# తెగిన జ్ఞాపకాలు



సంజీవదేవ్



ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ-2

# రూపరేఖ

స్మృతి, విస్మృతి, ఈ రెండూ మానవునిలోని మహత్తర శక్తులు. జ్ఞాపకం చేసుకోటం ఎంత గొప్పశక్తియో మరచిపోవటం అంతకంటే తక్కువ గొప్పశక్తి కాదు. రెండూ కూడ వ్యక్తికి సుఖాన్ని కలిగించగలవు, దుఃఖాన్ని కలిగించగలవు. ప్రియమైనవాటిని జ్ఞాపకం చేసుకోటం సుఖం కలిగిస్తే అప్రియమైనవాటిని జ్ఞాపకం చేసుకోటం దుఃఖం కలిగిస్తుంది. అప్రియమైన వాటిని మరచిపోవటం సుఖం కలిగిస్తే ప్రియమైనవాటిని మరచిపోవటం దుఃఖం కలిగిస్తుంది. స్మృతీ విస్మృతీ రెండూ ఒకేసారి మేల్కొని వుండవు. రెండూ ఒకేసారి నిద్రాణమై వుండవు. స్మృతి మేల్కొని వుంటే విస్మృతి నిద్రాణమై వుంటుంది, అది నిద్రాణమై వుంటే ఇది మేల్కొని వుంటుంది.

నా "తెగిన జ్ఞాపకాలు"లో స్మృతిమాత్రమే వుంటే అవి తెగినజ్ఞాపకాలు కాక తెగని జ్ఞాపకాలే అయేవి. ఆ స్మృతి ధారను అక్కడక్కడ విస్మృతి తెంచింది కనుక అవి తెగినజ్ఞాపకాలు అయినవి. నా జ్ఞాపకాలు ప్రియమైనవాటిని మాత్రమే గుర్తు చేసుకుని సుఖాన్ని ఇచ్చేవి కాక అప్రియమైన వాటినికూడ గుర్తుచేసుకొని దుఃఖాన్నికూడ ఇచ్చేవి అయివున్నవి. జీవితంలో అచ్చగా సుఖాలు మాత్రమే వుండవు, అచ్చగా దుఃఖాలు మాత్రమే వుండవుగా ! సుఖదుఃఖాల వెలుగునీడల క్రీడయే జీవితం. ఒకరి జీవితంలో వెలుగుభాగం ఎక్కువవుంటే మరొకరి జీవితంలో నీడ భాగం ఎక్కువ వుంటుంది. ఒకరి జీవితంలోనే కొన్ని సమయాల్లో వెలుగుభాగం ఎక్కువవుంటే మరికొన్ని సమ

యాల్లో నీడభాగం ఎక్కువుంటుంది. అయితే మానవావసర్యం మాత్రం తన సృజనాత్మక సాధనద్వారా తన జీవితంలోని వెలుగుభాగాన్ని ఎక్కువ చేసుకోటం, నీడభాగాన్ని తక్కువ చేసుకోటం అయివుంది. క్రమేణ వెలుగులోని తీవ్రత ఎక్కువయేవరకు నీడల అస్తిత్వమే నశించిపోవచ్చు.

మరపు అనేది మరపుగా తడితే ప్రమాదం లేదుకాని మరపు అనేది జ్ఞాపకంగా భ్రమకలిగిస్తే మాత్రం ప్రమాదం. మనో విజ్ఞానంలో రెండుపదాలున్నవి. ఆమ్నీషియా(**Amnesia**), పేరామ్నీషియా (**Paramnesia**) అని. ఈ రెండూ కూడ మరచిపోవటం అనే జబ్బుకు పేర్లే. ఆమ్నీషియా అంటే ఒకదాన్ని పూర్తిగా మరచిపోవటం, పేరామ్నీషియా అంటే ఒకదాన్ని మరొకటిగా గుర్తించటం. నా "చెగిన జ్ఞాపకాలు"లో పేరామ్నీషియాను ప్రవేశించనీయకుండా జాగ్రత్త వహించాననే నమ్మకం. నా నమ్మకమే ఒకవేళ పేరామ్నీషియాయేమో ఎవరు చెప్పగలరు?

సాహిత్యవిభాగాల్లో స్వీయచరిత్రలు నాకు విశిష్టమైన ఇష్టం. అయితే వీటిలో రాజకీయ నాయకుల స్వీయచరిత్రలను మినహాయించవలసి వుంటుంది. ఎవరి స్వంత మాటల్లో వారి జీవనగాథలు వింటూంటే చెప్పరాని ఆనందంకలిగేది. నేను నా జీవితంలో ప్రథమంగా చదివిన స్వీయచరిత్ర మహర్షి దేవేంద్రనాథ ఠాకుర్ స్వీయచరిత్ర. బెంగాలీ పుస్తకాలు చదవటం చేతయిన మొదటిరోజుల్లో బెంగాలీలో వున్న దేవేంద్రనాథుని స్వీయచరిత్ర చదవటం జరిగింది. అది నా లేత హృదయంమీద గాఢముద్రలు వేసింది. నేను కూడ స్వీయచరిత్ర వ్రాసుకొంటే ఎంత బాగుంటుందో అనిపించింది ఆ చిన్ననాడు. ఏ చరిత్రనూ వ్రాయలేని అపక్వ తరుణంలో స్వీయచరిత్రను ఏమి వ్రాయగలను కనుక?

తూండటం కూడ వాటి సజీవత్వానికి కారణమనికూడ విశదీకరించేవాణ్ణి. తరువాతి జీవితంలోని కొన్ని జ్ఞాపకాలు నేను అప్పుడప్పుడు వ్రాసుకొన్న డైరీలమీదకూడ ఆధారపడి వున్నవనికూడ వారికి తెలిపేవాణ్ణి.

"తెగినజ్ఞాపకాలు" లోని కొన్ని రసవత్తరమైన ఘట్టాలు చదివి కొందరు పాఠకులు అవి వాస్తవాలా లేక కల్పనలా అనికూడ అడగటం జరిగింది. కొన్ని వాస్తవాలు కల్పనల కంటే ఎక్కువ కల్పనాత్మకంగా వుంటవి అని మాత్రమే వారికి జవాబులు వ్రాశాను. "తెగినజ్ఞాపకాలు" నా స్వీయానందం నిమిత్తం రచిస్తున్నానా లేక పాఠకుల నిమిత్తం రచిస్తున్నానా అనికూడ కొందరు పాఠకులు ప్రశ్నలు వేయకపోలేదు. నా ఆనందం నిమిత్తమూ పాఠకుల నిమిత్తమూ కూడ అని నా జవాబు. నా స్వంత ఆనందం నిమిత్తమైనంత మాత్రాన నా రచన పాఠకుల ఆనందం నిమిత్తంకూడ అనటం సమంజసం కాదు. పాఠకుల ఆనందం నిమిత్తం కాక పాఠకుల నిమిత్తంమాత్రమే అనాలి. నాకు ఆనందాన్ని కలిగించే నా రచన పాఠకులకు కూడ ఆనందం కలిగిస్తుందనే నమ్మకం ఏమిటి? నా ఆనందం పాఠకులకు నిరానందం కావచ్చు. నా రచన చేయటంలో నా కెంత స్వేచ్ఛ వుంటుందో పాఠకులు దాన్ని బాగున్నదనటంలో కాని బాగు లేదనటంలో కాని వారికంత స్వేచ్ఛ వుంటుంది. రచనలో ఆనందం దొరకంది రచయిత రచించలేడు. కాని తన ఆనందం ఇతర్లకు కూడ ఆనందమే అవుతుందని రచయిత విశ్వసిస్తే కొన్ని తరుణాల్లో నిరాశ తప్పదు.

సంప్రదాయబద్ధులైన ఆధ్యాత్మికులకు నా రచన జడవాద ఛాయల్లో కనుపిస్తే జడవాదులకు అది ఆధ్యాత్మికఛాయల్లో కనుపించింది. నిజానికి ఉభయుల దృష్టులూ సత్యానికి దూరాలే. నా రచన ఆ రెండూకాదు అని అయినా అనాలి

మారింది. అయినప్పటికీ అటువంటి భయంకర రూపంలోవున్న రైలును ఎక్క-బోవడం కొంత అయిష్టంగానేవుంది కాని భయంకరమైన వాటినే చూడాలనే కుతూహలంకూడ ఎక్కువవుతూంటుంది. భయమూ కుతూహలమూ జీవనం చేస్తూంటవి. మామూలుగా పాము అంటే దాదాపు ప్రతివ్యక్తికీ భయమే. అయినప్పటికీ దాన్ని చూడడానికి ప్రతివ్యక్తి కుతూహలపడతాడు.

నాకు నిద్రవస్తున్నది. కాని నిద్రిస్తే మళ్ళీ ఆ ఎర్రని దీపాలు ఆకుపచ్చగా మారటం చూడనేమోనని బెంగ. ఇందాక రైలుపోగానే తిరిగి ఆ దూరపు ఆకుపచ్చని దీపం ఎర్రదీపంగా మారింది. దాన్ని పగులగొట్టివేయాలన్నంత కోపం వచ్చింది. అయితే పగులగొడితే మళ్ళీ అది ఆకుపచ్చగా కనుపించదేమో అని భయం. వస్తూన్న నిద్ర ఈ ఆలోచనలతో ఆగిపోయింది.

స్టేషన్‌కు చుట్టూ చెట్లున్నాయి. ఆ చెట్లమీదనుంచి రకరకాల పక్షులు రకరకాల గానం వినిపించసాగింది. ఆపక్షులగానం వింటూ ఆకుపచ్చరంగును మరచిపోయాను. నాదంముందు రంగు వెలవెలపోయింది. దృశ్యానందం, శ్రవ్యానందం ముందు పలచబడిపోయింది. కంటిమీద చెవి తన ఆధిపత్యాన్ని బలపరచుకొంది.

పక్షులగానాన్ని ఆనందిస్తుండగానే దూరాన మరో ఎర్రదీపం ఆకుపచ్చగా మారింది. క్రిందటి తడవది దక్షిణదిశది అయితే ఇప్పటిదీపం ఉత్తరపుదిశది. ఎర్రదీపం ఆకుపచ్చగా మారటమే ఆలస్యం, పక్షులగానం నాకానందం ఇవ్వడం ఆగిపోయింది. మళ్ళీ దృశ్యానందం శ్రవ్యానందాన్ని నొక్కివేసింది. కన్ను తిరిగి తాను కోల్పోయిన ఆధిపత్యాన్ని సంపాదించుకోడంలో చెవి చిన్నపోయింది.

ఆకుపచ్చ దీపాన్ని ఆనందిస్తూ నిలుచున్నాక దూరాన కూతవినిపించింది. అంతలో మరొక రైలుబండివచ్చి ఆగింది. అయితే అందులో మనుషులు లేరు. సామానులు ఎక్కించారు. అందులో ఏవో పెద్దపెద్ద బస్తాలు ఎక్కించారు. ఆ రైలుబండి అంతులేని పొడుగు. కొంతసేపు ఆగి మళ్ళీకదిలిపోయింది. అంత వేగంగా పరుగెత్తేరైలు నెమ్మదిగా కదులుతూంటే రైలుమీదవుండే భయం నాలో తగ్గిపోయింది. గుప్పుగుప్పుమంటూ మళ్ళీ కూతవేసి సాగిపోయింది. ఆకుపచ్చని దీపం మళ్ళీ ఎర్రబారింది.

లేక ఆ రెండూ కూడ అని అయినా అనాలి. అంతేకాని ఆ రెంటిలో ఏ ఒకటీ మాత్రం కాదు. ఒకసారి ఒక ప్రశ్నకు నేను ఈ జవాబు చెప్పేను **"I am a materialist, for matter is spirit; I am a spiritualist, for spirit is matter."** నేను జడవాదిని, కారణం జడం అనేది చేతనమే; నేను చేతనావాదిని, కారణం చేతన అనేది జడమే. ఈ వక్యమే నా రచనకూ వర్తిస్తుంది.

ఎవరి స్వీయచరిత్రా కూడ వారి సమగ్రజీవితాన్ని వున్న దున్నట్లు చిత్రించలేదు; జీవితంలోని కొన్ని దశలను మాత్రమే చిత్రించగలదు. కారణం రచనకంటే జీవితం గొప్పది. అయినా, జీవిత స్పర్శవల్ల రచనకూడ గొప్ప దవుతుంది. అందువల్లనే ఆ మాత్రమైనా జీవితాన్ని చిత్రించకలుగుతుంది రచన. కొన్ని గొప్పవాటికంటే కొన్ని చిన్నవి ఎక్కువ శక్తిని కలిగి వుంటవి. అందుకే జీవితానికంటే రచన ఒకోసారి ఎక్కువ శక్తివంతంగా వుంటుంది, ఎక్కువ సుందరంగా వుంటుంది, ఎక్కువ సజీవంగా వుంటుంది. అందుకే కొందరి రచయితల జీవితాల్లో కంటే వారి రచనల్లో ప్రాణస్పందన ఎక్కువగా గోచరిస్తుంది. స్వీయచరిత్రలు మిగతా రచనలకంటే రచయితల జీవితాలకు ఎక్కువ నిజమైన ప్రతిబింబాలు. అయితే, కొందరి స్వీయచరిత్రలు జీవితానికంటే ఎక్కువ తీవ్రమైన రంగుల ప్రతిబింబాలు. మరికొందరివి జీవితానికంటే తక్కువ తీవ్రమైన ప్రతిబింబాలు. మరి "తెగినజ్ఞాపకాలు" ఎటువంటి ప్రతిబింబాలు అని ప్రశ్నిస్తే మౌనానికిమించిన మంచి జవాబు మరొకటి కనుపించదు. అవి ఎటువంటి ప్రతిబింబాలో నాకు తెలియదు. ఎవరి రచనకు వారు విలువలు కడితే ఆ విలువలు ఎంత విలువకలవో నిర్ణయించటం కష్టం.

"తెగినజ్ఞాపకాలు" ను 1951 వరకూ తెచ్చి ఆపివేశాను. నా జీవితంలో అంతవరకూ ఒకవిధంగా నడిచింది; తరువాత మరోవిధంగా నడిచింది. తరువాతి జ్ఞాపకాలను వ్రాయవలసినదేది ఏమీ లేదు. ఒకవేళ వాటినీ వ్రాయటం జరుగుతుంది.

ఏ రచనలోనూ పూర్ణత్వం వుండదు. ప్రతి రచనా అపూర్ణమే. అసలు రచయితే అపూర్ణుడు. ఏదానికి మానవుడే అపూర్ణుడు. మానవుడికి పూర్ణత్వం లభించితే ఆ జీవితం అంతటితో ఆగిపోయినట్లే. అపూర్ణత్వమే సజీవత్వానికి లక్షణం. అపూర్ణత్వం వాస్తవం, పూర్ణత్వం ఆదర్శం. పూర్ణత్వం వైపుకు పోయే పథంలో నిరంతరం పయనించే పథికుడే మానవుడు. ఆదర్శం ఎప్పుడూ అందక దూరంగానే వుంటుంది. అందేది ఆదర్శమే కాదు. "తెగినజ్ఞాపకాలు" ఈ పథంలోనే పయనించినవి. వాటి అపూర్ణత్వమే వాటి స్ఫురణశీలత. ప్రతిరంగునూ చిత్రం వ్యక్తపరచలేదు. ప్రతిధ్వనినీ సంగీతం ధ్వనింప చేయజాలదు. ప్రతి ఆలోచననూ, ప్రతి అనుభూతినీ సాహిత్యం అభివ్యక్త పరచజాలదు. అందుకే అభివ్యక్తమైన ఆలోచనా అనుభూతులకంటే అభివ్యక్తం కాకుండా మిగిలిపోయినవే ఎక్కువ రమ్యంగానూ, ఎక్కువ గాఢంగానూ వుంటవి. "తెగినజ్ఞాపకాలు"లో వ్యక్తరూపంలో వ్యక్తమైన వాటికంటే అవ్యక్తరూపంలో గుప్తమైనవే గొప్పగా వుండిపోతవి !

—సంజీవదేవ్

# తెగిన జ్ఞాపకాలు

## బాల్యము - స్మృతులు

అప్పుడు నాకు నాలుగో సంవత్సరమని పెద్దయిన తరువాత తెలిసింది. అమ్మ చనిపోవడానికై తన తల్లిగారింటికి పయనమవుతుంది ఆ సాయంత్రం. అమ్మ ముఖాకృతి నాకు గుర్తులేదు. మనిషిమాత్రం వున్నట్టు అస్పష్ట ఛాయలాంటి ఒక మాసిన జ్ఞాపకం. ఆమె చేసిన పనులుమాత్రం ఇంకా కొంచెం ఎక్కువ స్పష్టంగా జ్ఞాపకం.

పారిపోతూన్న నన్ను బలవంతాన పట్టుకొచ్చి ఆ సాయంత్రం స్నానం చేయించడం, అన్నంవద్దని హఠంచేస్తూంటే బుజ్జగించి బ్రతిమాలి అన్నంపెట్టడం మొదలైనవన్నీ గుర్తే. స్నానం దగ్గర, అన్నందగ్గరకూడ ఎంతో అల్లరిచేసే వాణ్ణి. పింగాణీ గిన్నెలూ, అత్తరుసీసాలు పగలగొట్టడంలో చాలా ఉత్సాహం ప్రదర్శించేవాణ్ణి. ఎండలోవేసిన పరుపులకూ, దిండ్లకూ నిప్పు అంటించడంలో కూడా ఎంతో ప్రజ్ఞను ప్రదర్శించేవాణ్ణి.

అది వేసవి. ఆ సాయంత్రం భోజనాలు ముగించుకొని అమ్మా, నేను మేనాలో బయలుదేరాం, అప్పుడు మాకు మూడుమైళ్ళలోవున్న రైల్వేస్టేషన్‌కు. మేనా బోయీల అరుపులు నాకెంతో సంతోషాన్ని కలిగించాయి. గ్రామం దాటి కాలువకట్టకు రాగానే మూసివున్న మేనా తలుపులను తెరిచింది అమ్మ. కాలువలో

ఇసుకమధ్య అక్కడక్కడ నీటిమడుగు లున్నట్లు గుర్తు. లేత గోధుమరంగు ఇసుకా, నీలజలాలూకలిసిన ఆ దృశ్యం నాకెంతోఅజ్ఞాతానందాన్ని ఇచ్చినట్లు అనిపించింది.

సూర్యాస్తమయం అవుతూ వేసవి ఆకాశం అంతా ఎర్రబారింది. కాలవ కట్టన కొంతదూరం పోయినతరువాత కాలవ అవతలిగట్టున లాకులదగ్గర ఒకే ఒక ఆకులులేని సీమతంగేడు (గుల్ మొహూర్) చెట్టు నిప్పులలాంటి పూలను విరబూచివుంది. ఎర్రని ఆకాశం పడమటి ప్రక్కన వెలుగుతూంది. ఎర్రని పూల వృక్షం తూర్పు దిశన మండుతూంది. ఆ దృశ్యం నా బాలహృదయం మీద వేసిన ముద్ర నేటికీ కాంతివంతంగా వెలుగుతూనేవుంది కాని, చెరగలేదు. ఆ సాయంత్రం మేనమామల ఇంటికి పయనమైపోతున్న సంతోషం ఆ అరుణ దృశ్యం కలిగించిన ఆనందంముందు కొంత మరుగుపడింది. ఏదో అందరాని అనుభూతి, ఏదో పొందరాని ఆనందం వ్యక్తమయింది. ఆ దృశ్యం తప్ప మిగతా దృశ్యం ఏదీ కనుపించకుండా పోయింది. జీవితంలో ప్రథమంగా పొందిన లోకోత్తర ఆనందం అదే. ఆ దృశ్యాన్ని దాటి అవతలకు సాగిపోయిన తరువాత కూడా ఆ ఎర్రని వెలుగుపోయి మసకచీకటిదృశ్యం ప్రకృతినంతా ఆవరించిన తరువాతకూడా, నా కళ్ళముందునుంచి ఆ వెలుగుపోలేదు. నా హృదయంనుంచి ఆ ఆనందం తొలగలేదు.

మా నరవాహనానికి అడ్డంగా దారిలో ఎన్నో ఎద్దులబండ్లు ఖాళీవీ, నిండువీ కూడా ఎన్నో అడ్డంవచ్చేవి. బండ్లుకానీ, మనుషుల గుంపులుకాని ఎదురైనప్పుడల్లా అమ్మ మేనా తలుపులను మూసివేసేది. మూసినప్పుడల్లా నేను ఏడుపు సాగించేవాడిని. ఏడ్చినప్పుడల్లా పటికబెల్లం ముక్కనో, కారపుబూందీనో లంచం ఇచ్చి నా ఏడ్పు మాన్పడానికి ప్రయత్నించేసేది అమ్మ. కాని ఇచ్చినవి తీసుకుని కూడా మేనా తలుపులు తీసినప్పుడు కాని ఏడ్పు మానేవాణ్ణికాదు. మూసిన తలుపులు తీస్తుంటే ఏడుపు పోయేది. తీసిన తలుపులు మూస్తూంటే ఏడుపు వచ్చేది. తలుపులు మూస్తూంటే బయట కనుపించే విశాల విశ్వంనుంచి కనపడని దూరాల వరకు కనుపిస్తూన్న విముక్త నీలాకాశం నుంచి చుట్టూకనుపించే చెట్టుచేమల నుంచి నీళ్ళ మడుగులనుంచి దుమ్మూ ధూళినుంచి అసలు అనంత స్వేచ్ఛనుంచే నన్ను వేరుచేసిన సంకీర్ణ ఆవరణలో నన్ను బందీచేస్తూన్నట్టు బాధ చెందేవాడిని.

## అవ్యక్తానందం

అప్పుడు తుమ్మపూడి ఆనుకొని చిలువూరు రైలుస్టేషన్ లేదు. మూడు మైళ్ళదూరంలోవున్న పెదవడ్లపూడి రైలుస్టేషన్‌కు మసకచీకటిలో చేరుకున్నాం. రైలుపట్టాలూ, పట్టాలకడ్డంగా వేసిన కొయ్య స్లీపర్లనుచూడ్డం అదే మొదలు. దూరంగా ఎర్రని దీపాలు ఎత్తుగా గోచరిస్తున్నాయి. కొంతసేపటికి ఆ ఎర్రదీపం ఆకుపచ్చదీపంగా మారింది. ఇక నా ఆనందానికి మేరలేదు. ఎర్రదీపం చూస్తుంటేనే ఎంతో ఆనందం కలిగింది. కాని, అది ఆకుపచ్చదీపంగా మారేవరకు అదివరకున్న ఆనందం ఇనుమడించింది. ఎరుపులోకంటే ఆకుపచ్చలో ఎక్కువా నందాన్ని పొందసాగాను. ఎర్రగా కనుపిస్తూన్న మిగాతా దీపాలుకూడా ఆకుపచ్చలోకి మారితే బాగుండునని ప్రతివస్తువూ, ప్రతివ్యక్తి ఆకుపచ్చగా గోచరిస్తే బాగుండుననీ ఆకాంక్ష లేవసాగింది.

నాలుగవ ఏట రంగుల ఉనికి తప్ప రంగులపేర్లు తెలిసేవికావేమో గుర్తు లేదు. పేరు తెలుసుకోవడం బుద్ధికి చెందినపని. రంగును ఆనందించడం హృదయానికి చెందినపని. మొదటిది బోగట్టా. రెండవది సంవేదన. దీపంఒకటిమాత్రమే దూరంగా ఆకుపచ్చగా కనుపించడం, మిగతా దీపాలుకాని, వస్తువులుకాని, వ్యక్తులుకాని ఆకుపచ్చగా గోచరించకపోవడం నాకేమీ నచ్చలేదు. అమ్మతో అన్నాను "నీవు ఆదూరపు దీపం రంగుగాలేవు, నీదగ్గర నేనుండను"అని. ఆమె వడినుంచి లేచి రైలుపట్టాలవైపుకు పోయాను. దూరాన్నుంచి ఏదో అదివరకు వినని శబ్దం వినిపించసాగింది. రైలు వస్తూంది, అని వెనక్కు తీసుకువచ్చారు.

## రైలు రాక

కొంచెం సేపట్లో భయంకరమైన ధ్వనితో, అంతకంటే భయంకరమైన ఆకారంతో రైలు వేగంతో అక్కడ ఆగకుండా పరుగెత్తుకుపోయింది. నాకు విపరీతమైన భయం వేసింది. కళ్ళుమూసుకొని అమ్మవడిలో తలదాచుకున్నాను. అమ్మ ఆకుపచ్చగా లేకపోయినా కూడా ఆ ఘడియన ఇష్టంగానే వున్నది. భయంకర పరిస్థితులలో అయిష్టమైనవి కూడా ఇష్టంగా శత్రువులుకూడా మిత్రులుగా తడతారు. రైలు ఆకారమూ, ధ్వనీ భయం కలిగించినప్పటికీ అది దూరంగా వెళ్ళి వేసినకూత మాత్రం నన్నానందపరిచింది. ఒక నిమిషం ముందుగా రైలు మీద కలిగిన విరక్తిభావం దాని ఇంజనుపైన కూతమూలంగా తిరిగి అనురక్తిలోకి

మారింది. అయినప్పటికీ అటువంటి భయంకర రూపంలోవున్న రైలును ఎక్క బోవడం కొంత అయిష్టంగానేవుంది కాని భయంకరమైన వాటినే చూడాలనే కుతూహలంకూడ ఎక్కువవుతూంటుంది. భయమూ కుతూహలమూ జీవనం చేస్తూంటవి. మామూలుగా పాము అంటే దాదాపు ప్రతివ్యక్తికీ భయమే. అయిన ప్పటికీ దాన్ని చూడడానికి ప్రతివ్యక్తి కుతూహలపడతాడు.

నాకు నిద్రవస్తున్నది. కాని నిద్రిస్తే మళ్ళీ ఆ ఎర్రని దీపాలు ఆకుపచ్చగా మారటం చూడనేమోనని బెంగ. ఇందాక రైలుపోగానే తిరిగి ఆ దూరపు ఆకు పచ్చని దీపం ఎర్రదీపంగా మారింది. దాన్ని పగలగొట్టివేయాలన్నంత కోపం వచ్చింది. అయితే పగులగొడితే మళ్ళీ అది ఆకుపచ్చగా కనుపించదేమో అని భయం. వస్తూన్న నిద్ర ఈ ఆలోచనలతో ఆగిపోయింది.

స్టేషన్‌కు చుట్టూ చెట్లున్నాయి. ఆ చెట్లమీదనుంచి రకరకాల పక్షులు రకరకాల గానం వినిపించసాగింది. ఆపక్షులగానం వింటూ ఆకుపచ్చరంగును మరచిపోయాను. నాదంముందు రంగు వెలవెలపోయింది. దృశ్యానందం, శ్రవ్యా నందం ముందు పలచబడిపోయింది. కంటిమీద చెవి తన ఆధిపత్యాన్ని బలపరచు కొంది.

పక్షులగానాన్ని ఆనందిస్తుండగానే దూరాన మరో ఎర్రదీపం ఆకుపచ్చగా మారింది. క్రిందటి తడవది దక్షిణదిశది అయితే ఇప్పటిదీపం ఉత్తరపుదిశది. ఎర్రదీపం ఆకుపచ్చగా మారటమే ఆలస్యం, పక్షులగానం నాకానందం ఇవ్వడం ఆగిపోయింది. మళ్ళీ దృశ్యానందం శ్రవ్యానందాన్ని నొక్కివేసింది. కన్ను తిరిగి తాను కోల్పోయిన ఆధిపత్యాన్ని సంపాదించుకోడంలో చెవి చిన్నపోయింది.

ఆకుపచ్చ దీపాన్ని ఆనందిస్తూ నిలుచున్నాక దూరాన కూతవినిపించింది. అంతలో మరొక రైలుబండివచ్చి ఆగింది. అయితే అందులో మనుషులు లేరు. సామానులు ఎక్కించారు. అందులో ఏవో పెద్దపెద్ద బస్తాలు ఎక్కించారు. ఆ రైలుబండి అంతులేని పొడుగు. కొంతసేపు ఆగి మళ్ళీకదిలిపోయింది. అంత వేగంగా పరుగెత్తేరైలు నెమ్మదిగా కదులుతూంటే రైలుమీదవుండే భయం నాలో తగ్గిపోయింది. గుప్పుగుప్పుమంటూ మళ్ళీ కూతవేసి సాగిపోయింది. ఆకు పచ్చని దీపం మళ్ళీ ఎర్రబారింది.

మా రైలురావడం, అందులో మేము ఎక్కడం నాకుతెలియదు. నేను నిద్రలో వున్నాను. నాకు రైలు పోతూండగా మెలకువ వచ్చింది. నేను అమ్మవడిలో పడుకొని వున్నాను. పైన రైలులో దీపాలు వెలుగుతున్నాయి. ఆ దీపాలచుట్టూ సన్నని పురుగులు తిరుగుతున్నాయి. మాకు అటూ ఇటూ ఇంకెవరో ఎరగని మనుషులు కూచొని వున్నారు. అపరిచిత ముఖాలను చూసేవరకు నాకు సిగ్గయి కళ్లు మూసుకొన్నాను. మేము కిటికీ దగ్గరలోనే కూర్చున్నాము. అమ్మ నన్ను కిటికీదగ్గర నిలబెట్టి బయటికి చూపించింది. నడుస్తూన్న రైలుబండినుంచి నడవని బయటిభాగాన్ని చూచాను. కాని బయటి భాగమే పరుగెత్తుతున్నట్టు కనిపించింది. బయటకు వెలుగు నీడలు పరుగెత్తుతున్నాయి. ఆ వెలుగునీడల్లోగుండా చెట్లూ, టెలిగ్రాం స్థంబాలు, అక్కడక్కడ ఇళ్ళూ పరుగెత్తుతున్నాయి. ఒకవైపున భయమూ, మరొకవైపున ఆనందమూ తట్టసాగాయి. బయటి జగత్తంతా మాయాజగత్తుగా తట్టసాగింది. అమ్మ మళ్ళీ నిద్రపొమ్మంటూంది. కాని, ఆ కిటికీవదలి నిద్రించడం సుతరాము ఇష్టంలేదు.

కొంతసేపటికి రైలుమోతలో మార్పువచ్చింది. దణదణ మంటూంది. కిటికీకి దగ్గరలో పొడవాంటి ఇనపస్థంబాలు పడిపోతున్నట్టు కనిపించింది, నాకు భయంవేసి కళ్లు మూసుకొని మళ్లీ అమ్మవళ్లో తలదూర్చాను. అమ్మ అన్నది కృష్ణ వంతెన అని.

కొంచెంసేపటికి రైలు ఆగిపోయింది. అమ్మా నేనూ మా పెదతండ్రీ (మా పెదతల్లిభర్త) రైలులోంచి దిగాం. ఇంకెవరో మనుషులు వచ్చి మా సామానులు దించారు. ఇది బెజవాడ అని అమ్మ చెప్పింది. స్టేషన్‌నిండా తెల్లగా దీపాలు వెలుగుతున్నాయి. దూరాన చాలా ఎర్రదీపాలూ, ఆకుపచ్చ దీపాలూ ప్రకాశిస్తున్నాయి. మళ్లీ నాలో ఆనందతరంగాలు లేవసాగాయి. మేమంతా మరో రైలులోకి ఎక్కాం. దాన్ని నైజాం రైలు అంటున్నారు. నేను మళ్ళీ నిద్రించాను. మళ్లీ మెలుకువ రాలేదు.

రైలు ఆగివుంది. అమ్మ నన్ను క్రిందకు దించడంతో నాకు మెలకువ వచ్చింది. నన్ను మరల మా పెదతండ్రి ఎత్తుకొన్నారు. బెజవాడ స్టేషన్‌లాగ పెద్ద స్టేషన్‌కాదు. ఈ స్టేషన్‌లో బెజవాడలో వున్నన్ని దీపాలుకాని, జనులుకాని

లేరు. మధిర స్టేషన్ అన్నారు. మేమందరం రెండుఎద్దుల బండిలో ఎక్కాము. మళ్లీ నేను నిద్రించాను.

నాకు నిద్ర మెలకువ వచ్చేవరకు ఉదయం నందిగామలో వున్నాము. ఆ ఎద్దులబండి దిగి నందిగామలో మరో ఎద్దులబండి ఎక్కాము. పొలాలగుండా ఆ బండి పోతూంది. ఒకోసారి బండి ఒక ప్రక్కకు వరిగి పడబోతున్నట్టుండేది. ఒకోసారి ఎద్దులు పరుగెత్తేవి. మరోసారి కొట్టినాకూడా కదిలేవికావు. బండిలోకి ఎండ రాసాగింది. బండిలో నిలుచొని నాలుగు దిక్కులా చూడసాగాను. దగ్గర లోను, దూరంలోను చిన్నవీ, పెద్దవీ చెట్లు కనిపించసాగాయి. పడమటగా దూరంగా నీలపు కొండలు గోచరిస్తున్నాయి. అమ్మ అంటూంది : " అదుగో ఆ కొండల కివతల మామయ్యగారి వూరు కోనాయపాలెం. అన్నం వేళకు మనం అక్కడికి వెడతాం. నీకు ఆకలివేస్తుందా ? అరటిపళ్లు తిను. తొక్లు తిసబోకు. బయట పారేయి"

## మాతృవియోగము

నాకు చెల్లెలు పుట్టినట్టు మా అమ్మమ్మ చెప్పింది. నా సంతోషం తీవ్ర మైంది. చెల్లిని చూడాలని పట్టుబట్టాను. ఒక గదిలోకి తీసుకువెళ్లి చూపించారు. ఆ సగం వెలుతురులో నాకు స్పష్టంగా కనిపించలేదు. పసి ఏడుపు మాత్రం విని పించింది. అమ్మ మంచంలోనుంచి నా వైపు జాలిగాచూచి రెండేరెండు ప్రశ్నలు వేసింది. "అన్నం తిన్నావా? చెల్లిని చూశావా?" అని. నేను తలవూపి బయటకు పరుగెత్తుకు వచ్చాను.

అమ్మ బాలింతగా మంచంలో అనారోగ్యంతో వుంటూంది. నా పనులన్నీ అమ్మమ్మ చూడసాగింది. స్నానం చేయించడం, బట్టలు వేయడం, అన్నం తినిపిం చడం. నేను ఆడుకోడానికి స్నేహితుల్ని — ఆడపిల్లల్ని, మొగపిల్లల్ని కూడా సమకూర్చడం, నేను అమ్మదగ్గరే పడుకుంటానని గోలచేసినప్పుడు ఏమోమో మాటలుచెప్పి మరిపించి, మురిపించి తన దగ్గరే పడుకొనేలాగ చూడటం ఇదంతా అమ్మమ్మ భారంవహించింది.

ఒకరోజు అమ్మకు జబ్బు ఎక్కువైనదని, వైద్యులుకూడా నమ్మకం చెప్ప లేకపోతున్నారని, తుమ్మపూడి కి విషయం తెలియపరచామని సన్నసన్నగా గుస

గుసలు ప్రారంభమైనాయి. అందులోని ప్రాముఖ్యం నాకర్థంకాలేదు. అమ్మమ్మ నాకు అన్నంపెడుతూ నా వైపుచూచి కన్నీరు కార్చింది. "ఎందుకమ్మమ్మా ఏడుస్తావు" అన్నాను. ఆమె జవాబు చెప్పలేదు.

అనంతరం నన్ను అమ్మవున్న గదిలోకి తీసుకవెళ్ళితే అమ్మనన్ను దగ్గర కూర్చోబెట్టుకొని చేతితో నెత్తిని సవరించి కన్నీరుకార్చి కొంచెం నంగిమాటల్లో "వట్టి అల్లరివాడు. నేను పోయిన తరువాత ఎలాచూస్తారో" అన్నది. "నేను ఇవ్వాళ అమ్మదగ్గరే పడుకుంటాను" అని ఏడవసాగాను. అదే అస్పష్టధోరణిలో అమ్మ అన్నది "ఇవ్వాళ నాదగ్గర పడుకొంటే రేపటినుంచి ఎవరిదగ్గిర పడుకొంటావు?" అని ఎక్కిఎక్కి ఏడవసాగింది. గదిలో వున్నవాళ్ళంతా గొల్లున ఏడ్చారు.

మరో రోజు సాయంత్రానికి అమ్మకు మాటలులేకుండా పోయినవి. చూపు మన చూపు కాదని, మనుషుల్ని గుర్తించలేక పోతున్నదని అనుకొంటున్నారు. తుమ్మపూడినుంచి ఎవరైనా వచ్చేవేళ అయిందనికూడా అనుకొంటున్నారు. కరణంగారు, మునసబుగారు, శాస్త్రులుగారు, ఇంకా ఊళ్ళోని అనేకమంది పెద్దలువచ్చి అమ్మనుచూచి కన్నీళ్లు తుడుచుకొంటూ బయటికివచ్చి అక్కడున్న నావైపు జాలిచూపులు చూచి మరొకసారి కన్నీళ్లు తుడుచుకొని వెడుతున్నారు. ఊళ్లోని స్త్రీలంతా అక్కడే హాజరై వున్నారు.

నాకు ఏడుపు రావడంలేదు! నిజానికి నాకు ఏడవడం, నవ్వడం మాత్రమే తెలుసు అప్పటికి అయితే నవ్వులో సంతోషం వున్నదని కానీ, ఏడుపులో విచారం వున్నదనికాని తెలిసేదికాదు. అందువల్ల ఒకోసారి సంతోషం కలిగినప్పుడు కూడా నవ్వకపోవడం, విచారం కలిగినప్పుడుకూడా ఏడ్వకపోవడం జరుగుతుండేవి, అందుకని సంతోషం కలిగినప్పుడు ఏడవటం, విచారం కలిగినప్పుడు నవ్వడంలాంటి పొరపాట్లనుకూడా ఏమీ చేసినట్టు జ్ఞాపకంలేదు.

సాయంత్రం అమ్మను గొల్లుమనే ఏడుపుల మధ్య గదిలోనుంచి తీసుకవచ్చి తూర్పు అరుగుమీద _ నేలమీద - పడుకోబెట్టడం, మనుషులతోబాటు ఇళ్ళ కప్పులమీదా, చెట్లమీదవున్న కాకులుకూడా గోలపెట్టసాగినాయి. నేను ఆ కాకులను చూస్తూ వాటి రోదనం వింటూకూర్చున్నాను. అవి గోలగా అరుస్తూ, ఎక్కడా స్థిమితంగా కూచోక పూరింటి కప్పుమీదనుంచి పెంకుటింటి కప్పుమీదకు, వేప

చెట్టు కొమ్మలమీదనుంచి తుమ్మచెట్టు కొమ్మల మీదకు అక్కడనుంచి విరిగిన మునగచెట్టు మోడుమీదకు మళ్ళీ దానినుంచి ఇళ్ళ కప్పులమీగకు ఎగరసాగాయి.

ఊళ్ళో పెద్దలంతా మరోసారి వచ్చి మరణించిన అమ్మనుచూచి, జీవించి వున్న నన్నుచూచి కన్నీరు కార్చసాగారు. నిజానికి మరణించిన అమ్మనుచూచి కార్చిన కన్నీరుకంటె జీవించివున్న నన్నుచూచే ఎక్కువ కన్నీరు కార్చారు. చనిపోయినవాళ్ళుకూడా బాధపడతారు తమ బంధుమిత్రుల వియోగంవల్ల అని మరణానంతర శాస్త్రం చెబుతుంది, కాని అది ఇంతవరకు విశ్వజనీన సత్యంగా సుస్థిరం కాలేదు. ఒక విశ్వజనీన సత్యంమాత్రం సుస్థిరంగా నిల్చిపోయింది. చచ్చినవాళ్ల వియోగంలో బ్రతికున్నవాళ్లు బాధపడతారని, అందువల్ల చచ్చిన వారినిచూచికాక వారి ఆత్మీయులైన బ్రతికున్నవారిని చూచి కన్నీరుకార్చడమే ఎక్కువ సబబేమో! అయితే, జీవించివున్నవారి దగ్గరకువచ్చి కన్నీరుకార్చేవారితో "మీరు దుఃఖించడం మేము ఎందుకు జీవించి వున్నామా అనా?" అని కసురుకొనే సమయాలుకూడా వుంటుంటాయి.

చీకటి పడుతూంది. చీకటి ముదిరినకొద్దీ కాకులఏడ్పు చల్లారి మనుషుల ఏడ్పు ఎక్కువయింది. అమ్మ తలదగ్గర దీపం వెలుగుతూంది. అమ్మ తలమీద ముసుగు కప్పి వుంది. తుమ్మపూడినుంచి ఎవరెవరో వచ్చారు ఏడుస్తూనే. నన్ను అక్కడలేకుండా ఇంకా దూరంగా తీసుకవెళ్లారు.

చచ్చిపోవడంలోవున్న ప్రాముఖ్యం నాకర్థంకాలేదు. అయినప్పటికి ఆ మాటలో ఏదో భయంకరత తట్టసాగింది. అమ్మ మరణించడంలోవున్న లోటు ఇంకా అప్పటికి తెలియలేదు. చచ్చిపోవడం అంటే ఎక్కడికి పోవడం, ఎందుకు పోవడం, మళ్లీ ఎప్పుడు తిరిగిరావడం అనే ఆలోచన తట్టసాగింది. ఈ సంగతులను ఎవరినీ అడిగి తెలుసుకొనే సమయమూ కాదది. ఎవరూ తీరికలో వున్నట్టు కనబడరు. అందరూ ఆందోళనతోనే తిరుగుతున్నట్టున్నారు. ఆ రాత్రి నాకు అన్నం పెట్టలేదు ఎవ్వరూ, పెట్టినాకూడ తినేవాడినో లేదో. కోనాయపాలెం లోనే మా పెద్దతల్లిగారింట ఎవరిదగ్గరో గుర్తులేదు. ఆ రాత్రి నిద్రించాను. అమ్మను ఆరాత్రే దహనం చేశారట. రెండవ రోజుకూడా నన్ను అమ్మమ్మగారింటికి తీసుకపోలేదు. మా పెదతల్లినిఅడిగేను అమ్మ ఎక్కడ అని. ఆమెనన్ను వళ్లోకితీసుకుని బావురుమని ఏడ్చింది. ఆమెకంటినుంచి నీరుప్రవహిస్తూనేవుంది.

అమ్మమ్మ దగ్గరికి పోవాలని, చెల్లెని చూడాలని ఏడుపు మొదలుపెట్టాను కాని తినడానికేమో పెట్టి ఏడ్పు మాన్ప ప్రయత్నించారు. తినేది తిననూలేదు, ఏడ్పు మాననూ లేదు. తుమ్మపూడినుంచి వచ్చినవారంతా వెళ్ళిపోయారు.

మూడవరోజున నన్ను మళ్లీ అమ్మమ్మగారింటికి తీసుకపోయినారు. అమ్మమ్మా, మా పెదతల్లులూ, పెదతల్లుల కూతుళ్లూ నన్నుచూచి ఒకటేఏడవడం. నాకు ఏడుపు రాలేదు. విభ్రాంతిపోయి చూస్తూ వూరుకొన్నాను. ఎవరన్నా ఏడుస్తుంటే నాకు ఏడ్పురాదు. ఎవరూ ఏడవనప్పుడే నాకు ఏడ్పువస్తుంది.

## జ్ఞాపకాలు

చెల్లి ఉయ్యాల మంచంలో నిద్రపోతూంది. చెల్లిని చూసేవరకు అమ్మ జ్ఞాపకం వచ్చింది. అమ్మ ఏది అని అడిగేను. అక్కడున్నవారిలో ఆగిపోయిన ఏడ్పు మళ్ళీ వచ్చింది. ఆరోజు మొదలు చెల్లిదగ్గర నుంచి రాత్రింబగళ్ళు కదిలేవాడిని కాదు. పగలూ రాత్రి కూడా చెల్లిమీద చేయివేసుకు పడుకునేవాణ్ణి. తరువాత తరువాత అమ్మ ఏదని అడగడంకూడ మానివేశాను. చెల్లిలోనే అమ్మను చూడసాగాను. అమ్మమ్మా మొదలైనవారంతా నేనులేనప్పుడు ఏడుస్తూ నన్ను చూడగానే ఏడ్పును మ్రింగివేసి కన్నీళ్ళను తుడుచుకునేవాళ్లు. చెల్లెని నన్ను కలిపి చూచి ఒక్కొక్కసారి ఏడ్పు ఆపుకొనేవాళ్ళు కాదు.

రోజులు గడిచిపోతున్నాయి. ఇంట్లో ఏడ్పులు క్రమేణ వెనకట్టసాగాయి. చెల్లితోనే కాలంగడపడం. చెల్లిని ఉయ్యాల మంచంలోవుంచి వూపుతుండేవాడిని. చాలా పెద్ద వూపులు వూపేవాడిని. అంత పెద్దవూపు వూపినప్పుడు ఉయ్యాల మంచం గోడకు కొట్టుకునేది. దాంతో చెల్లి పెద్దగా ఏడ్చేది. అమ్మమ్మ పరుగెత్తుకుంటూ వచ్చి చెల్లిని ఎత్తుకొని వోదార్చేది.

మా పెదతల్లి భర్త చిరుమామిళ్ళ వెంకట సుబ్బయ్యగారిదికూడా కోనాయపాలెమే. మా మేనమామ శాఖమూరు పార్థసారధిగారు లేత వయసులో వున్నందున వీరింటి వ్యవహారాలు కూడా మా పెదతండ్రిగారైన వెంకట సుబ్బయ్యగారే చూస్తుండేవారు. తల్లిలేని నన్నుకూడా ఆయనగారే ఎత్తుకు త్రిప్పుతూ, బజారులోకి, పలుగురిలోకి తీసుకవెడుతూ, తనకువచ్చే దుఃఖాన్నికూడా నా ఎదుట దాచి నాకు ఏవో కథలు చెబుతూ ఈ విధంగా అమ్మలేని లోపాన్ని పూరించ

ప్రయత్నించేవారు. ఆయన, అమ్మమ్మ, ఇద్దరు పెదతల్లులతోపాటు ఈ పెద తండ్రి కూడా నా భారాన్ని వహించారు. క్రమేణ మిగతా వారందరికంటె వారి దగ్గరే ఎక్కువ చనువు ప్రారంభమైంది. వారుండే ఇంటిని కోట అని పిలిచేవాళ్లు అందువల్ల ఆయనను కోటలోబాబు అని పిలవసాగేను.

ఎండలు, వడగాలి, సెగలు పొగలు అంటూ అందరూ ఇస్సో అని బాధ పడుతుండేవారు. వాటిపేర్లు వినడం తప్ప ఆ ఎండలేమిటో, వడలేమిటో, పొగలేమిటో, వాటివల్ల కలిగే బాధ ఏమిటో నాకు తెలిసేదికాదు. దాహం మాత్రం తెలిసేది. విపరీతంగా నీరు త్రాగితే ఆకలి మాత్రం తెలిసేదికాదు.

ఒక సాయంత్రం మబ్బులు పట్టి పెద్దగా ఉరుములు, మెరుపులు. గాలీ, దుమ్మూ విజృంభించినాయి. అదే మొదటిసారి నేను అటువంటి బీభత్స దృశ్యాన్ని చూడడం. ఇల్లంతా దుమ్ము నిండిపోయింది. చెవులు పగిలిపోయేలాగా ఉరుములు కళ్ళు గ్రుడ్డివయేలాగా మెరుపులు, ఆ రెంటినీ చెవులు వినలేక పోయినాయి. కళ్లు చూడలేకపోయినాయి. చెవిద్వారా, కంటిద్వారా, హృదయంలోకి భయం ప్రవేశించింది. కళ్లు గట్టిగా మూసుకొని కోటలో బాబు ఒళ్ళో పడుకొన్నాను.

భయం సాధారణంగా మానవునిలో భయాన్నే కలుగచేస్తుంది. గుండెను దడదడలాడిస్తుంది. శరీరాన్ని వణికిస్తుంది. ప్రాణాన్ని నీరసపరుస్తుంది. ఈ విధంగా ఇంకెన్నో చేస్తుంది. కాని, భయం క్రమేణా మరోపనికూడా చేస్తుంది. భయం కొంతసేపటికి ధైర్యాన్ని సృష్టిస్తుంది. దీన్నే మనోవిజ్ఞానంలో ప్రతిక్రియ జరగడం అంటారు. నాకు ఆ విషయంలో అదే జరిగింది. ఇంకా ఉరుములూ, మెరుపులూ ఉగ్రరూపం దాల్చే వున్నాయి. కాని, నేను మా బాబుగారి ఒళ్ళో నుంచి లేచికూర్చొని కళ్లుతెరచి మెరుపుల్ని చూడసాగాను. చెవులు నిక్కించి ఉరుములను వినసాగాను. అంతటి ప్రళయ కల్లోలంలో కూడా ఇంట్లోనుంచి బయటి అరుగుమీదకు పరుగెత్తి వెళ్ళాను. కాని మా బాబుగారు వెంటనేవచ్చి నన్నింటిలోకి తీసుకువచ్చారు. నే నింటిలోకి వచ్చిన కొంచెం సేపటికి అతి కాంతితో తళుక్కున మెరసి ఫెళఫెళామని మహాభయంకరమైన ధ్వనితో ఆకాశం బద్దలైపోయింది. ఎక్కడో ఊరికి దూరంగా పిడుగు పడిందన్నారు.

పట్టి ఉరుములు, మెరుపులు, పిడుగులేకాని వర్షంమాత్రం పడలేదని, వర్షం పడితే తొలకరి అయేదని, తొలకరి అయితే పైర్లు పడేవి అని పెద్దలు చెప్పుకో

సాగారు. ఆ రాత్రికూడా రోజువలెనే బయట ఆకాశం క్రిందనే పడుకొన్నాం. మేఘాలు గాలికి తేలిపోయినాయి. చీకటిలో నిండిన ఆకాశంలో మిలమిలా మెరుస్తూ నక్షత్రాలు గోచరిస్తున్నాయి. నేనున్నది భూమి అనికాదీ, అవి వున్నది అంతరిక్షంలో అనికాని నాకు తెలియలేదు నేను పడుకున్న మంచానికి, వాటి గోళాలకు మధ్యవున్న అనంతదూరం నాకు తట్టలేదు. నక్షత్రాలు, నేను కూడా ఒకే తావున వున్నా అనుకొని అవి, వాటిని అనుకొని నేను వున్నామని భావించాను. అవి నాకు తెల్లగా చేతికి తగులుతున్నట్టే అనుభూతి చెందాను. ఆవిధంగా ఆ సమయాన దూరం అనే భౌతిక అవరోధాన్ని దాటకలిగేను.

అమ్మ చనిపోయినప్పటికంటె చెల్లి ఇప్పుడు కొంచెం పెద్దదయిందని తెలుసుకొన్నాను. చెల్లికి నెల వెళ్లి రెండవనెల వచ్చినదన్నారు. కళ్ళు పెద్దవిగా కనిపిస్తున్నాయి ఇప్పుడు. ఆ పెద్దకళ్ళను ఇంకా పెద్దవిచేసి నా ముఖంవైపు చూచేది. చెల్లిలో నేను అమ్మను చూస్తుంటే చెల్లి నాలో అమ్మను చూచేది కాబోలు !

కోటలో బాబు నన్ను బడిలోకి తీసుకుపోవడం మొదలుపెట్టిన తరువాత పగలు ఎక్కువసేపు చెల్లి దగ్గర కూర్చునే అవకాశమూ, అలవాటూ తగ్గిపోయినాయి. చెల్లిమంచి దూరంగా వుండడం ఎక్కువైనకొద్దీ చెల్లెలికి దగ్గరలో వుండాలనే ఆకాంక్ష బలీయమైనది. చెల్లికి దగ్గరలో వుండాలనే ఆకాంక్ష బలీయమైన కొద్దీ చెల్లెలి చూడగానే కలిగే ఆనందం అధికమైంది. "నీ చెల్లెలికంటె నీవే ఎర్రగా వున్నావు" అని యెవరయినా అన్నప్పుడు వాళ్ళమీద నాకు తీవ్రంగా కోపం వచ్చేది. అప్పుడు వాళ్ళు మళ్ళీ మాటను "త్రిప్పి" లేదులే, నీ కంటే నీచెల్లెలే ఎర్రగా వున్నది" అన్నప్పుడు సంతోషం కలిగేది. తన గొప్పదనం అనే స్వార్థాన్ని దాటి తన గొప్పతనాన్ని ఇతరులుచూపి ఆనందించేటట్టు చేస్తుంది మనిషిని ప్రేమ !

## అక్షరాభ్యాసము

ఆకాశం అంతా కారుమేఘాలతో నిండి ఏకధారగా వర్షం పడుతూంది. కోనాయపాలెపు బజారులు వాగులుగా ప్రవహిస్తున్నాయి. వర్షం ఎప్పుడు వెలుస్తుందా, ఆ నీళ్ళలో ఎప్పుడు ఆడుదామా అని తహ తహలాడుతున్నాను. కొంత సేపటికి వర్షం వెలిసింది. బజార్లలోని ప్రవాహంలోకి పరిగెత్తి నీళ్ళలోపడి

బట్టలు తడుపుకొని ఏడుస్తూ ఇంటికొచ్చాను. వచ్చేవరకు ఇంటి వాతావరణం మరోవిధంగా వుంది. మూడు మాసాల చెల్లెకి రాత్రినుంచి జబ్బుచేసి, ఈ పూట ఎక్కువైనది. కళ్ళు సగంతెరచి మాత్రమే చూస్తున్నది. చూస్తున్నదని పేరేకాని అది చూడకపోవడంలోనే లెక్క. ఆ చూపు మధ్యలోనే నిలిచిపోతుంది కాని మనవరకు రావడంలేదు. ఏవేవో రకరకాల మందులు పోస్తున్నారు. కాని క్రమేణ చూపులోని సజీవత్వం తగ్గిపోసాగింది. కళ్ళు మూతపడసాగినాయి. నేను చూస్తుండగానే కొంచెం సేపట్లో పూర్తిగా కన్నుమూసింది. ఇంట్లో అందరు గొల్లుమన్నారు. నాకుకూడా ఏడుపు ఆగలేదు. అమ్మ మరణించినప్పుడు నేను ఇప్పటికంటె మూడు మాసాలు చిన్నవాడిని. అప్పుడు అంతగా ఏడ్పురాలేదు. అమ్మ మరణించినప్పటికంటె ఇప్పుడు మూడు మాసాలు పెద్దవాడిని. చెల్లె మరణానికి దుఃఖించాను. ఇంట్లో అందరూ చెల్లె అమ్మదగ్గరకు పోయింది అంటూ దుఃఖించసాగారు. నేనుకూడా చెల్లెవెంట అమ్మదగ్గరకు పోతే ఎంతబాగుండేదో అనిపించింది.

ఒక గంట క్రిందటివరకు కదులుతూ, మెదులుతూ, చూస్తూ, వింటూ, మందులు చప్పరిస్తూవున్న చెల్లి ఇప్పుడు కదలక, మెదలక, చూడక, వినక మందులు చప్పరించక ఒక పదార్థంలాగా పడివుంది. మనుషుల జీవితాలలో ఇటువంటి మార్పులు రావడం ఎందుకనో? మరణం అంటే అమ్మ మరణించినప్పుడు భయం కలుగలేదు. కాని చెల్లి మరణించినప్పుడు మాత్రం భయం కలిగింది. మరణంలోని ఆ రహస్యం ఇంకెంతో రహస్యమయంగా తట్టసాగింది. చెల్లిని ఎవరో ఒక మనిషివచ్చి గుడ్డకప్పి బయటకు ఎత్తుక వెళ్ళినారు. ఇక అంతే. చెల్లి మళ్ళీ ఇంట్లోకి రాలేదు. శాశ్వతంగా అదృశ్యమైపోయింది. అమ్మ లేని ఇల్లు చెల్లి వున్నప్పుడు అంతగా శూన్యంగా తట్టలేదు. ఇక అమ్మా, చెల్లీ ఉభయులూ లేని ఇల్లు శూన్యంగా తట్టసాగింది. ఇక ఇంటిలో ఆ నాటకు నేనొక్కడినే మిగిలేను. నేనుకూడా మరణిస్తే అమ్మమ్మా, మామయ్య మాత్రమే వుంటారు. ఇంటిలో వాళ్ళిద్దరూకూడా మరణిస్తే ఇల్లు మాత్రమే వుంటుంది! మరి ఇల్లుకూడ మరణిస్తేనో! ఊరులోని మిగతా ఇళ్ళన్నీ వుంటాయి. ఆ ఇళ్ళలోని మనుషులంతా వుంటారు. కుక్కలుంటాయి. రాత్రులు భయంకరంగా రోదన చేస్తున్న నక్కలుంటాయి. కాకిగోలచేస్తున్న కాకులుంటాయి, పాలిస్తున్న బర్రెలుంటాయి, పొలాల్లో పైరును కొరుకుతున్న గొర్రెలుంటాయి. ఇంకెన్నో వుంటాయి. ఇంత మంది వుంటున్నప్పుడు నేను మాత్రం ఎందుకు వుండకుండాపోవాలి? కనుక

నేనూ వుండాలి, అమ్మమ్మా వుండాలి, మామయ్యా వుండాలి. మేమంతా వుం టూన్న ఇల్లూ వుండాలి.

## "ఇంకా చిన్నవాడినే"

నాకు నాలుగు సంవత్సరాలు దాటి అయిదవ సంవత్సరం వచ్చిందన్నారు. అందరికంటె నేను పెద్దవాణ్ణి అయినట్లు అనుకొన్నాను. కాని మామయ్య క్రింద నిలుచొనే గది తలుపు గొళ్లెంతీసేవాడు. నేను తలుపు పైకెక్కితేనేకాని నాకు గొళ్లెం అందేదికాదు. అప్పుడు తెలిసింది నేను చిన్నవాడినేకాని పెద్దవాడినికానని. పెదతల్లిగారి కోటకూ (కోట అని పేరేకాని నిజంగా కోటకాదు. పూర్వం అది కోట అట) మామయ్యగారింటికి ఒంటరిగా పోవడం రావడం సాగించాను. దారిలో కుక్కలు ఎదురుపడినప్పుడు మాత్రమే కొంచెం జంకి మళ్లీ వెంటనే ధైర్యం తెచ్చుకొని ఇజ్జా ఇజ్జా అంటూ చిటికలు వేసేవాణ్ణి. అవి దగ్గరకొచ్చి తోకవూపుతూ నాచేతిని నాకిచూచి ఇది బజారులో పోతున్న పెద్దలంటున్నారు. "తల్లిలేని పిల్లవానిమీద కుక్కలకూ జాలేమరి" అని. ఈ మాటలు నా వేపు నాకుతూన్న కుక్కకు ఎంతవరకు బోధపడివవో నాకుతెలియదుకాని నాకుమాత్రం పూర్తిగా బోధపడినాయి.

ఈ ఇంటిలో అన్నం తినక గోలచేస్తే ఆ ఇంటికీ. అక్కడ గోలచేస్తే ఇక్కడికీ తీసుకువచ్చి అన్నం పెట్టేవాళ్లు. అక్కడి పెదతల్లి, ఇక్కడ అమ్మమ్మ కూడా అన్నం పెడుతూ పెడుతూ కన్నీళ్లు కార్చేవారు. మళ్ళీ నేను చూడగానే కన్నీళ్లు తుడుచుకొని నవ్వుముఖంపెట్ట ప్రయత్నించేవాళ్లు. ఊళ్లోని ఇరుగు పొరుగు ఆడవారుకూడా నన్నుచూసి కంటతడిపెట్టేవారు. ఈ విధంగా అక్కడి వారందరి జాలికి పాత్రుడనయాను.

ఒకరోజు మధ్యాహ్నం అమ్మమ్మ, కోట్లో బాబూ కూర్చొని నాకు అయి దవ సంవత్సరం వచ్చింది కనుక అక్షరాభ్యాసం చేయించి బడికి పంపడం అల వాటుచేస్తే బాగుంటుందని నిర్ణయించారు. బడి అనే పేరుమాత్రమేకాక బడిఅనే వస్తువుకూడా నాకు తెలుసు. కోట్లోబాబుగారి కోటకు ఎదురుగానే కనుపిస్తూం టుంది బడి. చుట్టూ చెట్లూ వల్లవిగేటూ, ఎర్రని పెంకుల కప్పుమీద తెల్లని సున్నపు వసారా – ఇదే బడి అంటే. ఈ బడిని [illegible] పేరుగోడా పిలి

వాళ్ళు "ఇస్కూల్" అని. ఎక్కువమంది ఇస్కూల్ పేరునే వాడేవాళ్ళు. ఇక దాని హెడ్‌మాష్టర్‌గారైన మునిపల్లి శ్రీరాములుగారు కోట ప్రక్క ఇంట్లోనే కాపురం వుండేవారు. ఆయన వృద్ధులు, ఇంటిలో చాలామంది ఆడపిల్లలుండేవారు.వారంతా నన్ను ప్రేమగా చూస్తూ ఇంట్లోకి తీసుకుపోయి తినడానికేమైనా పెడుతుండేవారు. హెడ్‌మాష్టర్‌గారుకూడా చాలా అప్యాయతతో, చాలా చనువుగా పలకరించే వారు నన్ను.

ఒకనాడు హెడ్మాష్టరుగారే బాబుగారి దగ్గరకు పంచాంగం తెచ్చి అక్షరాభ్యాసం చేయడాని కేదో రోజు నిర్ణయించారు. వెంటనే బాబుగారు అక్షరాభ్యాసం వలాన రోజున జరుగుతుంది, కనుక రావలసింది అని తమ్మపూడి ఉత్తరం వ్రాసారు. అక్షరాభ్యాసం అనే పేరుతో ఏదో ఆకర్షణ తట్టసాగింది నాకు. ఆ ఆకర్షణకు తోడుగా ఏదో తెలియని భయంకూడా తట్టసాగింది. ఆకర్షణ కలగ డానికి, భయం తట్టడానికికూడా వున్న కారణాలు మాత్రం తట్టేవుకావు! అహేతు కాకర్షణ, అహేతుకభయం, అహేతుకాలు సహేతుకాలుగా మారితేనేకాని ఆకర్షణలోని ఆనందమూ, భయంలోని బాధా నశించవు. ఆకర్షణలోని ఆనందం నశించి ఆకర్షణలోకి బాధప్రవేశించడం, భయంలోని బాధ నశించి భయంలోకి ఆనందం ప్రవేశించడం జరిగినా లాభంలేదు. బాధ అనేది ఆకర్షణలోవున్నా-అది బాధమే అవుతుంది, భయంలోవున్నా - అది బాధయే అవుతుంది. కనుక అది దానిలోనూ వుండరాదు, దీనిలోనూ వుండరాదు. ఆనందం నిజానికి దేనిలోనూ నశించవలసిన పనిలేదు. ఆనందంలో వున్నా అది ఆనందమే,

అక్షరాభ్యాసం రోజు వచ్చింది. తలంటి, పట్టుగుడ్డలు తొడిగి. తలమీద జరీ టోపీ పెట్టి, పీటమీద కూర్చోబెట్టి మంత్రాలు మొదలైన తంతు అంతా జరి పారు. ఆ సమయానకూడా అక్కడున్నవాళ్లంతా కంటనీరు పెట్టారు. ఇటువంటి శుభసమయాన చూచి సంతోషించడానికి తల్లిలేకపోయెగదా! అని వాళ్ల ఆవేదన. బియ్యంమీద అక్షరాలు వ్రాయించారు హెడ్‌మాష్టర్‌గారు, వచ్చిన పిల్లలకు పల కలు, బలపాలు పంచిపెట్టినట్లున్నారు. అంతా అయినతరువాత లేచి పెద్దల దగ్గ రకు - ఒక్కొక్కరి దగ్గరకు - వెళ్లి నమస్కారాలు పెట్టవలసి వచ్చేవరకు చాలా ఓపికయపడ్డాను. ఆ బిడియం ముదిరి ఏడ్పుగామారింది. ఎక్కెక్కి ఏడవ సాగాను. దానితో ఆ కార్యక్రమం నమస్కారాలు లేకుండానే ముగిసింది. హెడ్

మాస్టర్‌గారు వెంటపెట్టుకొని బడికి తీసుకువెళ్లి తన కుర్చీ వెంబడివున్న కొయ్య పెట్టెమీద కూర్చోబెట్టుకొని ఎంతో వాత్సల్యంతో దిద్దించారు పలకమీద.

నేను తల పైకెత్తకుండానే దిద్దసాగాను. తల పైకెత్తి మిగతా పిల్లలవైపు చూస్తే సిగ్గువేసేది. నవ్వకుండా గంభీరముద్రలతో కూర్చున్నవాళ్లను చూస్తే ఏమీ అనిపించేదికాదు కాని నావైపు నవ్వుముఖంతో చూచిన పిల్లలను చూస్తే సిగ్గు వేసేది. కొంచెంసేపటికి ఇంటినుంచి పనిమనిషి వచ్చి నన్ను ఇంటికి తీసుకు వెళ్లాడు. ఇంటికిపోయి అన్నం తింటూనూ, ఆడుకొంటూనూ "అ ఆ ఇ ఈ" అని చదవసాగడం, వేలితో ఆకాశంలోనే అక్షరాలు వ్రాయబూనడం ప్రారంభించాను. అక్షరాలను చదవడంలోను, వ్రాయడంలోనుకూడా ఒకఆనందం లభించసాగింది. అక్షరాలపేర్లు సంగీతంలాగా వినిపించడం, అక్షరాలు బొమ్మలవలె కనుపించసాగాయి. అక్షరాల వంపులు నాట్యంచేస్తున్నట్టు గోచరించేవి.

## ఒంటి పూట బడి

హెడ్‌మాస్టర్‌గారు నిత్యమూ ఉదయం తమతోకూడా నన్ను వెంటబెట్టుకొని బడికి తీసుకువెళ్లి, తమ ప్రక్కనేవున్న ఆ కొయ్య పెట్టెమీద నన్ను కూర్చోబెట్టుకొని అక్షరాలు రానివి దిద్దించడం, వచ్చినవాటిని వ్రాయించడం, చదివించడం చేస్తూ వుండేవారు. హెడ్‌మాస్టర్‌గారితో రావడం,వారివద్దనే కూర్చోవడం, ఆయన నాయందు ప్రత్యేక వాత్సల్యం చూపడం మొదలైన వాటి మూలంగా బడిలోని మిగతాఇద్దరుపంతుళ్లూ, విద్యార్థులూ నన్ను ప్రత్యేక గౌరవ దృష్టితో చూడసాగారు. నాకు నిత్యమూ ఒక్కపూటమాత్రమే బడి, రెండవ పూట ఇంటిదగ్గరే వుండమనేవారు హెడ్‌మాస్టర్‌గారు. ఆయన చూపుతూ వచ్చిన మంచితనం మూలంగా ఆయనయందు ఎంతో గౌరవమూ, అనురాగమూ ఏర్పడినాయి నాకు.

కొద్ది రోజులకే అక్షరాలన్నీ వ్రాయడం, చదవడం వచ్చివేసినాయి. విద్యాభ్యాసంలో లభ్యమైన ఈ ప్రాథమిక సఫలత చూచి హెడ్‌మాస్టర్‌గారు, మా రెండు ఇళ్లలోని పెద్దలందరు సంతోషించారు. నా కంటె ఎంతో ముందునుంచీ అక్షరాలు దిద్దుతూన్న కొందరికి ఇంతవరకు అక్షరాలు రాకపోవడం చూచి వాళ్ల మీద నాకు జాలి జనించింది. వాళ్లదగర నేను కూర్చుని వాళ్లను దిద్దవద్దని చెప్పి

అక్షరాలను చూచి వ్రాయడం అలవాటు చేశాను. చూచివ్రాయడం, చేతనయిన అక్షరాలు చూడకుండా వ్రాయడంకూడా త్వరలోనేవచ్చినాయి వాళ్లకు. నాయందు ఎంతో సద్భావం కనబరచసాగారు. వాళ్లకూ, నాకూ స్నేహం కుదిరింది. కాని, ఆ మొద్దబ్బాయిలతో నేను స్నేహం చేయడం హెడ్‌మాస్టర్‌కి అయిష్టం, హెడ్ మాస్టర్‌గారి ఈ అయిష్టం నాకు ఇష్టంగా వుండేదిగాదు!

ఆదివారం వచ్చింది. ఆ మొద్దబ్బాయిలు మా ఇంటికి వచ్చారు. మధ్యాహ్న వేళలో వాళ్ళవెంట ఇంట్లో ఎవరికీ తెలీకుండా గ్రామానికి తూర్పుగావున్న చెరువు దగ్గరకు పోయినాం. ఆ చెరువును ఇదివరలో దూరంనుంచి చూడడం తప్ప దగ్గరకు ఎప్పుడూ పోలేదు, చెరువు నానుకొనే ఒక శివాలయం. హనుమంతుని మండపం, చెరువు కట్టమీద ఒక మర్రిచెట్టు ఊడలు ఓగి జడలు విరబోసుకొన్న దయ్యంలాగా వుంది, దానికి దగ్గరలో ఒక రావిచెట్టు. చెరువులోని నీరంతా బురదనీరే. వర్షాకాలం మూలంగా, అందరం కలిసి చెరువులోదిగి స్నానం చేయాలని, ఈత వేయాలనీ నిశ్చయించుకొని బట్టలు తీసి మెట్లమీద వుంచి, దగ్గరలోనే ఆ బురదనీళ్లలో మునిగేం. నాకు నోటిలోకీ, ముక్కులోకీ, చెవులలోకి నీరు పోయి ఊపిరి సలపలేదు, ముక్కురంధ్రాలలోనుంచి నీరుకారసాగింది తలంతా తడిసిపోయింది. విడచిన బట్టలు మళ్లీ తగిలించుకొని ఆ నీళ్లు కారుతున్న తలతో యింటికి వచ్చాను. అమ్మమ్మ చూచి చకితురాలైపోయి సంగతి అడిగితే నిజం చెప్పివేశాను. ఇక అది మొదలు ఆ మొద్దబ్బాయిలను ఇంటికి రావద్దని, వారితో సహవాసం చేయవద్దనీ చెప్పడంతో వాళ్లు నాకు దూరమైపోయారు.

ఆ రాత్రి దగ్గూ, తుమ్ములూ, కొద్దిగా జ్వరమూను, చెరువులో స్నానం చేసిన సంగతి కోటలోబాబుకుగాని, మామయ్యకుగాని, మరెవ్వరికిగాని తెలుప నీయవద్దని అమ్మమ్మను బ్రతిమాలాను, ఆమె సరేనని ఎవరితోనూ ఆ విషయం చెప్పలేదు. ఆ రాత్రి ఆశ్చైత్యభారంతో ఏమి తినకుండానే పడుకున్నాను, తులసి ఆకు రసంలో స్వచ్ఛన్నం అరగదీసి అమ్మమ్మ నాకు త్రాగించింది. ఆ రాత్రి సరిగా నిద్రపట్టలేదు, నా ప్రక్కనే పడుకొన్న అమ్మమ్మ గుసలతో నిద్రిస్తూంది. నాకు రైలుస్టేషనులో ఎర్రదీపాలూ, ఆకుపచ్చ దీపాలూ, అమ్మ జీవించివుండడం అమ్మ మరణించడం, చెల్లి జీవించివుండడం, చెల్లి మరణించడం మొదలైన దృశ్యాలన్నీ జ్ఞాపకం రాసాగినాయి. వీటిలో కొంచెంసేపు విషాదం, కొంచెంసేపు ఆనందం పొందసాగాను.

# చిన్ననాటి సరదాలు

మా కోట్లో బాబూగారి పెరటిలో ఒక రేగుచెట్టూ, చెట్టుక్రింద ఒక వెడల్పాంటి నాప బండా వుండేవి. ఆ బండకు భూమికీ మధ్య కొంచెం ఎత్తాటి రాళ్ళు నిలచి వుండడంతో చాలా ఖాళీ కనబడుతుండేది. ఆ బండక్రింద ఒక నల్లని ఆడకుక్క ఈని నాలుగు నల్లని పిల్లలను పెట్టింది. ఆడకుక్క కాక మొగకుక్క ఈనుతుందా అంటే ఈనదు నిజమే. అందుకే ఆడకుక్క ఈనిందన్నాను. కాని మొగకుక్క ఈనిందనలేను. ఈనిన కొద్దిరోజులవరకూ ఆవైపుల ఎవరిని మెదల నిచ్చేది కాదు. కొన్నాళ్ళయిన తరువాత నాకు మాత్రమే దాని దాపుకు రావడానికి మొదటి లైసెన్సు లభించింది.

నాలుగు పిల్లలూ ఒకేసారి తల్లివద్ద పాలు త్రాగుతుంటే నేను నల్లకుక్క తలమీద చేయివుంచి దాని చెవులతో కూడా కలిపి వెనక్కి దువ్వుతుండేవాణ్ణి. దాని పిల్లలు పాలు త్రాగుతున్నందున కలిగే సుఖమో లేక నేను తలను నిమురుతున్నందువల్ల కలిగిన సుఖమో కాని అది తన్మయత్వంతో కళ్ళుమూసేది. పిల్లలు పాలు త్రాగటమైన తరువాత వాటిని ఎత్తుకొని ఆడించేవాణ్ని. తల్లి చూస్తు మురిసిపోతూ తోక ఆడిస్తూ నా చేతులను నాకేది.

ఆ పిల్లలు తల్లివున్న పిల్లలు. నేను తల్లిలేని పిల్లవాణ్ని. అయినా ఆ తల్లివున్న కుక్కపిల్లనుచూస్తే నాకు అసూయ జనించేదికాదు. ఆనందమే జనించేది. తనకున్న కొరత ఇతర్లలోనైనా తీరినందుకు ఎంతో సంతృప్తి కలిగేది. ఆ నల్లకుక్కకు మా పెదతల్లి రెండుపూటలా చాలినంత అన్నం పెడుతూండేది. నామటుకు నాకు కుక్కపిల్లలతో ఆడుకుంటూన్నప్పటికంటె వాటి తల్లితో ఆడుకొంటూన్నప్పుడే ఎక్కువ సంతోషం కలిగేది. ఆ ఆడకుక్క దగ్గర కూర్చుంటే అది ఏదో జాలిదృష్టితో నా కళ్ళలోకి చూచి తోకవూపుతూ కూర్చునేది. దాని పిల్లలతో కలిపి దానిదగ్గర కూర్చుంటే అమ్మదగ్గర కూర్చున్నట్టే వుండేది. ఆ కుక్కనోట్లో చేతులుకూడా పెట్టి నన్ను కరవదుచూడమని పిళ్ళవాళ్లకు చూపేవాణ్ని. ఒక పిల్లవాడు తానుకూడ దానినోట్లో చేతులు పెడుతాను, చూడమని చేయి పెట్టేసరికి అది భవ్‌మని ఆ చేతిని పీకివదలింది. రక్తం కారుతూ ఏడుస్తూ పరుగెత్తాను.

## ఎలుగుబంటి సరదా

పీర్ల పంజాదగ్గర ఎలుగుబంటులను కట్టేసి వాటిని తెచ్చిన సాయిబులు అక్కడే అన్నాలు వండుకొని తినేవారు. ఎలుగుబంటులు వెనకకూ, ముందుకూ ఊగుతూండడం సరదాగా వుండేది. చూడటానికి రోజంతా అక్కడే కూచొని ఎలుగుబంట్లను చూస్తూండేవాళ్ళం. జావకాచి బొచ్చెలోపోసి వాటిముందు పెడితే గురగురమంటూ ఆ జావను పీల్చడం ఒక తమాషాగా వుండేది. ఆ సాయిబులు ఎలుగులను తీసుకొని వాటిచేత తమాషాలు చేయిస్తూ ఊరిలో అడుక్కుంటూ వుంటే మేము వాళ్ళవెంటనే వూరంతా తిరిగేవాళ్ళం. వాటిని ఉదయానే పొలాల మీదకు తీసుకుపోయి చీమల పుట్టలు చూపేవాళ్ళు. ఎలుగులు పుట్టల దగ్గర నోళ్ళుంచి బుసలతో చీమలను పీల్చితినేవి. కట్టివేసివున్నపుడు కూడ వాటి మూతులకు ఇనపకడియం ఒకటి వేసివుంచేవాళ్ళు. ఆ కడియం లేకపోతే చాలా వెడల్పాగా నోరుతెరచి మనుషుల తలలు పగలకొరుకుతవట.

ఒకటో తరగతి వాచకం చెబుతున్నారు బడిలో. ఎలుగుబంట్లు వూరిలో వున్నన్నాళ్ళు పాఠం బుర్రకెక్కేదికాదు. ఎప్పుడు పాఠం ముగుస్తుందా, ఎప్పుడు బడి వదలుతారా, ఎప్పుడు పీర్ల పంజా దగ్గరకుపోయి ఎలుగుబంట్లతోనూ, వాటిని తెచ్చిన రాయలసీమ సాయిబులతోనూ స్నేహంచేదామా అని ప్రాణం కొట్టుకులాడేది.

ఊళ్ళోకి ఎలుగుబంట్ల సాయిబులు వచ్చినా, బొమ్మలాటవాళ్ళు వచ్చినా, వీధి భాగవతులు వచ్చినా, గారడివాళ్ళు వచ్చినా, బుడుబుడుక్కలవాళ్ళు వచ్చినా, పగటివేషగాళ్ళువచ్చినా, పంబలవాళ్ళు వచ్చినా, మంచి పాములనాడించే పాముల వాళ్ళువచ్చినా పగలు బడి ఎగవేసి, రాత్రులలో నిద్రలు లేకుండా వాళ్ళ వెంటనే వుండేవాళ్ళం.

అలాంటి వాళ్ళంతా మాకెంతో ఇష్టమైనవాళ్ళు. అయినా వాళ్ళుగా మేము మారాలని వుండేది కాదు. తాము ఆనందించే వాటన్నిటిగా మనిషి మారాలని ఇష్టపడడు. ఎలుగుబంటినిచూచి ఆనందిస్తాడు మనిషి. పాము ఆడుతుంటే చూచి ఆనందిస్తాడు. బుడబుడక్కలవాణ్ణిచూచి ఆనందిస్తాడు. అందుకని తాను వాళ్ళని మారాలని కోరడు. తాను కర్తగాను వాళ్ళు కర్మగాను వుంటేనే ఆనందంకాగ తానుకూడ కర్మగా మారితే ఇంకా ఆనందం ఏముంటుంది కనుక?

కొన్నాళ్ళబట్టి వర్షాలు బాగా ముసురుబట్టి కురుస్తున్నాయి. ఆ ఊరు బజారులన్నీ వాగులుగానే, లోతుగా ప్రవహిస్తూంటాయి, కనుక వర్షాకాలంలో నీళ్ళతో ఆడుకోడానికి ఊరిబయట పోవాలసిన పనిలేదు. రకరకాల రంగుల కాయితపు పడవలను, రకరకాల ఆకారాలలో చేసి ఆ వర్షపునీటి ప్రవాహాలలో వదిలేవాళ్ళం. ఆ పడవలలో మేము ఎక్కడానికి ప్రయత్నించేవాళ్ళం, ఆ మా ప్రయత్నంతో అవి మునిగిపోయేవి. ఆ పడవలు మేము ఎక్కడానికి కాక మా మీద ఎక్కడానికి మాత్రమే పనికి వచ్చేవి. ఆ పడవలలో మేము ఎక్కితే అవి మునిగేవి కాని, ఆ పడవలు మా మీద ఎక్కితే మాత్రం మేము మునిగేవాళ్ళంకాదు.

## ఇంద్రధనస్సు

ఒక సాయంత్రం కొందరం చెరువు గట్టునకెళ్ళి కూర్చున్నాం, తూర్పుగా బాగా మేఘాలు క్రమ్మి వున్నాయి. పడమటవైపు మేఘాలలో నుంచి సూర్యుడు బయటికి వచ్చాడు. తూర్పునవున్న మేఘాంమీద రంగుల ఇంద్రజాలం ప్రత్యక్షమైంది. ఇంద్రధనస్సు దాన్ని చూడటం అదే ప్రథమం. దాని ప్రతిబింబం చెరువులో కనిపిస్తుంది. ఏది నిజమైన ఇంద్రధనస్సో, ఏది దాని ప్రతిబింబమో తెలియకుండా వుంది. చెరువులో వేసిన ఇంద్రధనస్సు ఆకాశంమీద ప్రతిబింబించినట్లా లేక ఆకాశంమీదనే ఇంద్రధనస్సు వేసి చెరువులో ప్రతిబింబించినట్లా లేక దేనికదే మూలం కాని, ఒకదానికొకటి ప్రతిబింబాలు కాదేమో :

అయితే ఒక ఘటనవల్ల చెరువులోదే ప్రతిబింబంకాని, ఆకాశంలోది కాదని తేలిపోయింది. చెరువులోకి రాళ్ళు విసరసాగేం. దానితో చెరువులో అలలు లేవసాగినాయి. ఆ అలలలో ఇంద్రధనస్సు చెదిరి నిరూపం చెందసాగింది. కాని ఆకాశంలోని ఇంద్రధనస్సు మాత్రం కదలక చెదరక అదే విధంగా కనిపిస్తూంది. కనుక ఆకాశంలోదే అసలు ఇంద్రధనస్సు అని, దాని నకలు మాత్రమే చెరువులోదని విస్పష్టమైపోయింది. మేము దానివైపుచూస్తూ చూస్తూండగానే ఆకాశం మీది ఇంద్రధనస్సు రంగులకాంతి సన్నగిలి క్రమేణ ఇంద్రధనస్సు దృశ్యలోకం నుంచి అదృశ్య లోకంలోకి అంతర్ధానమైపోయింది.

క్రమేణ వర్షాలు ఎక్కువయి క్రమేణ తగ్గిపోసాగేవి. దసరా పండుగ రోజులు ప్రారంభమయినాయి. మా అందరికీ రకరకాల దసరా పాటలు నేర్పి

వుంచారు. బడిలో ఆడిపాడితే, కోలాటం వేయటం కూడా నేర్పివుంచారు. నవరాత్రులలో విద్యార్థులందరినీ తీసుకొని గ్రామంలో ఇంటింటిముందూ మా కోలాట ప్రదర్శనమూ, పాటల ప్రదర్శనమూ చేయించేవారు హెడ్‌మాస్టర్‌గారు. కోలాటం వేసేసమయాన కోలాటపు కర్రలు తప్పుడులయతో నడిచినాయంటే అవతలవారికి కోలాటపుకర్రలు వేళ్ళకుతగిలి చాలా బాధకలిగేది. కోలాటాన్ని ప్రారంభించడం "తద్దిమికి ధిమికితాధిమికిధిమికీ" అనే పదువులతో ప్రారంభించి "మల్లిపంది రదిగో కృష్ణుడు మాధవుడల్లుడుగో" అనే కీర్తనలతో రక్తికట్టేది. మా మొగపిల్లల దసరా ఈ విధంగావుంటే యిక ఆడపిల్లల దసరా మరో విధంగా వుండేది.

## ఆడపిల్లల దసరా

తెలంగాణా గ్రామాల్లోనూ, తెలంగాణా సరిహద్దులయిన నందిగామ తాలూకా గ్రామాల్లోనూ దసరా పదిరోజులూ ఆడపిల్లలూ, పెద్దవాళ్ళు కూడా "బతకమ్మ" అనే ఒక గౌరీపూజ నిర్వహిస్తారు. దేవాలయపు ఖాళీస్థలంలో మట్టితో ఒక అరడుగు ఎత్తులో గుండ్రని వెడల్పయిన అరుగువేస్తారు. దానిమీద సన్నగా అనేక విధాలైన ముగ్గులువేసి అలంకరించి వుంచుతారు. నవరాత్రుల ప్రారంభంనుంచి ఒక పెద్ద పళ్ళెంలో తంగేడుపూవులతో ఎత్తుగా గోపురాకారంలో పేరుస్తారు. ఆ పూలపేర్పును "బతకమ్మ" అంటారు. బతకమ్మ అంటే గౌరి అనే అర్థం. తంగేడుపూల పేర్పులన్నీ స్త్రీలూ, బాలికలు ఆలయ ప్రాంగణంలో నిర్మించిన చక్రాకార వేదికమీదవుంచి, తంగేడుపూల దళాన్ని చేతిలోకి తీసుకొని వాటిని ఆ పూలపేర్పులమీద చల్లుతూ, పాటలు పాడుతూ ఆ వేదిక చుట్టూ చీకటిపడేదాకా తిరుగుతుంటారు. దీన్ని సాయంత్రం ప్రారంభించి చీకటిపడే లోపల పూర్తిచేస్తారు. "ఒక్కొక్క పూవేసి చందమామా రెండేసి పూలేసి చందమామా" అని, "ఇంత కోటంత కోటా గౌరమ్మ రామారివల్లెకోటా" అని ఇటువంటి పాటలు చాలా పాడుతారు. వారి పాటలు వినసొంపుగ వుంటాయి. వారి చక్రభ్రమణం చూడ సొంపుగా వుంటుంది. మేము మొగపిల్లలం ఆడుతూన్న ఆడపిల్లలను సమీపించి "బతకమ్మ బారెడు. బావిలో పడితే మూరెడు" అని అరచేవాళ్ళం. ఇంకోపాట "పతివ్రతా ధర్మాన పతిభక్తి దోషాన పెనిమిటే మొగుడాయెనే గౌరమ్మ. పెనిమిటే మొగుడాయెనే" అని బతకమ్మలాడే మహిళామండలిలో మేము అరచేవాళ్ళం. వాళ్ళు మమ్మల్ని తిట్టడం, కొట్టరావడం, చెవులు మెలేయడం చివరకు మాకు తినడానికి వాళ్ళు తెచ్చిన ఫలహారాలు పెట్టడంకూడ జరిగేది.

కోనాయపాలెంలో దసరా బ్రహ్మాండంగా జరిగేది. చుట్టుపట్ల ఊళ్ళ ప్రజలంతా దసరారోజు సాయంత్రం కోనాయపాలెంలోనే వుండేవాళ్ళు. పార్వేట వేడుక చూడటానికి. పార్వేట సాయంత్రం దేవాలయం నుంచి దేవుడు బయలుదేరి చెరువుకట్టమీద వున్న జమ్మిచెట్టు దగ్గరకువచ్చి దర్బార్ చేశాడు. ఆ సమయాన ఒక గొర్రెమెతెచ్చి తోక కొంచెంకోసి దాన్ని జనం వెంటాడుతారు. ఆ గొర్రె తోకతెగిన మంటతో, జనం వెంటబడిన భయంతో ఎవరికీ అందకుండా విపరీతంగా పరిగెత్తుతుంది. చివరకు దాన్ని ఎవరు పట్టుకోగలిగితే ఆయన ఆ దసరా పీయనిలో లెక్క. ఆ గొర్రెనుకోసి దాని తొడను ఆ పట్టినవానికిస్తారు. ఆ వూరులో చాలామంది పెద్దలకు గుర్రాలుండేవి. మా కోట్లో బాబుకికూడా ఒక బూడిదరంగు అరగుర్రం వుండేది. పార్వేట సమయంలో నాకు కొత్త దుస్తులు వేసి, జరీ టోపీ పెట్టి ఆ గుర్రంమీద కూర్చోబెట్టి పార్వేటకు తీసుకువెళ్ళేవాళ్ళు. దేవునిదగ్గర తుపాకీ కాల్చినప్పుడల్లా గుర్రం ఎగిరిపడేది; ఎగిరినప్పుడల్లా నేను క్రింద పడకుండా రికాబులలో కాళ్ళు బిగించి గట్టిగా కూర్చునేవాడిని. ఆ గుర్రం ఎన్నో పిల్లల్ని కని కొంతకాలానికి ముసలిదై చచ్చిపోయింది. ఈ బూడిద రంగు అరగుర్రమూ, ఆ నల్లరంగు ఆడ కుక్కా నా బాల్యస్నేహితులలో ప్రధానమైనవి.

దసరా వెళ్ళినది మొదలు ఇక ఇరవై రోజులకు రానున్న దీపావళి ప్రయత్నంలో నిమగ్నమై వుండేవాళ్ళం. అప్పటినుంచే రోలూ రోకట్నా ప్రయోగించడం ప్రారంభించేవాళ్ళం. ఆరంభంలో పెద్ద ధ్వనిని వినడం కొంత భరింపరానిదిగా, కొంత భయంగా వుండేది. కాని క్రమేణా అందులో ఆనందం దొరకసాగింది. ధ్వని ఎంత భయంకరమైనదయితే ఆనందం అంత గొప్పగా తట్టసాగింది. ఈ ఆనందంలో ఇంకో విశేషం ఏమంటే ఆ పెద్ద ధ్వని విని అక్కడున్న వాళ్ళలో కొందరు భయపడేవాళ్ళుండాలి. ఆ భయపడినవారిని చూచి మాకు ఇంకా ఎక్కువ ఆనందం కలిగేది. మా వీరత్వంమీద మాకు విశ్వాసం ఏర్పడేది. ఆ వూరులో నిమ్మకాయంత లావు నేలటపాకాయలు కట్టేవారు. దాన్ని అలా విసిరితే చాలు ఫిరంగిమోత మోగేది. రాత్రులు అయితే పెద్ద మంటకూడా కనుపించేది. ఇవి ప్రేలినప్పుడు వచ్చే పొగవాసన చాలా యిష్టంగా తట్టసాగేది. ఏ మేమి రసాయనిక పదార్థాలు కలిస్తే ఆ ప్రేలుడు మందు తయారవుతుందోకూడా తెలుసుకున్నాం. రోలూ రోకలి మందులోని పొటాషూ, గంధకమూ అని, నేలటపాకాయల

మందులోని మణిశిలా, గంధకమూ అని పేరు తెలుసుకున్నాం. వాటిని తయారు చేయాలనే దుర్బల సంకల్పం కార్యరూపం దాల్చలేకపోయింది. దీపావళివాడు రాత్రి ప్రొద్దుపోయేదాక అనేక విధాలయిన మందుసామానులు కాల్చివచ్చి పడు కొంటే దిగులుమూలంగా నిద్రపట్టేదికాదు. మళ్ళీ సంవత్సరానికికాని దీపావళి రాదు అనే దిగులు. ప్రతి అమావాస్య దీపావళి అమావాస్య కాకపోయినప్పటికి సంవత్సరానికి కనీసం రెండు మూడుసార్లు అయినా దీపావళిరాని ఈ విశ్వసృష్టి చాలా పేలవంగా తోచేది. పండుగలలోకల్లా ఏ పండుగ బాగుంటుందని నన్ను అడిగితే దీపావళి పండుగ అని జవాబిచ్చేవాడిని.

దీపావళి వెళ్ళిన కొన్నాళ్ళకు పీర్లపండుగ (మొహరం) వచ్చింది. దసరా పండుగలాగా పీర్లపండుగకూడా ఆ వూరులో బ్రహ్మాండంగా జరిగేది. ముస్లిముల జనసంఖ్య చాలా కొద్దిగానే వుండేది ఆ వూరులో. అయినప్పటికి హిందువుల ఉత్సాహ ప్రోత్సాహాలతోనే పీర్లపండుగ అంతా బాగా జరిగేది. పీర్లపంజాలోని పీర్లలో ఎక్కువభాగం గ్రామంలోని హిందువులు చేయించినవే. పది రోజులపాటు ఊళ్ళో రకరకాల వేషాలువేసుకొని ముస్లిములు ముస్లిమేతరులు తప్పెట దరువులతో ఆడుతూ తిరిగేవారు. రాత్రులు పీర్లపంజాముందు తీసిన పెద్ద గుండంలో మొద్దులుకాలిన నిప్పులు భగభగలాడుతూండేవి. యువకులు పీర్లను పంజానుంచి తీసి పట్టుకొని ఆ మండే నిప్పుల గుండంలోదూకి నడిచే వాళ్ళు. మా లేత హృదయాలకు ఆ అద్భుత కార్యం పరమాద్భుతంగా తోచేది. నిజంగా ఆ అగ్నిగుండంలో నడిచివెళ్ళినవారు భగవంతుని అవతారాలే అనుకొనే వాళ్ళం! పీర్లపండగలలోని తప్పెట్లమోతకు అదో ప్రత్యేక దరువు. ఆ సన్నాయి పాటకు అదో ప్రత్యేకరాగం. ఆ సన్నాయి పంచమ స్వరంలో ధ్వనిస్తూంటే ఏదో జాలిగా విషాదంతో కూడిన ఆనందంగా, ఏవో యుగయుగాలనాటి ఏవో దిగ్దిగంతాల కావలి విస్మృతిస్మృతులు మేల్కొంటూన్నట్లు అనిపించేది. పదోరోజున పీర్లు చచ్చిపోగా చెరువు నీళ్ళలో పడేసి వాటిని దుప్పటిలోచుట్టి "అల్ బిదాయో అల్ బిదా" అంటూ వాళ్ళు విషాదగీతాన్ని పాడుతూ పోతుంటే నాకు వాళ్ళతోకలసి ఏడవాలనిపించేది. ఏడిచేవుంటానేమో గుర్తులేదు.

ఈ విధంగా నా చదువు సరిగా సాగనీయని వేడుకలు, వ్యామోహాలు, పండుగలు, సమారోహాలు ఆ వూరులో ఎన్నో! దోలుమీద దెబ్బపడినా, సన్నా

యిలో రాగాలాపన వినిపించినా, చప్పట్లను మంటపంగ్గర కాపుతూ తోలువారుతో కొట్టి త్రిప్పుతూ చూసుకుంటున్నా నా చేతిలోని పుస్తకం క్రిందపడిపోయేది. నా అరికాళ్ళకు దురద వేసేది. గుండె దడగా కొట్టుకునేది. బడిమీదా, బడిలోని పంతుళ్ళమీద అనంతంగా కోపం వచ్చేది. ఎప్పుడులేచి ఆ చోట్లలో పోయి వాలుదామా అనిపించేది. అయితే, ఇన్ని సందడులతో తిరుగుతున్నాకూడా నాకేనాడు బడిలో వప్పచెప్పటానికి పాఠంకూడా పోలేదు. పంతుళ్ళ కోపానికి నే నేనాడు గురికాలేదు.

## విద్యాభ్యాసనలో తొలిఅనుభవాలు

నాకదే ఎనిమిదో సంవత్సరం అనుకొంటాను. మూడవ తరగతి చదువుతున్నానేమో. కానర్ల వెంకటేశ్వర్లు అనే ఒకాయన తెలంగాణా ప్రాంతంనుంచి వచ్చి పిల్లలకు ఉర్దూ భాష నేర్పడానికి ఒక రాత్రి పాఠశాలను ప్రారంభించాడు. ముదిగొండ ఉమామహేశ్వరశాస్త్రిగారింట ఈ ఉర్దూ బడిని ప్రారంభించారు. పగలు తెలుగుబడిలో చదువుకుంటూ, రాత్రులు ఈ ఉర్దూ బడిలో చదువుకోడానికి కొందరు పిల్లలు, పిల్లల తలిదండ్రులుకూడా ఉత్సుకత కనబరచారు. నేనుకూడా రాత్రిపూట ఉర్దూ చదువుకుంటానని మా అమ్మమ్మతోచెప్పి పలకా, బలపం తీసుకొని ఒకరాత్రి ఉర్దూబడికి వెళ్ళాను. పంతులు సంతోషించి "అలేఫ్" "బే" లు దిద్దించాడు. ఆ మొదటిరోజు కొంచెంసేపు మాత్రమేవుండి అక్కడనుంచి ఇంటికొచ్చి "అమ్మమ్మా అలీఫ్, అలీఫ్ అమ్మమ్మా" అని సంబోధించ సాగాను. అబ్బాయి తెలివికి ఇంట్లో అందరూ సంతసించారు. ఒక్కపూటకే అబ్బాయికి ఉర్దూ చాలా వచ్చేసిందని అమ్మమ్మ ఆనందించసాగింది. ఇతర అబ్బాయిలకంటె తన మనుమడే గొప్ప తెలివికలవాడని ఆమె గర్వించసాగింది. ఆమె సంతోషాన్ని కనిపెట్టి "అలేఫ్" అనే ఉర్దూ మొదటి అక్షరాన్ని మాత్రమేకాక మిగతా అక్షరాలయిన బే, పే, తే, టే, సే మొదలైనవి ఆ రాత్రి నా కొచ్చినంతవరకు వల్లించాను. ఇక ఆమె ఆనందానికి హద్దులులేవు.

### మనుమడి తెలివితేటలు

పగలు బడిలో తెలుగూ, ఇంగ్లీషు అక్షరాలూ, రాత్రులు ఉర్దూ అభ్యాసమూ, ఈ మూడు భాషలమూ కలిపి అభ్యసించడం కొంత మానసిక శ్రమగానే వుంది.

కాని ఉర్దూమీద నూతనోత్సాహం అశ్రమ అనేదాన్ని తెలియనీయలేదు. మూడు రోజులలోనే ఉర్దూ అక్షరాలన్ని వ్రాయడం, చదవడం వచ్చేశాయి. అంతటితో "ఖాయిదా" అనే మాటల పుస్తకాన్ని ప్రారంభించారు. దానితో ఉర్దూ సంయుక్తాక్షరములనుకూడా చదవసాగాను. ఉర్దూమీది ప్రీతి బడిలోని పగటి చదువుమీద కొంత దెబ్బకొట్టసాగింది. అయితే ఉర్దూమీద ఎంత ప్రీతివుందో ఇంగ్లీషునేర్చుకోవడంలోనూ అంత ప్రీతి వుండేది. ఎడమనుంచి కుడికి వ్రాసే తెలుగును, ఇంగ్లీషునూ, కుడినుంచి ఎడమకువ్రాసే ఉర్దూనూ సమాన దక్షతతోనే వ్రాయసాగాను. చదవసాగాను.

హిందీకి లిపిలేనట్టే ఉర్దూకు లిపి లేదు. హిందీ దేవనాగరలిపిని వాడుకొంటే ఉర్దూ అరబ్బీలిపిని కొన్ని మార్పులతో వాడుకొంటుంది. పార్శీకికూడా అరబ్బీ లిపియే కొన్ని మార్పులతో. ఉర్దూ స్వతంత్రభాషకూడా కాదు. హిందీ క్రియాపదాలను, అరబ్బీ, పార్శీశబ్దాలను చేర్చి నిర్మించిన కృతకభాష, కనుక ఇప్పుడు దాన్ని ఉర్దూభాష అని, ఉర్దూ లిపి అని అనక తప్పదు. ఉర్దూలిపి చాలా క్లిష్టమైన లిపి. సంయుక్తాక్షరాలు వ్రాయడం, ఇతరులు వ్రాసినవాటిని తెలుసుకోవడం కూడ చాలా కష్టం.

ఇదివరలో అంటే మేము ఉర్దూ చదువుకొనే రోజులలో గోధుమరంగు కాగితాలమీద చెక్కిన రెల్లుకలంతో వ్రాసేవాళ్ళు ఉర్దూ. మచ్చల మచ్చల అందమైన రెల్లుపుల్లలు తెలంగాణాలో అమ్మేవారు. వాటిని మనం తెచ్చుకొని చివర్లను చాకుతో పలచగా చెక్కి దాన్ని చాకుతో నొక్కితే ఒక చీలికచార ఏర్పడుతుంది. దానిని సిరాబుడ్డిలో ముంచివ్రాస్తుంటే బొమ్మలలాగా అందమైన అక్షరాలు రూపొందుతాయి. ఆ కలాన్ని త్రిప్పడాన్నిబట్టి లావులూ, సన్నాలూ ఒకేఊపులో వస్తాయి. ఉర్దూ అక్షరాలకు నుక్తా అని పిలువబడే చుక్కల గుర్తులుంటాయి. రెల్లుకలాన్ని మూలగా త్రిప్పి కాయితంమీద వత్తితే డైమన్ ఆకారంలో అందంగా నుక్తాపడుతుంది. లిపికళకు ఈ రెల్లుకలాలు ఎంతగానో ఉపయోగపడతాయి.

రాత్రి పాఠశాలంగానే ప్రారంభమైన ఉర్దూ పాఠశాల క్రమేణ పగటిపాఠశాలగా మారింది. ఉర్దూకుతోడు ఆయన తెలుగూ, లెక్కలుకూడా చెప్పసాగాడు. ఊళ్ళో ఇదివరకున్న బడిలోని హెడ్‌మాష్టరైన మునిపల్లి శ్రీరాములుగారు

అక్కడి మంచి బడిలో అయిపోవడంతో చాలా మంది పిల్లలు ఆ బడిని మానేసి ఉర్దూబడిలో ప్రవేశించ సాగారు. నేను కూడా అదే పనిని చేశాను. అయితే ఉర్దూ పాఠశాలలో ప్రవేశించిన తరువాత నా ఇంగ్లీష్ దెబ్బతిన్నది. ఉర్దూ పంతులు ఉర్దూ, తెలుగూ తప్ప ఇంగ్లీషు బొత్తిగా రాదు. మా ఉర్దూ పంతులు ఎల్లప్పుడూ చుట్ట కాలుస్తూనే వుంటాడు. చాలా చమత్కారంగా మాట్లాడుతాడు.

మొట్టమొదట ఉర్దూ బడి రాత్రుల్లో నడచినచోటు ముదిగొండ ఉమామహేశ్వరశాస్త్రిగారి ఇల్లు అని పైన వచ్చినది. ఆయన కుమారుడు రాజమల్లయ్య నాకు మిత్రుడుగా నాతో ఆ రోజుల్లో ఉర్దూ చదువుకొన్నాడు. రాజమల్లయ్యను గురించి ఎవరూ ఏమీ తెలుసుకోవలసిన విశేషాలు లేవు, కాని ఆయన తండ్రి ఉమామహేశ్వరశాస్త్రిగారు మాత్రం విశేషాలు గల వ్యక్తి. ముదిగొండవారు ఆరాధ్యులు, శైవులకు గురువులు. ఉమామహేశ్వరశాస్త్రిగారిది విశిష్ట వ్యక్తిత్వం. సంస్కృతంలో కాదుగాని తెలుగులో మాత్రం ఆయన సిద్ధహస్తుడు. ఎటువంటి కఠినపదానికైనా, శ్లేషకైనా, గూఢార్థానికయినా, భావార్థానికైనా, ఇతరులెవరూ అర్థం చెప్పలేనపుడు ఉమామహేశ్వరశాస్త్రిగారు చెప్పవలసిందే. చిన్నతనంలో ఆయన గొప్పగా చదువుకోలేదట. ఈ పాండిత్యం అంతా ఆయన స్వీయ కృషిద్వారా సంపాదించినదే. పాండిత్యమంటే పుస్తకాలకు అర్థం చెప్పటం మాత్రమే. కలంపట్టుకొని ఒక్క వ్యాసంకూడా ఆయనెప్పుడూ వ్రాసి యెరుగరు.

పంథా సనాతనమైనప్పటికీ ఆయనకు జాతిభేదాలుండేవికాదు. మేమంతా శాస్త్రిగారిని మామయ్యగారనీ. ఆయన సతీమణిని అత్తయ్యగారనీ పిలిచేవాళ్ళం. వెలకాకపోతైనా వారింట్లో భోజనం చేయవలసి వస్తూండేది మేము. ఉమామహేశ్వరశాస్త్రిగారిని ఉమ్మయ్యగారు అని ఊళ్ళో అంతా పిలిచేవాళ్ళు. మానవజీవితాన్ని గురించి ఆయనకు చాలా నవీన భావాలుండేవి. ఎప్పుడూ చేతిలో ఏదో ప్రబంధం. ఏకార్థాన్నిచ్చేదో, రెండర్థాలనిచ్చేదో, మూడు, నాలుగర్థాల నిచ్చేదో వుండేది. ఆయనకు నిరంతరమూ ఎవరైనా వినే వ్యక్తులవసరం. వినేవాళ్ళు పిల్లలైనాసరే ఆయన ఆనందించేవారు. వినడానికి ఎవరూ దొరకనప్పుడు వాళ్ళ ఇంట్లోని గోధుమరంగు కుక్కకుగాని, ఇంటివెనుక కట్టివేసివున్న బర్రెలకో, ఆవులకో, ఎద్దులకో ప్రబంధాలను చదివి అర్థం చెప్పేవారేమో తెలియదు. చాలా వింత స్వభావుడు. పెద్దలతో ఎంత గంభీరంగా విలువ ఇచ్చి మాట్లాడేవారో పిల్లలతోనూ అలాగే మాట్లాడేవారు.

4)

ఉర్దూ పాఠాల్లో వచ్చే కొన్ని అరబ్బీ పార్శీ శబ్దాలు ఎంతో సునాదంతో ఆకర్షణీయంగా వుండేవి. వాటిని తడవ తడవకు ఉచ్చరించాలనిపించేది. అఫ్‌సోస్ (విచారం) హిఫాజత్ (రక్షణ), హకీకత్ (వాస్తవం), తక్‌లీఫ్ (కష్టం) లిఫాఫా (కవరు) ఫిజూల్ (వృథా) మొదలయిన పదాలు ఎ-తో శ్రావ్యముగా తట్టేవి. ఫ (ఇంగ్లీషులోని ఎఫ్‌లాగా) వచ్చిన శబ్దమల్లా ఎంతో మధురంగా తట్టేది ప్రత్యేకంగా నాకు. ఉదయానే "తారీఫ్ ఉస్ ఖుదాకో జిస్‌నే జహాన్ బనాయా" అనే ప్రార్థనా గీతంతో బడిలోని కార్యక్రమం ప్రారంభమయేది.

ఒకరోజు మాకు పాఠాలు చెపుతూనే ఉస్తాద్‌జీ (ఉర్దూ పంతుల్ని అలా పిలిచే వాళ్ళం) ఒక కథ చెప్పాడు. ఆ కథ విని మేము నవ్వలేక సతమతమయ్యాం ఒక ఊరులో ఒక షావుకార్ వున్నాడట. అతనికొక చిల్లర దుకాణం కూడా వుందట. ఆ వూరులోని ఉర్దూ పంతులు దగ్గర కొన్ని మాత్రమే ఉర్దూ మాటలు నేర్చుకొన్నాడట ఆ షావుకారు. ఒకో మాట నేర్చుకొన్నందుకు ఆ ఉర్దూ పంతులుకు మాటకు అణా ఇస్తానని వప్పుకున్నాడట. ఘోడా అంటే గుర్రమూ అని చెప్పగానే షావుకారు అనేవాడట, "గుర్రం అంటే ఘోడా అని చెప్పావు చాలు. గుర్రం జీనుకు ఉర్దూ పేరు నాకు తెలుసు కనుక నీవు చెప్పనవసరం లేదు" అని. గుర్రం పేరు గోడా (ఘోడా) కనుక గుర్రం పైని జీనుపేరు గోడమీద వుండే పదురు అని వూహించుకొన్నాడట. ఇదే విధంగా తేల్ అంటే నూనె అని చెప్పించుకొని, నూనె పేరు తేలు అయితే ఆముదం పేరు తేలుకంటే గొప్పదైన "పాము" అయివుంటుందని వూహించుకొన్నాడట.

తరువాత ఒకరోజున ఆ వూరులోకి పోలీసు అధికారి వచ్చి మకాం వేశాడు. ఆ సాయంత్రం మకాంలో దీపం వెలిగించడానికి పోలీసు జవాన్ షావుకారు దుకాణానికి నూనెకోసం వచ్చి "భాయీ తేల్ హై తుంహారేషాప్" (సోదరా మీ దగ్గర నూనె వున్నదా?) అని అడిగాడట. ఉర్దూ మాటలు తనకు తెలుసునను కొన్న షావుకారు అన్నాడు. "తేల్ నహీఁ పాం పకడో" (నూనె లేదు కాళ్ళు పట్టుకో) దానితో పోలీసు జవాను షావుకారును మెత్తగా తన్ని వదలాడట। తేల్ అంటే నూనె అయినప్పుడు పాం (పాము) అంటే ఆముదంకదా అని షావుకారు ఊహ. పాం అంటే కాళ్ళు అని తెలియదు।

ఉర్దూలో ఇతర భాషల్లోకంటె కొన్ని తమాషా అయిన విశిష్టతలున్నాయి. కొన్ని పదాలను కొన్ని తరహాలుగా ఉచ్చరించవచ్చు. ఉదాహరణకు ఫిజూల్ (వృథా) అనే పదాన్ని "ఫజూల్" అనీ, "ఫిజూల్" అనీ, "ఫుజూల్" అని కూడా ఉచ్చరిస్తారు. ఉర్దూ అకారాన్ని తెలిపే చిహ్నాన్ని జబర్ అని, ఇ కారాన్ని తెలిపేదాన్ని జేర్ అని, ఉ కారాన్ని తెలిపేదాన్ని పేష్ అనీ అంటారు. ఈ చిహ్నాలను చాలాచోట్ల అసలు వాడరు. అందువల్ల కొన్ని పదాల ఉచ్చారణ అకారంగా కాని, ఇకారంగా కాని ఉచ్చరిస్తారు. ఎటువంటి కారంతో ఉచ్చరించినా అది వికారంగా మారదు.

ఇంగ్లీషు ఈ బడిలో చెప్పక పోవడం నాకు లోలోపల బాధగానే వుంది. అందువల్ల వచ్చిన ఇంగ్లీషు మాటలను మరచి పోకుండా వుండడానికై ఇంటివద్ద ఇదివరలోని ఇంగ్లీషు పాఠాలను చదువుకొనేవాణ్ణి. ఇంగ్లీషు స్పెల్లింగులూ, ఉచ్చారణలూ కొంత బాధాకరంగానేవుండేవి. క్రమేణ మా ఉస్తాద్‌జీకి త్రాగుడు ఎక్కువైపోయినకారణంగా అకారణంగా కూడా పిల్లల్ని క్రూరంగా హింసించ సాగాడు. మా అందరికీ ఆయన మీద ఇదివరలో నున్న ఆదరాభిమానాలు కోప ద్వేషాలుగా మారజొచ్చాయి. అప్పుడు నేను ఉర్దూలో చౌథీ అనబడే నాలుగో తరగతి వాచకం చదువుతున్నాను. గద్యపద్య సమ్మేళనంతో ఆ వాచకం చాలా మనోజ్ఞంగా వుండేది. అంతటితో ఉర్దూకు నీళ్ళు వదలి మళ్ళీ ఊళ్ళోని మామూలు బడిలోనే ప్రవేశించాను. నాతోసహా చాలామంది వచ్చి దానిలో ప్రవేశించారు.

## క్రొత్త హెడ్మాస్టరుగారు

క్రొత్త హెడ్మాస్టరుగారు బాగా ఇంగ్లీషు చదువుకొన్నవారని పేరు. ఆయన పేరు కొండూరు సుబ్బారావుగారు. ఆయన చాలా ఉల్లాసమూ, ఉత్సాహముగల వ్యక్తి. విద్యార్థులకు విలువ ఇచ్చి విద్యార్థులనుంచి విలువపొందే ఉపాయం తెలుసు ఆయనకు. పతనావస్థలో వున్న బడికి ఆయన తిరిగి నవజీవనం పోశాడు. క్రొత్త క్రొత్తరకాల ఆటలను ప్రవేశపెట్టి క్రొత్త ఆకర్షణను సృష్టించాడు. మాకు కొందరికి బడిలో మాత్రమే కాక తన ఇంటివద్ద రాత్రిపూట కూడా ఇంగ్లీషు చెబుతూండేవాడు. ఎంతో సరదాగవుండేది ఆయనతో వుండడం. అయితే ఒక్కో మనిషికి ఒక్కో తెగులు. ఆయన, ఆయన భార్యా ఎంతో ప్రేమతో జీవిస్తున్నట్టు కనుపించేవాళ్ళు ఎప్పుడూ మాట్లాడుకుంటూనే చివరకది పోట్లాటలోకి ముదిరేది.

పోట్లాటలోని మాటలు మనకు చేతలలోకి పరిణమించేవి. ఆయన చేతికి ఏది దొరికితే దానితోనే భార్య మీద విజృంభించి ఆమెను బాదమోదేవాడు. ఎప్పుడయినా ఆయనకు కోపం వచ్చినప్పుడు ఆయన చేతికి కత్తికాని, కొడవలికాని దొరకుతుందేమోనని మేము భయపడేవాళ్ళం. ఆయన ఆమెను కొడుతున్న సమయాన మేము గజగజలాడిపోయేవాళ్ళం. సరే, మిగతా వ్యవహారాలెలా వున్నా మాకు చదువు మాత్రం బ్రహ్మాండంగా చెప్పేవాడు.

ఇంగ్లీషులోనే ప్రశ్నలడిగి ఇంగ్లీషులోనే సమాధానం చెప్పించేవాడు. ఆ విధంగా ఇంగ్లీషు వాక్యాన్ని కూర్చుకొని సమాధానాలు చెప్పడంలో నాకేదో ఆకర్షణతో కూడుకొన్న ఆనందం తట్టేది. క్రియాపదాన్ని మూడు కాలాల్లోకి మార్చి చూపడంలో నాకు ప్రత్యేకానందం తట్టేది. ఇది కనిపెట్టి హెడ్‌మాస్టర్‌గారు అనేవారు, "నీవు త్రికాలజ్ఞుడి వోయి" అని. ఆ బడిలో అయిదవ తరగతి వరకే వుంది. నన్ను అయిదవ తరగతిలోనే చేర్చుకొన్నారు. ఇంగ్లీషు మీదవున్న అభిలాష, అధికారమూ లెక్కల మీద వుండేదికాదు. అందువల్ల లెక్కలంటే భయంగా వుండేవి.

ఉర్దూ బడిలో వుండగా ఇంగ్లీషు ఆగిపోయిందే అనే వేదన బాధిస్తూండేది. ఇప్పుడు ఇంగ్లీషు బడిలోకి వచ్చిన పిమ్మట బాగా చదువుకొన్న ఉర్దూ వెనకడుగు వేసిందే అనే వేదన పీడించసాగింది. ఉర్దూ బడిలో వుంటూ ఇంగ్లీషును మరచిపోకుండా ఇంటిదగ్గర వెనుకటి పాఠాలను తిరగేస్తూండేవాడినేకాని ఇంగ్లీషు బడిలో వుంటూ ఉర్దూ పుస్తకాలను ముట్టుకోడానికి తగిన తీరిక లేకుండాపోయింది. అందువల్ల వచ్చిన ఉర్దూను తిరిగి మరిచిపోసాగాను. ఇంగ్లీషు చదవడం, ఇంగ్లీషులో చిన్న వాక్యాలు అల్లడంలోనే నిరంతర నిమగ్నత.

# కూచిపూడి భాగవతులు — నా సంగీత సాధన

చదువుకోవడంలో ఇష్టం తప్పలేదు కాని ఎందుకనో బడికి పోవడంలో కొంత అయిష్టం కలగడం ప్రారంభించింది. బడికి వెళ్ళాలంటే ఏదో బరువుగా వుండేది. ప్రత్యేకించి కూచిపూడి భాగవతులు నందిగామలో జరుగు ముక్కోటి ఉత్సవాలకి వచ్చి అక్కడనుంచి కోనాయపాలెం వచ్చి మకాం పెట్టినపుడు వారిని వదలి బడికి వెళ్ళాలంటే విపరీతమైన బాధగా తట్టేది. అప్పుడు మంచి పేరులో

వున్న వెంపటి వేంకట నారాయణగారి ముఠా అది. వారి ముఠా ఆ ఊరిలోనున్న పక్షం రోజులూ వారిలో మృదంగం వాయించే మార్దంగికునికి భోజనం మా ఇంటనే. మేళంలోని వారందరితోనూ బాగా పరిచయం ఏర్పడింది గాని ఆ మార్దంగికునితో ఎక్కువ స్నేహం. రాత్రులలో నాటక ప్రదర్శన సమయాన నేను ప్రేక్షకులలో కూర్చొనేవాణ్ణికాను. స్టేజీమీదనే మృదంగం ప్రక్కన కూర్చొనేవాణ్ణి. మిగతా పిల్లలంతా నన్ను అసూయతో చూసేవాళ్ళు. మృదంగానికి శ్రుతిపెడుతూ సుత్తితో వారులమీద కొడుతూ వేళ్ళతో సాటూ మీటూ వేస్తుంటే తన్మయత్వం జనించేది.

వెంపటి వేంకటనారాయణగారు భామా కలాపంలో భామ వేషం వేసేవారు. అప్పటికే ఆయన చాలా వృద్ధుడు. పళ్ళూడి, చొట్ట బుగ్గలుపడి వుండేవి. అయితే, వేషంమీద చూచినప్పుడుమాత్రం ముసలితనం కనుపించేదికాదు, ఆ బుగ్గనా, ఈ బుగ్గనా తాంబూలం నింపి చొట్టలు పూడ్చేవారు వేషంలో వుండగా అవి ప్రతీతి. మృదంగమూ, వైలినూ, గుంటతాళాలూ సమ్మేళనమై అనుమేళనతో మ్రోగుతూంటే అదో రసజగత్తుగా అనుభూతి కలిగేది. వేంకటనారాయణగారు భామవేషంలోవచ్చి బంగారు జడను తెరవెలుపలికి వేసి ఎంతోసేపు తమ పాండితిని ప్రదర్శించేవారు. జడకథ తెలిసిన సమర్థులెవరైనా ప్రేక్షకులలోవుంటే రంగంమీదకుపోయి ఆ జడ పట్టుకొని జడకథ చెప్పమని భామ వేషధారిని అడగవచ్చు. ఆ వేషధారికి ఆ జడకథ రానిపక్షాన ఈ ప్రేక్షకుడు ఆ బంగారు జడను కోసి తెచ్చుకోవచ్చు. అయితే, ఆ జడకథను తాను చెప్పగలిగుండాలి. జడకథ చెప్పడం అంటే వట్టి కథ చెప్పడంకాదు. భరతశాస్త్రాన్నింతా ప్రదర్శించడమే అవుతుంది. ఆ తరుణంలో ఇక నాటక ప్రదర్శనానికి బదులు శాస్త్రప్రదర్శనం మాత్రమే జరుగుతుంది. శాస్త్రమూ, కళా సమన్వయరూపంలో నడవడంలో కొంత సౌకర్యమూ, కొంత అసౌకర్యమూ కూడ వుంటూంటుంది.

కూచిపూడి భాగవతులు ఆ ఊరులోవున్న పక్షంరోజులలో ఆ ఊరులో నాలుగు నాటకాలు మాత్రమే ప్రదర్శించారు. ఉషాపరిణయం, భామాకలాపం, ప్రహ్లాద, హరిశ్చంద్ర. వీటి నాలుగింటిలో ఉషాపరిణయం నన్నెక్కువ ఆనందపరచింది. అది బహుశా నృత్య ప్రదర్శనమే ప్రధానంగా కలది కావడమే కారణమేమో; ఉషాపరిణయం ప్రధానంగా నృత్యనాటకం.

పక్షంరోజులు కూచిపూడివారితో ఆనందంలో గడచిపోయినాయి. అది నాకు తొమ్మిదవ సంవత్సరం. కూచిపూడివారు వెళ్ళియిననాటినుంచి జీవితంలో ఏదో

శూన్యాన్ని అనుభూతి చెందసాగాను. ఏదో ఆనందలహరి ఆగిపోయినట్టూ, ఏదో రసవాహిని ఎండిపోయినట్టూ, ఏదో సజీవగతి నిర్జీవస్థితిలోకి దిగజారినట్టూ తట్ట సాగింది. తూచిపూడివారున్నప్పటి నుంచి బడికిపోవడం తగ్గిపోయింది. తల్లిలేని బాలుని కనుక ఇంటి పెద్దలు కూడా నేను బడికి సరిగాపోనందుకు నన్నేమీ మంద లించేవారు కారు. మా అమ్మమ్మ కూడా నా ఇష్టాన్నే అనుసరించి నేను బడికి పోయిననాడూ సంతసించేది, పోనినాడూ సంతసించేది. బడి మానుకోడం ఎక్కువ అలవాటయి ఇక బడికి పోవాలనే రోజున ఎంతో భారంగా వుండేది. బడికిపోయే బాధకంటె జ్వరంవచ్చి పడుకుంటే కలిగే బాధయే తక్కువగా కనుపించేది.

ఒక సుముహూర్తాన జ్వరం రానే వచ్చింది నిజంగా. వళ్ళువిరుపులు. ఆవలింతలు, తలనొప్పి, తీవ్రమైనజ్వరం, మూసిన కన్ను తెరవకుండా పడు కున్నాను, అమ్మా అమ్మా అని మూలుగుతూ. కళ్ళు మూసుకొని పడుకొంటే, కళ్ళముందు ఏవో మేఘాలలాగా తిరగసాగాయి. ఏమేమో కలవరింతలు, మూలు గులు మొదలైనవాటితో ఇంటిలోనివారంతా ఆందోళనపడసాగారు. ఊరులోని వైద్యులు వచ్చి వాతపైత్యజ్వరం అనిచెప్పి, అల్లపు రసంలో ఏవో మందులు అరగదీసి త్రాగించారు. తెల్లవార్లూ నిద్రలేదు. అమ్మమ్మా, పెదతల్లులూ, కోట్లో బాబూ నా వద్దనే కూర్చున్నారు. మొదట అమ్మ మరణించింది. తరువాత చెల్లి మరణించింది. పోయినవాళ్ళుపోగా వున్నవాడు బాగున్నాడుగదా అనుకొంటే బ్రహ్మాండమైన జ్వరం. అందరికీ భయసందేహాలు తట్టసాగాయి. ఏదోవిధంగా తెల్లవారింది. రాత్రి వున్నంతగా జ్వరం లేదనుకున్నారు. ఉదయాన నాకు నిద్ర పట్టింది. కొంచెంసేపుకు మెలకువ వచ్చిన తరువాత చేదుగా వాంతి అయింది. పచ్చని పసరు వెళ్ళిపోయింది. ఆ వాంతి అయిన తరువాత కొంతతేలికగా వున్నట్టునిపించింది. ఇంట్లో పెద్దలకు ధైర్యం వచ్చింది.

## ఆయుర్వేద వైద్యం

ఆ పగలంతా అన్నం లేదు. బార్లు ఇచ్చినట్టు గుర్తు. ఆ రోజుల్లో అలోపతి డాక్టరెవరూ, ఆ పూరులో లేరు. ఆయుర్వేద వైద్యులు మాత్రమే వుండేవారు. పగలంతా ఎక్కువ బాధ లేకుండా బాగానే వుంది. కాని సాయంత్రంనుంచి మళ్ళీ

పెళ్ళుమని జ్వరం వచ్చింది. మళ్ళీ తలనొప్పి, పొట్టలో వికారం, ఏదో తెలియని తపన. ఇక ఆ రోజు మొదలు దాదాపు రెండు మాసాల వరకూ మంచం దిగలేదు. ఊళ్ళో వైద్యులే మందులు వాడుతున్నారు. నన్ను మామయ్య గారింటి నుంచి కోట్లోకి మార్చారు. వచ్చేవారు, పోయేవారు ఎప్పుడూ ఎడతెగకుండా వుండేవారు.

ఒకరాత్రి జ్వరం తగ్గేవుంది. కంటికెవరో కనిపించినట్టు అనిపించి "అమ్మ అమ్మ" అని కేకవేసి కళ్ళుమూశాను. చాలాసేపటివరకూ సహజ చేతనరాలేదు. ఆ రోజునుంచి చీకటిలోకి ఒక్కడినే పోవడానికి భయం వేసేది. క్రమేణ ఆ భయాన్ని తొలగించుకొన్నాను. తుమ్మపూడి నుంచి మా పెదతండ్రి భార్య, పెద తండ్రి కుమారుడు సంజీవరాయణగారూ వచ్చారు. ఆయనకు ఆయుర్వేదంలోనూ, అల్లోపతిలోనూ, ప్రత్యేకించి హోమియోపతిలోనూ మంచి అనుభవంవుంది. అక్కడివైద్యం మానేయించి తాను చికిత్స ప్రారంభించి నన్ను ఆరోగ్యవంతుణ్ణి చేశాడు అనతికాలంలో.

రోగశయ్యమీద పడుకొంటే నా కెదురుగా వున్న గోడమీద ఉదయం మొదలు పది గంటలవరకూ ఇంటి పెంకుల సందునుంచి వచ్చే ఎండపొడ కోడి గ్రుడ్డు ఆకారంలో మీదినుంచి క్రిందకు సాగిపోయేది. ఆ ప్రాకే ఎండ పొడను చూస్తూ పడుకొనేవాడిని. బయట మేఘం అడ్డంవచ్చి ఎప్పుడైనా ఎండపొడ మధ్యలో కనుపించకపోతే మనసుకు ఏదో లోటువచ్చి బాధ అనిపించేది. మళ్ళీ జ్వరం వచ్చినట్టు అనుభూతి చెందేవాణ్ణి. కాని మళ్ళీ గోడమీద ఆ ఎండపొడ కనుపించగానే ఉల్లాసం వచ్చేది. జ్వరం పోయినట్టుండేది. పదిగంటల వేళలో అది అదృశ్యమైపోయేది. కాని, అప్పుడు మాత్రం ఏమీ కష్టం అనిపించేది కాదు.

## సంగీత సాధన

మా పెదతల్లి కూతురు కమలాంబ అని నా కంటె పెద్ద వయసు గల అక్క వుండేది. ఆమెకింకా అప్పటికి వివాహం కాలేదు. ఆ గ్రామంలోని బాలికా పాఠశాలలో చదివి ఇంటివద్దనే వుంటూంది. బాలికా పాఠశాలలో సంగీత ఉపాధ్యాయుడు కూడా వుండేవాడు. ఆ రోజుల్లో పెళ్ళి కావలసిన అమ్మాయిలకు హార్మోనియం నేర్పించడం అలవాటు. మా కమలాంబ అక్కకు కూడా బాలికా పాఠశాలలోని సంగీతం పంతులుగారు ఇంటికొచ్చి హార్మోనియం నేర్పేవాడు. ఆయన వైలిన్ కూడా వాయించేవాడు. నా మంచానికి దాపులోనే సంగీత పాఠాలు

సాగుతుండేవి. జబ్బునయమై, ఇంకా మంచంలోనుంచి లేచే స్థితికి రానందున మంచంలోనే పడుకొని సంగీతం పాఠాలు వింటూండేవాణ్ణి. స్వరాలు, జంటలు, స్వరజతులు, పిళ్ళారి గీతాలు అన్నీ వినీవిని నాకు కంఠస్థం అయినవి. మా అక్కయ్య తప్పులు పలికినప్పుడు నేను ఆ తప్పులను సవరించేవాడిని. నా జ్వరం రెండు మాసాలపాటు నన్ను బాధపెట్టినప్పటికి బోలెడు స్వరాలూ, సాహిత్యమూ కంఠస్థమైంది.

నా మంచం దగ్గర ఎవరూ లేనప్పుడు నేను మంచంలో పడుకొని పాడుకొనేవాణ్ణి. "వరవీణా మృదుపాణీ వనరుహ లోచన రాణీ" అని ఇంకా ఏమేమో పంతులుగారు తమ వైలిన్ వాయిస్తూంటే మా అక్కయ్య ఆయనను అనుసరించి హార్మోనియంమీద వాయించేది. జంత్రంమీద వాయిస్తూన్న పాట నాకిట్టే తెలిసిపోయేది. గాత్రానికంటె జంత్రం వాద్యమే ఎంతో శ్రావ్యంగా తట్టేది. వైలిన్ వాద్యం మరీ మధురంగా తట్టేది. పెద్దవాడనై వైలిన్ నేర్చుకోవాలని నిర్ణయించుకొన్నాను. చిన్నతనంలో నెరవేరని పనులు పెద్ద అయిన తరువాత నెరవేర్చుకోడంలో ఒక సంతృప్తి. అదే విధంగా పెద్దవాళ్ళు నెరవేర్చని పనులు తమ పిల్లలు నెరవేర్చగలరని నమ్మడంలో కూడా ఒక సంతృప్తి.

అక్కయ్య సంగీత పాఠాలకంటె నా అనారోగ్యమే ముందుగా ముగిసింది. ఆమె సంగీత పాఠాలు సాగుతూండగానే నేను లేచి తిరగసాగాను. ఆకలి - విపరీతమైన ఆకలి. ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు అన్నంతిందామా అనే ఆరాటమే. రోజుకు నాలుగైదుసార్లు చప్పిడి కూరంతోనే భోజనం చేసేవాణ్ని. చప్పిడి కూరలుకూడా తీవ్రమైన ఆకలిమూలంగా అమృతంలాగా తట్టేవి. క్రమేణా శరీరంలోకి తిరిగి క్రొత్త రక్తం ప్రవేశించ ప్రారంభించడంతో మనసులో క్రొత్త క్రొత్త స్థలాలను చూడాలనీ క్రొత్త క్రొత్త మాటలను వినాలనీ అభిలాషలు జనించసాగేవి. నాకు పథ్యం మూలముగా ఇంటిలో పిండివంటలే వండడం మానేశారు. అప్పుడప్పుడే మామిడిపండ్లు రాసాగినాయి. వాటిని తినాలనే ఆరాటం యెక్కువైంది. ఒకరోజు ఒక మామిడి పండు తినడంచూచి ఇంట్లో వాళ్ళంతా భయపెట్టారు, మళ్ళీ జ్వరం తిరగబెడుతుందని. భయమేసి తినడం మానేశాను. పచ్చిమామిడికాయ ముక్కలను ఉప్పుకారానికి అద్ది తినడంలో ఎంతో హాయి కనపించేది. కాని, తినడం మానవలసి వచ్చినందుకు బాధపడ్డాను.

అక్కడికి పదిమైళ్ళ దూరంలో కృష్ణాతీరాన పోపూరు అనే కుగ్రామం ఒకటుంది. అక్కడ వాసిరెడ్డి కోటయ్యగారనే భూస్వామి వుండేవారు. ఆయన మా పెదతల్లిగారి అల్లుడు. మా పెద్దక్కయ్య నన్ను కొన్నాళ్ళు తనవద్ద వుంచ మని కబురంపింది. మా కోట్లో బాబు నన్ను గుర్రంమీద తన ముందు కూర్చో బెట్టుకొని తెల్లవారుజామున పయనమై నెమ్మదిగ ఉదయం ఎనిమిది గంటలకల్లా అక్కడికి చేరుకున్నాం. దారిలో పశువులు మేసే బీళ్ళూ, వాగులూ, పొలాలూ, వాలుగు వృక్షాలూ మొదలైనవన్నీ తగులుతాయి. గుర్రంమీద పదిమైళ్ళ ప్రయాణం చేసే వరకు నడుములు నొప్పులు పేయసాగాయి. పోపూరులో బావా, అక్కయ్యా కూడా ఎంతో ఆదరం చూపారు. వారుభయులు కూడా అయిదు సంవత్సరాలనాడు మరణించిన అమ్మను జ్ఞాపకం చేసుకొని కన్నీళ్ళు పెట్టుకొని నన్ను బుజ్జగించారు. కోట్లోబాబు రెండు రోజులుండి తిరిగి కోనాయపాలెం వెళ్ళిపోయినారు. ఆయన గారి బూడిద రంగు గుర్రం మీద ఇక నేను అక్కా, బావల ఆదరణలో వుండి పోయాను. పోపూరులో ఆడపిల్లలూ, మొగపిల్లలూ నాకు చాలామంది స్నేహి తులు పోగైనారు. రోజూ ఉదయం, సాయంత్రం కూడా పిల్లలతో కలిసి కృష్ణ ఒడ్డుకు వెళ్ళేవాళ్ళం. అవతలి ఒడ్డు కనిపించనంతగా వెడల్పుగా వున్నది కృష్ణ అక్కడ. అంత ఎక్కువ నీరును చూడడం అదే మొదలు. మధ్యలో పెద్ద ఇసుక దిబ్బలు, దూరాన లోతుపాయల్లో పడవలు తెరచాప లెత్తుకొని సాగిపోతున్నాయి. ప్రవాహం పడమటినుంచి తూర్పుకు ప్రవహిస్తూంది.

## పడవ ప్రయాణం

కృష్ణలో ఒక రోజున పడవఎక్కి ఇసుకదిబ్బల కావలనున్న లంకకు వెళ్ళాం. లంకలో కొన్ని ఇళ్ళు, మనుషులూ, పొలాలూ, వ్యవసాయమూ వున్నాయి. చుట్టూ నీరు, మధ్య భూమి, ఆ లంకలో అటూ ఇటూ తిరుగుతుంటే ఎంతో ఆనందమైంది. దగ్గరలో మరో లంకకూడా కనుపిస్తూంది. కొన్ని లంక లలో పొలాలు మాత్రమే వుంటాయి. ఇళ్ళు, మనుషులు వుండరు. నిత్యం ఊరి లోని పశువులు ఈదుకొంటూ లంకకుపోయి మేతమేసి సాయంత్రానికి మళ్ళీ ఈదుకొంటూ ఇంటికి తిరిగి వస్తాయి. బోలెడంత గడ్డిమేస్తాయి పశువులు లంకలో. కాని ఏమి ఫలితం? రానూపోనూ ఈదే శ్రమకు సరిపోతుంది. అందుకే ఏటి ఈతకూ, లంక మేతకు సరిపోతుందనే సామెతవుంది. మరో సాయంత్రం

పోవూరు రేవులో నిల్చొని కృష్ణలోని సూర్యాస్తమయం చూచాను. అనంత దూరాన భూమి, ఆకాశమూ కలిసేచోట సూర్యుడ స్తమిస్తున్నాడు. ఆ అరుణ కాంతులు నదీజలాల్లో ప్రతిబింబిస్తున్నాయి. ఆ వైపున తెరచాప ఎత్తుకొని ఒక పడవ కనిపిస్తూంది. పుస్తకాలలో అటువంటి బొమ్మలు చూచిన గుర్తున్నది. వాస్తవరూపాన్ని బొమ్మతో పోల్చి ఆనందించడం సమంజసమో లేక బొమ్మను వాస్తవరూపంతో పోల్చి ఆనందించడం సమంజసమో నా కప్పుడు తెలియదు. నేను తెలుసుకొన్నదాన్నిబట్టి అయితే రెండూ సమంజసం కాదు.

మానవుడు కవితలాగా వుండేలా జీవించాలని ఒకచైనా తాత్వికుడు అన్నాడు. వస్తువు బొమ్మలాగా కనుపించాలట. కనుక ఆ నదీ తీరపు సూర్యాస్తమయం బొమ్మలాగానే గోచరించింది. దాన్ని ఆనందిస్తూన్న మానవుడనైన నేను ఆ కొంచెంసేపు కవితలాగానే జీవించాను. అంటే రసమయ ఘడియలలో పైన చెప్పిన చైనా తాత్వికుని వాక్కులు వాస్తవమైన కార్యరూపం దాల్చినాయి: మానవుడు కవితలాగా వుండేలా జీవించడానికి బదులు కవితయే మానవునిలాగా వుండేలా జీవించడం, వస్తువు బొమ్మలాగా వుండేలా కనుపించడానికి బదులు బొమ్మయే వస్తువువలెవుండేలా కనుపించడం జరిగితే కళాజగత్తు రసహీనమై పోతుందేమో తెలియదు. సరే, ఏది ఎటులైనప్పటికీ ఆ కృష్ణలోని సంధ్యా దృశ్యం అయిదు సంవత్సరాల వాడు అమ్మతో కలిసి తుమ్మపూడి నుంచి రైలు స్టేషన్‌కు వస్తూండగా చూచిన సంధ్యా దృశ్యం ఇచ్చినంత ఆనందం ఇచ్చింది.

# బాల్యంలో నాపై ఖద్దరు ప్రభావం

మా నల్లని ఆడకుక్కకు మా బూడిదరంగు ఆడగుర్రానికి ఎంతో స్నేహం. ఆ రెండూ నాకు స్నేహం. గుర్రం బీటినుంచి ఇంటికిరాగానే కుక్క దానితో ఎగురుతూ ఆడుతుండేది. నేనూ వెళ్ళి వాటి రెంటితో కలసి ఎగురుతూ ఆడేవాడిని. ఆ కుక్క చూచినట్లే ఆ గుర్రంకూడా నావైపు జాలిగా చూచేది. వాటిరెంటికీ పోలికవుంది. రెండూకూడా ప్రతి సంవత్సరం పిల్లల్ని కంటున్నాయి. కుక్క కంటూన్న పిల్లలమీద ఆదాఏమి రావడంలేదు. కాని గుర్రంకనే పిల్లలమీద ఒకవిధంగా కొంతఆదావచ్చేది. వాటి రెంటికీ ఉన్న పోలిక నాకు లేదు. అయితే ఇక నాకు పోలిక వాటి పిల్లలతో వుండేది; కారణం నా వలె అవీ పిల్లల్ని కనడంలేదు కనుక.

బూడిదరంగు గుర్రానికి కొంచెం పెద్దదైన ఒక మొగపిల్ల వుండేది. సకిలింపుతూ తల్లివెంట తిరుగుతూండేది. క్రమేణా అది సవారీకి అలవాటుపడింది. ఉదయాన్నే దాని ప్రక్కకాళ్ళకు బంధంవేసి వదిలితే పగలంతా బీటిలో మేసి సాయంత్రానికి ఇంటికి తిరిగివచ్చేది. ఒకోరోజు నేను ఊరు వెంబడే వున్న బీటికి వెళ్ళి కాలి బంధపుతాడు విప్పి నోటికి కళ్ళెంగా పెట్టి దాన్ని ఎక్కి ఇంటికి వచ్చేవాణ్ణి. ఒకోరోజు పరిగెత్తించేవాణ్ణి. ఒక సాయంత్రం ఎక్కి దాన్ని పరిగెత్తిస్తూ వస్తున్నాను. ఊరుకూ బీటికీ మధ్య ఒక వాగు ప్రవహిస్తూంటుంది. నా గుర్రం వాగు వద్దకు వచ్చేసరికి నా చేతిలో వున్న తంగేడు బెత్తంతో దాని పిర్ర మీద చరిచాను. అంతటితో అది అమాంతం ఎగిరి వాగు దూకింది. ఆ దూకుడులో నేను గుర్రం మీదనుంచి జారి వాగులో పడిపోయాను. వాగులోకొంత నీరున్నందు వల్లను, నీటి క్రింద ఇసుక వున్నందు వల్లను, నా కంతగా దెబ్బతగలలేదు. కాని గాబరాపడి కొంచెం సేపటివరకు లేవలేక పోయాను. గుర్రం మాత్రం చెవులు నిక్కించి తోక విసురుతూ వాగు వద్దన నిలిచే వుంది. నేను వాగులో నుంచి నెమ్మదిగా లేచి ఆ తడిసిన బట్టలతోనే మళ్ళీ గుర్రాన్ని ఎక్కి నెమ్మదిగా నడుపుకొంటూ ఇంటికి వచ్చాను. దారిలో కనుపించిన వాళ్ళంతా నవ్వసాగారు నా తడి బట్టలు చూచి. ఇంటిదగ్గర బాయిగారు చూచి ఇకముందు నీవు ఒక్కడివీ గుర్రం ఎక్కి రాబోకుమని సలహా ఇచ్చారు. ఆ రాత్రంతా కొంచెం శరీరం నొప్పులు చేసింది. కాని, నిద్ర బాగా పట్టింది.

# కలలో పతనం

నిద్రపోతూ త్రుళ్ళిపడి లేచాను. నిద్రలో గుర్రంమీదనుంచి క్రిందపడినట్టు కలవచ్చింది. సాయంత్రం నిజంగా గుర్రంమీదనుంచి పడినప్పుడు శరీరంలో అంతబాధ తట్టలేదుకాని ఇప్పుడు స్వప్నంలో గుర్రంమీదనుంచి పడేసరికి మాత్రం శరీరంలో బాగా బాధ తట్టసాగింది. సాయంత్రం పడడమే స్వప్నమేమో! ఇప్పుడు పడడమే నిజమేమో! సాయంత్రం గుర్రంమీదనుంచి పడినట్టు ఊరందరికీ తెలిసి పిల్లలూ పెద్దలూ కూడా చాలామంది పరామర్శించ వచ్చారు.

ఇది గాంధి యుగం. ప్రతి ఊరులోను గాంధీ టోపీలతో నాయకులు వచ్చి జనాన్ని సమకూర్చి బ్రహ్మాండమైన ఉపన్యాసా లిస్తుండేవాళ్ళు. ఖద్దరుబట్టలు కట్టడం ఆ రోజులలో ఒక గొప్పవనం. తెలుపు చేయని గోధుమరంగు కోరా ఖద్దరు కట్టడం ఇంకా ఎక్కువ దేశభక్తికి చిహ్నంగా వుండేది. మా బాబుగారు కూడా గొప్ప దేశభక్తుడుగా పరిగణింప బడేవారు. చిరుమామిళ్ళ వేంకటసుబ్బయ్యగారంటే నందిగామ తాలూకాలో కొంత ఖ్యాతి వుండేది. ఆయన కూడా తెలుపు చేయని కోరా ఖద్దరునే ధరించేవారు. ఇంటిలో అన్నీ కూడా ఖద్దరువే వుండాలని ఇంటిలో అందరూ ఖద్దరునే కట్టాలని ఆయన పట్టుదల కాకపోయినా అభిలాష. నాకుకూడా కోరా ఖద్దరు చొక్కాలు, లాగులు కుట్టించేవారు. మేము వాడే ఖద్దరు ఆ వూరులోని హరిజనులు నేసేవాళ్ళు. చాలా సన్నని ఖద్దరుకూడా నేసేవాళ్ళు. కోరాఖద్దరు దుస్తులకుతోడు నాకు తెలుపుచేసిన ఖద్దరు దుస్తులుకూడా వుండేవి. విశేషావసరాలలో ధరించేందుకు. బాబుగారు మాత్రం ఎల్లప్పుడూ కోరా ఖద్దరే ధరించేవారు.

అప్పుడప్పుడు, అంటే వర్షాకాలంలో తప్ప, నాయకులు గాంధీ టోపీలతో కారులో ఆ వూరు వచ్చి పోతుండేవారు. వర్షాకాలంలో అయితే కారులు ఆ దారిలో నడవవు. కారులే కాదు బళ్ళు కూడా నడవవు. సరుకులు గాడిదలమీదనే రవాణా. మనుషులు కాలినడకనే. ఖద్దరు ధరించిన నాయకులు కారులలో ప్రయాణం చేయడం చూచి మేము పిల్లలం అనుకొనేవాళ్ళం. తెల్లవాళ్ళ సీమలో తయారు చేసిన సీమగుడ్డను ధరించనివారు సీమలో తయారైన కారులను వాడుకోడం ఎంత వరకు దేశభక్తిలో జమ అవుతుందా అని.

ఊరులోకి కారు రావడమే ఆలస్యం, పెద్దలూ, పిన్నలూ అందరం కారు చుట్టూ మూగేవాళ్ళం. ఆనాటి కారులకు ఇప్పటి కారులకంటె పెద్ద ధ్వనివుండేది. హారన్ ప్రయోగించకపోయినా కూడా ఆ కారుల దడదడ శబ్దం ఊరంతా వినిపించేది. అందువల్ల ఎక్కడ ఎవరేమి పనిచేస్తున్నప్పటికీ ఆ పనిని అక్కడ వదలేసి కారు దగ్గరకు పరుగెత్తుకు వచ్చేవాళ్ళు. ఈ జనులంతా తమను చూడడానికే వచ్చారని భ్రమచెందేవారు ఆ కాంగ్రెసు నాయకులు. కాని, కారును చూడడానికే వాళ్ళంతా వచ్చారని వారికి తెలియదు పాపం. ఇక మా పిల్లల దృష్టిలో ఆ కారును మేము ముట్టుకోవడమే గొప్ప ఆనందం. ఇక దాన్ని ఎక్కగలిగితే బ్రహ్మానందమే. ప్రాణంలేని కారుకు ప్రాణంపోసి నడపగలిగిన ఆ డ్రైవరెంత ధన్యుడో అని, మన జీవితాల్లో మనం కూడా డ్రైవర్లం కాగలిగితే ఎంత అదృష్టమో అని ఊహాగానం చేయసాగేవాళ్ళు.

ఒక సాయంత్రం మేమిది వరకు చూచిన కార్లకంటె మంచికారు ఒకటొచ్చి బజారులో ఆగింది. దానిలో వున్న నాయకులలో ఇద్దరి పేర్లు మా అందరికీ కూడా పరిచయమే. ఒకరు ఆంధ్ర పత్రికకు, అమృతాంజనానికి అధిపతులైన కాశీనాధుని నాగేశ్వరరావుగారు, రెండవవారు నందిగామ నివాసులైన కాంగ్రెసు ప్రముఖులు అయ్యదేవర కాళేశ్వరరావుగారు. ఇద్దరూ కూడా కోరాఖద్దరు దుస్తులలో కాక తెల్లని ఖద్దరులో వున్నారు. వారుభయులు తెల్ల ఖద్దరులో వుండడం నాకేమి నచ్చలేదు. కారణం, కోరాఖద్దరు మాత్రమే దేశభక్తికి ఉత్తమ చిహ్నంగా భావిస్తూ వుండేవాణ్ని.

## "తులసి వనంలో"

ఎప్పటిలాగా పిల్లలమంతా కారుచుట్టూ మూగాము. కాని నాగేశ్వరరావుగారు ప్రతి పిల్లవాని చొక్కా పట్టుకొని చూచి వాళ్ళందరివీ సీమ బట్టలు కనుక తమ కారు అంటవద్దని శాసించారు. నా చొక్కా మాంచి కోరాఖద్దరుతో తయారు. అందరు సీమబట్టల పిల్లలమధ్య నా ఒక్కడి ఖద్దరు చొక్కా చూసేసరికి నాగేశ్వరరావు, కాళేశ్వరరావుగార్లకు అమితానందం కలిగి, నన్ను ఎత్తి కార్లో కూర్చోబెట్టుకొన్నారు. ఇక నా గర్వానికీ క్రిందవున్న నా స్నేహితుల అవమానానికీ హద్దులు లేవు. కారులో కూర్చోబెట్టి ఎవరబ్బాయివని నన్ను అడిగేరు. అక్కడే వున్న మామిళ్ళ వేంకటసుబ్బయ్యగారు సమాధానం చెప్పారు: "మా మరదలు కుమారుడు, తల్లి చనిపోతే మాదగ్గరే పెరుగుతున్నాడు. తండ్రిగారిది తెనాలి తాలూకా

తమ్మపూడి" అని. అంతటితో కాదురోని నాయకులన్నారు, "అలా చెప్పండి. ఇంకేమి? తులసివనంలో గంజాయిమొక్క పుడుతుందా? అని వారన్న సామెతను తలకిందుగా జ్ఞాపకం వుంచుకొని తరువాత అందరితోను అంటుండేవాడిని, "నన్ను మహానాయకులు గంజాయివనంలో తులసిమొక్క పుడుతుందా అని అన్నారు" అని. తరువాత తెలుసుకున్నాను ఆ సామెత అలా కాదు. "తులసివనంలో గంజాయిమొక్క పుడుతుందా" అని మాత్రమని.

ఆ రోజు వారిచ్చిన యోగ్యతాపత్రంతో నాలో ఏదో విశిష్టత ప్రవేశించిందని నమ్మసాగి తోటి పిల్లలకంటె నేనేదో అధికుణ్ని అనే భావం తొంగిచూడ ప్రారంభించింది. దానితో ప్రతివాళ్ళను, తోటి పిల్లలనేకాక అప్పుడప్పుడు పెద్దల్ని కూడా, నీకేం తెలుసుపో అనడం కూడా జరగసాగింది.

నాకు రెండు మాసాలక్రితం జ్వరం వచ్చినప్పటిమంచీ బడికి వెళ్ళడమే మానివేశాను. ఇంటిదగ్గర కూడా అంత శ్రద్ధగా పాఠ పుస్తకాలను చదవడంలేదు. కష్టపడి నేర్చుకొన్న ఉర్దూ, ఇంగ్లీషు కూడా నేర్చుకొన్నదానికంటే మరచిపోవడమే ఎక్కువగా జరగసాగింది. ఈ సత్యం మనసులో బాధిస్తూనే వుండేది. కాని అలవాటు తప్పిపోవడంతో మళ్ళీ పుస్తకాన్ని పట్టుకోడం అంటే భయంవేయసాగింది. కన్‌ఫూషియస్ కాబోలు అన్నాడు. మన నిజమైన గొప్పదనం ఎప్పుడూ పతనం కాకుండా వుండటంలో కాక పతనమైనప్పుడల్లా తిరిగి లేవడంలోనే వుందని. ఈ విషయం ఆ రోజులలో తెలియదు. విద్యాభ్యాసంలో పతనం జరిగింది అనే నిరుత్సాహం తప్ప ఆ పతనంనుంచి తిరిగి లేవాలనే ఉత్సాహం లేకుండా పోయింది. అయితే కన్‌ఫూషియస్ చెప్పిన స్వర్ణవాక్కులతో పరిచయంలేకుండానే ఆ పతనంనుంచి తిరిగి లేవాలనే ప్రయత్నం నేను చేయకపోలేదు. కాని దానినుంచి లేవాలనే ప్రయత్నం ఎంతో బాధగానూ, ఆ పతనంలోనే కదలకుండా పడివుండడం ఎంతో హాయిగాను తట్టేది.

చివరకు ఆ తాత్కాలిక పతనానికే అపజయం కలిగింది. దానినుంచి నేను బలవంతంగా లేవనే లేచాను. మళ్ళీ ఇంటివద్దనే ఉర్దూ పుస్తకాలను, ఇంగ్లీషు పాఠాలను చదవసాగాను. అంతేగాకుండా హెడ్‌మాష్టర్‌గారింటికి వెళ్ళి ఇంగ్లీషు చెప్పించుకోసాగాను. ఈ పునరుద్ధానంతో మళ్ళీ నాలో ఉత్సాహకుసుమాలు పుష్పించసాగాయి. నవజీవనం స్పందించసాగింది; దిగంత కాంతులలో నూతన కిరణాలు గోచరించసాగాయి.

ఏమ్యూరీడర్ మొదటి వాచకం అయిపోయింది; ఇక దాని రెండవవాచకం చదవాలి. నందిగామలో అప్పుడు పుస్తకాలు దొరికేవి కాదు. హెడ్‌మాష్టర్‌గారు ఏదో పనిమీద బెజవాడ వెళ్ళి యేమ్యూరీడర్ రెండో వాచకం తెచ్చిపెట్టారు. అందమైన పుస్తకం, ఆనందమైన బొమ్మలున్నాయి. రంగుల బొమ్మలు కూడా వున్నాయి. అన్నిటికంటె మించి ఆ పుస్తకం ఇచ్చే సువాసన ఇప్పటికీ జ్ఞాపకమే. కొత్త పుస్తకాలకో ప్రత్యేకవాసన ఉంటుంది. కొన్ని పుస్తకాల వాసనలు బాగుంటాయి. కొన్నిటివి బాగుండవు. కాని, ఆ యేమ్యూరీడర్ రెండో వాచకం వాసన ఎంతో ఆకర్షణీయంగా వుండేది. దాన్ని తెరచి వాసన చూస్తుంటే అలవాటులేని, ఇదివరకెన్నడూ చూడని ఏదో క్రొత్త ప్రదేశాలలో సంచరిస్తున్నట్లనిపించేది. అది పూలలాంటి సువాసనకాదు, అదొక విధమైన ఏదో వాసన.

రూపాన్నీ, నాదాన్నీ గుర్తించుకొన్నంత సులభంకాదు వాసనను గుర్తించుకోడం. అయినా, ఆ పుస్తకం నేటికీ నాకు గుర్తేవుంది. కొన్ని వాసనలు కొన్ని జ్ఞాపకాలను సృష్టిస్తాయి, జ్ఞాపకాలు మాత్రం వాసనను సృష్టించడం కష్టం. ఒక వాసన వచ్చినప్పుడు ఆ వాసనతో సంబద్ధమైన జ్ఞాపకంవచ్చి ఆ సంఘటన గుర్తుకు రావడం సహజం. కాని ఒక సంఘటన జ్ఞాపకం వచ్చినపుడు ఆ సంఘటనతో సంబద్ధమైన వాసన తట్టడం సులభం కాదు. సంఘటన కంటె వాసన సూక్ష్మమైనది. వాసనకంటె సంఘటన స్థూలమైనది. స్థూలమైంది ముందు తట్టినపుడు అంటే ప్రత్యక్షమైనప్పుడు దాన్నిబట్టి సూక్ష్మమైంది తట్టడం సులభం కాదు. కారణం స్థూలమైంది. ప్రత్యక్షంగా ఎదుట లేకపోయినా కూడా దాన్ని గుర్తుచేసుకోవడం సులభం. అయితే సూక్ష్మమైంది మాత్రం ప్రత్యక్షంగా ఎదుట గోచరిస్తేనే తప్ప మనసుకు తట్టదు. అందుకనే సూక్ష్మంకనుపించినపుడు దానిద్వారా స్థూలాన్ని జ్ఞాపకం చేసుకోవడం సులభంకాని స్థూలం కనుపించినపుడు దానిద్వారా సూక్ష్మాన్ని జ్ఞాపకం చేసుకోవడం కష్టం.

వాసన తట్టినపుడు ఘటన త్వరలో జ్ఞాపకం వస్తుంది కాని ఘటన తట్టినపుడు వాసన జ్ఞాపకంరావడం అంత సులభంకాదు. సరే, నాలో మాత్రం ఈ సూత్రాలకు విరుద్ధంగా ఇప్పటికీ ఆ పుస్తకం వాసన దానంత అదే తడుతుంది. అది తట్టినపుడు ఆ వాసనకు సంబంధించిన పుస్తకమూ, పుస్తకానికి సంబంధించిన చదువూ, చదువుకు సంబంధించిన ఘటనలూ జ్ఞాపకం వస్తుంటాయి.

# ఏకాంతంలో లోకాంతాలు

ఋతువులు గిరగిర తిరిగి పోతున్నాయి. వసంతంపోయి గ్రీష్మం, గ్రీష్మంపోయి వర్షం, వర్షంపోయి శరత్, శరత్‌పోయి హేమంతం, హేమంతం పోయి శిశిరం, శిశిరంపోయి తిరిగి వసంతం. ఋతువుకు ఋతువుకు వుండే మార్పును గుర్తించడం మొదట్లో అసంభవంగా తట్టసాగింది. ఎండాకాలం, వర్షాకాలం, చలికాలం అనే మూడుకాలాల భేదం మాత్రమే స్పష్టంగా తెలిసేది. కాని మూడుకాలాలలో ఇమిడివున్న ఆరు ఋతువుల భేదం గుర్తించడం అంత సుగమంగా లేదు. అయినా, వాటి భేదాన్ని నేను తెలుసుకొనేదాకా ఆగివుండక అవి ఒకదానివెంట ఒకటి గడిచిపోతూనే వున్నాయి.

వీలున్నపుడల్లా నాకు ప్రకృతితో స్నేహం ఎక్కువ కాజొచ్చింది. అవకాశం చిక్కినపుడల్లా ఊరిబయట చెరువుకట్టకో, వాగువద్దకో వెళ్ళి ఏకాంతసేవ చేయడంలో ఆనందం కలిగేది. ఆ ఏకాంతంలో కూర్చుని ఆకాశాన్ని, ఆ ఆకాశంలో తేలిపోయే వివిధాకారాల మేఘాల్ని, ఇసుకలో గుండా ప్రవహిస్తున్న వాగు నీటిని. చెట్లులేని మైదానము మీదుగా అగుపించే అనంత దిగంతాలను, ముబ్బా వున్న గడ్డి దుబ్బులనూ, పొదలనూ, ఆకురాలిన చెట్లనూ, వానకోసినందున వేళ్ళు బయటపడిన మొదళ్ళనూ, దూరంగా గోచరించే నీలికొండలనూ, నేలమీద నడిచే జంతువులనూ, ఆకాశంలో ఎగిరే పక్షులనూ పరిశీలిస్తూ కూర్చునేవాణ్ణి ఈ ప్రకృతి పరిశీలనతో కొన్నాళ్ళకు ఋతువుల భేదాలు అర్థమవసాగాయి. ప్రకృతిలో నానుంచి ఇంతవరకూ దాగున్న వాతావరణపు మార్పులు క్రమేణ వాటి నగ్న స్వరూపాల్లో ప్రత్యక్షం కాజొచ్చినాయి. మూడు కాలాల్లోని ఆరు ఋతువులూ తమ తమ నిజ స్వరూపాలను నా కళ్ళముందు ప్రదర్శించ సాగినాయి. ఒకో ఋతువులోని మధుర స్పర్శ మానసాన్ని మందారంలాగా పుష్పింప చేసేది. ఏకాంతవాసం ప్రకృతి పరిశీలనకేకాక చదువుకోడానికి, చదివినదాన్ని గురించి ఆలోచించడానికి, ఆలోచించినదాన్ని జ్ఞాపకం వుంచుకోడానికి పనికివచ్చేది. ఏకాంతసేవ ఎల్లప్పుడూ పనికిరాదు. కాని కొన్ని సమయాలలో అవసరం. మనిషి తనలోకి చూసుకోడానికీ బయటికి చూడడానికికూడ ఏకాంతం ఎంతో తోడ్పడుతుంది.

# ఏకాంతవాసం

ఈ ఏకాంతసేవలో ఒకోసారి ఆనందానికి బదులు విచారంకూడా కలిగేది. ఒకోసారి జననం, జీవనం, మరణం మొదలైనవాటిని గురించిన ఆలోచనలు వచ్చేవి. కొందరు ఇదివరలో లేనివాళ్ళు నూతనంగా జగత్తులోకి రావడంఅంటే జన్మించడం, కొందరు ఇదివరలో వున్నవాళ్ళు జగత్తునుంచి అదృశ్యం అయి పోవడం, అంటే మరణించడం. మరి కొందరు జన్మించడం మాత్రమే నేర్చు కొని మరణించడం చేతకాక జీవించి వుండడం మొదలైనవాటిని చూస్తుంటే ఒకోసారి ఏదో విరాశ తోచేది. - ఏదో శూన్యంగా అనిపించేది, అంతటితో ఆ ఏకాంతాన్ని వదలి స్నేహితుల దగరకు వచ్చేవాణ్ణి. వాళ్ళతో కలసి వాళ్ళ మాట లలో, వాళ్ళ పాటలలో, వాళ్ళ ఆటలలో నా కారణంలేని విచారాన్ని మరచిపోయే వాణ్ని.

ఒకోసారి ఏదో సుదూరంనుంచి ఏదో పిలుపు వినిపిస్తూన్నట్లు తట్టేది. ఆ దూరపు పిలుపు ననుసరించి ఆ దూరపు అజ్ఞాత ప్రదేశానికి పయనించాలనే ఆకాంక్ష జనించేది. ఒకోసారిసమీపమంతానీరసంగాను, సుదూరమంతారసవంతంగానుతట్టేది. అందుకే కాబోలు దూరపు కొండలు నునుపు అంటారేమో ! నేను ఏ దూర దేశా న్నుంచో, ఏ పర్వత ప్రాంతాలనుంచో, ఏ అరణ్య భూములనుంచో ఈ జనావాసా లలోకి వచ్చినట్టు అనుభూతిచెంది తిరిగి నా దూరదేశాలకు, నా పర్వత ప్రాంతా లకు, నా అరణ్యభూములకు నేను తిరిగిపోవాలని తహతహలాడే వాణ్ణి.

ఒకరాత్రి మా బాబుగారి దగ్గర కూర్చుని ఈ నా ఆలోచనలన్నీ ఆయనతో చెప్పివేశాను. ఆయన నాకు ధ్రువుడూ, ప్రహ్లాదుడూ కథలు చెప్పి నన్ను వాళ్ళతో పోల్చి అవి ఉత్తమమైన ఆలోచనలేకాని, వాటినిమళ్ళీ నీమనసులోకి రానివ్వకుండా మరచిపోవటం మంచిదని నాకు సలహాఇచ్చి బుజ్జగించాడు. తిరిగి నా ఆలోచనలకు యోగ్యతా పత్రం లభించింది.

క్రమేణ ఇటువంటి ఆలోచనలన్నీ భరించే శక్తి సన్నగిల్ల సాగింది. ఏకాంత జీవితంలో ప్రతిక్రియ ప్రారంభమైంది. ఒంటరిగా కూర్చోడంలోకంటె జనంలో కూర్చోడంలో ఆనందం కలుగసాగింది. కొందరు నా వయసువాళ్ళు

(పదకొండు సంవత్సరాలు), నా కంటె కొంచెంపెద్దవాళ్ళు, నాకంటె కొంచెం చిన్న వాళ్ళు నాకు స్నేహమయ్యారు.

రానురాను స్నేహితుల బంధన ఎంతవరకు వృద్ధి అయినదంటే వాళ్ళు నా ఎదుటవుంటేనే స్నానంచేయడం, ఎదటవుంటేనే భోజనంచేయడం, ఎదటవుంటేనే పాఠాలు చదవడం. ఈ స్నేహితులలో నా సమ వయస్కులైన ఇద్దరు అమ్మాయిలుండేవాళ్ళు. ఇందుమతి అని, దుర్గాంబ అని. వీళ్ళిద్దరూ స్నేహితులు మాత్రమే కాక బంధువులుకూడా. మేము ముగ్గురమూ ఎప్పుడూ కలసివుండే వాళ్ళం. ఇందుమతి నేడులేదు. వాళ్ళిద్దరివీ రెండురకాలస్వభావాలు. న్యాయానికివాళ్ళిద్దరివి వ్యతిరేక స్వభావాలు. వాళ్ళిద్దరే కనుక స్నేహంచేస్తే వాళ్ళస్వభావాలు కలియక ఏనాడో వాళ్ళిద్దరి మధ్య విరోధాలు వచ్చేవి. కాని అది ఇద్దరి స్నేహంకాక ముగ్గురి స్నేహం కనుక వాళ్ళ ఉభయుల వ్యతిరేక స్వభావాలలోని భేదాన్ని నాలో కలిగించి ఐక్యసూత్రంతో కట్టుబడి వుండేవాళ్ళు. అయితే ఈ అమ్మాయిలతో స్నేహం ఇంట్లో వరకే. ఇల్లుదాటితే మొగపిల్లల స్నేహమే".

బాలుర పాఠశాలలోకి పోవడం మానేసిన తరువాత కొన్నాళ్ళు బాలికా పాఠశాలలోకి పోవలసివచ్చింది. బాలికా పాఠశాల ఆరోజులలో అక్కడ మంచి అభివృద్ధిలో వుండి. దాని క్రొత్త హెడ్‌మాస్టర్‌గా చామర్తి నాగభూషణంగారనే మంచి ఉత్సాహం గల వ్యక్తి వుండేవాడు. క్రొత్తగా నా చదువు సంధ్యలభారాన్ని ఆయన వహించి, తనతోపాటు బాలికా పాఠశాలలో కూర్చోబెట్టి నాకు నవ్వులతో, పువ్వులతో, ఆటలతో, పాటలతో చదువు చెప్పినారు. ఆ విధంగా ఆ బడిలో చాలామంది అమ్మాయిలు స్నేహితురాండ్రయ్యారు. ఆడ పిల్లలతో స్నేహం పెంపుడు జంతువులతో స్నేహంలాంటిది. మగపిల్లలతో స్నేహం అడవిమృగాలతో స్నేహం లాంటిదనిపించేది. నేను ఆడపిల్లల మాట వినడంలో కంటె నా మాటే వాళ్ళు వినడంలో ఎక్కువ సంతోషించేవాళ్ళు. ఇక మొగపిల్లలు నామాట తాము వినడంలో కంటె తమ మాటే నేను వినడంలో ఎక్కువ ఉల్లాసం కనపరచేవాళ్ళు. నన్ను సంతోష పెట్టడంలో మొదటివాళ్ళు ఆనందిస్తే, నా వల్ల సంతోష పడడంలో రెండోవాళ్ళు ఆనందించేవాళ్ళు. నా కంటె చిన్న వయసు ఆడపిల్లలు కూడా నా కంటె తాము పెద్దవాళ్ళుగా, వాళ్ళకంటె నేను చిన్నవాణ్నిగా వున్నట్లు చూచేవాళ్ళయితే ఇక మొగపిల్లలు నాకంటె పెద్దవాళ్ళుకూడా తమకంటె నన్నే పెద్ద

వాడ్నిగా చూచేవాళ్ళు. సరే, ఉభయులకోటి స్నేహవల్లరి దట్టంగా పెనవేసుకోసాగింది. స్నేహితులు కనుపించని సమయం శూన్యాకాశంగా తట్టేది.

## “ తెల్ల మనుషులు ”

ఒక రోజు చింతలతోపులో రోమన్ క్యాథలిక్ మిషనరీలు వచ్చి డేరాలు వేశారు. పిల్లలమంతా డేరాలచుట్టూ మూగాం. డేరాలు చూడడము అదే మొదలు, డేరాలలో వున్న తెల్ల స్త్రీని చూడడమూ అదే మొదలు. తెల్లవాళ్ళు తెల్లవాళ్ళు అని పిలవడమే కాని, తెల్ల మనుషుల్ని అదివరకెప్పుడు చూడలేదు. అందువలన డేరాల వైచిత్ర్యాని కంటె డేరాలలోని వనితల వైచిత్ర్యమే ఎక్కువ కుతూహలంగా వుంది. సన్నని గొంతులు శ్రావ్యంగా వినిపించాయి. ఇతర్లతో తెలుగు కూడా మాట్లాడేవారు. కొందరు తెల్లగౌన్లలోనూ, కొందరు నల్లగౌన్లలోనూ వున్నారు. పనిచేసేవాళ్ళు తప్ప మొగవాళ్ళెవరూ లేరు. అయితే, ఇప్పటికి తెల్లని స్త్రీలను చూచినట్టే కాని తెల్లని పురుషుల్ని చూడలేను.

వారి దగ్గర రకరకాల సీసాలలో రంగు రంగుల మందులుకూడా వున్నాయి. ఆడవాళ్ళు, మొగవాళ్ళు పిల్లలూ వస్తున్నారు. ఆ తెల్ల వనితలు వచ్చినవారి శరీరాన్ని పరీక్ష చేస్తున్నారు. సీసాలలో మందులుపోసి ఇస్తున్నారు. నన్ను కూడా లోపలికి పిలిచారు. భయం భయంగా డేరాలోనికి వెళ్ళాను. ఒక తెల్ల వనిత నాకు జబ్బేమిటని అడిగింది. ఏ జబ్బూ లేదన్నాను. భుజంమీద చేయివేసి బుజ్జగించి రంగులలో వున్న ఒక చిన్న ఏసుక్రీస్తు బొమ్మగల కార్డును, ఇంకేదో క్రైస్తవ సాహిత్యంగల చిన్న పుస్తకాలనూ ఇచ్చింది. అవి తీసుకొని పరిగెత్తుకొంటూ బయటికి వచ్చాను. జీవితంలో మరొక యోగ్యతా పత్రం లభించింది—తెల్లవనిత స్పర్శ!

క్రీస్తు బొమ్మను చూస్తుంటే ఆయనముఖంలోని కరుణ, వేదన మొదలైనవి నన్నెంతో ఆకర్షించాయి. ఆయన్ను గురించిన చిన్న పుస్తకంచదివి ఆ బొమ్మలో ఆయన కరుణాగాథనంతా దర్శించసాగాను. ఆ పుస్తకం చదివితే క్రైస్తవ మతంలో చేరాలట, అని మా అమ్మమ్మ అన్నది. ఆ మాట నాకు నచ్చలేదు. ఆ పుస్తకాన్ని, బొమ్మనూ మళ్ళీ మళ్ళీ చూడ సాగాను. ఇతరుల సుఖం నిమిత్తం కష్టాలుపడ్డ కారుణ్యమూర్తి ఏసుక్రీస్తు. బుద్ధుని గురించి పాఠాలలో చదివి వున్నాను. బుద్ధ

డం చేకూడా ఎంతో అభిమానం ఏర్పడి వుంది. నేడు క్రీస్తు అంటేకూడ అభిమానం ఏర్పడింది. క్రీస్తుమీది అభిమానం బుద్ధునిమీది అభిమానాన్ని తగ్గించలేదు. ఒకరిమీద అభిమానం మరొకరిమీద అభిమానాన్ని తగ్గించకుండా వుంటే ఎందరి మీద అభిమానం వున్నా ప్రమాదం లేదు.

స్నేహితులం అందరం రోజూ కొంతసేపు ఆ మిషనరీ డేరాల దగ్గరకు వెళ్ళి వాళ్ళు చెప్పే మతబోధ వినేవాళ్ళం. అన్నీ మంచి మాటలుగానే, అన్నీ నిస్వార్థతతో నిండిన మాటలుగానే, అన్నీ లోక కళ్యాణానికి సంబంధించిన మాటలుగానే వినిపించేవి. అయితే ఊళ్ళో చాలా మంది పెద్దలకు మేమంతా ఆ డేరాల దగ్గరకు పోవడమూ, ఆ హితబోధలు లేక మతబోధలు వినడమూ అంత ఇష్టంగా వుండేదికాదు. అంతేకాదు, అసలు వాళ్ళు ఊళ్ళోకివచ్చి డేరాలు వేయడమే వారి కిష్టంలేదు. వీరందరి అయిష్టానికి కారణం మా కర్థమయింది. వారి మతంలో కూడిన హితబోధలు లేక హితంతో కూడిన మతబోధలు విని మేమంతా క్రైస్తవ మతంలో కలిసి పోతామేమో అని వారి భయం. కొద్ది రోజులుండి వాళ్ళు డేరాలు పీకి వెళ్ళిపోయారు.

ఇక మా మిత్ర మండలి హాజరుకావలసిన కార్యక్రమాలలో డేరాల దగ్గరకుపోయే కార్యక్రమం ఒకటి తగ్గిపోయింది. అయినా, అనేక కార్యక్రమాలుండేవి. మాకు తీరిక లేకుండా చేయడానికి, ఈ కార్యక్రమాలు తీరికలేకుండా చేయడమేకాక మాకు పని లేకుండాకూడా చేసేవి. కొందరు స్నేహితులు నాతోపాటు మన ఇంటవే నిద్రించేవాళ్ళు. ఉదయానే లేచి ఊళ్ళో మంచి వేప చెట్టు చూచి దానిని ఎక్కి చిటారు కొమ్మలకు పోయి వంపులేని సూటి అయిన బెత్తాంలాంటి వేపపుల్లలను విరిచేవాళ్ళం. దాదాపు ఒక అడుగూ అడుగున్నర పొడవైన వేపపుల్లలను నోట్లోవుంచుకొని చెరువువైపుకో, వాగువైపుకో పోయి కూర్చొనేవాళ్ళం. కనుపించని విష్ణుదేవుని దశావతారాలు మొదలు కనుపించే సృష్టిలోని దశదిశల వరకు మా సంభాషణలు సాగేవి ఈ లోపల నమలడం ఎక్కువయి అడుగున్నర వేపపుల్లలూ అరడుగుకంటె తగిపోయేవి. తెల్లవార్లూ వాచిన పళ్ళను తెల్లవారిన తరువాతకూడా ఇంక వానబెట్టడం వదిలుకొనదని అప్పుడు పళ్ళురుద్ది, అయిదారు పాల్లు వాలుకలు గీచి ముఖాలు కడిగి వంటిమీద చొక్కాతోటే ముఖాలు తుడుచుకొని ఊరు వైపుకు బయలుదేరేవాళ్ళం. అందులో కొందరు బడికి వెళ్ళే

వాళ్ళు. కొందరు వెళ్ళేవాళ్ళుకాదు. మేము కొందరం ఇంటివద్దనే పాఠాలు చదివి ఇంగ్లీషు వాచకంలోని తెలియని మాటలు వ్రాసుకొని బడి వదలిన పిమ్మట హెడ్ మాస్టర్ గారింటికి వెళ్ళి పాఠాలు చెప్పించుకొనేవాళ్ళం. ఆయన చాలా మంచి వాడు. మాతో నవ్వుతూ మాట్లాడుతూ మా కార్యక్రమాన్ని గురించి హాస్యంగా మాట్లాడేవాడు.

## ధూమపానం

ఎండాకాలం చివరి భాగంలో తెల్లవారుఝామునుంచి విపరీతమైన గాలి పడమటి నుంచి తూర్పుకు తోలుతూవుంటుంది. అది ఉదయం చల్లగావుండి ఎండ ముదిరినకొద్దీ గాలివేడెక్కుతూ వుంటుంది. జొన్నదంటుకు పైన వుండే వీనె బద్దలను చీల్చి వాటిని గుండ్రంగా వంచి జొన్న బెండుతో వాటిని అతికి చక్రాలు చేసేవాళ్ళం. ఉదయానే ఆ చక్రాలను నేలమీద వదిలితే ఆ పడమటి గాలికి అవి మహా వేగంగా పరుగెత్తేవి. వాటివెంట మేము పరిగెత్తేవాళ్ళం. ఆ బెండు చక్రాలు గాలికిదొర్లి పరిగెత్తడం ఎంతో మనోహరంగా వుండేది. బాగా ఎండ ముదిరేవరకు గాలిలో వాటితో పరిగెత్తి పరిగెత్తి విపరీతంగా దాహం వేసేది. ఆ ఖాళీ కడుపుతోనే విపరీతంగా మంచినీళ్ళు తాగేవాళ్ళం. పరగడుపున నీరు త్రాగితే పసరు అవుతుందని ఇంటిదగ్గర మందలించేవారు.

ఒక రోజు కొందరం బీడులోగుండా ప్రవహిస్తూ ఎండిపోయిన వాగులోకి వెళ్ళి కూర్చున్నాము. ఆ వాగు ఒడ్డున వున్న వృద్ధాప్యంతో బరువుగా వున్న తుమ్మ చెట్ల వేళ్ళు ఎండి వాగులో కనబడేవి. వాటి సన్నని వేళ్ళు విరచి వాటికి ఒక కొనకు నిప్పు అంటించి మరొక కొనను నోటిలో వుంచుకొని పొగ పీల్చసాగాము. ఆ తుమ్మవేళ్ళకు అటూ ఇటూ రంధ్రాలుంటాయి. పీల్చి పొగ వదలడం ఎంతో రమ్యంగా ఉండేది. ఆ రోజు మొదలు అప్పుడప్పుడు అక్కడకువచ్చి ఆ విధంగా చేయసాగాము. అయితే ఇటువంటి కార్యక్రమాల్లో ఆడపిల్లలు కలిసేవాళ్ళు కారు. ఇది అచ్చంగా మొగపిల్లల కార్యక్రమం మాత్రమే. ఇక అచ్చంగా ఆడపిల్లల కార్యక్రమాలు కొన్ని వుండేవి. వాటిల్లో మేమూ పాల్గొనేవాళ్ళం కాము. ఆడపిల్లలూ, మొగపిల్లలూ కలిపి కొన్ని కార్యక్రమాలుండేవి వాటిలో వాళ్ళూ, మేమూ కూడా పాల్గొనే వాళ్ళం.

# నా వేదాద్రి యాత్ర : కొన్ని వింతలు, విశేషాలు

కోవాయపాలెంకు కొంచెందూరంగా పడమటి భాగంలో అడవివుండేది. అందులో విలుసుచెట్లూ, జానచెట్లూ, కలేచెట్లూ, తునికిచెట్లూ, చంద్రచెట్లూ, మోదుగుచెట్లూ మొదలైన చెట్లుండేవి. తునికిపళ్ళూ, కలేపళ్ళూ, జానపళ్ళు కూడా తినడానికి రుచిగా వుంటాయి. మోదుగు ఆకులతో విస్తళ్ళు కుడతారు. ఆ అడవిలో పెద్దపులులు లేవుకాని చిరుతపులులు వున్నట్టు వాడుక. ఒకోరోజు రాత్రిపూట ఆ చిరుతపులులు కోవాయపాలెం ప్రవేశించి గాడిదలనో, కుక్కలనో చంపి తిని పోతూండేవి. ఉదయానే చెప్పుకొనేవాళ్ళు. రాత్రి చిరుతపులివచ్చి కుక్కనో, గాడిదనో లేక రెంటినో తినిపోయిందని. మేమంతా ఆచిరుతపులిని చూస్తే బాగుండునని ఊరిపోయే వాళ్ళం.

ఆ వూరుకు ఆంధ్రదేశ దివ్య క్షేత్రాంలో ఒకటైన వేదాద్రి ఆరుమైళ్ళు మాత్రమే వుంటుంది. అడవిలోగుండా, గుట్టలుమీదుగా కుంటలు దాటిపోవాలి వేదాద్రికి : మేమంతా ఒకరోజు ఎద్దులబండిమీద వేదాద్రి అనే నెపంతో అడవి చూడడానికి బయలుదేరాం. రోడ్డులేదు, సరికదా, డొంకదారికూడా లేదు. దారి నిండా రాళ్ళు, బండలూ. బండిలో కూర్చున్నవాళ్ళు ఆ దడదడలకు ఎగిరి పడుతున్నారు.

గ్రామంలో ఇళ్ళుంటాయి, మనుష్యులుంటారు, చెట్లుంటాయి. మరి అడవిలో ఇళ్ళుండవు, మనుషులుండరు, చెట్లుమాత్రమే వుంటాయి. ఎంతదూరం చూసినా చెట్లేచెట్లు. చిన్నచెట్లు, పెద్దచెట్లు, కుంటిచెట్లు, గూనిచెట్లు. విటూరైన చెట్లు, ఆకులున్నచెట్లు, ఆకులులేని చెట్లు, పూలున్నచెట్లు, పూలులేని చెట్లు, చచ్చిన చెట్లు. అయితే, అడవిలోకూడా అక్కడక్కడ ఇళ్ళూ, మనుషులూ వుండకపోరు. అటువంటప్పుడు, ఆ ప్రదేశాన్ని గ్రామమే అంటారుకాని అడవి అనరు. అయితే దాన్ని అడవివూరు అనవచ్చు.

లంబాడీలు పశువులను మేపుతూ అడవిలో అక్కడక్కడ కనబడసాగారు. కొంతదూరంలో కృష్ణానది గోచరిస్తూంది. సాయంసమయం కావస్తూంది. అది

వసంతఋతువు. మోదుగుచెట్లు చాలా కనిపించినాయి. ఆకులు రాలిపోయి మోదుగు చెట్లన్నీ ఎర్రటి పూలతో అరణ్యం మంటలతో మండిపోతున్నట్లు కనుపించ సాగాయి. అందుకే వీటిని ఇంగ్లీషులో "Flame of the forest" అంటారు. దీని శాస్త్రీయనామం " Butea Frondosa " అని. సంస్కృతంలో దీన్ని "కంశుకం" అనీ, "పలాశం" అనీ అంటారు. భారతీయ సాహిత్యంలో ఇది బాగా వ్యాప్తిచెంది వుంది. దీని పుష్పం ప్రజ్వలిస్తున్న అగ్నికణంలాగా ఎంతో రమ్యంగా వుంటుంది. కాని ఏమి లాభం ? దీనికి వాసనే వుండదు. రూపం బాగుండి గుణంలేని మనిషిని అందుకే మోదుగపువ్వుతో పోలుస్తారు. సంస్కృతంలో ఒక శ్లోకం వుంది.

"రూపయవ్వన సంపన్నా విశాలకుల సంభవాః
విద్యాహీన నశోభంతే నిర్గంధా ఇవకింశుకాః"

రూపమూ, యవ్వనము, కులీనతా, సంపదా ఇన్నీవుండి విద్యగనుక లేనిచో ఆ వ్యక్తులు మోదుగు పూలతో సమానమని.

మా దారికంటే క్రిందుగా మోదుగుచెట్లున్నాయి. వాటి జ్వలంత రక్త కుసుమాలమీదుగా కృష్ణానదిలోని నీలహరితపు నీటిపాయలు కనుపిస్తున్నాయి. మోదుగు పూలనుచూచి మండేకన్ను ఆవలకుచూస్తే కృష్ణాజలాల నీలహరితంతో చల్లబడుతుంది. అడవిని చూడడం, దగ్గరగా కొండలనూ, లోయలనూ చూడడంకూడా జీవితంలో అదే మొదలు. దూరాన్నుంచి కనుపించే నునుపూ, నీలమూకూడా దగ్గరగా చూచినప్పుడు కొండలలో కనుపించకపోవడంచూచి ఆశ్చర్యపోయాను. హిమాలయ పర్వతాలను గురించి, ఆ ప్రాంతపు మహారణ్యాలను గురించి పుస్తకాలలో చదవడం జరిగింది. మేము ఇప్పుడు చూస్తున్న కొండలు హిమాలయాలంత ఎత్తు కొండలు కావని, ఈ అరణ్యం హిమాలయ ప్రాంతపు మహారణ్యం లాంటి గొప్ప అరణ్యంకాదని తరువాత తెలుసుకొన్నాను.

మిత్రులం అందరం బండిదిగి నడవసాగాము. చదరమైన భూమినుంచి ఏటవాలుగా క్రమేణ ఎత్తుగా లేచిపోవున్న పర్వత సానువులను చూస్తుంటే ఏదో మధురానుభూతి కలిగేది. మేము వచ్చిచే దారికు ఒకవైపు ఎత్తు ప్రదేశం, మరోవైపు

లోతులు గోచరించాయి. ఆయా కొండగల ఎత్తు ప్రదేశాన్ని చూసే ఒక విధమైన ఆనందం కలిగేది. ఇటు లోయలను చూస్తుంటే మరొక విధమైన ఆనందం కలిగేది.

సంధ్యలోని రక్తారుణకాంతులు ముదిరి నలుపులోకిమారి చీకట్లు కమ్ముకొస్తున్న సమయానికి వేదాద్రి చేరుకొన్నాం. ఇదివరలో ఒక కోతిని రెండు కోతులను మాత్రమే చూశాం. కాని వేదాద్రిలో ఒకే పర్యాయం ఎన్నో కోతులను చూశాం. అన్ని కోతులను ఒకేసారి వాటి పిల్లలతోసహా చూడటం సంతోషాన్ని కలిగించింది. ఆ రాత్రికి దేవాలయంలోని పులిహోర తిని కృష్ణలోని నీరుత్రాగి పడుకొన్నాం తెల్లవారిన తరువాత లేచిచూస్తే వేదాద్రి చాలా రమ్యంగా కనిపించింది. దేవాలయం దగ్గరనుంచి కృష్ణలోకి చాలా లోతు దిగి వెళ్ళాలి. సోపానాలమీదుగా పైనుంచి కృష్ణలోకి క్రిందికి చూచినా, కృష్ణలోనుంచి దేవాలయంవైపుకు చూచినా ఈ రెండుచోట్లనుంచి ప్రక్కలకు చూచినా - ఎటుచూచినా ప్రదేశం రమ్యంగా కట్టిపాగింది.

## కోతుల జగత్తు

ఇక కోతుల జగత్తు ఒక ప్రత్యేకమైన వింతగా వుండేది. ఒక కొమ్మమీద నుంచి మరోకొమ్మకు, ఒక చెట్టుమీదనుంచి మరోచెట్టుమీదకు తమ పిల్లల్ని పొట్టలకు కరిపించుకొని దూకుతూండేవి. సందడిగా యాత్రికుల చేతుల్లో ఏమైనావుంటే వచ్చి బలవంతంగా లాక్కొని వెళ్ళి చెట్లు ఎక్కేవి. కనీసం ఒక కోతితోనైనా స్నేహం చేసుకోవాలని ప్రయత్నించాను. కాని అవి అంగీకరించలేదు. అప్పుడనిపించింది, ఈ కోతులకంటె ఇంటి దగ్గరున్న నల్లకుక్క, బూడిదరంగు గుర్రమూ చాలా మంచివని.

దేవాలయంలోకి వెళ్ళాను. కాని ఆ వెళ్ళడంలో ప్రధానోద్దేశం పులిహోర తినాలనేగాని దేవుని విగ్రహాన్ని చూడాలని కాదు. అప్పటికే దేవునిగురించి, దేవుని విగ్రహాలను గురించి కొన్ని భావాలు ఏర్పడినాయి. మా కోట్లోబాబు నాకొకసారి స్వామి దయానంద కథ చెబుతూ బాల్యంలో దయానంద చూస్తుండగనే శివాలయం లోని శివలింగంమీదుగా ఎలుకలు పరుగెత్తినట్లు, దాన్నిచూచిన దయానందకు విగ్రహారాధనమీద నమ్మకం పోయినట్లూ చెప్పారు. అప్పటినుంచి నాకుకూడా దేవా

లయాలమీద, దేవాలయాలలోని విగ్రహాలమీద అంతగా నమ్మకం వుండేది కాదు. అయితే దేవుడున్నాడని, దేవుడు సర్వాంతర్యామియని మాత్రం నమ్మేవాడిని. "ఇందుగలడందులేడని సందేహమువలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన నందందే గలడు" అనే ప్రహ్లాదు వాక్యాలతో ఏకీభవించేవాణ్ని. ప్రహ్లాదు డంటే ఎంతో అభిమానం. ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని పొగరణచాడని లేచి ఎగరొట్టి తిరిగేవాడు. అందుకే ఆయనంటే అంత అభిమానమేమో! ఈ విగ్రహారాధన విషయంలో మా స్నేహితుల్లో అనుకూలురు, ప్రతికూలురుకూడా వుండేవాళ్ళు. ఉభయ వర్గాలూ వాగ్వాదాలు జరిపేవాళ్ళు. ఆ వాగ్వివాదాలు ముదిరి ఒకోసారి దెబ్బలాటలలోకి దిగేవి.

## తిరిగి నిరుత్సాహం

సరే, వేదాద్రినుంచి మళ్ళీ సామంత్రానికి ఇంటికి తిరిగివచ్చాం. వేదాద్రి వెళ్ళుతూన్నప్పటి ఉత్సాహమూ, ఉల్లాసమూ తిరిగి వస్తూన్నప్పుడు లేవు. కొంత శరీర శైథిల్యమూ, కొంత మానసికమాంద్యమూ, మళ్ళీ తిరిగి పాతచోటుకే వెళ్ళుతున్నామనే నీరసము మొదలైనవన్నీ నన్ను పెనవేసుకొని తిరుగు ప్రయాణంలో ఏమీ ఆనందం కలగ లేదు. వెళ్ళేసమయాన కనుపించిన సుందర దృశ్యాల లోని సౌందర్యాన్ని వచ్చే ప్రయాణంలో ఆస్వాదించ జాలకపోయాను. కళ్ళు మూసుకొని బండిలో పడుకోబుద్ధి అయింది. మిగతా మిత్రులు చాలామంది ఉల్లా సంగానే వున్నారు. కాని కొద్దిమంది మాత్రమే, అందులో ప్రత్యేకించి నేను బొత్తిగా నీరసించిపోయాను. మళ్ళీ ఎప్పటి గ్రామమే, మళ్ళీ ఎప్పటి ఇల్లే, మళ్ళీ ఎప్పటి మనుషులే, మళ్ళీ ఎప్పటి మాటలే, మళ్ళీ ఎప్పటి ఆలోచనలే గోచరి స్తాయి. తిరిగి వెళ్ళిన తరువాత? అనే భయంతో నిండినభావం వడసాగింది మనసులో.

కొందరు ఇంటినుంచి క్రొత్తతావుకు ప్రయాణమై పోతున్నప్పటికంటె ఆ వెళ్ళిన తావునుంచి ఇంటికి తిరిగి వస్తూన్నప్పుడు ఎక్కువ ఉల్లాసంగా వుంటారు. ఇంటిదగ్గర సుఖంగా వుండేవాళ్ళూ, ఇంటిదగ్గర ప్రియమైన వ్యక్తులున్నవాళ్ళూ, ఇంటిదగ్గర ఏదో ఉజ్వలమైన భవిష్యత్ వున్నదని నమ్మేవాళ్ళు ఇంటికి తిరుగు ప్రయాణంలో ఎక్కువ ఆనందం పొందుతారు. కాని ఇంటిదగ్గర భారంగా తోచే వాళ్ళు, ఇంటిదగ్గర అంతగా ప్రియమైన వ్యక్తులు లేనివాళ్ళు, ఇంటిదగ్గర ఉజ్వల

మైన భవిష్యత్ గోచరించనివాళ్ళు మాత్రం ఇంటినుంచి పయనించేటప్పటి ఆనం దాన్ని తిరిగి ఇంటికి పయనించేటప్పుడు పొందరు.

నా స్థితి అప్పుడు రెండో వర్గానికి దగ్గరగా వుండేది. ఇంట వేరే ఎటువంటి ఇబ్బందులు లేకపోయినప్పటికి, ఇంట్లోవాళ్లూ, ఊళ్ళోవాళ్ళూ, ఎంతగా ఆదరంతో చూస్తున్నప్పటికీ, ఇంటిలో నా భవిష్యత్‌ను గురించిన సమస్యలు నాకేమీ తట్టనప్ప టికీ, ఇంటిలో వుండటానికేదో అయిష్టం, ఊరుకు తిరిగి రావడానికేదో అరుచి, పాత పరిసరాలనూ, పాత వ్యక్తులను చూడడానికేదో విరక్తి తట్టసాగాయి. స్వంత ఇంటనే ఖైదీ, స్వదేశంలోనే పరదేశీ అనే పదాలు అప్పటి నా స్థితికి సరిపోయేవి. నేనుంటూంది అసలు అర్థంలో స్వంత ఇల్లు కాకపోయినా, మేనమామగారిల్లూ, పెదతల్లిగారిల్లూకూడా తుమ్మపూడిలోని స్వంత ఇంటికంటె ఇంకా ఎక్కువ స్వంతా లుగా తట్టేవి. నిజానికి తుమ్మపూడిలోని స్వంతఇల్లే పరాయిఇల్లుగా వుండేది;

ఇక్కడివారు ఇంత ప్రేమ వాత్సల్యాంతో నన్ను చూస్తున్నప్పటికీ నేను నిజమైన ఆనందాన్ని పొందలేకపోయేవాణ్ని. నా అసలు నివాసం ఎక్కడో ఆ దిగంతాల కావల. ఆ మైదానాలకు దూరాన ఏ బంధనలూ లేని తావున, విముక్త వాతావరణంలో, నిరంతరమూ తెంపులేని ఆనందముండేచోట, రసవాహినులు నిహాళంగా ప్రవహించేచోట వున్నదనిపించేది. ఇప్పుడుంటూన్న చోటు, కొన్నాళ్ళ పాటుండడానికొచ్చిన మకాం మాత్రంగా, ప్రయాణం మధ్యలో ఆగిన మజిలీ మాత్రంగా తట్టేది.

మరొకరోజు మా స్నేహితులమంతా ఏడుమైళ్ళు నడిచి నందిగామ వెళ్ళాం. వెళ్ళేటప్పుడు చాలా ఉత్సాహంగా వెళ్ళాం. ఆ రాత్రి అక్కడ ఏదో నాటకంచూచి చీకటితో బయలుదేరి ప్రొద్దెక్కేవరకు ఇంటికి తిరిగివచ్చాం. మనసుకంటె ఈ ప్రయాణంలో శరీరానికి ఎక్కువ శ్రమ జనించింది. నడవడం అలవాటులేనందున కాళ్ళు బాగా నొచ్చాయి. ఈ ప్రయాణంలోకూడా అంటే నందిగామ పోయే సమ యానవున్న ఉత్సాహం ఇంటికి తిరిగివచ్చే సమయాన లేదు. మానసిక భారానికి తోడు శారీరక బాధకూడా తగిలేసరకు రెండూకలిసి ఎక్కువ కష్టమైపోయినాయి. ఏఒక్క బాధనో భరించే సమయాన దానికంటె రెండవదే తక్కువ బాధాకరమని తరుతుంది. కాని రెంటింటినీ ఏకసమయాన భరించే సమయాన రెండూ చాలా బాధా కరమని తెలుస్తుంది. మానసిక వేదనకంటే బాధ తక్కువదికాదు. శారీరక యాతన కంటే బాధకూడా తక్కువది కాదు.

తోటి స్నేహితులతో కలసి ఆ వూరు, ఈవూరు తిరిగిరావడం, నేనేదో పరధ్యానంతో అసంతృప్తిగా వుండడం, పెద్దలు అడిగే మాటకు సరిగా సమాధానం చెప్పకపోవడం, ఇంటిలోకంటె బయటనే ఎక్కువ సమయం గడపడం - మొదలైనవి మంచి లక్షణాలో, చెడ్డ లక్షణాలో నాకు తెలియదు. కాని మా కోట్లో బాబు వీటిని అంత మంచి దృష్టితో చూచినట్టుగా తోచలేదు. ఒకరాత్రి తనమంచం మీదకు పిలచి దగ్గర కూర్చోబెట్టి ఏమేమో హితబోధ చేయసాగారు. ఆయన హితబోధ నాకు వినడానికి ఇంపుగానే వుంది. కాని ఆచరించడానికి అంత హాయిగా తట్టలేదు. ఆయన చేయవద్దు అన్న పనులను మానుకోవడం కష్టంగా తట్టింది. ఆయన చేయమన్న పనులు చేయడం కష్టంగా తట్టింది. ఆయన చేయమన్న పనులను మానుకోవడం, మానుకోమన్న పనులను చేయడం మాత్రం సులభంగా తట్టింది. "జానామిధర్మం నచమే ప్రవృత్తి, జానామ్యధర్మం నచమే నివృత్తిః" అనే పద్ధతి అయింది నాపని. ధర్మమని తెలసినదాన్ని అనుసరించలేక పోవటం, అధర్మమని తెలిసిన దాన్ని వర్జించలేకపోవడం.

వెళ్ళి నా మంచంమీద పడుకున్నది మొదలు ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. ఆయన చెప్పిన హితోపదేశాన్ని గురించే ఆలోచించసాగాను. నేను ప్రస్తుతం చేస్తున్న స్నేహాలు మంచివికావనీ, వాటిని వదలమనీ బాబుగారి సలహా. నాకు అనేక సందేహాలు రాజొచ్చినాయి. ఆయన చిన్నప్పుడు ఇటువంటి స్నేహాలు చేయలేదా? అవును, చేసేవుంటారు. అయితే ఆయన సంరక్షకులు ఆ రోజులలో ఆయనను కూడా మందలించే వుంటారుగా. నన్ను తాను మందలించినట్టుగానే చిన్నప్పటి రోజులు అందరికీ ఒకటిగానే వుంటాయా? పెద్ద అయిన తరువాతనేనా ఈ తారతమ్యాలన్నీ? చిన్నప్పుడు చేసిన పనులన్నీ పెద్ద అయిన తర్వాత చిన్నవిగా కనిపిస్తవా? చిన్నతనంలో మధురంగా తట్టినవన్నీ పెద్ద అయిన తరువాత చేదుగా తడుతుంటవా? మంచి స్నేహాలకూ, చెడ్డ స్నేహాలకూ తారతమ్యం ఏమిటో! మంచి స్నేహితులనే వాళ్ళకంటె చెడ్డ స్నేహితులనేవాళ్ళే ఎక్కువ తీపిగా, ఎక్కువ సన్నిహితంగా, ఎక్కువ తెలివైనవారుగా గోచరిస్తారెందుకనో?

# నాయనమ్మకు మళ్ళీ పెళ్ళి: జంతుబలులపై దాడి

నాకప్పుడు పన్నెండు సంవత్సరాలు. తుమ్మపూడిలో వున్న మా తండ్రి గారు, మా అమ్మ చనిపోయిన మూడో సంవత్సరంలో ద్వితీయ వివాహం చేసుకొంటే ఆమె ఒక సంవత్సరం మాత్రమే జీవించి దివికేగింది. అప్పుడు మళ్ళీ తృతీయ వివాహం చేసుకొన్నట్టు తెలిసింది. తండ్రి వివాహం కుమారుడు చూడ కూడదని నన్ను ఆయన రెండు వివాహాలకు కూడా తీసుకుపోలేదు. నిజమే, తండ్రి వివాహం కొడుకు చూడడం ఎంతకష్టం మరి! అసలు తండ్రి వివాహ సమయంలో కొడుకు అనే జీవియే వుండడుగా!

మా అమ్మకు పెద్దక్కగారు విధవ. ఆమె కోనాయపాలెంలో నేముండే ఇంటి లోనే వుంటుంది. భర్తలంటే ఏమిటో, భార్యలంటే ఏమిటో, పెళ్ళిఅంటే ఏమిటో పిల్లలుఎలా పుడతారో ఇటువంటి విషయాలన్నీ అప్పటికి నాకుబాగా తెలుసు. మామిత్ర మండలిలో ఇటువంటివిషయాలన్నీ చర్చించుకొనేవాళ్ళం. ఇవేకాదు, ఇంతకంటేలోతయిన విషయాలనుకూడా చర్చించుకునేవాళ్ళం. స్త్రీపురుష సంబంధాలలోని ఆకర్షణ కూడా అప్పటికిమాకు తెలియందికాదు. మా తండ్రిగారిభార్యలు చనిపోతూంటే మళ్ళీ మళ్ళీ వివాహాలుచేసుకున్నారుకాని, ఇక్కడ మా పెద్దతల్లికి ఎప్పుడో భర్త చనిపోతే మళ్ళీ ఒక్కసారైనా వివాహం ఎందుకుచేసుకోలేదా అనినేను ఆలోచించసాగాను. కోనాయపాలెంలోకూడా భార్యలు చనిపోయిన భర్తలు మళ్ళీ వివాహాలు చేసుకోడం చూచాను. కాని భర్తలు చనిపోయిన భార్యలు మళ్ళీ పెళ్ళి చేసుకోడం చూడలేదు. దీని కారణం నాకు తెలియలేదు. నాకు తట్టిన సందేహాలన్నిటినీ మా కోటోబాబుకు తెలపటం. ఆయన తగు రీతిగా సమాధాన మియ్యడం అలవాటు.

ఒక సాయంత్రం బాబూ, నేనూ, కోట ముందున్న రచ్చబండమీద కూర్చుని వుండగా ఈ నా సందేహాన్ని బయటపెట్టాను. అందుకు ఆయన నవ్వి మీసాలు సవరించుకొని చెప్పసాగారు: "సంజీ, నీవన్నీ వయసుకు మించిన ఆలోచనలు. పెద్దవాళ్ళకు కల్గే సందేహాలు నీకు కలుగుతూంటవి నీకు. పూర్వం అసలు భర్తలు చచ్చిపోయిన వాళ్ళను సహగమనం అనే పేరుతో చచ్చిన భర్తలతోపాటు భార్యలను కూడా కాల్చివేసేవారు" అని చెప్పి, ఇంకా రాజారామమోహనరాయలు

జరిగించి ఆ సహగమన ఆచారాన్ని ఏ విధంగా రూపు మాపిందీ, తరువాత ఈశ్వరచంద్ర విద్యాసాగరు, కందుకూరి వీరేశలింగం మొదలైనవారు విధవా వివాహాలను ఏ విధంగా ప్రవేశపెట్టింది మొదలైన ఉదంతం అంతా ప్రొద్దుపోయే వరకు చెప్పుతు వచ్చారు. నాకు తోడు ఇంకా బజారుకు వెళ్ళే శ్రోతలు కూడా వచ్చి వింటున్నారు. అయితే విధవా వివాహాలు మన ఊళ్ళలో ఎందుకు జరగడం లేదని శ్రోతల నుంచి ఒకరు ప్రశ్నించారు. అందుకు బాబు సమాధానం ఇచ్చారు. "ఎందుకు జరగటంలేదు. పల్లెల్లో ఇంకా జరగటం లేదు కాని బస్తీలల్లో జరుగుతూనే వున్నాయి."

తెల్లవారి మా స్నేహితులమంతా వాగు వడ్డున చేరినప్పుడు రాత్రి మా బాబు గారిద్వారా నేనువిన్న విశేషాలన్నీ వాళ్ళకు తెలిపాను దానిమీదట చాలాచర్చ నడచిన తరువాత మన వూరులో కూడా విధవా వివాహా లెందుకు చేయరాదు అని ముగించాం. మా స్నేహితులలో ఒకరికి చాలా ముసలి నాయనమ్మ వుంది. మే మంతా ఆ స్నేహితునితో "ముందు మన వూళ్ళో మీ నాయనమ్మకు మళ్ళీ పెళ్ళి చేద్దాం" అని ఆయనతో కలసి వాళ్ళ ఇంటికి పోయి ఆ ముసలమ్మతో "సర్కారు వారు నీకు మళ్ళీ పెళ్ళి చేయమంటున్నారు. కనుక మేమంతా కలసి నీకు మళ్ళీ పెళ్ళి చేస్తాం" అన్నాం. ఆ ముసలమ్మకు విపరీతంగా కోపంవచ్చి తన చేతులో వున్న కర్రను అమాంతం మామీదకు విసరింది. దానితో ఇద్దరు అబ్బాయిలకు మోకాళ్ళకు బాగా దెబ్బతగిలింది. దానితో మేమంతా "ముసలమ్మ పెళ్ళి, ముసలమ్మ పెళ్ళి" అంటూ అరుస్తు బజారులోకి పరుగెత్తాం.

ఆ రాత్రి నేను వంటరిగా పడుకొని ఒకసారి తుమ్మపూడినుంచి అమ్మతో బరోలుచేరి రావడం, చెల్లెలు పుట్టడం, అమ్మ మరణించడం, నా విద్యాభ్యాసం, నా ఆలోచనలు, నా అనుభూతులు, నా ఆశయాలు, నా అభిరుచులు మొదలైన నాయీ కోవాయపాలెంలోని ఎనిమిది సంవత్సరాల జీవితాన్ని గురించి సింహావలోకనం చేయసాగాను. చేస్తుచేస్తూనే కన్నుమూశాను. ఏవో స్వప్నాలు, కొంత భయంకరమైనవీ, కొంత సంతోషమైనవీ కూడుకొన్న స్వప్నాలు.

ఆ వూరికి ఉత్తరంగా పన్నెండుమైళ్ళ దూరాన పెదగంచిప్రోలు అనే ఒక పెద్ద గ్రామం ఉంది. ఆ గ్రామంలో తిరుపతమ్మ అనే దేవతకు ప్రతి సంవత్సరమూ గొప్ప తిరునాళ్ళ జరుగుతుంది. మాఘపూర్ణిమకు చాలా దూరతీరాల నుంచి అంటే సత్తెనపల్లి, నరసరావుపేట, పలనాడు, రేనాడు మొదలైన మెట్టప్రాంతాల నుంచి గొప్పగొప్ప ప్రభలు కట్టుకొని వస్తారు మొక్కుబడులు చెల్లించడానికి.

దక్షిణంనుంచి వచ్చేవాళ్ళంతా కృష్ణదాటి కోనాయపాలెం మీదుగానే పెనుగంచిప్రోలు పోతారు. పగలుకాని, రాత్రులుకాని కోనాయపాలెంలో ఎక్కువసేపు విశ్రాంతి తీసుకొని బయలుదేరుతారు. కొన్ని ప్రభలు అరవై, డెబ్బయి అడుగుల ఎత్తున వుంటాయి. వాటిని నాలుగు రాతిచక్రాల బండిమీద కడతారు. కొయ్య చక్రాలకంటే ముందు రాతిచక్రాలే వుండేవట. ప్రతిఊరిలోని వీరశైవులూ, విశ్వకర్మలూ వచ్చి ఆ ప్రభలముందు వీరంగం అనే ఒక విధమైన నృత్యం చేస్తారు. ఈ వీరంగం అనేది శివతాండవానికి దగ్గరలోనే వుంటుంది.

## జాతరలు, వీరంగాలు

ఆ తరుణంలో కోనాయపాలెంలో ఒక తిరునాళ్ళగా తయారయేది. ఇంత అట్టహాసంతో జరుగుతూన్న పెనుగంచిప్రోలు వేడుక నేను తప్పక చూడవలసిందేనని గట్టిపట్టుపట్టాను. అప్పుడు రెండు బళ్ళు గట్టి వంటసామగ్రి అంతా తీసుకొని ఇంట్లో అందరితో కలిసి పెనుగంచిప్రోలు చేరుకొన్నాం. విఖ్యాత చరిత్రకారులు, విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపకులూ అయిన స్వర్గీయ కొమర్రాజు లక్ష్మణరావుగారిది పెనుగంచిప్రోలే అని విన్నాను.

ఎంతో పెద్ద జాతరది. ఎన్నెన్నో వింతవస్తువుల దుకాణాలూ, సర్కసులూ, గారడీలు, రంగులరాట్నాలూ - ఇంకా ఏమేమో వున్నాయి. లెక్కలేని చెట్లున్న అరణ్యం చూశాను. కాని లెక్కలేనందరు మనుషుల్ని చూడడం అదే ప్రథమం. కొందరం కలిసి తిరుపతమ్మ గుడివైపుకు వెడితే అక్కడ జరుగుతూన్న ఘోరం చూసి నాకు మూర్ఛ వచ్చింది. కోడిపుంజులనూ, గొర్రెలనూ, మేకలనూ తిరుపతమ్మ దగ్గర బలికి వేస్తున్నారు. రక్తం కాలవగా పారుతూంది. ఆ భయంకరమైన బీభత్స దృశ్యం చూచేసరికి నా గుండెదడా, కాళ్ళు వణకడం ప్రారంభించి పడిపోబోయాను. అక్కడ నుంచి బళ్ళ దగ్గరకు వచ్చి "జంతువుల రక్తం తాగే దేవత ఊళ్ళో నేనొక్క పూటయినాకూడా వుండజాలను. బళ్ళు కట్టండి బయలుదేరి వెళ్ళిపోదాం అని హఠం మొదలు పెట్టాను. అందుకు ఆ చుట్టుపట్ల వాళ్ళంతా ముక్కుమీద వ్రేలు వేసుకొని "తప్పు తప్పు, దేవతను, అమ్మవారిని ఆ విధంగా తిట్టరాదు. అమ్మవారు చాలా సత్యం గల అమ్మవారు" అని అనసాగారు. వాళ్ళు అంటూన్నకొద్దీ నేను దూషించసాగాను. "ప్రాణులను రక్షించే అమ్మవారు నిజమైన అమ్మవారు కాని, ప్రాణులను భక్షించేది కూడా అమ్మవారేనా?

అమ్మవారు కాదు, ఆమె రాక్షసి మాత్రమే" అని వెంటనే బళ్ళుకట్టించి బయలు దేరాం.

తిరుపతమ్మ గుడిదగ్గర చూచిన రక్తప్రవాహమూ, తెగిపడి వున్న అనేక జంతువుల తలలూ, మొండెములూ, పసుపూ, కుంకుమలూ, వేప మండలతో వూగుతూ తమకింకా ఆహారం చాలా లేదంటూ కేకలు వేస్తూన్న గణాచారులూ – వీటన్నిటితో నా మనసు చెదరిపోయింది. ఇక నాకు అన్నం తిన బుద్ధికాలేదు, మంచి నీరు త్రాగబుద్ధి కాలెదు, ఎప్పుడొచ్చి కోనాయపాలెంలో వాలుదామా అని తహ తహ లాడింది.

ఇదివరలో ఇంటికి వచ్చే తిరుగు ప్రయాణంలో తిరిగి యింటికి పోతున్నామన్న ఆందోళన పీడించేది. ఇప్పుడు ఆవిధంగాకాక ఎప్పుడుపోయి యింటిదగ్గర కోట్లోబాబుకు ఈ సమాచారమంతా చెబుదామా అనే ఆందోళన ఎక్కువైంది. పన్నెండుమైళ్ళు రెండెద్దుల బండిలో అటుకొట్టుకొని ఇటు కొట్టుకొని చివరకు పీక్కుపోయిన ముఖాలతో ఇల్లు చేరుకొన్నాం. బండి దిగడమే ఆలస్యం, వెంటనే కోట్లోబాబు దగ్గరకు పరుగెత్తుతువెళ్ళి జరిగిన సమాచారమంతా చెప్పాను. నా మానసికస్థితిచూచి ఆయన కొంచెం ఆందోళనపడి ఆ క్షుద్రదేవతలూ, జాతరలూ మన లాంటి వాళ్ళకోసం కాదు, అవి కావలసిన జనులు వేరే వున్నారు. అవి వాళ్ళ కోసం మాత్రమే. ఏమైనప్పటికీ జంతుబలులు క్రూరమైన కార్యం కనుక ఇటు వంటివాటిని ప్రభుత్వం నిషేధించాలని ఆయన నొక్కి చెప్పారు. ఆయన ప్రకటించిన అభిప్రాయాలవల్ల నా విషాదం కొంతవరకు నశించింది. ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు అవే జ్ఞాపకాలతో.

స్కూల్లోని హెడ్ మాస్టరుగారు బదిలీఅయి క్రొత్తవారు వచ్చారు. ఆయన పేరు వెంకటరావుగారు. పాత హెడ్ మాస్టర్‌గారికంటే క్రొత్తవారు ఎక్కువ చదువుకున్నారు. నేను స్కూల్లోని విద్యార్థులలో లెక్కకాకపోయినా హెడ్‌మాస్టర్లకు ప్రత్యేకమైన స్వంత విద్యార్థిగా వుంటుండేవాణ్ని. అందువల్ల వారి ఇళ్ళవద్దకు వెళ్ళి పాఠాలు చెప్పుకోడమేకాక స్కూల్లోకికూడా వారి వెంట అప్పుడప్పుడు పోతూండేవాణ్ణి. వెంకటరావుగారు చాలా కోపస్వభావులు. అయినా ఆయనకోపం నామీద అంతగా ప్రయోగించాల్సిన అవసరం వుండేదికాదు. కొందరి కోపం కొందరిమీద మాత్రమే ఉపయోగపడుతుంది. కాని అందరిమీద ఉపయోగపడదు. కోపంవచ్చిన సమయంలో రెండవవారు కొంచెం జాగ్రత్తగావుంటే కోపంపోయిన తరువాత ఆయన ప్రవర్తన సహజంగానే వుంటుంది.

ఆయన నాకు ఇంగ్లీషు వ్యాకరణంలోని ప్రధాన విశేషాలను బోధించేవాడు. పాఠక పుస్తకాలనేకాక చిన్నచిన్న ఇతర పుస్తకాలనుకూడా నాచేత చదివింప చేసేవాడు. ఇంగ్లీషులో చిన్నచిన్న వాక్యాలను రచించడంకూడా అభ్యాసం చేయించాడు. వెంకటరావుగారి చేతిక్రింద నా విద్యాభ్యాసం, అందులోనూ ప్రత్యేకించి ఇంగ్లీషు భాష ఉన్నతి పొందసాగింది.

మొదటిగా రవీంద్రనాథటాగోర్‌ను గురించి విన్నది ఆయన ద్వారానే. రవీంద్రుని ఫొటోవున్న పుస్తకంవుంది ఆయన దగ్గర. రవీంద్రుని ఫొటో నన్ను చాలా ఆకర్షించింది. దానికితోడు ఆయనను గురించిన విశేషాలు వినడంతో ఆయనంటే ఒక అభిమానం ఏర్పడింది.

హెడ్ మాస్టర్‌గారికి కవితాహృదయం. ఆయన స్వయంగా కవితలు రచించేవారుకాదు, కాని ఇతరుల కవితలను బాగా చదివేవారు, ప్రకృతి అంటే ఆయనకు చాలాఇష్టం. స్కూల్ వదలిన తరువాత మమ్మల్ని కొందరిని వెంటబెట్టుకొని ఆయన ఊరి బయటికి వాగుదగ్గరికి వాహ్యాళికి వెళ్ళేవాడు. ఒకసారి ప్రకృతిని గురించి మాట్లాడుతూ ఇంగ్లీషు కవులలో వర్డ్స్‌వర్త్ అని ఒక కవి వున్నారని ఆయన కవిత్వమంతా ప్రకృతి సౌందర్యాన్ని గురించే వుంటుందనిచెప్పి వర్డ్స్‌వర్త్ కవితలలోని ఈ క్రింది పద్యం చదివేరు :

**One impulse from a vernal wood**
**May teach you more of man**
**Of moral evil and of good**
**Than all the sages can.**

దీనిలోని లోతుపాతులు నాకంతగా అప్పుడు అర్థం కాలేదు. అయినప్పటికీ అదేదో ఆకర్షణీయంగా తట్టేది.

ఇంగ్లీషుభాషలోని అపవాదాలు చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఒకే సూత్రం అన్నిటికీ వర్తించేదికాదు. వర్క్ అనేదానికి భూతకాలం వర్క్‌డ్ అయితే ఈట్‌కు భూతకాలం ఈటెడ్ అని వుండడానికి బదులు ఏట్ అని వుండడం నాకేమీ నచ్చలేదు. ఏట్ మాత్రమేకాక ఈటెన్ అని భూతకాలంలోనే మరోరూపం. ఇటువంటి అపవాదాలున్నప్పటికీ ఇంగ్లీషు వ్యాకరణం ప్రియంగానే తట్టసాగింది.

ఒకరోజు స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్ వచ్చారు. ఆయన పేరు ఏదో నారాయణ మూర్తిగారని గుర్తు. ఆయన తెలుగులో కవిఅట. ఆయన వ్రాసిన కవితలు ఒక రోజు స్కూలులో చదివి వినిపించాడు. అవి విని నాకు ఎంతో ఆనందం వేసింది. పూర్తిగా వాటిభావం నాకర్థం కాలేదు. అయినా ఆనందం కలిగింది. అసలు కవి అనే పదంలోనే ఎంతో ఆకర్షణ తట్టసాగింది. ఆయన చెప్పాడు — మాకు మీరంతా నిద్రిస్తూన్న కవులేనని. ఒకనాటికి మీరు మేల్కొన్న కవులు కాగలరని. నిద్రిస్తూన్న కవులు అనే మాట మాకు బొత్తుగా అర్థంకాలేదు. ఇదేమిటి. పట్టపగలు మేల్కొనివున్నవాళ్ళని మమ్మల్ని ఈయన నిద్రిస్తున్నవాళ్ళని అంటాడేమిటి ? అని ఆందోళన చెందాం.

జీవితంలో కవి కావలసిందే అనిపించింది. అయితే ఏమేమి పదార్థాలుతింటే కవి అవుతారో సరిగా తెలియలేదు. అప్పుడు కవి కాలేకపోయినా భవిష్యత్తులోనైనా కవి కావాలనిపించింది. ఏమైనాసరే అని హెడ్ మాస్టర్‌గారిని అడిగాను. కవి కావడానికి ఏమేమి తినాలి, ఏమేమి త్రాగాలి, ఏమేమి చదవాలి, ఏమేమి వ్రాయాలి అని. ఆయన నవ్వుతూ సమాధానం చెప్పేరు - ఉమ్మెత్తకాయలు తినాలని. మేము నిజంగానే తింటామేమో అని భయపడి ఆయన ఉమ్మెత్తకాయలు నిజంగా తినవద్దు అవితింటే పిచ్చిపుడుతుందని మాకు తెలిపారు. ఆ వూరునిండా ఉమ్మెత్తచెట్లు తెల్లనిపూలతో, ముళ్ళముళ్ళ కాయలతో మస్తుగా వుండేవి. వాటన్నిటినీకాకపోయినా కొన్నిటినైనా తింటే ఎంత కవిత్వం అబ్బేదో మరి !

# తుమ్మపూడి ప్రయాణంలో ఒక వినూత్నానుభవం

శరత్కాలం ప్రవేశించింది. నల్లమబ్బులు తెల్లమబ్బులుగా మారసాగాయి. ఆకాశంలో ఒక నవ్యశోభ ప్రకాశింపసాగింది. ఉత్తర దిశనుంచి ఒక మృదువైన శీతలసమీరం వీవసాగింది. పచ్చికబయళ్ళ పచ్చదనం పండిన రంగుగా గోచరింప ప్రారంభించింది. వర్షాలు తగ్గిపోయినాయి. చెరువులలోను, వాగులలోను బురదనీరు నిర్మలజలాలుగా రూపొందసాగాయి. ఎటుచూచినా వాతావరణంలో స్ఫటిక స్వచ్ఛత వ్యక్తం అవుతూంది.

వయసు నాకు పన్నెండు నిండబోతున్నా చదువులు మాత్రం వయసుతో పోటీచేసి పనుగెత్తలేక వెనుకబడిపోతున్నాయి. ఎవరైనా నీ వయసెంత అని అడిగినప్పుడు పన్నెండు అని గర్వంగా చెప్పగలుగుతున్నానేకాని నీ వేమి చదువుతున్నావని అడిగినప్పుడు తెల్లబోయి తలవంచుకోవలసి వస్తున్నది.

పన్నెండు సంవత్సరాల వయసులో నేను పెద్దవాణ్ణి అయినట్లు భావించి గర్వపడసాగాను. కాని నా చదువు విషయం గుర్తువచ్చేసరికి చిన్నబోయి బాధపడసాగాను. ఈ శైథిల్యం విద్యా విషయాలలో మాత్రమేకాక మిగతా జీవిత విషయాలలోకూడా అస్పష్టంగా ప్రతిబింబించసాగింది. స్వేచ్ఛాప్రవర్తన, పెద్దల మాటను లక్ష్యం చేయటం, వారు ఇంకొంచెం గట్టిగా మాటాడితే నేను ఇక్కడ వుండను, మాఇంటికి నేను తుమ్మపూడి వెళ్ళిపోతాననటం మొదలైనవాటిని ప్రారంభించాను. నాలో పరిణతి పొందుతున్న ఈ ధూర్తదశను గమనించి మా అమ్మమ్మ, కోట్లోబాబు మొదలైనవారంతా లోలోపల ఆందోళన చెందసాగారు. ఒక వైపున తెంచుకోలేని మమత, మరోవైపున నా శ్రేయాన్ని గురించిన కర్తవ్యం. ఈ రెంటిమధ్య వారంతా సతమతమైపోసాగారు. రోజురోజుకు నా దుష్ప్రవర్తనల సంఖ్య ఎక్కువ కాజొచ్చింది.

## వియోగబాధ

సరే, ఇక్కడ ఇలా వుంటూండగా, అక్కడ తుమ్మపూడినుంచి ఉత్తరంమీద ఉత్తరం వస్తుండేది. అబ్బాయి చదువు ఇక్కడ సాగదు కనుక ఇక అక్కడనుంచి అబ్బాయిని తుమ్మపూడి పంపివేయమని ! ఇంకేం సరిపోయింది. లాగటం, నెట్టడం రెండూ ఏకమైతే ఇక కదలక తప్పదు. నన్ను తుమ్మపూడి పంపటానికి నిశ్చ

యించుకొన్నారు ఎంతో అయిష్టంగా, ఎంతో విచారంతో, ఎన్నో కనిపించని కన్నీటిధారలతో. ఈ నిర్ణయం జరిగినప్పటినుంచీ నా మానసమంతా విషాదచ్ఛాయలతో మలినమైపోయింది. కోపం వచ్చినప్పుడు తుమ్మపూడి వెళ్ళిపోతానంటున్నానే కాని తుమ్మపూడి పోవడం నాకు బొత్తిగా ఇష్టంలేదు. బొత్తిగా అన్నం సహించకుండా పోయింది. రాత్రులు సరిగా నిద్రపట్టక ఏ తెల్లవారుజామునకో నిద్రపట్టి ఎంతో ఎండఎక్కిన తరువాత లేవడం జరగసాగింది. ఆకలివేసినప్పుడు దుఃఖాన్ని తినడం. దాహం అయినపుడు కన్నీరును త్రాగడం అలవాటు కాజొచ్చినాయి. నా విషాదావస్థచూచి ఇంట్లోవారంతా కుమిలిపోతున్నారు.

తుమ్మపూడి ప్రయాణం దగరపడుతున్నకొద్ది కోనాయపాలెంమీది ప్రీతి బలీయం కాజొచ్చింది. ఇక్కడి చెరువును, చెరువు గట్టునవున్న పెద్ద మర్రిచెట్టును, ఊరుబయట ఎత్తుపల్లాలలోగుండా ప్రవహిస్తున్న వాగులను, వాగులలో నీరు ఎండిన చోట మిల మిల మెరిసే బంగారు ఇసుకను, కోటముందు రోజూ రాత్రులు మేము కూర్చునే విశాలమైన రచ్చబండను, నాతో తిరిగే ఎందరో అమ్మాయిలను, అబ్బాయిలను. విశ్వాసపాత్రమైన కుక్కలనూ, గుర్రాలను, వీటన్నిటినీ శాశ్వతంగావదిలేసి అమ్మమ్మనూ, కోట్లోదాటును, అమ్మలను. అమ్మల బిడ్డలైన అక్కలను, వదలేసి ఎక్కడో సుదూరాన నందిగామకు అవతల, బెజవాడకు అవతల కృష్ణకు అవతల. తెనాలికి దగ్గరలోవున్న తుమ్మపూడికి వలసపోవడం అంటే ఏదో చెప్పరాని బాధ. ఏదో తెలియరాని వ్యథ జీవనలోకంనుంచి మృత్యులోకంలోకి పయనిస్తున్నట్టు. అమ్మతోకలిసి తుమ్మపూడినుంచి వచ్చి నేను అమ్మలేకుండా తుమ్మపూడి వెళ్ళాలి!

శరత్కాలంలో సుదూర ప్రాంతాలనుంచి ఎన్నో రకరకాల కొంగలువచ్చి ఆ ప్రాంతంలో మకాంపెట్టి పిల్లలుచేసి వసంతకాలం ప్రారంభంలో అవి మళ్ళీ సుదూర ప్రాంతాలకు వెళ్ళిపోతాయి. శరత్కాలంలో పూచిన తెల్లని రెల్లుపొదల దగ్గర వాగుల వడ్డులో ఆ కొంగలను చూడడం జీవితంలో వికసిస్తున్న ఆనందాలలో ఒకటిగా వుండిపోయింది. శరత్కాలం వచ్చింది. దానితోపాటు కొంగలు వచ్చినాయి. అయితే ఏమి లాభం, ఇక్కడకు రావడం పని వాటిదైతే ఇక్కడనుంచి పోవడంపని నాది అవుతూంది. కొంగలు ఇక్కడనుంచి వెళ్ళిపోయేవరకు కాకపోయినా, కనీసం శరత్కాలం ఇక్కడనుంచి పోయేవరకు అయినా నేను ఇక్కడనుంచి పోకుండావుంటే! కాని వీలులేదు, ప్రయాణం స్థిరపడిపోయింది. అయితే, తుమ్మపూడిలోకూడా శరత్కాలం వుండదా. అక్కడకూడ కొంగలుండవా?

ఏమో యెవరెరుగు. తుమ్మపూడిలోని శరత్కాలంతోగాని, శరత్కాలంలోని తుమ్మపూడితోకాని నాకు పరిచయమేలేదు. అమ్మలేని తుమ్మపూడి తుమ్మముళ్ళతో సమానమే.

సరే, నాకిష్టమైన అటువంటి ఆనందమయమైన శరదృతువులో ఒక పేకువ జామున నా కిష్టంలేని ఆనందమయం కాని ప్రయాణం చేయాలసొచ్చింది. కోట్లో బాబూ, నేనూ గుర్రం ఎక్కి నందిగామకు బయలుదేరాం. మా పనిమనిషి నా సామాను తీసుకొని వెనక వస్తున్నాడు. అమ్మను దహనంచేసిన శ్మశానందాటి, వాగుదాటి, వాగువడ్డున పూగే తెల్లగా పూచిన రెల్లుపొగను దాటి అక్కడే తిరుగుతున్న కొంగలను దాటి డొంకమార్గాన ఉదయానికి నందిగామ చేరాము, బరువు హృదయాలతో.

అప్పటికి కొంతకాలంనుంచి నందిగామకు, బెజవాడకు మధ్య బస్సులు తిరుగుతున్నాయి. అయితే మధ్యలో కీసరదగ్గర మునేరుమీద అప్పటికి వంతెన కట్టలేదు. అటునుంచి వచ్చే బస్సు అవతలితీరాన ఆగిపోయేది. ఇవతలిది ఇవతల తీరాన ఆగిపోయేది. ఏరుదాటి రెండోబస్సులో ఎక్కవలసి వచ్చేది. వర్షాకాలంలో అయితే చక్రాలబోటుమీద దాటుతారు. మిగతా కాలాలలో నడిచే దాటుతారు.

## ముంచుకు వచ్చిన సిగ్గు

నందిగామలో కోట్లోబాబు నన్ను హోటల్‌లోకి తీసుకువెళ్ళి నాకిష్టమైన ఉప్మా నిమ్మరసం కలిపినది పెట్టించారు. కాని కోనాయపాలెంను వదలిన దిగులు మూలంగా ఇష్టమైనపదార్థాన్ని కూడా ఇష్టపూర్తిగా తినజాలకపోయాను. కాఫీ త్రాగడానికి ప్రయత్నిస్తే అవకాశం లేనంతవ డోకు వచ్చింది. అంతటితో రోడ్డుమీద కొంతసేపున్న తరువాత జగ్గయ్యపేటనుంచి బస్సువచ్చింది. ఇద్దరమూ అందులో ఎక్కాము. పురుషులు కూర్చున్నచోట ఖాళీ లేనందువల్ల నన్ను స్త్రీలదగ్గర కూర్చోబెట్టారు. స్త్రీల ప్రక్కన కూర్చోడంతో నాకు కొంత సిగ్గు వేసింది. నా ప్రక్కన నాకంటె వయసులో పెద్దఆమె, అంటే దాదాపు ఇరవై సంవత్సరాల వయస్సుగల వనిత కూర్చొనివుంది. ఆమె ముఖంలో ఏదో ఆకర్షణ గోచరించింది. ఆమె ముఖంవైపు చూడాలనిపించికూడా సిగ్గువల్ల తలఎత్తి సరిగా చూడలేకపోయాను. ఆమె ఆకృతిలోని ఆకర్షణకంటే ఆమె ఒడిలో ఉంచుకొన్న మొగలిరేకులవాసన నన్ను బాగా ముగ్ధుణ్ణిచేసింది. మొత్తంమీద ఆమె సాన్నిధ్యం నాలో అదివరకున్న బెంగను తగ్గించి, ఏదో అజ్ఞాత సంతృప్తిని సృష్టించింది.

మేమంతా కీసరకు ఇవతల మునేరు వద్దన బస్సుదిగి ఇసుకలోగుండా అక్కడక్కడ మోకాలులోతు నీటిపాయలలోగుండా అవతలి ఒడ్డుకు వెళ్ళాము. నేను ఆ యువతి వెంటనే వున్నాను. ఆమె ప్రేమతో పలకరించడంతో నాలోని సిగ్గు తగ్గిపోయింది. ఆమె ముఖంవైపు తలెత్తి పరిశీలనగా చూచి ఆమె అడిగే ప్రశ్నలకు జవాబు చెప్పసాగాను. ఆమె ముఖం నాకెంత కాలంనుంచో పరిచితమైన ముఖంగా తట్టసాగింది. నా సంగతులన్నీ ఆమె అడుగుతుంటే జవాబులు మాత్రమే చెప్పగలిగాను. కాని ఆమెను నేను తిరిగి తనను గురించిన ప్రశ్నలేమీ వేయజాలకపోయాను. అందువల్ల నేనెవరో ఆమెకు తెలిసింది కాని ఆమె ఎవరో మాత్రం నాకు తెలియలేదు. తెలుసుకోవాలనే కుతూహలం లేకపోలేదు. కాని ఆ తెలుసుకొనే ప్రయత్నం చేయజాలకపోయాను. ఏరుదాటి అవతలివడ్డు ఎక్కిన తరువాత నీళ్ళలోనూ, ఇసుకలోనూ నడచినందున నా తడిలాగుకు అంటుకున్న ఇసుకను ఆమె శ్రద్ధగా తన చేతితో దులపసాగింది. ఆ సమయాన నాకేదో అందని ఆనందం అందినట్టు అనుభూతి చెందాను. బెజవాడనుంచి ఇంకా అవతలి వడ్డుకు బస్సురానందున అందరితోపాటు ఆమె, నేను కూడా అక్కడ చెట్టుక్రింద కూర్చున్నాం. అరటిపళ్ళు కొని తినమని ఇచ్చింది. నేను మళ్ళీ సిగ్గుపడి తినకుండా వాటిని చేతిలో పట్టుకొని కూర్చుంటే వాటిని ఆమె తీసుకొని వొలిచి నా చేతికందించింది. ఇక తినక తప్పలేదు.

## నవ భావ పరంపర

బెజవాడనుంచి బస్సు వచ్చింది. కోట్లోబాబు నాదగ్గరకువచ్చి నన్నుబస్సులో ఎక్కమని చెపుతూండగా ఆమె అన్నది, "అబ్బాయి నా దగ్గర కూర్చుంటాడు లెండి" అని. బెజవాడ వెళ్ళేదారిలో ఎన్నోకొండలు, గుట్టలు, ఎండలో ఒకరంగుగా, నీడలో మరొకరంగుగా గోచరించసాగినాయి. ఆమె మాటలువింటూ, ఆమె జడలోని మొగలిరేకుల వాసనను పీలుస్తూ ఆ కొండల రూపాలను, రంగులను చూస్తూంటే నాలో ఏదో తన్మయభావం ప్రవేశించసాగింది. నాలో నూతన అనుభూతి కలగసాగింది. నవ్యప్రాణస్పందన జనింపసాగింది. నవచైతన్యం మేల్కొనజొచ్చింది. దిగుళ్ళకూ, విషాదాలకు అలవాటు పడివున్న జీవితం పునర్జన్మ ఎత్తినట్టు అయింది. ఆమె ఏదో అడుగుతున్నది. నేను ఏదో సమాధానం చెబుతున్నాను. కాని నా ఆనందలో నేను వున్నాను. ఆమె ఇంకా అంటూంది "చూడు నీవు మావూరు రారాదూ, మా ఇంట వుండి చదువుకొందువుగాని. నేనున్నానుగా నీకేం భయం? మా ఊరులో మంచి పంతుళ్ళున్నారు, మంచి బడి వుంది. నీవు

మంచివాడవుగదూ! నీకు బాగా చదువువస్తుంది, వస్తావామరి! నాకు ఏమిసమాధానంచెప్పాలో తోచలేదు. నవ్వి ఊరుకొన్నాను. తమఊరు రమ్మంటూంటే తనది ఏ ఊరనికూడా నేను అడగలేదు. ఆమెతోకలిపి ఆమె ఊరు వెళ్ళడం ఎంతో ఇష్టంగానే తట్టింది. తుమ్మపూడి తప్ప ఇంకెక్కడికి పోవడానికైనా ఇష్టమే. ఇకఆమెతో కలిపి వాళ్ళ వూరువెళ్ళి. వాళ్ళ ఇంట ఆమె సాన్నిధ్యంలోవుండి చదువుకోవడంలో ఒక ప్రత్యేక ఇష్టం తట్టసాగింది. ఒక్క ప్రశ్నమాత్రం ఆమెను వేయగలిగాను. “మీవూరులో మొగలిపూలున్నాయా?” “ఓ కావలసినన్ని” అని ఆమె సమాధానం చెప్పి నా ముఖంవైపు చూచి చిరునవ్వు నవ్వసాగింది. ఆమె నవ్వులోకూడా నాకేదో ఆకర్షణ, ఆత్మీయత తట్టసాగాయి.

బస్సు బెజవాడ వచ్చి ఆగింది. అందరం దిగాము. ఆమె తన సామానును దింపించి జట్కాలో పెట్టించుకొని “వస్తాను మరి” అంటూ నా మెడమీద చేయి వేసి వెళ్ళిపోయింది. కోట్లోబాబు నా దగ్గరకువచ్చి ఎవరామె అని అడిగేడు. ఏమో నాకు తెలియదన్నాను.

ఆమె వెళ్ళిపోయిన తరువాత హృదయంలో ఏదో శూన్యత తట్టసాగింది. ఆమె అదృశ్యమైనందున జనించిన బెంగముందు తుమ్మపూడి వెళ్ళుతున్నాననే బెంగ చాలా తేలికగా తట్టసాగింది. ఆమె చిరునవ్వూ, మొగలిపూవాసనలూ, ఆమె మాటల మాధుర్యమూ మానసమందిరంలో ప్రత్యక్షం కాజొచ్చినాయి. అవే జ్ఞాపకాలతో రైలుస్టేషన్‌కు వచ్చాం మధ్యాహ్నం. స్టేషనులోని జనమంతా ఏదో తీరిక లేనట్టు ఎవరివారివారు వడివడిగా పోతున్నారు. ఇదంతా ఒక నూతన ప్రపంచం. నెత్తిమీద టోపీలతో నల్లవాళ్ళూ, తెల్లవాళ్ళూకూడా ఇంగ్లీషు మాట్లాడుతూ తిరుగుతున్నారు. ఇంత బాగా నేనెప్పుడు ఇంగ్లీషు మాట్లాడగలనా అని కుతూహలం వేసింది. రకరకాల ఆకృతులుగల రంగురంగుల వస్త్రాలు ధరించిన స్త్రీలు, పురుషులు, పిల్లలూ స్టేషన్ నిండా, రైళ్ళనిండా నిండిపోయి వున్నారు.

మా రైలు వచ్చి ఆగింది. మేము ఎక్కి కూర్చున్నాం. కృష్ణమీది వంతెన మీదుగా రైలుపోతుంటే వెనక రాత్రిపూట భయంవేసింది ఇప్పుడు పగలు సంతోషం వేసింది! రైలుకు ఎద్దులు కట్టరు, గుర్రాలు కట్టరు. కేవలం నిప్పు. నీరుతో నడచిపోతుంది మరి!

# మారిపోయిన జీవితం :
# కరగిపోయిన కలలు

నూతన ప్రదేశం, నూతన వ్యక్తులూ, నూతన వస్తువులూ, తుమ్మ పూడి అంతా నూతనంగానే తట్టసాగింది. నందిగామ తాలూకా కోనాయపాలెంలోని వ్యక్తుల స్వరూపాలకూ, స్వభావాలకూ, వేషభాషలకూ, తెనాలి తాలూకా తుమ్మ పూడిలోని వ్యక్తుల వాటికీ చాల తారతమ్యం గోచరించసాగింది. ఈ తార తమ్యం వ్యక్తుల విషయంలోనేకాక ప్రాకృతిక పరిసరాల విషయంలో కూడ వర్తిం చింది. అక్కడలాగా ఇక్కడ ప్రదేశం ఎత్తుగా, పల్లంగా లేక చిత్రిక పట్టిన చెక్కలాగా సమతలంగా వుంది. ఇక్కడ వాగులూ వంకలూ లేవు. ఊరు ఆను కొని బకింగ్‌హాం కాలువ ప్రవహిస్తూంది. అక్కడ మెట్ట పైరులు - ఇక్కడ మాగాణి పైరులూ, పళ్ళతోటలూ. అక్కడ పెంకుటిళ్ళు, మిద్దెలూ ఎక్కువ. ఇక్కడ మేడలూ, డాబాలూ ఎక్కువ. అక్కడి మనుషులు పల్లెటూరి మనుషు లుగా కనుపించితే ఇక్కడి మనుషులు బస్తీ మనుషులుగా కనిపించే వారు. అక్కడ ఇంగ్లీషు చదువులు తక్కువ, ఇక్కడ అవి ఎక్కువ. అక్కడివారు అపరిచితులను కూడా ఆప్యాయతతో పలుకరించేవారు. ఇక్కడివారు పరిచయంతో కూడా అంతగా మాటాడేవారుకారు.

ఇక్కడకు, అక్కడకూ మాటల్లోకూడ ఎంతో భేదం గోచరించేది. అక్కడ "పోవటం" అనే పదం అధికంగా వాడితే, ఇక్కడ "వెళ్ళటం" అనే పదం అధికంగా వాడేవాళ్ళు. అక్కడ "ఉరకటం" ఇక్కడ "పరుగెత్తటం", అక్కడ "బొంగుపేలాలు" ఇక్కడ "మరమరాలు"; అక్కడి "గెనుసుగడ్డలు", ఇక్కడ "చిలకడదుంపలు". ఈ విధంగా ఆ మెట్ట ప్రాంతానికీ ఈ మాగాణి ప్రాంతానికీ మాటల్లో కూడ ఎంతో మార్పు వుండేది. నామాటలు కొన్నిటిని ఇక్క డివారు వెక్కిరించేవారు. "బిడ్డ" అంటే ఆ ప్రాంతంలో ఆడసంతానం అని అర్థం. ఇక్కడ "కూతురు" అనేవారు. అక్కడ "మట్టిపెడ్డలు" అంటే ఇక్కడ "మట్టిగడ్డలు" అనేవారు. పొలాల్లో మొక్కలను కొట్టివేసే పరికరాన్ని అక్కడ "గుద్దలి" అంటే ఇక్కడ దాన్ని "గొద్దాలకం" అనేవారు. అక్కడ కడవను "బింగ" అనీ "వంటి" అనీ అనేవారు. దాన్ని ఇక్కడ "కడవ" అనేవారు. అక్కడి మాటలను మొరటు మాటల క్రింద లెక్కకట్టేవారు ఇక్కడివారు.

## కొత్త పరిసరాలు

ఈ నూతన పరిసరాలలో నా జీవన విధానం కూడా నూతనమార్గంలో నడవసాగింది. నిత్యజీవితంలో ఒక క్రమబద్ధత ప్రవేశించ ప్రారంభించింది. నాకు తెలియకుండానే అమ్మమ్మగారింట వున్న స్వేచ్ఛ ఇక్కడ సన్నగిలింది. అక్కడ నాకే అందరు భయపడేవారు; ఇక్కడ నేనే అందరికీ భయపడసాగాను. అక్కడ పరిస్థితులు నాకు లోబడి వుండేవి. ఇక్కడ పరిస్థితులకు నేనే లోబడి వుంటున్నాను. అక్కడ బయటనుంచి ఎంతరాత్రికి ఇంటికి వచ్చినా ఎవరూ ఏమీ అనేవారుకాదు. ఇక్కడ సూర్యాస్తమయానికి తరువాత ఇంటికి వస్తే అంతా అనేవారే. అక్కడ నాఇష్టం వచ్చిన స్నేహితులతో కలిసి తిరగవచ్చు, ఏచోటుకైనా; ఇక్కడ వీరి కిష్టమైన స్నేహితులతో మాత్రమే కొన్నిచోట్లలోనే తిరగాలి. వేళకు స్నానం, వేళకు భోజనం, వేళకు నిద్ర మొదలైన వాటన్నిటిని ఇక్కడ అనుసరించాల్సొచ్చేది. అక్కడ అనంత నీలాకాశం క్రింద నివసిస్తే, ఇక్కడ ఇంటి కప్పు క్రింద జీవించడం-ఒక్కమాటలో అక్కడిది స్వేచ్ఛా జీవనము, ఇక్కడిది బందీ జీవనం.

జీవనవిధానంలోని ఈ మార్పు నా మనోజగత్తుమీద తన ప్రభావాన్ని బలీయంగా వేయసాగింది. బాహ్య జీవితం బంధనాయుతం, అసంతృప్తిపూరితం అయినప్పుడు ఆంతరిక జీవితం కల్పనామయం అవుతుంది. వాస్తవవాదం వ్యతిరేకంగా కనిపిస్తుంటే ఆదర్శవాదంలో అనుకూలత జనిస్తుంది. భౌతిక జగత్తులో అందని ఆనందం భావజగత్తులో అందసాగుతుంది. ఈ విధంగా నిత్య వ్యావహారిక జీవితంలో లభించని చిత్త శాంతి కల్పనాత్మకమైన భావజగత్తులో లభించ సాగింది.

తుమ్మపూడిలో మా తండ్రి అన్నదమ్ములు ఆరుగురు. వీరందరిదీ సమష్టి కుటుంబం; పెద్ద వ్యవసాయం; తోటలూ, దొడ్లు పశువులూ, పశుశాలలూ, నౌకర్లూ, చాకర్లూ, వంటలూ, పిండివంటలూ మొదలైన వెన్నో వీరిదర్పంగల జీవితానికి చిహ్నాలు. వీరెవరూ తమ స్వంత సంతానాన్ని పలుకరించేవారుకారు. తండ్రికీ, పిల్లలకూ ఏ మాత్రమూ చనువుతో కూడిన సంబంధాలుండేవి కావు. ఒకరి సంతానాన్ని మరొకరు చనువుగా పలకరించేవారు. మా తండ్రిగారైన సూర్యదేవర రామదేవ్‌గారి ఎదుటగా నేను పోవటంకాని, నా ఎదుటకు ఆయన రావటంకాని వుండేదికాదు. నా వ్యవహారాలన్నీ మా పినతండ్రులు, పెద తం

ప్రేమ మాత్రమే చూచేవారు. మా రెండో పెద తండ్రి సంతానం లేకుండ చని పోయినందున ఆయన భార్యకు నన్ను దత్తు అని, నా మంచి చెడులన్నీ ఆమెయే చూస్తూండేలా నిర్ణయించారు. ఆమె పేరు రాజ్యలక్ష్మమ్మగారు. ఆమెను అమ్మా అని పిలిచేవాణ్ని, ఆమె నామీద గుర్రుచేసి గదమాయించేది. నా కళ్ళ వెంట నీరు వచ్చేది; అనుకునేవాణ్ణి-అమ్మ చనిపోయి ఈమె ఎందుకు బ్రతికున్నదా అని!

ఇక ఆ కుటుంబంలో ఇద్దరు వ్యక్తులు నాకు ఎక్కువ చనువు. వారిద్దరూ నన్నెంతో గారాబంగా చూచేవారు. ఒకరు మా సవతి తల్లి అయిన హనుమాయమ్మగారూ, రెండోవారు మా పినతండ్రిగారి భార్య రంగనాయకమ్మగారూ. ఇద్దరినీ కూడ పిన్ని అని పిలిచేవాణ్ణి. సవతితల్లి చాలా బోళామనిషి, నన్నెంతో ఆదరించేది. అప్పుడామెకొక సంవత్సరం వయసుగల అమ్మాయి వుండేది. ఆ అమ్మాయిని ఆడిస్తూ ఆనందించేవాణ్ణి. త్వరలోనే ఆ అమ్మాయి చనిపోయింది. అందుకు నేను చాలా చింతించాను.

ఇక ఈ కుటుంబం అంతటికీ అసలు ప్రభువుండేవారు మా పెదనాన్న చినవెంకటకృష్ణయ్యగారు. ఆయనకు ఒక ప్రత్యేకమైన మేడ. ఆయనకు సంతానం లేదు. అప్పటికి ఆయనది పెద్ద వయస్సు. మనిషి పండి పచ్చగా వుండేవారు. వాకిట్లో పడక కుర్చీలో ఆసీనులై వుండేవారు. ఆయనది రాచఠీవి. ఆయనకు అనుగ్రహంవచ్చినా, ఆగ్రహంవచ్చినా ఇతరులు భరించటం కష్టం. మంచిమాటకాని, చెడ్డమాటకాని ఆయనకు ఎదురు చెప్పకూడదు. ఆయనంటే మాకందరికీ ప్రేమా, భయమూ రెండూ వుండేవి. ఆయన ఎదుట మేము పెద్దగా పరుగెత్తితే గానీ, నెమ్మదిగా నడిస్తేగాని సహించేవారు కాదు. రెండూ తప్పు అనేవారు. నేనంటే ఆయనకు ప్రత్యేక శ్రద్ధ వుండేది. ఆయనకు ఎన్నో విషయాలు తెలుసు, ఎందరో మహావ్యక్తులు తెలుసు. వార్తాపత్రికలు మాత్రమేగాక, ఇతర మాసపత్రికలనూ, పుస్తకాలనుకూడా చదువుతుండేవారు. థియసాఫికల్ సొసైటీమీద ఆయనకు అభిమానం. అనిబిసెంటుమీద గౌరవం; జిడ్డు కృష్ణమూర్తిమీద అనురక్తి. దివ్యజ్ఞాన దీపిక అనే పత్రికను శ్రద్ధగా చదివేవారు.

నా సాంస్కృతిక జీవితంపైన పెదనాన్నగారి ప్రభావం ఎంతో పనిచేసింది. శాంతినికేతనంలోని రవీంద్రుని గురించి, కలకత్తాలోని జగదీశ చంద్రబోసును గురించి, పుదుచ్చేరిలోని అరవింద ఘోషుని గురించీ ఎన్నో విశేషాలు నన్ను దగ్గర కూర్చోబెట్టి చెప్పేవారు. హిమాలయాలను గురించి అందులో నివసిస్తున్నా

రని నమ్ముతూన్న మహాయోగుల గురించి చెబుతూండేవారు. ఆయన స్వయంగా యోగాభ్యాసం చేసేవారు.

ఒక సుముహూర్తాన మా మరో పెద్దతండ్రి కృష్ణదేవ్‌గారు నన్ను వెంట బెట్టుకు వెళ్ళి ఊరిబయట దగ్గరలోవున్న హైయర్ ఎలిమెంటరీ స్కూల్లో ఆరవ తరగతిలో చేర్పించారు. తల్లిలేని పిల్లవాడు కనుక ఎవరేమీ కోపపడవద్దు అంటు అందరితో చెప్పవచ్చారు. ఎంతకాలం క్రిందనో కోనాయపాలెంలో వదలివేసిన బడికి మళ్ళీ ఈ వూరులో పోవాలసివచ్చినందుకు చాలా భారంమే అనిపించింది. అయినా, విద్యలేకుండా వుండడం ఇష్టంలేదు. అయితే బడికిపోవడం అంతకంటే ఇష్టం లేదు. బడికి పోకుండా వుండాలి, విద్య రావాలి. ఈ రెంటికి ఎలా పొందిక? విద్య మీదా, బడిమీదా రెంటిమీదా విరక్తివుంటే ఫరవాలేదు. లేక విద్యమీదా, బడిమీదా రెంటిమీదా అనురక్తివున్నా పరవాలేదు. అంతేకాని ఒక దానిమీద ఆశక్తి, రెండవ దానిమీద అనాసక్తివుంటే పొసగటం కష్టం.

సరే, తప్పనిసరిఅయి బడికి వెళ్ళటం ప్రారంభించాను. పంతుళ్ళంతా ప్రేమగానే చూడసాగారు. ఇంగ్లీషూ, సైన్సూ ఎంతో ఇష్టమైన విషయాలు. లెక్కలంటే భయంగా వుండేది. ఆరవ తరగతి శాస్త్రవాచకం అట్ట లోపలి భాగంలోవున్న జగదీష చంద్రబోసు ఫోటోమీద మిక్కుటమైన ఆసక్తి. వృక్షాలలోని ప్రాణస్పందనను కనుగొన్నాడనేది ఆగూన పట్ల వున్న అభిమానాన్ని ఇనుమడింపచేసింది. నేనుకూడా వృక్షశాస్త్రజ్ఞుడను కావాలని, వృక్షాలతో మాట్లాడాలని ఏమో ఏమో ఆలోచనలు తలలెత్తసాగాయి. దానితో వృక్షాలను చూస్తే ఎక్కడలేని ప్రేమ. మొక్కలను, పొలాలను చూస్తూంటే ఎంతో ఆనందంగా వుండేది. చెట్టునుంచి ముఖం కనుక్కొనే పుల్లలు విరుస్తూకూడా చెట్టు ఎంతగా బాధపడుతుందోనని బాధపడే వాణ్ణి. చెట్టు దుఃఖిస్తున్నట్టు అనుభూతి చెందేవాణ్ణి.

## స్వేచ్ఛా జీవితానికై తహతహ

బడిని ఆనుకొనే మదరాసువెళ్ళే రైల్వేలైను. వీలున్నప్పుడల్లా బడినుంచి రైలుకట్టమీదెళ్ళి రైలుపట్టాలమీద నడిచేవాళ్ళం. రైలు పోతుంటే చూడడంలో ఒక సంతోషం. డ్రైవరూ, గార్డూ ఎంత అదృష్టవంతులో అనిపించేది. ఎక్కడా దిగకుండా రోజంతా స్వేచ్ఛగా రైలులో ప్రయాణం చేస్తారు. వాళ్ళకేమీ దిగులూ, చింతలూ, భయాలూ, బాధలూ వుండవు అనుకొనేవాణ్ణి. ఎక్కడా దిగిపోకుండా అంతులేని ప్రయాణం ఎంత హాయిగా వుంటుందో. జీవితమంతా ఒక ఎడతెగంపులేని

నిరంతర ప్రయాణం అయితే ఎంత ఆనందంగా వుంటుందో. బడినుంచి ఇంటికి కాని, ఇంటినుంచి బడికికాని పోయేపని వుండదు. ఇటువంటి నిరంతర ప్రయాణంలో. పెద్దల అనుజ్ఞలకూ, కోపతాపాలకూ గురికావలసిన అవసరంవుండదు, ఇటువంటి నిరంతర ప్రయాణంలో. ఇంటినుంచి బయటికి పోలేదనే బెంగకానీ, బయటనుంచి తగు సమయానికి ఇంటికి రాలేకపోయామే అనే బాధ వుండదు. ఇటువంటి నిరంతర ప్రయాణంలో. ఇంటికి తిరిగిరాని నిరంతర ప్రయాణంలో ఆనందమే ఆనందం. ఈ విధమయిన ఆలోచనలతో, పగటికలలతో రైలుపట్టాల మధ్యనిలచి సుమారు దిగంతాలవరకూ, రెండు రైలుపట్టాలూ ఒకటిగా కలసి కన పించేంతవరకూ చూచేవాణ్ని.

రైలు కట్టనుంచి మళ్ళీ బడిలోకి వస్తే పంతుళ్ళ గద్దింపులూ, పిల్లల అల్ల రులూ, పాఠాల పుస్తకాలూ, పుస్తకాలలోని పాఠాలూ, ఏమీ వ్రాయని తెల్ల కాగి తాలూ, ఏమేమో వ్రాసిన నోటుబుక్కులూ ప్రత్యక్షం. వీటి అన్నిటిలో మునిగి నిరంతర ప్రయాణానికి సంబంధించిన పగటి కలలు కరిగిపోయేవి. మళ్ళీ జగదీశ చంద్రబోసూ, ఆయన చెట్లు చేమలూ, వాటిలోని చైతన్యస్రవంతులూ గుర్తుకు వచ్చేవి. బడినుంచి సాయంత్రం ఇంటికి తిరిగివచ్చి స్నానంచేసి, భోజనంచేసి, పుస్తకాలుముందేసుకొని చదవడానికి కూర్చుంటే చదివేదేమిటో తలకెక్కేదికాదు. కోనాయపాలెపు జ్ఞాపకాలతో తలనిండిపోయేది. అక్కడి అమ్మమ్మ, కోట్లోబాబు, పెదతల్లులు, స్నేహితులు, చెట్లు, చెరువు, వాగులు ఎన్నో ఆప్యాయతతో ఆహ్వానిస్తూం డేవి. అక్కడగడచిన జీవితమంతా మధురంగా తట్టేది. గడచిన దృశ్యమంతా ఒక వెన్నెల రాత్రిలా తట్టేది. కొంతసేపటికి నిద్ర. నిద్రలో ఏవో దేవకన్యకల దేశా లలో సవ్యటన. దేవకన్యలతో స్నేహం.

మా మరో పెదనాన్న దగ్గర ఒక మాదిరిది ఒక తెలుగు లైబ్రరీ స్వంతం వుండేది. అందులో ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల ప్రకటించిన బెంగాలీ నవలలకు అనువాదా లుండేవి. పాఠ్య పుస్తకాలు చదవడానికంటె ఆ నవలలను ఎక్కువగా చదువుతుండేవాణ్ని. అయితే వీటి మూలంగా నేను పాఠాలలో ఎప్పుడూ వెనుక బడలేదు. అప్పటి ఆ అపరాధ పరిశోధక నవలలు చదువుతూంటే ఒకోచోట భయమూ, సంభ్రమమూ, కరుణా, కోపమూ అనేకం కలుగుతూండేవి. అవి చదువు తూన్నంతసేపు అవే నిజం అనిపించేవి. కొద్దిరోజులలో ఆయన దగ్గరున్న చాలా నవలలు చదివాను.

## పాఠ్యేతర గ్రంథాల పఠనం

నవలలు మాత్రమేకాక కొందరి జీవితాలనూ, స్వీయచరిత్రలను కూడా చదవసాగాను. వాటిలో నా జీవితంమీద శాశ్వత ముద్రను వేసిన పుస్తకం ఒకటుంది. అది మహర్షి దేవేంద్రనాథ ఠాగోర్ స్వీయచరిత్ర. నవలలు చదువుతున్నప్పటి ఆనందం వేరు. ఈ పుస్తకం చదువుతున్నప్పటి ఆనందం వేరు. నవల చదువుతూ ఇదంతా అబద్ధమనీ కల్పన మాత్రమే అనీ ఒక ప్రక్కన ప్రతిధ్వనించడం వింటూండడం జరిగేది. ఈ పుస్తకం చదువుతూంటే ప్రతి అక్షరమూ నిజమని పించేది. మహర్షి దేవేంద్రుని మార్మికవాదం అంతా హృదయాన్ని తన్మయం చేసేది. ఆయన చేసిన పర్యటనల వర్ణన, ప్రత్యేకించి హిమాలయ పర్యటనల చిత్రణ నన్నెంతో పరవశపరచింది.

ఈ విధంగా క్రమేణ పాఠ్యపుస్తకాల పఠనం సన్నగిల్లి ఇతర గ్రంథాల పఠనం పెరగసాగింది. ఇటువంటి వాటిన్నిటి సహాయంతో కోనాయపాలెపు బెంగను మరచిపోవ ప్రయత్నించేవాణ్ణి. ఇన్ని మానసిక చింతనల మధ్యలో నివసిస్తూ కూడా బడిలోని చదువులో ఏ మాత్రమూ వెనకపడేవాణ్ని కాదు. దీని అర్థం విద్యార్థులందరికంటే ప్రథమంగా వుండేవాణ్ని అనీ కాదు. ఇతర విద్యార్థుల కంటె ముందూ వుండేవాణ్ని కాదు, వెనకా వుండేవాణ్ణి కాదు. కాంపోజిషన్లు వ్రాయడంలో మాత్రం అందరికంటె ప్రథముడుగా వచ్చేవాణ్ని. ఆరవ తరగతిలో ఆ రోజులలో నాకంటె వయసులో పెద్దవాళ్ళుకూడా విద్యార్థులుండే వాళ్ళు.

# కొయ్యకండలకు శస్త్రచికిత్స : విజయవాడలో నా అనుభవాలు

పాఠశాలలో ఆరవ తరగతిలో ప్రవేశించి రెండు నెలలైనది. శరత్కాలం అంతరించి శీతాకాలం వస్తూంది. ఎండలోని సుఖమూ నీడలోని కష్టమూ తెలిపే కాలం ఇది. శీతాకాలం పోయి వేసవిలో ప్రవేశించేవరకు నీడలో సుఖమూ, ఎండలో కష్టమూ తట్టసాగుతాయి. ఒకే వస్తువు దేశకాలాల మార్పులమీద ఆధారపడి వివిధ గుణాలను చూపుతూవుంటుంది. పొగమంచుతో నిండిన శీతాకాలపు ప్రభాతాలు, సాయంసంధ్యలూ ఎంతో రహస్యమయంగా, ప్రేరణాత్మకంగా గోచరించాయి. సాగిపోయే దీర్ఘమైన నీలినీడలు ఎంతో మనోజ్ఞంగా అగుపించాయి.

అయితే, చలిని భరించడం కొందరికి బాధగా వుంటుంది. నాకు మాత్రం అందరి మాదిరి చలి చల్లగా తగిలినా కూడా ఆ చల్లదనంలో ఏదో సంతోషం తట్టేది. శీత ప్రభాతాలలో మంచుతో తడిసిన పచ్చికమీద చెప్పులు లేని పాదాలతో తిరుగుతూంటే ఆ చల్లదనం పాదాలగుండా కళ్ళల్లోకి ఆరోహించి కళ్ళు చల్లబడి వత్తు అనుభూతి చెందేవాడిని. శీతాకాలంలో ఇన్ని ఆనందాలున్నాకూడా అది అంత ఆరోగ్యమైన కాలం కాదని, జ్వరాలువచ్చే కాలమని అనేవారు. ఈ సత్యం ఇతరుల పట్ల ఏ విధంగా వర్తిస్తుందో నాకు తెలియదు కాని నాపట్ల మాత్రం యదార్థమై కూర్చుంది.

*

ఒక మధ్యాహ్నానంతరం మా ఆరవ తరగతి ఉపాధ్యాయుడు మాకు సైన్సు చెబుతున్నాడు. థర్మామీటరును ఏ విధంగా వాడి ఉష్ణోగ్రతను తెలుసుకోవాలి? అనేదాన్ని ప్రదర్శిస్తున్నాడు. నాకు పళ్ళువిరుపులూ, ఆవలింతలూ, కళ్ళవెంట వెన్నుపీకూ ప్రారంభమైనాయి. ఉపాధ్యాయుడు నా స్థితిని గమనించాడు; దగ్గరకు పిలిచి ముఖంమీద చేయివుంచి చూచి థర్మామీటర్‌ను నోటిలో వుంచి తీసి చూచి జ్వరం మాటరెండు డిగ్రీలున్నదని చెప్పి తన గొడుగు ఇచ్చి ఒక విద్యార్థి వెంట ఇంటికి పంపించాడు. అంతే, ఇక నా జీవితంలో చదువు నిమిత్తం బడికి వెళ్ళి ఎరుగను! ఆరవ తరగతే నా విద్యాభ్యాసంలో ఆఖరు తరగతి!!

ఇంటికివచ్చి పడక ఎక్కాను. శరీరం మాడిపోతున్నది. తలనొప్పి, కడుపులో వికారం మొదలైన నాకు ఇష్టంలేని బాధలన్నీ బయలుదేరాయి. తొమ్మిది సంవత్సరాల వయస్సులో కోనాయపాలెంలో ఇంత పెద్ద జ్వరం వచ్చింది. ఇప్పుడు

పన్నెండు సంవత్సరాల వయసులో తుమ్మపూడిలో తిరిగి అంత పెద్ద జ్వరం వచ్చింది. రాత్రింతా తపన, నిద్రలేదు. మా పెదతండ్రిగారి కుమారుడు సూర్యదేవర సంజీవరాయణంగారు మందులివ్వసాగారు. కాని, జ్వరం ముందడుగులోనే వుంది కాని వెనకడుగు వేయలేదు. మూడురోజులు చూచిన తరువాత బెజవాడ నుంచి మా కుటుంబ వైద్యులైన వెలిదండ్ల హనుమంతరావుగారిని తీసుకువచ్చారు. ఈ డాక్టరు గారు తరువాత గొప్ప దేశభక్తుడుగా మారి సత్యాగ్రహోద్యమాలలో జైలుకువెళ్ళి అక్కడ జైలు అధికార్ల యమయాతనలకు బలియై మరణించారు. ఆయన పేరుతోనే ఇప్పుడు బెజవాడలో వెలిదండ్ల హనుమంతరాయ గ్రంధాలయమూ, పార్కూ వెలసివున్నాయి.

డాక్టర్ వెలిదండ్ల హనుమంతరావుగారు ప్రత్యేక వ్యక్తిత్వం గలవారు. చక్కగా ఎర్రగా వుండేవారు. మీసాలుండేవి. ఖద్దరు ధోవతి, ఖద్దరు లాల్చీ, పైన అంచుల ఉత్తరీయమూ, చూడగానే విస్మయంగా గొప్ప బుద్ధి జీవిగా గోచరించారు. చాలా హాస్యప్రియుడు. నన్ను మంచంలో చూడగానే మందహాసంతో అన్నారు: "నిజంగా జ్వరమేనా? లేక స్కూల్ ఎగవేయడానికి ఇదొక నెపమా?" అంటూ నన్ను పరీక్షచేసి ఆయన కొంచెం గంభీరముద్ర దాల్చారు. గుండె చాలా బలహీనంగా వుందని, జ్వరం వెంటనే తగ్గదని చెప్పి వెళ్ళిపోయి మందులు పంపించారు. మళ్ళీ వచ్చి చూస్తామన్నారు. రంగురంగుల సీసాలలో రంగురంగుల మందులు. ఆ మందులు చూడడానికెంత మధురంగా కనుపించాయో త్రాగడానికంత చేదుగా వుండాయి. అయినా ఇష్టంతో త్రాగేవాణ్ణి. చుట్టూ వాళ్ళంతా మెచ్చుకునే వాళ్ళు. ఎంత చేదుమందునైనా సరే అబ్బాయి ఇట్టే గుటుక్కున త్రాగివేస్తాడు అని ప్రశంసించేవారు. వీళ్ళ ప్రశంస నిమిత్తం నా అసలు ఇష్టాన్ని దాచివేసి నా అయిష్టాన్ని ఇష్టంగా చూపడానికి నానా యాతనలు పడేవాణ్ణి. మానవుడు ఎక్కువభాగం కీర్తికోసమే జీవిస్తాడేమో! కాంతను కనకాన్ని వర్జించిన వారుకూడా కీర్తిని వర్జించజాలరు!

మంచంలో జ్వరంతో రోజులు గడుస్తున్నాయి. మంచంమంచి లేవడమనేదే లేదు. రోజటికి ఆహారం బార్లీ, గ్లూకోజులు తప్ప మరేమీలేదు. ఒకవైపునుంచి మరోవైపు కూడా పొర్లగలిగే శక్తికూడా లేదు. అన్నం తిని ఎన్నోనాళ్ళయింది. దాహం వేసినప్పుడు కోడా త్రాగితే వాంతి అయేది. డాక్టర్ వెలిదండ్ల హనుమంతరావుగారు వస్తూనే వున్నారు. మందులు మారుస్తున్నారు. ఒకరోజు ఆయన అన్నారు-

"అబ్బాయి కేదో మానసికంగా బాధవున్నట్టుంది. ఏదో తీగని రగులును లోపల దాచుకొన్నట్టున్నాడు" అని. ఆయన వాక్యాలలోని సత్యం నాకు బోధపడింది. కాని చుట్టూవున్నవారి కేమి బోధపడుతుంది కనుక? వారంతా నవ్వి ఊరుకున్నారు.

నెల రోజులకు నా జ్వరం తిరుగు ముఖం పట్టింది క్రిమేణ అన్నసాధ నతోపాటు మంచం దిగి రెండడుగులు వేయ ప్రారంభించాను. ఉదయం అన్నం, మధ్యాహ్నం పళ్ళరసం, సాయంత్రం రొట్టె, పాలు- ఈ విధంగా తింటూ ఇంట్లోకీ, బయటికీ తిరగసాగాను. ఒకరోజు బెజవాడనుంచి డాక్టర్ హనుమ త రావుగారు వచ్చి నన్ను మళ్ళీ పరీక్షచేసి రెండు మాసాలపాటు బెజవాడలోవుంటే చికిత్స పొందాలని, గుండె చాలా బలహీనంగా వుందని, టాన్సిలిటీస్ ఆపరేషన్ చేయాలని చెప్పి వెళ్ళారు.

## బెజవాడలో చికిత్స

నేనూ, పెంపుడుతల్లీ, ఇంకా ఒకరిద్దరం బెజవాడలో నివాసంపెట్టి హను మంతరావు గారివద్ద చికిత్స పొందసాగాము. డాక్టర్‌గారు నన్ను ఎప్పుడూ ఏదో అంటూ నవ్విస్తూండేవారు. ఒకసారి ముప్పయి సంవత్సరాల వయసుగల తమ నర్సును చూపి ఆమెను పెళ్ళిచేసుకుంటావా ? అని అడిగారు. నేను వెంటనే చేసు కుంటానని జవాబు చెప్పాను. అందుకు తిరిగి సమాధానం ఏమి చెప్పాలో తోచక "నీ పెళ్ళి ఇంకా వారం రోజు"లుంది అన్నారు. అంటే నా టాన్సిలిటీస్ ఆపరే షన్ అని అర్థం.

ఆస్పత్రిలో నివసించడం అదే మొదలు. ఆస్పత్రిలోని విశేషాలు చూడడానికి వేడుకగా వున్నా, ఆస్పత్రి నివాసం నాకెందుకో వచ్చలేదు. ఇంతమంది జనం ఇక్కడ ఎందుకుంటున్నారు? ఏమి చేస్తున్నారు ? అనే కుతూహలం జనిస్తూ వుండేది. తుమ్మపూడికీ, కోనాయపాలెంకు "ఊరిబయట" అంటూ వుందికాని ఈ ఆస్పత్రికి ఎటుచూచినా "ఊరిబయట" అనేది కనిపించదేమా అని ఆశ్చర్యపోయేవాణ్ణి.

నా టాన్సిలిటీస్ ఆపరేషను మత్తుఇచ్చి చేస్తామని చెప్పినందువల్ల నాకు భయంలేకుండా పోవడమేకాక మత్తు ఇస్తే ఏవిధంగా వుంటుందో చూడాలని కుతూ హలంకూడా ప్రబలమైంది. అప్పుడు ఈ ఆపరేషన్లు అంతవిరివిగా వాడుకలోకి రాలేదు. ఎక్కడో ఆడపాతడపా నిపుణులు మాత్రమే చేయగలుగుతున్నారు. డాక్టర్ హనుమంతరావుగారు ఇదివరలో వీటిని చేస్తుంటే చూడడమేకాని స్వయంగా

చేసిచూడలేదు. ప్రథమంగా నామీదనే ప్రయోగముచేసి చూడబోతున్నారు. ఆయన వెంట తోడు మరో డాక్టర్ కూడా వచ్చాడు.

ఉదయం పదిగంటల ప్రాంతంలో నన్ను ఆపరేషన్ గదిలోకి తీసుకువెళ్ళి బల్ల ఎక్కించి నా బట్టలన్నీ తీసివేశారు. నేను నవ్వుతూనే వున్నాను. ధైర్యంకల పిల్ల నాడు అని డాక్టర్లచేత ప్రశంస పొందాలని ఆకాంక్ష. పడుకోబెట్టి ముక్కుదగ్గర క్లోరోఫారంపెట్టి ఒకటీ, రెండూ అని చదవ మన్నారు. చదవసాగాను ఊపిరి సలపక బాధగావుంది ఒక్క నిమిషం. తరువాత సంగతి నాకు తెలియదు. నాకు తెలివి వచ్చేవరకు డాక్టరుగారు నా గొంతుదగ్గ మంచుగడ్డతో అదిమిపట్టి నా ముఖం పై చూచి వున్నారు. నేను చిన్న గొంతుతో "అయిందా ?" అన్నాను. అయింది అని మళ్ళీ నవ్వారు ఆయన.

నాకు తల తిరిగిపోతూంది. వాంతివచ్చేసింది. అచ్చగా రక్తం, పచ్చి రక్తం విస్తారంగా రక్తం నోటివెంట చాలా బయటికి వచ్చింది. కడుపులో వికారం అధిక మైంది. వాంతి అయే సంవేదన తగుతూండేది. మళ్ళీ కళ్ళుమూశాను. నన్ను గది లోకి తీసుకువెళ్ళారు. హనుమంతరావుగారి మామగారికి జబ్బుగావుంది. బందరు రమ్మని ఆయనకు టెలిగ్రాంవస్తే నన్ను మరో డాక్టర్కు అప్పగించి ఆయన బందరు వెళ్ళిపోయారు. నాకు వికారం ఎక్కువైనది. దానితో వాంతులు అధిక మయాయి. మంచం మీద పడుకోలేకపోతున్నాను ఆపరేషన్ సమయంలో కడుపు లోకి ప్రవహించిన రక్తమంతా వాంతి ద్వారా బయటికొస్తున్నది. ఈ స్థితి ఆ రాత్రికింకా ముదిరి చాలా గడబిడ చేసింది. హనుమంతరావుగారు బందరు నుండి తిరిగిరాలేదు. ఆయన అప్పగించి వెళ్ళిన డాక్టరే అతి శ్రమమీద నా పోయే ప్రాణాన్ని పోనీయకుండా ఆపివేశారు. తెల్లవారే సరికి అంతా మామూలు స్థితికి వచ్చింది. హనుమంతరావుగారు వచ్చిచూచి సంతోషించారు.

ఇంకా కొన్నాళ్ళు బెజవాడలోనే వున్నాం ఒక సాయంత్రం నేను, మరో అమ్మాయి కలిసి బందరు రోడ్డు దాటి బందరు కాలువ వద్దకుపోయినాం. అక్కడ దగ్గరలో ఏదో వంతెన కడుతున్నారు. ఆ వంతెనవద్దకు రాళ్ళను తీసుకుని వెళ్ళ డానికై తోపుడు ట్రాలీలను ఉపయోగిస్తున్నారు. రైలు పట్టాలలాంటి పట్టాలమీద. దాన్ని కొంతదూరం నెడితే మరికొంత దూరం దానంతటది అదే నడుస్తుంది. ఒక ఖాళీ ట్రాలీ అక్కడ [illegible]. దానిమీద ఎక్కి మేమునెట్టుకుంటూ పోతున్నాం. అంతలో దానికి సంబంధించిన ఎవరో ఒకరు వచ్చి మా ఇద్దరినీ చెంప

దెబ్బలు వేసి ట్రాలీ నుంచి క్రిందకు లాగి ముందుకు లాగి నెట్టివేశాడు. మేము అంతటితో అక్కడున్న కంకర రాళ్ళను ఆయన మీదకు విసరసాగాం. అవి తగిలి అతని తల చిట్లి రక్తం బయటకొచ్చింది. అంతటితో మాకు భయం వేసి ఇంటికి పరుగెత్తుకు వచ్చాం. ఈ విషయం ఎవరికీ చెప్పలేదు. పాపం అతని గాయం ఎలా వుందో చూస్తే బాగుండుననిపించింది. కాని, మళ్ళీ అటు వైపుకు పోతే మా తలలను గాయాలు చేసి పంపుతాడేమోనని అతడిని చూడదలచలేదు.

## బుద్ధ ప్రతిమ

బెజవాడలో మేము వుంటున్న ఇల్లు మ్యూజియానికి చాలా దగ్గర. వీలున్నప్పుడల్లా మ్యూజియంలోకిపోయి కాలం గడిపేవాణ్ని. ఆ మ్యూజియంలో బుద్ధ ప్రతిమలు నిలుచున్నవీ, కూర్చున్నవీ కొన్నివున్నాయి. నందిగామ తాలూకా అల్లూరులో దొరకిన నిలుచున్న బుద్ధ ప్రతిమ నన్నెంతగానో ఆకర్షించేది. బుద్ధుని గురించి, బౌద్ధమతాన్ని గురించి పుస్తకాల్లో చదివినందున బుద్ధుడు చాలా పరిచిత వ్యక్తిలా అనిపించేవాడు. బుద్ధ ప్రతిమలోని ఆ ప్రశాంత ముఖతేజస్సు, ఆ నిమీలిత లోచనాలూ, ఆ కారుణ్యభావమూ ఏదో లోకోత్తరానందాన్ని ప్రసాదించేవి. ఆ బుద్ధ ప్రతిమముందు నిలచి భావించేవాణ్ని : "ఆ నాడు మాయాదేవి గర్భాన లుంబినీ వనంలో జన్మించిన సిద్ధార్థుడు, రాజప్రసాదంనుంచి యశోధరనూ, రాహులుణ్ని వదలి వెళ్ళిన సిద్ధార్థుడు బోధివృక్షం కింద జ్ఞానోదయాన్ని పొంది బుద్ధుడైన ప్రబుద్ధుడు ఇక్కడ మ్యూజియంలో నాలుగు గోడలమధ్య శిలారూపంలో బందీగా నిలచి వున్నాడు." ఈ విధంగా ఏమేమో భావాలు జనించేవి ఆ ప్రతిమ ముందు నిలచినప్పుడు.

మా డాక్టర్ వెలిదండ్ల హనుమంతరావుగారి కొక గుర్రపు కోచ్ బండి వుండేది. బండితోలేవాడిని వెనకనిలుచోబెట్టి ఆయనగారే స్వయంగా ఆకోచ్‌బండిని తోలేవారు. ఒక సాయంత్రం నాకు బెజవాడ చూపిస్తాను రమ్మని ఆ బండిలో తన ప్రక్కన కూర్చోబెట్టుకొని తన రోగుల ఇళ్ళకు, ఇంకా ఇతర బజార్లకు త్రిప్పి చూపి తీసుకువచ్చారు. ఆయనకు, నాకు వున్న సంబంధం డాక్టరుకు, రోగికీ వున్న సంబంధాన్ని మించివుండేది.

## మంత్రిగారి ఉపన్యాసం

ఒకరోజు మ్యూజియం ఆవరణలో పందిళ్ళువేసి రంగుకాగితాల తోరణాలు కట్టి చాలా ఆర్భాటం చేశారు. ఆ సాయంత్రం ఆ ప్రాంతమంతా రకరకాల

కాయంతో నిండిపోయింది, పెద్ద సభ జరిగింది. అందులో మదరాసు ప్రభుత్వపు విద్యాశాఖమంత్రి సర్ ఎ. పి. పాత్రో ప్రసంగించారు. అసలు ఆయనకు సన్మానం చేసే నిమిత్తమే ఆ ఆర్భాటమంతా. ఆయన ఇంగ్లీషులో ఏమేమో గడగడ చెప్పేస్తున్నారు. మధ్యమధ్యలో జనులు కరతాళధ్వనులు చేస్తున్నారు. ఆయన ప్రసంగంలోని ఇంగ్లీషుపదం నాకొక్కటీ తెలియలేదు. ఉన్నత ప్రభుత్వోద్యోగిని చూడడం అదే ప్రథమం. ఆయనను చూచిన తరువాత నాకు తట్టిన కుతూహలం ఒక్కటే, ఆయన ఏమి చదివితే ఆయనను మంత్రిగా చేశారా అని. ఈ విషయం ఎవరిని అడిగితే తెలుస్తుందా అని ఆలోచించసాగాను. అక్కడెందరో దొర టోపీలవారు, దొరసాని టోపీలవారు, నూలువేసుకొని తలపాగలు ధరించినవారు, ధోవతికింద మేజోళ్ళు, బూట్లు వేసినవారు, కంటిజోడును కంటికే పెట్టుకొని కొందరుంటే కంటిజోడును చేతిలో పుచ్చుకొని కొందరున్నారు. అయితే, కాలిజోడును మాత్రం కాలికే వుంచుకొని అందరూ తిరిగారుకాని కాలిజోడును చేతిలో వుంచుకొని తిరిగే వ్యక్తి ఎవరూ కనుపించలేదు. ఇందరిలో ఎవరిని అడిగేది ఏమి చదివిన వారికి మంత్రి పదవి ఇస్తారని.

రెండవ రోజు డాక్టరుగారినే ఆ ప్రశ్న అడిగాను. ఆయన నవ్వి అన్నారు: "ఏమి నీకు మంత్రి పదవి కావాలని వున్నదా? ఎప్పటికీ అటువంటి హోదాల కోసం ఆశించబోకు. మంత్రి కావడానికి ప్రత్యేక చదువులు ఏమీ అవసరం లేదు. మంత్రులు కానివారు చదివే చదువే మంత్రులైనవారుకూడా చదివేది."

# అనురాగ, విరాగాల మధ్య జీవితయాత్ర

తుమ్మపూడిలో వసంతఋతువు ప్రవేశించి కొన్నిదినాలైంది. వసంత శోభనుగురించి కవులు వర్ణన చాలచోట్ల చదివాను. వారు వర్ణించిన శోభను ప్రకృతిలో కనుగొనాలని ప్రయత్నించాను. అంతగా కనిపించలేదు. వారు వర్ణించిన దృశ్యాలు నాకు ప్రకృతిలో కనుపించలేదు. నాకు ప్రకృతిలో కనుపించిన దృశ్యాలను వారు వర్ణించలేదు. అందుకని వారు వర్ణించినదంతా అసత్యంకాదు. అయితే వారు వర్ణించనిదికూడా అసత్యంకాదు. ఎవరిదృష్టి వారిది. మనుషులంతా బయటికి ఒక ప్రపంచంలో నివసిస్తున్నా కూడ లోపల మళ్ళీ ఎవరి స్వతంత్ర ప్రపంచంలో వారే నివసిస్తారు. మనిషి నివసిస్తున్న ప్రపంచం చాలా పెద్దది. కాని, మనిషిలో నివసిస్తున్న ప్రపంచం ఇంకా ఎక్కువ పెద్దది.

ఎండలు బాగా ముదురుతున్నాయి. కోయిల కూతలు వినిపిస్తున్నాయి. మల్లెల వాసనలు గుబాళిస్తున్నాయి. పచ్చి మామిడి కాయల పప్పూ, పచ్చళ్ళూకూడా రుచిగా తగులుతున్నాయి. బెజవాడలో ఆపరేషన్ పూర్తిచేసుకొని ఆరోగ్యంగా తిరిగివచ్చినప్పటి నుంచి ఆకలి దప్పికలు బాగాతెలుస్తున్నాయి. తింటున్నాను. ఎండల్లో బయటికి పోనీయనందున ఇంటిలోనే తిరుగుతున్నాను. అనవసరమైన పుస్తకాలను అభిరుచితో చదువుతున్నాను. అవసరమైన పుస్తకాలను అంటుకోవడం లేదు. చలికాలంలో బడి వదలివేసిన తరువాత మళ్ళీ పాఠ్యపుస్తకాలు ముట్టలేదు. చదివిన పాఠాలకంటె మరచిపోయిన పాఠాలే ఎక్కువైనాయి.

పెద్దలకు, నాకూ కూడ ఒక్క విషయంలో అనుకూలత ఏర్పడ్డందుకు నాకు చాల సంతసమైంది. నాకు బడికి పోవాలని లేదు. వారికీ నన్ను బడికి పంపాలని లేదు. మా పెద్దనాన్నకు ఉద్యోగాలు చేయడం ఇష్టంలేదు. ఉద్యోగాలు అవసరం లేనప్పుడు ఉద్యోగాలకు పనికివచ్చే డిగ్రీల చదువులెందుకని ఆయన విశ్వాసం. ఇంగ్లీషు వ్రాయడం, చదవడం ప్రైవేటుగా నేర్చుకొని ఇంటిదగ్గర వుండే విద్యావ్యాసంగం చేయడం మంచిదని ఆయన తీర్మానించి ప్రకటించివేశారు. ఆయనగారి ఈ తీర్మానం నా కెంతగానో నచ్చింది. నేను అంగీకరించాను.

## గురువులతో మైత్రి

మా ఇంటి పెద్ద అరుగుల మీదనే వంగర సత్యనారాయణగారు అనే ఉపాధ్యాయులు కొందరు పిల్లలకు ప్రైవేటు పాఠశాల నడుపుతున్నారు. ఆయన బాగా

ఇంగ్లీషు చెప్పగలరని ప్రతీతి. మా ఉభయులకు స్నేహం కూడ వుండేది. ఇంకేం నా విద్యావిషయం సత్యనారాయణగారికి అప్పగించారు. మా ఉభయుల మధ్యా వయసులో చాల తారతమ్యం వున్నప్పటికీ ఆయన నన్ను తన శిష్యునిగాకాక మిత్రుని గానే చూడసాగారు.

బడిలోని మిగతా పిల్లలకు ఆయన అన్ని విషయాలలో పాఠాలు చెప్పేవారు. కాని నాకు చెప్పేది మాత్రం కేవలం ఇంగ్లీషు పాఠాలు మాత్రమే. కొందరికి మను చరిత్ర, ఆంధ్రనామ సంగ్రహం కూడ చెప్పేవారు. నాప్రక్కనే కూర్చున్న విద్యార్థి మనుచరిత్రలోని పద్యాలు చదువుతుంటె వాటిఅర్థం నాకుపూర్తిగా తెలియక పోయినాకూడా ఎంతో ఆహ్లాదాన్ని కలిగించేవి. "రహిమించు జంత్ర గాత్రముల రాల్ గరగించు విమల గాంధర్వంబు విద్య మాకు" అనే వరూధిని వాక్యాలు ఎంతో శ్రావ్యంగా తట్టేవి. ప్రవరునితో సిద్ధుడు తన దేశ సంచారాన్ని గురించి చెబుతూ "కాంచితి నందునందుగల చోద్యములెల్ల గనుంగొంటి నా వటీరాచల పశ్చిమాచలం హిమాచలం పూర్వదిశాచలంబుగన్" అనే మాటలుకూడ వినబుద్ధి అయ్యేది. ఆ విచిత్రమైన అచలాలను నేనెప్పుడు చూస్తానా అని ఉవ్విళ్ళూరేవాణ్ని. ప్రవరునికి కనుపించిన సిద్ధుడు ఇప్పుడు నాకుకూడా కనిపిస్తే ఆయననుంచి ఆ పాద లేపనం తీసుకొని దాని సహాయంతో ఎన్నెన్నో పర్వతాలను, జలపాతాలను, నదులను, లోయలను, అరణ్యాలను, సముద్రాలను, ఎడారులను, ద్వీపాలను, ఎన్నిటినో చూచిరావాలనిపించేది.

నా ఇంగ్లీషు చదువు బాగానే సాగిపోతూంది. ఇంగ్లీషు వ్యాకరణంలోని విచిత్ర ప్రయోగాలలో కూడా శ్రద్ధ జనించింది. ఉపాధ్యాయుల దగ్గర ఎక్కువ కాలం చదవడంలో కంటె ఆయనతో కబుర్లు చెప్పడం. ఆయననుంచి కబుర్లు విన డంతోనే గడిచేది.

## మధుర స్మృతులు

నేను చదువుకుంటున్న సమయాన ఊళ్ళోని ముగ్గురు నలుగురు ఆడపిల్లలు కూడ చదువుకొంటూండేవారు. వాళ్ళ జడల్లో ఒకరోజు మొగలిరేకులు పెట్టుకు వచ్చారు. ఆ మొగలిరేకుల మధుర సుగంధం తగిలేవరకు కొన్నాళ్ళక్రితం బస్సులో నాప్రక్కన కూర్చొని ప్రయాణం చేసిన ఆపేరు తెలియని వనిత నన్ను తన ఇంటిమనిషి చదువుకోమని ఆహ్వానించిన వనిత, నందిగామ నుంచి బెజ వాడ వరకు నాకెంతో మానసికానందాన్ని కలిగించిన వనిత, జడలో మొగలి

రేకులు ముడుచుకున్న ఆ ఆనందమయ వనిత మనోచక్షువుల ముందు ప్రత్యక్షమైంది. విషాదము, ఆనందము రెండూ కలిగినాయి. ఆమె ఎక్కడ ఏమి చేస్తున్నదో ? ఆమె నా స్మృతిఫలకంపై రూపొందినట్టే ఆమె స్మృతిఫలకంపైనకూడా ఇన్నాళ్ళు నేను రూపొంది వుంటానా? మొగలిరేకుల వాసన తగలక పూర్వం ఆమెను నేను మరచిపోయాను. అంటే మొగలిరేకులు ఆమెను నాకు గుర్తుచేశాయి. మరి ఆమెకు నన్ను గుర్తుచేయటానికి ఏమి వస్తువులున్నాయి? నాస్మృతులు ఆమె దగ్గరకు పయనించి నన్ను ఆమెకు గుర్తుచేయాలిసిందే. అదేవిధంగా ఎన్నో ఆలోచనలు. ఇక ఆ తావిలో అక్కడ నిలవలేక అక్కడ నుంచి లేచి వెళ్ళిపోయాను. ఆ రోజంతా ఏదో వేదనాయుతంగానే తట్టింది.

ఈ నూతన విద్యాభ్యాసం కాలంతోపాటు చరచర ముందుకు సాగిపోతున్నది. వేసవి వర్షాలలోకి మారింది. నా వయస్సు మరో మైలు రాతిని దాటింది. పన్నెండు గడిచి పదమూడవ సంవత్సరము వచ్చింది. పంతులుగారి వయస్సంత వయసు వస్తే బాగుండునను కొనేవాణ్ణి!

బడి అరుగుల మీద కూర్చుని బజారులో ధారాపాతంగా కురిసే వర్షాన్ని, బజారులో ప్రవహించే నీటిని చూస్తుంటే చదువుకోవాలనిపించేది కాదు. పుస్తకం మూసి ఆ దృశ్యాన్ని ఏకాగ్రతతో చూస్తూ కూర్చునేవాణ్ణి. దూరంగా కప్పల అరుపులు వినిపించేవి. ముసురుపట్టి వర్షం కురుస్తుంటే రాత్రులలో ఆ కప్పల సంగీతం వింటూ, ఆ చల్లగాలులను పీలుస్తూంటే ఏదో వంటరితనం తట్టి నిద్ర పట్టేదికాదు. దుప్పటి కప్పుకుంటే చెమటపట్టేది. కప్పుకోకపోతే చలివేసేది. ఈ రెంటికి రాజీ కుదరాలంటే ఏమిచేయాలో తెలియక చలి వేసినపుడు కప్పుకోడం చెమటపట్టినపుడు తీసివేయడం!

## అమరక్తి; విరక్తి

ఒక వర్షంలేని సాయంత్రం నేను మా పెదనాన్నగారితో మాట్లాడుతూ, బజారు అరుగుమీద కూర్చునివుండగా కాషాయ బట్టలు కట్టుకొన్న నలుగురు సాధువులు ఉత్తర హిందూదేశంనుంచి దక్షిణ హిందూదేశం పోతూ వచ్చి ఆగి సదావర్తి అడిగారు. వారికి తెలుగురాదు, మా నాన్నకు హిందీరాదు. ఆ స్థితిలో నేను బాల్యంలో అభ్యసించిన ఉర్దూ ఎంతో ఉపయోగించింది. వారికి బియ్యం, పప్పు, నేయీ, కూరగాయలూ ఇప్పించితే ఆ రాత్రి వారు వంటచేసుకొని భోజనాలుచేసి,

తెల్లవారి వెళ్ళిపోయారు. వారితో ఉర్దూ మాట్లాడిన రోజునుంచి మా పెదనాన్నకు నామీద అభిమానం వృద్ధిపొందింది. ఆయనకు నామీద అభిమానం వృద్ధిపొందితే నాకూ ఆ ఉత్తరదేశపు సాధువులమీద అభిమానం వృదిపొందసాగింది.

ఆ సాధువుల సంచార జీవితంపైన, వారు ధరించిన కాషాయవస్త్రాలమీద అనురక్తి ముదరసాగింది. కాషాయ వస్త్రాలమీద అనురక్తి అంటే ప్రపంచంమీద విరక్తి అన్నమాటే. ఒకదానిపై అనురక్తిలో ఆనందంవుంది కాని రెండవదానిపై విరక్తిలో ఆనందం వుందా? రెంటిపైనా విరక్తి లేకుండా రెంటిపైనా అనురక్తి వుంటే జీవితం రక్తి కట్టదా? కాషాయ వస్త్రాలమీద అనురాగం ఇల్లూ వాకిలి మీద, ఆత్మీయులమీద, అగుపించే జగత్తంతటిమీద విరాగానికి చిహ్నమా!

దేనిమీద అనురాగమో, దేనిమీద విరాగమో, ఏదిఏమైనా ఆ ఉత్తరదేశపు సాధువుల జీవితం నాకు బాగా నచ్చింది. నేనూ అటువంటి జీవితాన్నే గడపాలి. ఇప్పుడే వారి విధంగా తయారుకావాలా లేక ఇంకా ముందా? వారు నాఅంత చిన్న వారుకారుగా! అందుకని నేను వారంత పెద్దవాణ్ణి అయినప్పుడు వారి విధానాన్ని అవలంబిస్తాను, అనే నిర్ణయానికి వచ్చిన తరువాత అప్పటికప్పుడు వారివలె కావాలన్న వాంఛ సమసిపోయింది.

బుద్ధుడు స్మృతిలోకి వచ్చాడు. బుద్ధుడు సర్వసంగపరిత్యాగం చేశాడట. అంటే ఈ ఉత్తరదేశపు సాధువులవలెనే కాషాయవస్త్రాలు ధరించి తిరిగేవాడు కాబోలు. బుద్ధునికి భార్యా, పిల్లవాడూ వున్నారు కనుక వారిని వదిలేశాడు. మరి వారు నాకు లేరుగా; నే నెవరిని వదిలేసేది? ఇక్కడ వున్నవారిని, కోనాయపాలెంలో వున్నవారిని, అందరిని వదిలేయాలేమో. ఇక్కడున్నవారిని సులభంగా వదలగలను కాని కోనాయపాలెంలో వున్నవారిని మాత్రం అంత సులభంగా వదలలేను. వదలలేకపోవడం ఏమిటి, దాదాపు పదినెలలనుంచి వారిని కోనాయపాలెంలో వదలి నేను ఈ తుమ్మపూడిలో వుండడం లేదూ? పదినెలలు వదలగలిగినవాణ్ని పది ఏళ్ళు వదలలేనా? పది ఏళ్ళు వదలగలిగినవాణ్ని పది పదులఏళ్ళు మాత్రం ఎందుకు వదలలేను. అమ్మ తొమ్మిదిఏళ్ళక్రిందట నన్ను వదలి వెళ్ళలేదూ? ఏమైనప్పటికీ అందరినీ పరిత్యజించే మార్గమే సుఖవంతమైంది అని తేల్చుకొన్నాను.

ఈ విషయాలన్నీ మా ఉపాధ్యాయునితో చర్చించాను. ఆయనకు ఎప్పుడో పెళ్ళిఅయి క్రొత్తగా కాపురానికివచ్చిన భార్యవుంది. ఈ దృక్పథంతో ఆయన ఏకీభవించలేదు. నా ఆలోచనలను ఆయన తీవ్రంగ వమర్శించాడు, విరక్తిమార్గం పిరికి

వాళ్ళని అన్నాడు. వారు సాధించగలిగింది ప్రపంచంలో వుంటూనే, భార్యా బిడ్డలతో కాపురం చేస్తూనే సాధించవచ్చు అన్నాడు ఆయన. కాని కాషాయ వస్త్రాలమీద వున్ననా మోజుకు ఆ మాటలు నచ్చలేదు. ఆయనఎదుట ఇటువంటి చర్చ మళ్ళీ ఎప్పుడూ తేలేదు. ఇదివరలో వచ్చిన ఉత్తరదేశపు సాధువులు వంటి వారు మళ్ళీ అప్పుడప్పుడు రాసాగారు.

## పంజాబీ యువకుడు

ఒక రోజు మధ్యాహ్నం మేమంతా అరుగులమీద కూర్చొని వున్నాం. మధ్యాంబాటు ఎండ మసక మసకగా వుంది. తూర్పువైపు నుంచి ఒక ముప్పయి సంవత్సరాల వయసుగల యువకుడు మాసిన ఫ్లానల్ చొక్కా అంతకంటె మాసిన అంచులులేని ధోవతి ధరించివచ్చి మా ముందు ఆగిపోయినాడు. శరీరచ్ఛాయ మంచి పసిమిగా వున్నది. కోల ముఖమూ, పెద్ద కళ్ళు, పొడవైన ముక్కుతో సురమ్యంగా వున్నాడు. నవ్వని ముంగురులు కళ్ళ మీద పడుతున్నాయి. చెమట తుడుచుకుంటూ మాలో కూర్చున్న మా పెదనాన్నగారికి నమస్కరించి మా దగ్గరకు వచ్చి ఆసీనుడైనాడు. హిందీలోను, ఇంగ్లీషులోను మాట్లాడసాగాడు.

తనది పంజాబ్ అని, తన పేరు హర్బన్‌లాల్ అని, చాలా విపత్తులో చిక్కుకొని ఈ దక్షిణ ప్రాంతానికి రావలసివచ్చిందని, తన కథంతా తీరికగా చెబుతానని, కొంత కాలంపాటు మాయింటిలో తనకు ఆశ్రయమిమ్మని అడిగాడు. నేను హర్బన్‌లాల్‌తో ఉర్దూలో మాట్లాడేవాణ్ణి. మా ఉపాధ్యాయులు ఇంగ్లీషులో మాట్లాడేవారు. మా పెదనాన్న గారు ఆయన కోరికను మన్నించి ఆయన ఇష్టం వచ్చినంత కాలం మా ఇంట అతిథిగా వుండమన్నారు. హర్బన్‌లాల్ అందుకు ఎంతో సంతోషం వెలిబుచ్చాడు. ఆ రోజు మొదలు హర్బన్‌లాల్ మా ఇంటిలోని వ్యక్తి అయిపోయినాడు. నేను ఇక ఎల్లప్పుడూ ఆయనతోనే గడిపేవాణ్ణి. ఆయన మంచి ఇంగ్లీషు మాట్లాడేవాడు. నేను కూడా ఉర్దూకు బదులు ఆయనతో కొద్ది కొద్దిగా ఇంగ్లీషు మాట్లాడేవాణ్ణి.

హర్బన్‌లాల్ తన చరిత్రనంతా ఒక రోజు తీరిగా తెలియజేశాడు. తాను పంజాబ్ విశ్వ విద్యాలయ పట్టభద్రుడట. సంస్కృతంకూడా చదివాడట. టెర్రరిస్టు ఉద్యమంలో పాల్గొని పోలీసులకు పటుబడకుండా ఇటు పారిపోయి వచ్చాడట. ఇక్కడ కొంత కాలం తల దాచుకోవాలని. ఆ ప్రక్క గ్రామంలో తుమ్మపూడి పొమ్మని, అక్కడ పెలానివారింట ఆశ్రయమిస్తారని చెప్పారట. అందుకని ఇటు వచ్చాడట. వెంట మరో చొక్కా కాని, ధోవతికాని లేనందున మా పెదనాన్న నాలుగు చొక్కాలు, నాలుగు ధోవతులను కొని ఇచ్చాడాయనకు. మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్య మధ్య ఉపనిషత్తులమంచి సంస్కృత శ్లోకాలు చదివేవాడు.

మేమిద్దరమూ ఉదయాన్నే లేచి కాలువకు స్నానానికి వెళ్ళేవాళ్ళం. ఆయన నీటిలో చాలాసేపు ఈత యీదేసేవాడు. నాకు కూడా కొద్దిగా ఈదడం వచ్చింది. ఆయన ఈదుతూ ఈదుతూ పాడేవాడు, "అఖర్వ సర్వమంగలా కలా కదంబమంజరీ రస ప్రవాహ మాధురీ ప్రవిజృమాన మాధవం సమరాంతకం పురాంతకం భవాంతకం" అంటూ ఇంకేమేమో పాడేవాడు. ఈ శబ్దాలన్నీ నా చెవులకు భయంకరంగా వినిపించేవి.

## బాంబుల తయారీ

ఒక రాత్రి హర్బన్‌లాల్ బాంబులు చేసే పద్ధతిని, వాటిని ప్రయోగించే పద్ధతిని ఏ సమయానికి అవి ప్రేలాలంటే ఆ సమయానికి ప్రేలేలాగా చేసే పద్ధతి ఇవన్నీ చెప్పి భారతదేశానికి స్వాతంత్ర్యం గాంధీగారి సత్యాహింసలతో లభ్యం కాదని, హింసావాదులైన తెల్ల ప్రభుత్వాన్ని హింస ద్వారానే ఓడించాలని చెప్పుకు వచ్చారు. అదంతా సమంజసంగానే తట్టింది నాకు. దేశదాస్యాన్ని రూపుమాపడానికి ఉరికంబాలెక్కిన టెర్రరిస్టు యోధులు మహావీరులుగా తట్టారు. వారందరిలోకి ఖుదీరాంబోసు తన పదహారవ ఏటనే ఉరికంబాన్ని ఆరోహించాడు. కాషాయవస్త్రాల సాధువులకంటె ఇటువంటి ఆత్మబలిదానం చేసిన అమరవీరులే ఎక్కువ మహావీరులనిపించారు. అటువంటి సదవకాశం ఎప్పుడు లభిస్తుందా, ఎప్పుడు ఆవిధంగా ఆత్మత్యాగం చేద్దామా అనే ఆవేదన ప్రారంభమైంది. హర్బన్‌లాల్‌ను అడిగాను నన్ను కూడ టెర్రరిస్టు ఉద్యమంలో చేర్చుకోమని, మనం ఇక్కడినుంచి ఈ తెల్లవారుజామునే చెప్పకుండా ఆ ఉద్యమంలోకి వెళ్ళిపోదామని, కాని ఆయన అంగీకరించలేదు ఇది తరుణం కాదని. అటువంటి తరుణం వచ్చినప్పుడు నన్ను తప్పక ఆ ఉద్యమంలోకి పిలిపిస్తానని అన్నాడు. కాని నాకు సంతృప్తి కలిగించలేదు.

ఆ రాత్రంతా నిద్ర రాలేదు. ఏమేమో ఊహాచిత్రాలను సృష్టించుకొంటూ కాలం గడిపాను. ఏవో రసాయన ద్రవ్యాలు తెచ్చి బాంబు తయారుచేసినట్టు, దాన్ని ఒక తెల్ల గవర్నర్ మీద విసిరినట్టు, అది బ్రహ్మాండమైన ధ్వనితో ప్రేలి ఆ వ్యక్తి మరణించినట్టు, నన్ను వెంటనే అరెస్టు చేసి ఉరికంబం ఎక్కించినట్టు, వేలాది దేశప్రజలు చూస్తూండగా నేను సంతోషంగా ఉరికంబం ఎక్కినట్టు. ఈ విధంగా ఎన్నెన్నో ఊహాచిత్రాలు రూపొందసాగి చివరకు తెల్లవారుతుండగా నిద్ర పట్టింది. హర్బన్‌లాల్ కొన్నాళ్ళకు మదరాసు దాటి ఇంకా దక్షిణంగా వెళ్ళాలని చెప్పి నా దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

# నెల్లూరు నెరజాణలు : మద్రాసు ముచ్చట్లు

హార్బన్‌లాల్ సహవాసం విశాల జగత్తువైపుకు నా కన్నులను తెరిపించింది. ఎన్నో తెలియని విషయాలను తెలిపింది. తెలిసిన విషయాలను స్థిరపరచింది. తెలుసుకోదగిన విషయాలు ఇంకా అనంతంగా వున్నవనే విశ్వాసాన్ని సృష్టించింది. ఆయన స్నేహం నాకు విజ్ఞానాన్ని ప్రసాదించింది, వినోదాన్ని ఇచ్చింది; ఇంకా ఇచ్చింది నిర్భయాన్ని, ఆత్మసమర్పణ శక్తిని. ఆయన వెళ్ళిపోవడంతో నాకేదో ఒంటరితనం, హృదయంలో శూన్యత, జీవితంలో వైరాగ్యం తలెత్తసాగాయి.

ఇంగ్లీషు చదువు పూర్తిచేసినట్లే, ఇక ఉపాధ్యాయుల వద్ద పాఠాలు చెప్పుకొనడం మానివేశాను. ఇంగ్లీషు వ్రాయడం, చదవడం కొంతవరకు వచ్చినట్టే. నిత్యం ఇంగ్లీషు దినపత్రిక "హిందూ" చదవ ప్రయత్నించేవాడిని. ప్రథమంలో కొన్నాళ్ళు ఏమీ అర్థమయ్యేవి కావు. కాని, క్రమేణ నిఘంటువు సహాయంతో నూతన పదాల అర్థాలు తెలుసుకొంటూ పత్రికను చదివి కొంతవరకు అర్థం చేసుకొనేవాణ్ణి. "డిస్క్రిమినేషన్, ఇన్‌స్పిరేషన్" లాంటి పదాలు చెవులకు ఎంతో ఇంపుగా తట్టి హృదయానికి ఆనందమిచ్చేవి.

డిశంబరు వచ్చింది. అడయారులో దివ్యజ్ఞాన మహాసభలు జరుగుతాయి. మా పెదనాన్న నన్ను మదరాసుకు తనవెంట తీసుకువెళ్ళడానికి సిద్ధమయ్యారు. నిత్యం మదరాసునుంచి 'హిందూ' పత్రిక వస్తుంది. ఆ పత్రికను మాత్రమే చూడడం జరుగుతున్నది కాని, ఆ పత్రిక బయలుదేరే నగరాన్ని చూడడం జరగలేదు. ఈ పత్రికలోనే ఇన్ని విశేషాలుంటాయి గదా, ఇక ఈ పత్రిక పుట్టే నగరంలో ఎన్ని విశేషాలుంటాయో అనిపించింది.

పెదనాన్న నిర్ణయం నాకు అమితానందాన్ని కలిగించింది. మదరాసు ప్రయాణం నిమిత్తం నాకు సిల్కుకోటు, సిల్కులాగులు కుట్టించారు. ఒకనాటి రాత్రి బండిలో మా స్టేషన్ నుంచి మదరాసుకు బయలుదేరాము. ఇక్కడ నుంచి మదరాసు వరకు ఎన్ని స్టేషను లుంటవో లిస్టువ్రాయ ప్రారంభించాను. మా ప్యాసింజరు బండి ప్రతి చిన్న స్టేషన్‌లో కూడా ఆగుతూపోయింది. రైలులో ఇంత దూరం ప్రయాణం చేయడం ఇదే ప్రథమం. నాతోటి ప్రయాణికులు ప్రక్క స్టేషనులలో దిగిపోతూంటే చూచి నేను దిగనవసరం లేదు గదా అని ఎంతో సంతోషం వేసి ఆ దిగిపోయేవారివైపు గర్వంగా చూచేవాణ్ణి. ఆ రాత్రి నిద్రపోలేదు.

## నెల్లూరు నెరజాణలు

నెల్లూరు నెరజాణల కథలు వినివున్నందువల్ల నెల్లూరు చూడాలని చాలా కుతూహలంగా వుండేది. అదీకాక, మదరాసుకు ఇవతలవున్న దక్షిణాంధ్రలో నెల్లూరుపేరే నాకు బాగాతెలుసు. అందువల్ల నెల్లూరు స్టేషన్ వచ్చేవరకు ప్రత్యేక శ్రద్ధతో కిటికీలోనుంచి పరిశీలించి చూశాను. స్టేషన్ చాలా పల్లంలోవుంది. నెల్లూరు పేరు కున్నంత ఆకర్షణ నెల్లూరు స్టేషన్ చూస్తే కనిపించదు. ఆ రాత్రి పూట నగరం సరిగా కనిపించలేదు. సరే ఏనాటికయినా ఇక్కడ దిగి నగరంలోకి పోయి నెల్లూరు నెరజాణలెల్లా వుంటారో చూడకపోతానా? వారిని ఏమైనా పలకరించి వారి చమత్కారాలు వినలేకపోతానా? అని ఆశావాదాన్ని సృష్టించుకొని సంతృప్తిచెందాను.

గూడూరులో తెల్లవారుతుండగా ఇడ్లీ ఉప్మా తిన్నాను. ఉప్మాలో నిమ్మరసం పిండనందున అంతగా రుచించలేదు. గూడూరు ప్లాట్‌ఫారం మీద స్త్రీలు, పురుషులు కూడా చాలమంది బోడితలలవారు కనిపించారు. ఏడుకొండల దైవానికి జుట్టు ఇచ్చి వస్తున్నారు. దేవునికి మనుష్యుల జుట్టుమీద అంత ప్రీతి ఎందుకా? అని ఆశ్చర్యపోయాను: పురుషుల బోడితలలు చూడడాని కంతగా వికారంగా లేవుగాని స్త్రీల బోడితలలను మాత్రం చూడడానికి ఎంతో వికారంగా వున్నాయి. ఈ ఏడుకొండలస్వామి పురుషుని జుట్టు తీసుకొంటే తీసుకొన్నాడుకాని కనీసం స్త్రీల జుట్టయినా స్వీకరించకుండా వుంటె స్త్రీ సమాజానికి తద్వారా పురుష సమాజానికి ఎంత మేలుచేసేవాడో!

భర్తలు మరణించిన విధవలకు మాత్రమే కొన్ని హైందవ కుటుంబాలలో జుట్టు తీసే ఆచారంవుండేకాని భర్తలున్నవాళ్ళ జుట్టుకూడా ఈ వేంకటేశ్వర స్వామి తీసివేయిస్తున్నాడు. మల్లె. మందార, కదంబ, కనకాంబర, చేమంతి, దవనం, మరువం మొదలైనవన్నీ ఈ జుట్టులేని స్త్రీలను చూచి దాదాపు రెండు సంవత్సరాల పాటు ఎంతగా దుఃఖిస్తవో తాము వారి తలలను అలంకరించలేకపోతున్నాము కదా అని! అయినా, నేనెవరిని కనుక ఈ విషయాన్ని గురించి ఆలోచించడానికి? నేను వద్దు అంటే జుట్టు ఇచ్చే స్త్రీలూ మానుకోరు, స్వీకరించే స్వామీ మానుకోడు. పైగా భక్తులందరికీ నామీద కోపంకూడా వస్తుంది. మానవుల కోపాన్ని అందులోను స్త్రీల కోపాన్ని, ఏదో విధంగా కొంతవరకు భరించవచ్చుకాని ఏడుకొండల స్వామి కోపాన్ని భరించడం ఎంత విపత్తుతో కూడిన

వనోమరి : అయినా ఎవరి ఇష్టం వారిది, ఎవరి విశ్వాసం వారిది. ఒకరి ఇష్టం మరొకరికి కష్టంగా తట్టవచ్చు: ఒకరి విశ్వాసం ఇంకొకరికి అంధ విశ్వాసంగా తట్టవచ్చు!

ఇక్కడనుంచి అరవ మాటలు వినిపించడంకూడా ప్రారంభమైనాయి. మా కంపార్టుమెంటులో ఎక్కిన ఇద్దరు అరవవారు తమలో తాము అరవంలో మాటాడు కొంటూ, మాతో తెలుగులో మాట్లాడేవారు. వారిద్దరు అరవ వారువలె గోచీలేని గూడకట్టులను కాక పింజెగోచీలు పెట్టి పెద్ద అంచుగల ధోవతులను ధరించి వున్నారు. చొక్కాలను ధోతీల లోపటికి వేశారు. పైన కోటువేసుకొని నెక్ టైకూడా కట్టుకొని వున్నారు. నెత్తిన మడతలు చెదరని ఉన్ని తెల్లని తలపాగలున్నాయి. వారు అరవమూ, తెలుగూ రెండూ మాట్లాడుతున్నారు. కాని మేముమాత్రం ఒక్క తెలుగే మటాడుతున్నాం. నాకు అరవం రానందుకు విచారించాను. అయితే, వారికి ఉర్దూరాదుగా అనే సంతృప్తి జనించింది. వారికికూడా మూడుభాషలు తెలుసు. నాకూ మూడుభాషలు తెలుసు. ఇంగ్లీషు, తెలుగూ, అరవమూ వారికి తెలిస్తే ఇంగ్లీషూ, తెలుగూ, ఉర్దూ నాకు తెలుసు. ఈ ఆలోచన తట్టేవరకు నాకు ధైర్యం తిరిగి వచ్చింది.

## "దేశంలో ఒకే భాష : రైలులో ఒకే క్లాసు"

అనిపించింది, ఎందుకో దేశంలో ఇన్ని భాషలు? ఒకభాషవుంటేచాలదుకాబోలు! దేశంలో ఇన్ని భాషలు, రైలులో ఇన్ని క్లాసులు! ఒక భాషా, ఒక క్లాసూ అయితే ఎంత బాగుంటుంది. అయితే, దేశంలో ఒకే మనిషి, రైలులో ఒకే ప్రయాణీకుడు కాదుగా. దేశంలో కోట్ల మనుషులు, రైళ్ళలో లక్షల ప్రయాణీకులు. అందుకే ఇన్ని భాషలూ, ఇన్ని క్లాసులేమో! వేషభాష లంటారు, మరివేషాని కాక భాషవేమో లేకభాషకాక వేషమో, ఇది సత్యం. తెలుగుభాష మాట్లాడేవాళ్ళ వేషం వేరుగావుంది. అరవభాషమాట్లాడేవాళ్ళ వేషంవేరుగావుంది. ఉర్దూభాష మాట్లాడే వాళ్ళ వేషం వేరుగావుంది ఆ వేషం వేస్తేనేగాని ఆ భాష మాట్లాడలేరా? వేషం మారినా భాష మారుతుందా? వేషాన్ని, భాషను పట్టి రైలులోని క్లాసులు కూడా మారతాయా? రైలు పరిగెత్తుతూ వుంది నా ఆలోచనల కంటె ముందే. దూరంగా ఎంతోనీరు దిగంతాల కామకొని కనిపిస్తూంది. అవి సముద్రపు పాయలని తెలిసింది. చాలాచోట్ల పొలాలకో మగవాళ్ళు ఎర్రని గోచీలు మాత్రమే పెట్టుకొని నల్లని దేహాలతో పనులు చేస్తున్నారు. దూరంగా నీటి మడు

గులు, వాటిచుట్టూ కొబ్బరి చెట్లు నిలిచివున్నాయి. ఆ కొబ్బరి చెట్ల మధ్య అక్కడక్కడ పూరిగుడిసెలు, గుడిసెల దగ్గర పూర్ణ నగ్నంగా పిల్లలు, అర్ధనగ్నంగా పెద్దలు. అక్కడక్కడ చిన్న పశువులు, ఆకాశంలో ఎక్కడైన పిట్టలూ.

మదరాసుదగ్గరకువస్తున్నకొద్ది ఉల్లాసం, ఉత్సాహం వేయసాగాయి. వీటికి తోడు ఏదో తెలియని సంకోచంకూడా కలగసాగింది. కొత్త వ్యక్తులను చూడబోతున్నప్పుడు సంతోషానికి తోడు సంకోచంకూడా కలగడం సహజం. లజ్జాస్వభావులకు కొత్త స్థలాలను చూడబోతున్నప్పుడు, కొత్త వస్తువులను అందుకోబోతున్నప్పుడు కొందరిలో ఇవి కలుగుతాయి.

అసలు కొత్తకూ పాతకూ భేదమేమిటి? దేన్ని కొత్త అంటామో, దేన్ని పాత అంటామో? పాత అనేది భూతకాలానికి చెందితే క్రొత్త అనేది భవిష్యత్కాలానికి చెందుతుంది. ఇక వర్తమానకాలంలో ఈ రెండు రకాల కొత్తదనాన్ని, పాతదనాన్నికూడాపోగొట్టుకొని తటస్థావస్థలోకి రూపాంతరం చెందుతాయి. చూడనంతవరకే కొత్తమనిషికాని, కొత్తస్థలంకాని, కొత్తవస్తుకాని కొత్తవిగా వుంటాయి. అంటేచూడబోతూన్నవన్నీ అదృశ్యభవిష్యత్తులోవుంటాయి. చూచేపనివర్తమానానికి చెందుతుంది. చూడడం అయిపోగానే వర్తమానం భూతకాలంలో ప్రవేశిస్తుంది. ఈ విధముగా ఒకే వస్తువు కనబడని భవిష్యత్తులో కొత్తదిగా వుండి, కనబడుతున్న వర్తమానంలో పాత, క్రొత్త కాని తటస్థ రూపం దాల్చి జ్ఞాపకంగా మాత్రమే కనిపించే భూతకాలంలోకి చొచ్చి పాతదై పోతుంది. మారిన మూడుకాలాలలో కూడా వస్తువు మారనే మారదు. మారేదల్లా కాలాన్ని గురించిన మన దృష్టి మాత్రమే. న్యాయానికి కాలంకూడా మారదు. ఒకేకాలం అఖండంగా ప్రవహిస్తూ వుంటుంది. దానికి మనమే మన ఉపయోగం నిమిత్తం భూతకాలమని, వర్తమానం, భవిష్యత్ అని పేర్లు పెట్టుకున్నాం. ఈ పేర్ల తెరలను తొలగిస్తే హద్దులులేని అనంత కాలం ప్రవహిస్తూవుంటుంది. అక్కడ పాత అని కొత్త అని భేదమే లేదు.

## పాతబడిపోయిన "కొత్త"

చూడనట్టి మదరాసు అంటే చూడక పూర్వం వున్న కొత్త మదరాసు చూడగానే పాత మదరాసుగా మారిపోయింది. ఎంత కాలం నుంచో చూస్తూన్న మదరాసు అనిపించింది. మదరాసు తప్ప మరొక మహానగరం చూడక పోయినందునేమో మదరాసు మహానగరంగా మాత్రమే కాక మంచి నగరంగా కూడా నాకు

వచ్చింది. విశాలమైన సెంట్రల్ స్టేషన్, గోడ్డుమీదనే రైలుపట్టాలు వంటి పట్టాల మీద పరుగిడుతున్న ట్రాంబళ్ళు, అందమైన మౌంటు రోడ్డు, అంతకంటె అందమైన హార్బరు, అంతకంటె ఇంకా ఎక్కువ అందమైన సముద్రపు బీచ్ మొదలైనవన్నీ అద్భుతంగా కనిపించసాగాయి. మదరాసులోని రెండుమాత్రం నాకు నచ్చలేదు. అక్కడి ప్రజలు, భోజనం. భోజనం ఎంత నీరసంగా వుండేదో ప్రజలు అంత నీరసంగా తట్టారు. అక్కడి ఇడ్లీ, ఉప్మా మాత్రం రుచిగా వున్నాయి. ఈ అన్నం, సాంబారుకు బదులు మరికొన్ని ఇడ్లీ, మరికొంత ఉప్మాతినివూరుకొంటే ఎంతో హాయిగా వుంటుందనిపించేది. కాని మా పెదనాన్న నేను అన్నం తినక పోతే కోపపడేవారు, ఆరోగ్యం చెడిపోతుందని.

మదరాసు నివాసం ఆనందంగా తడ్డసాగింది. మ్యూజియంలోని వివిధ శిల్పాలు, అనేక చచ్చిన జంతువుల కళేబరాలు, ఇంకా ఏమేమో రకరకాల వింతలు చూస్తే ఆనందసంభ్రమాలు కలిగాయి. పెద్ద పెద్ద చచ్చిన జంతువుల కళేబరాలను చూస్తూవుంటే ఆనందానికంటె భయమే ఎక్కువ వేసేది.

అయితే, "జూ" లో బ్రతికిన జంతువులను చూస్తూవుంటే మాత్రం భయం వేసేదికాదు. అందుకే కాబోలు, బ్రతికివుండగా మనుషులను ప్రేమిస్తారు కాని వారు చనిపోతే వారిశవాలను చూచి భయపడతారు. జూ లో నాకు అన్నిటి కంటే కోతులు బాగా నచ్చాయి. వాటిప్రవర్తన, వాటి కోతిచేష్టలు ఎంతో ప్రియంగా తట్టాయి. అవి ఉయ్యాలలూగడం, ఒకదాని పేలు మరొకటి చూడడం, గిచ్చడం గిల్లడం, కొరకడం, మనుషులవైపు చూచి పళ్ళికిలించి వెక్కిరించడం మొదలైనవన్నీ వినోదంగా తట్టాయి. నాకు కోతులు బాగా నచ్చినవని మా పెదనాన్నగారితో అంటే ఆయన అన్నారు : "నీవుకూడా కోతి చేష్టలే కనుక నీకవి అంతబాగా నచ్చినాయి" అని.

## మ ద్రా సు వి ం త లు

ఆడయారులోని దివ్యజ్ఞాన మహాసభలు ఇంకా ప్రారంభం కానందున మేము నగర విశేషాలను చూడడం ప్రారంభించాము. ఒక రోజు మేము మరి కొందరు కలిసి హార్బరు చూడడానికి వెళ్ళాం. ఏవో ఒకటి, రెండు స్టీమర్లు ఆగి వున్నాయి. వాటిలోకి చూడడానికి ఎక్కాము. ఇల్లులాగా, ఇంటిలోని ఎన్నో గదుల లాగా, కొన్ని అంతస్థుల మేడలాగా అద్భుతంగా వుంది, ఇల్లుకాదు; నిజానికి

అదొక ఊరులాగా వుంది. ఇంత ఊరు మొత్తం నీటిమీద కదిలిపోతూ వుంటుంది కాబోలు! ఆ స్టీమరులో ఎక్కువమంది తెల్లవారు కనిపించారు. వాళ్ళు మాట్లాడు కొనే ఇంగ్లీషులో ఒక్క మాటకూడా నా కర్థం కాలేదు. నాకు కూడా ఇంగ్లీషు తెలుసుననుకొనే భ్రమ వీళ్ళ ఇంగ్లీషు విన్న తరువాత తొలగిపోయింది. అందు వల్ల కొంత దిగులు వేసింది. మళ్ళీ వెంటనే అనుమానం వేసింది. వీళ్ళు మాట్లాడు కునేది ఒకవేళ ఇంగ్లీషు కాదేమో అని కాని. అది ఇంగ్లీషు వలెనే ధ్వనిస్తుంది.

హార్బరు కంటె బీచ్ ఇంకా ఎంతో బాగా వచ్చింది. హార్బర్‌లో అన్నీ అడ్డాలే. ఏదో ఇరుకుగా మూసివేసినట్లు హార్బర్ వుంటే విశాలంగా, విముక్తంగా బీచ్ గోచరించింది. ముందువైపు గోధుమ రంగు ఇసుక, దానికావల అంతులేని నీల జలరాశి. ఆకాశానికున్న వైశాల్యం, దానికున్న రంగు దృష్టి సారించి చూస్తే దూరంగా సముద్రపు అంచు ఏదో, ఆకాశపు అంచు ఏదో తెలియక ఆకాశమూ, సముద్రమూ మొత్తం ఏకంగా గోచరించేవి. అందరం ఈ వడ్డున కూర్చుని సముద్రం వైపు చూస్తున్నాం, మరి సముద్రం మనందరివైపు చూస్తుందా? సముద్రాన్ని గురించి మన మనసులో అనేక ఆలోచనలు లేస్తూవున్నాయి. మరి సముద్రపు మానసంలో కూడా మనందరిని గురించి ఆలోచనలు లేస్తున్నయా? ఓ తప్పక, దాని మానసంలో కూడా ఆలోచనలు లేస్తున్నాయి. లేచి పైకెగురుతున్నాయి. అంతంత ఎత్తున లేస్తూ కనిపించే ఆ అలలే దాని ఆలోచనలు. మన ఆలోచనలు బయటికి కనిపించవు. ఎవరి ఆలోచనలు వారిలోనే లేస్తాయి బాహ్యరూపం దాల్చకుండా. మన ఆలోచనకు రూపం లేనట్టే శబ్దం కూడా లేదు. మరి సముద్రపు ఆలోచనలకు రూపమూ వుంది; శబ్దమూ వుంది. అందుకనే దాని తరంగాలు అంత స్పష్టంగా కనిపిస్తున్నాయి: అంత స్ఫుటంగా వినిపిస్తున్నాయి!

బీచ్‌లో నీటిలో నిలబడితే పెద్ద కెరటం వచ్చి నా బట్టలు తడిపివేసింది. కాళ్ళు జారుతూ సముద్రంలోకి పోతున్నట్లనిపించి భయపడి గబగబ పైకి వచ్చాను. మదరాసులో చూడవలసినవన్నీ చూడడం అయిపోయింది. ఇక రేపు అడయారులో ప్రారంభించబోయే దివ్యజ్ఞాన మహాసభలు చూడాలి.

# అడయార్ విశేషాలు; అనిబిసెంట్ సందర్శనం; జిడ్డు కృష్ణమూర్తితో పరిచయం

ఆ రోజులలో అడయార్ అనేది అందానికి, ఆనందానికి, అనురాగానికి, ఆలోచనకు, ఆధ్యాత్మికతకు ప్రతిబింబం. అడయార్‌లోని థియోసాఫికల్ సొసైటీయే ఇందుకు కారణం. అనంతా ఒక నందనవనం. ఎటు చూచినా చెట్లు, పొదలు, లతలు, ఆకులు, మొగ్గలు, పూవులు, వర్ణాలు, వాసనలు ఇతర సమయాలలో మనుషుల సంఖ్య చెట్ల సంఖ్యతో పోల్చిచూస్తే చాలా తక్కువ వుంటుంది. కాని డిశంబరులో జరిగే కన్వెన్షన్ సమయంలో మాత్రం ఇక్కడ జనసంఖ్య కూడా చెట్ల సంఖ్యతో సమానంగా వుంటుంది. విశాల విశ్వంలోని ప్రతి మూల నుంచి వచ్చిన మనుషులుంటారు. ప్రతి మతానికి సంబంధించిన మనుషులు వస్తారు. స్త్రీలు, పురుషులు, పిల్లలు, గృహస్థులు, బ్రహ్మచారులు, సన్యాసులు వివిధ వేష భాషలతో అడయార్ ప్రత్యక్షం. ఈ సభలకు హాజరైన వాళ్ళలో నేనే చిన్నవాణ్ణి అనుకొన్నాను కాని పరికించి చూస్తే నా కంటె చిన్నవాళ్ళు చాలా మంది వున్నారు.

అడయార్ మర్రిచెట్టు అన్నిటికీ మించిన ఆకర్షణ. ఎంత విశాలమైన చెట్టు! ఎంత వయసుగల చెట్టు! ఎన్ని ఊడలుగల చెట్టు! దాని ఆకు రాలిన కొమ్మల గుండా శీతకాలపు వీలగగనాన్ని చూస్తుంటే మర్రిచెట్టును కాక మర్రిచెట్టు చిత్రాన్ని చూస్తున్నట్లు తట్టింది. అసలు ఆ పరిసరమంతా ఒక గొప్ప చిత్రపటంగా గోచరించింది. ఈ కన్వెన్షన్ రోజుల్లో నిత్యము ఈ వట తరుచ్ఛాయలో సభలు జరుగుతాయి. వక్తలు, ప్రవక్తలు తమ తమ వక్తృత్వ స్రవంతులను ప్రవహింపచేస్తుంటే శ్రోతలు తన్మయులై ఆ స్రవంతిలో మునుగుతుంటారు.

ప్రకృతి సౌందర్యం, మానవ ప్రతిభ ఇక్కడ ఐక్యతను వినిపిస్తూంటాయి. ఇక్కడి ప్రకృతి సౌందర్యం అంతా మానవ నిర్మితమే. తామే ప్రకృతి నిర్మించుకొని తాముకూడా అందులో ఒక ప్రముఖ భాగమై సంచరిస్తున్నారు. ఎటు చూచినా కాంతి వినిపిస్తూంది. ఎటు చూచినా కాంతి ప్రకాశిస్తుంది. విశ్వమానవ సౌభ్రాతృత్వం ఇక్కడ ప్రతిబింబిస్తుంది.

పొడవైన తెల్లని గడ్డంతో లోకోత్తర వాతావరణాన్ని కల్పుకొని గుప్త విద్యలో నిగూఢ పరిశోధనలను జరుపుతున్న లెడ్‌బీటరు మహాశయుని చూశాం. ఆయన ఆకృతి మనిషిని ప్రకృతి కందని విచిత్ర ప్రభావాన్ని వేస్తుంది. కనుపించే లౌకిక జగత్తుకు, కనుపించని ఆత్మిక జగత్తుకువున్న సంబంధాన్ని గురించి, జీవానికి మరణానికివున్న బాంధవ్యాన్ని గురించి, అచేతనకు, అధోచేతనకు, సహజ చేతనకు, ఊర్ధ్వచేతనకు వున్న అనుబంధాన్ని గురించి లెడ్‌బీటరు ఎన్నో పరిశోధనలు చేసి ఎన్నో సత్యాలను కనుగొన్నాడు. నన్ను తన శిష్యునిగా స్వీకరించి ఈ గుప్త విద్యలన్నీ బోధించితే ఎంత బాగుండునో అనిపించింది.

## అనిబిసెంట్ సందర్శనం

శ్రీమతి అనిబిసెంట్ పేరు నిత్యం పత్రికల్లో వినవస్తుండేది. ఆమె గంభీరమైన ఫొటో అప్పుడప్పుడు పత్రికలలో కనుపిస్తుండేది. ఆమెను ఆ రోజున అడయారులో ప్రత్యక్షంగా చూశాము. ఆమె వాగ్ధోరణి స్వంత చెవులతో విన్నాను. అయితే ఆమె ఉపన్యాసం మాత్రం నాకేమీ అర్థం కాలేదు. ఆ వేగాన్ని అక్కడ కూర్చున్నవారు ఎంత వరకు అర్థం చేసుకొన్నారో తెలియదు. అనిబిసెంటు గొప్ప శక్తిశాలిని. ఆమె విగ్రహం చాలా ప్రభావోత్పాదకంగా గోచరించింది. పురుషుల పైన ఉత్తరీయాలు వేసుకోడం మాత్రమే చూచివున్నాను. కాని స్త్రీలు పమిటను మాత్రమే కాని ఉత్తరీయాన్ని ధరించడం ఎక్కడా చూడలేదు. అనిబిసెంటు మాత్రం జలతారు అంచుల ఉత్తరీయాన్ని మడతలతో మెడకు రెండువైపులా క్రిందకు వేలాడవేసింది. వృద్ధాప్యంవల్ల కనురెప్పలు క్రిందికి జారివున్నాయి. ఆమె ఉపన్యసిస్తుంటే అగ్నికణాలు కురుస్తున్నట్లే వున్నాయి.

థియొసాఫికల్ సొసైటీకి అధ్యక్షురాలుగా అనిబిసెంటు అయితే, ఉపాధ్యక్షుడు జినరాజదాస. ఆయన చాలా సున్నితమైనట్టి, ఎన్నో విదేశీభాషలు తెలిసినట్టి ఎంతో సంస్కృతి కలిగినట్టివ్యక్తి. గూడకట్టు, లాల్చీ, జలతారు ఉత్తరీయం, నెత్తిమీద టోపీతో చూడడానికెంతో ముచ్చటగా వున్నాడు. జార్జి అరండల్, ఆయన సతి రుక్మిణీదేవి అప్పుడక్కడ లేరు, విదేశాలలో వున్నారట. ఈ గొప్పవారందరిని చూస్తుంటే అనిపించేది – వారిని నేను చూస్తున్నాను కాని వాళ్ళు నన్ను చూడడం లేదుగదా అని. మనసులో ఈ భావన రేకెత్తడంతో వారిని చూస్తున్న సంతోషం కొంచెం నిస్తేజమయేది. వారిని మనం చూడటమే కాదు, మనను కూడా వారు చూడాలి. వారి మాటలు మనం వినడమే కాదు మన మాటలు కూడా వారు వినాలి.

వారిని మనం ఎరిగి వుండడమే కాదు, మనను కూడా వారు ఎరిగివుండాలి. వారిని మనం ప్రేమించడమే కాదు వారు కూడా మనను ప్రేమించాలి అనే ఆకాంక్ష తీవ్రంగా వుండేది. అప్పటికి నాకు ఇంగ్లీషు వ్యాకరణములోని యాక్టివ్‌వాయస్, పాసివ్‌వాయస్‌ల తారతమ్యం బాగా తెలుసు. అందుకని తెలిసింది. ఇక్కడ నా వాత్ర యాక్టివ్‌వాయసే కాని పాసివ్ వాయస్ కాదని, నేను గొప్పవారిని చూస్తున్నానే కాని గొప్పవారిచేత నేను చూడబడడం లేదని గ్రహించి కొంచెం చిన్న పోయినాను. ప్రేమించడంలో కంటె ప్రేమింపబడడంలోనే ఎక్కువ ఆనందం వుంటుందని తెలిసింది.

## "యాక్టివ్ వాయస్: ప్యాసివ్ వాయస్"

అయితే, ఈ పాసివ్‌వాయస్ ఆనందం అన్ని విషయాలలోను వుండదు. ఈ లోకం లోని ఎక్కువ విషయాలలో యాక్టివ్‌వాయస్‌లో మాత్రమే ఆనందం, పాసివ్‌వాయస్‌లో ఎక్కువబాధ. పిల్లి ఎలుకను తినడంలో ఆనందిస్తే ఎలుక పిల్లి చేత తినబడడంలో ఆనందించకపోగా యమయాతన అనుభవిస్తుంది. ఇతర్లనుదోచు కోవడంలో ఆనందం అనుభవిస్తారు దోపిడిగాండ్రు. కాని దోచుకోబడే వాళ్ళు దుఃఖం అనుభవిస్తారు. జంతువులను వేటాడడంలో వేటగాండ్రు ఉల్లాసంపొందితే వేటాడబడడంలో జంతువులు బాధ అనుభవిస్తాయి. ఇతర్లను నిందించడంలో ఆనందం దొరికితే నిందింపబడడంలో దొరికేది బాధ మాత్రమే

సరే, ఏది ఎమైనప్పటికీ అప్పుడు అడయారులో నాకు కావలసింది పాసివ్ వాయిసే కాని యాక్టివ్‌వాయస్ కాదు. నేను కోరిన పాసివ్‌వాయస్ దొరికే అవకాశం లేదని పూర్తిగా తెలుసుకొన్న పిమ్మట ఇక దొరకని దానికై బాధపడే బదులు దొరికిన దానితో ఆనందించడం మేలని నిశ్చయించుకొన్నాను. ఇప్పటి మహనీయులచేత నేను చూడబడడం, వినబడటం, ప్రేమింపబడడం జరగనప్పుడు నేనే ఆ మహనీయులను చూడడం, వినడం, ప్రేమించడం, జరపడంలో ఆనందించసాగాను. తీసుకోడం కుదరనప్పుడు ఇవ్వడమైనా నేర్చుకోవాలి!

అడయారుకే కాక, భారతదేశాని కంతకు మాత్రమే కాక యావద్విశ్వానికే మానవ పుష్పం ఒకరున్నారు అక్కడ. ఆయనే జిడ్డు కృష్ణమూర్తి. మా పెద నాన్నకు, నాకుకూడా ఆయనంటే ఎంతో ఆకర్షణ. అసలు ఈ అడయారు సభలకు రావడానికి ముఖ్యోద్దేశ్యం. జిడ్డు కృష్ణమూర్తిని చూడాలనే. థియొసాఫికల్ సొసై

టీలో వుంటున్నప్పటికీ ఆయని పూర్ణంగా ఆ సొసైటీకి చెందినవాడు కాడు. ఆయన చాలా స్వతంత్ర భావాలుగల వ్యక్తి. ఆయన రూపం ఎంతో సౌకుమార్యంగా, తేజోవంతంగా, భావాత్మకంగా, లోని తన్మయభావానికి ప్రతిబింబంగా గోచరించింది. రూపంలో, భావంలో, మాటలో, నడకలో ఏదో అవర్ణనీయమైన గొప్ప కళాత్మక లాలిత్యం గోచరించింది. ఈ కనుపించే జగత్తు అంచులనుదాటి దూరపు క్షితిజరేఖల కావలకు చొచ్చుకుపోయే చురుకుగల ప్రశాంతదృష్టి ఆయనది. జిడ్డు కృష్ణమూర్తి ఒక గొప్ప జీవన శిల్పి.

అడయారులోని మర్రిచెట్టు క్రింద ఆయన ప్రసంగాలు విన్నాను. ఇతరుల ఇంగ్లీషు ప్రసంగాలు నాకు ఇక్కడ బొత్తిగా బోధపడలేదుగాని జిడ్డు కృష్ణమూర్తి ఇంగ్లీషు ప్రసంగం మాత్రం అక్కడక్కడ అర్థమైంది. **"To understand what life is"** అనే వాక్యము, **"The fulfilment of human aspirations"** అనేది ఆయన ప్రసంగంలో ఒకటి కంటె ఎక్కువసార్లు వినిపించాయి. మిగతావారిని నేను మాత్రమే చూచి వారిచేత చూడబడక పోయినా ఫరవాలేదుకాని జిడ్డు కృష్ణమూర్తిని నేను చూడడం మాత్రమేకాదు, ఆయనవల్ల నేనుచూడబడాలి కూడా. ఆయన వాక్కులు నేను వినడమే కాదు, నా వాక్కులు కూడా ఆయనచేత వినబడాలి. అటువంటి అవకాశం నిమిత్తం నిరీక్షిస్తూ కూర్చున్నాను.

## శ్రీ జిడ్డు కృష్ణమూర్తితో పరిచయం

కృష్ణమూర్తి ప్రసంగం అయిపోయింది. ఆయన తన గొడుకు తెరచి బయలుదేరాడు. మిగతా వారంతా ఆయనను చుట్టివేయకముందే నేను పరుగెత్తి ఆయన దారికి అడ్డంనిల్చొని నమస్కరించాను. ఆ దగ్గరలో వున్నవారంతా పెదలే, నేనే అక్కడ చిన్నవాణ్ని. కృష్ణ చిరునవ్వుతో నా భుజం మీద చేయివేసి **"Where do you study ?"** అని ప్రశ్నించాడు. ఆయన తెలుగువాడని, ఆయన స్వల్పంగా తెలుగుకూడా మాట్లాడగలడని నేనిదివరకే విని వున్నందున ఆగానకు నేను తెలుగులోనే జవాబు చెప్పాను. అంతటితో ఆయన ఇంకొంచెం ఎక్కువగా చిరునవ్వుతో "మంచిది, సాయంత్రం కలుద్దాము", అని సాగిపోయాడు. ఆయన వెనకభాగం చూస్తూ నేను నిలచిపోయాను. ఇక నా ఆనందానికి హద్దులు లేవు. ఒక మహనీయుని నేను చూడడమే కాక ఆయనచేత కూడ చూడబడినాను; ఆయన మాటలు నేను వినడమేకాక నా మాటలు కూడా ఆయనవల్ల వినబడినాయి

ఈ తరహ యాక్టివ్ వాయిసూ పాసివ్ వాయిసూ కూడా నా యందు కార్యరూపం దాల్చినాయి.

అక్కడ కనుపించిన మిగతా మహనీయులంతా ఒక ఎత్తు. జిడ్డు కృష్ణమూర్తి మరొక ఎత్తు. మిగతావారంతా ఇతరులచే చూడబడేవారే కాని ఇతర్లను చూసేవారు కారు. ఇక జిడ్డు కృష్ణమూర్తి వేరు. ఆయన్ని గొప్ప మహనీయునిగా ప్రపంచం గుర్తించినా కూడా ఇతరులయెడల ఆయనకున్న దృష్టిలో మార్పేమీ రాలేదు. తనను ఇతరులు చూడడంతో పాటు తాను కూడ ఇతరులను చూస్తాడాయన. ఆయన ఉన్నతశిఖరంమీద నిలచివున్నా కూడా లోయలో నిలచివున్న సామాన్య మానవుణ్ని నిర్లక్ష్యంతో చూడడాయన. ప్రాణిని గౌరవిస్తాడు ఆయన, ఆ ప్రాణి హోదాతో సంబంధం లేకుండా.

అడయారులో ఎన్ని దేశాలవారినో, ఎన్ని మతాలవారినో చూడడం జరిగింది. వారి వారి జీవన విధానాలను, మతాచారాలను, కార్యకలాపాలను, వేషభాషలను చూశాను, విన్నాను. ఆ సభల రోజులలో అడయారు సూక్ష్మరూపంలో ఇమిడిన ఒక ప్రపంచమే. మా పెదనాన్నకు ఒక ఆలోచన జనించింది, నన్ను అడయారులో చదివిస్తూ తాను అడయారులోనే స్థిరనివాసం ఏర్పరచుకోవాలని. ఈ ఆలోచన నాలో సృష్టించిన తీవ్రమైన సంతోషం మూలంగా ఆ రాత్రి నాకు భోజనం చేయ మనస్కరించలేదు. భవిష్యత్తులోని నా అడయారు నివాసాన్ని గురించి అనేక గాలిమేడలు కట్టసాగాను. అడయారులోని జీవితం అంటే ఆనంద జీవితమే. అయితే వెంటనే సందేహం వేసింది. అడయారులోని వారందరూ ఆనందంగానే వుంటారా లేక దుఃఖంతో వుండరా? ఏమో ఇందరు జనంలో దుఃఖంలేకుండా ఎందరుంటారో! ఏమైనప్పటికి అడయారు నివాసం విషయంలో ప్రయత్నం చేయవలసిందే.

కాని, ఈ అడయారు నివాసాన్ని గురించిన ఆలోచన పెదనాన్నగారిలో ఎక్కువకాలం నిలవలేదు. వెంటనే ఆయనకు కుటుంబంలోని కొన్ని చిక్కులు గుర్తు వచ్చినందువలన తన ఈ ఆలోచనను ఎత్తివేసుకొన్నట్లు నాకు మదరాసులోనే చెప్పివేశారు. నా గాలిమేడలన్నీ ఒక్కసారిగా కూలిపోయినాయి. కళ్ళ ముందు కారు మబ్బులు క్రమ్మివేసినాయి. ఇక ఒక్కరోజు కూడా మదరాసులో వుండబుద్ధికాలేదు. తుమ్మపూడి పోతే అక్కడ కూడా వుండబుద్ధికాదని నాకు తెలుసు. మరి ఇటువంటప్పుడు తుమ్మపూడి పోయి లాభం? తుమ్మపూడిపోక

మరెక్కడికి పోవాలి? పెదనాన్నగారిమీద చాలా కోపం వచ్చికూడా ప్రశాంతంగా ఊరుకున్నాను. మదరాసును వదలాలనిపించింది. కాని, తుమ్మపూడి పోవాలని పించడం లేదు. తుమ్మపూడి పోయే బదులు మదరాసులో వుండటమే బాగుంటుం దనిపించింది కాని పెదనాన్నగారు తిరుగు ప్రయాణానికి సిద్ధమైవున్నారు. అయిష్ట మైన పనులు అనేకం ఇదివరలో చేసి ఈ అయిష్టమైన తుమ్మపూడి ప్రయాణానికి కూడా సిద్ధమయ్యాను.

తిరిగి వెళ్ళే లోపల మరోమారు జిడ్డు కృష్ణమూర్తిని చూడాలనిపించింది. కాని కుదరలేదు. ఒకసారికూడా చూడని వ్యక్తులను చూడటంలోని ఆనందంలో కొంచెం అశాంతి నిండివుంటుంది. సంకోచం కనిపిస్తుంది. కాని ఒకసారి చూచిన వ్యక్తిని మళ్ళీ చూడటంలోని ఆనందంలో శాంతి నిండి వుంటుంది. స్థిరత్వంనిలచి వుంటుంది. అపరిచితుల సందర్శనం ఆనందాన్నిస్తే, పరిచితుల సందర్శనం అధి కానందాన్నిస్తుంది. కృష్ణమూర్తి అప్పటికి పరిచితులలో లెక్క. సరే. కృష్ణ మూర్తిని రెండవసారి చూడకుండానే మదరాసు వదలివేశాం రాత్రి బండిలో.

రాత్రంతా అడయారులోని ప్రకృతి జ్ఞాపకాలు, బెడ్ బీచు జ్ఞాపకాలు, జీవన రాజధాని జ్ఞాపకాలు, అనిబిసెంటు జ్ఞాపకాలు, అన్నిటికి మించిన జిడ్డు కృష్ణ మూర్తి జ్ఞాపకాలు నాతో పాటు రైలులో ప్రయాణం చేస్తూ నన్ను నిద్రపోనివ్వ లేదు. ఇంటికి వెళ్ళిన తరువాత నడపవలసిన జీవనవిధానం ఎటువంటిదో తేల్చు కోలేక తల వేడెక్కి పోతోంది.

# పెద్దల అదలింపులతో చిన్నబోయిన పసిమనసు

మందరాజు ప్రయాణం, ప్రత్యేకించి అడయారు సందర్శనం, అందు జిడ్డు కృష్ణమూర్తితో క్షణిక పరిచయం నన్ను ఎంతో ఎత్తుకెత్తినాయి. ప్రస్తుతం జీవిస్తున్న జీవితం మరో జీవితాన్ని నిర్మించుకొనేందుకు ఏర్పడిన ముడిపదార్థమే అని గ్రహించాను. ఇంటిదగ్గర నివాసం తగ్గించి ఎక్కువకాలం మా నారింజ తోటలో గడప నారంభించాను. ఏ పని లేకుండా సోమరి అవుతున్నాననే విమర్శ రాకపోలేదు. అయినా, వ్యతిరేక విమర్శలను నిర్లక్ష్యం చేయడం అలవాటయి పోయింది. ఏకాంతంలో ఏదో మాధుర్యం తట్టసాగింది. ఏవో దృశ్యం గోచరించ మొదలిడింది, ఏదో సంగీతం వినిపించసాగింది.

ఇటువంటి ఏకాంతంలో వినిపించేది వినిపించని సంగీతమే. ఈ వినిపించని సంగీతాన్ని గురించి కీట్సుకవి రచించిన కవితను కంఠస్థం చేసుకొని అప్పుడప్పుడు ఉచ్చరిస్తూండేవాణ్ణి!

**"Heard melodies are sweet**
**but those unheard**
**Are sweeter, therefore ye soft**
**pipes, play on,--"**

కీట్సు, వర్డ్సువర్తు, బ్లేక్‌లాంటి కవుల చిన్నచిన్న కవితలను కంఠస్థం చేసుకొని వాటిని అప్పుడప్పుడు ఉచ్చరిస్తూంటే ఆ పదాల లాలిత్యమూ, ఆ భావాల గాంభీర్యమూ నన్ను ముగ్ధుణ్ణి చేస్తుండేవి. తెలుగు పుస్తకాలను చదవడం తగ్గించి ఇంగ్లీషు మీదనే శ్రద్ధనంతా కేంద్రీకరించ నారంభించాను. ఇంగ్లీషుభాషతో చాలినంత పరిచయం లేకపోవడంతో వున్న లోపాన్ని నేను అడయారులో గ్రహించాను. నా ఈ ఏకాంతవాసాన్ని ఇంగ్లీషులో దక్షత సంపాదించుకొనేందుకు ఉపయోగించుకోవాలనే సంకల్పాన్ని దృఢపరచుకొన్నాను. అప్పటికి తుమ్మపూడిలో కొందరిదగ్గర మంచి ఇంగ్లీషు పుస్తకాలు వుండేవి. ప్రత్యేకించి మా మరో పెదనాన్నగారి కుమారుడు సూర్యదేవర సంజీవరాయణంగారు అప్పటికే దేశంలో కొందరికు తెలిసిన వ్యక్తి. హిందుస్తాన్ సేవాదళానికి కెప్టెన్ చేశాడు కొన్నాళ్ళు. తరువాత ఆంధ్రరైల్వే ప్రయాణీకుల సంఘానికి ప్రధాన కార్యదర్శిగా వుండే

వాడు. ఋష్యాశ్రమంలో ఉచితంగా రోగులకు వైద్యంకూడా చేస్తుండేవాడు. ఆయనకు థియసాఫికల్ సొసైటీతోను, రామకృష్ణ మిషన్‌తోకూడా సంబంధం వుండేది. వీటికి సంబంధించిన ఇంగ్లీషు పుస్తకాలు ఆయనవద్ద చాలావుండేవి. థియసాఫికల్ పత్రికలు, రామకృష్ణమిషన్ ప్రకటించే ఇంగ్లీషు పత్రిక "ప్రబుద్ధభారత్" మొదలైన ఏవేవో ఆయనకు వస్తూండేవి.

నిఘంటు సహాయంతోను, వ్యాకరణ సహాయంతోను కొన్ని ఇంగ్లీషు పుస్తకాలనూ, పత్రికలను చదివి అర్థం చేసుకోవడంలో క్రమేణ సఫలత చెందసాగాను. నాకు పదునాలుగో సంవత్సరం వచ్చేవరకు మామూలు ఇంగ్లీష్ పుస్తకాలేకాక స్వామి వివేకానంద ఉపన్యాసాలనుకూడా చదివి అర్థం చేసుకోవటం ప్రారంభించాను

## హిమాలయ శోభ

నా పదునాలుగో ఏట స్వామి రామతీర్థ జీవితంతోను, ఆయన రచనలతోను పరిచయం ఏర్పడింది. ఆయన హిమాలయ పర్యటనలూ, ఆయన చేసిన హిమాలయ వర్ణనలూ నాలో హిమాలయాలమీద తీవ్రమైన ఆసక్తిని సృష్టించాయి. హిమాలయాల పేరులోనే ఏదో లోకోత్తర ఆకర్షణతోచేది. హిమ శిఖరాలు, దేవదారు అరణ్యాలు, జలపాతాలూ ఇవన్నీ నన్ను తమవైపు ఆకర్షించసాగాయి. తమను ఒకసారి చూచి పొమ్మని ఆహ్వానించసాగాయి. హిమాలయాలను చూడాలనే ఆకాంక్ష క్రమేణా వృద్ధికాసాగింది. హిమాలయాలను గురించిన పుస్తకాలు చదవటంలో ప్రత్యేకానందం కల్గసాగింది. సాధ్యమైనంత త్వరలో హిమాలయాలను సందర్శించాలనే నిర్ణయం స్థిరపడిపోయింది.

స్వామి రామతీర్థ వాక్కులు నాలో నూతనచైతన్యాన్ని సృష్టించినాయి, ఆత్మవిశ్వాసాన్ని రూపొందించినాయి. మానవునికి అసంభవము అనేదే లేదని, ఇచ్ఛాశక్తి నెరవేర్చలేని కార్యమే లేదని, మానవుడు తాను కోరినదంతా కాగలడని మొదలైన సత్యాలు నాలో విశ్వాసం ఏర్పరచుకొన్నాయి. అయితే నేను ఏమిగా మారాలి అనేది ఇంకా నిశ్చయించుకోలేక పోయాను. నా జీవితంలోని పరమ లక్ష్యమేమిటో ఇంకా నిర్ణయించుకోలేక పోయాను. మొత్తంమీద కొంతకాలంపాటు ఋష్యాశ్రమాన్ని వదిలివుండాలని మాత్రం ఒక నిర్ణయం.

ఉదయాన భోజనానంతరం ఇన్ని పుస్తకాలు పట్టుకొని వారింటితోటలోనికి రావటం కొంచెం సేపు చదవటం, పుస్తకం మూసి అవతలపెట్టి ఆ పచ్చగడ్డిమీద

పడుకొని ఆకాశాన్ని చూస్తూ, ఆకాశంలో తేలిపోతున్న మేఘాలను పరిశీలిస్తూ, చదివిన విషయాన్ని స్మరణకు తెచ్చుకొంటూ కొంతసేపు గడిపి మధ్యాహ్నం మళ్ళీ భోజనానికి ఇంటికి వచ్చి మళ్ళీ వెళ్ళిపోయేవాడిని తోటకు. సాయంత్రం తోటనుంచి బకింగ్‌హాం కాలువకు పోయి, అందులో ప్రవహించే నీటిని. నీటి మీద తేలిపోయే పడవలను, పడవలను లాగే మనుషులను చూస్తు రేవేంద్రపాడు లాకులవరకు నడచి ఇంటికి వచ్చేవాణ్ణి.

ఈ విధమైన జీవితం మా పెంపుడు తల్లి అయిన రాజ్యలక్ష్మమ్మగారి దృష్టిలో చాల వ్యర్థంగా కనిపించేది. కొంచెం ఎక్కువ చీకటి పడి ఇంటికొస్తె ఆమె కళ్ళెర్రచేసి "పెత్తనాలయినవా?" అనేది. అంటువంటి వైఖరి నాకు కష్టంగా తట్టేది. ఏమైనా మళ్ళా అనాలి అనుకొని కూడా ఏమీ అనకుండానే మానుకునేవాణ్ణి. తిరిగి ఏమైనా అనడం మంచిదో, అనకుండా వుండడం మంచిదో తేల్చుకోలేక పోయాను. ఈ పరిస్థితిలో ఇంటినుంచి బయటకు పోవడంలో వున్న సంతోషం బయటనుంచి ఇంటికి రావడంలో వుండేదికాదు.

నేను వ్యర్థంగా జీవితం గడపడం లేదు సార్థకంగానే గడుపుతున్నానని ఆమెకు నచ్చ చెప్పడం ఏవిధంగానా? అనితోచేదికాదు. ఆ విషయాన్ని ఆమెకు నచ్చచెప్పాలంటే చాలా మాటలు చాలాసేపు ఆమెతో చెప్పాలి. ఒక్క మాట కూడా ఆమెతో మాటాడడం అభ్యాసంలేని నేను చాలామాటలు ఆమెతో ఎలా చెప్పగలను? అందుకని చెప్పకుండానే మానుకొన్నాను. సరే, ఆ మాటలలో ఏమున్నది? అసలు పెదనాయన నన్ను ఏమీ చెడుగా అనటంలేదు గదా అని సంతృప్తిపడి వూరుకొంటూండేవాణ్ణి. వూరుకొంటూ నేనుంటే వూరుకోకుండా ఆమె ఉండేది.

## ఉంగరాల జుట్టు

నా వంకరలు తిరిగిన జుట్టు మీద నాకెంతో ప్రీతి. నా క్రాపును రోజుకు ఎన్నో సార్లు దువ్వుతుండేవాణ్ణి. రవీంద్రనాథటాగూర్, ఉమేశచంద్ర బెనర్జీ, జగదీశచంద్రబోసు, మొదలైనవారి ఫొటోలు నా కెంతో ప్రియంగా తట్టేవి. వారి జుట్టు మధ్య పాపడి తీసి దువ్వి వుండేది. వారిమీద ప్రీతి చొప్పునో, లేకనిజంగా మధ్య పాపిడి రమ్యంగా తట్టినందువల్లనో నే నదివరలో తీస్తున్న పక్కపాపిడి మానివేసి మధ్యపాపిడి తీయప్రారంభించాను. మధ్య పాపడికి రెండు వైపులా జుట్టు వంకరులు తిరిగి అందంగా గోచరించేది.

నాకు మరో సందేహం కూడా వేయకపోలేదు. నేను అద్దంలో చూచు కొన్నప్పుడు క్రాపు అందం గోచరించేది. క్రాపు మాత్రమే అందంగా గోచరిం పడమా లేక నాముఖం కూడా అందంగా గోచరింస్తూదా లేదా అనే సందేహం వచ్చేది. నా ముఖం నా దృష్టిలో మాత్రమే కాక ఇతరులదృష్టిలో కూడా అం దంగా గోచరించాలని నా అభిలాష. జుట్టులో ఒక విలక్షణత, కన్నులలో ఒక కమనీయత ముఖవైఖరిలో ఒకకోమలత వుండాలని అభిలాష. అభిలాష మాత్రమే కాదు; ఆలక్షణాలన్నీ నాముఖంలో వున్నాయనే విశ్వాసంకూడా. ఇతరులుకూడా నా ఈ విశ్వాసాన్ని దృఢపరచేవారు.

అందమైన ముఖాలు స్త్రీలకూ, పురుషులకూకూడా చాలామందికి వుంటూ వుంటాయి. అయితే ఆ అందాలలో కొన్ని నా కిష్టంగా తట్టేవికావు. కొందరి అందాలు నాడెందానికి కటువుగా కనిపించేయి. మార్దవమూ, కోమలతా మొద లైన లలితమైనవైఖరులతో కూడిన అందం మాత్రమే నా కానందాన్ని యిచ్చేది. కఠోర వైఖరుల అందాలు నచ్చేవి కావు. ముఖం చూడగానే అందులో, ప్రేమ తెలివి, సౌశీల్యతా మాట్లాడుతున్నట్లు తట్టిన ముఖాన్ని మాత్రమే సుందర ముఖంగా నేను భావించేవాణ్ని. ఆడపిల్లలు తలలు దువ్వకొనే సమయానికంటె కూడా ఇంకా ఆలస్యంగానే దువ్వుతాడు మన అబ్బాయి తన క్రాపును అనే విమర్శలు కూడా ఇంటిలో బయలుదేరినాయి. ఎవరేమనుకున్నా సరే నా క్రాపు నేననుకున్న విధంగా రూపొందేంతసేపు దువ్వేవాణ్ని. నా క్రాపు నేను అనుకొన్న ప్రకారం బాగారాని రోజు మనసు మసకగా వుండేది.

## కోనాయపాలెం మకాములు

అప్పుడప్పుడు **కోనాయపాలెం** మేనమామగారింటికి వెళ్ళి పదిరోజు ండి వస్తూనేవున్నాను. అమ్మమ్మా, 'కోట్లోబాబూ అప్పుడప్పుడు తుమ్మపూడివచ్చి కొద్ది రోజులుండి పోతూనే వున్నారు. నా పదునాలుగో ఏట శీతాకాలంలో కోనాయపాలెం వెళ్ళి నెలరోజులపైగా అక్కడ స్వచ్ఛందంగా కాలంగడిపి వచ్చాను. వచ్చిన బాధల్లా ఏమిటంటే వెళ్ళే రోజు అమావాస్య రాత్రి అయినప్పటికీ వెన్నెలలోనే వెళ్ళేవాణ్ని. కోనాయపాలెం నుంచి తిరిగి వచ్చేరోజు పౌర్ణమి రాత్రి అయినప్ప టికీ చీకటిలోనే వచ్చేవాణ్ని. మేనమామగారి వూరు వదలిరావడం అంటే అంత భారం వేసేది.

నా పదునాలుగో ఏట కోనాయపాలెంలో నెలరోజులుపైగా వున్నప్పుడు అంతకు పూర్వపు స్నేహితులతో పసితనపు తెగని జ్ఞాపకాలు చెప్పుకోడంలోను, ఊరుబయటి వాగులవద్ద షికార్లలోను, ఇంకా అనేకాలైన వయసుకు మించిన, సెక్సుకు సంబంధించిన రహస్యాలు తెలుపుకోడంలోను మాతోటిఅమ్మాయిలు ఎవరెవరు పెద్దవాళ్ళయినారు, ఎవరెవరికి పెళ్ళికాబోతున్నదీ మొదలైన వివరాలు తెలుసుకోడంలోను కాలం గడచిపోయింది.

అక్కడికి పది మైళ్ళ దూరంలో వున్న పోవూరు వెళ్ళి మాపెదతల్లి కూతురును, ఆమె భర్త వాశిరెడ్డి కోటయ్యగారిని చూచి రావడానికి, ఒకరోజు తెల్లవారుతుండగా గుర్రంమీద నే నొక్కడినే బయలుదేరాను. నాకు పొలాల్లో వాగుఒడ్డున కూర్చొని అన్నం తినాలని అభిలాష. అందుకని అన్నమూ, ఆవకాయ పచ్చడి, పెరుగూ ఒకదానిలో ఏర్పాటుచేసుకొని గుర్రంమీద వెంట తీసుకువెళ్ళాను. నా చిన్నప్పటి బూడిదరంగు ఆడగుర్రం మరణించింది. దాని పిల్ల మొగ గుర్రం స్వారీకి తయారై వుంది. సూర్యోదయం అయిన కొంతసేపటికి చందర్లపాడు దాటి పాటింపాడు వాగుదగ్గరకి వెళ్ళాను. ఆ వాగు దగ్గర గుర్రం దిగి దాన్ని ఒకచెట్టుకు కట్టివేసి వాగుఒడ్డున ఇసుకలో కూర్చొని అన్నము తినసాగాను. ఇంటివద్ద తింటూ వుండే అన్నం ఎప్పుడు అంతరుచిగా తట్టలేదు. ఎంతో రుచితో వాగుఒడ్డున ఆవకాయపచ్చడితోను, పెరుగుతోనూ భోజనం ముగించుకొని మళ్ళీ గుర్రం ఎక్కాను. కొంచంసేపు నెమ్మదిగా నడిపించడం, మరికొంచంసేపు పరుగు తీయించడం, ఈ విధంగా గుర్రపు ప్రయాణాన్ని సాగించాను. చీలికదారులు వచ్చినచోట మాత్రం ఏదారిన వెళ్ళడమో తెలియక ఆగి ఎవరైనా మనుషులు కనబడితే అడిగి తెలుసుకొని పయనించేవాణ్ణి. ఎవరూ లేనిచోట ఆ నిర్ణయం గుర్రానికే వదలే వాణ్ణి. గుర్రాన్ని తోలకుండా వుంచే ఆ చీలినదారిలో ఏదారివైపుకు అది నడుస్తుందో అదే నిజమైన దారి అయేది.

## తిరోగమనం

పాటింపాడు, కొత్తపాలెం మధ్య ఒకశనగచేలోగుండా బాట కనుపిస్తూంటే ఆ బాట గుండా గుర్రం నడవసాగింది. ఇంతలో ఆ చేని యజమాని పెద్దకర్రతీసుకొని పెద్దగా కేక లేస్తూ వచ్చాడు. కొడతాడేమో అని కొంచం జంకాను. "గుర్రానికి తెలియలేదా ? లేక నీకు తెలియలేదా ? ఇది శనగచేను అని" అని అంటూ గుర్రాన్ని ముందుకు పోనీయకుండా అటకాయించి గుర్రాన్ని త్రిప్పి వచ్చినదారినే

పొమ్మన్నాడు. నేను ఏమీ నోరెత్తకుండా వచ్చిన దారినే వెనుక్కి వచ్చి చుట్టూ తిరిగి ఓటిలో వున్న దారిగుండా పయనం సాగించాను. "పెద్దవాళ్ళు లేకుండా నీవు ఒక్కడివే అసలు ఎందుకు బయలుదేరావు మొనగాడులాగా!" అని మళ్ళీ గద్దించాడు ఆ చేని యజమాని. నాకు కోపమూ వచ్చింది, నవ్వూ వచ్చింది. కోపాన్ని మ్రింగి నవ్వును మాత్రమే బయటికి చూపించాను. ఆయనకు నా నవ్వు నచ్చలేదు. "పళ్ళికిలించి ఇంకా నవ్వుతున్నావా పైగా?" అన్నాడు. నవ్వుతుంటే ఆయనకు నచ్చనప్పుడు నేను నవ్వునే దిగమింగి కోపాన్నే ప్రదర్శిస్తే ఆయనకు నచ్చేదేమో మరి!

గుర్రమూ నేను, అది నన్ను కష్టపెట్టకుండా నేను దాన్ని కష్టపెట్టకుండా, క్షేమంగా పోవూరు చేరుకున్నాం. అక్కయ్యా, బావా కూడా నేను ఒంటరిగా గుర్రంమీద రావడం చూచి ఆశ్చర్యం, ఆనందం పొందారు. పోవూరులోని కరణంగారి పిల్లలు, మునసబుగారి పిల్లలు అంతా నన్ను చూచి పరుగెత్తుకువచ్చారు. నాకిష్టమైన పిండివంటలు ఏమి కావాలో చెబితే వండిపెడతాను అన్నది అక్కయ్య. ముందుగా అల్లమూ, ఉల్లిపాయలూ, పచ్చిమిరపకాయలూ వేసిన పకోడీలు వండిపెట్టమన్నాను.

# కృష్ణానదీ తీరానికి మా విహారయాత్ర; కోనాయపాలెంలో "నక్కలపాటకచేరి"

తిరుగు ప్రయాణంలో ఊరుబయట కుక్కలు నా గుర్రం వెంట మొరుగుతూ పరుగెత్తసాగాయి. అంతటితో గుర్రం బెదరి పరుగు సాగించింది. దారి వొంకా వదలి ముళ్ళ పొదల మీదుగా దూకుతూ గేలప్ సాగించింది. కళ్ళెం ఎంత లాగినా ఆగడంలేదు. ఆ పరుగు వేగానికి నేను గుర్రంమీద ఆగలేక జారి క్రిందపడే స్థితివచ్చింది. ఇంతలో ఒక మనిషి ఎదురుగా వస్తున్నాడు. గుర్రాన్ని ఆపమని అరిచి కేకవేశాను. అతను కర్ర ఎత్తి దారికి అడ్డంగా వచ్చాడు. గుర్రం ఆగిపోయింది. తీరా పరికించి చూస్తే ఆ మనిషి పరిచయస్తుడే. పోవూరు వెళ్ళేరోజు శనగచేలోగుండా గుర్రాన్ని పోనీయకుండా ఆటంక పరచిన వ్యక్తే. నన్ను గుర్తుపట్టి "ఇప్పుడైనా మళ్ళీ వెంట పెద్దవాళ్ళు లేకుండానే తిరిగి వస్తున్నావా?" అన్నాడు. "నేను పెద్దవాణ్ణేగా. నాకు పదిమీద నాలుగేళ్ళు" అన్నాను. అతను వెంటనే గుప్పెడు శనగమండలు పీకి తినమని నాకు అందించాడు. నేను అవితింటూ నెమ్మదిగా గుర్రాన్ని నడుపుతూ, మధ్య గ్రామాలలో కుక్కలు కనిపించిన చోటల్లామళ్ళీ గుర్రం ఎక్కడ బెదురుతుందో అని సందేహిస్తూ భోజనం వేళకు కోనాయపాలెం ప్రవేశించాను.

గుర్రంమీద ఒంటరిగా రానూ పోనూ ఇరవై మైళ్ళ ప్రయాణం చేయగలిగినందుకు, దారిలో ఎక్కడా గుర్రమూ, నేనూ కూడ పడకుండా రాగలిగినందుకూ నన్ను నేనే గర్వంగా అభినందించుకొన్నాను. అమ్మమ్మా, పెదతల్లీ కూడా మనవాడు ఇంత పెద్దవాడైపోయాడుగదా అని ఒకవైపున సంతోషిస్తూనే, ఇంతవాణ్ణిచూచి తల్లి వుంటే ఎంత సంతోషించేదో అని కన్నీళ్ళు పెట్టుకొన్నారు. తుమ్మపూడినుంచి నన్ను తిరిగి రమ్మని ఉత్తరం వచ్చినట్టు ఇంకా ఒక పక్షం రోజులుండి వస్తాడు అని కోట్లోబాబు జవాబువ్రాసినట్టు చెప్పారు. అక్కడనుంచి వచ్చిన ఉత్తరం చేదుగా తట్టినా, ఇక్కడనుంచి వెళ్ళిన జవాబు తీయగా తట్టింది. ఇంకా పదిహేను రోజులు ఇక్కడ హాయిగా కాలం గడపవచ్చు!

తుమ్మపూడి ఏకాంతంలో పుస్తకాలలోనే యావత్ ప్రపంచాన్ని చూస్తూ సంతృప్తిపడేవాడిని. ఇక్కడ కోనాయపాలెంలో మనుషులలోనే యావత్

ప్రపంచాన్ని సందర్శిస్తూ సంతృప్తిపడసాగాను. ఏకాంతం అభ్యాసమైన వ్యక్తులు జనంలో కొంతవరకైనా కాలం గడపగలరు కాని జనంలో అలవాటుపడిన వ్యక్తులు ఏకాంతంలో కొంతవరకైనా కాలం గడపజాలరు.

మిత్రులతో ప్రసంగాలలో ఇప్పుడు పెరరిజాన్ని గురించి, నా అధ్యయా అనుభవాన్ని గురించి, నేను చదువుతున్న పుస్తకాలను గురించి, నా ఇంగ్లీషును గురించి, హిమాలయాల ఆకర్షణం గురించి చెప్పసాగాను. కాని, వాళ్ళలో ఎవరుకూడా ఈ విషయాలను సరిగా అర్థం చేసుకొన్నట్టు కనుపించలేదు. ఇప్పుడు నేనేవో వ్యాకర్షణంకాని పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నానని వాళ్ళన్నారు.

## దూరపు కొండలు : దగ్గరి కొండలు

శీతకాలంలో పొట్టి పగళ్ళు ఇట్టే గడచిపోయాయి. చలికాలపు ఎండలో తిరగడం హాయిగానే వుంటుంది. పొలాలలో మిరపతోటలలో ఎర్రగా, పసుపుగా పూచిన బంతిపూలు నేత్రపర్వంగా వుండేవి. శనగకాయ బాగా ముదిరివుంది. మేమంతా శనగమండలు పీకి మంటలో తంపటవేసి తింటుంటే చాలా రుచిగా వుండేది. ఒకరోజు ఊరికి ఆగ్నేయ దిశగావున్న మామయ్యగారి పొలంలో మకాం పెట్టాం. దోసకాయలు తిన్నాం. తంపటవేసిన శనగలు తిన్నాం. పడమటిగా సూర్యుడు పడిపోతున్నాడు. కొండలు వరుసలు ఒకదాని వెనుక మరొకటి ఆకర్షణీయంగా కనిపిస్తున్నాయి. దగ్గరలో కనుపించే కొండల వరుసకు, దూరాన కనుపిస్తున్న కొండలవరుసకు మధ్య కృష్ణానది ప్రవహిస్తున్నది. ఏమైనాసరే రేపు మనమంతా ఆ కనుపించే కొండలవద్దకుపోయి తీరాలిసిందే అని నిశ్చయించుకొన్నాం. మనం అక్కడకు వెళ్ళితే దగ్గరి కొండలు ఇంకా ఎక్కువ దగ్గర కొండలవుతాయి. దూరపు కొండలు దగ్గరి కొండలవుతాయి. కృష్ణలో ఈతకూడా వేయాలనుకొన్నాం. ఆ కొండలమీద అక్కడక్కడ అడివికూడా వుందని తెలుసు. ఆ ప్రాంతంలో ఏవో శిలా శాసనాలు, శిల్పాలుకూడా వున్నాయట.

మన ఇంటివద్ద పులిహోర చేయించుకొని మిత్రులమంతా అక్కడకు మూడు మైళ్ళలోవున్న కృష్ణాతీరానికి. అక్కడ కనుపించే కొండలవద్దకు బయలుదేరాం తొంపరకస. ఆ తరయుం వాగులు పెద్దపెద్ద బండలు దాటి రామన్నపేట వెళ్ళి కృష్ణ ఒడ్డుకు చేరుకున్నాం. కృష్ణకు ఇటువైపు. అటువైపు కూడా కొండ లున్నందువల్ల కృష్ణ ఇక్కడ వెడల్పులేదు. ఆ వడ్డునే వున్న వ్యక్తిని

ఈ పద్ధతిన ప్రంకి పిలవవచ్చు. వెడల్పు కోయడానికి వీలులేనందున లోతుకోసింది. ఇక్కడ కష్ణ చాలా లోతువుంటుంది. అందువల్లనే వేసవిలో కూడా అక్కడ నీరు తొణికిసలాడుతుంది. కృష్ణకు ఇద్దరి నందిగామ తాలూకా, అద్దరి సత్తెనపల్లి తాలూకా. కృష్ణ వడ్డు అంతా పెద్దపెద్ద బండలమయం. ఇంకా పైన అడివి చెట్లతో, పొదలతో నిండినచిన్న కొండలు. అడవిలో కొంతదూరంగా ఏవో రాళ్ళమీద శాసనాలు చెక్కి వున్నాయి. ఈ భాగాన్ని గుడిమిట్ట అంటారు. ఈ ప్రాంతాన్ని వేటవరపు పోతరాజు పాలించాడట. వేములవాడ భీమకవి ఈ రాజు ఆస్థానంలో వున్నాడని వాడుక.

## వరహాకు గిద్దెడు బియ్యం

ఇక్కడి శిలా శాసనాలను బట్టి ఇక్కడి రాజకుటుంబం కూడా కరువు మూలంగా నిరాహారులై మరణించినట్లు తెలుస్తుందట. డబ్బు కావలసినంత వుండి తినడానికి అన్నం లేక జనం నశించారట. ఒక శాసనంలో వుందట, వరహాకు గిద్దెడు బియ్యం దొరికినా కూడా ఇంకా కొన్ని సంవత్సరాలు జీవించే వాళ్ళం అని. ధనం వుండికూడా ధాన్యం లేనందున ప్రాణాలు పోయాయి.

అక్కడికి దక్షిణంగా ఒక మైలులో ద్వారక గట్టు అని వుంది. కృష్ణ వడ్డువే రాళ్ళు ఎక్కుతూ దిగుతూ అక్కడకు వెళ్ళాం. అక్కడ ఒక చెట్టునీడను కూర్చొని ఇంటినుంచి తెచ్చిన పులిహోర తిని కృష్ణానదిలోని నీలోదకాలను త్రాగాం. అన్నం కాని, మరొకటి కాని ప్రకృతి పరిసరాలలో కూర్చుని తింటూ వుంటే వుండే ఆనందం ఇంటివద్ద కూర్చుని తింటూ వుంటే వుండదు ఎందువలనో! ఇందుకు పరిసర ప్రభావమే కారణమై వుంటుంది. నిత్యం అలవాటయిన నాలుగు గోడలమధ్య, కప్పుక్రింద కూర్చుని తింటూ వుండడం పాతపడి పోయినందున అది మామూలుగానే వుంటుంది. కాని, ప్రకృతి పరిసరాలలో, అలవాటులేని కొత్తచోట, ప్రకృతిలోని అందాన్ని చూస్తూ విముక్తగగనం క్రింద కూర్చుని తినడంలో ఒక స్వచ్ఛందత, ఒక నూతన ఆనందమూ కలుగుతాయి. అందువల్ల ప్రతిపదార్థం కూడా ఇంటివద్ద కంటె బయట ఎక్కువ రుచిగా వుంటుంది.

అవతల ఒడ్డున పుట్లగూడెం అనే గ్రామమూ, ఇంకా దక్షిణంగా చింతపల్లి కనుపిస్తున్నాయి. కష్ణానది లెవెల్‌కు ఎంతో ఎత్తున బండలమీద కూర్చుని క్రిందికి కృష్ణలోకి చూస్తుంటే ఎంతో ఆహ్లాదంగా వుంది. సూర్యుడు పడమటి దిశకు

జారుతూన్నకొద్దీ వాతావరణంలో చల్లదనం ఎక్కువ కాసాగింది. చుట్టూవున్న ప్రకృతి సౌందర్యం ద్విగుణీకృతం కాజొచ్చింది. మేమంతలో కృష్ణలో స్నానం చేయడానికి తీర్మానించుకున్నాం. అక్కడ పశువులను కాస్తూన్న వాళ్ళున్నారు. కృష్ణలో ఇక్కడ పడ్డామంటే రెండు నిలువుల లోతువుంటుంది. మొసళ్ళుకూడా వుంటాయి కనుక మమ్మల్ని కృష్ణలో దిగవద్దని. బండలమీద వుండే స్నానం చేయమని చెప్పగా మేము ఆవిధంగా చేశాం.

చుట్టూ ఆనందమయ వాతావరణం కనిపించింది. ఆ తావును వదలి పోబుద్ధికావడంలేదు. అయినా ఇక ఎక్కువ ప్రొద్దులేదు. ఇంటిముఖం పట్టాం. నడచి ఇంటికొచ్చేసరికి చీకటిపడింది. మొత్తం ఆ రోజు పదిమైళ్ళు తిరిగివుంటాం. నా కాళ్ళు నొప్పులుగానే వున్నాయి. నొప్పులని ఎవరికి తెలియజేయలేదు. ఆకలివేస్తూనే వుంది కాని బడలిక మూలంగా భోజనం చేసే వోపికలేదు. తినకుండా పడుకుంటే శరీరం బాగాలేదనుకుంటారని కొంచెం పెరుగుతో తిని నిద్రించాను.

తుమ్మపూడి పోవలసిన గడువు ఇంకొక వారం రోజులలో వుంది. కోనాయపాలెం వచ్చింది మొదలు పుస్తకం కాని, పత్రిక కాని పట్టుకొని ఎరుగను. ఒంటరిగా కూర్చుని ఏమీ ఆలోచించి ఎరుగను. ఏవో అందరాని మధురానుభూతులను పొంది ఎరుగను. హిమాలయాలకు పయనించాలనే ఆకాంక్ష కొంచెం మనసక జారింది. ఈ కోనాయపాలెపు సందడిలో నాలో. నన్ను చూచుకొనే వాణ్ణి తుమ్మపూడిలో; మరి ఇక్కడ ఇతరులలో నన్ను చూస్తున్నాను. జీవితంలోని సూక్ష్మత్వం ఇక్కడ స్థూలరూపాన్ని ధరించింది.

## చదువంటే ఏమిటి ?

ఇక్కడ ప్రతివారు నన్ను చదువెందుకు మానుకొన్నావని ప్రశ్నించసాగారు. నేను ఏమి సమాధానం చెప్పాలో తెలియక నవ్వి వూరుకొనేవాణ్ణి. ఇతరులు నన్ను అడిగే ఈ ప్రశ్న ఒక్కొక్కసారి నన్ను నేనే అడగడం కూడా సంభవించేది. అయితే, ప్రశ్న సులభంగానే వుండేదిగాని దానికి సమాధానం మాత్రం అంత సులభంగా దొరికేదికాదు. నిజంగా నేను ఎందుకని చదువు మానేసినట్లు? దీనికి జవాబుగా మరో ప్రశ్న మాత్రమే దొరికేది. నేను చదువు మానేశానా? ప్రతినిత్యమూ తుమ్మపూడిలో చదువుతూనే వున్నామగా! పాఠశాలం మానివేసి నంత మాత్రాన చదువు మానివేసినట్లా? పాఠశాలకు వెళ్ళితేనే చదివినట్లా? పాఠశాలకు వెళుతూకూడా చదవకపోయినా అది చదువులోనే జమా! పాఠశాలకు

వెళ్ళకపోయినా కూడా చదువుతూంటే అది చదవక పోవడంలో జమా! లోకం దృష్టిలో పాఠశాలకు వెళ్ళటమంటేనే చదువు; నా దృష్టిలో పాఠశాలకు వెళ్ళక పోయినా కూడా చదువే.

హైస్కూళ్ళలో, కళాశాలలలో, విశ్వవిద్యాలయాలలో చదివి గొప్పగొప్ప డిగ్రీలు పుచ్చుకోడంలో కూడా వ్యామోహం కలగక పోలేదు. అయినా, అంత భారాన్ని, అంత బంధనను భరించడానికి మనస్సు అంగీకరించేదికాదు. అటువంటి చదివి ఎంతో మోయలేని భారంతో గోచరించేది. ఎంతో పాడలేని పాటగా, ఆడలేని ఆటగా గోచరించేది. అసలు అటువంటి భారమైన చదువు నా జీవితానికి అనవసర మనుకొన్నాను. నా ఆశయాలనందుకొనేందుకు పనికిరావు అనుకొన్నాను. ఆశయం అనే పదం వచ్చేవరకు అసలు నా జీవితానికి ఆశయం ఏమిటనే ప్రశ్న వచ్చేది. ఈ ప్రశ్న ఎన్నిసార్లు లేచినాకూడా దీనికి నాలో జవాబుదొరికేది కాదు. నేను పరమలక్ష్యాన్ని దృష్టిలో వుంచుకొని జీవిస్తున్నాను? ఏ ఆదర్శాన్ని అందు కొనే నిమిత్తం ఈ దైనందిన కార్యకలాపాలన్నీ సాగిస్తున్నాను? ఏ గమ్యాన్ని చేరడానికి ఈ జీవయాత్రను సాగిస్తున్నాను? ఊహూ, వీటికి జవాబే దొరకదు. వీటికి జవాబు దొరికే సమయం ఇదికాదు. ఇంకా ముందున్నదనే జవాబుతో మాత్రమే సంతృప్తిచెందేవాడిని.

## నక్కల పాట కచేరి

ఈ విధంగా ఆలోచిస్తూ కోట్లో బాబుగారింట రాత్రిపూట పడుకొని వున్నాను. పొద్దుపోయింది. నా చుట్టూవున్న వారంతా నిద్రపోతున్నారు. ఊరిబయటనుంచి నక్కలు అరవసాగాయి విచిత్ర ధ్వనులతో. తుమ్మపూడిలో నక్కల అరుపు విని పింపక విసుగెత్తిపోయింది. కోనాయపాలెంలో విపరీతంగా నక్కల అరుపులు వినబడతాయి. ఈ నక్కల అరుపులెందుకో నాకు శ్రావ్యంగా వినబడుతున్నాయి. నక్కలు అరుస్తూ మధ్యలో ఆపితే బాగుండేదికాదు. అవి తిరిగి ఎప్పుడు అరుస్తాయా అని ఎదురుచూ పేవాణ్ణి. మరీ చిన్నతనంలో ఈ నక్కల అరుపులు శ్రావ్యంగా వినిపించడానికి తోడు భయంకరంగా కూడా వినిపించాయి. కాని, అందులోని భయంకరత్వం నశించి శ్రావ్యత మాత్రమే మిగిలిపోయింది.

రాత్రులు నక్కల అరుపులు వినిపించడం మాత్రమేకాక బీళ్ళలో, వాగుల పొరంగాలలో పగలు అప్పుడప్పుడు నక్కల ఆకృతి కనుపించేది కూడా. నక్కను గురించి విశ్వసాహిత్యంలో చాలా కథలున్నాయి. దాని చురుకైన

తెలిపితే చాలు, సమయోచిత, జిత్తులస్వభావం, దాని మంచితనం, పెద్దతనం అన్నీ, గుర్తుకు వచ్చేవి. దాని ఆకృతిని చూడగానే, దాని ఆకృతిలో దాని జల్లితోకా, దాని సన్నని మూతి ప్రత్యేకంగా గోచరించేవి. రాత్రులు అంత శ్రావ్యంగా ఏలా అరుస్తుందో నేను చూస్తుండగా పగలు అరచి చూపితే బాగుండుననిపించింది; దాన్ని చూడగానే "నక్కబావా" అని పిలవాలనిపించింది

రాత్రులు నిద్రరానప్పుడల్లా కోనాయపాలెంలో ఈ నక్కల పాట కచేరీ వింటూ పడుకొంటే ఆహ్లాదంగా వుండేది. ఆ అరుపులో వుండే ఆరోహణావరోహణాలు నా హృదయంలో ఏదో లయాత్మకతను సృష్టించేవి. కటుత్వంలోనే ఏదో మృదుత్వం తోచేది. నక్కలు బొందలలోనుంచి శవాన్ని బయటికి లాగి తింటాయని తెలిసినందున వాటిలో కొంత బీభత్సత ప్రత్యక్షమయేది. అయినా కూడా ఆ బీభత్సతతో ముడిపడి వుండికూడా నక్కల అరుపులలో ఏదో ఆనందం తట్టేది, అది పైశాచికానందం అనేవాళ్ళు పెద్దలు!

# గరుడ, సర్పయుద్ధం; పొట్టేలుతో కుస్తీ

శిశిర వసంతాల సంధికాలం మనోహరంగా వుంటుంది. కాని, వసంత, గ్రీష్మాల సంధికాలం మాత్రం మహా రౌద్రంగా వుంటుంది. మొదటిది కోమలతకు ప్రతిబింబం, రెండవది కఠోరతకు. అయితే ఈ కోమలత కఠోరమైన గ్రీష్మాన్ని తెస్తే ఆ కఠోర గ్రీష్మం తిరిగి కోమలమైన వర్షాన్ని తెస్తుంది. మొదటిదాని వర్తమానకాలం సుఖదం అయి భవిష్యత్తు బాధాజనకం అవుతుంది. రెండవదాని వర్తమానకాలం బాధాజనకమై భవిష్యత్తు సుఖదం అవుతుంది.

సరే, తుమ్మపూడిలో అది శిశిర, వసంతాల సంధి. ఒకచోట కొన్ని చెట్లు ఆకులురాలి మోడులుగా నిలచివుంటే, ఇంకొకచోట కొన్ని చెట్లు ఎర్రని మొగ్గ తొడిగి వుండేవి. మా నారింజతోట కంచెలో ఒక బ్రహ్మాండమైన ముళ్ళబూరుగు వృక్షం వుంది. ఇది తెల్ల బూరుగుకాక ఎర్ర బూరుగు. పెద్దపెద్ద తొర్రలు. వంగలు కలిగి భీకరంగా వుండేది. ఈ శిశిర వసంతాల సంధిలో దాని ఆకంతా రాలిపోయి అస్థిపంజర రూపంలో వుండి అక్కడక్కడ కొమ్మలకో ఎక్కడైనా ఒక ఎర్రని మొగ్గను వేసేది. ఏమీలేని దిసి చెట్టున, ఎక్కడో మూరాన చిటారు కొమ్మన. నీలాకాశం క్రింద ఆ ఎర్రని మొగ్గ అద్భుతంగా గోచరించేది. నీల మేఘాల్లోని మెరుపులాగా ఎల్లప్పుడూ ఆ బూరుగుచెట్టు దగ్గరకు వెళ్ళి ఆ ఎర్ర మొగ్గను ఆ నీలాకాశంతో కలిపి చూడబుద్ధి ఆసేది.

అయితే, ఆ చెట్టుదగ్గరకు పోవడంలో కేవలం ఆనందమేకాదు భయంకూడా వుంది. ఆ చెట్టు మొదటిలో పెద్దపుట్ట, ఆ పెద్ద పుట్టలో ఒక పెద్దపాము. ఆ పాము అప్పుడప్పుడు నాకు కనుపిస్తూంటుంది. అది బయటినుంచి పుట్టలోకి పోవడం, పుట్టలో నుంచి బయటికి రావడం కూడా నేను అప్పుడప్పుడు చూస్తుండేవాణ్ణి. ఈ విధంగా ఆ బూరుగు వృక్షం ఆనందానికి, భయానికి కూడా చిహ్నంగా నిలచింది. దూరంగా నిలచి చూడడానికి ఆనందంగా వుండేది, దగ్గరకు పోవడానికి భయంగా వుండేది. అయితే మనసులో నాకో ధైర్యం వుండేది. అది మన బూరుగు వృక్షం. దాని క్రిందిది మన పుట్ట. అందువల్ల, ఆ పుట్టలోనిది మనపాము. మన పాము నన్ను ఏమంటుంది కనుక? ఆ పామును నేను మనదిగా భావించి నట్లే ఆ పాముకూడా నన్ను తనవాడుగా తప్పక భావించివుంటుంది. కనుక ఆ చెట్టు మొదటి పుట్టదగ్గరకు పోవడానికి నేనేమీ భయపడవలసిన పనిలేదని

నమ్మి ఆ పుట్టదగ్గరకు పోవడం ప్రారంభించాను. శిశిరం పూర్తిగా అంతరించి పోయి వసంతం పూర్తిగా ప్రవేశించిన తరువాత ఆ బూరుగుచెట్టు నిండా ఎర్రని పెద్దపూలు పూచినాయి. ఒకోసారి ఆ పూలు చెట్టుక్రింద రాలుతూండేవి. వాటిని తెచ్చుకోటానికి పాము కనిపిస్తుందేమో చూడాలని ఆ చెట్టుక్రిందకు, ఆ పుట్ట వద్దకు పోయేవాణ్ణి. ఆ చెట్టు కొమ్మలమీద మామూలు గద్దలు కొంత భాగం తెల్లగా వున్న గరుత్మంతుడనబడే గరుడ పక్షులు కూడా కూర్చొని వుండేవి.

## గరుడ, సర్ప యుద్ధం

ఒక రోజు మధ్యాహ్న సమయంలో నేను ఆ బూరుగు వృక్షం క్రింద ఏదో శబ్దం అవుతుంటే విని వెళ్ళాను. నా కళ్ళను నేను నమ్మలేక పోయాను. గరుడ పక్షులకు పాముకు ఘోరమైన యుద్ధం జరుగుతూంది. ఆ దృశ్యాన్ని చూచి భయపడాలో, ఆనందించాలో నాకు తోచక చాలినంత దూరంలో నిలచి చూస్తూ వుండిపోయాను. పుట్టకు కొద్దిదూరంలో పాము బుస్సు మంటూ పడగవిప్పి పైకి లేస్తున్నది గరుడపక్షులు కాళ్ళతో, గోళ్ళతో పామును తన్నుతున్నాయి. కొంచెం సేపటికి పాము తన పుట్టలోకి వెళ్ళిపోయింది. పక్షులు చెట్టు కొమ్మలెక్కి కూర్చున్నాయి. ఈ విషయం తోటలో వున్న వాళ్ళందరికి చెబితే వాళ్ళంతా పరుగెత్తుకు వచ్చి చూస్తే అక్కడ పక్షుల ఈకెలు. కొన్ని నెత్తురు మరకలు తప్ప ఇంకేమీ గోచరించలేదు.

అటు తరువాత మూడు నాలుగు రోజులకు ఆ పుట్ట దగ్గరకు పోతే ఏదో చచ్చి కుళ్ళినవాసన రాజొచ్చింది. అనుకొన్నాను, పక్షుల దాడికి పాముకు గాయాలు తగిలి వాటితో దాని ప్రాణం పుట్టలోనే పోయి వుంటుందని. అది మొదలు ఆ చెట్టు దగ్గర ఆ పాము కనుపించడంలేదు. అలవాటయిన పాము కనుపించక పోవడంతో ఆ చెట్టున్న ప్రాంతం అంతా ఏదో శూన్యంగాను, ఆ చెట్టులోని ఆకర్షణ ఏదో నీరసంగాను అనిపించసాగింది.

ఆ పాము చనిపోయినంత మాత్రాన మా తోటలో పాములు లేకుండాపోలేదు. తోటకున్న కంచెలు అరణ్యాలలాగా వుండేవి. వాటిలో రకరకాల పాములు — త్రాచులు, జెర్రిపోతులు, రక్తపింజేరులు, పసిరిక పాములు — ఎన్నో తిరుగు తుండేవి. కాని అవి ఎవరినీ హింసించినట్లు లేదు; ఎవరైనా వాటినే హింసించే వాళ్ళు. నేను చూస్తుండగానే మా పనివాళ్ళు కొన్ని పాములను కర్రలతో కొట్టి చంపివేశారు.

ఇటువంటి సర్పాంతో నిండిన తోటయే అప్పటి నా విహారవాటిక; నా పఠనాలయం, నా ఊహారూపాలు తయారయే కర్మాగారం. తోటలో నా గ్రంథ పఠన సాగుతూనే వుండేది. ఏదో ఒక ఇంగ్లీషు మాసపత్రిక చదువుతుంటే అందులో విక్టర్ హ్యూగో వ్రాసిన ఈ పంక్తులు నన్ను ముగ్ధుణ్ని చేసినాయి: **"There is one thing grander than the sea; that is the sky. There is one thing grander than the sky; that is the human soul".** సముద్రానికంటె మహత్తరమైన వస్తువు ఒకటి వుందట అది ఆకాశమట. ఆకాశానికంటె మించిన మహత్తరమైన వస్తువు మరొకటుందట. అది మానవుని ఆత్మ అట. ఈవాక్యాలు ఇచ్చిన ప్రేరణలో నేను దానికి మరికొన్ని వాక్యాలు కలిపాను. "నీటిబిందువుకంటె మహత్తరమైన వస్తువు ఒకటుంది; అది కడవలోని నీరు. నీరుకంటె మహత్తరమైన వస్తువొకటుంది: అది బావి. బావి కంటె మహత్తరమైన వస్తువొకటుంది; అది నది. నదికంటె మహత్తరమైన వస్తువొకటివుంది; అది సముద్రం. ఇక తరువాత భాగం విక్టర్ హ్యూగో వాక్యాలు.

ఒకో పెద్దది దానికంటె చిన్నదాన్ని నిర్మిస్తుందేమో అనిపించింది. మానవుని ఆత్మ తనకంటె చిన్నదయిన ఆకాశాన్ని నిర్మిస్తే ఆకాశం తనకంటె చిన్నదయిన సముద్రాన్ని నిర్మిసుంది. ఇక సముద్రం తనకంటే చిన్నదయిన నదిని నిర్మిస్తే, నది తనకంటే చిన్నదయిన వాగును. మరి ఇంక మానవుని ఆత్మ వీటన్నిటి నిర్మాణానికీ మూలమైతే, మానవుని ఆత్మ నిర్మింపబడడానికి ఏది మూలం? అసలు పెద్దదనేది చిన్నదాన్ని ఎలా నిర్మిస్తుందా అని? నది వాగును నిర్మించదు, సముద్రం నదిని నిర్మించదు, వాగులు నదిని నిర్మిస్తాయి, నదులు సముద్రాన్ని నిర్మిస్తాయి, సముద్రం ఆకాశాన్ని నిర్మిస్తే ఆకాశం మానవుని ఆత్మను నిర్మిస్తుందా? ఏమో! అంతా చిక్కు చిక్కుగా వుంది. అసలు ఎవరూ దేన్ని నిర్మించకుండా అన్నీ దేనికవే నిర్మాణం అవుతాయేమో!

## పొట్టేలుతో కుస్తీ

మా తోటను మక్తాకు తీసుకొన్న ముస్లిములు ఒకగొర్రెపొట్టేలును పెంచసాగారు. దానికి వంకరలు తిరిగిన కొమ్ములు కూడా వచ్చినాయి. నేను ప్రతి నిత్యం ఆ పొట్టేలుతో కుస్తీ పట్టే వాణ్ణి. నన్ను చూడగానే అది పరుగెత్తుకువచ్చి తాకేది. అందుకని దాన్ని కట్టివేసే వుంచుతున్నారు. ఒక రోజు దాన్ని విప్పి కుస్తీపట్టి

సాగాను. అది వెనక్కు వెళ్ళి ఒక్క పరుగున వస్తూంటే నేను వెనక్కు వెనక్కు వేగంగా పోతున్నాను. వెనకగా ఒక పెద్ద వల్లరాతి బండ వుంది. ఆ వేగంలో నా మనువు ఆరాతికి కొట్టుకొని పగిలి రక్తం కారసాగింది. ఇంతలో పొట్టేలు కూడా వచ్చి తాకింది, దాంతో క్రింద పడిపోయాను. కాలి గాయమే కాక క్రింద పడినందున కూడా దెబ్బ తగిలింది. వాళ్ళు వచ్చి పొట్టేలును లాగి నన్ను లేవదీశారు.

ఆ గాయంతో, ఆ బాధతో ఇంటికి పోవడానికి నాకు మనస్కరించడం లేదు. అయినా పోకతప్పదు. ముఖం వేళ్ళాడవేసుకొని ఇంటికివెళ్ళాను. నన్ను చూచి కొందరు జాలి చెందారు. కోపపడేవారు కోపపడినారు. మా తండ్రి గారు ఆ రెండింటీమారంగా తటస్థంగానే వుండిపోయినట్టున్నారు! మూడు రోజులపాటు జ్వరం వచ్చి లేవాను. కాలిగాయం కూడా తగ్గుముఖం పట్టింది. మళ్ళీ ఆ గొర్రెపొట్టేలును చూడాలనిపించింది. తోటలోకి వెళ్ళాను, పొట్టేలు లేదు. విచారిస్తే తెలిసింది -దాన్ని నాకు దెబ్బతగిలిన మరునాడే కోసి తినివేశారట. నా మనస్సు చివుక్కుమంది. నన్ను హింసించిందికదా అని దాన్ని చంపారు. నామూలంగా దాని ప్రాణం పోయిందికదా! అని ఎంతో వేదన బాధపడినాను. దాని మూలంగా నాకు దెబ్బ మాత్రమే తగిలింది కాని నా మూలంగా దాని ప్రాణమే పోయింది. ఇక నేను నేటి నుంచి ఎవరితో కుస్తీలు పట్టి దెబ్బలు తినేది! దాన్ని కోసి తిన్నవాళ్ళలో లేశమైన దాన్ని గురించిన జాలి కనిపించలేదు. పెంచడం చంపడానికే కాబోలు!

రోజావలెనే ఒక సాయంత్రం కాలువ గట్టున వరకు వెళ్ళాను. కాలువలో గుండా అనేక పడవలు తెరచాపలెత్తుకొని, తెరచాపలు దించుకొని వస్తూ పోతూవున్నాయి. కొన్నిటిని లాగుతున్నారు, కొన్నిటిని గడలతో నెడుతున్నారు. కొన్ని గాలివాటున తెరచాపల సహాయంతో తేలిపోతున్నాయి. కొన్ని పడవలు ఈ ఈ కాలువగుండా మదరాసు కూడా పోతాయట. మదరాసు ఇక్కడకు రెండు వందల యాభై మైళ్ళు. నావన్ను ఇరవై రోజులలో పడవ మదరాసు చేరవచ్చునేమో. ఇరవై రోజులపాటు పడవమీద పోతూంటే ఎంత బాగుంటుందో. పడవలోనే భోజనం, పడవలోనే నిద్ర!

కొంతసేపటికొక కొత్తరకం బోటు కనిపించింది. తెల్లగా ఇల్లులాగావుంది. మనుషులు లాక్కొని వస్తున్నారు. ఆ బోటుకు వెనకప్రక్క పడకకుర్చీలో వయసు మళ్ళిన ఒక తెల్లని వ్యక్తి కూర్చొని నాలుగువైపులా పరికించి చూస్తున్నారు. పడవలాగే మనుషులు చెప్పారు : అయన కలెక్టరు అని. అప్పుడు గుంటూరు

జిల్లాకు ఒక ఐరిష్ వ్యక్తి కలెక్టర్‌గా వుంటున్నాడని వినివున్నాను. ఆయన చాలా ఉత్తముడని, తన ఐర్లాండ్ స్వాతంత్ర్య సమరం సాగించిన దేశం కావడంవల్ల స్వాతంత్ర్యం విలువ తెలిసిన వాడని, అందువల్ల అప్పటి సత్యాగ్రహ సమరంలో పాల్గొన్న ఆంధ్రులపట్ల సానుభూతితో వుండేవాడని వినివున్నాను. అందువల్లఆయన పట్ల గౌరవం ఏర్పడింది. ఇతనే బ్రిటిష్ వ్యక్తిఅయివుంటే నా దగ్గర బాంబు గనుక వుండివుంటే తప్పకదాన్ని అతనిపైకి విసరివుండేవాణ్ని. నేను ఆయనను చూస్తు నిలిచిపోయాను. అతనునావైపు కూడా చూస్తు వెళ్ళిపోయాడు.

## స్వాతంత్ర్య భావోద్దీపన

ఒక్కసారి నా కళ్ళ ఎదుట జలియన్‌వాలాబాగ్ మారణహోమం, తరుణ దేశభక్తులను ఉరితీయడం, సత్యాగ్రహ సమరంలో మనుషులను విరగబాదడం, ప్రజలను, నాయకులను కూడా చెరసాలలో బంధించి హింసించడం మొదలైనవన్నీ గిర్రున తిరిగిపోయినాయి. ఈ విదేశీ ప్రభువులను, వాళ్ళ అధికారులను ఏమిచేసినా తప్పులేదనిపించింది. ఒకరి దేశంమీద మరొకరు ప్రభుత్వం చేయడానికి ఏమిహక్కు వున్నదనిపించింది. గాంధీగారి అహింసామార్గంలో నాకు పూర్తిగా నమ్మకం లేకుండా పోయింది. ఏ మార్గంద్వారా అయినా, ఎంత రక్తపాతం ద్వారా అయినా దేశ స్వాతంత్ర్యం ప్రాప్తించాలనిపించింది.

ఈ ఆలోచనలతోనే ఇంటికి తిరిగి వస్తున్నాను. కాలవలోని నీటిమీద ఎన్నో పడవలు పోతున్నాయి. కాలవకట్టమీద ఎన్నో ఎడ్ల బండ్లు పోతున్నాయి. సూర్యుడస్తమించాడు. కనుచీకటి పడుతూంది. కాని నేను పూర్తిగా దేశ స్వాతంత్ర్యాన్ని గురించిన ఆలోచనలలో మునిగిపోయి నడుస్తూండడంలో నాకు కాలువలోని పడవలు కాని, కాలువబయటి బండ్లుకాని, బయటి దృశ్య జగత్తునంతా అలముకొంటున్న కనుచీకటి కాని కనుపించడంలేదు. వేగంగా నడచి ఇంటివైపు వచ్చివేస్తున్నాను. ఒకోసారి ఎప్పుడైనా సమాధి శిథిలమైనపుడు మాత్రం అవన్నీ గోచరించేవి. మనిషి ఆలోచనలో నిమగ్నమై వున్నప్పుడు కనులు కనుపించవు; చెవులు వినిపించవు. అయితే చూచేది కన్నులు కావన్నమాట. వినేది చెవులు కావన్నమాట!

ఆలోచనలలో మునిగి ఇంటికొచ్చేవరకు ఆ రోజు చీకటిపడింది. ఇంటివద్ద ఎవరెవరో గ్రామఫోన్ మ్రోగిస్తూ కూర్చున్నారు. నేను భోజనం చేసి వెళ్ళి పడుకుంటే నిద్రపోయేవరకు రికార్డులు వినిపిస్తూనే వున్నాయి.

# తుమ్మపూడి ఈతకల్లు; ఆంధ్రపారిస్ సందర్శన

కర్ణాటక సంగీతం రికార్డు లెన్నో వున్నాయి. కోయంబత్తూరు తాయి, బెంగుళూరు నాగరత్నం, బిడారం రాచప్ప, కిష్టప్ప, వనజాక్షి, ఫ్లూట్ సంజీవరావు మొదలైనవారి రికార్డు లెన్నో వున్నాయి. వనజాక్షి పాడిన జావళీలు, మిగతావారు పాడిన త్యాగరాజు కృతులు, నన్ను తన్మయుని చేసినాయి. మేఘాల చాటున నడుస్తున్న చంద్రునితో కలిసి ఆకాశవీధుల్లో నన్ను సంచరింపజేసింది ఆ సంగీతం. అన్నిటికంటె మించి సంజీవరావు వాయించిన మురళి నన్నెక్కువ ఆనందపరచింది. మురళి, వేణువు, పిల్లనగ్రోవి, ఫ్లూట్ మొదలైన ఆ పదాలలోనే ఏదో అద్భుతమైన ఆకర్షణ కనిపించేది. వేణు వాద్యం నేర్చుకోవాలని నిశ్చయించుకొన్నాను. ఒక్కొక్కసారి నా నిశ్చయాలమీద నాకే నమ్మకం వుండేది కాదు. ఇంకా పగటి నిశ్చయాలైనా కొంతవరకు నిశ్చయంగా వుంటవేమోకాని రాత్రుల నిశ్చయాలు తెల్లవారేసరికి కరగిపోయేవి! ఫ్లూట్ నేర్చుకోవాలనే నిశ్చయం మాత్రం కరగిపోక కార్యరూపం దాల్చింది. ఫ్లూట్ తెప్పించడం, దాన్ని సాధన చేయడంకూడా జరిగింది. అయితే, ఆ సాధన నాకు ఆనందం ఇచ్చేంత వరకే నిలచిపోయింది. కాని పాట కచేరీలు చేసి శ్రోతలను మెప్పించేంతవరకు ముదరలేదు.

జీవించడం వేరు, జీవితాన్ని అర్థం చేసుకోవడం వేరు. జీవిస్తున్నవాళ్ళంతా జీవితాన్ని అర్థంచేసుకొని జీవించరు. జీవించడం సులభంగా, తేలికగా దొర్లిపోతుంది. కాని అర్థం చేసుకొని జీవించడం అంత సులభంగా దొర్లిపోదు. అటువంటప్పుడు అర్థం చేసుకొని జీవించడం కంటే అర్థం చేసుకోకుండా జీవించడమే హాయిగదా, ఇక జీవితాన్ని అర్థం చేసుకొని జీవించవలసిన అవసరం ఏముంది? విద్య నేర్చుకోవడానికంటే విద్య నేర్చుకోకుండా వుండడం హాయి అయినపని. అందుకని విద్య నేర్చుకోకపోవడమే మంచిదా? జీవితాన్ని అర్థం చేసుకోకుండా జీవించడమూ అంతే.

మా చేలనిండా ఈతచెట్లు, తాడిచెట్లు అసంఖ్యాకంగా వుండేవి. వాటినుంచి కల్లుగీసేవాళ్ళు. తుమ్మపూడి కల్లు చాలా ప్రసిద్ధి. బెజవాడ, తెనాలి నుంచి కూడా తుమ్మపూడికి వచ్చి జనులు కల్లుత్రాగి పోతూండేవాళ్ళు. ఆ గీసేవాళ్ళు మా దగ్గర

తాటిచెట్లు, ఈతచెట్లు కొన్నా కూడా మా పనివాళ్ళకు మాత్రం ఉచితంగానే కల్లు పోసేవాళ్ళు. ఆ విధంగా పోయనివకున తెల్లవారేసరికి చెట్లకున్న కల్లుబొట్లు ఖాళీ చేస్తారు.

మా పనివాళ్ళు నిద్రలేవగానే ఈతచెట్లలోకి పోయి ఆ ఈత చెట్టు పుల్లతోనే పళ్ళుతోమి ఆ ఈతకల్లుతోనే నోరుకడిగి ఆ ఈతకల్లునే పొట్టపట్టినంత త్రాగేవాళ్ళు. అది చూడటం నాకు సరదాగా వుండేది. బాగా దాహం అయినప్పుడు కూడా మనిష చెంబునీళ్ళకంటె ఎక్కువ త్రాగలేడు. కాని కల్లు ఒకేసారి అరకడవ, కొంచెం అలవ్యంగా కడవకూడా త్రాగుతారు. ఆ మోతాదులో కల్లు త్రాగడం చూస్తే నా కాశ్చర్యం వేసేది. అంత త్రాగినా కొందరేమీ తొణికేవాళ్ళు కాదు. మరి కొందరు తూలుతూ పిచ్చిమాటలు ప్రారంభించేవాళ్ళు. ఇదీ నిత్యం జరిగే కల్లు తంతు.

ఇంత రుచిగల కల్లుకు ప్రసిద్ధి చెందిన వూరుకు ఎక్కడెక్కడికి బిచ్చగాళ్ళు, ఆటవికులు, దేశదిమ్మరులు, కోయలు, పాములవాళ్ళు, బుడబుక్కలవాళ్ళు, బుడిగె జంగాలు, పిచ్చి గుంటలవాళ్ళు, బొమ్మలాటవాళ్ళు, పందులవాళ్ళు, పగటి వేషగాళ్ళు, పరికిముగ్గులవాళ్ళు, దేవరగుడితో అడుక్కొనే ముతరాచులు, చెంచులు, గంగిరెద్దులవాళ్ళు, కన్నాలువేసే ఇతర దేశదిమ్మరులు వచ్చి గుడిసెలు వేసుకొని మకాములు పెడుతుండే వాళ్ళు.

## బుడబుక్కల వాళ్ళు

మా పశువుల పాకదగ్గర మైదానంలో బుడబుక్కలవాళ్ళు రంగు గుడ్డల గుడారాలు వేసి వున్నారు. బుడబుక్కలవాళ్ళు రెండు తెగలు, సాదా బుడబుడక్కలు, ఆరె బుడబుడక్కలు. సాదా బుడబుడక్కలు పగటిపూట మాత్రమే అడుక్కుంటాయి. ఆరె బుడబుడక్కలు తెల్లవారుజామున కొన్నాళ్ళు గ్రామక్షేమాన్ని ఆకాంక్షిస్తూ, గ్రామశత్రులను ప్రశాంతి పరుస్తు, రావిచెట్లమీది భూత, భేతాళ, ప్రేత, పిశాచాలను ఊరడిస్తు తిరిగి తరువాత ఒకరోజున అడుక్కుంటారు. ఆరె బుడబుడక్కలు తమలో తాము ఆరెభాష, అంటే బొమ్మలాటవాళ్ళు మాట్లాడుకొనే అపభ్రంశపు మరాఠీ మాట్లాడుకొంటారు. మా ఊరులో గుడారాలు వేసినవాళ్ళు ఆరె బుడబుక్కల వాళ్ళే.

నేను నిరుటి సంవత్సరంలో కంటె ఈ సంవత్సరంలో మరొక సంవత్సరం పెద్దవాణ్ణి అయ్యాను. పదిహేనో సంవత్సరం వచ్చింది. మనుషులను, మాటలను,

మాయలను, మర్మాలను ఇంకొంచెం లోతుగా అర్థంచేసుకోగలుగు తున్నాను. పెద్ద జగత్తులోని మాధుర్యం ఊహలలో రూపొందుతూంది; ఊహా రూపాలు శరీరం మీద ప్రతిబింబాలు వేస్తున్నాయి.

## ఉడుముల వేట

ప్రతి సాయంత్రమూ వెళ్ళి అరె బుడబుడక్కుల గుడారాల దగ్గర కూర్చునే వాణ్ణి. వాళ్ళు దేశాటన కబుర్లు వింటూ నే నానందిస్తూ, దేశంలోని రాజకీయ విషయాలు మొదలైనవిచెప్పి వాళ్ళను ఆనందపరచేవాణ్ణి. స్త్రీలూ, పురుషులూ వాళ్ళలో వాళ్ళు అరె భాష మాట్లాడుకొంటూ నాతో యాస తెలుగు మాట్లాడేవాళ్ళు. మగవాళ్ళు పొలాల మీద వేటాడితెచ్చిన ఉడుములను, ఉడతలను, పిట్టలను ఆడ వాళ్ళు కాల్చి, కోసి కూరలు వండేవాళ్ళు. ఒక సాయంత్రం వర్షం కురిసి వెలసి పగిలిన పడమటి మబ్బులలోగుండా నారింజ రంగులు కనిపిస్తున్న సమయాన నేను వాళ్ళ గుడారాల దగ్గర కూర్చునివుండగా వాళ్ళలోని వానోజీ అనేవాడు రెండు పెద్ద ఉడుములను చంపి తీసుకువచ్చాడు. వాటిని మంటలో వేసి కాల్చసాగారు. ఆ కాలుతూన్న వావన వాసు చాలా దుర్వాసనగా తట్టసాగింది. ఆ మంటచుట్టూ పిల్లలుచేరారు. ఆ ఉడుములు కాలేవరకు వాళ్ళు వోర్చుకోలేకపోతున్నారు. ఆ పిల్లలలో వన్నెండు, పదమూడు ఏళ్ళ అమ్మాయి వానోజీ కూతురుకూడావుంది. ఆ అమ్మాయి రంగులోను, రూపంలోను, మాటలోను, నడకలోను ఎంతో అందంగా వుండేది. ఈ అమ్మాయి ఆ కాలికాలని ఉడుముతోకను తుంచి కరకర నమల సాగింది. నా శరీరం ఒక్కసారి కంపించింది. ఆమెలో నిత్యము కనిపిస్తూన్న సౌందర్యమంతా ఒక్కసారి నా దృష్టిలో కురూపంగా మారిపోయింది. అది మొదలు ఆమె కనుపిస్తే ఏదో భయంగా తట్టేది.

సాయంకాలాలలో వర్షం వెలిసిన విశాలాకాశం క్రింద వాళ్ళ రంగుల గుడారాలు, పొయ్యిలలోనుంచి లేస్తున్న పొగలు, దూరంనుంచి చూస్తుంటే, ఏదో ప్రకృతి చిత్రించి ఉంచినట్లు తట్టేది. దగ్గరకుపోతే మాత్రం కొన్ని వసూలు వాళ్ళని హోరంగా కనుపించేవి. దూరంగా చూస్తే కనుపించే మన్నని కొండలు దగ్గరకు పోయేసరికి బండలు బండలుగా వుంటాయి. దగ్గరలోకంటే దూరంలోనే ఎక్కువ ఆకర్షణ కాబోలు, ఎక్కువ ఆనందం కాబోలు!

## గ్రంథ పఠనం

అటు ఇంగ్లీషులో క్లిష్టమయిన గ్రంథాలు చదువుతూనే మధ్య మధ్య తెలుగు మాసపత్రికలలోని కథలను. ఆ కథలను చదివి ఆనందిస్తుండేవాణ్ణి. ఆ

కథలు ప్రేమకూ, ప్రణయానికి ఎక్కువ సంబంధించి వుండేవి. అవి చదువు తుంటే ఇంగ్లీషు గ్రంథాలలో దొరకని ఏదో ఉత్తేజంగల ఆనందం దొరుకుతుం డేది. ఒకవైపు తత్త్వశాస్త్రాలు, రెండోవైపు ప్రణయగాథలు చదవడంలో ఒక దానిలో లేనిది మరోదానిలో దొరికేది. ఒక దానిలో తట్టిన నిండుదనం రెండవ దానిలో తట్టేది కాదు! రెండవదానిలో తట్టిన రసోద్రేకం మొదటిదానిలో తట్టేది కాదు; ఒకదానిలో ఆలోచన, తర్కము మేధకు పదును పెట్టేవి. రెండవదానిలో అనుభూతి, రసావేశమూ హృదయాన్ని సజీవపరచేవి. ఈ రెంటిలో ఏది నాకు ముఖ్యమో అర్థమయేది కాదు. అందువల్ల రెండూ ముఖ్యమే అని నమ్మసాగాను! రెండూ అముఖ్యమని మాత్రం నమ్మలేకపోయాను

## తెనాలి ప్రత్యేకత

నేను ఈ గ్రామంవచ్చి మూడు సంవత్సరాలు కావస్తుంది. కాని, ఈ గ్రామం ఏ తాలూకాకు చెందివుందో ఆ తాలూకా ముఖ్యనగరమైన తెనాలినికాని, జిల్లా ముఖ్యనగరమైన గుంటూరునుకాని చూడలేదు. రాజధానికి ముఖ్యనగరమైన మదరాసును మాత్రం చూశాను; రైల్వే జంక్షనైన బెజవాడను చూడడమేకాక రెండుమాసాలు అక్కడ నివాసమే చేశాను. ఎప్పుడైనా తెనాలి, గుంటూరు కూడా చూడాలని నిర్ణయించుకొన్నాను. అయితే ఏ పనిమీద వెళ్ళి చూడాలి? బెజవాడ పనివుంటే చూడడం జరిగింది. మదరాసుకూడా పనివుండి వెళ్ళి చూడడమే జరి గింది. మరి తెనాలి, గుంటూరులను చూడడానికి ఏమి పనులను కల్పించుకోవాలో తెలియలేదు.

తుమ్మపూడినుంచి కొందరు పెద్దలు నిత్యం తెనాలి వెళ్ళి వస్తుండేవారు. ఉదయం రైలులో వెళ్ళడం, సాయంత్రం రైలులో రావడం. వీరంతా ఏ పనుల మీద తెనాలి వెళ్ళుతున్నారో తెలుసుకొన్నాను, కొందరు కోర్టు పనిమీద కొందరు వ్యాపారపు పనులమీద, కొందరు ఏ పనీ లేనందున తెనాలి వెడుతుంటారని విన్నాను. నాకు కోర్టుపని లేదు, వ్యాపారపుపని అంతకంటే లేదు. ఇక ఏ పనీ లేకుండా వెళ్ళడం అనేది నాచేతకాదు. ఏపని లేకుండా వెళ్ళి ఆ బస్తీలో ఎక్కడకు పోవాలి, ఏమి చేయాలి? అయితే ఏ పనిలేకుండా మా గ్రామంనుంచి వెళ్ళేవారు నిజంగా ఏ పనిలేకుండా వెళ్ళడం కాదని, తెనాలిలో కాఫీ త్రాగి రావడానికి, పెరి గిన క్రాపులు కత్తిరవేయించుకు రావడానికి పోతుంటారని విన్నాను. ఈ రెండు పనులుకూడా నాకు అవసరంలేని పనులైనాయి. కాఫీ త్రాగడం నాకు అలవాటు లేదు. నా క్రాపును ఇక్కడే మా మంగలి శోభనాద్రి అందంగా కత్తిరించేవాడు.

మా గ్రామంనుంచి మరికొన్ని పనులమీదకూడా ప్రౌఢయువకులు తెనాలి పోతుంటారని తెలిసింది. రైల్వేస్టేషన్‌లోని స్పెషల్ రూములలో విస్కీ, బీరు, జిన్ మొదలైనవి సేవించి ఆ రాత్రి ఏ యువతులతోనో కాలంగడిపి రావడానికి కూడా పోతుంటారని. ఈ రెండుపనులు కూడా నా కందరాని పనులు. ఇక ఏ పని మీద తెనాలి పోవాలో తెలియక తెనాలి పోనేలేదు. ఆంధ్రదేశానికి పారిస్ అట తెనాలి.

తెనాలి చూడటం కంటె ముందు గుంటూరు చూడడమే జరిగింది. అది కూడా తుమ్మపూడినుంచి గుంటూరు వెళ్ళలేదు. ఆ సంధ్య తుమ్మపూడినుంచి మళ్ళీ కోనాయపాలెం వెళ్ళడం జరిగింది. కోనాయపాలెం నుంచి కోట్లోబాబు గుంటూరుకు వెళ్ళుతున్నారు ఏదో వ్యవహారం నిమిత్తం. నేనుకూడా ఆయనవెంబడించాను గుంటూరు. కోనాయపాలెం నుంచి పోపూరుకు గుఱ్ఱంమీద. పోపూరు నుంచి అమరావతికి కృష్ణానదిపైన పడవలోను, అమరావతి నుంచి గుంటూరుకు బస్సులోను. బెజవాడ కంటె గుంటూరు చాలా విశాలంగా గోచరించింది. బెజవాడలో కొండలు, కృష్ణానదీ వున్నాయి. గుంటూరులో ఆ రెండూ లేవు. బెజవాడలో పెద్ద రైలుస్టేషన్ వుంది గుంటూరులో అంత పెద్ద స్టేషన్ లేదు. గుంటూరులో పెద్ద హాస్పిటలులూ, పెద్ద కాలేజీ వున్నాయి. బెజవాడలో అవి లేవు. గుంటూరును చూస్తుంటే ఇది మన జిల్లాకు ముఖ్యనగరం కదా అని గుర్తు వచ్చింది.

మా జిల్లా ముఖ్యనగరమైన గుంటూరు చూడడం జరిగింది. జిల్లా ముఖ్యనగరం చూచి తాలూకా ముఖ్యనగరం చూడకుండా వుండడం సిగ్గుచేటుగా తోచింది. ఎటుతిరిగీ మేము గుంటూరునుంచి తుమ్మపూడి రావాలి. తెనాలిలో దిగి బజారుకు వెళ్ళి అటునుంచి తుమ్మపూడి వెళ్ళుదామన్నాను. కోట్లోబాబు సమ్మతించారు. గుంటూరునుంచి రైలులో వచ్చి తెనాలిలో దిగినాము. స్టేషన్‌నుంచి తెనాలి బజారుకు వెళ్ళాము. తెనాలిలోని ప్రధానభాగాలు తిలకించాను. గుంటూరులోని వైశాల్యంకాని, బెజవాడలోని జవాజా కాని, ఆ రెండు నగరాల్లోని పెద్ద పెద్ద షాపులుకాని తెనాలిలో గోచరించలేదు. చాలా ఇరుకైన మురికి బస్తీగా గోచరించింది. దీన్నే ఆంధ్రదేశానికి పారిస్ నగరం అన్నారు. పారిస్ నగరం దీనిమాదిరే వుంటుందని కాబోలు అనుకొన్నాను. పారిస్ నగరాన్ని గురించి పుస్తకాలలో బ్రహ్మాండంగా చదివాను. కాని తెనాలితో పోలుస్తున్నారు కనుక పారిస్ నగరం కూడా తెనాలివున్నంత చిన్నదిగా, ఇరుకుగా, మురికిగా వుండివుండాలి. అటువంటప్పుడు పారిస్ నగరానికి అంత ఖ్యాతి ఎందుకనో ప్రపంచంలో!

తెనాలినుంచి తుమ్మపూడి వస్తువస్తు తెనాలి రైలుస్టేషన్‌లోని హిగిన్ బాదమ్స్‌లో **"The Modern Review"**ను తెచ్చాను. దాన్ని తెరచి చూస్తుంటే చిత్రాలతో, ఫొటోగ్రాఫులతో, వ్యాసాలతో, కథలతో, కవితలతో ఎంతో ఆకర్షణీయంగా వుంది. అటువంటి మాసపత్రికను చూడడం అదే మొదలు. దాన్ని రైల్లో చదవకుండా భద్రంగా ఇంటికితెచ్చి రెండవ రోజున నారింజ తోటలోకి తీసుకువెళ్ళి శ్రద్ధగా చదవసాగాను. ఒక వ్యాసంలో ఈ పంక్తులు కనుపించాయి.

**"If there is righteousness in the heart, there will be beauty in the character. If there be beauty in the character, there will be harmony in the home. If there is harmony in the home, there will be order in the nation. When there is order in the nation, there will be peace in the world."**

"హృదయంలో సన్మార్గంవుంటే శీలంలో సౌందర్యం వుంటుంది. శీలంలో సౌందర్యం వుంటే ఐక్యత వుంటుంది. గృహంలో ఐక్యతవుంటే జాతిలో క్రమబద్ధత వుంటుంది. ఇక జాతిలో క్రమబద్ధత వున్నప్పుడు ప్రపంచంలో శాంతి వుంటుంది."

ఎంత అద్భుతంగానో తట్టింది ఈ భావావళి. ఎన్నోసార్లు ఆ భాగాన్ని మళ్ళీ మళ్ళీ చదివాను. ప్రపంచంలో శాంతి వుండడానికి హృదయంలోని సన్మార్గమే కారణం అన్నమాట. ప్రపంచాని కంతకూ హృదయమే కేంద్రం. హృదయంలో కలిగే భావనకు ప్రపంచం ఒక ప్రతిబింబం మాత్రమే. హృదయంలో చీకటి వుంటే ప్రపంచంలోనూ చీకటే వుంటుంది; హృదయంలో వెలుగువుంటే ప్రపంచంలోనూ వెలుగే వుంటుంది. హృదయంలో మెరిసే మెరుపుకు ప్రపంచం ఒక ప్రతిబింబం. హృదయంలో మ్రోగే ఉరుముకు ప్రపంచం ఒక ప్రతిధ్వని!

హృదయం మరణిస్తే ప్రపంచమూ మరణిస్తుందా? హృదయం స్పందిస్తే ప్రపంచమూ స్పందిస్తుందా? అయితే హృదయమంటే ఏమిటో? ఇంత పెద్ద. అనంతమైన ప్రపంచాన్ని నడుపుతూన్న హృదయం ఇంకెంత పెద్దదో. అంత పెద్ద హృదయం ఇంత చిన్న మానవునిలో ఏవిధంగా ఇమిడివుందో! ఏమిటో అంతా రహస్యమయం!! అంతా అయోమయం!!!

# "నాలో చెలరేగిన సాహితీ పిపాస"

దక్షిణదేశంలో హిందీ ప్రచారం తీవ్రంగా సాగుతున్నది. దక్షిణ భారత హిందీ ప్రచారసభలో ప్రధాన మంత్రిగా వుంటున్న ప్రజ్ఞానిధి మోటూరు సత్య నారాయణగారి ఉత్సాహ ప్రోత్సాహాలవల్ల ఆంధ్రదేశంలో హిందీప్రచారం మారు మూలలోని పల్లెలకుకూడ ప్రాకింది. నేనుకూడా ఒక హిందీ స్వబోధిని పుస్తకం ద్వారా హిందీ అక్షరాలు. గుణింతాలు నేర్చుకొని హిందీ కొద్ది కొద్దిగా చదవడం ప్రారంభించాను. నాకు ఉర్దూభాష తెలుసు కనుక హిందీ చదవడంవస్తె అర్థం కావడంలో ఇబ్బందిలేదు. హిందీ మాత్రమే వచ్చిన భారతీయునికి ఉర్దూ అర్థం కావడం కష్టంకాని ఉర్దూమాత్రమే తెలిసిన భారతీయునికి హిందీ సులభంగా అర్థ మవుతుంది. హిందీలోని పదాలు చాలాభాగం సంస్కృత పదాలే కనుక.

ఊరిలోని కొందరు యువకులు కూడా హిందీ చదవాలనే ఉత్సాహం ఎక్కువ కావడంతో ఎవరినైనా హిందీ ప్రచారకుని పంపమని మదరాసులోని మోటూరు సత్యనారాయణగారికి వ్రాశాను.

ఒక మధ్యాహ్నం శిశిరాంతంలో [illegible] దేహంతో, గొరగని గడ్డంతో, మాసిన గుడ్డలతో ఒక పాతికేళ్ళ వయసుగల హిందీ పండితుడు మా ఇంట ప్రత్యక్షం. ఆయన స్వరూపాన్ని చూచి మేమంతా నిరాశ చెందాం. మా పెదనాన్న గారు ముక్కూ మూతీ విరిచారు ఆయన్ను చూచి. ఆయనస్వరూపం ఆయన స్వభా వానికి అద్దం కావడానికి బదులు అడ్డం అయింది. నివురుగప్పిన నిప్పు అనే సామెత వినివున్న నాకు సందేహం కల్గింది, ఒకవేళ ఈయన నివురుకప్పిన నిప్పు కాదుగదా అని. ఏమైతేనేం, మా పాకకి ఆనుకొనివున్న చిన్నడాబా ఆయన నివా సానికిచ్చి ఆయనకు కావలసిన సామానంతా పంపించారు. ఆయనపేరు తుమ్మ కోట వెంకట కృష్ణశర్మగారు. ఆయన మంచీ చెడులు చూచే భారమంతా నా కప్ప చెప్పబడి.ది. ఆరోజు సాయంత్రమే ఆయన వంట ప్రారంభించి నాకు కూడా తనవద్దనే భోజనం పెట్టారు. మొదటిరోజే మేమెంతో పరిచితులమైనాం.

క్రమేణ రోజులు గడచినకొద్దీ జనులందరికీ తెలిసిపోయింది శర్మగారు తన స్వరూపానికి ప్రతిబింబం కారని. ఈ కనుపించే బూడిదవెనుక కణకణ

మండే నిప్పు చాలా వుందనీ, ఆయన రూపం ఎంత సాదాగా గోచరిస్తుందో ఆయన మానసిక జగత్తు అంత ఉన్నతమైనదని. ఇంగ్లీషులో **"Plain living and high thinking"** అనే వాక్యాన్నే విన్నాను కాని దాని కార్యరూపాన్ని ఎప్పుడూ చూడలేదు. ఆ వాక్యానికి అంటే "సాదాగా జీవించడం. ఉన్నతంగా ఆలోచించడం" అనేదానికి శర్మగారు సజీవ నిదర్శనం. తెలుగు, సంస్కృతం, హిందీ – ఈ మూడింటిలో ఆయన ప్రజ్ఞాశాలి.

ఇంతకాలంనుంచి నాలో నేనే జీవిస్తూ నా ఆలోచనలకు అనుగుణమైన మిత్రుడు లేక ఏకాంతవాసాన్ని గడుపుతున్న నాకు శర్మగారి సాహచర్యం సుధాధారగా గోచరించింది. సాహిత్యమంటే ఏమిటో, గద్యమంటే ఏమిటో, పద్యమంటే ఏమిటో, నవలకూ కథానికకు వున్న భేదమేమిటో, నాటకానికి నాటికకు వున్న తారతమ్య మేమిటో, విమర్శనాత్మక సాహిత్యానికి, సృజనాత్మక సాహిత్యానికి వుండే తేడా ఏమిటో, ఈ విధంగా సాహిత్యపరమైన విషయాలు. మర్మాలు, ధర్మాలు ఎన్నో శర్మగారి సహచర్యంద్వారా నేను తెలుసుకొన్నాను.

హిందీ పాఠాలు సాగిపోతున్నాయి. నాకుతోడు గ్రామంలోని ఇంకా పది మంది హిందీ చదువుతున్నారు. ఉర్దూతో పరిచయమున్న నా హిందీ త్వరత్వరలో ముందుకు సాగిపోతోంది. పదిహేను సంవత్సరాల వయసు వచ్చినా అప్పటివరకు పుస్తకాలు చదవడం, ఆలోచించడం, అనుభూతి చెందడంతప్ప కాయితంమీద కలంపెట్టి రెండుపంక్తులు వ్రాసి ఎరుగను. కాని, కృష్ణశర్మగారి రాకతో, హిందీ చదువులతో వ్రాయడంకూడా ప్రారంభమైంది. హిందీలో కాంపోజిషన్‌లు వ్రాయ సాగాను. ఆరవ తరగతి చదువుతుండగా పాఠశాలలో కాంపోజిషన్‌లు వ్రాయడం, మళ్ళీ మూడేళ్ళ తరువాత ఈ హిందీ చదువుతూ హిందీలో కాంపోజిషన్‌లు వ్రాయడం. ఆరవ తరగతిలో వ్రాసినవి వ్రాతలోనే లెక్కకాదు. ఇవి మాత్రమే నిజమైన వ్రాతలు.

అప్పుడు నా దగ్గర "బ్లాక్‌బర్డ్" కలం వుండేది. అందులో ఒకే రంగు సిరా వుండడం ఎక్కువ రోజులు సహించేవాణ్ణి కాదు. ఆకుపచ్చ, నీలం, ఊదా, నలుపు ఈ విధంగా రంగుసిరాలను మార్చేవాణ్ని. ఒకరంగు సిరాను కొన్నాళ్ళు వాడేవరకు ఆ రంగుమీద ప్రీతిపోయి మరో రంగును వాడాలనిపించేది. అది పాతబడి మరొకటి. ఈ చంచలత్వాన్ని చూచి శర్మగారు అన్నారు "నీవు సిరాలనే కాక,

మనుషుల్నికూడా మార్చేటట్టున్నావు !" ఆయన ఆ మాటలన్న తరవాత మళ్ళీ సిరా రంగులను మార్చలేదు. బ్లూ బ్లాక్ సిరానే వాడుతుండేవాణ్ని. కలాన్ని మార్చి మాత్రం ఎర్ర రంగులోవున్న వాటర్‌మన్స్ కలాన్ని సంపాదించాను. క్రొత్త క్రొత్త రూపాలుగల కలాలమీద చాలా మోజు వుండేది.

వ్రాయడం చేతకావాలికాని ఏ కలంతో వ్రాస్తే ఏమో అంటూండేవాళ్ళు కొందరు. అందమైన కలాలమీద అంత ప్రీతి ఎందుకని నన్ను విమర్శించే వాళ్ళు. అందమైన కలంతో వ్రాస్తే వ్రాత అందంగా వుంటుందా అని మరొకరనే వాళ్ళు. వ్రాయడానికి మాత్రమే కలంకాని కలంకోసం వ్రాయడం కాదు అనేవాళ్ళు ఇంకొకరు. అప్పటికే గాంధిగారి మాటలు "జీవించడానికే తినాలికాని తినడానికే జీవించరాదు" అనేవి వాడుకలోకొచ్చి వున్నాయి. ఈ మాటలు నా కంతగా నచ్చేవి కావు. జీవించడానికే తినేబదులు జీవించకపోతే మాత్రం ఏమి అనిపించేది. నా దృష్టిలో వ్రాయడానికి మాత్రమే కలంకాదు, చూచి ఆనందించడానికికూడా కలమే. ఉపయోగం ఎంత అవసరమో సౌందర్యమూ అంత అవసరమే అనిపించేది. తలమీద జుట్టు తలను కాపాడడానికి మాత్రమేకాదు, ముఖానికి అందాన్నివ్వడానికి కూడా అనేవాణ్ని. ఈ విషయాలలో శర్మగారికీ, నాకూ వాద వివాదం జరుగుతుండేది.

సరే, రచనాసౌష్టవం ఎలా వున్నప్పటికీ ఆ రచన చేసే పనిముట్టు అయిన కలంమీద మక్కువలోని సౌష్టవం మాత్రం బాగా వుండేది. దేనిమీద మోజు వున్నప్పటికీ ఆ మోజులు నా విద్యాభ్యాసాని కేమీ అడ్డు తగిలేవి కావు. "సింహగఢ విజయ", "మేవాడపతన్", "ఆత్మోదార్", "మిలన్" మొదలైన హిందీ పాఠ్య పుస్తకాలను చదువుతూ వెళుతున్నాను. "సింహగఢ విజయ"ను చదువుతూంటే వీరరసంతో హృదయం ఓతప్రోతమయేది. తానాజీ శౌర్యపరాక్రమాలు నన్ను ఉద్రేకపరచాయి.

ఇక రామనరేశ త్రిపాఠీ రచించిన ఖండకావ్యం "మిలన్" నాకు చాలా ప్రియమైన గ్రంథం. అందులోని ప్రకృతి వర్ణనలు, ప్రేమలు, విరహాలు, ప్రియుల సంయోగాలు, వియోగాలు ఎంతో రసాత్మకంగా వుండేవి. అందులోని కవితలు ఎంతో లలితమైన పదాలతో నిండివుండేవి. ఎక్కువ సంస్కృత పదాలే అందులో.

"నీరవ నిశా తపోవన్ నీరవ
శాంత దిశా ఆకాశ్
నీరవ తారాగణ్ కర్తేథే
ఝిల్ మిల్ అల్ప ప్రకాశ్."

## ప్రేమచంద్ నవలలు

ఆయా గ్రంథాలను చదువుతున్నపుడు ఆయా గ్రంథకర్త ఉంటున్నస్థలాలకు వెళ్ళి వారితో కలసి ఇష్టాగోష్ఠి జరపాలనే ఆకాంక్షజనించేది. ప్రత్యేకించి ప్రేమచంద్ రచించిన "సప్త సరోజ్"లోని కథలు చదువుతున్నపుడు, "రంగభూమి", "కర్బలా" చదువుతున్నపుడు ప్రేమచంద్ దగ్గరకు తప్పక వెళ్ళాలనే వాంఛ తీవ్రమైంది.

సాయంత్రం నాలుగు గంటలకల్లా హిందీ పాఠాలు ముగించివేసుకొని శర్మగారు, విద్యార్థులము అటు తోటలవైపుకో, కాలవవైపుకోవెళ్ళి తిరిగివచ్చేవాళ్ళం. శర్మగారు ఎన్నో విషయాలు చెబుతుండేవారు. తాముపాఠాలు చెప్పవచ్చిన ఇతర చోట్ల అనుభవాలు, అక్కడి విద్యార్థుల స్వభావాలు, ప్రవర్తనలు అక్కడి పెద్దల విశేషమనస్తత్వాలు మొదలైన వెన్నో చెప్పేవారు. కొన్ని నవ్వుతెప్పించేవి కొన్ని కోపాన్ని తెప్పించేవి. ఇంకొన్ని విచారం తెప్పించేవి

ఎండలు బాగాముదిరి పడమటినుంచి వడగాలి తోలుతుండేది. మేము పాఠ్య పుస్తకాలు మూసివేసి శర్మగారితోసహా విశ్రాంతిగా కన్నుమూసేవాళ్ళం. శర్మగారు ఒక సంవత్సరం వుండడానికి అంగీకరించారు. ఆయన విద్యార్థులకు చాలామందికి హిందీ బాగాచదవడం, చదవడాని కంటె తక్కువ వ్రాయటం వచ్చింది. నాకు మాత్రం చదవటం వచ్చినంత వ్రాయటం కూడా వచ్చింది. శర్మగారి దగ్గర హిందీ ద్వారా బెంగాలీభాష నేర్చుకొనే స్వబోధినివుంది. పుస్తకం అయితే తెప్పించారు కాని దాన్ని చదవడం శర్మగారికి వీలుపడడంలేదు. దానిలోని బెంగాలీ అక్షరాలను వ్రాసుకొని వాటిని చూచి వ్రాస్తూబెంగాలీ అక్షరాలను నేర్చుకొన్నాను. క్రమేణా గుణింతమూ, సంయుక్తాక్షరాలూకూడ వచ్చినాయి. నెమ్మదిగా బెంగాలీని కలిపి చదవడం ప్రారంభించాను. శర్మగారు అక్షరాలతోనే ఆగిపోయినారు. ఇక ఆయన బెంగాలీ జోలికిరాలేదు. నేనుమాత్రమే ఆ నూతన భాషలో పురోగమించసాగేను.

హిందీతోపాటు బెంగాలీకూడా సాగిపోతోంది. క్రమేణా నా అభిరుచి హిందీలో కంటె బెంగాలీలో అధికం కాజొచ్చింది.

బెంగాలీభాష ఉచ్చారణ చాలాకష్టం. ఆ ఉచ్చారణ పద్ధతులన్నీ కూడా ఆ బెంగాలీ స్వబోధినిలో వివరంగా విశదపరచబడి వున్నాయి. దాన్ననుసరించి నేను క్రమంగా ఆ ఉచ్చారణ పద్ధతులను కూడా అవగాహన చేసుకొని ప్రవర్తించ సాగేను. కలకత్తానుంచి కొన్ని బెంగాలీ పుస్తకాలు తెప్పించి చదవసాగేను. "శిశుసాథీ" అనే ఒకబెంగాలీ మాసపత్రికనుకూడా తెప్పించసాగాము. బెంగాలీలో నా త్వరితాభివృద్ధిని చూచి శర్మగారు ఈర్ష్యచెందక ఆనందించారు. శర్మగారు ఒక రోజు మాపెదనాన్నతో చెప్పారు, "మీ అబ్బాయికి హిందీ మాత్రమేకాక బెంగాలీ కూడా వచ్చింది" అని. ఇక మా పెదనాన్నగారి ఆనందానికి హద్దులులేవు. కావలసిన బెంగాలీ పుస్తకాలలిస్టు ఇస్తే వాటిని కలకత్తానుంచి తెప్పిస్తామన్నారు. రవీంద్రునివి, శరత్‌చంద్రునివి, కొన్నిపుస్తకాలు తెప్పించారు. "విచిత్రా", "బంగశ్రీ" అనేరెండు బెంగాలీ మాసపత్రికలకు "విశాలభారత్" అనే హిందీ మాసపత్రికకు, **"The Modern Review"**కు చందాలు చెల్లించారు.

వర్షాకాలం ప్రారంభమైంది. నాకు పదహారవ సంవత్సరం వచ్చింది. నా వరస అయిన ఒకరన్నారు. "ఇంకానీవు చిన్నవాళ్ళలో లెక్క కాదు, నీవుఆడమ్మాయివి అయివున్నట్లయితే ఇప్పటి కొకబిడ్డతల్లివి అయివుండేదానివి" అని. అందుకునే నన్నాను "ఆడమ్మాయినయితే తల్లిని అయివుంటే మరి ఇప్పుడు మగబ్బాయిని తండ్రి నెందుకుకాలేను" అని.

కృష్ణశర్మగారిని నెల్లూరు జిల్లాబోర్డు క్రింది సూళ్ళూరుపేట హైస్కూలులో హిందీ పండితునిగా నియమించినట్లు, వెంటనే వచ్చి ప్రవేశించమని ఉత్తరవులు వచ్చినాయి. శర్మగారు తత్తరపోయినారు. మేమంతా ఖిన్నులమయ్యాము. శర్మగారికి తప్పలేదు. ఒకరోజున మూటాముల్లె కట్టుకొని విషాదముఖంతో మమ్మందరినీ వదలి సూళ్ళూరుపేట వెళ్ళిపోయినారు. మేమంతా చెదరిన హృదయాలతో వుండి పోయాము. మా హిందీ అంతటితో ఆగిపోయింది.

నాకు బెంగాలీ మాస పత్రికలు, హిందీ మాసపత్రికా, ఇంగ్లీషు మాసపత్రిక రాసాగినాయి. శర్మగారు వెళ్ళినతరువాత ఈ మాసపత్రికలు నాకు అంతరంగిక సహచరులైనాయి. వాటిలోని వ్యాసాలు, కథలు, కవితలు, ఇంకా ఇతర వింతలు

మాత్రమేకాక మరో నూతన ఆకర్షణ వాటిలో గోచరించసాగింది. అవి త్రివర్ణ చిత్రాలు. ప్రత్యేకించి బెంగాలీ పత్రికలైన "విచిత్ర" లోను "బంగశ్రీ"లోను నవ్యభారతీయ చిత్రకారులు రచించిన ఉత్తమ చిత్రాల త్రివర్ణ ప్రతులు వెలువడు తుండేవి. అప్పటి ప్రసిద్ధ భారతీయ చిత్రకారులైన, అవనీంద్ర, గగనేంద్ర, నందలాల్, అసిత్ కుమార్, దేవీప్రసాదరాయ చౌదరి మొదలైన వారికళాఖండాలు ఆ మాస పత్రికలలో ప్రకటింపబడేవి. ఆ పత్రికలలోని రచనలు చదవడాని కంటె వాటిలో ముద్రితమైన చిత్రాలను చూడడంలో అధికానందం కల్గేది.

ఆ చిత్రాలలోని ఆ రేఖల వొంపు. ఆ రంగుల సొంపు నా హృదయంలో దృశ్య సంగీతాన్ని ప్రమోగించేవి. మళ్ళీ వచ్చే నెలలోని పత్రికలో ఏమేమి నూతన చిత్రాలు వస్తాయా? అని ఎంతో ఆరాటంగా నిరీక్షిస్తూండేవాణ్ణి. చిత్రాలు వెలువడ డం మాత్రమేకాక చిత్రకళనుగురించి విమర్శనాత్మకమైనట్టి వ్యాసాలు కూడా వెలు వడుతుండేవి. ఆ పత్రికలలో, ఆ చిత్రాలను చూస్తూండడం, చిత్రాలను గురించిన ఆ వ్యాసాలను చదువుతూండడం నాలో చిత్రకళమీద విపరీతంగా ప్రేమ జనింప సాగింది. అయితే, చిత్రరచన చేయాలని కాక చిత్రాలను చూచి ఆనందించాలని, చిత్రకారుల జీవితాలు తెలుసుకోవాలని, చిత్రకళా చరిత్రను అధ్యయనం చేయా లనే ఆరాటం వృద్ధిపొందసాగింది. మానవమూర్తుల చిత్రాలకంటె ప్రకృతి దృశ్యాల చిత్రాలు ఇంకా ఎక్కువ ఆనందం ఇస్తూండేవి. దృశ్యంలోని దగ్గరి వివరాలూ, దూరపు అస్పష్టతా మొత్తాన్ని ఆవహించివుండే వాతావరణ శోభ నన్ను ముగ్ధుణ్ణి చేస్తూండేవి. వాటిలోకి చూస్తూంటే ఏదో అనంతంలోకి పయనిస్తున్నట్టుం డేది.

ఆ బెంగాలీ మాసపత్రికలో వెలువడే సాహిత్య రచనలు కూడా నాకు తక్కువ ఆనందం ఇచ్చేవికావు. "విచిత్ర" లో రవీంద్రుని నూతన కవితలు వెలువడుతుం డేవి. శరత్ చంద్రుని నూతన నవల "విప్రదాస్" అనేది కూడా దానిలో వెలువడు తుండేవి. ధారావాహికంగా. "విచిత్ర" పత్రిక బెంగాలీలో వ్యావహారిక భాషను ప్రోత్సహిస్తూంటే "బంగశ్రీ" పత్రిక బెంగాలీలోని గ్రాంధిక భాషను ప్రోత్స హించేవి. మొదటిపత్రిక లాలిత్యానికి ప్రతినిధి అయితేరెండవపత్రిక గాంభీర్యానికి.

# గుండెలలో గూడుకట్టుకున్న విషాదం : దేశాటనకై నాలో చెలరేగిన ఆరాటం

భూమిమీదకు చూస్తే ఎండా, నీడలు కనిపిస్తాయి; ఆకాశంలోకి చూస్తే శూన్యమూ, మేఘాలు కనిపిస్తాయి; నీటిమీదకు చూస్తే అలలూ, ప్రతిబింబాలూ అగుపిస్తాయి. మానవహృదయంలోకి చూస్తే ఖేదాలూ, మోదాలూ దర్శనమిస్తాయి. మోదాలను ఆనందంతో భరిస్తాము కాని ఖేదాలను దుఃఖపడుతూ కూడా భరించజాలం. అయితే భరించజాలనంత మాత్రాన అవి తొలగిపోవు. భరించలేనివాటినికూడా భరించక తప్పదు.

వర్షాలు ఎక్కువవుతూన్నకొద్దీ నా హృదయంలో ఏదో బాధాకరమైన ఏకాంతభావం. ఏదో తెలియని నిస్సత్వం, దేన్నో అందనిదాన్ని అందుకోవాలనే ఆకాంక్ష. ఇల్లువిడచి దూరప్రాంతాలకు, హిమగిరి ప్రదేశాలకు పోవాలనే దాహం అధికం కాజొచ్చాయి. ఇక తోటల్లోకాని, పుస్తకాల్లోగాని పగటికలల్లోకాని ఆనందం తప్పలేకపోతూంది. కృష్ణశర్మగారి నుంచి మొదటగా మంచి ఉత్తరం వచ్చింది హిందీలో. ఆయన చాలా విషయాలు నన్ను గురించి నా మనస్తత్వాన్ని గురించి, నా ఉన్నత లక్ష్యాలను గురించి ఏమేమో వ్రాశారు. వాటిలో ఎక్కువ నాకు నచ్చడం, తక్కువ నచ్చకపోవడం జరిగాయి. నేను తిరిగి హిందీలోనే ఆయనకు జవాబు వ్రాశాను. మళ్ళీ ఆయన వ్రాశారు. మళ్ళీ నేను వ్రాశాను. వ్యక్తిగత క్షేమాలు తెలుపుకొంటూకాక వివిధ విషయాలమీద దీర్ఘలేఖలు వ్రాయడం, అందుకోడం అదే ప్రారంభం.

## మానసంలోని తమస్సు

ఎవరు ఏమి వ్రాసినా, ఎవరు ఏమి చెప్పినా మానసంలోని తమస్సు తొలగటం లేదు. ఇక్కడే వుండిపోవటం చాలా భారం అనిపించసాగింది. ఇంతలో స్వామి సత్యదేవ్ రచించిన హిందీ పుస్తకం "మేరీ కైలాస్ యాత్రా" అనేది తెప్పించాను. అందులో ఆయన తాను కైలాస మానససరోవర ప్రాంతాలకు వెళ్ళి వచ్చిన ఉదంతమంతా వ్రాశారు. అల్మోరాకు పోవలసిన దారి వివరాలు వ్రాశారు. హిమాలయ సౌందర్యాన్ని వర్ణించారు. ఆ పుస్తకాన్ని మళ్ళీమళ్ళీ చదివి భద్రంగా దాచి వుంచాను.

రామకృష్ణ మిషన్‌వారు ప్రకటిస్తున్న ఇంగ్లీషు మాసపత్రిక "**Prabudda-Bharat**" శ్రద్ధగా చదువుతూండే వాణ్ణి. దాని సంపాదక కార్యాలయం హిమాలయ ప్రాంతంలోని ఆల్మోరాజిల్లాలోని మాయావతి అనే ప్రదేశం. వెంటనే దాని సంపాదకుడైన స్వామీ పవిత్రానందకు ఇంగ్లీషులో ఒక ఉత్తరం వ్రాసాను, నేను అక్కడకు వస్తానని. త్వరలోనే ఆయననుంచి జవాబు వచ్చింది, రావచ్చుకాని దక్షిణ ప్రాంతం నుంచి వచ్చేవారు అక్కడ హిమాలయపు చలిని భరించడం కష్టం అని. కాని నేనంతటితో నిరాశ చెందక మళ్ళీ వ్రాసాను. నా అభిరుచులను, ఆశయాలను ఆయనకు తెలుపుతూ, చలిని నేను లెక్కచేయనని కూడా వ్రాసాను. రెండవ జవాబులో ఆయన నా రాకకు అనుమతించాడు. ఇక నా కెంతో సంతోషం కలిగింది. కాని వెంటనే అక్కడికి చేరడానికి డబ్బు ఎలా అనే ఆలోచన కలిగింది. ఇక్కడ ఎవరితో చెప్పినా కూడా నేను వెళ్ళడానికి సమ్మతించరు. ఎవరికి తెలియకుండానే పోవాలి, పోవడానికి డబ్బుంది? వెంటనే నాకో విషయం గుర్తొచ్చింది. చనిపోయిన అమ్మవి కొన్ని బంగారు నగలు కోనాయపాలెంలోనే వుండిపోయాయి. నా యీ పవిత్ర కార్యం నిమిత్తమే మా అమ్మ తన బంగారు వస్తువులను అక్కడ వదలింది, వాటిని నేను ఈ మంచి పనికి ఉపయోగ పరచుకోడంలో దోషం ఏ మాత్రం లేదు.

## ఇంగ్లీషులో సంభాషణ

ఈ విధంగా ఆలోచిస్తూన్న కొద్దిరోజులకే కోనాయపాలెం నుంచి ఉత్తరం వచ్చింది. అమ్మమ్మకు జబ్బుచేసి మంచంలో వున్నదని, నన్ను చూడాలి రమ్మంటున్నదని. ఇంకేం. నా ఆలోచనకు అనుగుణంగా పరిస్థితులు కలిసివచ్చినాయి. అయితే, అమ్మమ్మ జబ్బు విషయం మాత్రం నన్ను కలవరపెట్టింది. ఈ విధంగా కోనాయపాలెంనుంచి వచ్చిన ఉత్తరం మిశ్రమ అనుభూతులను సృష్టించింది నాలో, ఆనందమూ, విషాదము! సరే పెద్దల అనుమతి తీసుకొని నా బట్టలు, పుస్తకాలు, ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ మాసపత్రికలు తీసుకొని కోనాయపాలెంకు పయనమయ్యాను. బెజవాడ రైలులో వెళ్ళి బెజవాడలో బస్సు ఎక్కి ముందు సీటులో కూర్చున్నాను. అంతకుముందే ఆ సీటులో మరొకరు తెల్లని సూటుతో నెక్‌టైతో కూర్చునివున్నారు. నా కంటె ఆయన పెద్దవాడు. మా ఉభయులకు ఇంగ్లీషులో సంభాషణ సాగింది. ఇంగ్లీషులో సంభాషించాలని నాలుక దురదగా వుండేది. ఎవరు దొరుకుతారా అందుకని అవకాశం కోసం ఎదురుచూసేవాణ్ణి

ఆయనది మలబార్ అట, తాను డాక్టరట, నందిగామ హాస్పిటల్‌లో వుంటున్న లేడీడాక్టరును తాను వివాహమాడబోతున్నాడట. అందుకని ఆమెతో మాట్లాడి పోవడానికి నందిగామ వెడుతున్నాడట. సరే, మా ఇద్దరిలో ఆత్మీయత ముదిరింది. బస్సు కీసర దగ్గర మునేరువద్దకు వచ్చింది. మునేరుమీద కడుతున్న బ్రిడ్జి పూర్తయి వాహనాలు నడవడానికి సిద్ధంగా వుంది. కాని, దానికి అధికారికంగా ఇంతవరకు ఎవరు ప్రారంభోత్సవం చేయలేదు. అందువల్ల బస్సులు బ్రిడ్జి మీదుగా అవతలి తీరానికి వెళ్ళడం లేదు.

డ్రైవరు నవ్వుతూ అన్నాడు, నేడు మనమే దీనికి ప్రారంభోత్సవం చేద్దాం. మిమ్మల్ని బ్రిడ్జిమీదుగా తీసుకుపోయి ఎకాయకీ నందిగామలో దించి వెంటనే వెనక్కు వస్తాను అని. అందుకు మేము సంతసించాం. విపరీతమైన వేగంతో మమ్మల్ని బస్సులో తీసుకువచ్చి నందిగామలో దించి నవ్వుతూ తిరిగి బస్సును వెనక్కు తీసుకువెళ్ళిపోయాడు. మేము నందిగామలో పరస్పరం సెలవు తీసుకొన్నాం. ఒకరి చిరునామాలు ఒకరం తీసుకొన్నాం. నేను కోనాయపాలెం చిరునామా ఇచ్చాను. కోనాయపాలెంకు ఆయననుంచి రెండు ఉత్తరాలు వచ్చాయి. నేనూ వ్రాసాను.

ముందుగా నేను ఉత్తరం వ్రాసినందున నందిగామకు కోట్లో బాబు గుర్రాన్ని పంపారు. ఎండ తగ్గిన తరువాత నందిగామ నుంచి బయలుదేరి ఏడు మైళ్ళు చీకటి పడకముందే పూర్తిచేసి కోనాయపాలెం చేరాను. నేను పదహారు ఏళ్ళ పెద్దవాణ్ణయిన తరువాత కోనాయపాలెం రావడం ఇదే ప్రథమం.

## మరణశయ్యపై అమ్మమ్మ

గుర్రం దిగగానే అరుగుమీద మంచంలో కుమిలి కృశించి పడుకొని వున్న అమ్మమ్మ దగ్గరకు వెళ్ళాను. మాటలేకుండా పోయింది. చెవులు వినిపించటంలేదు. కళ్ళు మాత్రం కనుపిస్తున్నాయి. నా నెత్తిమీద చేయివేసి కళ్ళ వెంట నీరు కార్చింది మౌనంగా. నాకూ దుఃఖం ఆగలేదు. పన్నెండు సంవత్సరాల నాడు అమ్మ చనిపోయిన రోజునుంచి అమ్మమ్మ దిగులుతో వేళకు అన్నంకూడా సరిగా తినక లోలోపల దుఃఖిస్తూ వుంది. నాలుగేళ్ళ క్రితం నేను తుమ్మపూడి వెళ్ళి పోయి నప్పటినుంచి ఆమె మరీ కృశించి క్రుంగిపోయి నేటి కీ స్థితికి వచ్చింది. చూడగానే అనిపించింది ఈమె ఎక్కువ కాలం ఈ లౌకిక దేహంలో నివసించదని.

అమ్మమ్మ స్థితి మధ్య మధ్య కొంచెం బాగుపడడం, మళ్ళీ తగ్గిపోవడం ఈ విధంగా రోజులు గడుస్తున్నాయి. నన్ను ఎక్కువసేపు తన దగ్గరే కూర్చో బెట్టుకొని, అప్పుడప్పుడు కళ్ళనీళ్ళు రాలుస్తుండేది. ఇన్ని సంవత్సరాలనుంచి కన్నీళ్ళు నిత్యము రాలుస్తూన్నా కూడా అవి ఇంకా ఇంకిపోలేదు; ఈ విషాద వాతావరణం నిత్యం అలవాటయినందున ఇక నాకు కన్నీరు రావడం లేదు. అయినా హృదయం మాత్రం ఆమె దీనావస్థకు ద్రవించి పోతుండేది. ఎక్కువ కాలం అమ్మమ్మ దగ్గర, తక్కువ కాలం ఊరులోను వుండేవాణ్ణి. అప్పుడప్పుడు పెద్ద వర్షం కురిసి వెలిసి పోతుండేది. ప్రతి సాయంత్రం మాత్రం బజారులోని రచ్చబండమీద కూర్చుంటే కొత్తలు, పాతలు అనేకమంది వచ్చి కూర్చునేవాళ్ళు. ప్రొద్దుపోయే వరకు లోకాభిరామాయణం జరిగేది. నేను కోనాయపాలెం వచ్చి ఇరవై రోజులు కావచ్చింది.

ఒక రాత్రి రచ్చబండమీద కూర్చునివుండగా ఇంటి నుంచి రమ్మని కబురు వచ్చింది. నేను వెళ్ళి అమ్మమ్మను చూచే సరికి ఆమె చూపు తిరిగి పోతూంది. నన్ను గుర్తు పట్టే స్థితిలో లేదు. నేను చూస్తూ చూస్తూండగానే ఆమెకు శ్వాసఆగి పోయింది. నాకు జీవితంలో మిక్కిలి ప్రియమైన వ్యక్తులు ముగ్గురు ఇహ జగత్తు నుంచి అదృశ్యమై పోయారు. పన్నెండేళ్ళనాడు అమ్మ, మరి మూడు మాసాలకు చెల్లీ, నేడు అమ్మమ్మ. కర్మలు మొదలైన వన్నీ సకాలంలో జరిగిపోయాయి.

ఈ ప్రపంచంలో జీవించేవారంతా మరణిస్తారని, ఎవరూ మరణించకుండా వుండరని ఏమేమో ఆలోచనలు తెచ్చుకొని అమ్మమ్మ మరణానికి చింతించకుండా వుండ ప్రయత్నించాను. నేను తుమ్మపూడినుంచి వచ్చి నెల వెళ్ళి రెండోనెల. అమ్మమ్మ చనిపోయిన తరువాత హిమాలయ ప్రయాణం మళ్ళీ మనసులో మెరియ సాగింది. అమ్మ బంగారపు వస్తువులు నాచేతికి తీసుకొనే ఉపాయం ఆలోచించ సాగాను.

ఒకరోజు, పెదతల్లీ, కోట్లోబాబుఅంతాకూర్చుని వుండగాఅన్నాను. అమ్మవస్తువులు తుమ్మపూడి వారి కిచ్చేస్తే మర్యాదగా వుంటుదని. అందుకు వారంతా సంతోషంతో సమ్మతించారు. అయితే, నేను వెళ్ళేప్పుడు తీసుకు వెడతానంటే అందుకు వారు సరేఅన్నారు. ఇక నాకు విపరీతమైన ఆనందం కలగసాగింది. ఎంతత్వరలో వీలైతే అంత త్వరలో ఆ వూరును వదలాలని నిర్ణయించాను. కాని వీరంతా అక్కడే ఇంకా కొన్నాళ్ళుండి పొమ్మంటున్నారు.

దసరా రోజులు మళ్ళీ ప్రారంభమైనాయి. వర్షమూ, ఉక్కా కూడా పోగానే, రాత్రులు వర్షాలు లేనప్పుడు కోట ముందు వున్న రచ్చ బండమీద పరుపు వేసుకొని చందమామను చందమామ మీదిగా పోయే నల్లమబ్బులను, చందమామ క్రిందుగా పోయే తెల్లమబ్బులను చూస్తూ వాటితోపాటు చంద్రుని సమీపంలో నేను కూడా విహరిస్తున్నట్లు భావించేవాణ్ణి. అంత ఎత్తున విహరిస్తూ క్రిందికి చూస్తే ఎలాఉంటుందో అనిపించింది. హిమాలయాలకు వెళ్ళినప్పుడు ఆ ఎత్తు శిఖరాలనుంచి లోయలలోకి చూచినపుడు చంద్రుని నుంచి క్రిందికి చూచినట్టుగానే కనిపిస్తుంది. హిమాలయాలలో కూడా ఇదే చంద్రుడు కనుపిస్తాడు కాబోలు! అటువంటప్పుడు ఈ కనుపించే చంద్రుడు ఇప్పుడు హిమాలయాలను నన్ను ఒకేసారి చూస్తూండి వుండాలి. చంద్రుడుగా జన్మించడం కూడా మంచిదే; ప్రపంచంమీద తన వెన్నెలను వెదజల్లుతూండవచ్చు, కవులచేత ప్రశంసింపబడుతూండవచ్చు, సంయోగంలోని ప్రేమికులచేత భూషింపబడుతూవుండవచ్చు. వియోగంలోని ప్రేమికులచేత దూషింపబడుతూ వుండవచ్చు. నాలాంటి సంయోగమూ, వియోగమూ లేనివానిచేత ఆనందింపబడుతూ వుండవచ్చు!

బెంగాలీ మాసపత్రిక "విచిత్ర" దసరా ప్రత్యేక సంచిక తుమ్మపూడినుంచి ఇక్కడికి తిరిగివచ్చి నా కందింది. అది ఎన్నో త్రివర్ణ చిత్రాలతోను, ఏకవర్ణ చిత్రాలతోను, వ్యాసాలతోను, కథలతోను, విమర్శలతోను, నాటికలతోను, ప్రహసనాలతోను ఎంతో రమ్యంగా వుంది. రవీంద్రుని రసోద్దీపకమైన కవితలు ఎంతగానో నన్ను ఆనందపరచాయి. "బంగశ్రీ"లో రవీంద్రునికి వ్యతిరేకంగా దాని సంపాదకుడైన సజనీ కాంతదాస్ వ్రాశాడు. రవీంద్రుని కవితాకళ కేవలం వనితా సులభమైన లాలిత్యంమాత్రమే కలిగివున్నందున దేశాన్ని దుర్బలపరచిందని, వారి వ్యావహారిక భాషాశైలి వంగభాషను విచ్ఛిన్నపరచిందని ఏమేమో వ్రాశాడు. ఆయన ఆ విధంగా ఎందుకు వ్రాశాడో నాకు సరిగా బోధపడలేదు. ఆయనేకాదు, హరీంద్రనాథ చట్టోపాధ్యాయకూడా రవీంద్రునికి వ్యతిరేకంగా ఇదే విధమైన ధోరణిలో వ్రాశాడు.

## గొప్పవారిలోని గొప్ప ఎంత?

గొప్పవారికి అంతా అనుకూలతే వుండదు, వ్యతిరేకతకూడా కొంత వుంటుందని గ్రహించాను. గొప్పవారైన వారు చేసేదంతా మంచిదే వుండదు, చెడ్డకూడా కొంత వుంటుంది. గొప్పరచయితలు వ్రాసేదంతా గొప్పగానే వుండదు, కొద్దికూడా

కొంత వుంటుందన్న మాట! కనుక గొప్పవారనేవారు పూర్ణంగా గొప్పవారు కారు, కొంతభాగం కొద్దివారు కూడా. అందుకే పరిపూర్ణతఅనేది సృష్టిలో లేదంటారు.

"విచిత్ర" లోని చిత్రాలు చూస్తూ అందులోని సాహిత్య రచనలను చదువుతూ ఒకరోజంతా ఇంటిలోనే గడిపాను. సాహిత్య రచనలు చదువుతూంటే కలిగే ఆనందానికి వుండే భేదాన్ని గురించి ఆలోచించసాగాను. సాహిత్య రచనల ఆనందం అర్థం మీద ఆధారపడి వుంటుంది. చిత్రరచనం ఆనందం అర్థంతో పని లేని సంవేదనల మీద ఆధారపడివుంటుంది. సాహిత్య రచనలు ఆనందించడానికి కొంత సమయం పడుతుంది. చిత్రరచనలను వెంటనే ఆనందించవచ్చు. ఇది కొంతవరకు మాత్రమే సత్యం.

# హిందీ రచయిత ప్రేమచంద్‌తో పరిచయం

మెంగుళూర్-పెషావర్ గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ నూతనంగా ప్రవేశపెట్టబడిన సంవత్సరం అది. తుమ్మపూడి ప్రక్కగా అదివాయువేగంతో పరుగెత్తుతూంటే దానిలో ప్రయాణం చేయాలని తీవ్రమైన కుతూహలం కలిగేది. మెంగుళూరులో దారిలో ఎక్కడా దిగకుండా పెషావర్‌లో దిగాలనిపించేది. ఆ వాంఛ పూర్తిగా కాకపోయినా కొంతవరకైనా నేడు తీరబోతూన్నది. ఈ ఎక్స్‌ప్రెస్‌లో నేను నేడు ఎక్కుతూవున్నది మెంగుళూరులో కాదు, దిగబోతున్నది పెషావర్‌లో కాదు, ఎక్కబోతూన్నది బెజవాడలో, దిగబోతూన్నది వీరనారీ ఝాన్సీ లక్ష్మీబాయిగారి ఝాన్సీలో.

అప్పుడు సాయంత్రం అయిదు గంటలకే ఎక్స్‌ప్రెస్ బెజవాడ స్టేషన్‌కి వచ్చేది. వర్షాలు వెలిసిపోయిన కాలం అది. శరత్కాలం ఇంకా సగంలో పడలేదు. పగలు కొంచెం ఎండగాను, రాత్రులు చల్లగాను వుంటున్నాయి. సాయంకాలం నాలుగున్నరకు బెజవాడ ప్లాట్‌ఫారం అంతా వందలాది జనంతో కిటకిటలాడుతూంది. ఆ వందలలో నేను ఒకణ్ణి. నాకొద్ది సామానుతో ఎక్స్‌ప్రెస్‌ నిమిత్తం నిరీక్షిస్తూ అటూ-ఇటూ తిరుగుతున్నాను. హిమాలయాలకు వెళ్ళుతున్నాను నా పదహారో ఏట. నాకు ఇదివరలో గడచిపోయిన సంవత్సరాలకంటె ఈ పదహారో సంవత్సరం ఎంత ధన్యమైందో మరి నన్ను హిమాలయాలకు తీసుకవెళ్ళుతూంది. రైలు ఇంకా రాలేదు. ఆలస్యానికి ఓర్వలేకపోతున్నాను.

పెనుభూతంలాగా శబ్దించేస్తూ మెంగుళూర్-పెషావర్ గ్రాండ్ టంక్ ఎక్స్‌ప్రెస్ వచ్చి ఆగింది. దీని పేరే ఇంత గ్రాండ్‌గావుంది ఇక దీనిలో ప్రయాణంఎంత గ్రాండ్‌గా వుంటుందోమరి! ఆరైలునిండా ఆంధ్రులు కాని జనులే. గడ్డాలు, తలపాగాలు గల ఒడ్డూపొడుగూ శరీరాల శిక్కులు, యూరపియనులు, హిందీవాళ్ళు, గుజరాతీలు-ఈ విధంగా ఎందరో! నేను ఒక మధ్యతరగతి కంపార్టుమెంటులో కొంత ఖాళీగానే వుంది. అందుకొని మిగతా ప్రయాణీకులలో ప్రక్కన కూర్చున్న మలబారునుంచి వస్తూన్న మిలటరీలో పనిచేస్తున్న సివిల్ ఉద్యోగులు, వీళ్ళుకూడా ఝాన్సీలో దిగుతారట, చాలా స్నేహపాత్రులుగా మెలిగారు నాతో. అందులోని ప్రయాణీకులలోకల్లా నేనే చిన్నవాణ్ణి. ఆ మళయాళీలు నాతో ఇంగ్లీషులో మాట్లాడేవారు. తమదగ్గరున్న మలబారు అరటిపళ్ళు మొదలయిన వాటిని తినమని నాకు ఇచ్చారు. దూరపు ప్రయాణంలో తగిన సహచరులు దొరికినందుకు సంతోషించాను.

# ధర్మ సందేహం

వాళ్ళలో ఒకతను బాగా వాక్శుద్ధి కలవాడు. సంస్కృతంకూడా చదువుకున్నాడు. భారతీయ సంస్కృతిని జీర్ణించుకొని వున్నవాడు. నేను హిమాలయాలకు వెళ్ళుతున్నానని విని చాలా సంతోషించాడు. అతను నన్నడిగిన మొదటి ప్రశ్న ఇంటిదగ్గర వాళ్ళతో చెప్పివెళుతున్నావా, చెప్పకుండానా అని. నేను నిజంచెప్పాను. అతను ఏమీ ఆశ్చర్యపోలేదు. ఇంటిదగ్గర వాళ్ళతో చెప్పి వెళుతున్నానంటేనికూడా ఆశ్చర్యపోయే వాడేమో !

బెజవాడవదలి ఎక్స్‌ప్రెస్ మధిరలో ఆగింది. ఇంతవరకు నాకు తెలిసున్న ప్రదేశమే. ఇక అక్కడనుంచి నేను చూడని ప్రదేశమే. రాత్రంతా మేల్కొని పెద్ద పెద్ద స్టేషనులు చూడాలనుకొన్నాను కాని పగలంతా కోవాయపాలెం నుంచి చేసిన ప్రయాణం శ్రమమూలంగా పెందలకడనే నిద్రపట్టింది. నిద్రలో ఏమీ కల వచ్చిన గుర్తులేదు.

తెల్లవారేసరికి బలార్‌షా స్టేషను చేరాం. అక్కడ ముఖం కడుక్కొని ఏవో తిని టీ త్రాగాను. అప్పటివరకు టీ కాఫీల అలవాటు లేదు. ప్రయాణంలో ఇటువంటి వేమైనా త్రాగకపోతే ఇబ్బంది అని త్రాగడానికే నిశ్చయించాను. నాగపూర్ స్టేషనులో కమలాలు కొని పీటుమీద నుంచి కొంచందూరంగ ప్లాట్‌ఫారం మీద పుస్తకాల షాపు కనిపిస్తుంటే రైలుదిగి అక్కడకువెళ్ళి ఏవో పుస్తకాలు తిరగ వేస్తూ రైలుసంగతి మరచిపోయి నిలుచున్నాను. ఏవో హిందీ పత్రికలు కొన్నాను. మారైలు కూతవేసి కదిలింది. నేను చాలా ఆందోళన చెందిపోయి పరుగెత్తుకు వెళ్ళి మా కంపార్టుమెంటుకాక మరొక కంపార్టుమెంటును అందుకున్నాను నడుస్తున్న రైలులో. అదిమొదలు ఆ ప్రయాణంలో మరెక్కడా రైలు దిగి ప్లాట్‌ఫారం మీదకు పోలేదు. ఎన్నాళ్ళనుంచో వింటూన్న నాగపూర్ కొంతవరకు కనిపించింది. చూచి సంతోషించాను.

దారిపొడుగునా పల్లెలు, బస్తీలు, పరిచితంకాని వేషాలలో వున్న స్త్రీ, పురుషులు మొదలైన విశేషాలను రైలులోనుంచిచూస్తూ ఆనందిస్తున్నాను. సాయంకాలం చీకటి పడుతుండగానో, ఎప్పుడో మారైలు నర్మదా నదిని దాటుతూంది. దేశపటంలో రేఖా రూపంలో చూచినట్టి నర్మదను ఇక్కడ ప్రత్యక్షంగా దాని భౌతికరూపంలో చూచి ఆనందించాను. అదేసమయానమా ప్రక్క కంపార్టుమెంటులో ఒక భిక్షకుడు వేణువు వాయిస్తూ యాచిస్తున్నాడు. మాకంపార్టుమెంటుకు వచ్చేవెళ్ళాడు. సగం చీకటిలో

అస్పష్టంగా గోచరిస్తున్న ఆ సంధ్యవేళలో నర్మదానదమీదుగా పోతూ ఆ వేణుసంగీతాన్ని వినే వరకు చేతన ఊర్ధ్వ చేతనలోకి ఆరోహించి తన్మయత్వం అపీమయాను దాల్చింది ఆ క్షణాలు దివ్యక్షణాలుగా కనిపించాయి. ఆ రాత్రంతా నిద్రపోకుండా కూర్చున్నాను. భోపాల్ చూడాలని కోరిక, చూశాను. అర్ధరాత్రికో, అర్ధరాత్రి దాటిన తరువాతో ఝాన్సీ స్టేషన్‌లో దిగివేశాం. దిగగానే కొంచెం చలిగా వుంది. మలయాళీ మిత్రుడు నానుంచి విడబడి వాళ్ళ దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. అపరిచిత ప్రాంతంలో నేను ఒంటరిగా నిలచిపోయాను. నాదగ్గర టికెట్టు యకాయికి లక్నోవరకు వున్నది. విచారించాను లక్నోపోయే రైలు ఇప్పుడేమైనా వున్నదా అని. లక్నో వెళ్ళే లేదుకాని కాన్పూర్ వెళ్ళేది వుంది. కాన్పూర్ నుంచి లక్నోకు వుంటుందన్నారు.

## మైథిలీశరణ్ గుప్త

కాన్పూర్ వెళ్ళే బండిలో వెడుతుంటే కొంతసేపటికి చిర్‌గాంవ్ అనే స్టేషన్ వచ్చింది. ఆ పేరు వినేసరికి ప్రసిద్ధ హిందీకవి మైథిలీశరణ్ గుప్త గుర్తు వచ్చారు. ఆయన నివాసం ఈ చిర్‌గాంవ్ అనే వూరే. ఆయన ఇప్పుడు ఈవూరులో తన ఇంటిలో ఏమి చేస్తుంటారో? నిద్రిస్తుంటారు. లేక ఏదో మహాకావ్య రచనలో నిమగ్నులై వుంటారు. ఇక్కడ దిగి ఆ మహాకవిని సందర్శించి వెడితే ఎంత బాగుంటుంది! కాని. దిగే సాహసం చేయలేకపోయాను. "భారత భారతి", "జయద్రధ వధ" మొదలైన ఉత్తమ కావ్యకర్త మైథిలీశరణ్ గుప్తను చూడకుండానే సాగి వెళ్ళిపోయాను. ఒకోసారి దుర్బల సంకల్పాలు కూడా కావ్యరూపం సులభంగా దాలుస్తాయి; ఒకోసారి బలమైన సంకల్పాలు కూడా కావ్యరూపం దాల్చకుండా కరిగిపోతాయి

ఉదయం ఎనిమిది గంటల ప్రాంతంలో కాన్పూరు చేరాను. కాన్పూర్ నుంచి లక్నో వెళ్ళే రైలు సిద్ధంగా వుంది. అందులో ఎక్కాను. అందులో ఎక్కువగా ముస్లిములు కూర్చుని వున్నారు. కాన్పూరు నుంచి "ప్రతాప్" అనే హిందీ వార పత్రిక వెలువడుతు వుండేది. దాని సంపాదకుడు గణేశ శంకర విద్యార్థి అంతకు కొద్ది రోజులకు ముందే జరిగిన హిందూ ముస్లిం అల్లరులలో ఆహుతి అయిపోయారు. నా ప్రక్కనే కూర్చున్న ముస్లిం మధ్య వయస్కుడు తాంబూలం నమిలిన ఎర్రని పళ్ళతో, లక్నో లాల్చీతో, తలమీద చిన్న ఖద్దరు టోపీతో కొంచెం సంస్కారం గల వ్యక్తిలాగా గోచరించాడు. నేను లోపలికి ఎక్కగానే

అవతలంతా జరిగి నాకు చోటు ఇచ్చారు. ఆ ఎగ్రని పక్కను బహిరంగ పరుస్తూ ఇంగ్లీషులో అన్నారు: "మీది మదరాసు ప్రాంతమా" అని అందుకు నేను హిందీలో సమాధానం చెప్పాను అవునని. ఆంధ్రరాష్ట్రం కూడా మదరాసు రాష్ట్రంలోది కనుక ఆంధ్ర అనే పేరు ఉత్తర హిందూస్తాన్‌లో ఎవరికీ తెలిసేది కాదు. మదరాసీ అనేపేరుతోనే దక్షిణ ప్రాంతీయుల నందరను పిలిచేవాళ్ళు. ఆనాటి మదరాసు రాష్ట్రంలో ఆంధ్రులనీ, కన్నడులనీ, మళయాళీలనీ, తమిళులనీ, ఇన్ని జాతుల వారున్నారని ఉత్తరదేశంలో ఎవరో బాగా చదువుకొన్న వాళ్ళకు తప్ప తెలియదు. దక్షిణాదివారంతా మదరాసీలలో లెక్కయే.

ఆయనతో తరువాత చెప్పాను ఈ భేదాన్ని గురించి. ఆ విషయం ఆయనకు స్పష్టంగా అర్థమైనట్టు లేదు. కొద్ది రోజులక్రితం కాన్పూరులో జరిగిన హిందూ ముస్లిం అల్లరులలో జరిగిన ఘోరాలను వర్ణించాడు. ఉభయ వర్గాలలోని దుండగులు క్షేమంగానే వుండి సన్మార్గులే ఎక్కువగా హతులు. నిహతులు అయినారనిచెప్పాడు. "ప్రతాప్" పత్రిక సంపాదకుడు గణేశశంకర విద్యార్థిని ఘోరంగా హింసించి చంపినట్టు చెప్పాడు. ఈ ముస్లిం వ్యక్తి కాంగ్రెసు మనిషిగా గోచరించాడు, ఖద్దరువస్త్రాలతో. మీ దక్షిణ ప్రాంతంలో హిందూ ముస్లిములు సఖ్యంగా వుంటారని అన్నాడు. అవును, ఉభయ మతస్థులూ మా ప్రాంతంలో సఖ్యతగా వుంటారు గాని హిందువులలో హిందువులు మాత్రం సఖ్యత లేకుండా కులతత్వంతో కుమిలిపోతుంటారు అన్నాను.

## లక్నో సందర్శన

రాయబరేలీ, ఉన్నావ్ స్టేషన్ల మీదుగా మా రైలు లక్నో జంక్షన్ స్టేషన్ చేరుకొన్నది. ఆ ముస్లిం మిత్రుడు లక్నోలో తమ ఇంటికి తీసుకువెళ్ళి ఆతిథ్యం ఇచ్చి ఆదరించి లక్నోలో వుండదలచినన్నాళ్ళు తన అతిథిగానే వుండమని బలవంతం చేశాడు. నేను అంగీకరించాను. అపరిచితమైన దూర ప్రాంతంలో దొరికే ఆదరణ కంటె మించిన ఆనందం మరే ముంటుంది కనుక. సాయంత్రం నా సామాను అక్కడే వదలి నేను నగర సందర్శనకు బయలుదేరాను.

అవధ నవాబుల కీర్తి అంతా లక్నోలో ఇప్పుడు వెల వెలపోతూంది. గొప్ప గొప్ప ఇమాంబారాలు అప్పటి చిహ్నాలుగా నిలిచి వున్నాయి. నగరంలో ముస్లిం నాగరికత అధికం. లక్నో ఉర్దూను ఉర్దూసాహిత్యంలో ప్రత్యేకదృష్టితో చూస్తారు. గోమతీ నదీతీరాన జ్ఞానవిజ్ఞానాలకు పేరుపడ్డ లక్నో యూనివర్సిటీ

వుంది. అందులో రాజనీతి శాస్త్రానికి ప్రధానిగా అప్పుడు వంగల శివరాంగారనే ఆంధ్రుడు వుంటున్నారని విన్నాను.

సుప్రసిద్ధ కథాశిల్పి ప్రేమచంద్ ఆరోజులలో లక్నోలోనే వుంటున్నాడు. లక్నోనుంచి వెలువడే హిందీ మాసపత్రిక "మాధురి" అనేదానికి ప్రేమచంద్ సంపాదకుడుగా వుంటున్నాడు. లక్నోలో అప్పుడు నవీన నాగరికత తక్కువగా వుండేది. బజార్లలోనే మంచాలు పరచుకొని జనులు కూర్చొండేవాళ్ళు. పురాతన ముస్లిం సంప్రదాయమే ప్రతిచోటా కనుపిస్తుంది.

చిర్‌గాంవ్‌లో దిగకుండా మహాకవి మైథిలీ శరణగుప్తను చూడకుండా వచ్చివేశాను. లక్నోలోదిగాను, ఇక్కడేవుంటున్న ప్రసిద్ధకథాశిల్పి ప్రేమచంద్‌ను చూడకుండా పోదలచలేదు. ఆ సాయంత్రం నగరంలో తిరిగి ముస్లిం మిత్రుని ఇంటికి రాత్రిపూట చేరుకొన్నాను. ఆయన కూడా అప్పటివరకు ఎక్కడెక్కడో తిరిగి ఇంటికి చేరుకొన్నాడు. ఆయనకు వివాహంకాలేదట. ఎవరో ఒకడు వండి పెడుతుంటాడు. నేను శాకాహారినని తెలిపినందున బంగాళాదుంపలూ మొదలైన శాకనాకాలతోనే నా భోజనం. భోజనానంతరం ప్రొద్దుపోయేవరకూ దేశంలోని అనేక విషయాలను గురించి మాటాడుతూ పడుకొన్నాం. ప్రేమచంద్ తెలుసా అని అడిగితే, ఆయనపేరు ప్రతిష్ఠలు తెలుసుకాని, వ్యక్తిగా పరిచయం లేదన్నాడు. తన తమ్ముడు అలీఘర్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా వుంటున్నాడట. తానెప్పుడూ ఇంతవరకూ దక్షిణదేశం చూడలేదట.

## ప్రేమచంద్‌తో గోష్ఠి

రెండవరోజు ఉదయం పదిగంటల ప్రాంతంలో టాంగాలో బయలుదేరి "మాధురీ" కార్యాలయానికి వెళ్ళాను. ప్రేమచంద్ వున్నారు. దక్షిణదేశంనుంచి వచ్చాననీ, హిందీ తెలుసుననీ, అందులోను ఆయన సాహిత్యాన్ని చదివాననితెలిసి ఆయన పరమానందం చెందారు. ఆదరించి కూర్చోబెట్టి హిందీలో ఆప్యాయతతో పలుకరించసాగారు. దక్షిణదేశపు విశేషాలను గురించి, దక్షిణ భాషలను గురించి, సాహిత్యాలను గురించి వివరంగా అడిగి తెలుసుకొన్నాడు. ఆయన కథలలోని కొన్ని పాత్రల విషయాలు చెప్పాను. అందుకాయన తన్నీ అవన్నీ కూడా వాస్తవ జగత్తులోనుండి దైనందిన జీవితంలోనుంచి తీసుకొన్నవే అన్నాడు.

నేను హిమాలయాలలోని "ప్రబుద్ధభారత" కార్యాలయానికి పోతున్నానని విని ప్రేమచంద్ చాలా సంతోషించాడు. ఉత్తరదేశాని కంటే దక్షిణదేశం ఎంతో తెలివికల దేశమని, ఎంతో పరిశుభ్రమైన దేశమని ఆయన అన్నాడు. కేవలం సాహిత్యజీవిగా మన దేశంలో జీవించడం కష్టం అన్నాడు. హిందీ భాషలోని "నే" ప్రయోగాన్ని గురించి ఆయనతో చర్చించాను. ఈ "నే" ప్రయోగం హిందీ మాతృభాష కానివాళ్ళకు ప్రథమంలో చాలా చిక్కుగా వుంటుందని చెప్పాను. ఆయన అన్నాడు: "హిందీ మాతృభాష కానివాళ్ళకు "నే" ప్రయోగం వుంటే బాధగావుంటే హిందీ మాతృభాషఅయిన వాళ్ళకు ఆ ప్రయోగం లేకపోతే బాధగా వుంటుంది," అని నవ్వసాగాడు. రేపు నన్ను తమ ఇంటికిభోజనానికి రమ్మని,హిమాలయాలనుంచి తిరిగి వచ్చేటప్పుడు నేను మళ్ళీ తనను కలిస్తే తన పుస్తకాల సెట్టును నా కిస్తానని అన్నాడు. రేపే నేను ఉత్తరాభిముఖంగా బయలుదేరుతున్నాను కనుక తమ ఇంటికి భోజనానికి రాలేనందుకు క్షమించ మన్నాను.

ప్రేమ్‌చంద్ మధ్యరకం ఎత్తుగల మనిషి. ముఖం అచ్చగా యు. పి. లోని గ్రామీణ ప్రజల ముఖమే. కళ్ళ దగ్గర కొంచెం ఎత్తుగా అదోరకంగా వుంటాయి ఆ ముఖాని. ఆయన చాలా సాదా మనిషి. గ్రామీణ జీవితాలను గురించి ఎక్కువ పరిశీలన చేసిన వ్యక్తి. ఎదటివ్యక్తుల స్వభావాలను ఇట్టే పసికట్టగలడు. భారతీయ భాషలలోని సాహిత్యకారులలో ప్రేమచంద్ కథాశిల్పిగా గొప్ప ఖ్యాతి వార్జించాడు.

# హిమవన్నగ సౌందర్యశోభ

లక్నో నుంచి మూడవరోజు మధ్యాహ్నపు రైలులో ఉత్తరానికి బయలు దేరాను. ఈ రైలు ఏకాయకీ కాత్‌గోదాం పోకుండా సీతాపూర్‌లోనే ఆగిపోతుంది. రాత్రికి మరొక బండి ఇంకా ముందుకు భోజీపురావరకు వెళ్ళేది వుంది కాని సీతాపూర్ వరకు పగటి ప్రయాణం చేస్తూ కొత్త ప్రదేశాన్ని చూస్తూ పోవచ్చునని మధ్యాహ్నం రైలులోనే బయలు దేరాను. ఇటునుంచి ఉత్తర భాగాన్ని రుహేల్‌ఖండ్ - కుమాఫూ రైల్వే అనేవాళ్ళు. దేశం ఇటునుంచి ప్రత్యేకంగా కనిపించసాగింది. శరత్కాలపు ఆకాశం నిర్మలంగా వుంది. విశాలమైన ప్రకృతి దృశ్యాలతో ఈ ప్రాంతం ఒక నూతన శోభను, ఒక నవీన ఆశను ప్రసాదించసాగింది. రైల్వే లైనుకు ప్రక్కనే రోడ్డుకూడా తగులుతుండేది.

స్వీయ ప్రాంతాన్ని, స్వజనాన్ని వదలి ఒంటరిగా, అందులోనూ ఎవరికీ తెలవకుండా రావడం ఇదే మొదలైనందున, ఇంత దూరం వచ్చినతరువాత, ఈ అపరిచిత స్థలాలలో, అపరిచిత వ్యక్తుల మధ్య కొంచెం బెంగ కలగసాగింది. కాని వెంటనే మనసును దృఢపరచుకొని, అనంతమైన ధైర్యం తెచ్చుకొని, ఏ ప్రాంతమూ పరాయిది కాదు, అన్ని ప్రాంతాలూ స్వప్రాంతాలేనని, ఏ మనుషులూ పరాయి మనుషులు కారు, జనులంతా స్వీయ జనులేనని. "వసుధైక కుటుంబ"మేనని. ఈ విధమైన భావాలను సృష్టించుకొని తిరిగి మానసంలో ధైర్యంతో కూడిన సంతోషాన్ని సృష్టించుకొన్నాను. మానవులంతా ఒకటే అనే భావవాదం నాలో నాగానవిచేసి తలలెత్తిన బెంగను అణచి వేసింది. అసలు బెంగకు కారణం దూరప్రదేశం వచ్చినందుకుకాక ఎవరికీ చెప్పకుండా వచ్చానే అనే భావం. అటు కోనాయపాలెంలోనివారు ఇటు తుమ్మపూడిలోనివారు నన్ను గురించి ఏమనుకొంటున్నారో ఎక్కడెక్కడ వెదకుతున్నారో! తుమ్మపూడిలోని, కోనాయపాలెంలోని పెదతండ్రులంతా నేనంటే ఎంతో ప్రేమ. నేను చేసిన ఈ పనికి ఏమని భావిస్తున్నారో!

మనసు మధ్య మధ్య దిగజారి పోతూండటం. దాన్ని మళ్ళీ విశ్వాసంతో పైకెత్తుతుండటం. ఈ ప్రయత్నంలో పైకెత్తే ప్రయత్నమే విజయవంత మవుతుండేది. ఈ మానసికమైన ఆరోహావరోహణలమధ్య కనుపించే దృశ్యాలను ఆనందిస్తూ సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో సీతాపూర్ వచ్చి రైలు ఆగిపోయింది ఇక ఈ రైలు ముందుకు పోదు. రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో మరొక రైలు పోతుంది.

## అపరిచితుని ఆతిథ్యం

సీతాపూర్‌లో దిగి సామాను ఒక హోటల్‌లో పడవేసి ఆ హోటల్‌లో చపాతీలు తింటూ కూర్చున్నాను. ఇంతలో ఒక పాతిక సంవత్సరాల వయస్సుగల యువకుడు కూడా భోజనానికి వచ్చి నాతోపాటు చపాతీలు, కూరా, పెరుగూ తిని నా డబ్బుకూడా హోటల్ వాళ్ళకు ఆయనే చెల్లించాడు. నేను ఆశ్చర్యపోతూ వుండిపోయాను. ఆయన పేరు జీవానంద్ అట. తాను మదరాసులో కొంతకాలం వున్నట్టు నన్ను చూడగానే దాక్షిణాత్యునిగా గ్రహించినట్టుచెప్పి, ఆపూట నేను తన అతిథినని అన్నాడు. నేను నవ్వి ఊరుకున్నాను. దూరప్రాంతంలో వెళ్ళిన చోటల్లా ఇటువంటి ప్రేమ పాత్రులైన మిత్రులు దొరకడం నా అదృష్టమని నన్ను నేను అభినందించుకొన్నాను.

బెజవాడలో ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కగానే మళయాళీ మిత్రులు ఆదరణచూపారు. లక్నోలో ఒక ముస్లిం వ్యక్తి నన్ను ప్రేమతో ఇంటికి తీసుకువెళ్ళి తన అతిథిగా చేసుకొన్నాడు. మళ్ళీఇప్పుడిక్కడ ఈ సీతాపూర్‌లో ఈజీవానంద్ నాకు మిత్రుడై నన్ను తన అతిథిగా తీసుకొన్నాడు. ఏదో అజ్ఞాతశక్తి నన్ను కాపాడుతున్నదని భావించాను. మా భోజనాలైన తరువాత జీవానంద్ నన్ను వెంటతీసుకొని సీతాపూర్ చూడడానికి తీసుకవెళ్ళాడు.

సీతాపూర్ జిల్లా, ఇది జవహర్‌లాల్ నెహ్రూగారి అత్తవారి వూరట. విశాలమైన రోడ్లు, చెట్లు. బాగుంటాయి. మేము బజార్లు తిరుగుతూ ఒక పెద్ద లైబ్రరీలోకిపోయి కూర్చుని ఏవో పత్రికలు తిరగవేసి మళ్ళీ రోడ్డుమీదనే కొంతదూరం నడిచాం. వివిధవిషయాల మీద ప్రసంగించుకొన్నాం, హిందీలోను. ఇంగ్లీషులోను. ఆయన ఇక్కడి కాలేజిలో ఆర్థిక శాస్త్రోపన్యాసకుడుగా పని చేస్తున్నాడట. ఇంకా అవివాహితుడే. ఉనావ్. జిల్లాకు చెందినవాడట. తన జీవిత విశేషాలు నాకుచెప్పి, నా జీవిత విశేషాలు తాను విన్నాడు. వయసులో నాకంటే తాను తొమ్మిది సంవత్సరాలు పెద్దఅట, అయినప్పటికీ జీవితములోని లక్ష్యాన్ని నామాత్రం కూడా తాను నిర్ణయించుకోలేకపోతున్నానని, తన జీవితం ఇంకా చుక్కాని లేని పడవవలె వున్నదని చెప్పాడు. ఆయన ధోరణి అంతా విన్న తరువాత అనిపించింది మానవ సమాజంలో సంతృప్తిగల మానవులు చాలా కొద్దిమంది వుంటారేమో అని !

రాత్రి తొమ్మిదింటి వరకు అటూ ఇటూ తిరిగి తిరిగి హోటల్‌కు వచ్చాం. రేపుకూడా తన అతిథిగావుండి ఎల్లుండి పోవచ్చు నని చెప్పాడు. కాని నాకొంత

నన్ను అందుకు అంగీకరించనీయలేదు. సరే - సామాను టాంగాలో పెట్టించుకొని మే ముఖయులమూ స్టేషన్‌కు వచ్చాం. ప్రొద్దుపోయి రైలువచ్చింది. నన్ను జీవానంద్ రైలు ఎక్కించి చింతాక్రాంతుడై వెనక్కి వెళ్ళిపోయాడు. పోతున్న ఆయనవైపు బరువైన హృదయంతో నేను చూస్తూ వుండిపోయాను, ఏనాటిదో ఈ స్నేహం అని ఆశ్చర్యపోతూ! ఇంతలో రైలు కదలింది. నేను నిద్రించాను.

తెల్లవారకముందే నాకు మెలకువవచ్చింది. రాత్రి నిద్రలో స్వప్నం చిన్నతనంలో కోనాయపాలెంలో మిత్రులతో కలసి స్వేచ్ఛగా ఆడుకుంటున్నట్టు, దసరా వేడుకలు చూస్తూన్నట్టు, కన్ను తెరచి చూస్తే ఎక్కడ కోనాయపాలెం, ఎక్కడి యు. పి. లోని రుహేల్‌ఖండ్ ప్రాంతం! ఒక్కసారి మనసు చివుక్కుమన్నది. లోయలో పడుతున్న మనసును ధైర్యంతో మరొకసారి శిఖరం మీదకు లాగాను, అది శిఖరం మీద నిలచింది. ఉదయానికల్లా రైలు భోజీపురా వెళ్ళి నిలచింది. కాఠ్‌గోదాం వెళ్ళడానికి మరొక రైలు ఎక్కాలి. ఎదటి ప్లాట్‌ఫారం మీద అది ఆగి వుంది. దీనిలో నుంచి దిగి దానిలో ప్రవేశించాను. భోజీపురా నుంచి బయలుదేరిన బండిలో ప్రయాణీకు లెక్కువగాలేరు. ఇక్కడికి హిందీకొంత మార్పుగా కనిపించసాగింది. రైలు కొంతదూరం పోయినప్పటినుంచి భూమిమొత్తం పుష్పమయంగా గోచరించసాగింది. కొంతదూరం కుంకుమ ఆరబోసినట్టు ఎర్రనిపూలు ఇంకొంత దూరం పసుపు ఆరబోసినట్లు పసుపుపచ్చనిపూలు. ఇంకొంతదూరం పాలాలు- ఈ విధంగా భూమి ప్రాంతం రంగులమయం పూవులతో.

క్రింద భూమిమీద ఈ విధంగా పూవుల తివాచీలు పరచివుంటే ఇక ఆకాశంలో మేఘాలంత ఎత్తున పర్వతాలు గోచరించసాగాయి. ప్రథమంగా చూచి నేను వాటిని మేఘాలు అనుకొన్నాను. తరువాత తెలిసింది అవి పర్వతాలని. హిమాలయాల పాద పర్వతాలు గోచరించసాగాయి. ఎంతకాలంగానో కలలుగన్న హిమాలయాలు నేడు కళ్ళఎదుట ప్రత్యక్షమయాయి. మానసచక్షువుల ఎదుట మాత్రమే ఇంత కాలంగా రూపొందుతూ వచ్చిన హిమాలయాలు నేడు చర్మచక్షువుల ఎదుట రూపొందాయి. దగ్గరలో భూమిమీద రంగు రంగుల పూల ఇంద్రజాలాన్ని, దూరాన ఆకాశంలో పర్వత రాజ హిమాలయాలను చూస్తూ కొంత సేపు నన్ను నేను మైమరిచాను.

ఇప్పటివరకు పయనించినదంతా ఒక జగత్తు, ఇక ఇప్పటి నుంచి పయనించబోయేది మరొక జగత్తు. ఇక్కడి ప్రదేశానికి అక్కడి ప్రదేశానికి, ఈ వాతావరణానికి, ఆ వాతావరణానికి, ఇక్కడి మానవులకు, అక్కడి మానవులకు ఎంతో

తారతమ్యమో! హిమాలయాలలో ఎటుచూచినా హిమమే గోచరిస్తుంది కాబోలు! ఏ సమయంలోనైనా చలియే కాబోలు! ఎండలో కూడా చలి. నిప్పులో కూడా చలి వుంటుంది కాబోలు. చరిత్రకు పూర్వం నుంచి ఈ హిమాలయాలు సాక్షిగా ఇక్కడే నిలిచివున్నాయి. ఈ హిమాలయాలకు అవతలి భాగంలో మానస సరోవరము, కైలాస పర్వతము. టిబెట్టు దేశము కాబోలు! ఈ విధమైన ఊహాగానంతో కాట్ గోదాం స్టేషన్‌లో వెళ్ళిదిగాము.

ఇక రైలు ముందుకు పోదు, వెనక్కు పోవలసిందే. పర్వతాలు అడ్డుగా నిలబడివున్నాయి. ఇక్కడ హిమాలయాలకు ఎక్కివెళ్ళే బస్సులు బయలుదేరుతాయి. ఈ హిమాలయ ప్రాంతాన్ని కుమావూ ప్రాంతం అంటారు. సంస్కృతపు పేరు కూర్మాచలం అని. ఇక్కడనుంచి ఒక రోడ్డు నైనిటాల్‌కు బయలుదేరి పోతుంది. మరొక రోడ్డు రాణీఖేత్ మీదుగా అల్మోరా పోతుంది. ఉత్తరంగా టిబెట్టు వరకు అల్మోరా జిల్లాయే. కాట్ గోదాం నుంచి నైనిటాల్ 22 మైళ్ళు. రాణీఖేత్ 53 మైళ్ళు; అల్మోరా 83 మైళ్ళు. నా గమ్యం అల్మోరా ప్రస్తుతానికి. ఆ తరువాత అల్మోరా నుంచి మరో మార్గం ద్వారా "ప్రబుద్ధ భారత" సంపాదకీయ కార్యాలయం మాయావతికి పయనించాలి. అక్కడికి బస్సులులేవు.

ఏదో అల్పాహారం చేసి అల్మోరా బస్సులో కూర్చున్నాను. నా ప్రక్క వారు మాట్లాడే భాష మరో విధంగా ధ్వనిస్తుంది. ఇక్కడ హిందీకితోడు కుమావీ అనే పర్వత భాష కూడా మాట్లాడుతారు. బస్సు పదకొండు ప్రాంతంలో బయలు దేరింది. క్రమేణా పైకెక్కసాగింది. మెలికల మెలికల రోడ్డు గుండా, పైకెక్కిన కొద్దీ చల్లని, హాయి అయిన వాయువులు వీచసాగాయి. మైదానాల పొడవున చేసిన ప్రయాణపు శ్రమంతా ఈ చల్లగాలికి కరిగిపోయింది. ఎటుచూచినా మనోహర దృశ్యమే కొండలు, లోయలు, లోయలకావల మళ్ళీకొండలు, మళ్ళీ లోయలు!

చీడ్ అనే ఒక సన్నని ఆకుల నిటారైన చెట్లు ఈప్రాంతమంతా ఎక్కువగా వున్నాయి. వీటిని చీర్ గ్లాసులు కడతారు. వాటిలోకి జిగురు కారుతుంది. దానితో కర్పూర తైలం తయారు చేస్తారట. అడుగడుగునా తెల్లని సెలయేరులు ఎత్తునుంచి పల్లాలలోకి గలగల ధ్వనితో ప్రవహిస్తున్నాయి. పైకిపోయిన కొద్దీపాము మెలికలతో బస్సువచ్చినదారే క్రిందగా కనిపిస్తుంది. మేఘాలు తెల్లగా లోయల్లో వేళ్ళాడుతున్నట్లు గోచరిస్తున్నాయి. బస్సు ఆకాశాని కెక్కిపోతున్నట్టుంది.

దేవదారువెట్టు సువాసనలతో శీతల పవనాలు ప్రాణాన్ని రసమయంగా చేసి వేస్తున్నాయి. ఎత్తు ఎక్కిన కొద్దీ ప్రాణం ఎంతో తేలికిచ్చినట్టుంది. బస్సు ఒక చోట ఆగింది. అక్కడదగ్గి దగ్గరలో పారుతున్న సన్నని సెలయేటిలోవి నీరు త్రాగాను. మంచుగడ్డ వేసిన నీరున్నట్టు చల్లగా తీయగా అమృతంవలె వున్నది. అమృతం ఎలావుంటుందో ఎప్పుడూ తాగి ఎరుగనుకాని అమృతం అనేదివుంటే ఈ హిమాలయాల సెలయేటి నీరులాగా వుండివుంటుంది.

ఈ పర్వత మార్గాలవెంట బస్సులో పోతుంటే ఎక్కువదూరం పోసే వరకు కడుపులో వికారం ఏర్పడినట్టుంది వాంతి అవుతూవుంటుంది ఒకోసారి. నాకు వాంతి కాలేదు కాని, కడుపులో వికారమనిపించింది. చుట్టూకనుపించే ప్రకృతి సౌందర్యాన్ని చూడకుండా కనులుమూసుకో బుద్ధిఅయేది ఒకోసారి.

## రాణీఖేత్ సందర్శన

సాయంత్రం మూడు గంటల ప్రాంత్రంలో రాణీఖేత్ చేరాం. హిమాలయాలలో వున్న గిరినివాసాలలో రాణీఖేత్ చాలా రమణీయ ప్రదేశం. ఇది మిలటరీ కంటోన్‌మెంటుకూడా. రాణీఖేట్‌లోని ప్రత్యేకతేమంటే ఇక్కడినుంచి ఉత్తరంగా చూస్తే మేఘాలు లేని రోజున దూరానవున్న హిమశిఖరాలన్ని వరసగా తూర్పు నుంచి పడమరకు కనుపిస్తుంటవి. తూర్పునుంచి పడమరకు వ్యాపించివున్న హిమ శిఖరాలను చూస్తుంటే కుమార సంభవంలోని కాళిదాసు శ్లోకం గుర్తొస్తుంది;

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వా పరౌతోయ నిధీవగాహ్య
స్థితఃపృథివ్యా ఇవమానదండః॥

రాణీఖేట్ నుంచి సూర్యోదయ సమయంలో కనుక ఉత్తరంగా చూస్తే ఆ హిమశిఖరాలన్నీ అరుణరాగంలో అద్భుతంగా గోచరిస్తాయి. నందాదేవి శిఖరం, నందకోట శిఖరం, నీలకంఠ మొదలైన వెన్నో శిఖరాలు అచ్చుగా మంచుగడ్డను పిరియబోసుకొని నిలచి ధగధగ మెరుస్తుంటాయి. ఎండలో రాణీఖేట్ నుంచి బద్రీనాథ్ కేదారనాథ్ కూడా పోతుంటారు యాత్రికులు. ఇక్కడనుంచి పిండారీ గ్లేషియర్ కూడా పోతారు పర్యటకులు.

# కంచరగాడిదపై ప్రయాణం - వింత అనుభూతులు

ఉత్తర కుమాయూ లేక కూర్మాచల హిమాలయాలలో ఆల్మోరా నగరం చారిత్రాత్మకమైన నగరం. దీన్ని చంద్రవంశపు రాజు అయిన కల్యాణచంద్ క్రీస్తుశకం పదహారవ శతాబ్దపు మధ్యభాగంలో నిర్మించాడు. అంతకుపూర్వం ఈ చంద్ రాజుల రాజధాని ఆల్మోరాకు తూర్పుగా పాతిక మైళ్ళలో వున్న చంపావత్ (చంపావతి) నగరం. చంపావత్‌కు తూర్పుగా శారదానది (దీని నామాంతరం కాలీనది) వుంది. ఆ నది కావలనుంచి నేపాల్ రాజ్య ప్రారంభం. పూర్వం ఆ భాగంలో దోతి రాజ్యం అనేది వుండేది. ఈ దోతి పాలకుల అత్యాచారాల నుంచి దూరంగా వుండాలని చంద్ రాజులు ఆల్మోరా నగరాన్ని నిర్మించి తమ రాజధానిని చంపావత్‌నుంచి ఆల్మోరాకు మార్చుకొన్నారు. కాని, క్రీ. శ. పద్దెనిమిదవ శతాబ్దపు మధ్యభాగంలో ఈ హిమాలయాలకు దక్షిణ భాగమైన రోహిల్‌ఖండ్ నుంచి రోహిలా ముస్లిముల దండువచ్చి అప్పుడు ఆల్మోరాను పరిపాలిస్తున్న మరో కల్యాణచంద్‌ను ఓడించి ఆల్మోరాను హస్తగతం చేసుకొన్నారు. తరువాత కొంతకాలం ఇది గూర్ఖాల పరిపాలనలోవుండి చివరకు 1815 లో బ్రిటిష్‌వారి చేతులలోకి వచ్చింది.

ఆల్మోరాలో ఆ సాయంత్రం బస్సుదిగి దగ్గరలోనే ఒక లాడ్జిలో ప్రవేశించాము. హిమాలయాల శరత్కాలం దివ్యశోభను ప్రదర్శిస్తున్నది. కాని చలి మాత్రం విపరీతంగా వేయసాగింది. ఆల్మోరాలో ఏ వస్తువును ముట్టుకున్నా కూడా మంచుగడ్డను ముట్టుకొన్నట్లే వుంటూంది. వెంటనే బజారుకు వెళ్ళి రెండు దట్టమైన ఉన్ని రగ్గులను, రెండు నిండు స్వెట్టర్లను, ఒక ఉన్ని కోతి టోపీని కొని తెచ్చాను. రెండవరోజు రెండు ఉన్ని పంట్లాములను, ఒక ఉన్ని కోటును కుట్టించాము.

## ఆల్మోరా నగర సందర్శన

ఆల్మోరానగరం చూడడానికి విచిత్రంగా వుంటుంది. ఆల్మోరా బజారులలో గుర్రాలు, కంచరగాడిదలు తప్ప చక్రాలున్న వాహనాలేమీ నడవవు. బజారులనిండా బండలు పరచివుంటుంది; ఎక్కుడు దిగుడు పర్వత నగరాలలో తప్పనిసరి. ప్రతి ఇంటిముందు కూడా మంచి పూలచెట్లు, తీగెలూ. వెనక "విశాల్ భారత్" పత్రికలో ప్రమోద కుమార చటర్జీ చిత్రించిన ఆల్మోరా నగర దృశ్యాన్ని చూచాము.

నేడు ఈ నగరాన్ని తిరిగి ఆ చిత్రంలో పోల్చి చూడసాగాను. పర్వత నగరాల్లో ప్రత్యేక శోభ వుంటుంది. వాటిలో అల్మోరాది మరొక ప్రత్యేక శోభ. అల్మోరా ప్రాంతంలో చాలా ఆశ్రమాలున్నాయి స్వదేశీయులవీ, విదేశీయులవీ కూడా. ఇక్కడికి కొన్ని మైళ్ళ దూరంలో ఒక ఇంగ్లీషు సన్యాసి కృష్ణప్రేమ అనే పేరుతో ఉత్తర బృందావన్ అనే ఆశ్రమం నడుపుతున్నాడు. ఆయన వెనక ఇంగ్లండ్ నుంచి వచ్చి లక్నో విశ్వవిద్యాలయంలోను, కాశీ హిందూ విశ్వవిద్యాలయంలోను ఇంగ్లీషు ప్రొఫెసర్ చేశాడు.

అల్మోరా వాతావరణం క్షయరోగులకు అనుకూలంగా వుంటుంది. ఇక్కడ ఒక క్షయరోగుల శానిటోరియం కూడా వున్నది. ఇది చాలా సంస్కృతిగల నగరం. సాహిత్యపరులు, కళాకారులు కూడా ఇక్కడ వుంటూంటారు. ఏదో చిత్ర కాంతి, జ్ఞానకాంతి ఈ ప్రాంతాన్నంతా ఆవరించి వున్నట్టుంటుంది. నేను ఇక్కడున్న మూడు రోజుల్లో ఇక్కడి కొందరు ప్రముఖులతో పరిచయమైంది. దక్షిణం నుంచి ఈ చిన్న వయసులో ఈ హిమగిరి ప్రాంతాలకు ఒంటరిగా వచ్చినందుకు వాళ్ళంతా ప్రశంసించారు.

ఇక్కడనుంచి ఉత్తరంగా నందాదేవి శిఖరం మెరుస్తూ ప్రత్యేకంగా గోచరిస్తుంది. కుమాయు ప్రాంతానికి అధిష్ఠానదేవత నందాదేవి. ఈ నందాదేవి ఆలయం కూడా వుంది అల్మోరాలో. ఈ నందాదేవికి ఆ నందాదేవి హిమశిఖరం ప్రాకృతిక చిహ్నం; ఆ నందాదేవి శిఖరానికి ఈ నందాదేవి ప్రతిమూర్తి చిహ్నం. నందాదేవి హిమశిఖరమంటే పిండారీ గ్లేషియర్ ఉత్పత్తి. పిండారీ గ్లేషియర్ రానురాను పిండార్ నదిగా రూపొందుతుంది. ఈ పిండార్ నదికి పశ్చిమభాగం ఘర్వాల్ పరిదేశం. పూర్వభాగం కుమాయు ప్రాంతం.

మూడు పగళ్ళు, మూడు రాత్రులు అల్మోరాలో విశ్రాంతి తీసుకొంటూ తీవ్రమైన చలిని భరిస్తు గడిపాను. యు. పి. మైదానప్రాంతాలలోవలె ఇక్కడ రొట్టెలు తినడం తక్కువ. హిమాలయాలలో వరి అన్నం తినడమే ఎక్కువ. కూరలలో మైదాన ప్రాంతాలలోకంటె కారంకూడా, ప్రత్యేకించి పచ్చి మిరపకాయలు ఎక్కువ వాడతారు. అందువల్ల ఇక్కడ నాకు బాగావుంది।

## మాయావతికి ప్రయాణం

అల్మోరా నుంచి మాయావతి నలభై మైళ్ళు దాదాపు వుంటుంది. పర్వతాల గుండా, అరణ్యాలలోగుండా చిన్న గుర్రంమీదకాని, కంచర గాడిదమీదకాని. లేక నడచికాని పోవాలి. అల్మోరాలో గుర్రంకాని, కంచరగాడిదకాని దొరకలేదు.

ఇక్కడనుంచి ఆల్మోరానగరం ఎత్తుమీద సుందరంగా గోచరిస్తుంటుంది. ఇక్కడినుంచి ఈదారి చాలా చాలా దూరపు తావులకు పోతుంది. ఎల్లప్పుడూ గుర్రాలూ, కంచరగాడిదలూ, సామాన్లు మోసుకొని ఈ దారిన ఆల్మోరా పోతూ వస్తుంటాయి. ఈ చుట్టుపట్ల పల్లెలలో ఉత్పత్తి అయిన బంగాళాదుంపలను ఈ జంతువులమీద వేసుకొనిపోయి ఆల్మోరాలో అమ్మివస్తుంటారు.

ఇక్కడ పాఠశాలకుతోడు ఒక చిల్లర అంగడికూడా వుంది. ఇందులోనే పోస్టాఫీసుకూడా. ఆ వర్తకుడే పోస్టుమాస్టరు పనికూడా చూస్తాడు. ఈ ప్రాంతం అంతా ఇదే ప్రథ. నాకు ఆ పూట ఆ వర్తకుడే వంటచేసి పెట్టినాడు. భోజనం చాలా రుచిగావుంది. అన్నం, దానిమ్మకాయ పచ్చడి, ముల్లంగి వేపుడు, పెరుగు ఎంతో సంతృప్తిగా భోజనంచేశాను. ఇంటిదగ్గర తెలుగు భోజనంలాగానే వుంది.

ఆ రోజున ఆ వర్తకుడు, ఉపాధ్యాయులుకూడా నాకు వాహనాన్ని సమకూర్చడానికని ఎంతో ప్రయత్నించారు కాని దొరకలేదు. రేపు ఉదయంనుంచి బయలుదేరడానికైతే ఒక కంచరగాడిద యజమాని సమ్మతించాడు. నేను విధిలేక ఆ మాటకు అంగీకరించాను. రేపటివరకు ఇక్కడే వుండాలి. ఆ రాత్రి పూరీ తిని పాలుత్రాగి ఆ పాఠశాలలోనేవున్న మంచంమీద నిద్రించాను. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులైన దేవీలాల్‌షా ఆ రాత్రి ఇంటికి పోకుండా నాకు తోడుగా పాఠశాలలోనే నిద్రించాడు.

రెండవరోజు అనుకొన్న ప్రకారం మాధోసింగ్ అనే ఆతను కంచరగాడిదను తీసుకొనివచ్చాడు, కొంత ఆలస్యంగా. సరే, అక్కడి వారందరివద్ద సెలవు తీసుకొని కంచరగాడిదమీద సాధ్యమైన కష్టం పుచ్చుకొన్నాను. అది ఒకసారి తల త్రిప్పి నావైపు చూచి ఇక నడక ప్రారంభించింది. మాధోసింగ్ నా సామాను ఎత్తుకొని నావెంటే వస్తున్నాడు. ఇక్కడి నుంచి లాంగరా ఏడు మైళ్ళు వుంటుంది. అవతల మోర్నోలా ఒక ఎనిమిది మైళ్ళు వుంటుంది. మాధోసింగుది మోర్నోలా. ఏ రాత్రికైనా మోర్నోలా చేరాలని అతని సంకల్పం. కాని, ఈ పర్వత మార్గంలో కంచరగాడిద అంతదూరం సాయంత్రానికి వెళ్ళగలదా అని నా సందేహం. అనేక అందమైన లోయల గుండా కొండల గుండా, దేవదారు అరణ్యాల గుండా, యాపిల్ తోటల ప్రక్కగా, టీ తోటల దగ్గరగా ప్రయాణం సాగిస్తూన్నాం. సాయంత్రం అయ్యే వరకు ఆకాశమంతా మేఘాచ్ఛన్నమైపోయింది. వర్షం ప్రారంభించింది. ఉరుములు ఉరుము తున్నాయి. మెరుపులు మెరుస్తున్నాయి. ఇక మేము చేసేది లేక

ఇక్కడనుంచి ఆల్మోరానగరం ఎత్తుమీద సుందరంగా గోచరిస్తుంటుంది. ఇక్కడినుంచి ఈదారి చాలా చాలా దూరపు తావులకు పోతుంది. ఎల్లప్పుడూ గుర్రాలూ, కంచరగాడిదలూ, సామాన్లు మోసుకొని ఈ దారిన ఆల్మోరా పోతూ వస్తుంటాయి. ఈ చుట్టుపట్ల పల్లెలలో ఉత్పత్తి అయిన బంగాళాదుంపలను ఈ జంతువులమీద వేసుకొనిపోయి ఆల్మోరాలో అమ్మివస్తుంటారు.

ఇక్కడ పాఠశాలకుతోడు ఒక చిల్లర అంగడికూడా వుంది. ఇందులోనే పోస్టాఫీసుకూడా. ఆ వర్తకుడే పోస్టుమాస్టరు పనికూడా చూస్తాడు. ఈ ప్రాంతం అంతా ఇదే ప్రథ. నాకు ఆ పూట ఆ వర్తకుడే వంటచేసి పెట్టినాడు. భోజనం చాలా రుచిగావుంది. అన్నం, దానిమ్మకాయ పచ్చడి, ముల్లంగి వేపుడు, పెరుగు ఎంతో సంతృప్తిగా భోజనంచేశాను. ఇంటిదగ్గర తెలుగు భోజనంలాగానే వుంది.

ఆ రోజున ఆ వర్తకుడు, ఉపాధ్యాయులుకూడా నాకు వాహనాన్ని సమకూర్చడానికని ఎంతో ప్రయత్నించారు కాని దొరకలేదు. రేపు ఉదయంనుంచి బయలుదేరడానికైతే ఒక కంచరగాడిద యజమాని సమ్మతించాడు. నేను విధిలేక అందుకు అంగీకరించాను. రేపటివరకు ఇక్కడే వుండాలి. ఆ రాత్రి పూరీ తిని పాలుత్రాగి ఆ పాఠశాలలోనేవున్న మంచంమీద నిద్రించాను. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులైన దేవీలాల్‌షా ఆ రాత్రి ఇంటికి పోకుండా నాకు తోడుగా పాఠశాలలోనే నిద్రించారు.

రెండవరోజు అనుకొన్న ప్రకారం మాధోసింగ్ అనే ఆతను కంచరగాడిదను తీసుకొనివచ్చాడు, కొంత ఆలస్యంగా. సరే, అక్కడి వారందరివద్ద సెలవు తీసుకొని కంచరగాడిదమీద కూర్చుని కళ్ళెం పుచ్చుకొన్నాను. అది ఒకసారి తల త్రిప్పి నావైపు చూచి ఇక నడక ప్రారంభించింది. మాధోసింగ్ నా సామాను ఎత్తుకొని నావెంటే వస్తున్నాడు. ఇక్కడి నుంచి లాంగరా ఏడు మైళ్ళు వుంటుంది. అవతల మోర్నోలా ఒక ఎనిమిది మైళ్ళు వుంటుంది. మాధోసింగుది మోర్నోలా. ఏ రాత్రికైనా మోర్నోలా చేరాలని అతని సంకల్పం. కాని, ఈ పర్వత మార్గంలో కంచర గాడిద అంతదూరం సాయంత్రానికి వెళ్ళగలదా అని నా సందేహం. అనేక అందమైన లోయల గుండా, కొండల గుండా, దేవదారు అరణ్యాల గుండా, యాపిల్ తోటల ప్రక్కగా, టీ తోటల దగ్గరగా ప్రయాణం సాగిస్తూన్నాం. సాయంత్రం అయ్యే వరకు ఆకాశమంతా మేఘాచ్ఛన్నమైపోయింది. వర్షం ప్రారంభించింది. ఉరుములు ఉరుము తున్నాయి. మెరుపులు మెరుస్తున్నాయి. ఇక మేము చేసేది లేక

ఆ చీకటిలో, ఆ వర్షధారలో దగ్గరలో వున్న ఒక పశుశాలలో తలదాచుకొని తెల్లవారి పయనం సాగించాం.

మొరాన్గాలలో ఆగకుండానే పయనం సాగించి మధ్యాహ్నానికి ముందే దేబీధురా చేరుకొన్నాం. ఈ మూడు రోజులనుంచి ఆ చలిలో అల్మోరానుంచి బయలుదేరిన తరువాత నేను స్నానంచేయలేదు. ఈ వాతావరణంలో స్నానంమీద పెద్దగా అభిలాష కూడా జనించదు. దేబీధురాలో వేడినీటితో స్నానంచేసి మాధోసింగ్ వండిన ఖిచిడీతిని, దగ్గరలో వున్న చిన్న హాస్పిటల్‌కు వెళ్ళాను. హాస్పిటల్‌లో వున్న డాక్టర్ పంజాబీ యువకుడు. ఆయన నేను కొంతసేపు ప్రసంగించుకొని మళ్ళీ పయనం సాగించాం.

పర్వత మార్గాలలో కొండలు ఎక్కుడు వచ్చినప్పుడు జంతువుమీద కూర్చోవచ్చు కాని దిగుడు వచ్చినప్పుడు మాత్రం జంతువును దిగి నడవాలి. దిగుడులో జంతువు మీదనే కూర్చుంటే జంతువు కాళ్ళు మడతపడి ముందుకు పడిపోతుంది. అప్పుడు వాహనానికి, వాహకునికి కూడా ప్రమాదం. రాత్రి వర్షం కురిసిపోయిన ఆకాశంలో ఒక స్వచ్ఛత గోచరిస్తోంది, దారినిండా రాళ్ళు బయటపడి వున్నాయి. కంచరగాడిదను వడి వడిగా నడవసాగాను. దారిలోనే చీకటి పడిపోయింది. ఖేతిఖాన్ గ్రామం కనుపిస్తూంది. ఇక్కడ కొంచెం సమతలంగా వున్నట్టుంది భూమి. ఖేతిఖాన్ చేరేవరకు కొంచెం ప్రొద్దుపోయింది. ఒక ఇంటిలో కంచర గాడిదను కట్టివేసి అక్కడే కొన్ని బంగాళాదుంపలను కాల్చితిని నిద్రించాం. అలసిన శరీరంలోని ప్రాణం ఎటుపోయిందో కన్ను మూయగానే !

తెల్లవారుఝామునే నాకు నిద్రమెలకువ వచ్చింది. కొంచెం దూరం నుంచి ఏదో సంకీర్తన వినిపిస్తోంది. హార్మోనియమూ, డోలక్కూ మ్రోగుతున్నాయి సహకార వాద్యాలుగా. నాకు తన్మయత్వం కలిగింది. మళ్ళీ కన్నుమూశాను. తెల్లవారిన తరువాత మాధోసింగ్, నేనూ లేచి కాలకృత్యాల అనంతరం ఏదో తినుపదార్థంతిని టీ త్రాగి మళ్ళీ పయనం సాగించాం.

ఈ దారి అంతగా సుఖంగాలేదు. ముళ్ళ పొదలలోగుండా కూడా పోవలసి వచ్చింది. ఎక్కుడుకంటె దిగుడు ఎక్కువ. దిగుతూంటే జారుతూంది. కొంత దూరం పోయిన తరువాత దూరంగా కొంత ఎత్తుమీద మాయావతి కన్పించసాగింది. అదే ఇంగ్లీషు మాసపత్రిక "ప్రబుద్ధ భారత" సంపాదకీయ కార్యాలయం. అదే నా దీర్ఘప్రయాణానికి గమ్యం. దాదాపు పదిహేనువందల మైళ్ళు ప్రయాణంచేసి, ప్రయాణంలో అనేక వెలుగునీడలను దాటి మాయావతి చేరుకొన్నాను. "ప్రబుద్ధ భారత" సంపాదకులు స్వామి పవిత్రానంద వాత్సల్యంతో నన్ను లోనికి తీసుకు వెళ్ళారు.

# "మాయావతి" ప్రకృతి సౌందర్యం

మాయావతి కుమావు హిమాలయాలలో ఒక రమ్యమైన స్థానం. రామకృష్ణ మిషన్ వారి ఆంగ్ల మాసపత్రిక "ప్రబుద్ధ భారత" ఇక్కడనుంచే వెలువడుతున్నది. దాని సంపాదకుడు ఇక్కడే ఉంటాడు. కాని ముద్రణ కలకత్తాలో జరుగుతుంది. మాయావతిలోని ఆశ్రమాన్ని అద్వైతాశ్రమం అంటారు. రామకృష్ణమిషన్‌కు చెందిన స్వామీజీలకు ఇక్కడ ప్రత్యేక శిక్షణఇచ్చిన తరువాత యూరప్‌కు, అమెరికాకు వేదాంత ప్రచారానికి పంపుతారు. వీరంతా యూనివర్సిటీ డిగ్రీదారులే. అటు పాశ్చాత్య సంస్కృతిని, ఇటు భారతీయ సంస్కృతిని జీర్ణించుకొన్న విద్వాంసులు.

ఈ సుందరతమ హిమాలయప్రకృతిలో, అందులోను నిర్మలమైన, పారదర్శకమైన శరత్కాలంలో, ఇటువంటి దీప్తిగల సంస్కృతీపరుల మధ్య నివసించడం అదో అలౌకికానందంగా తట్టేది. మేఘాలు లేని రోజు ఇక్కడనుంచి ఉత్తరంగా చూస్తే అనంతమైన గాఢ నీల గగనంక్రింద సుదూరపు హిమ శృంగాలు ఆకాశంలోకి చొచ్చుకొని ధవళకాంతులను ప్రసరిస్తూ అనంత ఖండాలుగా గోచరిస్తుంటాయి; ఇందులో బదరీనాథ్ శిఖరాలుకూడా వున్నాయి.

క్రిందుగా అరణ్యాలలో నిండిన లోయలు, అక్కడక్కడ పది ఇళ్ళుగల గ్రామాలు చిత్రాలలోవలె గోచరిస్తూంటాయి. ఎటుచూచినా జలజల సెలయేళ్ళు ప్రవహిస్తుంటాయి చల్లగా, తెల్లగా. ఈ ఆశ్రమానికి చెందిన తోటలు, దొడ్లు, పశుశాలలు అన్నీ సుందరంగా కనిపిస్తుంటాయి. ఈ స్థలం నిజంగా ప్రకృతికి లీలానికేతనం, దీనికితోడు విశ్వ సంస్కృతికి కూడా :

ఇక్కడనుంచి ఉత్తరంగా సుదూరాన పశ్చిమ టిబెట్‌లోవున్న ప్రసిద్ధ హైందవ తీర్థ స్థలాలైన మానససరోవరానికీ, కైలాస పర్వతానికీ మార్గం పోతుంది లోహాఘాట్, పిథోరాగఢ్, అస్కోట్ మొదలైన స్థావరాల మీదుగా. ఇక్కడికి కొద్దిదూరంలో తూర్పున ప్రవహిస్తూన్న కాళీనదిని దాటితే అవతల నేపాల్ రాజ్యంలో అడుగుపెడతాం. చిరుతపులులూ, పెద్దపులులూ మొదలైన వన్యమృగాలు రాత్రులు ఈ ఆశ్రమంచుట్టూ కుక్కలవలె సంచరిస్తూంటాయి.

ఈ ఆశ్రమాన్ని స్థాపించినవాళ్ళు వివేకానందుని ఇంగ్లీషు శిష్యులైన కెప్టెన్ సేవియర్ దంపతులు. 1897లో వివేకానందునితోపాటు వాళ్ళు భారతదేశంవచ్చి

1899 లో మాయావతిలో స్థిరపడిపోయారు. కెప్టెన్ సేవియర్ 1900లో తన మరణ పర్యంతం "ప్రబుద్ధ భారత్"కు మేనేజర్‌గా వుండేవాడు. తదనంతరం మరికొంత కాలం శ్రీమతి సేవియర్ ఇక్కడే వుండి తరువాత ఇంగ్లండ్ వెళ్ళిపోయింది. ఆ రోజులలో శ్రీమతి సేవియర్ ఆహ్వానంపైన విఖ్యాత వృక్ష వైజ్ఞానికుడైన జగదీశచంద్రబోసు ఆయన భార్య అబలాబోసు గ్రీష్మంలో ఈ అద్వైతాశ్రమంలో వచ్చివుంటుండేవారట. మొక్కలు బయటి ఉత్తేజనాలకు ఏ విధంగా చలిస్తాయో మొదలైన ప్రయోగాల ప్రదర్శనను చేసి చూపేవాడట జగదీశ చంద్రబోసు ఈ ఆశ్రమవాసులకు. దేశబంధు చిత్తరంజనదాసుకూడా ఒకటి, రెండుసార్లు ఈ ఆశ్రమాన్ని సందర్శించి వెళ్ళాడట కుటుంబంతోసహా.

అప్పుడప్పుడు ఇక్కడకు అనేక సుప్రసిద్ధ విదేశీ విద్వాంసులు వచ్చి పోతుంటారు. కొందరు కొంతకాలం నివాసం కూడా చేసి పోతుంటారు. నేను వున్నప్పుడు ఇద్దరు ఫ్రెంచి విద్వాంసులు వుంటున్నారు. ఆశ్రమం అధ్యక్షుని పేరు వీరేశ్వరానంద. "ప్రబుద్ధ భారత" సంపాదకుని పేరు పవిత్రానంద. పత్రిక సంపాదకీయ కార్యాలయం ప్రత్యేకంగా ఒక రెండు అంతస్థుల కట్టడంలో వుంది. సంపాదకుని గదివెంబడే వున్న గదిలో నన్ను ప్రవేశపెట్టారు. చాలా భాషలలో మంచి పుస్తకాలున్నాయి సంపాదకీయ కార్యాలయం లోని గ్రంథాలయంలో. ప్రపంచంలోని ఎన్నో పత్రికలు ఇక్కడికి వస్తాయి. వాటన్నిటినీ చదవడం కుదరక పోయినా, కళ్ళతోటి చూచి సంతోషించడానికి పనికివచ్చే పత్రికలు, కొన్ని చదివి ఆనందించడానికి పనికివస్తే. మరికొన్నిచూచి ఆనందించడానికి మాత్రమే పనికివస్తాయి !

ఆశ్రమం అధ్యక్షుడు పత్రికా సంపాదకుడు కాక ఇంకా ఒక ఏడెనిమిది మంది స్వామీజీ లున్నారు. ఇక్కడ సాధన, అధ్యయనంతోపాటు తలా ఒక పని చూస్తూంటారు. బయటి ప్రపంచంతో ఉత్తర ప్రత్యుత్తరాలు ఒకరు చూస్తూంటే, వంటింటి వ్యవహారాలూ మొదలైనవి మరొకరు చూస్తూంటారు. డాక్టర్ కమలానంద అనే స్వామీజీ ఇక్కడి వైద్య వ్యవహారాలను చూస్తాడు. ఆశ్రమం తరపున ఒక ఉచితవైద్యశాల నడపబడుతూంది. చుటుపట్ల శైల గ్రామాలనుంచి నిత్యమూ ఎందరో రోగులు ఈ వైద్యశాలకు హాజరవుతూంటారు. వచ్చిన రోగులు పిల్లలు స్త్రీలు, పురుషులు అందరినీ డాక్టర్ కమలానంద ఆదరించి వారికి తగు చికిత్సలు చేసి పంపుతూంటాడు.

ఈ ఆశ్రమానికి వివేకానంద 1901 లో వచ్చివెళ్ళాడట. ఈ హిమగిరి ప్రాంతంలో, ఈ వన్య పరిసరాలలో, ఈ గిరిజనుల ఆవాసాల ప్రదేశంలో మాయావతి నిజంగా మాయకు అతీతంగా నిలచివున్న ఒక జ్యోతిర్ఖండం ! బుద్ధిజీవుల జగత్తుకు సంబంధించి ఎంత శ్రమ చేస్తుందో, ఈ ప్రాంతంలోని

సామాన్యమానవుని అవసరాలను తీర్చటానికి కూడా అంత సేవ చేస్తూంది ఈ ఆశ్రమం. వీటిలో ఉచితంగా చేసే వైద్యసేవ అమోఘమైంది. విద్య వైద్యం అత్యుత్తమమైన మానవసేవ.

ఈ ఆశ్రమంలోని భోజనమంతా బెంగాలీ భోజనమే. కారణం ఇక్కడుంటున్న స్వామీజీ లందరూ బెంగాలీవారే కనుక శరత్ అంటే చలికాలానికి ఒకమెట్టు క్రిందదిమాత్రమే కనుక హిమాలయాల్లో దక్షిణ దేశీయులకు ఈ ఋతువులో భరించలేనంత చలివుంటుంది. నేను అందువల్ల కొంత ఎండ ఎక్కిన తరవాతనే మంచం దిగేవాణ్ణి. తెల్లవారుఝామున నాలుగు గంటలకే మెలకువ వచ్చేది. కాని చలిమూలంగా రగ్గులలో ముడుచుకొని మెలకువతోనే పడుకునేవాణ్ణి. చలితో వెచ్చని దుప్పులలో మునిగి పడుకొని వివిధాలోచనలు చేస్తుండడంలో ఏదో ఒక సంతృప్తి తడుతుంటుంది. ఆంధ్రదేశానికి సుదూరమైన ఈ హిమాలయ ఆశ్రమంలో చలిలో పడుకొని గడచిపోయినవాటి స్మృతులను. గడుస్తున్నవాటి అనుభవాలను గడవనున్నవాటి ఆశలను స్వప్నంలోలాగా తిలకిస్తుంటే ఏదో హాయి కొంతసేపు, ఏదో వేదన కొంతసేపు తట్టసాగాయి.

ఉదయం కాలకృత్యాలయిన మీదట ఏవో తీపి పదార్థాలు తిని తేనీరు త్రాగేవాళ్ళం, అక్కడి అంతేవాసులందరం కలసి. దాక్షిణాత్యుడిని నేనున్నానని ఒకోరోజు ఉప్మా చేసేవారు. అందులో నేను నిమ్మరసం వేసుకొని తింటే. మిగతావారు అందులో పాలు పంచదార కలిపి తినేవారు. తరువాత ఎవరి గదులకు వారు ధ్యానానికి వెళ్ళిపోయేవారు. నేనుమాత్రం వీరి ఆధ్యాత్మిక విధులలో దేనిలోను అంతగా పాల్గొనేవాడిని కాదు. ఎక్కువగా సంపాదకీయ కార్యాలయంలోను, గ్రంథాలయంలోను గడిపేవాణ్ని; విశ్రామ సమయాలలో దూరాన గోచరించే ధవళ హిమ శిఖరాలను చూస్తూ వుండిపోయేవాణ్ణి. ఒక మాటలో చెప్పాలంటే వారందరిదీ కళ్ళు మూసినధ్యానమైతే, నాది కళ్ళు తెరచిన ధ్యానం। అసలులో రెంటికీ భేదమేలేదు॥

అనంతరం పన్నెండు ఒంటిగంటమధ్య భోజనం. చపాతీలులాంటివేమీ లేకుండా మామూలుగా వరి అన్నము, కూరలు వుండేవి. ఆంధ్రులవలె బెంగాలీలు కూడా బియ్యపు జీవులే. భోజనసమయం చాలాసేపు పట్టేది. ఎక్కడెక్కడి విషయాలు ఆ సమయంలో చర్చకు వచ్చేవి. బెంగాలీలోను, ఇంగ్లీషులోనూకూడ సంభాషణలు జరిగేవి. న్యూయార్కులోని వేదాంత కేంద్రం ఏ విధంగా పనిచేస్తూన్నది అనే విషయం మొదలు ఆశ్రమంలోని అవుదూడల విషయం వరకు ఏ విషయం వదలబడేదికాదు. బెర్ట్రెండ్ రస్సెల్ చేసిన లేజా ప్రకటనలు వాటికి ఆల్డస్ హక్స్లీ ఇచ్చిన సమాధానాలూ, బెర్నార్డు షా నూతన రచనలూ, రోమారోలానుండి వచ్చిన ఉత్తరంలోని విషయాలూ—ఈ విధంగా భోజన సమయంలో జాతీయ అంతర్జాతీయ విషయాలు ఎన్నో సంభాషణలలో ప్రవేశించేవి.

# హిమాలయ పర్వత ప్రాంతాల ప్రజలు — విచిత్రమైన వారి వృత్తులు, ప్రవృత్తులు

అధ్యయన కలాపాలనుంచి కొంచెం విరామం తీసుకొని ఆరామం పొందాలనే ఇచ్ఛతో ఉదయాన ఆస్పత్రి తెరవగానే వెళ్ళి డాక్టర్ కమలానంద దగ్గర కూర్చున్నాను. ఇక్కడ కూర్చుంటే ఈ ప్రాంతపు ప్రజల ఆకృతులనూ, ప్రకృతులనూ కూడా పరిశీలించే అవకాశం దొరుకుతుంది. బాహ్య ప్రకృతిని అర్థం చేసుకోవడం సులభమేకాని మానవ ప్రవృత్తిని అర్థం చేసుకోవడం అంత సులభం కాదు. బాహ్యప్రకృతిలో కూడా రహస్య మయత లేక పోలేదు. కాని, మానవ ప్రకృతిలోని రహస్యమయత గాఢతరం. ఒక వ్యక్తి మాట్లాడు తూంటే ఆ మాటలు అతని ప్రకృతికి ప్రతిబింబాలవునో కావో గుర్తించ డానికి ఇవతలి మనిషిలో ఎంతో మనోవైజ్ఞానిక పరిజ్ఞానమూ, సూక్ష్మదృష్టి వుండాలి. ఇన్నివుండి కూడా ఎక్కువసార్లు వాస్తవాన్ని గుర్తించిక పోవడం జరు గుతూ వుంటుంది. ఎదటి మనిషి స్వభావం ఒక విధంగా వుంటే దాన్ని మనం మరో విధంగా అర్థం చేసుకొని మనం అర్థం చేసుకొన్నదే వాస్తవమని మోస పోతుంటాము.

ప్రొద్దెక్కిన కొద్దీ గుర్రాలమీద, కంచర గాడిదల మీద, కాలినడకనా, మరీ మంచం పట్టిన రోగులు డోలీలలో ఆస్పత్రికి రాసాగారు. రంగు రంగుల దుస్తు లను ధరించి వెండినగలను పెట్టుకొన్న స్త్రీలు, బిర్రులాగులను తొడుక్కొని కోటూ, టోపీతో వున్న పురుషులు, జ్వరంతో కళ్ళు మూతలుపడి తల్లుల భుజలమీద వేలాడు తున్న శిశువులు మొదలైనవారంతా ఆస్పత్రిలో ప్రవేశించ సాగారు. ఈ హిమా లయ ప్రకృతిలో ఎంత సౌందర్యం వున్నదో ఇక్కడి ప్రజల జీవితాలలో అంత దారిద్ర్యము, వ్యాధులు, నిరక్షరాస్యతా, దుర్వ్యసనాలు వున్నాయి. దారిద్ర్యం, అనా రోగ్యం వున్నచోట దుర్వ్యసనాలుండక తప్పవని, ఆ బాధల నుంచి ఉపశాంతి పొందడానికి ఏదో తాత్కాలిక సుఖం ఇచ్చే దుర్వ్యసనం ఇటువంటివాళ్ళకు శరణ్య మని కొందరంటారు. కాని ఇదీ సమగ్రసత్యం కాదు. ఏమంటే ధనవంతులు, ఆరోగ్యవంతులు, విద్యావంతులు అయినవారు మాత్రం దుర్వ్యసనాలకు బలికాకుండా వుంటున్నారా? అయితే, గొప్పవారు చేసే దుష్టకార్యాలు గొప్పదనం అనే ముసుగు క్రింద గొప్పగా ప్రకాశిస్తాయి. ఇక తక్కువవాళ్ళు చేసేది తక్కువదనాన్ని ప్రదర్శిస్తాయి!

పెద్ద ఫ్లాస్కులో తేనీరు తీసుకొని అరణ్యంగుండా నడక సాగించి రెండు మైళ్ళు వెళ్ళి అక్కడ ఒక ఊటకాలవ వద్దున మకాం పెట్టాం. అక్కడ ప్రకృతి ఎంతో రమణీయంగా వుంది. ఒక వైపున ఎత్తయిన కొండ, రెండవవైపున లోతైన లోయ. కొండమీదనుంచి లోయలోకి ఊట కాలవలు ధనధనమంటూ ప్రవహిస్తున్నాయి. దాని దగ్గరలోని పర్వతసానువు మీద మేము మకాం పెట్టాం.

అక్కడ కొన్ని నిడివైన దేవదారు చెట్లు నిలిచి అటు ఆకాశానికీ, ఇటు కొండకూ ఎంతో సౌందర్యాన్ని ప్రసాదిస్తున్నాయి. దేవదారు అనే పేరు వినడానికి ఎంత ఇంపుగా వుంటుందో చూడడానికికూడా అది అంత సొంపుగా వుంటుంది. దాని సన్నని ముళ్ళలాంటి ఆకులు ఏదో సంవేదనాత్మకంగా గోచరిస్తాయి. గాలి వీచినపుడల్లా దేవదారుల మీదనుంచి తన్మయాన్ని కలిగించే సుగంధం వస్తుంది. కాళిదాసు కుమారసంభవంలో దేవదారు ద్రుమాలను గురించి రమ్యంగా వర్ణించాడు.

మాయావతికి వచ్చినది మొదలు ఇంగ్లీషులో అప్పుడప్పుడు అంత్యప్రాసలతో చిన్న కవితలు అల్ల ప్రయత్నిస్తూండేవాణ్ని. స్వర్గీయ కవయిత్రి తోరుదత్తును గురించి చదివి వున్నాను. ఆమె చాలా చిన్నతనంలోనే బహుశా ఎనిమిదో తొమ్మిదో సంవత్సరంనుంచే ఇంగ్లీషులో కవితలు రచించ ప్రారంభించినదట. తోరుదత్తు తొమ్మిదో ఏట ఇంగ్లీషు కవితలు రచించ గలిగినప్పుడు సంజీవదేవ్ పదహారో ఏట ఎందుకని ఇంగ్లీషు కవితలు రచించజాలడా అని నేను వాటిని రచించటం మొదలుపెట్టాను. ప్రకృతిలోని దృశ్యలావణ్యాన్ని గురించి మాత్రమే నాలుగు పంక్తులకు ఒకే అంత్య ప్రాసను కలుపుతూ రచించేవాడిని. ఆ రోజు ఆ ఫ్రెంచి మిత్రులతో కలిసి ఆ కొండ మీద విహారంచేస్తూ దగ్గరలోవున్న ఆ దేవదారులను చూచి కవితాప్రేరణ పొంది ఈ క్రింది పంక్తులు వ్రాశాను ఇంగ్లీషులో.

**It's immensely fine**
**To look at a lovely pine,**
**Its tall tapering line**
**Yields us Joy divine.**

ప్రతి చరణంలోను చివరి ప్రాసలు ఎంతబాగా కలిస్తే అంతగొప్ప కవిత అనే భావం వుండేది! ఆ కవితను ఫ్రెంచి మిత్రులు చూచి బాగున్నదని సంతోషించారు. నిజంగా ఆ కవిత వారికి నచ్చి సంతోషించారో, లేక నన్ను ప్రోత్సహించడానికి మాత్రమే సంతోషించినట్టు నటించారో నాకు బోధపడక వారి ముఖాలవైపు

పరిశీలనగా చూచాను. కాని వాస్తవం ఏమిటో ప్రస్ఫుటంగా తెలిసిందికాదు. సరే ఇతర్లకు నచ్చినా నచ్చకపోయినా, నాకు నచ్చితే చాలు అనే సంతృప్తి వుండేది.

వాళ్ళు కూడా కొన్ని కవితలు ఆ సమయాన ఫ్రెంచిలో రచించారు. నేను ఒక కవిత రచించే సమయంలో వాళ్ళు కొన్ని కవితలు రచించారు. వాళ్ళు రచించింది వాళ్ళ మాతృభాషలో మరి నేను రచించింది పరాయి భాషలో. మరి నేను మాత్రం నా మాతృభాషలో ఎందుకు రచించకూడదు? అప్పటికి మాతృభాషలోని సాహిత్యంతో సరైన పరిచయంకాని, అందులో రచన చేయగల కృషికాని జరగడం తటస్థపడలేదు, నిజానికి ఆ సమయాన నా మనసు కొంచెం చిన్నబోయిందికూడా, ఫ్రెంచి మిత్రులు మాతృభాషలో కవితలు వ్రాసుకొంటుంటే నేను మాతృభాషలో వ్రాయలేకపోవడం కొంతబాధ కలిగించింది. కాని, ఆ ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సును మరోవిధంగా సమర్థించుకో సాగాను; మాతృభాషకాని పరాయిభాషయిన ఇంగ్లీషులో నేను కవితలు వ్రాయగలిగాను కాని వారు ఇంగ్లీషులో వ్రాయలేకపోయారని; ఈ భావన నా బాధను కొంత చల్లార్చింది! !

అరణ్యం మధ్యలోని ఎండనీడల్లో తిరుగుతూంటే ఎండ తగిలినప్పుడు చలిలేకుండాను, నీడ తగిలినప్పుడు చలిగాను మిశ్ర సంవేదనలు తట్టసాగాయి. ఏమైనా క్రూర జంతువులు కనిపిస్తే బాగుండునని ఉవ్విళ్ళూరాము. నేలమీద చీమలు, నింగిలో గ్రద్దలు తప్ప మరే జీవీ కనుపించలేదు. నిరాశ చెందాము.

మేము ముగ్గురము ఒకరి అనుభవాలను మరొకరికి తెలుపుకొన్నాము. నా వయసులో వాళ్ళు ఫ్రాన్సులో ఏమి చేస్తుంటారని అడిగాను. పదహారో సంవత్సరం వరకూ పాఠశాలలోనే చదువుతున్నారట. వాళ్ళుకూడా పదహారవ ఏటనే ఫ్రెంచిలో చిన్న చిన్న కవితలు రచించ ప్రారంభించారట. వాళ్ళు నన్ను అడిగారు తమ వయస్సు అనగా నలభై సంవత్సరాల వయస్సప్పుడు భవిష్యత్తులో నేను ఏమి చేస్తుంటానో అని. నేను జవాబు చెప్పాను; రచనలు చేస్తుంటాను, ఉపన్యాసాలు ఇస్తుంటాను, చిత్రాలు చిత్రిస్తూంటాను. ఏవో అందని ఆలోచనలు చేస్తూంటాను, ఏవో పొందని అనుభూతులను పొందుతుంటాను, మిమ్మల్ని జ్ఞాపకం చేసుకుంటువుంటాను అని.

మీరు ఫ్రాన్సునుంచి మారుమూలనవున్న ఈ హిమాలయాలలోని ఈ ఆశ్రమానికి రావడానికి మిమ్మల్ని ప్రేరేపించిన విషయమేమిటని, ఏదైనా మనసులో అశాంతికలిగి దాని నివారణ నిమిత్తం ఇక్కడికి వచ్చారా లేక భారతదేశం

మీద ఏదైనా అభిమానం వుండి వచ్చారా అని వాళ్ళను ప్రశ్నించాను. వాళ్ళు ప్రథమంగా రోమారోలా రచించిన రామకృష్ణ, వివేకానంద జీవితాలను చదివి దివ్యానుభూతి చెందారట. అప్పటినుంచి భారతదేశంవెళ్ళి రామకృష్ణ మిషన్‌వారి కార్యక్రమాలను చూడాలని ఆకాంక్ష కలిగి ఇటీవలనే భారతదేశానికి వచ్చి దేశమంతా పర్యటించి రామకృష్ణ మిషన్‌వారి కేంద్రాలన్నిటిని సందర్శించి చివరకు ఇక్కడకు వచ్చి ఈ ప్రశాంత వాతావరణంలో శాంతిని తిని కాంతిని త్రాగుతూ కాలక్షేపం చేస్తున్నామని, ఇంకొక నెలరోజులలో ఫ్రాన్సుకు తిరిగి వెళ్ళిపోతామని చెప్పి గంభీరముద్ర తాల్చారు.

నా జీవితంలోని విశేషాలను వాళ్ళకు ఎరుకపరచాను. వాళ్ళు నిట్టూర్చారు. ఈ వయసులో ఆ విధంగా దేశద్రిమ్మరిగా జీవించడం వారికి నచ్చలేదు. ప్రాచ్య దేశాలలో చాలామంది వ్యక్తుల బాల్యం సంతృప్తికరంగా వుండదని తామువిన్నట్టు చెప్పారు. ఇందుకు కారణం ఎక్కువమంది తలిదండ్రులు తమ పిల్లలను విలువైన దృష్టితో చూడనందున ఆ పిల్లలు ఆ కుటుంబాలలో ఇమిడిపోరు.

మేము కూర్చున్నచోటుకు చాలా క్రిందుగా లోయలో మరొక సెలయేరు ప్రవహిస్తోంది. క్రిందికి లోయలోకి దిగి ఆ సెలయేటి దగ్గర భోజనం ముగించుకొందామనుకొని అక్కడనుంచి క్రిందికి దిగసాగాం. చాలా నిటారైన దిగుడు. కాని మెట్లు జారుతున్నాయి. ఏవో పొదలు పట్టుకొని కూర్చొని నెమ్మదిగా లోయలోకి దిగాము ఏ అపాయములేకుండా. స్ఫటిక స్వచ్ఛమైన ధార ప్రవహిస్తోంది క్రింద. దారిమధ్య చిన్నవి, పెద్దవి బండలుకూడా వున్నాయి. నీటిధార ఆ బండలకు వేగంగా కొట్టుకొని తెల్లని నురుగలు లేస్తున్నాయి.

## ప్రకృతి సౌందర్యం

నీరు లేనిచోట బండలు వున్నాకూడా రమ్యంగానే వుంటాయి. అదేవిధంగా బండలు లేనిచోట నీరు ప్రవహిస్తున్నాకూడా రమ్యంగానే వుంటుంది. ఇక నీరు ప్రవహించే జాలులో బండలువున్నా, బండలలోగుండా నీరు ప్రవహిస్తూన్నా, ఆ దృశ్యపు లావణ్యం అద్భుతంగా వుంటుంది. ఎంతోసేపు అయినా బండలను దాటి వెడుతున్న ఆ నీటిని, నీటిని ప్రవహించకుండా అడ్డుపడుతున్న ఆ బండలను చూడాలనిపిస్తుంది. ఒకటి స్థితిశీలం, రెండవది గతిశీలం. బండలు కదలవు, నీరు కదులుతుంది. కదిలేది చైతన్యము, కదలనిది జడము. కదిలే చైతన్యాన్ని కదలని

జలం అడ్డగించజాలదు. అందుకే బండలను నీరు అధిగమించి తన పయనం నిరంతరంగా సాగిస్తుంటుంది।

మేము ఆశ్రమంనుంచి వెంట తెచ్చుకొన్న రొట్టెలు, పండ్లు, తేనీరు ఆనందంగా సేవించి కొంచెంసేపు అక్కడి పచ్చిగడ్డిపైన విశ్రమించాం. మా ఈ చిన్న వినోదయాత్ర చాలా ఆనందప్రదంగా వుంది. సాయంత్రం మూడుగంటల వరకు అక్కడే కొంతసేపు విశద్దించాము. మరికొంతసేపు విశ్వదించాము గడిపి ఆశ్రమంవైపుకు తిరోగమనం సాగించాం. హిమాలయ శరత్తులో సాయంత్రం మూడుగంటలకే సంధ్య అవుతూన్నట్టుంటుంది. మేము త్వరత్వరగా ఆశ్రమానికి వచ్చాం. మేము ఆశ్రమం చేరుకొనే సమయానికి సూర్యాస్తమయం అవుతూ ఉత్తరానున్న హిమశృంగాలు బంగారు వారింజకాంతులను వెదజల్లుతూన్నాయి. ఫ్రెంచి మిత్రులు వాళ్ళ గదులకు వెళ్ళిపోయారు. నేనుమాత్రం ఒక లోయవద్దన వున్న చిన్న గోడమీద కూర్చుని సాంధ్య హిమాలయ సౌందర్యాన్ని ఆనందిస్తూ ఈ ఆంగ్లకవిత రచించాను.

**The sunset in the hills**
**Rings the vesper bells,**
**Fire of the crimson bright**
**Lights our spirit's light.**

ఇంతకుముందు వ్రాసిన దేవదారు మీది కవితలో నాలుగు చరణాలకు ఒకే అంత్యప్రాసవాడితే దీనికి రెండు చరణాలకు ఒకటి చొప్పున వాడాను.

ఆ రాత్రి భోజన సమయంలో స్వామీజీ అందరి ఎదుటా నా సంధ్యాగీతాన్ని చదివి వినిపించాను. వారంతా సంతోషించి "లిట్సు అవర్ స్పిరిట్సు లైట్" అని రెండు మూడుసార్లు అన్నారు పెద్దగా. ఇక వీరందరికి నాది మరోకవిత ఏదీ విని పించకూడదు అని నిశ్చయించుకొన్నాను. కారణం, దీన్ని వారంతా బాగున్న దన్నారు. నాది మరోకవిత – వారికి నచ్చకపోవచ్చు; కనుక వారికి బాగున్న కవితతోనే ఆపడం మంచిదని।

# హిమాలయ పర్వతప్రాంతాల ప్రజలు – విచిత్రమైన వారి వృత్తులు. ప్రవృత్తులు

అధ్యయన కలాపాలనుంచి కొంచెం విరామం తీసుకొని ఆరామం పొందాలనే ఇచ్ఛతో ఉదయాన ఆస్పత్రి తెరవగానే వెళ్ళి డాక్టర్ కమలానంద దగ్గర కూర్చున్నాను. ఇక్కడ కూర్చుంటే ఈ ప్రాంతపు ప్రజల ఆకృతులనూ, ప్రకృతులనూ కూడా పరిశీలించే అవకాశం దొరుకుతుంది. బాహ్య ప్రకృతిని అర్థం చేసుకోవడం సులభమేకాని మానవ ప్రవృత్తిని అర్థం చేసుకోవడం అంత సులభం కాదు. బాహ్యప్రకృతిలో కూడా రహస్య మయత లేక పోలేదు. కాని, మానవ ప్రకృతిలోని రహస్యమయత గాఢతరం. ఒక వ్యక్తి మాట్లాడుతూంటే ఆ మాటలు అతని ప్రకృతికి ప్రతిబింబాలవునో కావో గుర్తించడానికి ఇవతలి మనిషిలో ఎంతో మనోవైజ్ఞానిక పరిజ్ఞానమూ, సూక్ష్మదృష్టి వుండాలి. ఇన్నివుండి కూడా ఎక్కువసార్లు వాస్తవాన్ని గుర్తించక పోవడం జరుగుతూ వుంటుంది. ఎదటి మనిషి స్వభావం ఒక విధంగా వుంటే దాన్ని మనం మరో విధంగా అర్థం చేసుకొని మనం అర్థం చేసుకొన్నదే వాస్తవమని మోస పోతుంటాము.

ప్రొద్దెక్కిన కొద్దీ గుర్రాలమీద, కంచర గాడిదల మీద, కాలినడకనా, మరి మంచం పట్టిన రోగులు డోలీలలో ఆస్పత్రికి రాసాగారు. రంగు రంగుల దుస్తులను ధరించి వెండినగలను పెట్టుకొన్న స్త్రీలు, చి[illegible]లను తొడుక్కొని కోటూ, టోపీతో వున్న పురుషులు. జ్వరంతో కళ్ళు మూతలుపడి తల్లుల భుజలమీద వేలాడుతున్న శిశువులు మొదలైనవారంతా ఆస్పత్రిలో ప్రవేశించ సాగారు. ఈ హిమాలయ ప్రకృతిలో ఎంత సౌందర్యం వున్నదో ఇక్కడి ప్రజల జీవితాలలో అంత దారిద్ర్యమూ, వ్యాధులు, నిరక్షరాస్యతా, దుర్వ్యసనాలు వున్నాయి. దారిద్ర్యం, అనారోగ్యం వున్నచోట దుర్వ్యసనాలుండక తప్పవని, ఆ బాధల నుంచి ఉపశాంతి పొందడానికి ఏదో తాత్కాలిక సుఖం ఇచ్చే దుర్వ్యసనం ఇటువంటివాళ్ళకు శరణ్యమని కొందరంటారు. కాని ఇదీ సమగ్రసత్యం కాదు. ఏమంటే ధనవంతులు, ఆరోగ్యవంతులు, విద్యావంతులు అయినవారు మాత్రం దుర్వ్యసనాలకు బలికాకుండా వుంటున్నారా? అయితే, గొప్పవారు చేసే దుష్టకార్యాలు గొప్పదనం అనే ముసుగు క్రింద గొప్పగా ప్రకాశిస్తాయి. ఇక తక్కువవాళ్ళు చేసేది తక్కువదనాన్ని ప్రదర్శిస్తాయి.

సుఖవ్యాధులు కూడా ఇక్కడి ప్రజలలో చాలా అధికం. ఒక పద్దెనిమిది ఏళ్ళ నవయువతి చాలా పెద్ద కళ్ళతో, తెల్లని అందమైన పళ్ళతో, గులాబీ రంగు శరీరచ్ఛాయతో వచ్చి నాకు దగ్గరలోవున్న బల్లమీద కూర్చుంది. ఉన్ని కావి నారింజ రంగుది కప్పుకొని, నిజంగా హిమగిరితనయ మహాదేవుని గురించి చేస్తూన్న తపస్సును వదలి తన వ్యాధికి అక్కడ దొరకని మందు నిమిత్తం ఈ ఆస్పత్రికి వచ్చిందా అనిపించింది. ఆమెవైపే చాలసేపు చూస్తూకూర్చున్నా. నా క్రొత్తముఖాన్ని ఆమెకూడా పరిశీలిస్తూనే వున్నదని గ్రహించాను. ఆమె పైకి ఎంత రామణీయకంగా గోచరిస్తూందో ఆమె ఆరోగ్యం అంత మంచిది కాదని గుర్తించాను. అందమైన నేత్రాలే కాని, నేత్రాల క్రింది భాగంలో నల్లని గుంటలు పడివున్నాయి. ముఖంమీది వర్చస్సులో నిదానంగా చూస్తే మలినం కనిపిస్తోంది. ఎక్కువసేపు నిటారుగా కూర్చులేక అటూ ఇటూ ఒరిగిపోతూంది. ఇంతలో అక్కడున్న నర్సువచ్చి డ్రస్ చేయించుకోవూ అంటూ ఆమెను గదిలోకి తీసుకు వెళ్ళింది.

నాకు కుతూహలం ఎక్కువయి డాక్టర్ కమలానందను ఆమెను గురించి ప్రశ్నించాను. ఆయన నవ్వుతూ ఆమె గనోరియా వ్యాధితో బాధపడుతూందని చెప్పి, ఆ వ్యాధి అంటే నాకు ఏమిటో తెలియదనే ఉద్దేశంతో ఆ వ్యాధికి సంబంధించిన వివరాలూ, దానివల్ల రోగికి కలిగే భరించరాని బాధా మొదలైనవన్నీ విశదంగా తెలిపారు. ఇంతలో ఆమె డ్రస్ చేయించుకొని మూతలుపడే కళ్ళతో, తడబడే కాళ్ళతో వచ్చి డాక్టర్‌గారికి ఒక నమస్కారం చేసి, మరోసారి నా ముఖం వైపు చూచి బయటకు వెళ్ళిపోయింది. ఆమె వ్యాధిని గురించి విన్న తరువాత ఆమె మీద జాలితో కూడిన గౌరవం కలిగింది.

నిజంగా ఈ కుమావూ హిమాలయ ప్రాంతంలో ఈ ఆస్పత్రి ఒక గొప్ప వరప్రసాదమే. ఎన్నో సుఖవ్యాధులు, దుఃఖ వ్యాధులు ఈ డాక్టర్ చేతిలో నివృత్తి అయిపోతున్నాయి ఏడుస్తూ వచ్చిన రోగులు నవ్వుతూ పోతారు.

## శరీర ప్రయోజనం

మానవునికి శరీరం వున్నందున శరీరానికో వ్యాధికూడా వుండాలి కాబోలు. వ్యాధిలేని శరీరం వుండదా? వ్యాధి బాధామయమైంది. అందుకని శరీరం వుండటం బాధామయమా? శరీరం బాధను ఇస్తుంది. ఆనందాన్నీ ఇస్తుంది. కనుక, శరీరం దానం

తటని బాధామయమూ కాదు, ఆనందమయమూ కాదు. మనం దాన్ని ఉపయోగించు కొనే విధానంలో వుంటుంది. శరీరం సక్రమంగా ఉపయోగిస్తే ఆనందం ఇస్తుంది. అక్రమంగా ఉపయోగిస్తే బాధనిస్తుంది. శరీరంలో అనేక అవయవాలు. ప్రతి అవయవానికీ బాధా, ఆనందమూ, రెండూ వుంటాయి. కన్ను సుందరాన్ని చూచి ఆనందమిస్తుంది. కురూపాన్ని చూచి బాధనూ ఇస్తుంది. ఇదే విధంగా చెవి సునాదాన్ని విని ఆనందాన్ని కలుగజేస్తుంది. కునాదాన్ని విని బాధను కలుగజేస్తుంది. కనుక శరీరం బాధలకు మాత్రమే నివాసంకాదు. ఆనందాలకు కూడా నికేతనమే.

అయితే, సమాజ వ్యవస్థ సరిలేనందువల్లను, కుటుంబ విధానాలు సక్రమంగా లేనందున, వ్యక్తిగత ప్రేమలో భావసామ్యం కుదరనందునా, వీటన్నిటిపైనా తమ ప్రభావాన్ని ప్రసరించే రాజనైతిక, ఆర్థిక విధానాల లోపాలవల్ల అధిక సంఖ్యాకులకు తమ శరీరాలు ఆనందానికంటె బాధనే ఎక్కువ కలుగజేస్తున్నాయి. బాధకంటె ఆనందాన్నే ఎక్కువ కలుగ జేసేలాగా శరీరాన్ని తయారు చేసుకోవడం మానవ జీవితపు ప్రథమావసరం మాత్రమేకాక ప్రధానావసరం కూడా.

ఆ రోజు భోజనంలో నాకు నిమ్మకాయ ఊరగాయకూడా వడ్డించారు. ఎవరో విశాఖపట్నం ప్రాంతంనుంచి ఆ ఊరగాయ పంపారట. ఎన్నాళ్ళనుంచో సరైన కారంలేక చప్పబారివున్న ఆంధ్రుని నోరు ఆరోజు నిమ్మకాయ ఊరగాయతో తిరిగి పదునెక్కింది. వారెవరూ దాన్ని తినజాలక కన్నీళ్ళు కార్చారు. అక్కడ వున్న వారందరితో భోజనసమయంలో చెప్పాను ఉదయం ఆస్పత్రిలో రోగులతో గడిపివచ్చానని. రోగులతో కాలంగడిపితే నేనుకూడా రోగినవుతానేమోనని వారంతా నవ్వారు. రోగులతోనేకాక డాక్టరుతోకూడా గడిపాను కనుక రోగుల అనారోగ్యం నాకేమాత్రం అంటదని. ఆ విధంగా అంటితే ఆ తప్పు డాక్టరుదేకాని, నాదికాదు, రోగులదికాని కాదని జవాబు చెప్పాను. వారంతా డాక్టరువైపుకు చూచి ఆయన చెప్పేది నిజమని అంగీకరిస్తారా, అని ఆయనను అడిగారు. డాక్టరు అన్నాడు తాను చెప్పినట్లు నేను సంచరిస్తే ఆ బాధ్యత తనదే నన్నారు. తాను ఇచ్చే మొదటి సలహా ఏమిటంటే నేను రెండురోజులపాటు ఆహారం ఏమీ తినకుండా వుండాలట. అందుకు నేను అంగీకరించనని అన్నాను. నా అనారోగ్యానికి బాధ్యుడు తాను కాకపోయినా సరేకాని నేనుమాత్రం ఉపవాసాలు చేయలేనని అంతా పెద్దగా నవ్వారు. ఈ విధంగా భోజనసమయంలో గంభీరమైన స్వామీజీలు కూడా పసి పిల్లలవలె చిన్నవిషయాన్ని తీసుకొని విపరీతంగా నవ్వేవారు.

ఆ మధ్యాహ్నంనుంచి లైబ్రరీలో కూర్చుని పాత బెంగాలీ మాసపత్రికలు తిరగేస్తూ కాలం గడిపాను. ఎన్నిటిలోనో రవీంద్రుని కవితలు, శరత్ చంద్రుని కథానికలు, ప్రమథచౌదరి సాహిత్య వ్యాసాలు, అవనీంద్రుని చిత్రాలు వున్నాయి. పాశ్చాత్య తత్వశాస్త్రపు ఎడారులలో సంచరిస్తున్న నా మానసానికి ఇవన్నీ పుష్ప వాటికగా తట్టసాగాయి.

ఆ సాయంత్రం పవిత్రానందతో కలిసి చంపావత్ వైపుకు నడకకు వెళ్ళాను. ఈ మార్గం పశ్చిమ టిబెట్‌లోని మానస కైలాస ప్రాంతాలనుంచి ఇక్కడకు దాదాపు నలభై మైళ్ళ దూరంలోవున్న తనక్‌పూరు రైలుస్టేషన్ వరకు పోతుంది. ఇండో టిబెట్ సరిహద్దులలో వుంటున్న భోటియాలు అనే దేశద్రిమ్మరి వ్యాపారస్తులద్వారా ఈ మార్గంగుండా టిబెట్ సరకులను భారతదేశానికి, భారత దేశపు సరకులను టిబెట్‌కు ఎగుమతి, దిగుమతి చేస్తూంటారు. ఈ పని కంచర గాడిదల ద్వారాను, చమరీ మృగాల ద్వారాను సాగుతూంటుంది. అరణ్యాలతో నిండిన హిమాలయ మార్గమంతా కంచరగాడిదలు నడుస్తాయి. అరణ్యాలు అంతమై పూర్తిగా మంచుదారులు ప్రారంభమైన దగ్గరనుంచి చమరీ మృగాలు నడవవలసిందే కాని కంచరగాడిదలు నడవలేవు.

ఆ సాయంత్రం మేము నడచివెళ్ళి చంపావత్ మార్గంలో ఒక బండమీద మౌనంగా కూర్చున్నాం. ఇంతలో తనక్‌పూర్ రైల్వేస్టేషనుకు పోతున్న భోటియా వ్యాపారస్తులదళం ఒకటి వచ్చి మా కెదురుగావున్న కొంచెం మైదానంలాంటి భూమి మీద తమ కంచరగాడిదలనుంచి సామానుదించుకొని మకాం చేశారు. పవిత్రానందను అక్కడే కూర్చోమని చెప్పి నేను ఆ భోటియాల మకాం దగ్గరకు వెళ్ళాను. కంచర గాడిదలు గడ్డి మేస్తూ తిరుగుతూ సకిలిస్తున్నాయి. భోటియాలు తాము దింపిన సామాన్లకు ఆనుకొనికూర్చుని విశ్రాంతి తీసుకొంటున్నారు. నా కొత్త ముఖం చూచి ఇకిలించారు. కొంత భాగం టిబెటన్లలాగా, మరికొంత భాగం భారతీయుల లాగా వుంటారు వీళ్ళు ఆకృతిలో. ప్రత్యేకమైన భోటియా భాష మాట్లాడు కొంటారు. అపభ్రంశమైన హిందీ కూడా మాట్లాడుతారు. టిబెటన్లు మతరీత్యా బౌద్ధులు, భోటియాలు హిందువులు. వీరు నివసించే ప్రాంతాన్ని భోట్ అంటారు. వీళ్ళ పేర్లు రాజపుత్రుల పేర్లవలె కేసర్‌సింహ, కల్యాణసింహ, ఖడ్గసింహ అని వుంటాయి. చాలా కష్టజీవులు. అనేక విధాలైన హిమాలయ వాతావరణ వైపరీత్యాలకు అలవాటుపడ్డ శరీరాలతో, మృత్యుముఖంలో కూడా భయమెరుగని ధైర్య

సాహసాలతో జీవిస్తారు, ఈ ధీరోదాత్తులైన భోటియా వ్యాపారులు. వీళ్ళకు పరిశ్రమమే తరిక.

ఈ వ్యాపారానికి సర్దార్‌గా గోచరిస్తున్న ఒక భోటియా దగ్గరకు వెళ్ళి కూర్చున్నాను. నవ్వు ముఖంతో నన్ను పైకి క్రిందికి ఎగాదిగా చూచి ఆ హిమాలయాలకు చెందిన మనిషిని కానని గుర్తించాడు. టిబెట్టు నుంచా? అని నేను హిందీలో ప్రశ్నించాను. కాదు. భోట్‌నుంచి అని అస్పష్టమైన హిందీలో సమాధాన మిచ్చాడు. నన్ను ఎక్కడివాడినని ప్రశ్నించాడు. దక్షిణ ప్రాంతమని చెప్పాను. మదరాసా అని మళ్ళీ అడిగాడు. మదరాసు పేరు వీళ్ళకు కూడా తెలుసు. వీళ్ళ దృష్టిలో దక్షిణం అంటే మదరాసు అనే అర్థం. ఆంధ్రులు అని చెబితే అర్థంకాదని మదరాసు అనే చెప్పాను.

మా ఉభయులకు సంభాషణ సాగుతోంది. తాను పొగపీలుస్తూ "గుడగుడ" నాకు అందించాడు. నాకు అభ్యాసం లేకపోయినా కూడా మర్యాదనిమిత్తం దాన్ని తీసుకొని రెండు దమ్ములు లాగేసరికి దగ్గు వచ్చింది. దాన్ని మళ్ళీ అతనికి అందించాను. దగ్గూ, కళ్ళవెంట నీళ్ళు చూచి అతడు గ్రహించాడు, నాకు అలవాటు లేదని. వీళ్ళంతా టిబెటన్ తేనీరు త్రాగుతారు. దాన్ని తయారు చేస్తున్నారు, అతిథినైన నాకు కూడా ఇచ్చేందుకు. ఇది విచిత్రమైన తేనీరు. ఇందులో పాలకు బదులు వెన్నను పంచదారకు బదులు ఉప్పును కలుపుతారు. చిక్కటి ఆకుపచ్చని డికాషన్ పొడవైన కొయ్యపాత్రలో పోసి అందులో వెన్న, ఉప్పు వేసి, కవ్వం లాంటి దానితో చిలుకుతారు. అది తయారైన తరువాత ఒక పాత్రతో నాకుకూడా అందించాడు. అయిష్టమైన వాసనగల ఆ టిబెటన్ తేనీటిని ఇష్టాన్ని సృష్టించుకొని త్రాగివేశాను.

# ఉత్తర పరిహద్దులు: ప్రజలు, పరిస్థితులు

ఉత్తరంగా వెళ్ళే మార్గంగుండా పోతూన్న పాంధులను చూస్తూంటే నేనుకూడా ఉత్తరంగా కొన్ని మైళ్ళు ప్రయాణం చేసి రావాలనే ఆకాంక్ష అదమ్యమై పోయింది. ఈ ఋతువులు మానస సరోవరానికి, కైలాసానికి పయనించడానికి పనికిరావు. కనీసం వాటి మార్గంలోవున్న అస్కోటవరకైనా ప్రస్తుతానికి పోవాలని నిర్ణయించుకొన్నాను. మాయావతినుంచి అస్కోట దాదాపు యాభై మైళ్ళుంటుంది.

అస్కోట ప్రయాణానికి గుర్రమూ, మనిషీ సంసిద్ధమయాయి. ఉదయం బయలుదేరాము. గుర్రాన్ని ఎక్కబోయేముందు అది నావైపు పరిశీలించి చూచి సకిలించింది. గుర్రపు మనిషి లాల్‌చంద్ అన్నాడు, ఆ గుర్రం నేనంటే ఇష్టాన్ని చూపిందని, మాయావతినుంచి లోహాఘాట్ మూడు మైళ్ళు కొంత సమతలమూ, మరికొంత ఎక్కుడు దిగుడు దారి. మార్గం పెలయేళ్ళతోను, దేవదారు వృక్షాల తోను మనోహరంగానేవుంది. లోహావతి నది ప్రవహిస్తుంది. కనుక ఆ ఊరికి లోహాఘాట్ అనే పేరు వచ్చింది. పూర్వం ఇది మిలిటరీ కంటోన్‌మెంటు. సామాన్లు అమ్మే బజారు, పబ్‌పోస్టాఫీసు మొదలైనవన్నీ వుండి ఈ ప్రాంతంలో యిదొక చిన్న బస్తీగావుంది. లోహాఘాట్‌లో మేము ఆగకుండా పయనం సాగించాము. నేను గుర్రంమీద ముందు వెడుతుంటే లాల్‌చంద్ సామాను తీసుకొని వెనక వస్తున్నాడు.

లోహాఘాట్ నుంచి మోరాఖాన్ మీదుగా పయనం సాగించాం. పర్వత మార్గంలో ఎప్పుడూకూడా ఆరోహణావరోహణలు వుంటూనే వుంటాయి. మధ్య మధ్య తేయాకుతోటలు కూడా తగులుతున్నాయి. మోరాఖాన్‌నుంచి మూడు మైళ దూరంవరకూ లోతైన దిగుడు దిగాలి. మూడుమైళ్ళు దిగిన తరువాత చాగ్రి అనే చిన్న నదీ. దానిమీద కొయ్యవంతెనా వున్నాయి. ఆ వంతెన దాటిన తరువాత దట్టమైన ఒక చెట్లవనంలోగుండా, వల్లిపీడలమధ్యగా సుందరమైన మార్గం. మరి మూడుమైళ్ళ దూరంవరకు సమతలంగా వుంటుంది. తరువాత చీరా అనే గ్రామం తగిలింది. మాయావతిలో ఉదయం బయలుదేరి యిప్పటికి పన్నెండు మైళ్ళు వచ్చాము. పన్నెండుమైళ్ళు మామూలు మైదాన ప్రదేశంలో అయితే గుర్రంమీద

ఒక గంటలో వెళ్ళవచ్చు. కాని పర్వతమార్గంలో గుర్రాన్ని ఎంత వేగంగా నడప ప్రయత్నించినాసరే పన్నెండు మైళ్ళు అయిదారు గంటలుపట్టింది. చీరా గ్రామం చేరుకునేవరకు మధ్యాహ్నం పన్నెండు అయింది. దగ్గరవున్న డాక్ బంగళాలో దిగి మాయావతినుంచి వెంట తెచ్చుకొన్న రొట్టెలు, పళ్ళు, వగైరాలు నేను లాల్‌చందూ తిని, గుర్రాన్ని పచ్చికలో వదలి కొంచెం విశ్రాంతి తీసుకొన్నాం. ఇక్కడికి దగ్గరలో క్రిందిభాగంలో సరయూనది సన్నని రూపంలో ప్రవహిస్తుంది. ఇదే సరయూనది. పర్వత ప్రాంతాలనుదాటి మైదానాలలోకి దిగి అయోధ్యమీదుగా ప్రవహిస్తుంది, ఇంతకంటె ఎక్కువ విశాలరూపంలో.

మధ్యాహ్నం రెండుగంటలకు మళ్ళీ పయనం సాగించాం. ఇక్కడనుంచి రాత్రికి కోరనా అనే గ్రామం చేరుకోవాలి, పదిమైళ్ళు ప్రయాణంచేసి. ఇక్కడ సరయూనది దృశ్యం యెంతో మనోహరంగా వుంటుంది. పాంగ్రీనది వచ్చి సరయూతో సంగమిస్తుంది. ఇక్కడ తిరిగి సరయూ కొంతదూరంలోవున్న కాళీ నదిలో కలుస్తుంది. ఇక్కడనుంచి యీ ప్రవాహాన్ని శారదానది అంటారు. నదీ ప్రవాహాలు విచిత్రమైనట్టివి. ఎక్కడో నిర్జన పర్వతాలలో జన్మించి క్రమేణా జనాంతాలలో ప్రవహించి మనుషులకు, పశువులకు, పక్షులకు, వృక్షాలకు దాహాన్ని తీర్చడమే కాకుండా ఆహారాన్నికూడా అందిస్తాయి. నిజంగా జలం అంటే ప్రాణ ద్రవం అన్నమాటే !

చీకటి పడకముందే గోరనా డాక్‌బంగళా చేరుకొన్నాం. లాల్‌చంద్ ఆ రాత్రి చపాతీలుచేసి అందులోకి బంగాళదుంపలకూర చేశాడు. హిమాలయాలలో ప్రతిచోటా బంగాళాదుంపల పంట జాస్తి. హిమాలయపు బంగాళాదుంపలు లావుగాను, తింటూంటే పొడి పొడిగా చాలా రుచిగా వుంటాయి. ఆ రాత్రి అవి తిని శయనించాం. విపరీతంగా చలివేయసాగింది. బంగళా కావలాదారు, కొన్ని మొద్దులు తెచ్చి మేము పడుకొన్నచోటికి దగ్గరలో నిప్పు అంటించాడు. అవి బాగా మండసాగాయి. కొంతసేపు ఆ మండే జ్వాలలను, తాండవించే వాటి శిఖలనూ చూస్తూ పడుకున్నాను. సృష్టిలో నీరు ఎంత ఉపయోగమో నిప్పు అంత ఉపయోగం. నీరూ నిప్పు యీ రెండూ కలసి యెంత పనైనా చేయగలవు. నీరూ నిప్పూ కలిసేగదా రైలుబళ్ళను పరుగెత్తిస్తుంది. మనిషికి వేడెక్కినప్పుడు చల్లని నీరు మనిషిలోని వేడిని తీసేసి చల్లబరచి హాయినిస్తుంది. మనిషికి చలి వేసినప్పుడు నిప్పు మనిషిలోని చలిని పరిమార్చి వేడిని కలిగించి హాయినిస్తుంది. నీరు

ఆహారాన్ని పండిస్తే, నిప్పు ఆహారాన్ని వండిస్తుంది. నీరు నిప్పు కూడా మానవునికి మేలుచేసిన విధంగానే కీడూ చేయగలవు. ఈ రెండూకూడా ప్రాణాన్ని రక్షించినట్టే ప్రాణాన్ని భక్షించగలవు. నీరూ నిప్పు నిర్మాణాత్మకాలు; విధ్వంసాత్మకాలు కూడా! ఈ విధమైన ఆలోచనలతో ఆ ఎముకలను కరగించే చలిలో ఆ మంటల వెచ్చదనంలో ఎప్పుడో నిద్రపట్టింది.

తెల్లవారేవరకు నిద్ర మెలకువరాలేదు. లేచి చూస్తే లాల్‌చంద్ లేచి ఆ నిప్పులమీద తేనీరు కాస్తున్నాడు, పాలు లేకుండానే. మంటలు ఆరిపోయి నిప్పులు మాత్రమే మిగిలినందువల్ల ఉదయాన మళ్ళీ చలి ప్రారంభించింది. ధైర్యంతో చలిని నిరసించి కప్పుకొన్న రగ్గులను లాగిపారేసి నిర్భయంగా చలిని లెక్కచేయకుండా బయటికి వచ్చాము. ఈ సాహసచర్య మూలంగా కొంత చలి తగ్గిపోయింది. చలిలో వున్న ప్రత్యేకత యేమంటే వణికేవాళ్ళను చలి మరి కొంచెం వణికిస్తుంది; ఎదిరించేవాళ్ళని అంతగా ఏమీ చేయజాలదు!

## పాలులేని తేనీరు

లాల్‌చంద్ కాచిన పాలులేని తేనీటిని త్రాగి సూర్యోదయానంతరం మళ్ళీ పయనం ప్రారంభించాం. చాలా చలిగానే వుంది. శిఖరాలు కనపడకుండా పొగమంచు కమ్మివుంది. లోయలు గోచరించకుండా కూడా పొగమంచు ఉదయ సూర్య రశ్మికి ధూమ్రవర్ణాన్ని దాల్చిన తెరలను దించివేసింది. చెట్లు సగం కనుపించీ కనుపించని మేలి ముసుగులను ధరించాయి. అటువంటి మనోహర వాతావరణంగుండా మేము పయనిస్తున్నాం.

సూర్యుడు పైకివచ్చినకొద్దీ పొగమంచు పలచబడసాగింది. ప్రకృతిలోని రూపాలు అస్పష్టతనుంచి స్పష్టతలోకి రూపాంతరం చెందసాగాయి. నెమ్మదిగా గుర్రాన్ని నడుపుకొంటూ దగ్గరలోని పెలమేళ్ళ అందాన్ని, దూరానవున్న పర్వత శిఖరాల ఆనందాన్ని అనుభవిస్తు సాగిపోతున్నాం. చెట్టు గుట్టలుదాటి యీ శీతల వాతావరణంలో ఎండ ముదిరినకొద్దీ ఆనందం అధికమవుతూంది. చెట్ల నీడ తగిలినప్పుడల్లా చలి, నీడదాటి ఎండ తగిలినప్పుడల్లా హాయి అయిన వెచ్చదనం. మనిషికి వేడి యిష్టమా, చల్లదనం యిష్టమా అనే ప్రశ్న వేస్తే యేదీ యిష్టంకాదు అధికపరిమాణంలో. రెండూ యిష్టమే తగిన పరిమాణంలో. మనిషికి చల్లదనం యిష్టమేకాని అమితమైన చలి యిష్టంలేదు. వెచ్చదనం యిష్టమేకాని అమితమైన

వేడి యిష్టంలేదు. ఈ రెండూ కూడా పరస్పరంగా వ్యతిరేకమైన పరిస్థితులలోను ఆధారపడి వుంటాయి. చలివేస్తున్న వాతావరణంలో ఎవరూ చల్లదనాన్ని కోరరు. అదే విధంగా వేడి వాతావరణంలో ఎవరూ వెచ్చదనాన్ని కోరరు.

## "వీరుల కోట"

గోరవానుంచి పదుమైళ్ళు ప్రయాణించి పదిగంటల ప్రాంతంలో పిథోరాగఢ్ చేరుకొన్నాం. పిథోరాగఢ్ ఒకమాదిరి చిన్న బస్తీలో లెక్క. ఇక్కడ విదేశీ క్రైస్తవ మిషనరీలుకూడా నివాసం యేర్పరచుకొన్నారు. పిథోరాగఢ్ యిటువేపు కొంచెం ప్రాముఖ్యంగల స్థానం. పూర్వం రాజా రామచంద్ర సైన్యం, రాజాగోరి మానచంద్ సైన్యాలు యిక్కడ హోరాహోరీగా పోరాడి రక్తనదులు ప్రవహింప చేసి వాళ్ళ ఎముకల పోగులు గుట్టలు గుట్టలుగా యిక్కడ వదలివారట. అందుకే యీ స్థానం పేరు పిథోరాగఢ్ అంటే "వీరుల కోట" అయింది.

పిథోరాగఢ్లో ఆగి లాల్చంద్ చేసిన వులగం (ఖిచడీ) తిని కొంచెంసేపు విశ్రమించి మధ్యాహ్నం రెండుగంటల ప్రాంతంలో బయలుదేరాం. దారిలో గుర్రం కొంచెం అవస్థ పెట్టసాగింది. దానికి యెప్పుడైనా కాలుగిట్ట నొప్పి చేస్తుందట. దాని నొప్పిని గుర్తించి గుర్రం దిగి దానికి కొంచెం విశ్రాంతి యిస్తే దాని నొప్పి మాసిపోతుందట. నేను అదే మాదిరి చేసి తరువాత మళ్ళీ దాన్ని యెక్కి ప్రయాణం సాగించాను. ఇక బాగానే నడవసాగింది. సైకిల్మీద ప్రయాణం చేసే వాళ్ళు దారి సరిలేకపోయినా, దారిలో నీటిమడుగులు అడ్డమొచ్చినా, తాము సైకిల్ నుంచి దిగి సైకిల్ను తాము యెత్తుకొని తీసుకుపోతారు. అంటే అంతవరకు తమను సైకిల్ మోస్తే తామిప్పుడు సైకిల్ను మోస్తారన్నమాట! మరి గుర్రం విషయంలో అది జరిగే అవకాశంలేదు. అది మనిషిని మోయాలసిందే కాని మనిషి దానిని మోయడు. అది నడవలేనప్పుడు దాన్ని దిగి జాలితోనో, కోపంతోనో దానివైపు చూస్తూ వూరుకోవలసిందేకాని, సైకిల్ వాహకుడు చేసిన విధంగా చేయడం కుదరదు:

చీకటి పడేవరకు పదిమైళ్ళు పూర్తిచేసి షత్గర్ అనే గ్రామం చేరుకొన్నాం. ఆ రాత్రి అక్కడ అప్పుగా బంగాళాదుంపలను కాల్చి తిని పాలులేని తేనీరు త్రాగి నిద్రించాం. దగ్గరలో మొద్దుల మంటచేసి, లాల్చంద్ తన స్వంత గాథ యేదో చెప్పసాగాడు ప్రొద్దుపోయేవరకూ. లాల్చంద్కు ఒక పాతిక సంవ

త్సరాల వయసుంటుంది. ఇంకా అవివాహితుడు. ఈ హిమాలయ ప్రాంతంలో లేత వయస్సులోనే వివాహాలు జరుగుతాయి, కాని యెందుకనో లాల్‌చంద్ పాతిక సంవత్సరాలవరకు వివాహం చేసుకోలేదు. కారణం అడిగితే నవ్వుతాడేకాని జవాబు చెప్పడు. సాధువులలో కలసిపోవాలని వున్నదా అంటే లేదని జవాబు చెప్పేడు. తన తండ్రికి యిద్దరు భార్యలట. ఇద్దరూ యిప్పటికీ ఒక యింటిలోనే వున్నారట. తాను పెద్దభార్య కొడుకట. తన సవతి తల్లికి పిల్లలు లేరట. కొద్దిగా పొలం వుందట. కాని ఆ పొలంమీద వచ్చే ఆదాయంతో భుక్తి గడవక యీ గుర్రాన్ని త్రిప్పుతున్నాడట. తన స్వంత తల్లీ సవతి తల్లీ యెంతో అనుకూలంగా వుంటారట. సవతి తల్లికి పిల్లలు లేనందున తనను చూచి అసూయపడక తననే తన స్వంత పిల్లలుగా చూచుకొంటుందట. తండ్రి ఏమీ పనిచేయక సోమరిగా తిరుగుతూ జూదాలు ఆడతాడట.

నేను అన్నాను "మీ తండ్రి రెండుసార్లుగా యిద్దరు భార్యలను చేసుకొంటే నీవు ఒకేసారి యిద్దరు భార్యలను చేసుకొనే నిమిత్తమై అటువంటి అవకాశం నిమిత్తం యెదురుచూస్తూ యిప్పటివరకూ వివాహం చేసుకోకుండా వున్నావనుకొంటాను". దీని అర్థం అతనికి సరిగా బోధపడినట్లు తోచలేదు. అయినా పెద్దగా నవ్వసాగాడు,

ఉదయానే లేచి పెందలాడే చలిని లెక్కచేయకుండా పోసాగేము. ఇక్కడకు అస్కోట పదిహేను మైళ్ళుంది. సాయంత్రానికి పెందలకడే అస్కోట చేరాలి. మధ్యలో తొమ్మిదిమైళ్ళలో సింగలిఖాన్ అనే మజిలీ తగులుతుంది. గుర్రాన్ని సాధ్యమైనంత త్వరగా నడిపింప ప్రయత్నించాను. చేతిలో బెత్తం వుంది కాని మాయావతిలో గుర్రం యెక్కింది మొదలు యీ ముప్పైఅయిదు మైళ్ళ మార్గంలో బెత్తంతో గుర్రాన్ని యెన్నడూ కొట్టి యెరుగను. కాని పెందలకడ అస్కోట చేరుకోవాలనే ఆరాటంతో నేను దాన్ని అప్పుడప్పుడు బెత్తంతో చిన్నగా కొట్టసాగాను. మనసులో బాధపడుతూనే దెబ్బవేసేవాణ్ని. కాని అది అంత మంచి పద్ధతి కాదేమో. మనసులో జాలివుంటే కొట్టకుండా వుండాలి. కొడుతున్నపుడు జాలిపడకూడదేమో ఈ ధర్మచింతనకు అవకాశంలేదు; త్వరగా అస్కోట చేరుకోవాలన్న ఆరాటమే;

# హిమాలయాలలో దిగంబరుల జీవితం; అంతర్జగత్తు అందించే అమందానందం

చీనాలో హూంగ్‌హో మూలందగ్గర ప్రారంభమై ఆసియా మైనర్, బాస్ఫరస్ ప్రాంతంలో ముగిసిన అయిదువేలమైళ్ళ పొడవైన ఆసియా పర్వత మాలలోని ఒక చిన్నభాగం మాత్రమే హిమాలయాలు. పశ్చిమోత్తరదిశలో సింధు నది నుంచి తూర్పున బ్రహ్మపుత్రానది వరకు హిమాలయాల పొడవు వాయుయాన మార్గానుసారం పద్నాలుగువందల మైళ్ళు. మధ్య ఆసియా పీఠభూముల దక్షిణ భాగం బలీయంగా బద్దలవడం ద్వారా హిమాలయాలు ఉద్భవించినాయని భూగర్భ శాస్త్రజ్ఞుల అంచనా. వీరి అంచనాల ప్రకారం హిమాలయాలు ఏడుకోట్ల సంవత్స రాలనాడు టెర్షియరీ కాలమనబడే కర్బనయుగంలో జన్మించినటు. ఇప్పుడు హిమా లయాలున్నచోట ఆ కాలంలో టెథిస్ మహాసాగరం వుండేదట।

తూర్పునుంచి సిక్కిం, భూటాన్, నేపాల్, కుమావూ, గఢ్‌వాల్ కాంగడా, కులూ, కాశ్మీర్ ప్రాంతాలు యీ హిమాలయ భూములే. వీటిలో కుమావూ హిమా లయాలు ఉత్తర ప్రదేశ ప్రభుత్వ పరిపాలనలోనివి. నేను చేరుకొన్న అస్కోట దక్షిణంలోని మైదానాలకూ, ఉత్తరంలోని టిబెట్‌కూ దాదాపు మధ్యలో వుంటుంది. అస్కోటలో ఒక రాజకుటుంబం పూర్వంనుంచి వుంటున్నది. వీరిని రాజబార్ అని అంటారు. వీరు హిందువులు. వీరి కులదైవం శ్రీశైల మల్లికార్జునుడట. ఆంధ్రదేశంలోని శ్రీశైల మల్లికార్జునునకూ, సుదూరంలోని ఈ హిమాలయ క్షత్రియులకూ యీ సంబంధం యే విధంగా యేర్పడిందో తెలియడంలేదు. ఇది చరిత్రకారుల పరిశోధనకు ఉపయుక్తమైన విషయం.

అస్కోట ప్రాంతపు పర్వతాలన్నీ అరణ్యమయం. ఓక్ వృక్షాలూ, దేవ దారులూ యింకా యితర వనస్పతితో నిండిన బ్రహ్మాండమైన అరణ్యంవుంది యిక్కడ. పులులకు పుట్టిల్లు యీ ప్రాంతం. ఇవి పశువులను మాత్రమే కాక వీలు చిక్కినప్పుడల్లా మనుషులనుకూడా తింటూంటాయి. ఇక్కడ అందుకనే యెవరూ రాత్రులు యింటినుంచి బయటికి రారు.

అస్కోట అరణ్యంలోని గొప్ప విశేషం యేమంటే యీ అరణ్యాలలో నగ్న శరీరాలతోవున్న అడవి మనుషులు నివసిస్తారు. వీళ్ళను రాజీలు అంటారు

యిక్కడ. సంస్కృతి సభ్యతలు వికసించి విస్తరించిన యీ యిరవయ్యో శతాబ్దంలోకూడా సభ్య సమాజంతో సంబంధములేని నగ్న శరీరాల అడవి మనుషులు వుండడం వింతగానేవుంది! వీళ్ళు యిప్పటికీ ఆకులూ, పళ్ళూ, కందమూలాలూ, జంతువులూ మొదలైనవాటిని తిని జీవిస్తారు. వీళ్ళలో ఒక శిల్పం సాంప్రదాయకంగా వస్తోంది. అది కొయ్యపాత్రలను కూజాల రూపంలో అందంగా తయారు చేయడం. విశేషమేమంటే వాళ్ళ మొరటైన పనిముట్లతో యింత అందమైన కొయ్య కూజాలను యెలా చేయగలుగుతారో అని ఆశ్చర్యం వేస్తుంది ఆ పాత్రలను చూస్తే!

ఇటువంటి నాజూకైన పాత్రలను చేసే శిల్పులు ఇటువంటి అనాగరికమైన జీవితాలను యెలా గడుపుతున్నారో, ఎందుకు గడుపుతున్నారో తెలియదు. వీళ్ళు సాధారణంగా అరణ్య వాసాలనుంచి బయటికివచ్చి ప్రజలకు కనపించరు. చాలా సిగ్గుగలవారు. ఆకృతులు టిబెటన్ ఆకృతులలాగే వుంటాయి. మీసం గడ్డం వత్తుగా పెరగవు. మంగోలియన్ వైపువారే వీళ్ళది. వీళ్ళు ప్రజలకు పెద్దగా యేమీ హాని చేసినట్లు లేకపోయినా కూడా వీళ్ళంటే ప్రజలకు భీతి. వీళ్ళ నమ్మకం ప్రకారం యిక్కడున్న రాజకుటుంబపు కోటా, ప్రభుత్వం ఒకప్పుడు తమదే అని. అందుకని యీ రాజకుటుంబంమీద యెంతో భక్తి శ్రద్ధలు కలిగివుంటారు వీళ్ళు.

వీళ్ళకు సంబంధించిన మరో వింత యేమంటే తాము తయారుచేసిన ఆ కొయ్య పాత్రలను తెల్లవారుతుండే సమయాన గ్రామాలలోకి తెచ్చి ఒకో యింటి వాకిలిముందు ఒకో పాత్రను వుంచుతారు. ఉంచి యీ అడవి మనుషులు గోడ చాటున దాగివుంటారు. ఇంటివారు లేచి ఆ కొయ్యపాత్రలో ధాన్యంపోసి లోనికి వెళతారు. అంతటితో యీ అడవి మనుషులు ఆ పాత్రలలోని ధాన్యాన్ని తమ సంచులలో పోసుకొని పాత్రలను అక్కడే వదలి వెళ్ళిపోతారు. అంటే ధాన్యం తీసుకొని పాత్రలను అమ్మినట్లు. అంతే ఇది నిత్యమూ జరగదు, ఎప్పుడైనా జరుగుతుంది. ఈ అడవి మనుషులను సభ్య మానవులుగా చేయాలని యిక్కడి క్రైస్తవ మిషనరీలూ ప్రభుత్వంవారుకూడా విరివిగా ప్రయత్నిస్తున్నారు. పాఠశాలలుపెట్టి వీళ్ళను అక్షరాస్యులుగా చేయాలని, వీళ్ళచేత బట్టలు కట్టించి వీళ్ళ నగ్నత్వాన్ని రూపుమాపాలని, వీళ్ళచేత సేద్యం చేయించాలని అనేక ప్రయత్నాలు. వీటిని చేసేవరకు వాళ్ళలో అనువంశికంగా వస్తూన్న యీ దారు పాత్రా శిల్పం

వస్తుందేమో. అనాగరికులుగా వుంటూ నాగరిక శిల్ప కార్యాలను చేస్తున్నవాళ్ళు నాగరికులుగా మారేసరికి ఆ శిల్పం రూపుమాసిపోదుగదా !

ఆస్కోటలో వారం రోజులపాటు రాజకుటుంబంవారి అతిథి గృహంలో వారి అతిథిగానే వున్నను. అడవి మనుషులను చూచే అవకాశం కూడా వారే యేర్పాటుచేశారు. చుట్టూవున్న కొండలను, లోయలనూ అరణ్యాలను చూపించారు. నేను యెక్కివచ్చిన గుర్రమూ, గుర్రపు యజమాని లాల్‌చందూ నేను అస్కోట చేరినరోజే మరో బాడుగ దొరకగా వెళ్ళిపోయినారు. తమ కులదైవం అయిన శ్రీశైలమల్లికార్జునుని దేశమైన ఆంధ్రదేశంనుంచి వచ్చానని నన్ను యిక్కడి అస్కోట రాజకుటుంబంవారు ప్రత్యేక ప్రేమతో ఆదరించారు.

ఒక ఉదయం అస్కోట రాజకుటుంబంవారినుంచి సెలవు తీసుకొని గుర్రం మీద బయలుదేరి మళ్ళీ వచ్చిన దారినే కొండలలోగుండా, లోయలలోగుండా, చెట్లలోగుండా, పొదలలోగుండా, సెలయేళ్ళ సంగీతాలను వింటూ నీలాకాశంలో యెగిరే గ్రద్దలనూ, తేలిపోయే తెల్లని దూది మబ్బులను చూస్తూ అస్కోట మకాంలోని విశేషాలను గుర్తుతెచ్చుకుంటూ రెండురోజులపాటు పయనించి మూడోరోజు ఉదయానికి మాయావతికి తిరిగివచ్చాను. గుర్రంమీద యెగుడు దిగుడు దారుల గుండా ప్రయాణంచేసి వచ్చినందువల్ల శరీరం కొంచెం బడలికగావుంది. ఏమీ తిన లేక కొంచెం తేనీరు త్రాగి మంచం యెక్కాను. పగలే మంచి నిద్రపట్టింది. నిద్ర లేచేసరికి మధ్యాహ్నం దాటింది. లేచి చూస్తే ఆశ్రమంలో కొంచెం సందడిగా వుంది. ఎవరో అమెరికన్ అతిథులు వచ్చారని తెలిసింది. నేను లేచి స్నానంచేసి యేమీ లేకుండా వొట్టి బంగాళా దుంపలకూర తిని తేనీరు త్రాగి పవిత్రానంద గదికి వెళితే అక్కడ యెవరూలేరు. అక్కడనుంచి దిగి రెండవ యింటిలోని హాలులోకి వెళ్ళాను. ఇద్దరు అమెరికన్ పురుషులు నడివయసువారు హాలులో ఆసీనులై వున్నారు. వారిదగ్గర పవిత్రానంద. ఆశ్రమం ప్రెసిడెంటు అయిన వీరేశ్వరానంద కూర్చొని వున్నారు. నన్ను అమెరికన్లకు, వారిని నాకు పరిచయం చేశారు. పిల పర్చియ వివాహులట. ఒకరు మనోవైజ్ఞానికుడు, రెండవవారు గ్రంథకర్త. అమెరికాలోని రామకృష్ణమిషన్ కేంద్రాలతో వీరికి సంబంధమున్నదట. భారతదేశ పర్యటనకు వచ్చి మాయావతి చూడాలని వచ్చారు.

అంసరంకలిపి ఆ సాయంత్రం ఆశ్రమానికి చెందిన తోటలు, దొడ్లు, పశుశాలలు, ఆస్పత్రి అన్నీ చూడబోయాము. ఆ అమెరికను లిద్దరు యిక్కడి ఏర్పా

ట్లన్నిటిని చూచి యెంతగానో సంతృప్తి, సంతోషం పొందారు. ప్రపంచంలోని సాంస్కృతిక కేంద్రాలలో యిది ఒకటని ప్రశంసించారు. తమ స్వదేశం వదలి యిక్కడికువచ్చి యీ మాయావతిలో స్థిరనివాసం యేర్పరచుకోవాలని వున్నదన్నారు. వెనక ఒక అమెరికన్ యువ రచయిత ఫ్రాంక్ అలెగ్జాండర్ అనే ఆయన యీ ఆశ్రమంలో చాలాకాలం వున్నాడట. ఆయనే "In the Hours of Meditation" అనే అంతర్ దృష్టిగల పుస్తకాన్ని రచించింది. "ప్రబుద్ధ భారత" లో "మాంక్ తేజనారాయణ" అనే కల్పితనామంతో చాలా వ్యాసాలు వ్రాశాడట. 1911 లో ఆయన యిక్కడ వుంటూ యీ ఆశ్రమం ప్రచురించిన వివేకానంద జీవితాన్ని రచించడంలో యెంతగానో సహాయపడినాడట. తరువాత అమెరికాకు తిరిగి వెళ్ళి అక్కడే లేతవయసులోనే శరీరాన్ని వదలాడట. ఈ అలెగ్జాండర్ను గురించి తాము విని వున్నామన్నారు ఈ అమెరికనులు.

## విశ్వజనీనత

ఒకటి రెండు రోజులు యీ అమెరికన్లతోనే గడచింది. భారతదేశంలోని ఉత్తర భాగానికీ, దక్షిణ భాగానికీ వున్న భేదం వారికి తెలియదు. ఒక రోజున ప్రసంగవశాత్తు యీ విషయం వచ్చినప్పుడు ఈ రెండు భాగాలకూ, ఈ రెంటిలోని ప్రజలకూ, భాషలకూ వున్న భేదాలను వారికి తెలియజెప్పి ఈ ఆశ్రమంలోవున్న వారంతా ఉత్తరభాగానికి సంబంధించినవారే, నేనుమాత్రమే దక్షిణ భాగానికి సంబంధించినవాణ్ణి అని గర్వంగా చెప్పాను. అక్కడ కూర్చొనివున్న పవిత్రానంద నేను చెప్పినదాన్ని వ్యతిరేకిస్తూ, తాము బెంగాలీలం. ఉత్తరభాగానికి కాక తూర్పు భాగానికి చెందిన వారం కనుక తమను ఔత్తరాహులలో చేర్చరాదన్నాడు. అందుకు నేను అన్నాను- బెంగాల్ తూర్పు భాగమైనప్పటికీ ఉత్తర భారతదేశంలోని తూర్పు భాగమే కనుక బెంగాలీలు ఔత్తరాహులేనని, ఆ వరుసకొస్తే మేముకూడా దక్షిణ భారతదేశంలోని తూర్పుభాగంలోనివారమే అని అన్నాను. అందరం నవ్వుకొన్నాం. ఏ భాగానికి చెందితే ఏమి మనమంతా భారతీయులంమేకదా అని, తిరిగి అమెరికన్లవైపు చూచి మనమంతా యీ భూగోళవాసులంమేగదా అన్నాను. "ఆ విశ్వ జనీన దృష్టినే పోషించుకోవాలి నీవు ఈ చిన్న వయసునుంచే; విభజించి చూడటం కాక కలిపి చూడడం నేర్చుకోవాలి యిప్పటినుంచే" అన్నారు అమెరికన్లు.

అమెరికనులు తనక్‌పూర్ స్టేషన్‌కు గుర్రాలమీద బయలుదేరి వెళ్ళిపోయారు. రెండురోజులపాటు వారితో సందడిగా గడచిపోయింది. వారితో అలవాటయిన కాలాన్ని మళ్ళీ వారులేని పద్ధతితో సాగించాలి. ఏకాంతసేవ యెంతగా అభ్యాసమైనప్పటికీ జనాంతసేవలో మొదటిది దాని ఆకర్షణను కొంత పోగొట్టుకొంటుంది.

ఆస్కోట ప్రయాణం మొదలు అమెరికన్లు వెళ్ళిపోయేంతవరకు నేను పుస్తకం ముట్టలేదు. ఇమాన్యుయల్ కాంట్‌నుగురించి. ఆయనగారి శుద్ధహేతువును గురించి నిశితంగా నేను చేస్తూన్న అధ్యయనం ఆగిపోయింది. చాలా యెండు విషయం. ఆగిపోయినదాన్ని మళ్ళీ సాగించాలంటే యేదో బరువుగా వుంటుంది. ఎంతో సాహసం తెచ్చుకొని మళ్ళీ దానిలో చొప్పించాను మస్తిష్కాన్ని. ఈజర్మన్ తాత్వికునికి ఫ్రెంచి తాత్వికుడైన బెర్గుసన్‌కు యెంతో తారతమ్యత. Pure Reason అని కాంట్ అంటూంటే Intuition అని బెర్గసన్ అంటాడు. శుద్ధమైన బుద్ధి ప్రధానమంటాడు కాంట్. విశుద్ధమైన బోధి intuition ప్రధానమంటాడు బెర్గసన్. ఈ యింట్యూషన్‌నే భారతీయ వేదాంతంలో అపరోక్షానుభూతి అంటారు.

ఈ శాస్త్రీయ అధ్యయనంతో తలనొప్పి వచ్చినప్పుడల్లా బెంగాలీ మాసపత్రికలలోని చిత్రాలను చూడడం, కథానికలను, నాటికలను, కవితలను చదవడం అనే చికిత్సద్వారా ఆ తలనొప్పిని పోగొట్టేవాణ్ణి. ఇవికాక వర్డ్స్‌వర్త్ రచించిన నిసర్గ కవితలను చదువుతుంటే యెంతో ఆనందం కలిగేది.

**"Whose dwelling is the setting suns,**
**And the round ocean and the living air,**
**And the blue sky, and in the mind of man,**
**A motion and a spirit, that impels**
**All thinking things all objects of all thought,**
**And rolls through all things."**

ఇది ఎంతో సంతోషాన్నిచ్చేది. ఇటువంటివన్నీకూడా సంతోషాన్నివ్వకుండా సమ్మెచేస్తే పుస్తకాలను వదిలివేసి క్రిందిలోయదగ్గరలోవున్నపిట్టగోడమీదకూర్చుని విశాల నీలాకాశంలో దూరాన తెల్లగా ప్రకాశిస్తున్న హిమశిఖరాలను వీక్షించేవాడిని. ఈ బయటి ప్రపంచం అంతా కూడా ఆనందం యివ్వజాలని సమయంలో నా అంతర్జగత్తులోకి చూచుకొని ఆనందించేవాణ్ణి. అంతర్జగత్తు నన్నెప్పుడూ మోసగించలేదు. ఆనందం యివ్వకుండా!

# ప్రసిద్ధ చిత్రకారుడు హాల్దార్‌తో పరిచయం

ఇక్కడ చదవటం తప్ప వ్రాయటం యేమీ ప్రారంభించలేదు. ఎప్పుడైనా వ్రాస్తే చిన్న కవితనో లేక బాల్యమిత్రులకు ఉత్తరాలో, అంతకుమించి కలంతో అంతగా పని వుండేదికాదు. క్రొత్త విషయాన్ని గురించి చదివినప్పుడు దాన్నిగురించి మనసులో చర్చించుకొని ఆ విషయాన్ని స్మృతిఫలకంమీద కనపించని లిపిలో లిఖించడం తప్ప ఆ విషయాన్ని గురించి నోట్సుకూడా వ్రాసుకొనేవాణ్ణికాదు. ఎన్నో విచిత్రాలోచనల్ను, మరెన్నో రంగు రంగుల అనుభూతుల్ను వచ్చాయి. కాని వాటికి అక్షరాలతో రూపం యిచ్చేవాణ్ణికాదు. ఈ విధంగా అధ్యయనం ఆలోచనాత్మకంగా, ఎక్కువ సృజనాత్మకంగా తక్కువరూపంలో వుండేది. దీన్నే ఇంగ్లీషు మాటలలో చెప్పాలంటే **Contemplative aspect** ఎక్కువగాను, **Creative aspect** తక్కువగాను వుండేది.

ఇక్కడి గ్రంథాలయంలో ప్రథమంగా '**Golden Book of Tagore**" అనే బృహత్ గ్రంథాన్ని చూడటం జరిగింది. రవీంద్రుని డెబ్బయ్యో జన్మదినోత్సవ సమయంలో 1930లో ప్రచురించారు ఈ పుస్తకాన్ని. ఇన్ని సంవత్సరాలుగా దాన్ని చూడడం పడలేదు. పుస్తకంలో గంభీరమైన వ్యాసాలు మాత్రమేకాక మనోజ్ఞమైన వర్ణచిత్రాలున్నాయి. వాటిలో నందలాల్ బోసు రచించిన "గ్రామ కుటీరాలు" అనే చిత్రం నా చిత్తాన్ని పూర్తిగా ఆకర్షించింది. అందులోని వెదురు పొద, కుటీరాలకు ఈవలగా కుడి ఎడమలకు వాలి యెంతో రమ్యంగావుంది. దాని సన్నని సున్నితమైన ఆకులు, రెమ్మలు తూర్పునవున్న అరుణాకాశానికడ్డంగా, పడమరనున్న నీలాకాశానికడ్డంగా యెంతో ప్రశాంతోత్పాదకంగా గోచరిస్తున్నాయి. ఈ చిత్రాన్ని నిత్యం కొన్నిసార్లు చూచేవాణ్ణి. ఇదివరలో అరణ్యంలో వెదురు పొదలు కనిపిస్తే వాటినిచూసి ఆనందించేవాడినే. వెదురు చెట్టుమీద యెప్పుడూ కూడా ప్రీతివుండేదే. కాని ఈ గ్రంథంలోని నందలాల్ బోసు చిత్రించిన వెదురు చెట్టును చూచిన తరువాత అరణ్యంలో కనుపించే వెదురుచెట్టుమీది ప్రీతి యింకా పెరిగింది.

ఇక్కడి గ్రంథాలయంలో బెంగాల్ చిత్రకారులవి కొన్ని ఆల్బములున్నాయి. ఒకరోజు వీటిని చూస్తూంటే అసిత్‌కుమార్ హాల్దారు చిత్రించిన "దుర్దినంలో"

అనే చిత్రం నన్నెంతగానో ఆకర్షించింది. గాలివాన రోజున ఒక చెట్టుక్రింద దాని వేళ్ళమీద కూర్చొని వుంటుంది, ఈ లోకంలోని దుఃఖాన్నంతా తానే మోస్తున్న ఒక దీనురాలు కట్ట బట్టలేక, ఉండ ఇల్లులేక, తిన తిండిలేక. ఆ భయంకరమైన గాలివానలో ఆ దీనురాలు అతిదీనవదనంతో ఆ చెట్టుక్రింద కూర్చొనివుంది. ఈ చిత్రం నా మనసును యెంతో లోతుగా కదలించివేసింది. ఎక్కడ కూర్చున్నా, నిలుచున్నా, నడుస్తూన్నా, కనులు తెరచినా, కనులు మూసినాకూడా ఆ దీనదృశ్యం ప్రత్యక్షం కాజొచ్చింది।

## ప్రసిద్ధ చిత్రకారునితో పరిచయం

అసిత్‌కుమార హాల్దార్ చిత్రాలనేకాక ఆయన రచనలనుకూడా బెంగాలీ మాసపత్రికలలో చూచాను. ఆయన లక్నోలోని ప్రభుత్వ లలితకళల విద్యాలయానికి ప్రిన్సిపాల్ చేస్తున్నారని తెలుసు. ఒకరోజు బెంగాలీలో ఆయనకొక పెద్ద ఉత్తరంవ్రాసి పోస్టుచేశాను. అయిదారు రోజులలో హాల్దార్‌నుంచి యెంతో చక్కని అవాలు చక్కని కాగితంమీద వచ్చింది. మొదటి ఉత్తరంలోనే ఆయన ఎంతో ప్రేమ వ్యక్తంచేస్తూ వ్రాశారు. దాన్ని పవిత్రానందకు చూపాను. ఆయన చాలా ఆనందించి నాకు మరొక విశేషాన్ని తెలిపారు. అసిత్‌కుమార్ హాల్దార్ అంటే విశ్వకవి రవీంద్రనాథ్ టాగోర్ మేనకోడలు కుమారుడట. ఈ విషయం విన్న తరువాత హాల్దార్‌మీది ప్రీతి అధికమైంది. మా ఉభయులకు బెంగాలీలోను, ఇంగ్లీషులోను ఉత్తర ప్రత్యుత్తరాలు ఎక్కువైనాయి. అది ఎంతవరకు ముదిరిందంటే నన్ను లక్నోవచ్చి తన బంగళాలో తనతో కొంతకాలం నివసించమని వ్రాశారు ఆయన. అందుకు సందర్భాన్ని వెదకుతున్నాను. ఆ సుముహూర్తం ఒక నాడు రానేవచ్చింది.

అసిత్‌కుమార హాల్దార్‌నుంచి ఉత్తరం వచ్చింది. ఒక వారంరోజులలో తన తాతగారగు రవీంద్రనాథ టాగోర్ లక్నో రాబోతున్నారని, నన్ను మరునాడే బయలుదేరి లక్నోరమ్మని. ఇక నా ఆనందానికి హద్దులులేవు, ఎంతో కాలంనుంచి చూడాలనుకొన్న రవీంద్ర కవీంద్రుని, ఇటీవలనుంచి చూడాలనుకొన్న అసిత్‌కుమార్‌ను చూడబోతున్నందుకు. పవిత్రానంద నా ప్రయాణపు యేర్పాట్లు చేయించారు.

రెండవరోజు ఉదయాన్నే నే నిదివరలో ఆల్మోరానుంచి బయలుదేరి ఎక్కివచ్చిన కంచరగాడిదా, ఆ గాడిద యజమాని మాధోసింగూ తయారు। మాధో

సింగును నేనూ, నన్ను మాధోసింగూ గుర్తించి ఒకరినొకరు చూచి సంతోషాన్ని వెలిబుచ్చాం. మాయావతిలో అందరివద్ద సెలవు తీసుకొని కంచరగాడిదమీద తనక్‌పూర్ రైలుస్టేషన్‌వైపుకు బయలుదేరాను. మాయావతిని, అక్కడ చెట్లు చేమలను, పశుపక్షులను. స్వాములను, పరిచారకులను విడచిరావడం మనసుకు కష్టంగానేవుంది. కాని వెళుతున్న పనిలోని సంతోషం ఈ కష్టాన్ని కష్టంగా అనిపించలేదు. రానున్న సమాగమ సుఖంముందు యిప్పటి వియోగదుఃఖం వెల వెల పోయింది.

మాయావతినుండి తనక్‌పూర్ రైల్వేస్టేషన్ యాభై మైళ్ళ లోపు వుంటుంది. రోజుకు ఒక్క బండిమాత్రమే లక్నోవైపునుండి తనక్‌పూర్‌వచ్చి మళ్ళీ తిరిగి లక్నో వేపుకు వెళుతుంది. అది పగలు పన్నెండుగంటల ప్రాంతంలో వస్తుందట. ఆ బండి తప్పితే మరో రోజువరకూ అక్కడ ఆగిపోవలసిందే. తనక్‌పూర్ మలేరియా ప్రాంతం. క్రొత్తవాళ్ళు అక్కడ రాత్రులు నిద్రచేస్తే తప్పక మలేరియా సంక్రమిస్తుందట. కనుక నేడు బయలుదేరిన నేను రేపు తనక్‌పూర్‌లో రైలుబండిని అందుకోవలసిందే. మాయావతికి వచ్చే సమయాన పడమటవైపుగా ఆల్మోరా నుంచి వచ్చాను. ఇప్పుడు తూర్పువైపుగా తనక్‌పూర్ మీదుగా వెళుతున్నాను. పాత మిత్రుడైన మాధోసింగ్‌తో కబుర్లుచెబుతూ గాడిదను చాంపావత్ వైపుకు నడుపుతున్నాను.

మాయావతినుంచి మూడు నాలుగు మైళ్ళలో వుంటుంది చంపావత్. మంచి అరణ్య దృశ్యాలున్నాయి. కుమావూ చరిత్రలో గొప్ప ప్రాముఖ్యాన్ని వహించిన నగరం యిది. ఇప్పుడు నగరంకాదు, గ్రామంగానే లెక్క; పెద్ద గ్రామం. పురాణాలలోని చంపావతి నగరం యిదేనని ప్రతీతి ఇక్కడ భూమి ఒక విధంగా సమతలంగానే వుంటుంది. ఆ రోజంతా సుందరదృశ్యాలగుండా ప్రయాణంచేసి మాయావతినుంచి యిరవై మైళ్ళ దూరంలోవున్న డ్యోరీ అనే పెద్దగ్రామం చేరుకొని గ్రామానికంటె చాలా ఎత్తువవున్న డాక్ బంగళాకుచేరుకున్నాం సాయంత్రానికి. డాక్ బంగళా వరండాలో కూర్చుని చాలా క్రిందుగావున్న గ్రామాన్ని, ఆ గ్రామంలోని వంటిళ్ళలోనుంచి వస్తున్నపొగను, అప్పుడప్పుడే దూరంనుంచి క్రమ్ముకువస్తున్న పొగమంచును, వీటన్నిటికీ అవల దూరంగా కనుపించే పర్వతాల ఛాయారూపాలను చూస్తుంటే కంటికీ హృదయానికీ ఏదో హాయీ, లోకోత్తరానందం కలిగాయి.

డాక్ బంగళాలో నేను ఆక్రమించుకొన్న గది వెంబడివున్న మరో గదిని

బేలూరుమఠ్‌నుంచి వస్తున్న ఒక స్వామీజీ నిమిత్తం మాయావతిలోనివారు రిజర్వు చేయించి వుంచారు. ఆ రాత్రికి మాయావతిలో యిచ్చిన నాన్‌రొట్టెలను, పళ్ళను తిని బంగళా చౌకీదారు ఊళ్ళోనుంచి తెచ్చి యిచ్చిన పాలను త్రాగాను. రాత్రికి బేలూర్‌నుంచి మాయావతి పోతున్న స్వామీజీవచ్చి యిక్కడ గుర్రందిగి బంగళాలో ప్రవేశించారు. ఆయన వృద్ధులలో లెక్క. ఈ కఠినమైన ప్రయాణంచేసి చాలా బడలిక చెందివున్నారు. బడలిక మూలంగా ఆ రాత్రి ఆయన యేమీ తినకుండానే నిద్రించారు. నేను మాయావతినుంచి వస్తున్నానని విని చాలా ఆనందించారు ఆయన. మాయావతికంటె యిక్కడ ద్యోరీలో చలి కొంత తక్కువగావుంది. రాత్రి బాగా నిద్రపట్టింది.

ఇక యిక్కడకు పదిహేనుమైళ్ళలో వుంటుంది, తనక్‌పూర్ రైల్వేస్టేషన్. పగలు పన్నెండుగంటలలోగా అక్కడికి చేరుకొంటేనేకాని ఆ రోజు రైలు అందదు. కనుక చీకటితో అయిదు గంటలకే బయలుదేరాము చలికి వణుకుతూ. దారి యేమీ బాగాలేదు. అంతా రాళ్ళమయం. కంచరగాడిద నడవటానికి కష్టంగా వుంది. కొంత ప్రొద్దెక్కేవరకు మేము ఘూకీదాంగ్ చేరుకొన్నాం. మధ్యలో వంతెనలేని లాధ్యా అనే నదిని దాటవలసివచ్చింది. నీరు లోతు లేనందున గాడిదమీదనే ఆ నదిని దాటాము. ఘూకీదాంగ్ దాటిన తరువాత క్రమేణ మార్గం కొంత బాగుండసాగింది. ఇక్కడనుంచి పర్వత ప్రదేశం క్రమేణ సమతల ప్రదేశంగా మారజొచ్చింది. ఇంకా వెళ్ళినకొద్దీ పర్వతాలు అంతమై పూర్తిగా మైదానం ప్రారంభమైంది. మధ్యలో మార్గం రెండువైపులా దట్టమైన, ఎత్తైన అరణ్యం. వన్యమృగాలు పగలుకూడా యిటు తిరుగుతుంటవట. కాని నాకేమీ కనుపించలేదు. సమతల మార్గమైనందున గాడిద వడివడిగా నడవసాగింది. మా ధోపింగ్ నడకను కూడా త్వరితంచేశాడు.

మేము పదకొండు గంటలకల్లా తనక్‌పూర్ బజారుకుచేరుకొన్నాం. అక్కడ ఇంత పూరీకూరా తిని రైల్వేస్టేషన్‌కు చేరుకొన్నాం. అప్పటికింకా అరగంట సమయముంది లక్నో వేపునుంచి రైలు రావడానికి. టిక్కెట్టు పిలిభిత్ వరకే తీసుకోవాలి. ఈ రైలు అంతవరకేపోయి ఆగిపోతుంది. బుకింగ్ ఆఫీసులో నూరు రూపాయల నోటుకు చిల్లరలేదని టిక్కెట్టు యివ్వలేదు. నాకు ఏమిచేయడానికీ తోచలేదు. నా దగ్గర నూరునోటు తప్ప చిల్లరలేదు. బండి సమయం అవుతున్నది. నేను మంచి యిబ్బందిపడిపోయాను. అవసరమైన చిల్లర

దొరకనప్పుడు డబ్బు ఉన్నాకూడా లేని దానిలో జమేకదా అనుకొని చుట్టూవున్న వాళ్ళదగ్గర దొరుకుతుందేమో అని అడిగితే ఎవరిదగ్గరా చిల్లరలేదు. వెంటనే మాధోసింగ్ ఈ చిక్కును గుర్తించి నా వద్దవున్న వంద నోటును తీసుకొని గాడిదమీద ఎక్కి కేంప్ వదిలి పదినిమిషాలలో తనక్‌పూర్ బజారునుంచి నూరు రూపాయల చిల్లర పట్టుకువచ్చాడు. అతను నా దగ్గర నూరురూపాయల నోటు పట్టుకువెళ్ళడం చూచినవాళ్ళు అతను మళ్ళీ రాడని, ఆ డబ్బు తీసుకొని వెళ్ళిపోతాడని అనసాగారు. కాని అతను తిరిగి వస్తాడని నాకు సంపూర్ణ విశ్వాసం.

సాయంత్రం అయిదుగంటల ప్రాంతంలో పిలిభిత్‌లో రైలు దిగాము. లక్నో పోయే బండి రాత్రి తొమ్మిది గంటలకుకాని బయలుదేరదు. కొంతకాలం క్రిందట ఈ పిలిభిత్ మీదుగానే నేను కాఠ్‌గోదాంకు రైలులో ప్రయాణించాను. సామాను స్టేషన్‌లో వదలి బస్తీలోకిపోయాము పురవీక్షణకు. పిలిభిత్ జిల్లాకు ప్రధానస్థానం. ఏ ప్రాంతంలోనైనా దాదాపు బస్తీలన్నీ ఒకేమాదిరిగా వుంటాయి. పల్లెలలో ఒక దానికి మరొకదానికి యెక్కువ తారతమ్యం గోచరిస్తుంది. బజార్లలో ఏమీ విశేషాలు గోచరించలేదు. ఒక హోటలులో ఆ రాత్రి భోజనం ముగించుకొని రాత్రి ఎనిమిది గంటలకు స్టేషన్‌కు తిరిగివచ్చి వెయిటింగ్‌రూంలో విశ్రమించాము.

కొంతకాలం క్రిందట యిటు హిమాలయాల వైపుకు వెళ్ళేటప్పుడు ఎంతో బరువు హృదయంతో, కొంత దిగులు చింతలతో వెళ్ళాను. ఇప్పుడు తిరిగి లక్నో వస్తూంటే బరువులేని తేలిక హృదయంతో ఉల్లాసంగా వస్తున్నాము. అప్పటిజీవితం లోని ప్రతిక్షణంలో చీకటి, విషాదం ఎదురవుతుండేవి. మరి ఈ తిరుగు ప్రయాణంలో ఎటుచూచినా బయట కాంతి, లోపల శాంతి ప్రత్యక్షమవుతున్నాయి.

# రవీంద్ర కవీంద్రుని సందర్శన భాగ్యం; అయోధ్యలో కిష్కింధాపుర అగ్రహారీకులు

లక్నో స్టేషన్‌లో కొంతకాలం క్రిందట దక్షిణం వైపునుంచి వచ్చిన రైలునుంచి దీనవదనంతో దిగాను. మళ్ళీ నేడు అదే స్టేషనులో ఉత్తరంనుండి వచ్చిన రైలునుంచి ప్రఫుల్లవదనంతో దిగాను. నాడు హిమాలయాలు వీక్షణలోని అస్ఫుటరూపాలు. నేడు హిమాలయాలు స్మృతిఫలకంపైని ప్రస్ఫుటరూపాలు. నాడు లక్నోనగరం నాకు క్రొత్తది, నేడు అది పాతది. నాడు లక్నోలో నన్ను ఎరిగిన ప్రముఖ వ్యక్తి ఎవరూలేరు, నేడున్నారు. ఆనాడు నేను దిగిన లక్నో ఏమీ మారలేదు కాని ఈ నాడు లక్నోలో దిగిన నేను మారివున్నాను. అయితే మారిన మనస్సుకు జగత్తంతా మారినట్టే గోచరిస్తుంది। కనుక లక్నో మారలేదని చెప్పేదానికంటె మారినదని చెప్పడంలోనే ఎక్కువ సత్యంవుంది.

నేను యే బండిలో లక్నోలో దిగుతానో అసిత్‌కుమార హాల్దార్‌కు తెలియదు కనుక నా కోసం స్టేషన్‌కు ఆయనకాని, ఆయన అనుచరులుకాని రావడం కుదరదు. స్టేషన్‌నుంచి టాంగాలో బయలుదేరి లక్నో యూనివర్శిటీకి వెనక భాగంలోవున్న ప్రిన్సిపాల్ బంగళాకు వెళ్ళాను. ఈ భాగాన్ని బాద్‌షాబాగ్ అంటారు. తోటలోగుండా వెళ్ళి విశాలమైన బంగళాముందు ఆగేసరికి వరండాలో అటూ యిటూ తిరుగుతున్న పొడవైన నల్పని చాయగల అందమైన వ్యక్తి నా కెదురువచ్చి ప్రేమతో ఆలింగనం చేసుకొన్నాడు. ఇంతవరకు నేను కల్పనా రూపంలో మాత్రమే చూస్తున్న అసిత్‌కుమారుడు నేడు వాస్తవరూపంలోకనుపించినందుకు అమితానందం కలిగింది. నన్ను చూచి ఆయనే ఎక్కువ సంతోషించారో లేక ఆయననుచూచి నేనే ఎక్కువ సంతోషించానో అని కొలవడానికిబదులు ఉభయులం సమానంగా సంతోషించామనడం మంచిది।

బ్రిటిషుపాలన రోజులలో భారతదేశంలో స్థాపించిన లలితకళల విద్యాలయాలకు బ్రిటిషువారే ప్రిన్సిపాల్స్‌గా వుండేవారు. వీటికి మొదటి భారతీయ ప్రిన్సిపాల్ అసిత్‌కుమార హాల్దారే. కొంతకాలం శాంతినికేతనంలోని కళాభవన్‌కు మొదటి ప్రిన్సిపాల్‌గావుండి, తరువాత జయపూర్‌లో ప్రిన్సిపాల్‌చేసి అక్కడ నుండి లక్నోకు వచ్చారాయన. కవీంద్ర రవీంద్రునికి ఒక మేనకోడలు కూతురు

విఖ్యాత సినీతార దేవికారాణి. మరొక మేనకోడలు కొడుకు అసిత్‌కుమార హాల్దార్. ఈయన చిత్రకారుడు, కవి, వక్త, కళాసమీక్షకుడు, ఉన్నత మానవుడు. భారతీయ చిత్రకళకు ఈయనచేసిన సేవ అపారం. హాల్దార్ చిత్రణ ఎక్కువగా భావకవితలవలె, అంటే లిరికల్‌గా వుంటాయి. ఈయన కవితలలో చిత్రాలు గోచరిస్తే, ఈయన చిత్రాలలో కవితలు వినిపిస్తాయి.

విశాలమైన ప్రభుత్వపు బంగళా, బ్రిటిష్ ప్రిన్సిపాల్‌సనిమిత్తం నిర్మించింది కావడంవల్ల అవసరానికి పనికిరాని వసతులెన్నో వున్నాయి యీ బంగళాలో. చుట్టూ మంచి పూలతోట, ఎన్నోరకాల వాసనలేని రంగురంగులపూలు, మొగలి పొదలుమాత్రం ఈ విషయంలో అపవాదంగా నిలిచాయి!

## అయోధ్యలో కిష్కింధ

కొన్ని చెట్లలో కోతులు వాటి కొడుకులూ కూతుళ్ళతో, మనుమలూ మనుమరాండ్రతో గుంపులు గుంపులుగా కోతికొమ్మంచి ఆడుతున్నాయి. లక్నో ప్రాంతాన్ని అవధప్రాంతం అంటారు. అంటే అయోధ్యా ప్రాంతమని అర్థం. నేను హాల్దార్‌కు కోతులను చూపించి అన్నాను: "అయోధ్యాప్రాంతం కిష్కింధా ప్రాంతంగా మారిందేమి?" అని. అందుకాయన నవ్వి సమాధానం చెప్పారు. "కిష్కింధా వాసుల సహాయంతో రాముడు సీతను తిరిగి తెచ్చుకోగలిగినందున అందుకు ప్రతిఫలంగా రాముడు యీ భాగాన్ని కిష్కింధావాసులకు జాగీరు ఇచ్చాడు!"

హిమాలయాలకు ఆయన వెళ్ళేడట కాని మాయావతి ప్రాంతానికి వెళ్ళలేదట. ఎప్పుడో మాయావతిని చూచిరావాలన్నాడు. ఇక్కడ వంటచేస్తున్న తేజసింగ్ అనే యువకుడు మాయావతికి దగ్గరలోనుంచి వచ్చినవాడే. ఇక్కడి భోజనం మాయావతి భోజనం మాదిరేవుంది. అక్కడకూడా యజమానులు బెంగాలీలే అయినందున వంటవారు ఏ ప్రాంతం వారయినా, వంట పద్ధతులలో అంతగా భేదం తట్టదు. ఆవనూనెతో చేసిన వేపుడు మాత్రం భరించరాని వాసనతో వుండేది. మిగతా కూరలన్నీ బాగుండేవి.

రవీంద్రనాథటాగోర్ అలహాబాద్ వచ్చి వున్నారని యింకా రెండు రోజులకు లక్నో వస్తారని హాల్దార్ చెప్పారు. భోజనానంతరం తన విద్యాలయానికి తీసుకువెళ్ళి తన క్రింది అధ్యాపకులకు, విద్యార్థులకు నన్ను పరిచయం చేశారు.

అక్కడివారు చిత్రించిన చిత్రాలను, నిర్మించిన శిల్పాలను చూపేరు. తరువాత తాను స్వయంగా చిత్రించిన వాటినికూడా చూపారు. ఆయన చిత్రాలు మిగతా బెంగాలీ చిత్రకారులు భారతీయవిధానం అనే పేరుతో చిత్రించిన చిత్రాలకంటె చాలా పెద్దవిగా వున్నాయి. ఎక్కువగా బెంగాలీ చిత్రకారులు చిత్రించిన చిత్రాలలో సమూహరచన (**Group Composition**) వుండక ఒకటి రెండు వ్యక్తుల మూర్తులు మాత్రమే కనిపిస్తాయి. కాని, అదే భారతీయ పద్ధతిలో పెద్ద సైజులో సమూహరచన చేయడం ప్రారంభించారు హాల్దార్.

ఆ సాయంత్రం హాల్దార్ తన కారులో నన్ను తీసుకొని లక్నో నగరాన్ని త్రిప్పి చూపించారు. క్రిందటిసారి నేను చూచిన బజార్లు కొన్ని గుర్తుపట్టాను. కవులు, గాయకులు, నటకులు అయిన తన స్నేహితులు కొందరి యిళ్ళకు నన్ను తీసుకువెళ్ళి పరస్పరం పరిచయం చేశారు. బెంగాలీ మిత్రులతో బెంగాలీలోను, హిందీ మిత్రులతో హిందీలోను ప్రసంగించాను. అందుకు వారంతా సంతోషించారు. వారిలో హిరణ్మయరాయ్ చౌదరి అని గొప్ప శిల్పి వున్నాడు. ఆయన గొప్ప గొప్ప వ్యక్తుల రూప శిల్పాలను గొప్ప గొప్పగా నిర్మించి, గొప్ప గొప్ప మొత్తాలను ఆర్జిస్తూంటారు. ఆయన రూపం స్వయంగా బంగారు విగ్రహంలాగా వుంటుంది. ఆ సాయంత్రం ఆయన యింట ఆయనతో వివిధ ప్రసంగాలతో కాలక్షేపం యెక్కువసేపు చేశాం.

హాల్దార్ భార్యా, పిల్లలూ లక్నోలో లేరు. కలకత్తాలో వున్నారు. ఆయన తన పరిచారకులతో మాత్రమే యిక్కడ వుంటున్నారు. ఆ రాత్రి స్వప్నంలో మాయావతి కనుపించింది.

మూడురోజులు హాల్దార్‌తో కలసి లక్నోలో తిరుగుతూ కాలం గడిపిన తరువాత రవీంద్రుడు అలహాబాద్‌నుంచి కారులో లక్నోవచ్చి ప్రభుత్వపు అతిథి గృహంలో బసచేశారు. ఒకటి రెండురోజులు సభలు, సన్మానాలు వీటితో హడావిడిగా వుంది. ఈ సందడి తగ్గిన తరువాత నన్ను ఆ విశ్వకవికి పరిచయం చేస్తానన్నారు హాల్దార్. హడావిడి శాంతించిన తరువాత ఒక మధ్యాహ్న సమయాన ఎవరులేని తరుణంచూచి మేముభయులం ప్రభుత్వ అతిథి గృహానికి వెళ్ళి రవీంద్రుని దగ్గర కూర్చున్నాం. నన్ను పరిచయం చేసినతరువాత రవీంద్రుడు, నేను కొన్ని నిమిషాలు బెంగాలీలో మాటాడుకొన్నాం. తదుపరి రవీంద్రుని బెంగాలీ కవి

తలు రెండు ఆయనకు చదివి వినిపించాను. ఈ రెండు కవితలు ఆయనవే ఆయనకు వినిపించాలని కంఠస్థంచేసి వుంచాను.

## రవీంద్రుని ప్రశంసలు

"సీమారొ మాఝే అసీమ తుమి
బాజావో ఆపన్ సుర్-
ఆమారొ మాఝే తోమారొ ప్రకాశ్
తాయి ఏటా మధుర్."
"శేషేరొ మధ్యే అశేష్ అఛే-
ఏయి కథాటి మనే
ఆజ్‌కే ఆమారొ గానేరొ శేషే
జాగేఛే క్షణే క్షణే."

ఒక వంగేతరుని నోటివెంట తన స్వీయ వంగ కవితలను విని విశ్వకవి అమితానందం పొందారు. ప్రశంసించారు. అప్పటికే ఆయన జీవితం అస్తగత సూర్యుని విధంగా వాలిపోతూంది. ఆరోగ్యం సరిగాలేదు. వెనకటి ఫొటోగ్రాఫులలో చూచిన రవీంద్రుని రసరూపం యిప్పు డాయనలో లోపించింది. తాను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వెనక మానవుడు అనే విషయంమీద ఉపన్యాసాలు యిచ్చినప్పటి విశేషాలను గురించి ముచ్చటించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం చాలా సుందరమైన ప్రదేశంలో వున్నదన్నారు.

తన అంతం ఎక్కువకాలం లేదని, తాను మరణించిన తరువాత శాంతి నికేతనాన్ని జీవింపచేసే కర్తవ్యం మీలాంటి యువకులమీద వుంటుందనీ ఏవేవో కొంత వైరాగ్యవాదపు ధోరణిలో ప్రసంగించారు రవీంద్రుడు. తన వృద్ధాప్యంలో తనను వరించిన చిత్రకళకు ప్రోత్సాహమిచ్చింది మన అసిత్‌కుమారే నన్నారు. కవిగా జీవించగలిగితేనే చాలదు, మనిషిగా జీవించగలిగితేనే కవిగా కూడా జీవించి నట్లు అన్నారు.

చిన్నప్పటినుంచి రవీంద్రుని ఖ్యాతి వింటూ నేను ఆయన సమక్షంలో కూర్చుని వుండటం గుర్తువచ్చినప్పుడు నిజంగా ఆయన ఉనికిలో వున్నానా లేక యిదొక స్వప్నమా? అనిపించింది. కొంతసేపయిన తరువాత ఇక ఆయనను శ్రమ పెట్టకూడదని మేము లేచాము. రేపు తన యింటికి భోజనానికి తీసుకువెళతానని

హాల్దార్ తన తాతగారిని అడిగారు. అందుకు రవీంద్రుడు నవ్వి భోజనాలకు వచ్చే తరుణం తప్పిపోయినదని, పథ్యంతోకూడిన ఏవో కొన్ని ప్రత్యేకమైన తేలిక పదార్థాలు తప్ప మరేమీ తీసుకోడంలేదు కనుక తనను భోజనానికి తీసుకువెళ్ళ వద్దని, తిరిగి ఎల్లుండి కలకత్తా వెళ్ళిపోతానని చెప్పారు. పరిస్థితిగ్రహించి హాల్దార్ ఇక రవీంద్రుని బలవంత పెట్టలేదు. ఆయనవద్ద సెలవు తీసుకొని మేము బంగళాకు వెళ్ళిపోయాము.

ఆ రాత్రి అసిత్‌కుమార్ కొంచెం విచారంగా కనుపించారు. నే నూహించాను, రవీంద్రుని దిగజారిపోతున్న ఆరోగ్యం ఈయన మనసుకు విషాదం కలిగించి వుంటుందని. నా వూహ నిజమే అయింది. హాల్దార్ అన్నారు, తన తాతగారి జీవితం యిక ఎక్కువకాలం వుండదేమోనని. ఉదయించిన రవి అస్తమించక తప్పదు. అస్తమించే సమయం సమీపిస్తున్నదన్నారు.

ఆ రాత్రి పొద్దుపోయేవరకు కూర్చుని బెంగాలీలో కొన్ని కవితలు రచించారు హాల్దార్. తాత్విక సంబంధంగా రసాత్మకంగావుండే కవితలు అవి. దృశ్య జగత్తుకు, అదృశ్య జగత్తుకు వుండే దూరాలు, దగ్గరలు, ఒకటి వున్నప్పుడు రెండవది వుంటుందా వుండదా అనే చర్చతో విచిత్రమైన కవితలు అవి. ఆ రాత్రి ఆయన మేలుకొని వున్నంతసేపు నేను మేలుకొని వున్నాను. ఆ కవితలు పూర్తి కాగానే వాటిని నాకు చదివి వినిపించారు. రేపు పగలు ఆ కవితలకు రేఖలలో, రంగులలో రూపకల్పన చేయాలన్నారు.

ఇటువంటి నైరూప్య (**Abstract**) విషయాన్ని ఏ విధంగా చిత్రించగలరు అని అడిగాను. ఇటువంటి నైరూప్య విషయాలను చిత్రించడం కష్టమే కాని, వాటిని చిత్రించడంలో ఒక ప్రత్యేక పంథాను అనుసరించాలి. అపరిచిత విషయాన్ని పరిచిత రూపాలలోకి అనువదించి చిత్రించాలి. అతీంద్రియ విషయాలను ఇంద్రియగ్రాహ్య రూపాలలో వ్యక్తపరచాలి. అయితే ఇవి చిత్రించినవారికి నచ్చినంతగా ప్రేక్షకులకు నచ్చవు. తాను చిత్రించినదాని అర్థం తనకు తెలుసును కనుక చిత్రకారుడు దాన్ని చూచి ఆనందించగలడు. తాను చిత్రించిన ఇటువంటి నిగూఢమైనరూపకల్పనను గురించిన అర్థం ప్రేక్షకులు ఎక్కువమంది గుర్తించలేరు. కనుకదాన్ని ప్రేక్షకులు ఆనందించజాలరు. అంటే ఇది జన బాహుళ్యానికి వచ్చే కళకాదని తాత్పర్యమని యీ విధంగా మేము నిద్రించేవరకూ ఆయన చెబుతూనే వస్తున్నారు. చిత్రించడం వేరు, చిత్రాన్నిగురించి చెప్పడంవేరు. చెప్పడం తెలిసున్నవారు చిత్రించే చిత్రాలు చెప్పజాలనివారి చిత్రాలు ఎక్కువ బాగుంటాయా అనే ప్రశ్నలేచింది మనసులో. బాగుండకపోవచ్చు కూడా.

# ప్రవృత్తి, నివృత్తులమధ్య సంఘర్షణ

లక్నో లలితకళల విద్యాలయంలో హాల్దార్ దగ్గర చిత్రకళ అభ్యసిస్తున్న ఒక బెంగాలీ అమ్మాయి నీరజ నిత్యమూ హాల్దార్‌గారిబంగళాకు వచ్చి నా దగ్గర కొంతసమయం గడుపుతూండేది. ఆమె నాకంటే ఒక సంవత్సరం పెద్దది వయసులో. నాకు పదిహేడు సంవత్సరాలయితే ఆమెకు పద్దెనిమిది. చాలా స్నేహపాత్ర, సుకోమలమైన వేదనలు. సంవేదనలు కల హృదయం ఆమెది; శరీరం మాత్రం కొంచెం బలహీనంగా వుండేది. ఒకవేళ ఈ శారీరక బలహీనత ఆమె మానసిక సౌకుమార్యానికి ప్రతిబింబమేమో! ఈమె తండ్రి రిటైర్డైన సివిలియన్.

"నీకంటే నీ పేరు బాగుంది నీరజా" అనేవాణ్ని. "నాపేరు కంటే నీ పేరు యింకా ఎక్కువ బాగుంది" అనేది ఆమె. "ఈ జగత్తంతా నామరూపాలమయం. కొన్ని నామాలు బాగుంటే కొన్ని రూపాలుబాగుంటాయి. మన ఉభయుల విషయంలో రూపాలకంటే నామాలే యెక్కువ బాగున్నాయి. మరి మన ప్రిన్సిపాలుగారి విషయంలో నామానికంటె రూపమే బాగుంది. అసితకుమార్ అంటే నల్లనివాడు అని అర్థం. మరి ఆయన రూపం బంగారు రంగులో వున్నది" హాల్దార్ మాదగ్గరే కూర్చుని ఉన్నందున ఈ మాటలు విని నవ్వసాగారు.

ఒకరోజు మేము ముగ్గురమూ, మరో ముగ్గురు అమ్మాయిలూ కలిసి గోమతీ నదీ తీరాన నగరానికి చాలాదూరంగా పిక్నిక్‌కు వెళ్ళాం. నలుగురు స్త్రీలు, ఇద్దరు పురుషులం. "నారీ మెజారిటీ ఎక్కువయినందున నరులం భయంతో జాగ్రత్తగా మెలగాలి మేము యిక్కడ" అన్నాను. అందుకు నీరజ అన్నది "నారీమణులు అబలలు కనుక సంఖ్యలో ఎక్కువైనా, సారంలో సమానమే."

ఆరోజు సాయంత్రంవరకు గోమతీ తీరాన ఆనందంతో కాలంగడిపి తిరిగి వచ్చాం. నీరజ స్నేహం నాలో నూతన ప్రాణాన్ని, నూతనోత్సాహాన్ని, జీవితంలో ఆశావాదాన్ని, సృష్టించసాగినాయి. ఆమె ఎంత అనురక్తి వ్యక్తపరచేదో అంతగా విరక్తినికూడా వ్యక్తపరచేది. మాయావతిలో స్త్రీలనుకూడ నివసించనిస్తే తాను మాయావతి వెళ్ళిపోయి ఆ హిమాలయ వాతావరణంలో ఆనంద సాధనలో వుండిపోవాలి అనేది నీరజ. ఆమెలో ప్రవృత్తికంటే నివృత్తియే అధికం.

ఒకరాత్రి నాకంతా నిద్రపట్టలేదు. ఇంకా ఎన్నిరోజులని లక్నోలో గడపగలను? లక్నోనుంచి తిరిగి మాయావతికి వెళ్ళటమా? తుమ్మపూడి వెళ్ళటమా?

తుమ్మపూడి వెళ్ళి యేమి చేయాలి? అయితే మాయావతి వెళ్ళి మాత్రం యేమిటి చేయడం? మాయావతి వెళ్ళి చేయగలిగింది తుమ్మపూడి వెళ్ళిమాత్రం చేయలేనా? మాయావతి వెళ్ళడం నివృత్తి. తుమ్మపూడి వెళ్ళడం ప్రవృత్తియా? మరి అటూ యిటూ కాక లక్నోలో వుండడం యేమివృత్తియో! ఈ విధంగా ఆ రాత్రంతా అశాంతియైన ఆలోచనలే. జీవితంలో అవివాహితుడిగా వుండిపోవాలనికూడా తీర్మానించుకొన్నాను. ఆ రాత్రే నీరజకూడా అవివాహితగానే జీవితం గడపాలని తన అభిలాషను యిదివరకే వ్యక్తపరచింది. ఒక స్త్రీ, ఒక పురుషుడు అవివాహితులుగా ఒకచోట స్నేహితులవలె నివసించడం సంభవంకాదా? స్త్రీకి పురుషుడు, పురుషునికి స్త్రీ నివృత్తి మార్గానికి అడ్డంకులా? నివృత్తి మార్గానికి అడ్డంకులు అంటే ప్రవృత్తి మార్గానికి అనుకూలురనేగా? అటువంటప్పుడు నివృత్తి మార్గానికి బదులు ప్రవృత్తి మార్గాన్నే ఎందుకు అనుసరించరాదు? నిజంగా యీ రెండు మార్గాలకు మౌలిక భేదమేమైనా వున్నదా? వుంటే ఆ భేదాన్ని తొలగించి ఈ రెండువర్గాల మధ్య ఐక్య సేతువును నిర్మించి ఈ రెండుమార్గాల సమ్మిశ్రణ ద్వారా ఈ రెంటికీ భిన్నమైన మూడవ మార్గాన్ని నూతనంగా ఎందుకు నిర్మించకూడదు?

రాత్రంతా ఆలోచనల మధ్య, అనుభూతుల మధ్య, ఆశల మధ్య, నిరాశల మధ్య, అనురాగాలమధ్య, విరాగాల మధ్య సతమతమై, నిద్రలేనందున ఉదయాన కళ్ళు ఎర్రబారినాయి. హల్దార్ ఈ మార్పును గ్రహించారు. నా యిష్టమొచ్చినంత కాలం తన దగ్గరే వుండిపొమ్మని మరోసారి చెప్పారు. కాని ఎందుకో నే నిక్కడ కూడా వుండలేకపోతున్నాను. భవిష్యత్తును గురించిన నిర్ణయమేమీ చేసుకోలేనందున వర్తమానంతో అశాంతి తట్టసాగింది. ఆ మధ్య అశాంతిలేకుండా శాంత చిత్తంతో జీవించసాగాను. ఇప్పుడు తిరిగి ఆ వెనకటి అశాంతి, ఆందోళన పీడించ సాగాయి.

మధ్యాహ్నం దీనవదనంతో, భవిష్యత్తును నిర్ణయించుకోలేక నా గదిలో కూర్చున్న సమయంలో నీరజ వచ్చింది అదే దీనవదనంతో. నా ఎర్రని కళ్ళు చూచి రాత్రి నిద్రలేదా? అని అడిగింది. నేను అవునని తలవూపి పరిస్థితంతా చెప్పాను. తాను అదే స్థితిలో వున్నట్టు, భవిష్యత్తును గురించి ఏ నిర్ణయానికి రాలేక వేదనపడుతున్నట్టు చెప్పి నన్ను తిరిగి తుమ్మపూడి వెళ్ళమని సలహా యిచ్చింది; తాను హిమాలయాలకు వెళ్ళిపోతానన్నది; ఆల్మోరా దగ్గరవున్న ఆనందమాయీ ఆశ్రమంలో కొన్నాళ్ళు గడుపుతానన్నది.

తానొక నిర్ణయానికొచ్చి, నాకొక నిర్ణయాన్ని నీరజ సూచించినందున నా హృదయంమీద బరువు తొలగించినట్లు అయింది. దానితో మానసం ఎంతో తేలిక పడింది. మళ్ళీ జీవన దిగంతాన ఆశాజ్యోతులు గోచరించసాగాయి. నేను స్వయంగా చేయలేని పనిని నీరజ చేసిపెట్టింది. నన్ను తుమ్మపూడి పంపిన తరువాతనే తాను హిమాలయాలకు వెళ్ళిపోతానన్నది.

ఆ సాయంత్రం మేమంతా ఉల్లాసంగా హల్దార్‌గారి కారులో నగరానికి వెలుపలకాక నగరం బజార్లలోనే తిరిగాము. అనుకొన్నాను నగరం బయటికి పోవడం నివృత్తి, నగరం లోపల తిరగడం ప్రవృత్తి అని. నేను ఇప్పుడు ప్రవృత్తి మార్గంలో ప్రవేశించినట్టా? అయితే నీరజతో కలిసుండడం ప్రవృత్తి నీరజనుంచి వేరుగా వుండడం నివృత్తి అనేనా? కాదు, నీరజతో కలిసుండడమే నివృత్తి. నీరజకు దూరంగా వుండడం ప్రవృత్తి!

## దుస్వప్నం

అంతరం చీకటి పడినతర్వాత బంగళాకు తిరిగివచ్చాం. నీరజకూడా నాతోనే భోజనం చేసింది. ఆమె వెళ్ళిపోయిన తరువాత నాకు ఏ ఆలోచనా రాకుండా నిద్ర పట్టింది. ఆ నిద్రలో నీరజ చనిపోయినట్లు, వాళ్ళ వాళ్ళంతా దుఃఖిస్తున్నట్లు కల వచ్చింది. కలవరపడి వెంటనే నిద్ర మేలుకొని కూర్చునిచూస్తే జరిగింది కలేకాని వాస్తవం కాదని తట్టింది. ఇక నిద్రపట్టలేదు. ఎందుకని యిటువంటి స్వప్నం వచ్చిందా? అని దాని అర్థం ఆలోచించసాగాను.

మరునాటి ఉదయం తెలిసింది రాత్రి నీరజకు విపరీతంగా జ్వరం వచ్చిందని. నా స్వప్నం అప్పుడు నాకు అర్థమైంది. నేను నీరజ యింటికి వెళ్ళిచూస్తే నీరజ రగ్గు కప్పుకొని పడుకొనివుంది. శరీరం మాడిపోతోంది. ఆ జ్వరపు బాధలోనే చిరునవ్వునవ్వి మాట్లాడసాగింది. రాత్రి నా కొచ్చిన స్వప్నాన్ని మార్చి చెప్పాను తనకు జ్వరం వచ్చినట్లు నేను కలగన్నానని. ఆమె ఆశ్చర్యం ప్రకటించింది. నాకుకూడా వెనక యిటువంటి మండిపోయే జ్వరాలు వస్తుండేవని. ఇప్పుడు అటువంటి జ్వరాలు రావడంలేదని చెప్పాను. నీరజ అన్నది, తనకు వెనక అసలు జ్వరాలే వచ్చేవి కావని, ఇప్పుడిప్పుడే జ్వరాలు రావడం ప్రారంభిస్తున్నవని. నేను అన్నాను, జ్వరాలు వస్తూండేవేకాని ఆ జ్వరతాపానికి మానవునిలోని అజ్ఞానమంతా కాలిపోయి జ్ఞానోదయం కలుగదు అని. ఇప్పుడు నీకు జ్వరాలు రావడం ప్రారం

భించినాయి కనుక ఇక నీలో జ్ఞానోదయం కలుగుతుంది అని. నీరజ తిరిగి కొంచెం పెద్ద గొంతుతో అన్నది, "అయితే, నీ కిదివరలో జ్వరాలు వస్తున్నందువల్ల నీలో జ్ఞానోదయం అయింది. మరి యిప్పుడు నీకు జ్వరాలు రావడంలేదు కనుక నీలోని జ్ఞానోదయం అస్తమించి పోయిందన్నమాట: అంటే నేను అజ్ఞానంలోనుంచి జ్ఞానంలోకి ప్రవేశిస్తూంటే నీవు జ్ఞానంలోనుంచి అజ్ఞానంలోకి ప్రవేశిస్తున్నావని అర్థం."

## ఎవరు జ్ఞానులు?

అవును, నీరజ చెప్పినదానిలో యెంతో సత్యముంది. ఆమె యింటినుంచి హిమాలయాలకు వెళ్ళబోతోంది; అంటే అజ్ఞానంనుంచి జ్ఞానంలో ప్రవేశించబోతోంది. ఇక నేను హిమాలయాలనుంచి యింటికి వెళుతున్నాను. అంటే జ్ఞానంనుంచి అజ్ఞానంలో ప్రవేశించబోతున్నాను: అయితే, హిమాలయాలలో వున్నవారంతా జ్ఞానులా? ఇళ్ళదగ్గర వున్నవారంతా అజ్ఞానులా? మరి నేను హిమాలయాలలో చాలామంది అజ్ఞానులను చూశానే! ఇళ్ళదగ్గర వుండేవారిలో జ్ఞానులనుకూడా చూశానే!

నాలుగురోజులలో నీరజ జ్వరం తగ్గిపోయింది. మళ్ళీ నీరజతో అన్నాను: "నీవు నాలుగురోజులపాటు మంచంలో పడుకొని జ్ఞానోదయంలో విహరించావు; మళ్ళీ యిప్పుడు మంచందిగి అజ్ఞానంలో ప్రవేశించావు" ఇందుకు నీరజకు జవాబు దొరకక తలత్రిప్పి వూరుకొంది.

లక్నో విశ్వవిద్యాలయంలోని కళాసమితివారు ఆ సాయంత్రం అసిత్ కుమార్ హాల్దార్ కళాప్రసంగం ఏర్పాటుచేశారు. ఒక అరగంట ముందుగా మేమంతా వెళ్ళాము. చరిత్రలో ప్రవీణులైన రాధా కుముదముఖర్జీ, సామాజిక విజ్ఞానంలో దిట్టఅయిన రాధాకమల్‌ముఖర్జీ, వృక్షవిజ్ఞానంలో కోవిదుడైన బీరబల్ సహానే మొదలైనవారంతా ఆ ప్రసంగానికి హాజరయినారు. నన్ను వారందరకు పరిచయంచేశారు హాల్దార్.

హాల్దార్ తన ప్రసంగంలో సాహిత్య కళలకు, రూపకళలకువున్న భేదాన్ని, ఐక్యతను, చిత్రకళకు, శిల్పకళకువున్న సంబంధాలను, వివిధప్రక్రియల ప్రభేదాలను, విషయ వస్తువులోని ప్రాధాన్యాన్ని, అప్రాధాన్యాన్ని రూపంగల భావాన్ని, భావంలేని రూపాన్ని, వర్ణ విన్యాసానికి, రసానుభూతికి వున్న అనుబంధాన్నిమొద

లయిన వాటి నెన్నింటినిగురించో చర్చించారు. ఉపన్యాసం బాగా రక్తికట్టింది అన్నారు హాజరయినవారు అందరు. అదే సమయంలో హాల్దార్ నూతనంగా రచించిన కొన్ని చిత్రాలనుకూడా అక్కడున్నవారికి ప్రదర్శించారు. కొందరు ఒకటి బాగున్నదంటే మరికొందరు మరొకటి బాగున్నదన్నారు. ఈ విధంగా లోకం భిన్న రుచిని కనపరచింది. అప్పుడు నాకు దృఢపడింది కళాసృష్టి, ఆస్వాదనాకూడా వస్తుగతమైనవికావు వ్యక్తిగతమైనవని. అయితే వస్తుగత స్థాయి అంటూ కూడా కొంతభాగం వుండకపోదు.

సభానంతరం కొందరు ప్రముఖులు హాల్దార్‌ను సమీపించి తన చిత్రాలలో ఏ చిత్రం తన కెక్కువగా నచ్చింది అని ప్రశ్నించారు. అందుకు హాల్దార్ నవ్వుతూ అన్నాడు. "మీ అందరికీ నచ్చిన నా చిత్రాలు నాకు నచ్చలేదు. మీ అందరికి ఏ చిత్రాలైతే వీటిలో నచ్చలేదో అవి నాకు నచ్చుతాయి."

ఇక మళ్ళీ నా ప్రయాణాన్ని గురించి ఆలోచించసాగాను. నీరజతో సంప్రతించి ప్రయాణపు రోజును నిర్ణయించదలచాను. ఇంతలో నీరజ తానే వచ్చింది. ఇద్దరం కూర్చుని యిద్దరి ప్రయాణాల తేదీలను కొంచెం వేదనా హృదయాలతోనే నిశ్చయించుకొన్నాం. నేను వెళ్ళిన మూడవరోజున నీరజ హిమాలయాలకు వెడుతుంది. విడబడిపోవడాన్ని పరస్పరంగా చూడగలుగుతున్నాంకాని పునర్మిలనాన్ని మళ్ళీ చూడకలుగుతామా అన్నాను నేను. అనే నా కళ్ళలోను, వినే ఆమె కళ్ళలోనుకూడా నీళ్ళు తిరిగినాయి. మళ్ళీ ముఖాలలోకి లేని నవ్వును తెచ్చిపెట్టుకొని ఒకరి నొకరు మోసంచేయ ప్రయత్నించాం.

వియోగం అంటే యేమిటి, సంయోగమంటే యేమిటి అని చర్చించుకొని, రెండూకూడానిజమైనవికావని, రెండూకూడా తాత్కాలికకల్పితాలే అని, మనిషి సంయోగ వియోగాలకు అతీతుడుగా వుంటేనేకాని నిజమైన ఆనందాన్ని పొందడని, అసలు ఒక అర్థంలో చూస్తే నిరంతరమూ సంయోగమేకాని వియోగమనేది లేనేలేదని తేల్చి సంతృప్తిపొందాము. క్రింద భూమిమీద నిలచిన వాళ్ళను ఒకవేళ నదులు, పర్వతాలు వేరుచేసినా మనపైనున్న ఆకాశంమాత్రం ఎంతదూరాన వున్నవాళ్ళను కూడా కలిపే వుంచుతుంది. కనుక మానవులు ఆకాశం క్రింద వున్నంతకాలం వాళ్ళకు వియోగమంటూ వుండదు. ఆకాశపు నీలిముసుగు నిరంతరం మనను సంయోగంతోనే కప్పివుచ్చుతుంది.

# నాలో రేగిన సాహిత్య పిపాస

అది పందొమ్మిదివందల ముప్పయితొమ్మిదవ సంవత్సరం సెప్టెంబర్ మాసం. రెండవ ప్రపంచ మహాయుద్ధం ప్రారంభమయింది. నేను హిమాలయాల నుంచి లక్నోకు, లక్నోనుంచి తుమ్మపూడి తిరిగివచ్చి రెండుసంవత్సరాలు కావస్తున్నది. ఈ రెండు సంవత్సరాలనుంచి ఎటూ దూరపు ప్రయాణాలు చేయలేదు. నాలో నేను జీవిస్తున్నాను. వివిధ సాహిత్యాలను, వివిధ భావవాహినులను అధ్యయనం చేస్తున్నాను. ప్రయాణాలలో పరిచితులైన వివిధ మిత్రులతో వివిధ భాషలలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాను. వీరిలో అసిత్‌కుమార్ హాల్దార్‌ది ప్రధానపాత్ర. తరచుగా ఉత్తరాలు వ్రాస్తూ నా రస జగత్తుకు చైతన్యం ప్రసాదిస్తున్నాడు.

రెండు సంవత్సరాలనుంచి ఎటూ పయనించక యింటిదగ్గరే శయనించి వుండటంలో కూడా ఒక హాయి కనిపించసాగింది. సంచారంలో ఒక హాయి, సంచరించకపోవడంలో మరొక హాయి. పాము పడగవిప్పి ఆడటంలోనూ ఆనందం పొందుతుంది. ఆడి ఆడి ఆ పడగను ముడిచి చుట్టచుట్టుకొని పడుకోడంలోను ఒక ఆనందాన్ని పొందుతుంది. అయితే శాశ్వతంగా ఈ తరహాగా ముడుచుకొనే పడుకోవడం వుండదు. తనకు ఇచ్ఛకలిగినప్పుడు మళ్ళీ పడగను విప్పగలను గదా అనే దైర్యోత్సాహాలతో నిండిన ఆశావాదం ఈ ఆనందానికి కారణం.

ఇంతవరకు నాకు తెలుగు సాహిత్యంతోను, తెలుగు సాహితీ జీవులతోను పరిచయం లేదు. అది భావ కవిత్వపుయుగం. తెలుగు పత్రికలను, ప్రత్యేకించి తెలుగు మాస పత్రికలను చదవడం ప్రారంభించాను. తల్లావఝ్ఝలవారు, దేవులపల్లివారు, రాయప్రోలువారు, కాటూరువారు మొదలయిన కవులపేర్లు వినిపిస్తూ వుండేవి. బెంగాలీ, హిందీ, ఇంగ్లీషు మొదలయిన భాషల సాహిత్యాలను చదివివున్న మనసుకు మాతృభాషలోని సాహిత్యాన్ని చదువుతూంటే తల్లివడిలో తలదాచుకొన్నంత హాయి కలగసాగింది.

ఇటువంటి మృదుమధురమైన సాహితిని సృష్టించే తెలుగు సాహితీపరులు ఏ విధంగావుంటారో వారు ఏమి తిని ఆకలిని బాపుకొంటారో, ఏమి తాగి దప్పికను తీర్చుకుంటారో, ఎటువంటి నోటితో మాటలు మాటాడుతారో అనే కుతూహలం ఎక్కువ కాసాగింది. ఇటువంటి తరుణంలో మధురకవి, వివిధ భాషలతో పరిచ

యంగల సహృదయులు, పండితులు, శల్లాప్రగడ శివశంకరశాస్త్రిగారు. తుమ్మపూడి రావడం సంభవించింది. అప్పుడు వారు మాకు ఎక్కువ దూరంలేని ఒక గ్రామంలో వుంటున్నారు. వారికి, నాకు పరిచయం ఏర్పడింది. భావ కవులవలెనే వున్నారు. వారి ముఖంలో కవిత ప్రకాశిస్తూవేవుంది. నా హిమాలయ వ్యాసాన్ని గురించి, లక్నో మకాముల గురించి, నా భాషా పరిజ్ఞానాన్నిగురించి తెలుసుకొని తెలుగులోకూడా కృషిచేయమని సలహాలిచ్చారు. తెలుగు సాహితీ ప్రపంచ ప్రథమంగా చూడడం శివశంకరశాస్త్రిగారివే. నా దగ్గర అప్పుడున్న సుప్రసిద్ధ సంగీతజ్ఞుడు, సాధకుడు, కవి అయిన దిలీపకుమార్‌రాయ్ రచించిన బెంగాలీ పుస్తకం "అనామీ"ని శివశంకరశాస్త్రిగారు చదివేందుకు తీసుకువెళ్ళారు.

## "అనామి" ప్రభావం

నా సాహిత్య జీవితంమీద "అనామీ" ఎంతో ప్రభావాన్ని కలిగించింది. అదొక విచిత్రమైన గ్రంథం. దిలీపకుమార్‌రాయ్ రచించిన బెంగాలీ, ఇంగ్లీషు కవితలు, అనువాద కవితలు మాత్రమేకాక దానిలో తనకు శ్రీ అరవింద, రవీంద్రనాథ్, శరత్‌చంద్ర, బెర్ట్రాండ్ రస్సెల్, సుప్రసిద్ధ ఐరిష్ కవి, చిత్ర కళాకారుడు అయిన "ఎ.ఇ."అనబడే జార్జి రస్సెల్, రోమారోలా, కృష్ణప్రేమ అనబడే రొనాల్డ్ నిక్సన్, లారెన్స్, డికిన్‌సన్, హరీంద్రనాథ ఛటోపాధ్యాయ మొదలైన మహామహులు వ్రాసిన మనోజ్ఞమైన ఉత్తరాలుకూడా అందులో ఎన్నో వున్నాయి. కవితా శిల్పాన్నిగురించి, జీవన విధానాన్నిగురించి, తాత్త్వికచింతనమునుగురించి, ఎన్నో కౌతుహలంగల విషయాలనుగురించి వీరి ఉత్తరాలలో చర్చించారు. వీటిలో ఒక ఉత్తరంలో హరీంద్రనాథ ఛటోపాధ్యాయ రచించిన ఆంగ్లకవిత నన్నెంతోముగ్ధుణ్ణి చేసింది.

**"A crystal wall is built around**
**The spirit's tall enchanted tower**
**Where in shall enter no bird's sound**
**Nor even the perfume of a flower.**

ఈ "అనామీ" అనే దిలీప్‌కుమార్‌రాయ్ పుస్తకం నాకెంతో కాంతివంతమైన ప్రేరణ ఇవ్వసాగింది.

శివశంకరశాస్త్రిగారు "అనామి"ని చదివి త్వరలో తిరిగి దానిని పంపించారు. దానితోపాటు వారు రచించిన చిన్నిగేయనాటిక "పద్మావతీ చరణచారణ చక్రవర్తి" అనేదాన్ని పంపించారు. దాన్ని చదివితే దానిలోని పదాలకూర్పు, భావమాధురి మొదలైనవి నాకెంతో ఆనందాన్ని ప్రసాదించాయి.

"కావ్యలోకమునందు రాధాకాంతుచే నమపించు పలుకులు
ఈ ప్రపంచమునందు నాకా ఎట్లు వర్తించున్"

శాస్త్రిగారి గేయనాటికలోని ఇటువంటి చరణాలన్నీ ప్రత్యేక ఆకర్షణీయంగా కనిపించసాగాయి. ఇటువంటి కవితా శిల్పాన్ని నేనుకూడ సృష్టించ గలిగితే ఎంత ఆనందమో అనిపించేది. వెంటనే అనిపించేది-నేను సృష్టిస్తేనే ఆనందమా ఇతరులు సృష్టించిన వాటిలో ఆనందముండదా, ఇతరులు సృష్టించిన వాటిని చదివితే మరి నాకు బాగానే ఆనందం కలుగుతూందిగా, అటువంటప్పుడు నేను స్వయంగా ఎందుకు సృష్టించాలి? ఇతరులు సృష్టించినవి నేను చదివి ఆనందిస్తే, నేను సృష్టించిన వాటిని యితరులు చదివి ఆనందించటానికని నేను సాహిత్యాన్ని సృష్టించాలా? ఇతరులు సృష్టించినవి తప్ప ఎవరు సృష్టించుకొన్నవి వారికి ఆనందమివ్వవా? ఇస్తాయి. తాను సృష్టించినవి యితరులకు ఆనందాన్నిమాత్రమే యిస్తవని నమ్మకమేమిటి? ఇతరులకు అవి నచ్చనూవచ్చు. నచ్చకపోనూవచ్చు. కాని తాను సృష్టించినవి తనకు నచ్చటంమాత్రమే జరుగుతుంది. కాని నచ్చకపోవడమనేది జరగదేమో. తనకు తన ప్రతిరచనా నచ్చటంమాత్రమే జరుగుతుంటే తన రచనలలోని గుణదోషాలు ఏ విధంగా తనకు తెలుస్తాయి?

## తెలుగులో నా ప్రథమ రచన

ఎందుకనో స్వయంగా ఏమైనా తెలుగులో రచించాలంటే ధైర్యం చాలేది కాదు. కవితలు రచించకుండా ముందుగా తెలుగులో వచన రచనలు చేయాలనుకున్నాను. కల్పనా సాహిత్యాన్ని రచించడానికంటె వ్యాసరచన చేయబుద్ధి అయేది. వ్యాసరచనమీది ఈ ప్రేమయే నాచేత "కళా-విజ్ఞానము" అనే వ్యాసాన్ని వ్రాయించింది. ఇది తరువాత ఏదో మాస పత్రికలో వెలువడింది. చదివినవారు బాగున్నదన్నారు. ఇంగ్లీషులో అదివరకే యేదో ఒకటి వ్రాస్తున్నప్పటికి తెలుగులో ఇదే నా మొదటి రచన.

ఇందులో హృదయజనితమైన కళాదృష్టిని, మేధాజనితమైన వైజ్ఞానికదృష్టిని వాటి మధ్యవున్న ప్రధాన భేదాన్ని వివరించాను. కళాసృష్టి సంశ్లేషణాత్మకమని,

వైజ్ఞానిక దృష్టి విశ్లేషణాత్మకమని. నీటి ప్రవాహాన్ని కళాదృష్టి ఆనందిస్తూంటే ఆ నీటిలో ఆక్సిజన్ ఒకపాలు, హైడ్రోజన్ రెండుపాళ్ళు అని లెక్కవేస్తుంటుంది వైజ్ఞానిక దృష్టి అని-ఈ విధంగా ఆ వ్యాసంలో వ్రాశాను.

ఇది వ్రాసిన తరువాత మళ్ళీ వాంరోజులంపనకు వ్రాసినట్టులేదు. నాలోచనాత్మకమైన సృజనమూలక దశా. ఆలోచనాత్మకమైన సమీక్ష మూలక దశా సమానంగా వున్నాకూడా నేను స్వయంగా రచించాలంటే సమీక్ష మూలక దశయే సులభంగా వ్యక్తమయేది. నేను కవినికాక విమర్శకుడనే ఎక్కువభాగం అవుతానేమో అని పించేది.

ఇంటిదగ్గర రెండు సంవత్సరాలు ఎటూ ప్రయాణాలు లేకుండా వుండేసరికి మళ్ళీ ఎటయినా ప్రయాణించితే బాగుండునని అరికాలులో జిల కలగసాగింది. కాని అవి ద్వితీయ మహాయుద్ధం ప్రారంభించినరోజులు. ఎటు చూచినా అంతా వ్యతిరేక వాతావరణం. ఎన్నో వేలమైళ్ళలో యుద్ధం జరుగుతున్నాకూడా అది మనదేశం లోనే జరుగుతున్నదన్నంత అశాంతి, అల్లకల్లోలం ప్రబలివున్నాయి దేశంలో. దేశనాయకులకు బ్రిటిష్ ప్రభుత్వానికి మధ్య యుద్ధ ఆదర్శాలను గురించి ఐక్యభావం కుదరనందువ ఏ సమయంలో మన దేశంలో యేమి ప్రమాదం సంభవిస్తుందో అన్నట్లు దేశమంతా అగ్నిపర్వతంవలె వుంది.

నిత్యం వార్తా పత్రికలను శ్రద్ధతో చదివేవాణ్ణి. హిట్లర్ సైన్యాలు ముందుకు పురోగమిస్తున్నాయంటే ఎంతో సంతోషం కలిగేది. బ్రిటిష్ ప్రభుత్వం మీదవున్న ద్వేషంవల్ల అభిమానం జర్మనీ, జపానులమీద ఎక్కువవుతూ మిత్రమండలి సైన్యాల పరాజయాన్ని కోరుతూండడం జరిగింది. జర్మనీ విజయం పొందితేనే కాని బ్రిటన్ అపజయం పొందదు, బ్రిటన్ అపజయం పొందడం అంటే భారత దేశానికి స్వాతంత్ర్య ప్రాప్తి అనే అర్థం।

ఇటువంటి కల్లోల వాతావరణంలో ఎటూ ప్రయాణాలు చేయడంలో సుఖం లేదని ఆ ప్రయత్నాలు మానుకొని సాంస్కృతిక సాధనలోనే నిమగ్నమై వుండిపో ప్రయత్నించాను.

ఒకవైపున గంభీరమైన తాత్వికచింతన, సాహిత్య విమర్శలు ఎంత ఆనందం యివ్వసాగేవో, మరోవైపున బెంగాలీ మాసపత్రికలలో వెలువడే వర్ణ చిత్రాలు, చిత్రకళకు సంబంధించిన సమీక్షాత్మక రచనలు అంత ఆనందం ఇవ్వ సాగాయి. కాని, నేనెన్నడూ రూపసృష్టి చేయ ప్రయత్నించలేదు. చిత్రాస్వాదన

తప్ప చిత్రలేఖనం ప్రారంభించలేదు. ఒక విధంగా రసవిజ్ఞానం (**Aesthetics**) మీద ప్రీతి అధికం కాజొచ్చింది. చిత్రాల ఆల్బమ్‌లను సేకరించడంలోను, వాటిలోని చిత్రాలను చూచి ఆనందించడంలోను విశేషానందం కలగసాగింది. చిత్రాలలోకూడా మానవమూర్తుల చిత్రణకంటే ప్రకృతి చిత్రణ మెంతో హృదయాన్ని ఆకర్షించేది. అదే విధంగా పశుపక్ష్యాదుల చిత్రాలుకూడా ఎంతగానో ఆకర్షించాయి. దూరప్రాచ్య చిత్రాలమీద మోజు ఎక్కువైంది.

బెంగాలీ మాసపత్రికలలో మనోజ్ఞమైన చిత్రాలు వెలువడేవి. ఒక పెద్ద ఆల్బమ్ తెచ్చి ఆ పత్రికలలోని ఉత్తమ చిత్రాలన్నిటినీ కత్తిరించి ఆ ఆల్బమ్‌లో అంటించి దాన్ని ఒక సుందర చిత్రసంపుటి చేశాను.

లక్నోలోని ప్రిన్సిపాల్ హాల్దార్‌నుంచి ఉత్తరాలు వస్తున్నాయి కాని ఆల్మోరా దగ్గిర ఆనందమాయీ ఆశ్రమానికి వెళ్ళిపోయిన నీరజనుంచి మాత్రం ఉత్తరాలేమీ లేవు. బహుశా ఆ ఆశ్రమాధిపతులు ఆశ్రమవాసులు ఉత్తరాలువ్రాస్తే వారుకోరేమో అనుకొన్నాను అందువల్ల నేనుకూడా వ్రాయదలచలేదు. ఆల్మోరా దగ్గరలోవున్న ఉత్తర బృందావన్ అనే మరో ఆశ్రమంలో వుంటున్న ప్రొఫెసర్ రొనాల్డ్ నిక్సన్ (కృష్ణప్రేమ)తో నాకు నూతనంగా ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి. నిక్సన్ బ్రిటన్‌నుంచి వచ్చి లక్నో యూనివర్శిటీలోను, బనారస్ హిందూ విశ్వవిద్యాలయంలోనూ ఇంగ్లీషు ప్రొఫెసర్‌చేసి చివరకు సన్యసించి కృష్ణప్రేమ అనే పేరుతో ఆల్మోరాదగ్గర ఒక ఆశ్రమంలో ఆత్మసాధనలో వుంటున్నాడు. ఆయనకు నేను వివిధ విషయాలను గురించి ఉత్తరాలు వ్రాస్తుండేవాణ్ణి. ఆయన మంచి సమాధానాలతో ఉత్తరాలు వ్రాసేవాడు తిరిగి. ఆయన బ్రిటిష్‌వాడయినప్పటికీ బ్రిటిష్ ప్రభుత్వం అంటే ఆయనకేమాత్రం గిట్టేదికాదు।

# ప్రాపంచిక, పారలౌకిక తత్వాల సంఘర్షణ

"బొంబే క్రానికల్" అనే ఆంగ్ల వారపత్రిక బొంబాయినుంచి వస్తుండేది. చాలా విలువైన వ్యాసాలుంటుండేవి అందులో. ప్రత్యేకంగా సాంస్కృతిక విషయాలకు అందులో విశిష్టస్థానం యిస్తుండేవారు. అది సచిత్ర వారపత్రిక. అందులో ప్రతివారం విఖ్యాత కళాసమీక్షకులైన కనయలాల్ వకీల్ కళలను గురించి సమీక్షాత్మక రచనలు చేసేవారు. ఇవి బెంగాలీవారికి అంతగా గిట్టేవికావు. చిత్రకళలో బెంగాల్ సంప్రదాయానికి, బొంబాయి సంప్రదాయానికి చాలా తారతమ్యం వుండేది. అతిమార్దవానికి బెంగాల్ సంప్రదాయం ప్రాతినిధ్యం వహిస్తే, అతి బలీయతకు బొంబాయి సంప్రదాయం వహించేది. మొదటిది దూరప్రాచ్య దేశాలవైపుకు చూస్తుంటే, రెండవది పాశ్చాత్య దేశాలవైపుకు చూచేది.

ప్రతి వారం "బొంబే క్రానికల్" నిమిత్తం ఎంతో ఆతుర హృదయంతో నిరీక్షించేవాణ్ని. ఒకవారం అందులో రెండు కళాగ్రంథాలనుగురించి మంచి విశదమైన సమీక్ష వెలువడింది. ఒకటి హంగేరియన్ చిత్రకారిణులైన సాస్‌బ్రిన్నర్, ఎలిజబెత్ బ్రిన్నర్ అనే తల్లీ కూతుళ్ళు రచించిన చిత్రాల సంపుటి. రెండవది సుప్రసిద్ధ బౌద్ధ పండితుడు, చిత్రకారుడు అయిన జర్మన్ భిక్షువు అనాగరిక గోవింద రచించిన సచిత్రగ్రంథం. మొదటిదానికి హిందీ, ఇంగ్లీషు రెండు భాషలలోను పేర్లున్నాయి. హిందీలో "అద్భుత భారత" అని. ఇంగ్లీషులో "మిస్టిక్ ఇండియా" అని, రెండవదానిపేరు "ఆర్టు అండ్ మెడిటేషన్" అని. ఆ రెండు పుస్తకాలను తెప్పించాలని విపరీతమైన అభిలాష జనించింది. వెంటనే వి. పి. ద్వారా పంపమని వ్రాశాను. వ్రాసిన రోజునే అవి రావు. రెండవరోజున రావు, మూడవరోజున రావు. బొంబాయినుంచి వారంరోజులకుకాని అవి రావు. మరి వాటి నిమిత్తం వారంరోజులు వేచివుండాలంటే చాలా బరువుగా కనిపించింది.

చివరకు ఒకరోజున ఆ రెండు పుస్తకాలూ రానేవచ్చినాయి. ఇక నా ఆనందానికి మేరలేదు. పార్శిలుతెచ్చి ఏకాంతంగా కూర్చుని విప్పిచూస్తే నేను వాటిని ఏవిధంగా వుంటాయని నిరీక్షించానో అంతకంటె యింకా ఎక్కువ రమ్యంగా వున్నాయి. ఒక్కొసారి మనం వాటిని నిరీక్షించిన రూపంకంటె అవి తక్కువగా వుండి నిరాశ కలిగిస్తాయి. మరోసారి కొన్ని ఎక్కువగావుండి ఆనందాన్ని కలిగిస్తాయి.

"మిస్టిక్ ఇండియా", "ఆర్ట్ అండ్ మెడిటేషన్" ఈ రెంటిలో ముందుగా దేన్ని తెరచి చూడాలా అని ముందుగా మొదటిదాన్నే తెరచిచూచాను. నిజంగా అద్భుతంగావుంది. ఎన్నో చిత్రాలు కనులకు కాంతి నిచ్చాయి; ఎన్నో వాక్యాలు మనసుకు శాంతి నిచ్చాయి. శ్రీమతి సాస్‌బ్రన్నర్ రచించిన బుద్ధుని తలనుగురించి బాయీ బిష్ అనే సమీక్షకుడు వ్రాసిన వాక్యాలు నాకెంతో ప్రేరణ కలిగించినాయి.

**"The closed, yet all-knowing eyes, the perfect, truthful consoling ljps--the powerful gentle presence of that master mind breath the calm visage, must surely represent Gautama as he was when he found what he had sought for So long in the cradle land of men so many centuries in the past."**

ఆమె చిత్రించిన చిత్రమే ఎక్కువ రమ్యంగా వున్నదో, దాన్నిగురించి రచించిన ఆ సమీక్షకుని వాక్యాలే ఎక్కువ రమ్యంగావున్నవో నిర్ణయించజాలక పోయాను. ఈ వాక్యాలను చూచి ఆమె చిత్రించినా, ఆ చిత్రాన్ని చూచి యీ వాక్యాలు రచించినా దేనికేది వ్యాఖ్యయో తెలియడంలేదు. చిత్రానికి సాహిత్య వ్యాఖ్య, లేక సాహిత్యానికి చిత్రవ్యాఖ్యా? వాక్కును రూపం వ్యక్తపరచినట్లా లేక రూపాన్ని వాక్కు వ్యక్తపరచినట్టా? ఒకదాని కొకటి వ్యాఖ్య కాకపోయినా కూడా దేనికదే స్వతంత్ర రచనలుగా మనగలవు.

## నగ్నసుందరి : ఇంద్రధనుస్సు

ఈ సంపుటిలోని చిత్రాలలో సాస్‌బ్రన్నర్ రచించిన మరోచిత్రం "ఇంద్రధను ఆకాంక్ష అనేది ప్రత్యేకమైంది. సరస్సులో ఆకాశంలోని ఇంద్రధనువు ప్రతిబింబిస్తూంటుంది. ఒక నగ్నసుందరి ఉత్తుంగ స్తనాలతో ఆ నీటిలో నిలచి వుంటుంది నీటిలోనుంచి వికసించిన కమలాన్ని కుడిచేతితో స్వీకరిస్తూ ఎడమ చేతితో తన స్తనాన్నితీసి యివ్వటానికి సిద్ధంగా వున్నట్టుంటుంది. పుచ్చుకొన్నప్పుడు యిచ్చుకోవడంకూడా వుండాలని, సరోవరంనుంచి కమలాన్ని స్వీకరిస్తుంది కాని తిరిగి సరోవరానికి యివ్వడానికి తన నగ్నశరీరంమీద ఏముంది కనుక? అందుకని తనకు ప్రాణంతో సమానమైన తన సుందర కుచద్వయంనుంచి ఒక కుచాన్ని తీసి సరోవరాని కివ్వడానికి సిద్ధంగావుంది ఆ నగ్నసుందరి.

ఈ విధంగా ఆ సంపుటినిండా శక్తిబిద్దలు రచించిన ఎన్నో మనోహరమైన చిత్రాలు. మానవమూర్తులని, ప్రకృతినికూడా వున్నాయి. ఆ పుస్తకం ఒక రూపరాశి. ఒక వర్ణసంగీతం!

ఒక జర్మన్ బౌద్ధభిక్షువు అనాగరిక గోవింద పుస్తకం "ఆర్టు అండ్ మెడిటేషన్" మరో విధమైన పుస్తకం. ఈ పుస్తకంలోని చిత్రరచనలనుకాని, అక్షర రచనలనుకాని ఆనందించడానికంటే ఎక్కువ ఆలోచించడానికి పనికివస్తాయి. కళలోని తాత్వికదశను గురించిన వ్యాసాలు, తాను చిత్రించిన కొన్ని నైరూప్య **(Abstract)** చిత్రాలు ఇందులో వున్నాయి. అన్నీ చాలా మార్మిక రూపాలను, తాత్వికార్థాలను కలిగివున్నాయి. గోవింద అంటాడు **"To enjoy works of art means to rediscover Visions of our own soul"** అని కళాకృతులను ఆనందించడమంటే మన స్వీయ ఆత్మను తిరిగి దర్శించడమే అని ఆయనంటాడు. ఇందులో ఆయన రూపరహస్యాలను, వర్ణరహస్యాలను రూపానికి వర్ణానికి వుండే సంబంధాలను విశ్లేషించి చూపుతాడు. బ్రిన్నర్ల పుస్తకం ఆనందాన్నిస్తే, గోవింద పుస్తకం అంతర్దృష్టి నిస్తుంది. అంతర్దృష్టి లేని ఆనందం కాని, ఆనందంలేని అంతర్దృష్టికాని సమగ్రాలు కావు.

సాహిత్య రచనలను చదవడంలో, చిత్రరచనలను చూచి ఆనందించడంలో జీవితం సాగిపోతుంది. ఈ రెంటికి మించిన మరో జగత్తుకూడావుంది; అది అశరీరానుభూతిని పొందే పరాకష్ఠ సాధన. ఈ మూడువిధాల ఆనందాలేనా జీవితంలో అని ప్రశ్నించుకొంటే కాదనే జవాబువచ్చింది. శరీరం యిచ్చే ఆనందం ఏమిటో తెలుసుకోకుండానే శరీరాన్ని అధిగమించిన అశరీరానుభూతి నిమిత్తం సాధనా? ప్రేమ, కామం యీ రెండూ జీవితంలో తక్కువ విలువగలవా అంటే కావని అనిపించింది. మానవుడు ఇంద్రియాలిచ్చే ఆనందాన్ని వదలి అతీంద్రియానందంకోసమే ఎందుకు ప్రయత్నించాలి? స్త్రీ, పురుష సంబంధాలు ఆధ్యాత్మిక జీవితమనబడేదానికి అడ్డంకులా? ఇటువంటి విషయాలు మళ్ళీ రాత్రిందిగళ్ళు మన సును కలవరపెట్టసాగినాయి. శరీరంలో కొన్నిరకాల ఉత్తేజనలు కలుగసాగాయి. కొన్ని సుఖాకృతులు మనోఫలకంమీద ప్రత్యక్షమైనప్పుడల్లా శరీరంలో ఏదో అజ్ఞాత సంవేదన జనించసాగేది. రాత్రులలో నిద్ర మెలకువవచ్చినప్పుడల్లా ఏదో తీరని వంచితనన్న బాధ కల్గసాగేది.

# వివాహ వ్యవస్థ సరైనదేనా?

వివాహాన్ని గురించి, లైంగిక తత్వాన్నిగురించి కొన్ని పుస్తకాలు చదవ సాగాను. వివాహ వ్యవస్థ సమాజంలో అవసరంలేదేమో అనిపించింది. వైవాహికమైన తంతులేకుండా యిద్దరు స్త్రీ పురుషులు ఒకచోట మానసికంగా, శారీరకంగా ఏకమై జీవించడం బాగుంటుంది అనిపించింది. సృష్టిలో స్త్రీలు, పురుషులు ఉభయులు వున్నప్పుడు ఉభయులు కలిసి ఒకరిని మరొకరు ఆనందింపడం ఆధ్యాత్మికానందానికి ఏ విధంగానూ అడ్డురాదని అనిపించింది. శరీరం ద్వారానే శరీరాతీత ఆనందం పొందవచ్చు ననిపించింది. ఆధ్యాత్మిక జీవితం అనేదానికి విరాగం అవసరంలేదు. అనురాగం వుంటేచాలు. విరాగమార్గం యిష్టమున్నవారు దాన్ని అవలంబించి పరమ లక్ష్యాన్ని అందుకోవచ్చు. అనురాగమార్గం యిష్టం వున్నవారు దీన్ని అనుసరించి పరమలక్ష్యాన్ని అందుకోవచ్చు. ఏదీ అక్రమపద్ధతికాదు. కనుక పరాతత్వ పథంలో పురుషునికి స్త్రీకాని, స్త్రీకి పురుషుడుకాని అడ్డంకికాదు. అడ్డంకులు కాకపోగా సహాయకులు కూడా అవుతారు. ప్రాచీన తత్వరీత్యాను నవీన తత్వరీత్యాను కూడా ఈ సత్యం సమర్థనీయమని తేలింది.

వివాహితులలోనూ గొప్పవ్యక్తులున్నారు, అవివాహితులలోను గొప్పవ్యక్తులున్నారు. వివాహితులలోను పనికిమాలినవారున్నారు, అవివాహితులలోను పనికిమాలినవారున్నారు. కనుక వివాహంకాని అవివాహంకాని ఒక వ్యక్తిని మహనీయునిగా చేయదు, హీనునిగా చేయదు. ఆ ఆ వ్యక్తిలోని అర్హతానర్హతాలే వివాహాన్ని కాని, అవివాహాన్ని కాని మహనీయంగానో, హీనంగానో చేస్తాయి. కనుక వివాహంలో సౌఖ్యం వున్నదనుకొనేవారు వివాహం చేసుకోవచ్చు. లేనివారు చేసుకోకుండా వుండవచ్చు. ఈ రెండు దశలలో ఏ దశకూడా మానవ ప్రగతికి ఆటంకాలు కావు అని మున్నాటికీ విశ్వసించాను. వారి రూపం, వారి వాక్కులు, వారి సాన్నిధ్యం ఆనందదాయకంగానే తట్టసాగినాయి.

అయితే మానవప్రేమ దుఃఖాన్ని తెలుసుకోదేమో. ఒక వ్యక్తిని గాఢంగా ప్రేమిస్తే, ఆ తరువాత ఆ వ్యక్తి మరణిస్తే అప్పుడు దొరకేది ఆనందానికి బదులు దుఃఖమేగా. అందుకే నశించేవాటిని ప్రేమిస్తే దుఃఖం తప్పదనేది. అందుకని నశించనిదాన్ని ప్రేమిస్తే ఆనందంకూడా నశించదు. మరి అటువంటి నశించనిదాన్ని ప్రేమించాలంటే నశించని పదార్థమొకటి వుండాలిగదా? ఇంద్రియగోచరమైనవన్నీ నశిస్తాయి కనుక ఇంద్రియగోచరం కానిది నశించదు. నశించనిది ఏది కాదో తెలు

స్తుంది. కాని ఏదో అప్పుడో తెలియడంలేదు. వశించని పదార్థం మనిషికాదు, పశువు కాదు, ఇల్లుకాదు, వాకిలికాదు, కొడుకుకాదు, లోయకాదు, చెట్టుకాదు, పుట్టకాదు, అది మరి యేమిటి? ఇదికాదు, అదికాదు, ఏదికాదు. అందుకే "నేతినేతి" అన్నారు. చివరకు ఇతి అన్నారు ఆర్ష సాధకులు. ఇవన్నీ కానిదేదో అదీ వశించని పదార్థం. ఆ పదార్థం చాలా నైరూప్యమైనది, అది కంటికి కనుపించదట, చెవికి వినిపించదట, స్పర్శకు తగలదట. ఇవన్నీ లేనప్పుడు అది యింకా నశించేదేమున్నది? కనుక అటువంటి వశించనిదాన్ని ప్రేమిస్తే ప్రేమించినవారి ఆనందం వశించదు అని.

అయితే, ప్రేమించిన వాళ్ళెప్పుడో నశిస్తారని ఆనందమయమైనట్టి మానవులను ప్రేమించకుండావుంటే సుఖమా? కనిపించే, వినిపించే, స్పర్శకు తగిలే వస్తువులను, వ్యక్తులను, ప్రదేశాలను ప్రేమించడం కుదురుతుందికాని వీటన్నిటికి దూరమైన కనుపించని, వినుపించని, స్పర్శకు తగలని పదార్థాన్ని ప్రేమించడం ఏవిధంగా? ఒక వ్యక్తిని మనసారా, గాఢంగా ప్రేమించినప్పుడు ఆ వ్యక్తి చనిపోతే దుఃఖం, విపరీతమైన దుఃఖం కలిగేమాట వాస్తవమే. ఏమి దుఃఖం కలిగితే? దుఃఖం కలిగితే దుఃఖించవచ్చు. తాను ప్రేమించిన వ్యక్తి జీవించివుండగా ఆనందం పొందిన ప్రేమహృదయం నేడు ఆ వ్యక్తి లేనప్పుడు దుఃఖం అనుభవించడం బాధగా ఎందుకుండాలి? ఆనాడు సంయోగంలో ఆనందాన్ని అనుభవించిన హృదయంతోనే నేడు వియోగంలో దుఃఖాన్ని మధురంగా అనుభవించ గలగాలి. ఆ దుఃఖంకూడా ఆనందంగానే తట్టాలికాని బాధగా తట్టరాదను. ఆనందబాష్పాలకు, దుఃఖ బాష్పాలకు భేదం వుండరాదు.

మనసుకు ఇటువంటి స్థితి అబ్బితే నశించేదాన్ని ప్రేమించినాకూడా నశించనిదాన్ని ప్రేమించినట్టే. అయితే యిటువంటి స్థితిని అంటే ప్రియావియోగంలో కలిగే దుఃఖాన్నికూడా మధురంగా అనుభూతిచెందే స్థితిని అందుకోవడం సులభంకాదు. ఇందుకు యెంతో సాధన అవసరం. దుఃఖాన్ని మధురంగా అనుభూతి చెందడం అంటే ఆనందించడమనే అర్థం. అంటే ప్రియుల సంయోగంలోను, వియోగంలోను కూడా ఆనందాన్నే అనుభవించడం అవుతుంది. దీని అర్థం దుఃఖాన్ని జయించినట్టే! నశించేది, నశించనిది అనే తారతమ్యమే వుండదు అప్పుడు.

# బహిరంగసభలో నా ప్రథమోపన్యాసం; జనన, మరణాల మధ్యగల అనంత అగాధం

ద్వితీయ ప్రపంచయుద్ధం దాగా సాగిపోతూంది. జర్మన్ల విజయదుం దుభి ప్రపంచం నాలుగుమూలలా మ్రోగిపోతూంది. పందొమ్మిది వందల నలభై య్యో సంవత్సరం ప్రవేశించింది. ప్రతిమారు నూతనసంవత్సరం ప్రవేశించినపుడల్లా నా వయసు మరొక సంవత్సరం ఎదిగింది అని సంతోషించేవాడిని. ఈ సంవత్సరంలో కొం దరు ప్రముఖులతో నూతన పరిచయాలు ప్రారంభమైనాయి. ఉత్తర ప్రత్యుత్తరాల సంఖ్య అధికమైంది. నిత్యమూ టపావేళకు పోష్టుఆఫీసుకు హాజరు కావడం ఒక నిషాక్రింద తయారయింది. ఏ రోజు ఎన్ని ఉత్తరాలు ఎక్కువవస్తే ఆరోజు అంత సంతోషించేవాణ్ని.

ఉత్తరాలు అందుకోడంలోను, తిరిగి వ్రాయడంలోనూ ఎంతో అభిరుచి, ఆనందమూ ఏర్పడినాయి. అయితే నేను వ్రాసే వాటిలో కాని, అందుకొనే వాటిలో కాని తెలుగు ఉత్తరాలు వుండేవేకావు. ఆంధ్రలో ఎవరితోనూ ఉత్తర ప్రత్యుత్త రాలు వుండేవికావు. అన్నీ పరప్రాంతాలనుండే వస్తుండేవి. అందువల్ల ఇంగ్లీ షులో, బెంగాలీలో, హిందీలో ఉత్తరాలుండేవి. ఉత్తరాలు వ్రాసేందుకు అంద మయిన కాగితాలను, అనేకరంగులగల కవర్లను సంపాదించటం ఒక యిష్టమైన పని. విదేశీ కవర్లూ, కాగితాలూ ఎంతో ఆకర్షణీయమైన వాటిని సంపాదించి, వాటిమీద వ్రాస్తుండేవాడిని ఉత్తరాలు. ఇందువల్ల కొందరు నాకు వ్రాసే జవాబులలో "మీరు వ్రాసిన కవరూ, కాగితమూ కూడా మిక్కిలి రమణీయంగా వున్నాయి" అనికూడా వ్రాసేవారు. దీని అర్థం నేను వ్రాసిన కాగితం మాత్రమే బాగుండి, కాగితంమీద వ్రాసిన విషయం బాగుండలేదనికదా అని అనుమానించే వాడిని.

## ప్ర థ మ ఉ ప న్యా స ం

ఒకరోజు దుగ్గిరాలలో లైబ్రరీలకు సంబంధించిన సభ ఏదో జరిపి నన్ను కూడా ఆ సభలో ఉపన్యసించమని ఆహ్వానించారు. తుమ్మపూడికి దుగ్గిరాల నాలుగు మైళ్ళే కనుక ఆ సభకు వేళకు వెళ్ళాను. ఆ సభకు అధ్యక్షత వహించారు బెజవాడ లోని క్రొత్త కాలేజి ప్రిన్సిపాల్ డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు. ఆయన

ప్రతిభావిశేషాలను గురించి విని వున్నాను కాని ఆయనను చూడటం అదే ప్రథమం. నన్ను లలితకళల ప్రాముఖ్యాన్ని గురించి ప్రసంగించమన్నారు. నాకి అదే ప్రథమ బహిరంగోపన్యాసం. కొంత సిగ్గు, కొంత సంకోచం వేస్తున్నా కూడా వాటిని అణచి, ఆత్మవిశ్వాసాన్ని పూరించుకొని కొంతసేపు ఉపన్యసించాను. ఏమినా హాజరైవున్న సభికులవైపు చూడకుండా వారికి అవతలగా శూన్యంలోకి చూస్తూ ప్రసంగించాను. మనుష్యులవైపు చూస్తే నోటినుంచి మాటలు వెలువడవేమో అని భయం. ఫరవాలేదు ప్రతిహోపన్యాసం అయినప్పటికీ అంత పెద్దగా లేదు.

నా ప్రసంగం ప్రత్యేకించి సహాధ్యక్షులైన డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచారి గారికి బాగా నచ్చింది. నేను హిమాలయంలో వుండి రావడంకూడా ఆయనకు ఆనందం కలిగించింది. శ్రీనివాసాచారిగారితో ప్రథమ పరిచయమే మైత్రిగా మారింది. ఆరోజే మేముభయులమూ సన్నిహితులం అయినాము. ఒకరోజు బెజవాడ వచ్చి ఆయన యింట అతిథిగా వుండమని గట్టిగా చెప్పారు.

తరువాత ఒక ఆదివారం, నా దగ్గరున్న **"Art and Meditation"** అనే పుస్తకాన్ని (జర్మన్ బౌద్ధ భిక్షువు అనాగరిక గోవిందరచన) తీసుకొని బెజవాడ వెళ్ళాను శ్రీనివాసాచారి గారింటికి. ఆయన, ఆయన సతీమణి చాలా ఆదరించారు. ఆహారాలు, అల్పాహారాలు పెట్టి ఆనందపరచారు. నేను తీసుకువెళ్ళిన **"Art and Meditation"** చూచి ఆయన అమితానందం పొంది చదవడానికి వుంచుకున్నారు. కాని విశేషమేమంటే ఆ పుస్తకం ఆయన చేతిలోనుంచి మరో కాలేజీ ప్రిన్సిపాల్ చేతిలోకి, అక్కడనుంచి ఇంకో ప్రిన్సిపాల్ చేతిలోకిపరిభ్రమించసాగి చివరకు అదితిరిగిరాకుండానే మాయమైపోయింది; ఆరోజు శ్రీనివాసాచారిగారు లండన్‌లోని తన విద్యాభ్యాస అనుభవాలను యెన్నో చెప్పారు. గొప్ప బౌద్ధ పండితులైన ఆనంద కౌసల్యాయన్, రాహుల్ సాంకృత్యాయన్ మొదలైన వారితో కలిసి బ్రిటన్‌లో శ్రీనివాసాచారిగారు బౌద్ధంమీద ఉపన్యాసాలు యిచ్చేవారట, తాము లండన్ విశ్వవిద్యాలయంలో డాక్టరేట్‌కు పరిశోధన చేస్తున్న రోజులలో.

తమ కాలేజీలోని విద్యార్థీ విద్యార్థినులలో చిత్రకళా రసాస్వాదనను పెంపొందించే కార్యక్రమాలు ఏర్పాటు చేయాలనివున్నదని. అందుకు నన్ను తోడ్పడుతుండమని కోరారు. నేను అంగీకరించాను. తరువాత శ్రీనివాసాచారిగారికి ఉత్త

రాలు వ్రాయసాగాను. శ్రీనివాసాచారిగారిలో అపారమైన విద్యావిజ్ఞానా లున్నప్పటికీ ఒక చిన్న అశక్తత వుండేది. వ్యక్తిగతంగా మిత్రులకు పెద్ద ఉత్తరాలు వ్రాయటం ఆయనకు చేతయ్యేదికాదు. అందుకుగాను చాలానొచ్చుకుంటూ అనేవారు: "మన ఉభయుల ఉత్తరాలలో మీ ఉత్తరాలు మాత్రమే నాకు ఉపయోగిస్తాయి, నా ఉత్తరాలు మీకు ఉపయోగించవు."

## విజయవాడ కాలేజీలో ఉపన్యాసం

డాక్టర్ శ్రీనివాసాచారిగారితో మైత్రిమూలంగా తరచుగా బెజవాడ పోతుండటం, ఒకటి రెండు రోజులు వారింట ముకాం పెడుతూండటం మూలంగా తుమ్మపూడిలోని ఏకాంతనివాసంలోని లోటు తీరుతూవచ్చింది. ఒక మధ్యాహ్నం తమ కాలేజీలోని వారి నిమిత్తం నాచేత ప్రసంగం ఏర్పరిచారు ఇంగ్లీషులో. అది వ్రాసుకు వచ్చి చదివే ఉపన్యాసం: **"Appreciation of Formal Arts"** అని దాని శీర్షిక. శిల్పమూ, చిత్రకళా శిల్పుల నిమిత్తమే కాదని, అవి ప్రధానంగా ప్రజల నిమిత్తమే అని, కనుక శిల్పాన్నికాని, చిత్రాన్నికాని ఆనందించేవారంతా శిల్పులూ, చిత్రకారులూ కానవసరం లేదని, ఒకవేళ కాగలిగితే మంచిదే అనీ ఏమేమో ప్రసంగించాను. కొన్ని నమూనాలనుకూడా ప్రదర్శించాను. విద్యార్థీ విద్యార్థినుల ఆటోగ్రాఫ్ పుస్తకాలమీద చైనీయుల సామెత **"If you have two leaves, sell one and buy a lily"** అనేది వ్రాశాను.

ఆహారానికిచ్చేవంత విలువ సౌందర్యానికి కూడా యివ్వాలని సూచిస్తుంది ఆ చైనీయుల సామెత. ఆకలి తీరడంతో మాత్రమే మానవుడు జీవించలేడు. ఆకలి తీరిన తరువాత యింకా తీరవలసిన అవసరాలు చాలా వుంటాయి. ఆ అవసరాలు ఆహారానికంటె తక్కువ విలువయినవికావు. అయితే, మానవుడు జీవించివుంటేనేగా మిగతా అవసరాలు కలిగేది! జీవించి వుండడానికి ప్రథమావసరం ఆకలి తీరడం. కనుక ఆకలి తీరనిదే మానవుడు జీవించివుండలేడు. అందుకనే జీవితంలోని ప్రథమావసరం ఆహారమే. రెండు రొట్టెముక్కలుంటే ఒకటి అమ్మి తామర పూవును కొనుక్కోడం సమంజసమే కాని ఒక్క రొట్టెముక్కవుంటే మాత్రం దాన్ని అమ్మి తామరపూవును కొనడం ప్రాణాంతకం కనుక ఆకలి తీరడానికి ప్రథమస్థానమూ, మిగతావసరాలు తీరడానికి రెండవ స్థానమూ యివ్వటం సమంజసం. రొట్టెతో మాత్రమే మానవుడు జీవించలేడని చెప్పడం ఒక మామూలుక్రింద

కొచ్చింది. దీనికి జవాబు వెంటనే వుండనే వున్నది, రొట్టె లేకుండాకూడా మానవుడు జీవించలేడని! మనిషికి శరీరం అనేది వున్నది కనుక ఆహారం అవసరం. శరీరం మాత్రమే కాక మనసుకూడా వున్నది కనుక విజ్ఞానాలూ, వినోదాలూ అవసరం. మనిషి భౌతికజీవి, సాంస్కృతికజీవికూడా. ఆ రోజున కాలేజీ ప్రసంగంలో చర్చించాను.

ఆ సాయంత్రం డాక్టరు శ్రీనివాసాచారిగారూ, నేనూ కాలవ వడ్డునే చాలా దూరం మాట్లాడుతూ నడక సాగించాం. మళ్ళీ తిరిగి వస్తూండగా చీకటిపడుతోంది. ఆ చీకటిలో ఆ దృశ్యాదృశ్యాల సంధిలో బెజవాడ కొండలు స్వప్నరూపాలను తాల్చి మనోహరంగా గోచరించసాగినాయి. మేముభయులము కొంతసేపు కదలక నిలచి ఆ వాతావరణ శోభను ఏకాగ్రచిత్తంతో ఆనందించాము. కొన్నిచోట్ల కొండలమీద నగరాలుంటాయి; ఇక్కడ నగరంలోనే కొండలున్నాయి. కొండమీది నగరం కొండకు శోభనిస్తే నగరంలోని కొండలు నగరానికి శోభనిస్తాయి. ప్రపంచంలో ఎక్కువగావుండేవి నగరాలులేని వట్టికొండలే, కొండలులేని వట్టి నగరాలే. నగరంలేని కొండమీది ప్రజలకు నగరమంటే ఏమిటో తెలియదు. కొండలు లేని నగరవాసులకు కొండలంటే ఏమిటో తెలియదు!

వేసవి రౌద్రస్వరూపం తాల్చింది. మా పెదనాయనగారు తమ డెబ్బయి అయిదవ ఏట మంచం పట్టినారు వ్యాధితో. నా జీవితంలో నా మనోవికాసానికి వారు యెంతో దోహదం యిచ్చారు. క్రమేణ వారి ఆరోగ్యం దిగజారిపోసాగింది. బెజవాడనుంచి డాక్టర్‌ను తీసుకువచ్చే పని నేను చూస్తుండేవాణ్ని. డాక్టర్ వెలిదండ్ల హనుమంతరావు మరణానంతరం డాక్టర్ జంధ్యాల దక్షిణామూర్తిగారు మా కుటుంబడాక్టరు అయ్యారు. చాలాసార్లు వచ్చి పెదనాయనగారిని పరీక్షించి మందులు యిచ్చిపోతున్నారు. ఒకరోజు నేను బెజవాడవెళ్ళి డాక్టర్‌గారిని తీసుకొని తుమ్మలపూడి వచ్చేసరికి మా ఇంటిముందు జనులు గుమికూడారు. లోపలినుంచి ఏడుపులు వినిపించసాగాయి. వచ్చిన డాక్టర్ దక్షిణామూర్తిగారు పెదవి విరచారు. మా పెదనాయనగారు ఇకలేరు!

నా జీవితంలో అప్పటివరకు చాలా మరణాలను చూశాను. మరణిస్తూన్న మనుషులను చూశానుకాని జన్మిస్తున్న శిశువులను చూడలేదు. మరణిస్తున్న మనుషులను చూడగలముకాని జన్మిస్తున్న శిశువులను చూడజాలమేమో! మరణిస్తున్న మనిషి బహిరంగంగా అందరి ఎదుట మరణిస్తాడు, కాని జన్మిస్తున్న శిశువు రహస్యంగా యితరులకు - ఎక్కువమంది చూడకుండా జన్మిస్తుంది. మరణమనే పని ఒక వ్యక్తికి సంబంధించే వుంటుంది. జననమనే పని యిద్దరు వ్యక్తులకు సంబంధించినది. మాతా శిశువులకు, మరణించే వ్యక్తి చైతన్యంనుంచి అచేతనలోకి

ప్రవేశిస్తే జన్మించే శిశువు అచేతననుంచి చైతన్యంలోకి ప్రవేశిస్తుంది. మరణించిన వ్యక్తి తిరిగి జన్మిస్తాడో లేదో తెలియదుకాని, జన్మించిన శిశువుమాత్రం ఒకనాటికి తప్పక మరణించి తీరుతుంది. మరణించినందున ఆత్మీయులు దుఃఖిస్తారు: విరోధులు సంతోషిస్తారు. ఇక జన్మించినందున ఆత్మీయులు సంతోషిస్తారు, విరోధులు దుఃఖిస్తారు. జననానికీ. మరణానికీ మధ్య యింత తారతమ్యం! జగత్తంతా జనన మరణాలు ఈ రెంటిమయం. పూర్తిగా జననాలను అరికట్టివేస్తే భవిష్యత్‌లో కొంత కాలానికి మనిషి అనే ప్రాణి వుండదు. జననాలను అరికటినప్పుడు మరణాలను కూడా అరికట్టగలిగితే — ఆ రాత్రంతా యిదే ఆలోచనలు.

వైశాఖమాసపు మధ్యలో ఒక సాయంత్రం ఆకాశం అంతా మేఘాలు క్రమ్ముకువచ్చి ఉరుములు, మెరుపులూ, గాలివుమ్మా సాగాయి. మధ్య మధ్య రెండు చినుకులుకూడా పడసాగాయి. నేను, మరికొందరు మిత్రులము సాయంత్రం మా మామిడితోటలో మాట్లాడుతూ కూర్చున్నాము. ఆకాశంలో అటు ఉరిమి ఇటు ఉరిమి అటు మెరసి యిటు మెరసి, మా కనులు మూతలు పడేలాగా మెరసి మా చెవులు తూట్లుపడేలాగా మ్రోగింది. మాలో ఒకరిద్దరు పడిపోవ సిద్ధమైనారు. మేము బెదరిపోయిన కళ్ళతో, అదరిపోయిన గుండెలతో అటు చూచేవరకు మాకు కొద్దిదూరంలోనే వున్న తాడిచెట్టు చివర మంటలు కనిపించాయి. అప్పుడు తెలుసుకున్నాం, ఆ తాడిచెట్టుమీద పిడుగు పడిందని. పిడుగు పడడమంటే ఎంత భయంకర దృశ్యమో తెలుసుకొన్నాం. వినలేని శబ్దం. కనలేని కాంతి పిడుగుల సమయంలో తప్ప మరెప్పుడూ జనించవు. శ్రవ్య భీకరత, దృశ్య భీకరత అనే రెంటిని చెవి, కన్ను అనుభవిస్తాయి. అంటే ఒక్కొక్కటి ఒకోదాన్నే అనుభవిస్తాయి. చెవి దృశ్య భీకరతను అనుభవించదు, కన్ను శ్రవ్య భీకరతను అనుభవించదు. కాని ఈరెంటు భీకరతలను కలిపి అనుభవించే వస్తువున్నది. అదిమనసు. ఆ రెంటినికూడ తానొక్కటే అనుభవించాలి. అందుకే చెవి, కన్నూ కూడా అనుభవించని బాధ మనసు అనుభవిస్తుంది.

పిడుగుపడి కాలుతున్న ఆ తాడిచెట్టు చివరను చూస్తుంటే ప్రేక్షణాత్మకంగా వుంది పైనంతా నీలిమేఘాలు, ఆ నారింజరంగు మంటలు, ఆ నీలిమేఘాల మధ్య మండుతున్నట్టుగా ఎంతో సుదృశ్యంగా కనిపించాయి. పిడుగుపడుతున్న సమయాన భయంకరంగా తట్టినా, పిడుగుపడిన తరువాత మాత్రం యీ జ్వాలామయదృశ్యం ఆనందాన్నివ్వసాగింది. అయితే, ఆ జ్వాలలను ఎక్కువకాలం జ్వలించనీయక జనులు వాటిని ఆర్పివేశారు. లేనిచో నగరంలోవున్న గడిబాములకు ప్రమాదం. నీల నీరదాలు చీకటిపడిన కొద్ది నలుపులో చీకటితో పోటీచేసి చివరకు రాత్రంతా వర ధారలను కురిపించాయి. వేసవిలోని వర్షం ఆనందవిషాదాల సమ్మేళనంవలె వుంటుంది.

# కళాతపస్వి రోరిక్‌తో పరిచయం

మహాబోధి సొసైటీ తరపున నడుస్తున్న "మహాబోధి" అనే ఆంగ్ల మాసపత్రికలో జగద్విఖ్యాత చిత్రకారుడు, గ్రంథకర్త, పర్యటకుడు అయిన రష్యన్ మనీషి ప్రొఫెసర్ నికొలస్ రోరిక్ రచించిన వ్యాసం ఒకటి వెలువడింది. ఆ వ్యాసంలోని విషయం విశ్వశాంతికి సంబంధించిన "శాంతిపతాక" (**Banner of Peace**) దాన్ని సాంస్కృతిక రెడ్‌క్రాస్ అనవచ్చు. ద్వితీయ సంగ్రామం తీవ్రంగా చెలరేగుతున్న రోజులలో యిరుపక్షాల సేనలద్వారా ప్రపంచంలోని అనేక కళాఖండాలు నాశనమైపోతున్నాయి. మ్యూజియంలమీద, చిత్రశాలలమీద, విజ్ఞాన కేంద్రాలమీద ఉభయసైన్యాలు వివేచనలేకుండా బాంబులు కురిపించి నాశనం చేయడం జరుగుతూంది.

యుద్ధ సమయపు ద్వేషాలతో ఆహుతియైన కళాఖండాలు శాంతి సమయంలో తిరిగి రమ్మంటే రావు. కనుక యుద్ధకాలంలో ఆస్పత్రులమీద బాంబులు వేయకుండా రెడ్‌క్రాస్ పతాక కాపాడుతున్నట్టే సాంస్కృతిక కేంద్రాలమీద బాంబులు వేయకుండా శాంతిపతాక కాపాడాలని రోరిక్ స్థాపించిన యీ నూతన శాంతి ఉద్యమం ఆదర్శం. ఈ పతాకంమీద ఒక వలయం వుంటుంది, ఆ వలయంలో మూడు గోళాకృతులుంటాయి. ఆ మూడు గోళాకృతుల అర్థం కళ, విజ్ఞానం, ధర్మం అని. (**Roerich Peace Pact**) అనే ఒక చట్టబద్ధమైన ఒడంబడికను నికొలస్ రోరిక్ నిర్మించితే ప్రపంచంలోని చాలా రాజ్యాలు దానిమీద సంతకాలుచేసి ఆమోదించాయి.

ఈ విషయాలన్నీ "మహాబోధి"లో ఆయన చర్చించాడు. ఆ విషయం నాకెంతో సమంజసంగా గోచరించడంతో ప్రొఫెసర్ నికొలస్ రోరిక్‌కు యింకా దాని వివరాలను తెలపవలసిందని ఉత్తరం వ్రాశాను. అంతవరకు ఆయన అపరిచిత వ్యక్తే నాకు. ఒకవారం అయిన తరువాత నా నిత్య నిరీక్షణ సఫలతచెందింది. తెల్లని గడ్డలాంటి కాయితంమీద ప్రొఫెసర్ రోరిక్‌నుంచి సమాధానం వచ్చింది. ఆయనెంతో సంతోషం ప్రకటించాడు, ఉత్తరం అందుకొన్నందుకు. ఉత్తరంలో వ్రాశాడు, వేరే బుక్‌పోస్టులో శాంతి పతాకకు సంబంధించిన కాగితాలు పంపిస్తున్నట్లు. అప్పటినుంచి శాంతి పతాకతో ప్రారంభించిన పరిచయం మా ఉభయులకు వ్యక్తిగత స్నేహంలోకిపరిణమించింది. తరచుగా ఉత్తర ప్రత్యుత్తరాలలో భావ వినిమయం చేసికోసాగాము.

ఆయన తన చిత్రాలను గురించి యితరులు వ్రాసిన వ్యాఖ్యలను, తన చిత్రాల వర్ణప్రతులను పంపసాగాడు. ప్రొఫెసర్ రోరిక్‌నుంచి ఉత్తరం వచ్చిన రోజంతా ఆనందంగా వుండేది. ఆటు పశ్చిమ హిమాలయాలనుంచి రోరిక్, కుమావూ హిమాలయాలనుంచి ప్రొఫెసర్ రోనాల్డ్ నిక్సన్ (కృష్ణప్రేమ), లక్నో నుంచి ప్రిన్సిపాల్ హాల్డార్, ఈ ముగ్గురు మనీషులనుంచివచ్చే ఉత్తరాలు నా మానసాన్ని మానససరోవరంగా మారుస్తుండేవి. హాల్డార్ ఉత్తరాల రసతత్వం(**Aesthetics**) **తో నిండి**వుండేవి, రోరిక్ ఉత్తరాలు నైతికతత్వం (**Ethics**)తో నిండివుండేవి. నిక్సన్ ఉత్తరాలు పరాతత్వం (**Metaphysics**) తో నిండివుండేవి. జీవితానికి ముఖ్యమైన ఈ మూడు సత్వాలు త్రివేణీ సంగమరూపంలోని మానస సాగరం లోకి ప్రవహిస్తుండేవి!

నా జవాబులలో ముగ్గురికీ మూడు విధాలుగా కనిపించేవాడిని. నా జవాబులు వారు వ్రాసిన ఉత్తరాలకు భిన్నంగా యిస్తుండేవాణ్ని. పరాతత్వం గురించి వ్రాసిన వారికి రసతత్వంగల జవాబులూ నైతికతత్వంగురించి వ్రాసిన వారికి పరాతత్వం గలవి, రసతత్వం గురించి వ్రాసిన వారికి నైతిక తత్వంగల జవాబులు వ్రాస్తుండే వాడిని వ్యతిరేకరసం నిమిత్తం!

వేరే సాహిత్యరచనలకు బదులు ఉత్తరాలు వ్రాయడమే నా సాహిత్య రచనలు కాసాగినాయి. మంచి మంచి పదావళీ, ఉన్నత భావావళీ ఉపయోగించేవాణ్ణి నా ఉత్తరాలలో. ఈ ముగ్గురు మనీషులు కాక యింకా ఉత్తర దేశంలోని కొందరు సాహిత్య పరులతోకూడా నా ఉత్తర ప్రత్యుత్తరాలు జరగసాగాయి. ఈ ఉత్తరాల రచన తరువాత నా వ్యాసరచనకు పరోక్షంగా చాలా సహకరించింది. సుప్రసిద్ధ ఐరిష్‌జీవి అయిన మన దేశంలోనే స్థిరపడిపోయిన డాక్టర్ జేమ్సు హెన్సింజిన్స్‌తో కూడ ఇదే కాలంలో, అంటే పందొమ్మిది వందల నలభైలోనే ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి.

వెడితే బెజవాడ, లేనిచో యింటివద్ద వివిధ సాంస్కృతిక వ్యాసంగాలు, ఇంకా ఎటూ చుట్టుపట్ల బస్తీలకు వెళ్ళడంలేదు. ఉత్తరదేశం చూడడం జరిగింది కాని ఆంధ్రదేశంలో ఏ నగరాలూ చూడలేదు. విశాఖపట్నం, కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, నెల్లూరు, రాయలసీమలోని నగరాలు మొదలయినవి ఏవీ చూడడం తటస్థించలేదు. అవి ఏ విధంగా వుంటాయో అని కుతూహలంవుండేది. బంధువుల యింటికి వెళుతూ బందరుమాత్రం చూడడం తటస్థించింది.

ఇతర ప్రాంతాలు చూచి స్వీయ ప్రాంతం చూడకపోవడం తప్పుగా ఎంచబడు తుందా? అయితే స్వీయ ప్రాంతం చూచి పరప్రాంతాలు చూడకపోవడం కూడా తప్పుక్రిందకే వస్తుందా? రెంటినీ చూస్తే మాత్రమే తప్పులేకుండా పోతుందా? మరి రెంటినీ చూడకపోతే దేనిక్రింద కొస్తుంది ?

తుమ్మపూడిలోకూడా బంధువులలోను, మిత్రులలోనూ కూడా కొందరు సాహిత్యప్రియులు తలలెత్తసాగారు. అందుమూలంగా యిదివరలో వున్నంత ఎడారిగా గోచరించడంలేదు. ఈ గ్రామం యిప్పుడు, సాహిత్యానురాగమేకాక సాహిత్యసృష్టికూడ కొందరిలో తలఎత్తసాగింది. వీరిలో నా మేనత్తగారి కుమారులు వాశిరెడ్డి పార్థసారధిగారూ, మల్లిఖార్జునా ముఖ్యులు. పార్థసారథిగారు గద్య రచనలుచేస్తే మల్లిఖార్జున పద్యరచనలు చేసేవారు. మేమందరము గ్రామ పంచాయతీ లైబ్రరీలో ఏవో ఒకటి చర్చించుకుంటూ ఎక్కువకాలం గడిపేవాళ్ళం. మల్లిఖార్జున, నేను సూర్యదేవర వెంకటసుబ్బయ్య అనే మరొక మిత్రుడు కలసి సాయంత్రం కాలవకట్టలకు వ్యాహ్యాళికి వెడుతుండేవాళ్ళం. వెంకట సుబ్బయ్య మిత్రుడు మాత్రమేకాకుండా ఒకవిధంగా శిష్యుడు కూడా. ఆయన నా దగ్గర హిందీ, ఇంగ్లీషు పాఠాలు నేర్చుకొంటూ ఎక్కువగా నా వెంట వుండేవాడు.

నిత్యం రాత్రిపూట మా పెదనాయనగారి యింటివద్ద మా చెల్లెలు భారతికి, పెదవాన్నగారి అమ్మాయి రజనికి హిందీ, ఇంగ్లీషు పాఠాలు చెప్పేవాణ్ణి. వాళ్ళిద్దరు పాఠాలు చదివేకంటే, నాతో కబుర్లు చెప్పడంలోనే ఎక్కువకాలం గడిపేవాళ్ళు. అయినప్పటికీ వాళ్ళకు విద్య అబ్బసాగింది.

ఆ రోజులలోనే ఈ వూరివారి అల్లుడు వాశిరెడ్డి వీరభద్రయ్యగారు అనే గాయకుడు యిక్కడ నివసించసాగారు. ఆయన విజయనగరం సంగీత కళాశాల విద్యార్థి; ద్వారం వెంకటస్వామి నాయుడుగారి శిష్యులు. మంచి నైపుణ్యంతో వయొలిన్ వాయిస్తారు; ప్రక్కవాద్యం వాయించడం మటుకు వారికి కుదిరేదికాదు. మౌలికత్వం వున్నవారు చాలామంది ప్రక్కవాద్యం వాయించలేరు; అందుకు కొంత అభ్యాసంకూడా అవసరం. వారివద్ద నేను వయొలిన్ సాధన మొదలుపెట్టాను. నాకు అదివరకే చాలా స్వరాలు నోటికివచ్చు. వాటివన్నిటినీ వయొలిన్‌మీద పిళ్ళారి గీతాలు వాయించడంవరకు వచ్చింది. ఇక తరువాతి సాధనకు ఏవో ఆటంకాలు వచ్చి అంతటితో సంగీతం సన్నగిలిపోయింది.

గాత్ర సంగీతంకంటె జంత్ర సంగీతం ఎక్కువ ఆనందంగా వుంటుంది. గాత్ర సంగీతంలో అర్థం వుంటుంది; జంత్ర సంగీతంలో అర్థం వుండక నాద మాధురే ప్రధానం. గాత్రంలోని అర్థం ఒకోసారి నాదమాధురికి అడ్డం వస్తుం టుంది. జంత్రంలో శుద్ధ నాదమాధురి మాత్రమే వినిపిస్తుంది. అయితే, రాగాలాపన మాత్రం అటు గాత్రంలోను, ఇటు జంత్రంలోను ఒకటిగానే వుంటుంది. రాగాలాపన ఏ అర్థాన్ని తెలుపక శుద్ధ నాదమాధురిగానే వుంటుంది. అయినా, జంత్రం అందుకోగలిగిన స్థానాలను గాత్రం అందుకోవడం కష్టం. జంత్రవాద్యాలలో నాకు వీణకంటె ఎందుకనో వయొలిన్ అంటేనే ఎక్కువ ఇష్టం. తాళవాద్యాలు, అందు లోను మృదంగం అంటే ఎక్కువ ఇష్టం - తాళవాద్యంలో వున్న లయస్పందన, మిగతా వాద్యాలలో అంతగా వుండదు. తాళవాద్యాలు నృత్యశీలమైనట్టివి. మృదంగం ఎక్కువగా ప్రక్కవాద్యంగా రాణిస్తుంది. మృదంగాన్ని ఆ స్థితినుండి దాటించి స్వతంత్ర వాద్యంగా స్థాపించడం చాలా అవసరం. ప్రత్యేక మృదంగం కచేరీలు జరపడం అవసరం.

జంత్ర వాద్యాలలో వేణువుది ఒక ప్రత్యేకత. చిన్న వాద్యం, పెద్ద శబ్దం, మిగతా తంత్రాల కున్నంత విశదమైన వివరాలు ఈ జంత్రంలో లేనందున ఒక శ్రావ్యమైన నాద ఐక్యత వేణువులో గోచరిస్తుంది. అందువల్ల దీని పలుకులో ఒక తన్మయత ఉద్భవిస్తుంది. మురళి, వేణు మొదలైనవి ఎంతో రసవంతమైన ముద్దు పేర్లు. ఈ పేర్లు యమునా తీరపు వెన్నెల రాత్రులతో, బృందావనపు పొలుగు పీడలతో సంబద్ధమైవున్నాయి. వెన్నెల రాత్రులలో దూరంనుంచి నది మీదుగా వినిపించే వేణువు సంగీతం వెన్నెల తగలని చీకటి ప్రదేశాలను కూడా వెన్నెలతో నింపుతుంది!

చిత్రప్రదర్శనాలను చూస్తున్నప్పటికంటె పాటకచ్చేరీలను వింటున్నప్పుడే నాకు ఎక్కువ ఆనందం కలిగేది. డాక్టర్ శ్రీనివాసాచారిగారితో కలిసి బెజవాడలో కొందరి పాటకచ్చేరీలకు హాజరయాను. గాయకుని పాటకంటె అక్కడి మృదంగం, వయొలిన్లు నన్ను తన్మయపరచాయి. నాకు చాలాసార్లు అనిపించింది వేణు వాద్యాన్ని సాధనచేసి దేశమంతా తిరిగి పాటకచ్చేరేలు చేయాలని. శ్రోతల ముందు వేదికమీద కూర్చుని వేణు సంగీతంద్వారా నా ఆనందాన్ని వారి కందించి తిరిగి వారి ఆనందంద్వారా నేను ఆనందించాలని. అయితే ఈ సంకల్పం వేణు వును కొని తీసుకురావడం వరకే కార్యరూపం దాల్చింది. కాని ఇక అంతకుపైకి

పరిణమించలేదు. అయితే శాస్త్రీయం కాని పద్ధతిలో మాత్రం వేణువుమీద ఏవో ఏవో వాయిస్తూండేవాణ్ణి, నా సంతృప్తి నిమిత్తం, నా చుట్టుపట్లవున్న సంగీతజ్ఞులు కానివారి నిమిత్తం.

శ్రవ్య కళమీది ప్రీతి నిలవక దృశ్యకళలమీది ప్రీతి మాత్రమే నిలిచిపో సాగింది. అందుకని శ్రవ్య కళలను వింటున్నప్పుడు ఇంకా ఎక్కువ ఆనందం జనించసాగింది. ఉత్తరదేశపు భాషలతోను, మనుషులతోను, ఉత్తరదేశపు సంస్కృతితోను ఎక్కువ సంబంధం వున్నప్పటికి నాకు ఎందుకనో కర్ణాటక సంగీతమంటేనే ఎక్కువ ప్రీతి. హిందుస్థానీ సంగీతానికంటె, మనోవైజ్ఞానికంగా ఇందుకు కొన్ని కారణాలేవో వుండివుంటాయి నాకు తెలియకుండానే. నాకు తెలిసి నంతవరకు నా చిన్నతనంలో ప్రథమంగా విని ఆనందించిన సంగీతం కర్ణాటక సంగీతం కావడం కూడా ఒక కారణమేనేమో.

సరే ఏది ఏమైనప్పటికి భారతీయ సంగీతంలో హిందుస్థానీ సంప్రదాయాని కంటె కర్ణాటకపద్ధతే నా కిష్టమెవదని తేలిపోవడంతో కర్ణాటక సంగీతాన్ని గురించిన చరిత్ర, అందులోని ప్రధాన విభాగాలు, అందులో కృషిచేసిన మహనీయులు మొదలైన విషయాలకు సంబంధించిన పరిజ్ఞానం సంపాదించటంలో అభిరుచి ఏర్పడసాగింది. సంగీతం సంగతి జాడ తెలిస్తేనేకాని సాహిత్యం సంగతికూడా తెలిసినట్టు కాదు. సాహిత్యంలో విషయ పరిజ్ఞానంకూడా అవసరం. సంగీతంలో సునాద సృష్టి మాత్రమే ప్రధానం.

# మృత్యువుతో పోరాడిన నా జీవితేచ్ఛ

లక్నోనుంచి అసిత్‌కుమార్ హాల్దార్ తాను రచించిన రెండు బెంగాలీ ఖండకావ్యాలను, వాటికి తాను గీసిన రేఖాచిత్రాలను (మూలాలు) పంపించారు. "కల్పాంతిక", "ప్రక్షిప్తిక" అని ఆ రెండు ఖండకావ్యాల పేర్లు. అవి ఎక్కువగా పురాతత్వ మూలకమైన కవితలు. అందులోని పదాలుకూడా నూతన ప్రయోగాలు. ఆ కవితలకు బొమ్మలుకూడా కవిగారే స్వయంగా వేసుకొన్నారు. కనుక వాటి రెంటిని కలిపి అర్థం చేసుకోవడం సులభంగా వుంది.

ఏవేవో పుస్తకాల చదువులతోను, తాత్విక చింతనలతోను మెదడు వేడెక్కినపుడు మా మేనత్తగారింటికి వెళ్ళి అక్కడ కొంచెంసేపు ప్రొద్దుపుచ్చుకునేవాణ్ణి. వారిల్లు చాలా సందడిగా వుండేది. ఆడపిల్లలతోను, మగపిల్లలతోను, మేనత్త కొడుకులు, కూతుళ్ళు, వాళ్ళ పిల్లలు అంతా సందడే. మేనత్తగారి మనుమరాండ్రుండేవాళ్ళు సరోజని, సావిత్రి అని. అందులో సరోజ సన్నగా, పొడవుగా, పచ్చగావుండేది. పచ్చగా అంటే ఆకుపచ్చగా కాదు, పసుపుపచ్చగా. చాలా తెలివైనట్టి, చురుకైనట్టి పిల్ల. ఆమెను నేనేదో ఒకటి అంటుండేవాణ్ణి. ఆమె కూడా నన్నేదో ఒకటి అంటూండేది. మేమంతా కలసి ఒకో సాయంత్రం వారింటి వెనక కొబ్బరిచెట్లక్రింద కూర్చుని వేడివేడి పప్పుచారుతో భోజనాలు చేసేవాళ్ళం.

తుమ్మపూడిలోని వేసవి అంతగా వేడిగా వుండదని అత్తవారిళ్ళలో కాపురాలు చేస్తున్న ఇక్కడి అమ్మాయిలు, పుట్టిళ్ళలో వుంటున్న ఇక్కడి కోడళ్ళుకూడా వేసవి ప్రారంభించగానే తుమ్మపూడి వచ్చి తొలకరి రాగానే మళ్ళీ వెళుతుండేవాళ్ళు. కాలవలో ఎండిపోయిన ఇసుకమీద మిత్రులం సమావేశమై చీకటిపడేవరకు కాలక్షేపం చేసేవాళ్ళం. ఎండాకాలం ఇక్కడంత బాధగా అనిపించేదికాదు.

## బృహత్తర గ్రంథం

శ్రీరామకృష్ణ శతవార్షికోత్సవ సందర్భంలో ప్రకటింపబడిన బృహత్తర గ్రంథం **"The Cultural Heritage of India"** అనే మూడు సంపుటాలను తెప్పించి కొంతకాలమైనప్పటికి వాటిని సక్రమంగా అధ్యయనం చేయలేదు. ఇప్పుడు వాటిని తీసి శ్రద్ధగా చదవసాగాను. ఆ గ్రంథాన్ని ఒక విధంగా సాంస్కృతిక సర్వస్వం అనవచ్చు. వేదాలనుంచి ప్రారంభించి భాషలు, సాహిత్యాలు, కళలు, సైన్యాలవరకు వున్నాయి అందులో. భారతదేశంలోని వివిధ విశ్వ

విద్యాలయాలకుచెందిన దాదాపునూరుమంది విద్వాంసులరచనలు అందులోవున్నాయి. ఇటువంటి గంథాలను చదవడం కొంత విసువుగావుందే మాట వాస్తవమేకాని, అభిరుచి సృష్టించుకొని మనసును ఒప్పించి చదువుతూంటే అదొక రుచిగానే వుంటుంది.

దీని అధ్యయనం మూలంగా ఎన్నో ఆశలు, తెలియని విషయాలు కొంత తెలిసినాయి. సగం తెలిసున్న విషయాలు పూర్ణంగా తెలిశాయి. పూర్ణంగా తెలిసున్న విషయాలకు కాంతి అబ్బింది. వ్రాసింది విద్వాంసులయినప్పటికి, వ్రాయబడింది విద్వాంసుల నిమిత్తమే కానందున అంత జటిలంగా ఏమీలేవు ఇందులోని రచనలు. ఈ రచల్లో భారతదేశం మాత్రమే గొప్పది. హిందూమతం మాత్రమే సర్వోత్కృష్టమైనదనే ధోరణి లేదు. హిందూమతంగాని, మిగతా మతాలను గురించికూడా ఇదులో రచనలున్నాయి. వీటికితోడు ఎన్నో అసంఖ్యాకమైన బొమ్మలున్నాయి ఇందులో. వర్ణచిత్రాలు, శిల్పాల ఫొటోలు, వాస్తు నిర్మాణాలు గ్రంథానికి సొంపు కూరుస్తున్నాయి. ఈ పుస్తకాన్ని నిత్యం కొన్ని పేజీలు చదివి ఆ విషయాలను గురించి సంక్షిప్తంగా నా స్వంతమాటల్లో వ్రాసుకొనేవాణ్ణి. ఈ విధంగా **"The Cultural Heritage of India"** మూడు సంపుటాలను వివరంగా చదవడం నెలరోజులు పట్టింది. దాన్ని చదవకముందున్న పరిజ్ఞానానికంటె దాన్ని చదివిన తరువాత పరిజ్ఞానం ఎంతో ఎక్కువయింది.

పుస్తకాలకంటె కూడా పాత మాసపత్రికలు చదవడంమీద అభిలాష ఎక్కువ వుండేది. ఒకో పుస్తకంలో ఒకో విషయమే వుంటుంది. మరి ఒకో మాసపత్రికలో ఎన్నెన్నో విషయాలు, ఎన్నెన్నో బొమ్మలు వుంటాయి. ఒకరి దగ్గర "ఆనంద" అనే ఇంగ్లీషు మాసపత్రికలు కొన్ని దొరికాయి. వాటికి జిడ్డు కృష్ణమూర్తి సంపాదకుడుగా వుండేవారు. ఎంతో అందమైన పత్రిక, ఎన్నో ఆకర్షణీయమైన వ్యాసాలుండేవి. జిడ్డు కృష్ణమూర్తి స్వయంగా రచించిన కవితలు, వ్యాసాలు కూడా వుండేవి. ఆయన వ్యాసాలకంటె ఆయన కవితలు ఎంతగానో మనోజ్ఞంగా వుండేవి. ఆయన ఆంగ్లంలో తప్ప మరో భాషలో వ్రాసి ఎరుగరు. ఆయన కవితలన్నీ ముక్తచందంలోనే వుండేవి. ప్రతి వాక్యము ఎంతో భావయుక్తంగాను, మార్మికంగాను వుండేవి. ఆయన ఆధ్యాత్మికమంతా కవితా సౌరభంతో నిండి వుండేది.

**"My song is the song of the river**
**Calling for the open seas-**
**Wandering wandering. . .**
**I am life !"**

"ఆనంద" మానపత్రికలలో నాకు నవకాంతులు ప్రత్యక్షమైనాయి. వాటి మిగతా సంచికలు కూడా ఎక్కడైనా దొరుకుతాయేమో అని ప్రయత్నించాము. కాని దొరకలేదు. బహుశా ఎక్కువకాలం ఆ పత్రికనడవలేదేమో.

ప్రొఫెసర్ రోరిక్ తామిదివరలో కొంతకాలం నడిపిన అంతర్జాతీయ పత్రిక **"Flamma"** అనే వాటిని పంపినాడు. అనేకమైన విషయాలను గురించి ప్రఖ్యాత అంతర్జాతీయ రచయితలు రచించిన వ్యాసాలు, రోరిక్‌వి కొన్ని చిత్రాలు వాటిలో వున్నాయి. బార్నెట్ డి. కాన్లన్ అనే కళావిమర్శకుని నోట్సు చాలా ఆకర్షణీయంగా వున్నాయి. ఇటువంటి పత్రికలు శాశ్వతంగా దాచుకోవలసినవిగా వుంటాయి.

లైబ్రరీలో మా అందరికీ సంగీతజ్ఞులైన వీరభద్రయ్యగారు పులిహోరలు, దధ్యోదనాలు, ఉప్మాలు మొదలైనవి వండి పెడుతుండేవారు. తిని మేము ఏవో ప్రసంగాలలో కొంత ప్రొద్దుపుచ్చుకొని సాయంత్రానికి ఊరు బయటకు కాలవ వడ్డుకు వెళ్ళేవాళ్ళం. ఇటువంటి సామాజిక జీవితానికి, నా వ్యక్తిగత జీవితానికి ఒకవిధమైన సంధి కుదుర్చుకొన్నాను. ఇటువంటి మిత్రులతో సరదాగా బహిరంగ జీవితాన్ని గడుపుతున్నప్పుడుకూడా నేను నా ఆంతరంగిక జీవితంలో ఒకవేపు జీవిస్తూనే వుండేవాణ్ణి. ఎటువంటి బహిరంగ జీవిత పరిస్థితిలోకూడ వ్యక్తిగత జీవితం నుంచి వేరుచేయబడలేదు

## ఈతలో ఆసక్తి

ఉదయానలేచి నేను కాలవలో కొంతసేపు ఈత ఈదివచ్చేవాడిని నిత్యము. ఒకరోజు వర్షాకాలంలో వర్షంలేని ఉదయాన కాలవకట్టమీద కూర్చుని ముఖం కడుక్కుంటూండగా ఒక హరిజన బాలుడువచ్చి బాగా కాచివున్న నేరేడుచెట్టు ఎక్కి నేరేడుపళ్ళు కోస్తున్నాడు. ఇంకా చివరికొమ్మలకు వస్తుంటే నేను కేకలు వేస్తున్నాను ఆ కొమ్మలు విరుగుతాయి కనుక అటురావద్దని. నేను ఈ మాటలు పూర్తి చేశానో లేదో ఆ బాలుడు ఆ సన్నకొమ్మ విరిగి దబేల్‌మని అంత ఎత్తునుంచి రోడ్డుమీద పడిపోయినాడు. నా కళ్ళను నేను నమ్మలేకపోయాను. నా కళ్ళముందు

చీకట్లు కమ్మివేసినాయి. పైనుంచి పడింది నేను అయిందీ తెలియలేదు, ఆ బాలుడు అయిందీ తెలియలేదు. నా భ్రమనుంచి బయటపడి చెంబుతో నీళ్ళుతీసుకొని అతని వద్దకు పరుగెత్తుకువెళ్ళిచూస్తే ఆ బాలుడు అచేతనావస్థలో వున్నాడు. ముక్కులు గుండా, చెవులగుండా, నోటిగుండా రక్తం వచ్చివుంది. వెంటనే కొంచెం నీరు నోటిలోపోసి చెవులు మూశాను. ముందు చిన్నకొమ్మపడి తరువాత ఆ కొమ్మలోని ఆకులభాగంమీద ఆ బాలుడు పడినందున అతనికి సూటిగా రోడ్డు దెబ్బ తగల కుండా ఆ ఆకుల మెత్తదనం రక్షించినదని గ్రహించాను.

అతని చెవులు మూసివుంచే మరొకళ్ళచేత వాళ్ళ యింటికి వార్త పంపాను. కొంచెంపేపటికి హరిజనవాడనుంచి ఏడుస్తూవచ్చారుచాలామంది జనులుఒకమంచం తీసుకొని. వాళ్ళకు ఏమీ ప్రమాదం లేదని చెప్పి నెమ్మదిగా అతని చెవులమీద నుంచి చేతులుతీసి మరికొంచెం నీరు నోటిలో పోశాను. ఈ తడవ నీటిని గుటక వేసినట్లు గ్రహించాను. దాంతో నాకు ధైర్యంవచ్చింది. నా ధైర్యాన్ని వాళ్ళకు కూడా పంచి యిచ్చాను. మంచంమీద అతన్ని తీసుకువెళ్ళారు. ఆ మధ్యాహ్నానికి అతనికి స్పృహ వచ్చి కళ్ళుతెరచి చూడసాగాడు. వాళ్ళ వాళ్ళంతా ఆ బాలుని నేను రక్షించినట్లు నన్ను శ్లాఘించసాగారు. చివరకు నేనూ నమ్మాను నేను అక్కడలేని పక్షాన ఆ బాలుడు మరణించేవాడే అని!

ఒక ప్రాణాన్ని రక్షించానని నమ్మి ఎంతో సంతృప్తి చెందాను. రోజూ ఎన్ని అసంఖ్యాకమైన ప్రాణాలు నశిస్తున్నాయో. వాటిని నేను రక్షించ జాలడం లేదు. నేను రక్షించలేక పోయినందున వాటిని నేను సంహరించినట్లు కాజాలదు. ఇన్ని ప్రాణులను రక్షించలేక ఒక్క ప్రాణిని రక్షించినాకూడా యిన్ని ప్రాణు లను రక్షించినంత ఆత్మసంతృప్తి.

కొందరు తమ బాధను ఏదోవిధంగా సహిస్తారు కాని యితరుల బాధను చూచి సహించలేరు. ఒక వ్యక్తి బాధ అనుభవిస్తున్న సమయాన ఎందరు వ్యక్తులో ఎన్నో విధాలయిన సుఖాలు అనుభవిస్తూంటారు. అటువంటప్పుడు ఈ ఒక్క వ్యక్తి పడే బాధ చూచి దుఃఖించేబదులు ఆ ఎక్కువమంది అనుభవించే సుఖాలను చూచి ఆనందించడం మంచిదికాదా? బాధలోవున్న మనిషి బాధను చూచి మనం బాధపడితే అతని బాధ ఉపశమిస్తుందా మరి? అవును. ఉపశమించదు. బాధితుని బాధ ఉపశమించడానికి కాదు మనం బాధపడేది. ఆ బాధితుని చూచినందువల్ల మనలో కలిగిన బాధ ఉపశమించడానికే మనం బాధపడేది!

మా బకింగ్‌హామ్ కాలవ చాలా లోతూ, వెడల్పూగల కాలవ. ప్రత్యేకించి మా పూరువద్దగ్గర. ఇంటిదగ్గర మా పెంపుడు తల్లి నన్ను కాలవలో ఈత వేయ వద్దని ఎంత బలవంతపెట్టినాకూడా వినకుండా వెళ్ళి ఈత వేసేవాణ్ణి. నేను కాలవ నుండి తిరిగి రావటంలో కొంచెం ఆలస్యం జరిగితే నే నేమయినానో అని ఆమె మనిషిని పంపేది. ఒక ఉదయం కాలవ నిండుగా ప్రవహిస్తోంది. అప్పుడప్పుడే నీరు బురదలు విరుగుతూ వలుపుకు తిరుగుతున్నాయి. నేను ఒకసారి ఆవలితీరానికి ఈదుతూ వెళ్ళివచ్చి ఆయాసం తీరకుండానే మళ్ళీ ఆవలతీరానికి ఈది అక్కడ కూడా విశ్రాంతి తీసుకోకుండా మళ్ళీ ఈవలితీరానికి బయలుదేరాను. కాలవ సగం దాటి యిటువైపుకువచ్చి ఇక యీదలేకపోయాను. చేతులు చచ్చుపడిపోయినాయి; గుండెదడ జాస్తి అయింది. ఇక ఒక్క బారవేయడంకూడా అసంభవంగాతోచింది. కళ్ళయెదుట చీకట్లు క్రమ్మివేసినాయి. వడ్డున ఎవరైనా గోచరిస్తే ఒక్క నమస్కారం, ఈ భూమిమీద ఆఖరి నమస్కారంచేసి నీటిలో మునిగిపోవాలని పించింది.

వెంటనే జీవితంపైని ఆశ పూర్ణంగా మేల్కొన్నది. ఎక్కడలేని ఆత్మ బలం వికసించింది. కదలలేని చేతులు కదలసాగాయి. చలించని కాళ్ళు చలించ సాగాయి. అయిదు నిమిషాలలో వచ్చి వడ్డున వాలాను. అయితే నిలుచోలేక పోయాను. వెంటనే అతికష్టంమీద వడ్డు ఎక్కి గడ్డిమీద పడుకొన్నాను కళ్ళు మూసుకొని. కొంతసేపటికి నే నేమయినానో అని ఇంటినుంచి మనిషి వచ్చాడు. నేను లేచి ఆ మనిషిని వెంబడించాను. కాళ్ళు నడవడం కష్టంగావుంది. జరిగిన సంఘటన ఆ వచ్చిన మనిషితో కాని, మరెవరితో కాని చెప్పలేను. ఆ రోజు మృత్యుముఖంలోనుంచి తిరిగి వచ్చాను. ఆ మధ్యాహ్నంనుంచి విపరీతంగాజ్వరం. జ్వరం ఎందుకొచ్చిందో నాకు తెలుసు. ఇతరు లెవరికీ తెలియదు.

# వివాహంపై విరక్తి; సంఘసేవపై అనురక్తి

ద్వితీయ సంగ్రామం తారాస్థాయి నందుకొన్నది. జర్మన్ల పురోగమనం ఆగిపోయినట్టున్నది. మిత్రమండలిచేయి కొంచెం పైకి వస్తున్నట్టుంది. పంతొమ్మిది వందల నలభై రెండులో భారత రాజకీయాలు కల్లోల పరిస్థితులలో కొచ్చినాయి. నాయకుల అరెస్టులు, రైలుపట్టాలు, తీగెలు ధ్వంసం చేయడం మొదలైన వాటితో ఎప్పుడేమి కానున్నదో అని భీతాహంతో వున్నారు జనం. బ్రిటిష్ ప్రభుత్వంమీదవున్న ఈ ద్వేషంమూలంగా మనదేశంమీదకు జపానుసైన్యాలు ఎప్పుడు వచ్చి మనను ఎప్పుడు కాపాడి బ్రిటిష్ ప్రభుత్వాన్ని మన భూభాగంనుంచి ఎప్పుడు తరిమివేస్తారా అని ప్రజలు తూర్పుగాజపాను దేశంవైపుకు ఎదురు చూడసాగారు ఉద్విగ్నమానసాలతో.

ఈ సమయంలోనే మా బంధువులలో మూడు వివాహాలు జరిగాయి. ఒకటి, మా మేనత్తగారి మనుమరాలు సరోజని వివాహం. చేబోలులోని మా బంధువైన హరిప్రసాద్‌తో జరిగింది సరోజని వివాహం। అదే సమయాన మా పినతండ్రిగారి కుమార్తె పద్మావతి వివాహంకూడా జరిగింది మరికొన్నాళ్ళకు సంజీవరాయణం గారి పుత్రుడైన పరంజ్యోతి వివాహంకూడా జరిగింది. పరంజ్యోతి వివాహంలో కొన్ని పాటకచేరీలు, కూచిపూడివారి భరతనాట్యాలు వగైరా జరిగాయి. ఆ వచ్చిన పాట కచేరీలవాళ్ళంతా మన యింటనే దిగడంతో నాకు చాలా ఉల్లాసంగా వుంది. వైలను శ్రుతిచేసుకోవడం, మృదంగాలను బిగించి సాటూ మీటూ శబ్దం పలికించి చూడడం, కంఠాలను సవరించుకొంటు కూనిరాగాలు తీయడం, మొదలైనవన్నీ నాకు ఆనందం కలిగించాయి. అసలు పాటకచేరీలో కంటే ఈ ముందరి ప్రయత్నాలే ఎంతో ఆహ్లాదంగా వుండేవి. పాటకచ్చేరీలలో పాల్గొన్న మిగతావారి పేర్లు నాకు అంత స్పష్టంగా గుర్తులేవుకాని వేణుగానం చేసిన పోలవరపు రామచంద్రరావుగారు, మృదంగం వాయించిన మహదేవ రాధాకృష్ణరాజుగారు మాత్రం బాగా గుర్తు. రాధాకృష్ణగారు వెంట రెండు మూడు మృదంగాలను తెచ్చుకున్నారు. ఆయన వాయిస్తున్నప్పుడు లయ తాండవించి ఘనరూపంలో కరిగిపోయింది.

వివాహాలను అంత దగ్గరగా చూడడం అదే మొదలు. వివాహ మండపం లోని ఆ తంతు అంతాలేకుండా వివాహాలు జరిగితే బాగుండుననిపించింది. ఆ

మేళాలు, తాళాలు, ఆ మంత్రాలు. ఆ గందరగోళమంతా కలిసి నాలో వివాహం మీద విరక్తి కలిగించినాయి.

సరోజని భర్త హరిప్రసాద్ వివాహానంతరం యిక్కడే వుంటూండేవాడు ఎక్కువగా. ఆయన కాశీవిద్యాపీఠ్ విద్యార్థి; సూక్ష్మగ్రాహి; ఏ విషయాన్నయినా యిట్టే గ్రహిస్తాడు. మా ఉభయుల స్నేహం చాలా సన్నిహితంగా రూపొందింది. మేము ప్రత్యేకంగా ఒకచోట యితర్లు లేనిచోట కూర్చొని ముచ్చటించుకొనే వాళ్ళం. క్రొత్తగా పెళ్ళి అయిన తన వైవాహికానుభవాలను చెబుతూండేవాడు. అవివాహిత నవయువకునికి వైవాహికానుభవాలు వినడంకంటే మధురమైన విషయం మరొకటేముంటుంది కనుక! సరోజనికి వివాహమైన పిమ్మట వెనకటి కొంటెతనం తగ్గిపోయి పెద్దమనిషి స్వభావం ఏర్పడింది.

దేశంలో అందరికీ నాకంటే చిన్నవాళ్ళకుకూడ వివాహాలవుతున్నాయి. నేను వివాహాంమాటే ఎత్తనని మా పెంపుడు తల్లిగారి ఆవేదన. ఆమెగారి ఆవేదన చూచి నేను పరివేదన చెందేవాణ్ణి. సంవేదనలను దిగమ్రింగుతూ. అంత వరకే, అంతకుమించి మరి ఏమి చేయను!

## విరక్తి, అనురక్తి

పాత మిత్రురాలు లక్నోలోని నీరజ విరక్తి మార్గం త్రొక్కింది. నేను ఇక్కడ అనురక్తుల మధ్య జీవిస్తున్నాను. ఆమె విరక్తిమార్గం త్రొక్కితే నేనూ విరక్తిమార్గం త్రొక్కాలని ఎక్కడుంది? అయితే నేను అనురక్తిమార్గం త్రొక్కుతున్నానని నీరజ కూడా ఎందుకు అనురక్తిమార్గం త్రొక్కరాదు? కాని నేను అనురక్తి మార్గం త్రొక్కుతున్నట్లు ఆమెకెలా తెలుస్తుంది? ఒకరి ఇష్టం రెండవవారికి కష్టం కాకూడదు. నీరజ ఇష్టం నీరజది; నా ఇష్టం నాది.

మధ్య మధ్య బెజవాడలో డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచారిగారింటికి వెళ్ళి ఒకటి రెండు రోజులు వారింట గడిపి వస్తూనే వున్నాను. వారి దంపతులుకూడా నా వివాహ విషయం ప్రస్తావించసాగారు. నేను నవ్వి మౌనం దాలుస్తున్నాను. ఏదైనా సమాధానం చెపితే మళ్ళీ ఎవరైనా మరోమాట అంటారు కాని నవ్వి మౌనం దాల్చిన మనిషితో ఆ విషయంలో రెండోమాట ఎవరైనా ఏమనగలరు? అవతలి మనుషులు కూడా మౌనంగానే ఊరుకొంటారు.

కొన్ని అనుభూతులు, కొన్ని సంవేదనలు మనసును ఒక విధంగా కల్లోలం పరచసాగినందువల్ల ఏమి చదువుతున్నా అంతగా తలకెక్కడంలేదు. జీవితంలో ఏదో అవ్యవస్థత ప్రవేశించసాగింది; చురుకుదనం మందగించ ప్రారంభించింది; ఏదైనా దృఢంగా నిర్ణయించుకోలేక పోతున్నాను. ఇప్పుడు ఇది సవ్యమైంది అని నిర్ణయించుకొన్నది ఇంకొద్దిసేపటికి సవ్యమైంది కాదని నిర్ణయించుకో వొచ్చాను. ఈ మానసిక దురవస్థను గుర్తించసాగాను. ఇందుకు కారణాలుకూడ తెలిశాయి. కాని దీని నివారణకు మాత్రం ఇది సమయం కాదు. ఇంకా వేచి వుండాలి. ఇది భవిష్యత్తులోని పనేకాని వర్తమానానిది కాదు.

ఈ ఊరులో జరిగిన పాటకచేరీలో జయదేవుని అష్టపదులు పాడడం విని ముగ్ధుడనయాను. అందువల్ల అష్టపదులను చదవాలని జయదేవుని గీతగోవిందం సంపాదించాను. కొన్ని రచనలు పాడుతూంటే మాత్రమే మధురంగా తడతాయి కాని చదువుతుంటె తట్టవు. కాని జయదేవుని అష్టపదులు పాడుతున్నప్పుడు ఆనందంగానే తడతాయి. చదువుతున్నప్పుడు ఆనందంగానే తడతాయి. వాటిలోని సంగీత ప్రాధాన్యత మూలంగా అవి పాడుతున్నపుడు బాగుంటాయి. వాటిలోని లలిత పదాలు, భావ మాధుర్యం మూలంగా అవి చదువుతున్నపుడు కూడ బాగుంటాయి.

## రాధాకృష్ణుల ప్రణయం

"లలిత లవంగ లతాపరిశీలన కోమల మలయ సమీరే" ఇటువంటి లలిత పదాలను జయదేవుడు మాత్రమే సృష్టించగలడేమో!" రాధాకృష్ణుల ప్రేమగాథ, శృంగారచేష్టలు, రతి ఉన్మత్తతలు జయదేవుని రచనలలో చరమస్థాయి నందుకున్నాయి. ఇటువంటి విశుద్ధమైన శృంగారరసాన్ని ఏదో ఆధ్యాత్మికత్వానికి ప్రతీక మాత్రమే అని మభ్యపెట్టి చూడడం మానవత్వానికే అవమానం. రాధకు కృష్ణునికి కూడా శరీరాలున్నాయి. హృదయాలున్నాయి; అందరి శరీరాలలోవలె వారి శరీరాలలో కూడ రక్తం ప్రవహిస్తుంది; అందరి హృదయాలలో వలె వారి హృదయాలలో కూడా పరిమళంతో కూడిన కాంక్ష లుదయిస్తాయి. ఒకరిమీద ఒకరు ముగ్ధులై గాఢంగా ప్రేమించుకొన్నారు రాధాకృష్ణులు. మానసిక ప్రేమ కట్టలను తెంచుకొన్నప్పుడు శారీరక ఐక్యతను కోరుతుంది. ఇటువంటి ఐక్యతలను, అభిలాషలను, అందాలను, ఆనందాలను జయదేవుడు రాధాకృష్ణుల చేష్టలుగా వర్ణిం

చాడు. ఇటువంటి శృంగార రసాన్ని శృంగారరసంగా తీసుకొని ఆనందించడం సబబుకాని దీని నేపథ్యంలో ఆధ్యాత్మికత చూడకలిగినవాళ్ళకు ఒక శృంగారంలో ఏమిటి, అన్నిటిలోను దొరుకుతుంది.

## జయదేవుని గీతగోవిందం

జయదేవుని గీతగోవిందతో ప్రారంభించిన సంస్కృత కావ్యాలమీద మోజు కాళిదాస రచనలన్నిటివి చదివించింది. కాళిదాస ప్రకృతి వర్ణన నన్నెంతో ఆనందపరచింది. మేఘసందేశంలోని, కుమార సంభవంలోని ప్రకృతి వర్ణన ప్రాచీన సాహిత్యంలో దానికదే సాటి. ఋతుసంహారంలోని ప్రకృతి వర్ణన మరో విధమైంది. మొదటి రెంటిలోని ప్రకృతి వర్ణన ప్రదేశానికి సంబంధించి వుంటే, ఋతు సంహారంలోని ప్రకృతి వర్ణన వాతావరణకు ఎక్కువ సంబంధించి వుంటుంది. కాళిదాస వర్ణనలలో మొదుగుపూలు అమరత్వాన్నందుకొన్నాయి. షేక్స్‌పియర్ తన రచనలలో మానవస్వభావాలకు, మనోవైజ్ఞానిక వికల్పాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తే కాళిదాసు తన రచనలలో ప్రకృతి సౌందర్యానికి, మానవుల సహజత్వానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. కాళిదాసు వాడిన ఉపమా లంకారాలు ఏ కవీ వాడలేదేమో; అందుకే "ఉపమా కాళిదాసస్య" అనే ప్రతీతి వ్యాపించింది.

ఇటువంటి ప్రాచీన సాహిత్యం మన కెంతవరకు అవసరం? అది నేటి సమాజానికి ఏ విధంగా ఉపయోగపడుతుంది? సమకాలిక సాహిత్యానికంటె అది ఉత్కృష్టమైనదా? కాలంలోని ప్రాచీనత్వం మాత్రమే సాహిత్యానికి శ్రేష్ఠత్వాన్ని ప్రసాదిస్తుందా? ఇటువంటి సందేహాలకు కాళిదాసే స్వయంగా సమాధానం చెప్పు కొన్నారు :

"పురాణమిత్యేవ నసాధుసర్వం
నచాపికావ్యం నవమిత్య వద్యం"

పాతదయినంతమాత్రాన అంతా మంచిదికాదు. క్రొత్తదయినంతమాత్రాన కావ్యం చెడ్డదికాదు. కనుక ప్రాచీనమైనదంతా చెడ్డదికాదన్నప్పుడు అర్థం ప్రాచీన మైనదంతా చెడ్డదనీకాదు; నవీనమైనదంతా చెడ్డదికాదు అన్నప్పుడు నవీనమైన దంతా మంచిదనీకాదు. ప్రాచీనమైనదానిలోను మంచీ చెడులుంటాయి. నవీనమైన దానిలోను మంచీ చెడులుంటాయి.

ప్రమాదమల్లా ఎక్కడ వస్తుందంటే ప్రాచీనత మాత్రమే మంచిదనడం లోను, నవీనత మాత్రమే మంచిదనడంలోను, ప్రాచీనతంతా భారతదేశంతోను, నవీనతంతా పాశ్చాత్యదేశాలతోను ముడివేయడంకూడ సమంజసంగా తోచదు. మా ఊరి లైబ్రరీలో కూడిన మిత్రమండలిలో ఇటువంటి చర్చలు కూడా జరుగుతుండేవి. రెండు వర్గాలవారు రెండు వాదాలను అవలంబిస్తే వాటి రెంటికీ రాజీ మార్గమైన మధ్య మార్గాన్ని నేను అవలంబించేవాణ్ని.

జపాను, జర్మనీతో కలిసి యుద్ధం చేస్తున్నందువల్ల భారతదేశంలోని బ్రిటిషు ప్రభుత్వం జపాను అంటే మండిపడుతోంది. భారతీయులు చాలామంది జపానువారి పంచమాంగదళం వారే అని నిర్ణయించి జపానును ఇదివరలో సందర్శించిన వారిని, జపానుతో సంబంధం వున్నదని అనుమానించిన వారిని అరెస్టు చేసి జైళ్ళలో వుంచుతున్నారు. ఈ సందర్భంలో దేశంలోని ఇళ్ళూ, వాకిళ్ళూ శోధిస్తున్నారని, జపానుకు సంబంధించిన పుస్తకాలున్నాకూడా అరెస్టులు చేస్తున్నారని ఒక వాడుక పుట్టింది. నా దగ్గర కొన్ని జపాను సంబంధమైన పుస్తకాలున్నాయి. వాటిని దాచడమా లేక బహిరంగంగానే వుండనీయడమా అనే సందేహం వచ్చింది. వాటిని దాయకుండా బహిరంగంగానే వుంచదలచాను. అంతగా జైలుకు పోవలసివస్తే పోవడానికే సిద్ధపడి వున్నాను. జీవితంలో అదొక నూతన అనుభవం కలుగుతుందని అనుకొన్నాను.

ఎన్నాళ్ళకు కూడ ఎవరూ రానూలేదు. సోదాలు చేయనూలేదు. ఆ జపాను పుస్తకాలు అక్కడే వున్నాయి. నేను జైలుకు పోనేలేదు. రోజుకొక పుకారు బయలుదేరేది. దానితో ప్రజలు కొంత బీభత్సపడేవాళ్ళు. బాంబరు విమానాలు వచ్చి ఊళ్ళమీద బాంబులు వేస్తున్నవని కొన్నాళ్ళు ప్రజలు భయంతో కంపించేవాళ్ళు.

# శ్రీ అడివి బాపిరాజుతో పరిచయం

సెప్టెంబర్ మాసంలో వర్షాలు ఎంతగా వుంటాయో, ఎండలూ, ఉక్కా అంత ఎక్కువగా వుంటాయి. వర్షఋతువుకు, శరదృతువుకు సెప్టెంబర్ సంధి కాలం. పందొమ్మిదివందల నలభై మూడులోని సెప్టెంబర్‌లో ఎండలకంటె, ఉక్క కంటె వర్షాలు ఎక్కువ. బెజవాడలోని యస్. ఆర్. ఆర్. కాలేజీలో ఆంధ్రోత్స వాల ప్రారంభం. ఆ కాలేజీ ప్రిన్సిపాల్ పుట్టపర్తి శ్రీనివాసాచారి. నన్ను ఆ వారం రోజులు తమ ఇంటిలో వుండమని ఆహ్వానించారు. కార్యక్రమంలో నన్ను ఉపన్యాసకునిగా కూడా వేశారు. నా దగ్గరవున్న రోరిక్ చిత్రాల ప్రతులు, అసిత్ కుమార్ హాల్దార్ కొన్ని చిన్న చిత్రాలు, వీరేశ్వరసేనుని మినియేచర్ ప్రకృతి దృశ్యాలు, ఇవన్నీకూడా చిత్ర ప్రదర్శనంలో వుంచారు.

వారంరోజులు నిత్యం ప్రముఖుల ఉపన్యాసా లుంటుండేవి. కాలేజీలో శ్రీయుతులు విస్సా అప్పారావు, అడివి బాపిరాజు, వరదా వెంకటరత్నం, మొక్క పాటి కృష్ణమూర్తి మొదలైన వారంతా పాల్గొన్నారు. చాలామంది కళాకారుల కళాకృతులు ప్రదర్శింపబడినాయి. డాక్టర్ శ్రీనివాసాచారి ఉత్సాహం కార్యరూపంలో ప్రత్యక్షమైనందున కాలేజీ అంతా కన్నులపండువుగా వున్నది.

ఇతరుల ఉపన్యాసాలు వింటూ శ్రోతగా కూర్చోవడంలో ఎంతో ఆనందం అనుభవించాము రెండురోజుల పాటు. మూడవ రోజున పరిస్థితి మారింది. నేను ఉపన్యసిస్తుంటే ఇతరులు శ్రోతల స్థానంలో కూర్చొని వినవలసిన సమయం ఆసన్నమైంది. మనసులో సంకోచం, కుతూహలం రెండూ కలగసాగాయి. ఇది నా రెండవ బహిరంగోపన్యాసం. మొదటి తడవ దుగ్గిరాలలో లైబ్రరీల సభలో ఉపన్యసిస్తున్నప్పుడు హాజరైన శ్రోతలు వేరు. నేటికిక్కడ కాలేజీలో హాజరు అయిన శ్రోతలు వేరు. ఆనాటి వారంతా ఎక్కువగా ధోవతీ చొక్కాలవారు; నేటి శ్రోతలలో ఎక్కువమంది నెక్‌టైతోసహా సూట్లు ధరించినవారే. మరి వారి ఎదుట కంటె వీరి ఎదుట ఉపన్యసించడం ఎక్కువ కష్టం. వీరిలో కూడా సూట్లు వేసు కోని శ్రీ విస్సా అప్పారావు, శ్రీ అడివి బాపిరాజుగారి లాంటి సంస్కృతీ సంప న్నుల ఎదుట ఉపన్యసించబూనడం కూడా దుస్సాహసమే.

## ప్రాచ్య చిత్రాల రేఖా ప్రాధాన్యత

నా ఉపన్యాసానికి శ్రీ విస్సా అప్పారావు అధ్యక్షత వహించారు. నేను ఉప న్యసించవలసిన విషయం "ప్రాక్పశ్చిమ చిత్ర కళల విభేదాలు." సంపూర్ణమైన

ఆత్మవిశ్వాసాన్ని సృష్టించుకొని ఉపన్యసించ ప్రారంభించాను. ప్రాచ్య చిత్రాల రేఖా ప్రాధాన్యత, పాశ్చాత్య చిత్రాల వర్ణప్రాధాన్యత. అందులోని సౌకుమార్యం, ఇందులోని శక్తి; అందులోని దృష్టిక్రమ అస్పష్టత, ఇందులోని దృష్టిక్రమ విస్పష్టత మొదలైన వెన్నో ఉపన్యసించాను. ఆ సమయంలో ఉపన్యసిస్తున్న నన్ను నేను మరచాను; నా కెదురుగా కూర్చున్న శ్రోతల అస్తిత్వాన్ని మరచాను. వేదిక ఎక్కబోయే సమయాన నన్ను ఆవరించిన సిగ్గూ బిడియాలు మటుమాయమై పోయాయి.

ఉపన్యాసం విని అధ్యక్షత వహించిన శ్రీ విస్సా అప్పారావు, శ్రోతలలో ముందు కూర్చున్న శ్రీ అడివి బాపిరాజు కూడా ఆనందించి, అభినందించారు. ఆ సభలో తరువాత మరికొంతమంది ఉపన్యాసాలు చేశారు.

ఆ మరుసటిరోజున వినాయక చవితి. శ్రీనివాసాచారిగారింటికి ఆనాడు అడివి బాపిరాజును భోజనానికి పిలిచారు. బాపిరాజు ఆయన భార్యా, వారి అమ్మాయీ భోజనానికి వచ్చారు. అడివి బాపిరాజును నేను బెజవాడలో అదే మొదటిసారీ, ఆఖరుసారీ కూడా చూడడం.

భోజన సమయంలో శ్రీ బాపిరాజు ఎన్నో చలోక్తులు విసరసాగారు. వైష్ణవుల వంటలు, వడ్డించే పద్ధతులు మొదలైన వాటిని గురించి చెప్పే తమాషాలను విని డాక్టర్ శ్రీనివాసాచారి ఆయన సతీమణి కడుపుబ్బ నవ్వ సాగారు. భోజనానంతరం తాంబూలాలు వేసుకొంటూ బాపిరాజు గారు తమ కళానుభవాలను అనేకం చెప్పారు. తాము చిత్రించిన చిత్రాల సంఖ్య చాలా స్వల్పమనీ, అయినా చిత్రాల సంఖ్యనుబట్టి కాక సారాన్నిబట్టే చిత్రకారుని ప్రతిభను కొలవాలన్నారు.

వికలాంగురాలైన తమ కుమార్తె వేసిన చిన్న చిత్రాలను కొన్నిటిని మాకు చూపించారు. ఆ అమ్మాయి వయసుకు మించిన ప్రతిభ ఆ చిత్రాలలో గోచరిస్తున్నది. నా భవిష్యత్తుని గురించి, జీవితంలో నా లక్ష్యాన్ని గురించి శ్రీ బాపిరాజు నన్ను ప్రశ్నించారు. నేను నవ్వి వూరుకున్నాను.

శ్రీ బాపిరాజు రచనలను చదివాను; ఆయన చిత్రాలను చూచాను. కాని ఆయన చిత్రాలకంటే ఆయన రచనలే నాకు ఎక్కువ నచ్చాయి. శ్రీ బాపిరాజు చిత్రకారునికంటే సాహిత్యకారుడే. అధిక ప్రతిభాన్వితుడు.

కాలేజీ ఆంధ్ర వారోత్సవాలను ముగించుకొని నేను ఇంటికి తిరిగి వచ్చాను. వర్షాధిక్యంవల్ల కాలేజిలోని నూతన భవనాలలో పైనుంచి నీరు వెలసినందువల్ల

నేను ప్రదర్శించిన వీరేశ్వర్ సేన్ జలవర్ణ చిత్రాలమీద నీటిమరకలైనాయి. అయినా అంత పెద్దగా ఏమీ చెడిపోలేదు. తైలవర్ణ చిత్రాలకు, జలవర్ణ చిత్రాలకు వున్న తారతమ్యం ఇదే. తైల చిత్రాలమీద ఎంత నీరు పడినా ప్రమాదం లేదు. జలవర్ణ చిత్రాలు గాజు సామానులాంటివి; వీటిని మహా సున్నితంగా వాడాలి.

## శ్రీ గంగూలీతో పరిచయం

సువిఖ్యాత కళా సమీక్షకులు "రూపం" అనే పత్రిక సంపాదకులు, కలకత్తా విశ్వవిద్యాలయంలో వాగీశ్వరీ లలిత కళల ప్రొఫెసర్ అయిన శ్రీ ఒ. సి. గంగూలీ త్రివేంద్రం నుంచి తిరిగి కలకత్తాకు వెళుతూ నాకు ఉత్తరం వ్రాసారు, ఫలానా రోజు మెయిలులో బెజవాడ స్టేషన్‌లో కలుసుకోమని. అంతవరకు ఆయ నను నేనుకాని, నన్ను ఆయనకాని చూడడం జరగలేదు. ఆయన ఫొటో చూచి వున్నాను కనుక రైలులో ఆ బుర్ర మీసాల బెంగాళీ బాబును గుర్తించాను. వయసు అరవై అయిదు వుంటాయి. దర్పాన్ని తెలిపే దట్టమైన పెద్ద మీసం వున్నది. పురాతన బెంగాళీ సంప్రదాయానికి చెందిన వ్యక్తి ధోతీ కట్టుకొని పట్టుకోటు వేసు కొని వున్నాడు. వెంట ఆయన శిష్యురాలు కుమారి సుధాబోసు వుంది.

కలకత్తా విశ్వవిద్యాలయానికి చెందిన విద్యాసంస్థలలో కళాస్వాదన కోర్సులు పెట్టించడంలో చాలా పాటుపడ్డారు ప్రొఫెసర్ గంగూలీ. నాలో కళా స్వాదన విజ్ఞానాన్ని కలిగించడంలో ఉత్తరాల ద్వారా చాలా తోడ్పడ్డారు. అక్కడ దిగమని తుమ్మపూడి వెళదాం రమ్మనీ అడిగేను. ఈ తడవకు సరాసరి వెళ్ళిపోతా మనీ, పైతడవ వచ్చినపుడు వస్తామనీ అన్నారు. రైలు కదిలేంతవరకు కళలకు సంబంధించిన విషయాలు, సాహిత్యానికి సంబంధించినవి, సంగీతానికి సంబంధించి నవి, అనేకం ముచ్చటించుకొన్నాం. ప్రొఫెసర్ ఒర్ధేంద్రకుమార్ గంగోపాధ్యాయ (ఓ. డి. గంగూలీ) సంగీతాన్ని గురించి చాలాకాలం పరిశోధనలు చేసి "రాగ రాగణీ" అనే సచిత్రమైన బృహత్తర గ్రంథాన్ని రచించారు.

ఆయన మీసం తీసేస్తే ఏవిధంగా వుంటుందని ఆయన్ను ప్రశ్నిస్తే ఆయన నవ్వుతూ అన్నారు సంజీవదేవ్ ముఖం మాదిరే వుంటుంది అని. అందుకు నేను అన్నాను, సంజీవదేవ్ మీసం పెంచితే గంగూలీలాగా వుంటాడు అని. అందుకు ఆయనా, కుమారి సుధాబోసు కూడా పెద్దగా నవ్వసాగారు. ఇంతలో మెయిలు కదిలింది. నేను దిగిపోయాను. తాను వ్రాసిన కొన్ని బెంగాలీ వ్యాసాలను, ఇంగ్లీషు వ్యాసాలను ఇచ్చాడు.

లక్నో ప్రభుత్వ లలితకళల విద్యాలయంలో వైసు ప్రిన్సిపాల్‌గా వుంటున్న వీరేశ్వరసేన్ గంభీరమైన ఉత్తరాలు వ్రాస్తున్నాడు. ఆయన చిత్రించిన మినియేచర్ ప్రకృతి చిత్రాలను పంపుతుండేవాడు. హిమాలయ దృశ్యాలను వివిధ రూపాలలోని రంగులలో చిత్రించేవాడు. ఆయన ఇదివరలో కాలేజీలలో ఇంగ్లీషు ప్రొఫెసరు చేసినందున ఆయన ఆంగ్ల రచనలు కూడా అద్భుతంగా వుండేవి. సేన్‌కు ఎం. ఎస్. రంధ్వా అనే ఐ. సి. ఎస్. ఆఫీసర్ ఒక మిత్రుడున్నాడు. రాయబరేలీలో ఆయన జిల్లా కలెక్టర్ చేస్తున్నాడు. వీరేశ్వరసేన్ ద్వారా రంధ్వాతో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగినాయి నాకు.

మహేంద్రసింగ్ రంధ్వా మంచి మంచి ఉత్తరాలు వ్రాయసాగాడు. ఆయనకు చాలామంది విదేశీ చిత్రకారులతో పరిచయం వుంది. అల్మోరా ప్రాంతంలో వుంటున్న అమెరికన్ చిత్రకారులైన బ్రూస్టర్ దంపతులను గురించి, తాను రచించిన చిన్న పుస్తకాన్ని నాకు పంపించాడు. రాయబరేలీ వచ్చి కొన్నాళ్ళు తన బంగళాలో వుండమని వ్రాశాడు. కాని నేను వెళ్ళడం పడలేదు. ఆయన వృక్ష శాస్త్రంలో ఎం. ఎస్. సి. పాసై ఇంగ్లండువెళ్ళి ఐ. సి. ఎస్. చదివి వచ్చాడు. పూలచెట్లను గురించి ఆయన చాలా పరిశోధనలు చేశాడు. చిత్రకారుడు కాడు కాని చిత్రకళ అంటే ఆయనకు చాలా ఇష్టం. అందులోను ప్రకృతి చిత్రాలంటే ఆయనకు విశేష శ్రద్ధ. అందుకే ప్రకృతి చిత్రకారుడైన వీరేశ్వర్ సేన్‌తో ఆయనకు మైత్రి. ఆయన చాలా చిత్రాలను సంగ్రహిస్తుంటాడు. చిత్రాలను గురించి, చిత్రకారులను గురించి వ్రాస్తుంటాడు.

ఒకసారి రంధ్వా నా వివాహంవిషయమై వ్రాస్తూ వివాహవిషయంలో ఎక్కువగా ఆలోచించవద్దని, ఏ కొరతాలేని ఆదర్శవధువు కల్పనాజగత్తులో తప్ప వాస్తవ జగత్తులో దొరకదని వ్రాశాడు. కేవలం ఆదర్శవాదంలోనూ, కల్పనా జగత్తులోను నివసించడం ఆయనకు గిట్టేదికాదు. ఆయన ముఖ్యంగా ఆచరణవాది. రసాస్వాదన కల్పనాజగత్తులో విహరించడానికి కాక వాస్తవమైన వ్యవహార జగతులో ఆనందంతో నివసించడానికే అని రంధ్వా వాదన.

నేను నిత్యమూ చాలామందికి ఇటువంటి ప్రముఖులకు ఉత్తరాలు వ్రాయవలసి వుండేది. చిన్నది పోర్టబుల్ హెర్మిస్ టైపుయంత్రం సంపాదించాను. వీరందరికీ దానిమీదనే టైపుచేసి ఉత్తరాలు పంపేవాణ్ణి. ఒక్కోసారి చేతితో వ్రాసేవాణ్ణి.

రోజులో చాలా సమయం పుస్తకాలు చదవడంలోను, వచ్చిన ఉత్తరాలు చదవడంలోను, ఉత్తరాలు వ్రాయడంలోను సరిపోయేది. ఇవన్నీ అయిన తరువాత బయటికి వెలుగులోకి వెళ్ళి కూర్చుంటే మనసుకు హాయిగా, తేలికగా వుండేది. ఏ రోజు పని ఆ రోజున పూర్తిచేసుకోకుండా బజారుకు వెళ్ళినామంటే ఏదో బరువుగా తట్టేది. ఏదో నెరవేర్చాల్సిన పని బోలెడు నెత్తిమీద బరువుగా వున్నట్టు తట్టి అక్కడ కూర్చున్నంతసేపూ హాయిగా వుండేదికాదు.

పర్యటన గాథలకు సంబంధించిన పుస్తకాలు ఎక్కువగా చదవాలనిపించేది. ఆయా పుస్తకాలలోని పర్యటకులు వ్రాసిన తమ పర్యటన అనుభవాలను చదువుతుంటే ఆ పర్యటనలన్నీ నేను స్వయంగా చేస్తున్నట్లే తట్టేది. అందువల్ల పర్యటన గ్రంథాలు అన్నిటికి మించిన ఆనందం ప్రసాదించేవి.

# రాహుల్‌జీతో నా పరిచయం

పంతొమ్మిది వందల నలభై నాలుగులో బ్రహ్మాండమైన సభలు జరిగాయి బెజవాడలో. అఖిలభారత కిసాన్ మహాసభలు కమ్యూనిస్టుల ఆధిపత్యం క్రింద జరిగాయి. ఆ సభలకు అధ్యక్షత వహించారు బీహారు రైతు ఉద్యమ నాయకుడైన స్వామి సహజానంద సరస్వతి. అఖిలభారత కమ్యూనిస్టు నాయకులంతా హాజరైనారు. పగలు నాయకుల ఉపన్యాసాలు, రాత్రులు వివిధాలైన సాంస్కృతిక కార్యక్రమాలు. కొన్నాళ్ళపాటు బెజవాడ మొత్తం గొప్ప తిరునాళ్ళగా మారిపోయింది.

ఈ రైతు మహాసభల మూలంగా రైతుల కెంతవరకు ఉపకారం కలిగిందో నాకు తెలియదు కాని, నాకు మాత్రం చాలా ఉపకారం కలిగింది. మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ త్రిపిటకాచార్యతో నాకు పరిచయం, స్నేహమూ ఏర్పడినాయి, ఈ సభల మూలంగా. ఇందుకు ప్రత్యక్షకారకులు డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచారి. రాహుల్ సాంకృత్యాయన్‌తో శ్రీనివాసాచారిగారికి లండన్‌లో స్నేహం ఏర్పడింది. రాహుల్‌జీకు నన్ను పరిచయం చేస్తాను రమ్మని ఆయన ముందుగానే నాకు వ్రాశారు.

నేను డాక్టర్ శ్రీనివాసాచారిగారింటికి వెళ్ళాను. వెళ్ళుతుండగానే బెజవాడ వీధులలో కిసాన్ మహాసభల ఊరేగింపులలో మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ కనిపించారు. నేను ఆయనను చూడడం మాత్రమే జరిగింది. ఆయన ప్రత్యేక ఆకృతి అందరిలో విశిష్టంగా గోచరిస్తూనే వుంది దూరానికి. తెల్లని వస్త్రాలలో బుద్ధుని పాలరాతి ప్రతిమలాగా గోచరించారు రాహుల్‌జీ. దూరంగా గోచరిస్తున్న రాహుల్‌జీని త్వరలో దగ్గరగా చూస్తాను. అపరిచితంగావున్న రాహుల్‌జీ పరిచితులు కాబోతారు. నేను మాత్రమే చూస్తున్న రాహుల్‌జీ త్వరలోనే నన్ను కూడ చూస్తారు. ఇదంతా మిత్రులు డాక్టర్ శ్రీనివాసాచారిగారింట అనతికాలంలోనే జరగబోతున్నదనే సంతోషంతో ఊరేగింపులోని రాహుల్‌జీని ఊరేగింపులోనే వదిలేసి నేను శ్రీనివాసాచారిగారింటికి వెళ్ళాను.

ఆ రాత్రి రాహుల్‌జీకి డాక్టర్ శ్రీనివాసాచారి గారింట భోజనం. భోజనం వేళకు చాలా ముందుగానే రాహుల్‌జీ వచ్చివేశారు. ఆయన వంటరిగా మాత్రమే వచ్చారు వెంట ఎవరూ లేకుండా. ఉదయాన దూరాన్నుంచి చూచిన రాహుల్‌జీని ఇప్పుడు దగ్గరగా చూచాను. గొప్ప విగ్రహం. తేజోమయమైన ముఖం. శ్రీనివాసా

చారిగారు నన్ను రాహుల్‌జీకి పరిచయం చేసి, రాహుల్‌జీని నాకు పరిచయం చేయబోతుండగా నేను అడ్డువచ్చి "మీరు అనవసరంగా శ్రమపడవద్దు. నేనెవరో ఆయనకు తెలియదు కాని, ఆయన ఎవరో నాకు తెలుసు" అన్నాను. శ్రీనివాసాచారిగారితో నేను చెప్పిన తెలుగుమాటలు రాహుల్‌జీకి ఎంతవరకు అర్థమైనవో నాకు తెలియదు. ఆయన అందుకు నవ్వి ఊరుకొన్నారు. అది తెలిసిన నవ్వో తెలియని నవ్వో నేను తెలుసుకోలేక నేనుకూడా నవ్వి ఊరుకొన్నాను. ఆయనకు తెలుగు చదవడం తెలుసుకాని మాట్లాడుతుంటే బాగా అర్థం చేసుకోలేరు.

భోజనంలో వడ్డించినవన్నీ ఆయన తినివేశాడు. ఆయనకు ఉప్పు, పులుపు, కారం, తీపి మొదలైన రుచులలోని భేదం తెలిసినట్లు లేదు. రాహుల్‌జీ రుచిని దాటిన వ్యక్తి; ఆయనకు ఏ ప్రాంతపు భోజనమూ క్రొత్తగా తట్టదు. భారత దేశపు వివిధ ప్రాంతీయ భోజనాలలోని విశేషాలను చెప్పసాగారు ఆయన. అన్ని ప్రాంతాల భోజనాలలోకీ ఏ ప్రాంతపు భోజనం బాగుంటుందని అడిగితే రాహుల్‌జీ అన్నారు "మాంసం గనుక వుంటే ఏ ప్రాంతపు భోజనమైనా బాగానే వుంటుంది" అని. ఈ మాట విన్న శ్రీనివాసాచారిగారి సతీమణి తెల్లబోయి నావైపు చూచారు.

భోజనానంతరం శ్రీనివాసాచారిగారు, రాహుల్‌జీ తాముభయులు లండన్‌లో గడిపిన రోజులను, అక్కడి ఆనాటి మిత్రులను జ్ఞాపకం చేసుకుంటూ కొంతసేపు ముచ్చటించుకొన్నారు. భోజనానంతరం రాహుల్‌జీ జేబులోనుంచి సిగరెట్లు తీసి ఒకదాని వెంట మరొకటి కాల్చడం ప్రారంభించారు. రాహుల్‌జీ తత్వాన్ని నేను సరిగా బోధపరచుకొనడానికి కొంత బాధపడ్డాను. ఆయన గొప్ప బౌద్ధపండితుడు. పండితుడేకాదు, బౌద్ధ సన్యాసిగాకూడా ఆయన చాలాకాలం హిమాలయాలలోను, టిబెట్‌లోను పర్యటించాడు. అయినా మాంసం తినడం, సిగరెట్లు కాల్చడం మొదలైనవి ఆయనలో వుండడం గమనించి ఆయనలోని వ్యతిరేకతలను సమన్వయించుకోలేక ఆశ్చర్యపోసాగాను.

## రాహుల్‌జీతో ఒక వారం

ఆయన నాతో తుమ్మపూడి రావడానికి, ఆయననే నేను వెంటతీసుకొని అమరావతి, నాగార్జునకొండ త్రిప్పి తీసుకరావడానికి ఆయన అంగీకరించారు. తుమ్మపూడిలో మా అతిథిగా ఆయన ఒకవారం రోజులు గడపడం జరిగింది. ఆ వారమూ నా జీవితంలో ఎన్నో దీపికలను వెలిగించింది రాహుల్‌జీ సాహచర్యం. చరిత్రను గురించి, భాషలను గురించి, వివిధ దేశాలను, మానవులను గురించి.

భౌతికవాదాన్ని గురించి, మతాలను గురించి, మూఢ విశ్వాసాలను గురించి. ఇంకా ఎన్నెన్నో విషయాలను గురించి ఎంతో ఆయనవల్ల నేర్చుకొన్నాను.

అప్పుడు మా ఇంట మా పెంపుడు తల్లీ, నేనూమాత్రమే నివసిస్తూండే వారం. మేమందరం శాకాహారులం కావడం మూలంగా మా యింట రాహుల్‌జీ కిష్టమైన మాంసాహారం ఆయనకు దుర్లభమైపోయింది. మాంసాహారం తినక పోవడం మంచి లక్షణం కాదని ఆయన అనేకసార్లు అంటూ వుండేవారు. అయినా, ఆయన చేసే ఈ ఉపదేశాన్ని మాత్రం మేమంతా నిర్లక్ష్యపరచి దాన్ని స్వీకరించేవారం కాము.

ఆయన రచనలలో ప్రఖ్యాతమైన "ఓల్గాసే గంగా" అనే హిందీ పుస్తకాన్ని నాకిచ్చారు. మే ముభయులము ఉదయానే బకింగ్‌హాం కాలవలో ఈత ఈదే వారం. బకింగ్‌హాం కాలవ పేరు తీసివేసి మరేదైనా పేరు పెడితే ఈ కాలవ ఇంకా ఎక్కువ సుందరంగా వుంటుందని నవ్వేవారు. ఆంగ్లేయులపేర్లు ప్రతిదానికి పెట్టివుండడం ఆయనకు చాలా అసహ్యంగా కనిపించేది.

మా గ్రామం సమీపంలో కొన్నిచోట్ల ఆయన మిత్రులలో హిందీలో ఉపన్యాసాలు చేస్తుంటే నేను వాటిని తెలుగులోకి తర్జుమా చేశాను. రష్యాలో తాను చూచిన వ్యవసాయ విధానాలను గురించి, అక్కడి సామాన్య మానవుని ప్రగతి శీలతను గురించి, ఆయన ఎక్కువగా ఉపన్యసించేవారు. రాహుల్‌జీ గొప్ప వక్త కాదు: నెమ్మదిగా ఆగి ఆగి ప్రసంగించేవారు. ఆయన ప్రధానంగా రచయిత, ఆయన కలానికున్న వేగం ఆయన నాలుకకు వుండేదికాదు. అయినప్పటికీ ఆయన ఉపన్యాసాలు ఎంతో విజ్ఞానప్రదంగా, వినోదాత్మకంగా వుండేవి.

రాహుల్‌జీ మా ఇంట వుండగనే ఆంధ్రదేశంలో రాజకీయ రంగంలోను, సాంస్కృతిక రంగంలోను, ప్రసిద్ధులైన ఇద్దరు కాంగ్రెసువాదులు వచ్చి వారిలో ఒకరి అమ్మాయిని నన్ను వివాహమాడమని కోరారు. నాకు అసలు అప్పుడు వివాహ విషయంలో విముఖత వుండేది. వివాహ విషయాన్ని భవిష్యత్తు మీదకు వదలి తాత్కాలికంగా ఉపశాంతిని పొందుతుండేవాణ్ణి. దానికితోడు రాహుల్‌జీకూడా నన్ను ఆ విషయంలో నిరుత్సాహపరచడంతో ఆ వచ్చిన ఇద్దరు పెద్దలకు ప్రస్తుతానికి నాకు వివాహేచ్ఛ లేదని చెప్పివేశాను.

ఒకరోజు బయలుదేరి అమరావతి వెళ్ళి అక్కడి శిల్పాలను, శిథిలాలను పరిశీలించి, అక్కడ కృష్ణానదిలో కొంతసేపు ఈతవేసి ఆ సాయంత్రానికి

గుంటూరు చేరుకున్నాం. ఆ రోజులలో రాహుల్‌జీ ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు. మేము ఆ సాయంత్రానికి గుంటూరు వస్తున్న విషయం అక్కడి జిల్లా కమ్యూనిస్టు ఆఫీసుకు తెలుసు. అందువల్ల మమ్మల్లను వారు తమ ఆఫీసులోనే ఉంచి మంచి సన్మానం చేసి విందుకూడా చేశారు. ఆ రోజుల్లోనే నాజర్ బుర్రకథ ప్రారంభం. ఆ రాత్రి మాకు నాజర్ బుర్రకథ వినిపించారు. కథ సరిగా అర్థం కాకపోయినా కూడా సంగీతం విని, అభినయం చూచి ఆయన చాలా ఆనందించారు.

## నాజర్ బుర్రకథ

మరునాడు ఉదయానే నాగార్జునకొండకు పయనమై వెళ్ళాం రైలులో. మాచర్లనుంచి రెండు ఎద్దుల బండిలో బయలుదేరాం 14 మైళ్ళ నాగార్జునకొండకు బండిలో కూర్చొని, ఆయన తన రష్యన్ భార్య విషయాలు, కుమారుడు ఇగార్ సమాచారాలు ఆనందంతో చెప్పసాగారు సిగరెట్టు పొగలు వదలుతూ. వాళ్ళను చూచి చాలాకాలమైనందున ఆయన వాక్కులలో, ఆయన కళ్ళలో ఎంతో వియోగ బాధ వ్యక్తం కాజొచ్చింది. ఒకనాటి విరాగియైన బౌద్ధసన్యాసిలో నేను ఇంతగా అనురాగ బంధన, విరహవ్యథ చూచి నేను విస్మయం చెందాను. బహుశా విరాగ సాధనలోని సిద్ధి అనురాగసుధయేనేమో? అను రాగసిద్ధికి విరాగసాధన ఒక పెద మార్గం మాత్రమేనేమో?

నాగార్జునకొండ చరిత్రంతా రాహుల్‌జీకి కరతలామలకం. ఇక్ష్వాకుల పరిపాలన, విజయపురి రాజధాని, ఇక్ష్వాక రాజ్యాన్ని స్థాపించిన "సిరిఛాంశిమూల" బ్రాహ్మణ మతస్థుడు; ఆయన సోదరులు "హిమ్మసిరిణ", "ఛాంతసిరి" మాత్రం బౌద్ధులు. ఇక్ష్వాకులపాలన క్రీస్తుశకం 250 నుంచి 340 వరకు సాగింది. నాగార్జునకొండ శిల్పాలు ఈ కాలానికి చెందినవే. ఇక్ష్వాకులు ఆంధ్ర శాతవాహనుల సామంతరాజులు. వీరుభయులకు సంబంధబాంధవ్యాలు కూడా వుండేవి.

రోజంతా శిల్పాలను పరిశీలించడంలోను, ఇంకా అనేక శిధిలాలను అనుశీలించడంతోను సరిపోయింది. ఆ రాత్రి మా నిమిత్తం లంబాడీ నాట్యాలు ఏర్పాటు చేయబడినాయి. రాహుల్‌జీ వాటన్నిటినిచూచి ఆనందించాడు. ఆరాత్రి నాట్యాలు చూచి చాలా ప్రొద్దుపోయి ఆయనా, నేనూ మా పక్కలమీద శయనించాం. కాని రాహుల్‌జీ ఏదో నాతో మాట్లాడుతూనే వున్నందునను, నేను ఆయనను ఏదో అడుగుతున్నందునను ఆయనకూ నాకు ఉభయులకు నిద్రలేదు. తెల్లవార్లు తన వివాహవిషయాలను గురించి చాలా చెప్పారు. తన 51 వ సంవత్సరాన తన వివాహమైనదట. మొదట సన్యాసాశ్రమం తరువాత గృహస్థాశ్రమం అవలంబించడమే క్రమరీతి అని ఆయన చెప్పారు. ఆయన కెన్నో భాషలతో సంబంధం; ఎన్నో విషయాలతో సాన్నిహిత్యం వుంది.

# శ్రీ జిడ్డు కృష్ణమూర్తి తత్వచింతన

ఎండలు మండిపోతున్నాయి. పడమరనుంచి తోలుతున్న వడగాలిని భరించడంలో అంతగా బాధ కలిపించేదికాదు కాని బొత్తుగా గాలి బిగదీసిన ఉక్కను భరించడం చాలా బాధగా వుండేది. ఇటువంటి సమయంలో ఏమీ వ్రాయ బుద్ధి అయేదికాదు, ఏమీ ఆలోచించ బుద్ధి అయేదికాదు. కేవలం ఏ చెట్టునీడనో కూర్చొనో పడుకొనో పగటికలలు కనబుద్ధి మాత్రమే అయేది.

పగటికలలు రాత్రి కలలకంటె మధురతరంగా వుంటాయి. రాత్రి కల లంటే నిద్రలో వచ్చే కలలు. పగటి కలలంటే మేల్కొనే కనే కలలు. రాత్రి కలలమీద అంతగా మన అధికారం వుండదు; అవే మనమీద అధికారం కలిగి వుంటాయి. ఇక మేల్కొనివుండి కనే పగటికలలమీద పూర్తిగా మన అధికారం వుంటుంది. రాత్రులు నిద్రలో మన ఇష్టం వచ్చిన కలలను సృష్టించుకోజాలం; పగటికలలను మాత్రం ఇష్టంవచ్చినవి సృష్టించుకోగలం.

ఇటువంటి మధురమైన పగటికలలను కంటూ ఇంటివెనుక మామిడిచెట్టు క్రింద పడుక్కొని కోయిలకూతను వింటూ, వేడితో మాడే వడగాలిని సేవిస్తూ, హిమాలయాల చల్లదనాన్ని గుర్తుతెచ్చుకుంటూ వున్న తరుణంలో పోస్టుమనిషి మూడు ఉత్తరాలు తెచ్చి ఇచ్చాడు. వాటి దస్తూరినిపట్టి తెలుసుకున్నాను. ఒకటి నికోలస్ రోరిక్ నుంచి అని, రెండవది రాహుల్ సాంకృత్యాయన్ నుంచి అని. మూడవది అసిత్‌కుమార్ హాల్దార్‌నుంచిఅని. మూడూకూడా ప్రియమైన ఉత్తరాలే. అందుకని ముందుగా దేనిని చించి చదవాలా అని సందేహం వచ్చింది. మిగతా ఇద్దరూ పాతమిత్రులు. రాహుల్‌జీ మాత్రమే కొత్త మిత్రుడు. అందుకని రాహుల్‌జీ ఉత్తరాన్ని ముందుగా చించి చదవసాగాను. ఆయన ఉత్తరం హిందీలో వున్నది. ఆయన దస్తూర్ చదవటం కొంచెం కష్టంగానే వుంది. రాహుల్‌జీ ఉత్తరాన్ని సగం చదివి ఇక కుతూహలాన్ని ఆపలేక హాల్దార్‌గారి ఉత్తరాన్ని చించి చదవసాగాను. ఇది బెంగాలీలో వుంది. ఇది సగం చదివిన తరువాత మళ్ళీ కుతూహలాన్ని ఆపలేక రోరిక్‌గారి ఉత్తరాన్ని చించి సాంతం చదివాను. ఇది ఇంగ్లీషులో వుంది.

రాహుల్‌జీ వ్రాశారు. తనకు పాస్‌పోర్టు లభించనందువల్ల తాము రహస్యంగా కాలినడకను భారతపరిహద్దులు దాటదలచినట్టు, ముందుగా ఇరాన్ చేరి అటునుంచి క్రమంగా రష్యా చేరదలచినట్లు. ఈ విషయాన్ని అతి రహస్యంగా

వుంచమని వ్రాశారు. వాలో అప్పుడప్పుడు మిణుకు మిణుకు మంటున్న మర్మవాద (Mysticism) పు దీపశిఖలు ఆయనకు నచ్చలేదు. అందుకని తన ఉత్తరంలో భౌతికవాదపు మహిమను వర్ణించడంలో ఆయన ఏమాత్రమూ వెనుదీయలేదు. ఆయన భౌతిక దృక్పథాన్ని నేను అనుసరించగలిగాను కాని ఆ దృక్పథాన్ని వాదిగా చేసుకొనేందుకు నేను ఇష్టపడలేను.

ఏ వాదమైనప్పటికీ అది మానవచైతన్యాన్ని ఊర్ధ్వముఖంగా మార్చి, మానవ హృదయంలో ఉన్నతమైన ఆనందాన్ని సృష్టించి మానవుణ్ణి మానవుడి కంటె పైకి ఎత్త కలిగినప్పుడు అది ఉత్తమవాదం. అటువంటి వాదంపేరు ఏ పేరు అయినప్పటికీ పరవాలేదు. భౌతికవాదం అనేదికూడా ఆ విధంగా చేయగలిగి నప్పుడు దాన్ని స్వీకరించడానికి కూడా వెనుకాడవలసిన అవసరంలేదు. అసలు భౌతికవాదమంటే చైతన్యపు స్థూలదశ మాత్రమే; ఆధ్యాత్మికవాదమంటే భౌతికత్వపు సూక్ష్మదశమాత్రమే. జడ, చేతనాల మధ్య మనం కల్పించే ప్రభేదం అంతగా వాస్తవమైందికాదు మర్మవాది భౌతికవాదాన్ని చిన్నచూపు చూడాలిసిన పని లేదు.

అయితే, రాహుల్‌జీలో ఈ రెంటి సమన్వయ దృష్టి వుండేదికాదు. మర్మవాదంనుంచి భౌతికవాదాన్ని విడదీసి భౌతికవాదం మాత్రమే మహత్తరమైనదని ఆయన విశ్వసించేవారు. ఆ ఏకపక్షదృష్టి నాకు నచ్చేదికాదు. రాహుల్‌జీ వాదంలో నాకేదో ఛాందసం కనిపించేది.

ఈ ఉత్తరాల రాకతో నేను కంటున్న పగటికలలు కరిగిపోయాయి. నిజానికి నేను కంటున్న పగటి కలలకు, మిగతా రెండు ఉత్తరాలకు, అంటే రోరిక్, హాల్దార్‌ల ఉత్తరాలకు, అంతకు తారతమ్యం లేదు. నా పగటికలలకే వారు తమ ఉత్తరాలలో అక్షరరూపం ఇచ్చారేమో. లేక, వారి అక్షరరూపాలకే నా పగటికలలు భావరూపాలేమో !

వేసవికాలపు సాయం సమయాలలో పగలంతా కాలివున్న మట్టినేలమీద నీరు చల్లితే ఒక మధురమైన సుగంధం వస్తుంది. ఆ మట్టిలోనుంచి వచ్చే సుగంధం మానసానికి మట్టికి మించిన ఆనందాన్ని యిస్తుంది. పొందకలిగిన వాళ్ళకు బాహ్య జగత్తులోని ప్రతి భౌతిక పదార్థంలోను అనుభూతి దొరుకుతుంది. ప్రాణస్పందన కనపిస్తుంది. ప్రతి వస్తువులోనూ వ్యక్తి తన స్వీయ వ్యక్తిత్వాన్ని అనుభూతి చెందవచ్చు. వస్తుగత సత్యాలను వ్యక్తిగత అనుభూతులలోకి రూపాంతర పరచుకోవచ్చు !

ఇదంతా తలచుకొంటూ నీరుచల్లిన నేలమీద మంచం వాల్చుకొని పడు కొంటే జిడ్డు కృష్ణమూర్తిగారి కవితలోని కొన్నివాక్యాలు గుర్తుకొచ్చినాయి :

**Oh, I rejoice !**
**There is thunder among the mountains**
**And long shadows lie across**
**the green face of the valley**
**The rains**
**Bring forth green shoots**
**Out of the dead stumps of yesterday**
**High among the rocks**
**An eagle is building his nest**

ఆహా, ఎంత ఆనందం !
గిరుల మధ్య ఉరుములు
పచ్చని లోయ కడ్డంగా సుదీర్ఘ ఛాయలు, వర్షాలు
నిన్నటి ఎండు దుబ్బులనుంచి
పచ్చని మోసును సృష్టిస్తాయి,
ఎత్తుగా చట్టుల మధ్య
గ్రద్ద ఒకటి గూడు కడుతోంది.

జిడ్డు కృష్ణమూర్తి రచించే భావగీతాలలో ఏదో చెప్పరాని మార్దవమూ, ఏదో రసమయ తత్వానుభూతి, ఏదో దృశ్యమయ చిత్రణ, సామాన్య పదాలలోనే ఏవో అసామాన్యమైన మర్మవాద ఛాయలు. నాకు ప్రత్యక్షమై ఎంతో అపార్థివ ప్రేరణ కలిగించేవి. ఆయన కవితలలో ఏదో ఒక లోకోత్తర ప్రాణస్పందన నా హృదయస్పందనతో అనుమేళించేది. దానితో రసానందం మర్మవాదపు కాలవలలో ప్రవహించేది. జిడ్డు కృష్ణమూర్తి కవితలు ఎంత రసాత్మకంగా వుండేవో ఆయన వ్యాసాలు అంత ఆలోచనాత్మకంగా వుండేవి; ఆయన వ్రాస్తారు :

**Truth cannot be understood purely from the intellectual point of view. There is no one who is dominated purely by intellect; nor is there anyone who guides his life purely by emotion. You cannot separate emotions and intellect and hope to understand life from the narrow, limited point of view of either by itself. The fulfilment of life is the outcome of the harmonious blending of the intellect and the emotions.**

కేవలం బుద్ధిమూలకమైన దృక్పథానికి సత్యం బోధపడదు, కేవలం బుద్ధిచేతనే పరిపాలించబడే వ్యక్తి ఎవడూ వుండడు. అదేమాదిరి ఎవరూ కూడా తన జీవితాన్ని కేవలం అనుభూతులతోనే నడపజాలరు. మీరు బుద్ధిని, అనుభూతులను వేరుపరచి ఏ ఒక్కదాని సంకుచిత దృక్పథంతోనో జీవితాన్ని అర్థం చేసుకోజాలరు. బుద్ధీ అనుభూతుల ఈ రెంటి సమన్వయఫలితమే జీవనసాఫల్యం.

మరి, జిడ్డు కృష్ణమూర్తి తత్వం జనబాహుళ్యానికి నచ్చదు. మతమే ప్రధానమనుకొనే వారికి నచ్చదు. సిద్ధాంతాలనే అంటిపెట్టుకొని వుండేవారికి నచ్చదు. సంప్రదాయబద్ధులకు నచ్చదు. దైవాన్ని పురుష రూపంలోనో, స్త్రీ రూపంలోనో ఆరాధించేవారికి నచ్చదు. తాము నమ్మేది మాత్రమే సత్యమనుకొనే హ్రస్వదృష్టిగలవారికి నచ్చదు. ప్రతి నూతన సత్యాన్ని ముక్త హృదయంతో స్వీకరించగలవారికే ఆయన తత్వం నచ్చుతుంది; భూతకాలానికి కాక వర్తమాన కాలానికే విలువ ఇచ్చేవారికి నచ్చుతుంది జీవితంలో భద్రతకు ప్రాముఖ్యం ఇవ్వని వాళ్ళకు నచ్చుతుంది; జడంలో కూడా చైతన్యాన్ని దర్శించగలవారికి నచ్చుతుంది; వెలయేళ్ళలో సంగీతం వినగలవారికి నచ్చుతుంది; మానవతతో స్పందించే మానవులకు నచ్చుతుంది.

ఆ సాయంత్రం చీకటి పడేంతవరకు ఈ విషయాలనే నాలో నేను మౌనంగా చర్చించుకొంటూ పడుకొన్నాను. ఆలోచించిన దాన్నంతా ఆచరణలోకి అనువదించడం అంత సులభం కానిమాట వాస్తవమే. అందుకని ఆలోచించడాన్నే మానివేయడం ఏ విధంగానూ సమంజసం కాదు. ఆచరించగలిగితేమాత్రమే ఆలోచించబూని ఆచరించజాలని దాన్నంతా ఆలోచించకుండా మానివేస్తే లోకంలోని లోకోత్తర భావ ప్రవంతి అంతా ఇంకిపోయేది. జగత్తులోని మేధాశక్తి అంతా అశక్తమయేది. ప్రపంచంలోని తర్కమంతా అంతరించేది. అసలు ఒక విధంగా చూస్తే ఆలోచనకూడా ఆచరణయే. ఆలోచించడం అంటే ఒక రూపంలో ఆచరించడమే! ఆలోచనలేని ఆచరణ ప్రమాదం కాని ఆచరణలేని ఆలోచన ప్రమాదం కాదు.

అయితే, అనుభూతిలేని ఆలోచన మాత్రం మానవుని మనస్తత్వంపైన కొంత దెబ్బ కొడుతుంది. ఆలోచించే మనిషికి కొంత హృదయానందం కూడా వుండాలి. అందుకే ఆలోచించేవారికి సంగీతమో, సాహిత్యమో, చిత్రకళో ఏదో ఒకదానితో సంబంధం వుండాలి. వాటిని సృష్టించటం లేకపోయినా వాటిని ఆనం

దించడమైనా వుండాలి. లేనిచో, ఆలోచనాయంత్రంలో నలిగి వ్యక్తిలోని జీవరసమే ఇంకిపోతుంది.

ఆ వేసవిలోని సాయంత్రం ఆ విధంగా దీర్ఘాలోచన చేసి చేసి చివరకు జయదేవ కవి రచించిన అష్టపదులను తీసి వాటిని పఠిస్తూ పడుకొన్నాను. అష్టపదులను పఠిస్తే ఏమి ఆనందం వుంటుంది? వాటిని పఠించడం కాక గానం చేయాలి. అప్పుడుకాని వాటిలోని అసలైన ఆనందాన్ని అనుభవించజాలం. వాటిని స్వయంగా గానంచేసేకంటె ఇతరులెవరైన గానం చేస్తూంటే వింటుంటే ఇంకా ఎక్కువ ఆనందం లభిస్తుంది. ఆ గానం చేసే వ్యక్తి స్త్రీ అయితే అదో ప్రత్యేకానందం. ఆ విధంగా గానంచేసే స్త్రీ ఇంటిలో ఎవరూ లేరనే కొరతను తెలుసుకొని కొంచెం ఖేదం చెందాను. ఒక విషాదమయమయిన వంటరితనాన్ని అనుభూతి చెందాను. ఈ విషాదమైన వంటరితనాన్ని వివాహం అనేది తీర్చగలదా? ఏం, వంటరితనంలో అంత విషాదమున్నదా! వంటరితనం నా జీవితంలో ఎక్కువగా ఆనందాన్నిస్తూనే వచ్చింది. ఎప్పుడైనా అది కొంచెం విషాదం కలిగిస్తే అంత మాత్రాన వంటరితనం చెడ్డదా?

# గద్య, పద్య రచనలు - నా తర్జన భర్జనలు

కాలం అతివేగంగా గడిచిపోతోంది. నిన్న అనేది నేటిలోకి, నేడు అనేది రేపటిలోకి నిమిషంలో మారిపోతుంది. నేడు ఆదివారం అనుకొంటే మళ్ళీ తిరిగి ఆదివారం రావడంలో వారంరోజులు గడిచినట్లు అనిపించడంలేదు. మళ్ళీ రేపే ఆదివారం వచ్చినట్లుంటుంది. ఇది నిజంగా కాలవేగమో లేక నా మనోవేగమో అర్థంకాక ఇతరులను అడిగిచూశాను. వారెవరికీ కాలంలోని ఈ వేగం తట్టినట్లు లేదు. అయితే ఇది నా ఒక్కనికే కాబోలు అని తెలుసుకొన్నాను. ఇది నా ఒక్కనికే అన్నప్పుడు ఇది కాలవేగంకాక నా మనోవేగం మాత్రమే అని స్థిరపరచుకొన్నాను. అయినా ఇంతగా మనోవేగం వుండడం అంతగా క్షేమకరం కాదని అనిపించింది.

1944 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం మంచి తీవ్రంగా సాగిపోతూనే వుంది. నిత్యం పత్రికలలో అనేక భయంకరమైన వార్తలు వస్తున్నాయి. జర్మనీ మూలంగా కమ్యూనిస్టు దేశమైన రష్యాకు, కేపిటలిస్టు దేశమైన అమెరికాకు, ఇంపీరియలిస్టు దేశమైన బ్రిటన్‌కు సఖ్యత కుదరడం చూస్తే చాలా చిత్రమని పించింది. శత్రుభయం పరస్పర విరుద్ధపంథాల జాతులలో కూడా ఎంతో ఐక్యత (ఈ ఐక్యత తాత్కాలికమే అయినా) సమకూర్చకలదని తెలుసుకొన్నాను. పత్రికలు చదివేవాళ్ళు ఇళ్ళదగ్గర వంటరిగా చదువుకోడంతో సంతృప్తిచెందక కొందరు కలిసి ఒకచోట కూర్చుని పత్రికలలోని యుద్ధవార్తలు చదివి సామూహికంగా చర్చించుకొనడంలో ఆనందం చెందేవారు. వారిలో కొందరు జర్మనీ, జపానుల పక్షమైతే మరికొందరు మిత్రరాజ్యాలపక్షం. వీరుభయులమధ్య ఇక్కడ ప్రచండమైన వాగ్యుద్ధాలు రేగుతుండేవి!

ఎటూ దూరపు ప్రయాణాలకు అనుకూలంగా లేవు ప్రయాణసౌకర్యాలు. ఎటుచూచినా, అల్లరులు, ఆందోళనలు, అశాంతి, అసౌకర్యాలు. ఇటువంటి క్లిష్ట సమయంలో ఎక్కడికీ దూరపు ప్రయాణాలు చేయకుండా ఏవో సాంస్కృతిక అనుశీలనలలో నన్ను నేను మరచిపోయి కొంతకాలంపాటు ఇంటనే కాలం గడపాలని నిర్ణయించుకొన్నాను. నా చదువులకు తోడు పదిహేను సంవత్సరాల మా చెల్లెలు భారతీదేవికి కూడా హిందీ, ఇంగ్లీషు పాఠాలు చెప్పడంలో ఆనందం పొందేవాణ్ణి. ఆమె మంచి చురుకైన, తెలివైన అమ్మాయి. పాఠాలు చెప్పడం మాత్రమేకాక ప్రపంచంలోని అనేక విషయాలు భారతికి బోధిస్తుండేవాణ్ణి. తెలి

యని విషయాలు ఆమె ఎన్నో అడుగుతుండేది. ఆమె అడిగిన విషయాలనేకాక అడగని విషయాలను కూడా అనేకం చెప్పేవాణ్ణి. ఆమె నా కష్టసుఖాలను తెలుసుకోడంలో, నేను ఆమె కష్టసుఖాలు తెలుసుకోవడంతో ఎంతో ఆసక్తి, సానుభూతి కనపరచేవాళ్ళం.

చెల్లెలు భారతికితోడు మా పెనతండ్రిగారి ఇద్దరు అమ్మాయిలు రజని, రాధ కూడా నావద్ద విద్యాభ్యాసం ప్రారంభించారు. అందరం కలిసి ఒకచోటనే విద్యావ్యాసంగం జరిపేవాళ్ళం. పాఠాలు అయిన తరువాత లోకాభిరామాయణం ప్రారంభించేవాళ్ళం. నిజానికి పాఠాలు చెప్పుకొనే సమయానికంటె దేశంలోని సంగతులు చెప్పుకొనే సమయమే అధికంగా వుండేది. తరువాత ఆ సంవత్సరమే సోదరి రజనికి వివాహం కావడంతో ఈ విద్యావ్యాసంగం ఆగిపోయింది. అయినప్పటికి భారతికి మాత్రం ఇంకా పాఠాలు చెప్తూనే వున్నాను.

ఇంతవరకూ ఏవో అడపాదడపా కొద్ది ఆంగ్లకవితలు రచించడం తప్ప వేరే ఇతర రచనలు ఏమీ ఎందుకని చేయలేకపోతున్నానా అని నన్ను నేను పరిశీలన చేసుకోసాగాను. అసలు నేను చేయవలసింది పద్యరచనా, లేక గద్యరచనా, లేక రెండూనా అని ప్రథమంగా నిర్ణయించుకోవడం ముఖ్యం అనుకొన్నాను. పద్యరచన పరిధులు అంతగా విస్తీర్ణమైనవి కావని, గద్యరచనలోనే స్వేచ్ఛ ఎక్కువ వుంటుందని కనుక నేను ప్రధానంగా గద్యరచనలే అవలంబించాలని నిర్ణయించుకొన్నాను. ప్రధానంగా గద్యరచన చేస్తూ అప్పుడప్పుడు పద్యరచన కూడా చేయవచ్చు అని ఆలోచించాను. అయితే నా రచనలను ఏ భాషలో చేయాలి? తెలుగులోనా ఇంగ్లీషులోనా? తెలుగులో రచిస్తే తెలుగు దేశంలో మాత్రమే తెలుస్తుంది. మరి ఇంగ్లీషులో రచిస్తే, భారతదేశంలోని ఇతర ప్రాంతాల వారికి మాత్రమేకాక ప్రపంచంలోని వారందరికీ కూడా తెలుస్తుంది. తెలుగువారికీ తెలుస్తుంది. కనుక నా రచనలు ఇంగ్లీషులోనే రచించాలని నిర్ణయించుకొన్నాను.

## పద్యరచన : గద్యరచన

రచించాలని నిర్ణయించుకొన్నానేకాని రచన చేయడానికి మాత్రం పూనుకోలేదు. రచనను గురించి రెండు విషయాలు తేల్చుకొన్నాను. ఒకటి పద్యరచనా గద్యరచనా అనేది; రెండవది ఏ భాషలో రచించడం అనేది. ఈ రెండు నిర్ణయాలు మాత్రమే సరిపోలేదు; అసలైన గడ్డు విషయం ఇక మూడవదిగా వుంది. దాన్ని తేల్చడమే కష్టం. నా రచనకు విషయవస్తువు ఏమిటి అనేదే మూడవ

సమస్య. నేను నవలల్ని వ్రాయాలా, నాటకాలు వ్రాయాలా, కథానికలు వ్రాయాలా, వ్యాసాలు వ్రాయాలా? వీటిలో ఏది వ్రాయాలి నేను? నా సమీక్షాత్మక బుద్ధి నన్ను వ్యాసాలు వ్రాయడానికే ప్రోత్సహించింది.

సరే, వ్యాసాలు రచించాలనే నిర్ణయమైంది. అయితే అంతటితో పరిష్కారం అయిందా? వ్యాసాలు రచిస్తే ఏ విషయాలను గురించి వ్యాసాలు రచించాలి? సాహిత్యాన్ని గురించా, సంగీతాన్ని గురించా, రాజకీయాలను గురించా, తాత్విక విషయాలను గురించా లేక చిత్రకళను గురించా? ఆలోచించిచూచాను. చిత్రకళను మినహాయిస్తే మిగతా వాటన్నిటిని గురించి వ్రాసే రచయితలు చాలా మంది వున్నారు కాని చిత్రకళను గురించి వ్రాసేవారు భారతదేశంలో చాలా అరుదుగా వున్నారు కనుక చిత్రకళను గురించి సాహిత్య సృష్టి చేయాలని కూడా నిర్ణయించుకోడం జరిగింది.

అంటే నా జీవితాన్ని కళా సమీక్షకుడిగా నడవవలసి వుంటుందన్నమాట. కళాకారుడుగా మనడంకంటె కళా సమీక్షకుడుగా మనడంలో అధికమైన కష్టం వున్నదని నాకు తెలుసు. కళాకారునికి తన కళలో ప్రతిభవుంటే చాలు, రాణించగలడు. కాని కళా సమీక్షకునికి అనేక ఇతర విషయాలతో కూడా గట్టి పరిచయం వుండాలి. భాషమీద మంచి ఆధిపత్యం వుండాలి. సాహిత్యం తెలిసివుండాలి. చరిత్ర తెలిసివుండాలి, సౌందర్యబోధ తెలిసివుండాలి. తాత్వికచింతనతో పరిచయం వుండాలి. కళలోని వివిధశాఖల పరిజ్ఞానం కలిగివుండాలి, వీటన్నిటిపైనా నిష్పాక్షిక దృష్టిని కలిగివుండాలి. ఇవన్నీ వున్నపుడు కాని ప్రతిభగల కళాసమీక్షకుడుగా ప్రకాశించలేడు. ఇందుకు అనేకవిధాలయిన గ్రంథాలు అవసరం. ఇటువంటి ప్రత్యేకగ్రంథాలు సామాన్య గ్రంథాలయాలలో లభించవు. అందుకని ఇటువంటి గ్రంథాలను స్వంతంగా సంపాదించి వుంచుకోవాలి. కళాసంబంధమైన కొన్ని దేశ. విదేశీ పత్రికలను తెప్పించుతూవుండాలి. ఇంత హంగామా వున్న వృత్తిని వరించే సాహసం చేసినందుకు నా ప్రవృత్తి దీన్ని త్వరలో కార్యరూపంలో పెట్టలేకపోయింది.

ఈ విధంగా ఆలోచిస్తూ వంటరిగా కూర్చుని వుండగా సోదరి భారతి వచ్చి "ఏమిటి అన్నయ్యా ఆలోచిస్తున్నావు" అన్నది. నేను అన్నాను "నీ పెళ్ళిని గురించేనమ్మా" అని. అందుకు ఆమె అన్నది "ముందు నీ పెళ్ళి కానిచ్చి వదినను తీసుకురా; తరువాత మీ ఉభయులు కలిసి నా విషయం ఆలోచించవచ్చు" అని. వదిన అనే వ్యక్తి లేనందున తాను చాలా ఒంటరితనాన్ని అనుభూతి చెందు

టున్నట్లు, కనుక వదిన తనకెంతో అవసరమని సోదరి భారతి ఒక ఉపన్యాసం చేసింది. "సరే, నా నిమిత్తం కాకపోయినా, కనీసం నీ నిమిత్తమైనా వదినను తేవడానికి ప్రయత్నిస్తాను చెల్లీ" అని చెప్పి ఆమెను తాత్కాలికంగా ఓదార్చాను.

ఒకరోజు పోస్టులో ఢిల్లీనుంచి ఒక చిన్న పుస్తకం వచ్చింది. గ్రంథకర్త పేరు షిబయేవ్. గ్రంథకర్తయే పుస్తకం పంపాడు. ఆయన పోలిష్ (పోలెండు దేశస్థుడు). రష్యన్‌లోను, ఇంగ్లీషులోను కూడా బాగా రచించగలడు. ఒకప్పుడు ఆయన నికోలస్ రోరిక్‌కు ప్రైవేటు సెక్రటరీ. ఆ సంబంధంతోనే నాకు తన పుస్తకాన్ని పంపాడు. పుస్తకం పేరు **'St Sergius'.** అందులో సెంట్ సెర్గియస్‌ను గురించి నికోలస్ రోరిక్ చిత్రించిన చిత్రాలుకూడా కొన్ని వున్నాయి. పదునాలుగవ శతాబ్దంలో రష్యాలో ఉండేవారు ఈ సెంట్ సెర్గియస్. ఆ కాలంలో ఆయన గొప్ప సాధుపుంగవుడు.

షిబయేవ్ రచించిన సెంట్ సెర్గియస్ జీవితం నాకెంతో ఆనందమయ ప్రేరణ కలిగించింది. పదునాలుగవ శతాబ్దపు ఈ రష్యన్ సాధుపుంగవుని జీవిత విశేషాలు చాలా విచిత్రమైనవి. ఆనాటి రష్యాలో ఆయన ప్రభావం ప్రతివ్యక్తిపైనా ప్రసరించి వుంది. మానవులమీదనే కాక వన్యమృగాలమీద కూడా ఆయన ప్రేమప్రభావం వ్యక్తమవుతుండేది. ఎలుగుబంట్లూ మొదలైన వన్యమృగాలు ఆయనవెంట తిరుగుతూండేవట. ఆయనలోని మహా ప్రత్యేకత ఏమంటే ఆయన తన శిష్యులచేత సేవ చేయించుకోక తానే స్వయంగా తన శిష్యులకు సేవ చేసేవారు. శిష్యులకు కుటీరాలు నిర్మించిపెట్టడం, అడవినుంచి కట్టెలు కొట్టి తెచ్చి శిష్యుల కివ్వడం, నదినుంచి నీరుతెచ్చి శిష్యులకు పోయడం, శిష్యులకు వైద్య సహాయం చేయడం మొదలైన ఎన్నో విధాలైన సేవలు సెంట్ సెర్గియస్ శిష్యులకు చేస్తుండేవాడు. జ్ఞానబోధకు తోడు భౌతిక సహాయంకూడా ఎంతో చేసేవారు ఆయన !

ఇటువంటి మహనీయులు మరణించిన తరువాతకూడా తమ లోకోత్తర సత్తాను ప్రదర్శిస్తుంటారని జనబాహుళ్యంలో ఒక విశ్వాసం వుండడం సహజం. తార్తారులు రష్యామీదకు దండయాత్రలు చేసినపుడల్లా ఆయన అశరీర రూపంలోనే తార్తారులను పారద్రోలడంలో దేశవాసులకు తోడ్పడ్డారని ప్రతీతి. కొందరిచేత పుణ్యభూమిగా ఎంచబడుతున్న భారతావనిలోనేకాక ఈ విస్తృత విశ్వంలో ప్రతి దేశంలోకూడా అన్నికాలాలలోను మహనీయ గుణాలుగల మహాత్ములు,

సాధుపుంగవులు, నిస్వార్థ సేవాపరాయణులు వుంటూనే వచ్చారు. తమ దేశం మాత్రమే ఆధ్యాత్మిక దేశమని, మిగతా దేశాలన్నీ భౌతిక దేశాలనీ నమ్మటం భ్రాంతివ్యాప్తి మాత్రమే. ఆధ్యాత్మికత అంటే అంటరానితనానికి చిహ్నమేమో!

మనదేశంలో ఎందరో మహానుభావులు పుట్టిపోయినారు. అదేమాదిరి ఇతర దేశాలలోను ఇటువంటి మహనీయుల జీవన విధానాలలో దేశాన్ని అనుసరించి కాలాన్ననుసరించి భేదాలుండవచ్చు కాని ప్రధాన ఆదర్శాలన్నీ ఒకటే. విశ్వ ప్రేమ, త్యాగం, సేవా పరాయణత, నిస్వార్థత, సంస్కారం, పరిసర ప్రభావాలకు అతీతులుగా వుండగలగడం, నిర్భీకత, స్వేచ్ఛ మొదలైనవన్నీ ప్రతి దేశంలోని మహానుభావులకూ నైజగుణాలే.

సోదరి భారతిని పిలిచి ఆ పుస్తకాన్ని గురించిచెప్పి, అందులోని బొమ్మలు చూపించి ఆ పుస్తకాన్ని చదివి అర్థం చేసుకోమని ఇచ్చాను. నవలలు, నాటకాలు, కథానికలు చదవడం అవసరమే. అయితే వాటితోపాటు ఇటువంటి పుస్తకాలను కూడా చదవడం అంతకంటే తక్కువ అవసరంకాదు. కల్పనా సాహిత్యం పాఠకులలో మనోవైజ్ఞానిక దృక్పథాన్ని, సాంఘిక పరిజ్ఞానాన్ని, జీవన విధాన వైశిష్ట్యాన్ని మానవులలో సుఖదుఃఖాల విజ్ఞతను, రసానుభూతిని కలిగిస్తాయి. ఇక "సెంట్ పెర్గియస్" వంటి పుస్తకం వీటన్నిటికి కాంతి కలిగించి పాఠకునికి శాంతి కలిగిస్తుంది. శాంతిలేనప్పుడు పై గుణాలన్నీ వ్యర్థమేకదా!

# కన్నీరు, పన్నీరుల తారతమ్యం

**1944** ముగియ వస్తూంది. కాని ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసే జాడ ఏమీ గోచరించడంలేదు. ఈ యుద్ధం మూలంగా పత్రికలు, పుస్తకాలు ఇంకా అవసరమైన ఇతర వస్తువులు చౌకబారు రూపంలో ఉత్పత్తి కాజొచ్చాయి. వార్ క్వాలిటీ అనే పేరు ప్రతివస్తువుకు ఏర్పడసాగింది. ఇదివరలో సుందరంగా నడిచే మాసపత్రికలు, త్రైమాస పత్రికలు ఎంతో కళావిహీనంగా, పిచ్చికాయితాలతో వెలువడుతున్నాయి.

ఇటువంటి స్థితిలో సర్ నృపేంద్రనాథ సర్కార్ సాహసాన్ని నిజంగా ప్రశంసించవలసిందే. **"The Hindusthan"** అనే త్రైమాస పత్రిక నొకదాన్ని స్థాపించి అతి సుందరంగా నడపసాగారు. అది ఆయన ఉన్నతశ్రేణికి చెందిన రచనలతోను, ఉత్తమమైన చిత్రాలతోను వెలువడసాగింది. దాని మొదటి సంచిక నాకు వచ్చింది. అందులో గొప్ప గొప్పవారంతా వ్రాశారు. భారతీయ పారంపర్యాన్ని గురించి సర్వేపల్లి రాధాకృష్ణన్, బెంగాల్ కరవును గురించి సర్ నృపేంద్రనాథ సర్కార్, "స్రష్టలు" అనే విషయంపై నికోలస్ రోరిక్, విద్యా విషయాన్ని గురించి సర్ మీర్జా ఇస్మాయిల్, సాంస్కృతిక నిర్మాణాన్ని గురించి సెంట్ నిహాల్‌సింగ్, వేదాలలో ప్రతిమలున్నవా అనే విషయాన్నిగురించి ప్రొఫెసర్ ఓ. సి. గంగూలీ, ఆధునిక కవితను గురించి డాక్టర్ అమియ చక్రవర్తి, ఇంకా అనేక అభిరుచిగల విషయాలను గురించి డాక్టర్ సచ్చిదానంద సిన్హా, డి. ఎన్. మజుందార్, నీరదచంద్ర చౌదరి, అడ్రియన్ మూర్ మొదలైనవారు రచించారు. ఇవికాక ఆల్డస్ హక్స్లీ పుస్తకం **"Grey eminence"** అనే దాన్ని గురించి పి. పి. దత్తు సుదీర్ఘమైన సమీక్ష వ్రాశారు.

డాక్టర్ అవనీంద్రనాథ టాగూర్ మొగల్ శైలిలో చిత్రించిన వేటనుంచి నావలో తిరిగివస్తున్న చిత్రం, నందలాల్ బోసు చిత్రించిన వీణావాసిని చిత్రమూ ఈ పత్రికలో రంగులలో ముద్రింపబడి వున్నాయి. యుద్ధం రోజులలో ఈ పత్రిక ఇంత సుందరంగాను, ఉన్నతంగాను వెలువడడం చూచి ఆనందంతో ఆశ్చర్యపోయాను.

త్రైమాస పత్రికలు ప్రత్యేక ఆకర్షణ కలిగివుంటాయి. దినపత్రికలకంటె వారపత్రికలు ఎక్కువ ఆకర్షణీయంగా వుంటాయి. వారపత్రికలకంటె మాసపత్రి

కలు, మాసపత్రికల కంటే త్రైమాస పత్రికలు, ఇంకా ఎంతో ఆకర్షణీయంగా వుంటాయి రూపంలోను విషయంలోనుకూడా. ఇక అన్నిటికంటె సంవత్సరానికి ఒకటి మాత్రమే వెలువడే వార్షిక సంచికలను గురించి చెప్పనే అవసరంలేదు. ఇక రెండు సంవత్సరాల కొకటి చొప్పున వెలువడే సంచికంటె అదెంత బాగుంటుందో మరి!

ఇందులోని రచనలన్నిటిని సమానమైన అభిరుచితో చదవలేకపోయాను. శుద్ధమైన సాంస్కృతిక విషయాలుతప్ప రాజకీయాలకు సంబంధించిన వ్యాసాలు నాకు అంతగా రుచించవు. ఆధునిక కవితను గురించి డాక్టర్ అమియ చక్రవర్తి వ్రాసిన వ్యాసం చాలా లోతుగాను, మనోహరంగాను వున్నది. అందులో ఆయన ఉదహరించిన టి. యస్. ఇలియట్ కవిత చన్నెంతో ఆనందపరచింది:

**"In my beginning is my end.**
**Now the light falls**
**Across the open fields,**
**Leaving the deep 'ane**
**Shuttered with branches,**
**Dark in afternoon,**
**Where you lean against**
**A bank while a van passes."**

ఎంత కమనీయ భావం! ఎంత దృశ్యమయ చిత్రణ!! టి. యస్. ఇలియట్ కవితలతో నాకదివరకే పరిచయం వున్నది. కాని ఈ కవితను చూడడం ఇదే మొదలు **In my beginning is my end** నా ఆరంభంలోనే నా అంతం వుంది! ఎంత విచిత్రమైన భావాభివ్యక్తి. ఆరంభంలోనే అంతం వుండడం జరిగితే ఇక వికాసం లేనట్టా? కాదేమో! ఆరంభంలో అంతం వున్నపుడు తిరిగి అంతంలో కూడా ఆరంభం వుంటుంది. కనుక ప్రమాదం లేదు! ఆరంభంలో అంతమూ అంతంలో ఆరంభమూ వుండటం అంటే ఇక దానికి తెంపు లేనట్టే. విత్తనంనుంచి చెట్టు పుడుతుంది! మళ్ళీ చెట్టు నుంచి విత్తనం పుడుతుంది. చెట్టు పుట్టిన విత్తనం ఆరంభం; చెట్టుకు పుట్టిన విత్తనం అంతం. కనుక ఆరంభమూ విత్తనమే. అంతమూ విత్తనమే. అంటే ఆరంభానికీ అంతానికీ భేదం లేదన్నమాట! జీవితం చక్రం లాంటిది. చక్రానికి ఆరంభం అని అంతమని వుండదు. ఆరంభలోనే అంతం, అంతలోనే ఆరంభం. అందుకే ఇలియట్ కవి నా ఆరంభంలోనే నా అంతం వుంది అన్నాడు.

నిజానికి సుందర భావాలు ఏ ఒకరి సొత్తుకావు. అవి ఎల్లప్పుడూ అంతటా వ్యాపించివుంటూనే వుంటాయి. వాటిని పట్టుకొన్నవాళ్ళు వాటిని సృష్టించినట్టు ఎంచ బడతారు. జానపద సాహిత్యాలు మొదలు శాస్త్రీయ సాహిత్యాల వరకు అన్ని దేశాలలోను అన్ని కాలాలలోను ఎన్నో సుందర భావాలు గోచరిస్తాయి.

ఒక డిశంబర్ సాయంత్రం నీలగగనం క్రింద వరిపైరు పండి బంగారు రంగులో ప్రకాశిస్తుండగా వరికోతకోస్తున్న కూలీల దగ్గరకు వెళ్ళాను. కూలీలు ఉత్తర రామచరిత్రలో లక్ష్మణుడు సీతను అరణ్యాలలో వదలి రాబోయేఘట్టాన్ని పాటపాడు తున్నారు. రాముని ఆజ్ఞానుసారం లక్ష్మణుడు గర్భంతో వున్న సీత దగ్గరకు వస్తాడు. ఆమెను అరణ్యాలపాలుచేసి రావడానికి, వచ్చిన లక్ష్మణుని సీత తగిన మర్యాదచేస్తుంది. కాళ్ళు కడుక్కునేందుకు చెంబుతో నీరు యిస్తుంది. త్రాగడానికి పాలు యిస్తుంది. ఈ విషయాన్ని ఆ జానపద గేయకర్త ఎవరో కాని చాలా చమత్కారంగా వర్ణించాడు. కూలీలు పాడుతున్నారు:

పాలు కలవని నీళ్ళు పాదాలకిచ్చే
నీళ్ళు కలవని పాలు పానానికిచ్చే.

ఎంత సాదా మాటలలో ఎంత సుందర ప్రయోగం జరిగింది! పాలు కలసిన నీళ్ళు పాదాలకిస్తే వాటితో లక్ష్మణుడు పాదాలు కడుక్కుంటే ఆయన పాదాలను చీమలు పీక్కుతింటాయి. ఆ పాదాలు లక్ష్మణుని పాదాలు అవి. లక్ష్మణుడు అంటే రాముని తమ్ముడుగదా అని చీమలు గ్రహించి మర్యాదగా వదలివేయవు. పాదాల మీద పాలుంటే సరి; ఆ పాదాలు లక్ష్మణుని వైనాసరే, రాముని వైనాసరే చీమలు పీక్కుతినవలసిందే! అందుకే సీత జాగ్రత్తపడి, పాపం పాలు కలవని నీళ్ళనే పాదాలు కడుక్కోమని లక్ష్మణునకు ఇచ్చింది. అదే విధంగా నీళ్ళు కలసిన పాలను త్రాగమని లక్ష్మణుని కిచ్చినట్టయితే లక్ష్మణునికి ఆ నీళ్ళపాలు గుటకపడక, పైకి అనకపోయినా, లోలోపల వదినను ఎంతగా నిందించుకొనేవాడో ; కాని సీత జాగ్రత్తపడి ఇటువంటి ప్రమాదాలు రానీయని పనే చేసింది!

కొన్ని జానపద గేయాలు పేలవంగా వున్నట్టే మరికొన్ని జానపద గేయాలు రసవంతంగా వుంటాయి. ఈ సత్యం ఒక జానపద గేయాలకేకాదు, మిగతా అన్నిటికీ వర్తిస్తుంది.

మరొకరోజు పొలాలలోనే ఒకరు పాడుతున్నారు.

పీము పాదముంచమ నే పన్నీరుపోసి కడిగెదనూ.

ఆ పాడుతున్న వనితకు నేను సలహా ఇచ్చాను, పన్నీరును తొలగించి కన్నీరు అని పాడమని. అప్పుడామె తిరిగి పాడింది:

నీదు పాదములను నే కన్నీరుపోసి కడిగెదనూ।

పన్నీరు విలువగల పదార్థమే. సందేహం లేదు. కాని కన్నీరు అంతకంటె ఎక్కువ విలువగలది. పన్నీరు సుగంధం ముక్కుకు మాత్రమే తగులుతుంది; కాని కన్నీరు సుగంధం సూటిగా చొచ్చుకొనిపోయి ప్రాణానికే తగులుతుంది. పన్నీరు మనిషికి బయట తయారవుతుంది; కన్నీరు మాత్రం మనిషిలోపలే తయారవుతుంది. పన్నీరు మానవుడు చేస్తాడు, కన్నీరు మానవుడివే చేస్తుంది. వియోగంలో కన్నీరు, సంయోగంలో కన్నీరు. విషాదంలో కన్నీరు, ఆహ్లాదంలో కన్నీరు.

కలకత్తాలోని ప్రొఫెసర్ ఓ. సి. గంగూలీ నుంచి ఉత్తరం వచ్చింది. **"Love Poems in Hindi"** అనే తాను రచించిన పుస్తకం పంపుతూన్నట్టు వ్రాశారు. కాని ఉత్తరం వచ్చిన రెండు రోజులవరకు పుస్తకం రాలేదు. మూడవ రోజు పుస్తకం వచ్చింది. నా వీరీక్షణ అంతమైంది. పుస్తకం ఎంతో ఆకర్షణీయంగా వున్నది. గంగూలీగారు ప్రకటించే పుస్తకాలన్నీ లోపలి విషయం ఎంత మనోహరంగా వుంటుందో బయటి ఆకృతి కూడా అంత మనోహరంగా వుంటుంది. ఈ పుస్తకం నిండా రాజపుత్ర, మొగల్ చిత్రాలు నిండివున్నాయి. ప్రాచీన హిందీ కవులు రచించిన ప్రేమ కవితలను తీసుకొని వాటికి ఇంగ్లీషు అనువాదం, వ్యాఖ్యా రచయిత వాటికి సరిపోయే ప్రాచీన చిత్రాలను ముద్రించారు. నాయికా నాయకుల విరహమిలనాలు, శృంగారలీలలు, రాధాకృష్ణుల ప్రేమ విహారాలు మొదలైనవి ఇందులో ప్రధానాలు. పదుమాకర్ అనే ప్రాచీన హిందూకవి రచించిన శృంగార కవిత:

పుష్ విశామే సువారుణీ లై నవి
బైతే దుహూం మద్ కే మత్వాలే.
తేఁవో పదుమాకర్ ఝుమే ఝుకై ఘన్
ఘుమి రచై రప్ రంగ్ రసాలే
శీత్ కో జీతి అభీత్ భై
సుగ్ నైన్ పఖి భుశాల్ దుశాలే
ఛాక్ ఛకా ఛవిహీకో పియే
మద్ వయనన్ కే కియే ప్రేమ్ కేపియాలే.

పుష్యమాసపు రాత్రి "వారుణి" మధువును సేవించి కూర్చుని వున్నారు. వారిరువురు మత్తుగా. పదుమాకర్ అంటాడు: వారు ఒకోసారి నిద్రలో తూలుతూ, ఒకోసారి సరససల్లాపాలలో మునుగుతూ వుంటారు. వారు చలిని జయించారు కనుక వారికిక భయంలేదు. అందువల్ల వారికిక భయంలేదు. అందువల్ల వారికిక శాలువలతోను, దుప్పట్లతోను పనిలేదు. పరస్పర సౌందర్య మధువు వారు పూర్ణంగా గ్రోలివున్నారు, పరస్పర నేత్రాలను మధు పాత్రలు చేసుకొని.

ఈ కవితను విశదపరచే కాంగ్రా చిత్రం "తవిహార్" అనేది, ఈ కవిత దగ్గర ముద్రించబడివుంది. ఆదిమకాలంనుంచి ఆధునిక కాలంవరకు ప్రేమను, ప్రత్యేకించి స్త్రీ పురుషుల ప్రేమను, కవులు తమ కవితలలో వర్ణించడంలో, చిత్ర కారులు తమ చిత్రాలలో చిత్రించడంలో, శిల్పులు తమ శిల్పాలలో శిల్పించడంలో అనంతమైన ఆనందాన్ని కనపరుస్తూ వచ్చారు. అదేమాదిరి ప్రజలు ఆ కవితలు చదవడంలో, ఆ చిత్రాలను శిల్పాలను చూడడంలోకూడా ఆనందాన్ని పొందుతూ వచ్చారు.

**" Love Poems in Hindi"** ని పంపిన కొద్దిరోజులకే ప్రొఫెసర్ గంగూలీ రెండు తన బెంగాలీ పుస్తకాలను పంపారు. ఒకటి రూపశిల్ప మనేది, రెండవది శిల్ప పరిచయ మనేది. ఈ రెండు పుస్తకాలు కూడా వాస్తుశిల్పాన్ని గురించి, మూర్తిశిల్పాన్ని గురించి, చిత్రకళను గురించి సచిత్రంగా వ్యక్త పరుస్తాయి. నాలో కళామర్మజ్ఞతను చైతన్యవంతం చేయడానికి గంగూలీగారు ఎంతో ఉత్సాహం చూపేవారు.

మానవుడు హేతువాది అయినప్పటికీ రసజీవి కూడా, రూపంద్వారా రసం రంగుద్వారా రసం, పదంద్వారా రసం, నాదంద్వారా రసం, గతిద్వారా రసం, ప్రాణంద్వారా రసం-ఈ విధంగా సృష్టిలోని ప్రతిదానినుంచి రసాన్ని పొందడం ద్వారా మానవుడు బాధలను అధిగమించి ఆనందజీవి అవుతాడు. ఇటువంటి రసాన్ని ప్రసాదించడానికే వివిధాలైన కళాసృష్టి, కళాసృష్టి అనేది రసాన్ని ప్రసాదించ డానికి మాత్రమేనా, శ్రేయం ప్రసాదించడానికికాదా అనేది మరో విషయం. ఏమీ? రసం మాత్రం శ్రేయం కాదా?

# ప్రకృతి సౌందర్యోపాసనలోని పారవశ్యం

ఎటూ దూరప్రయాణాలు చేయక చాలా కాలం జరిగిపోయినట్టు అనిపించసాగింది. కాని ప్రయాణాలకు కాలపరిస్థితులు అనుకూలంగా లేనందువల్ల కదలక కూర్చొనడం తప్పడం లేదు. ప్రయాణాలు చేయకుండానే ప్రయాణాల ఆనందాన్ని అనుభవించాలంటే రెండే మార్గాలు. ఒకటి భూతకాలంలోకి చొచ్చి ఇదివరలో చేసివున్న ప్రయాణాలను జ్ఞాపకం తెచ్చుకొని ఆనందించడం. రెండవది భవిష్యత్తులో తలదూర్చి చేయనున్న ప్రయాణాలను గురించి రంగురంగుల ఊహలను సృష్టించుకోవడం. భూత భవిష్యత్తుల మధ్య వర్తమానకాలం నలిగిపోయి తన అస్తిత్వాన్నే కోల్పోతుంది.

ప్రవీణ కళామర్మజ్ఞుడైన ఎం. ఎస్. రంధవా నుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఆయన అప్పుడు యు. పి. లోని రాయ్‌బరేలీ జిల్లాకు కలెక్టరుగా వున్నాడు. ఆయన ఐ. సి. ఎస్. అయినప్పటికీ మిగతా ఐ. సి. ఎస్. వారికీ ఆయనకూ ఎంతో తారతమ్యం వుంది. తన ఉత్తరంలో ఆయన నన్ను రాయ్‌బరేలీ రమ్మని, వచ్చి తనతో కొన్నాళ్ళపాటు యు. పి. లోని గ్రామాలలో పర్యటన చేయమని వ్రాశారు. ఇంకా నా వివాహాన్ని గురించి ఆయన ఈ మాటలు వ్రాసారు. **"You need no more live in utopia regarding your matrimony. Don't spend time in quest after ideal brides. Ideal brides exist only in the dream-world and not in the real World!"** "నీవు నీ వివాహాన్ని గురించి ఇంకా ఎక్కువగా ఊహా జగత్తులో విహరించరాదు. ఆదర్శ వధువుల నిమిత్తం అన్వేషణ అనవసరం. ఆదర్శ వధువు ఉండేది స్వప్నజగత్తులోనే కాని వాస్తవజగత్తులో కాదు!" అని వ్రాశారు, మహేంద్ర సింగ్ రంధవా. ఆ ఉత్తరం చదివి నాలో నేను వెదకసాగాను. నేను ఆదర్శ వధువుల నిమిత్తం అన్వేషణ సల్పుతున్నానా అని. ఎవరు ఆదర్శ వధువులు, ఎవరు ఆదర్శ వధువులు కారు?

రంధవా తన ఉత్తరంతోపాటు తాను రచించిన పుస్తకం **"The Art of E. H. Brewster & Achsah Brewster"** అనే దాన్ని పంపారు. లోపల మంచి చిత్రాలున్నాయి. పుస్తకం అట్ట ప్రత్యేక రూపంలో కనులపండువగా వుంది. ఈ పుస్తకంలోని విశేషమేమంటే దీన్ని వ్రాసిన గ్రంథకర్త ప్రతి

భాన్వితుడే, ఇందులో వ్రాయబడిన వ్యక్తులు ప్రతిభాన్వితులే. బ్రూస్టర్ దంపతులిద్దరు సిద్ధహస్తులైన అమెరికన్ చిత్రకారులు; ఉభయులు ఆల్మోరావద్ద నివసిస్తున్నారు.

రంధవా ఆహ్వానం అందుకొన్న తరువాత రాయ్‌బరేలీ వెళ్ళాలని ఆకాంక్ష బాగా తలెత్తింది. కాని కారణాంతరాలవల్ల ఆకాంక్ష కాంక్షగానే నిలచిపోయింది. కాని కార్యరూపం దాల్చలేదు. కార్యరూపం దాల్చని కాంక్షలు ప్రత్యేక మాధుర్యాన్ని కలిగి ఎంతో సువాసనలో జీవిస్తాయి, మనసులోని పొరల మధ్య.

## స్థిత ప్రజ్ఞత

ఒకటి అభ్యాసం చేసుకున్నాను. అనివార్యాలకు నన్ను నేను అనుకూలపరచుకోవడం, కాంక్షలు కార్యరూపం దాల్చనప్పుడు బాధపడడం, మనసును చెడగొట్టుకోవడం మొదలైన మనోదౌర్బల్యాలను దరిజేరనిచ్చేవాణ్ణి కాదు. పరిస్థితులను మానవుడు తన కనుకూలంగా చేసుకోవడం అన్నిటికంటే మంచిపని. కాని ఏవో కారణాలవల్ల అది కుదరనప్పుడు మానవుడే పరిస్థితుల కనుకూలంగా మారాలి. తన కనుకూలంగా పరిస్థితులు మార్చుకోలేక, మారని పరిస్థితుల కనుకూలంగా తాను మారలేకపోతే మనోవ్యధ తప్పదు.

సరే, రాయ్‌బరేలీ ప్రయాణం మానుకొన్నాను. ప్రయాణం జరగలేదని బాధపడడమూ మానుకొన్నాను. అయితే రెంటిని మానుకోవడం సమానంగా జరగని మాట మాత్రం సత్యం. ప్రయాణం మానుకోడం సులభంగానే జరిగింది కాని మానుకోడంవల్ల ఏర్పడిన బాధను మానుకోడం మాత్రం అంత సులభంగా జరగలేదు.

నిజానికి ప్రయాణం చేయడమే శ్రమ, ప్రయాణం చేయకుండా వుండడమే హాయి. ప్రయాణంలో ఎన్నో అసౌకర్యాలుంటాయి. ప్రయాణం చేయకపోవడంలో అటువంటి చిక్కులేమీ వుండక సుఖంగా వుంటుంది. మరి ఇటువంటప్పుడు సుఖంగా వుండని ప్రయాణంమీద ప్రీతి సుఖంగా వున్న ఇంటిపట్టున కూచోడంలో బాధ ఎందుకనో! కొన్ని సుఖమైనవి బాధగా తట్టటమూ, బాధ అయినవి సుఖంగా తట్టడమూ మానవుని పరస్పర విరుద్ధ స్వభావాలలో ఒకటి. అందుకే కాబోలు విషాదాంత నాటకాలను కూడా మనం ఎంతో మక్కువతో ఆనందిస్తాం!

బాధ అనేది హాయి అనేదికూడా వ్యక్తిగత ఇష్టంమీద ఆధారపడి వుంటుంది. ఇష్టమైన బాధకూడా హాయిగా తడుతుంది. ఇష్టంలేని యికూడహా

బాధగా తడుతుంది. ఇష్టమే సుఖం, అయిష్టమే దుఃఖం. అయితే కొన్ని సమయాలలో అయిష్టాన్ని ఇష్టంగా మార్చుకోపోతే బాధ తప్పదు.

లక్నోలో ప్రభుత్వ కళా విద్యాలయంలో వైస్ ప్రిన్సిపాల్‌గా వుంటున్న బి. వేన్ తాను చిత్రించిన అతి సూక్ష్మమైన ప్రకృతిచిత్రాలు (**Miniature Landscapes**) నాలుగు పంపించారు. ఒకటి లోయనూ, లోయ కావల కొండలనూ చూపుతూంటుంది. చిత్రమంతా ఎక్కువగా నీలంలోనే వున్నది. ఆ నీలపు ఏకత్వాన్ని భంగం చేయడానికవి పర్వతమార్గంలో అతి సూక్ష్మరూపంలో నారింజ రంగు దుస్తులుగల ఒక వ్యక్తిని ఏర్పరచారు. అంత చిన్న చిత్రంలో ఎంతో దూరం ప్రదర్శించబడి వుంది. రెండో చిత్రం నిశాదృశ్యం. మూడవది తొలకరి మబ్బులలోగుండా కొంగ ఎగిరిపోతున్న దృశ్యం. నాలుగవది మరొక పర్వత దృశ్యం. నాలుగుకూడా నిజంగా రంగులలో వున్న కవితలే!

ప్రకృతి దృశ్యాలను చిత్రించడం అదొక ప్రత్యేక కళ. ప్రకృతిలోని రూపాలను చిత్రించకలిగితేనే చాలదు. వాతావరణ శోభనుకూడా చిత్రిస్తేనే అది సుందరమైన ప్రకృతి చిత్రమవుతుంది. విశ్వంలోని చిత్రకళలో ప్రకృతి చిత్రణ ఒక ప్రత్యేక శాఖగా రూపొందింది. ప్రకృతి చిత్రణ పుట్టుపూర్వోత్తరాలను గురించి నేను కొంత గవేషణ చేస్తూ వచ్చాను. దీన్నిగురించి ఒక వ్యాసంకూడా వ్రాయాలని సంకల్పించాను. ఇంతలో బెజవాడలో వుంటున్న నాట్యకోవిదుడు శ్రీ తాండవకృష్ణ నుంచి ఒక ఉత్తరం వచ్చింది, బెజవాడలో జరగనున్న కృష్ణా పుష్కర సందర్భంగా ఒక బృహత్తర సంచికను ప్రకటించబోతున్నట్టు, అందులో ప్రకటనార్థం చిత్రకళను గురించి నా దొక ఇంగ్లీషు వ్యాసం పంపమనీ వ్రాశారు.

ఇంకేం? నేను వ్రాయాలనుకొన్న ప్రకృతి చిత్రణ వ్యాసం ఆ సంచికకు పంపవచ్చునని వ్యాసాన్ని ఇంగ్లీషులో ప్రారంభించాను. వ్యాసం శీర్షిక **"Landscape Art"** అని పెట్టాను. **"The Art of Landscape Painting"** అని పెట్టాలనుకొంటే ఆ పేరు చాలా పాతదనంగా తట్టింది. **"Landscape Art"** అంటే బాగున్నదనిపించింది. ఇంగ్లీషులో ఇదే నా మొదటి వ్యాసం. దాన్ని ఈ విధంగా ప్రారంభించాను.

**To behold a distant blue mountain beyond the vast plains is by no means a less delight than to see a beautiful human face expressive of some deep feeling. To give form in line and colour to a lonely leafless tree silhouetted against the rosy sky in an autumn dawn is as pleasant as to paint the figure of the Dhyani Buddha One would receive the same lasting impressions of supramundane tranquility and ecstasy from both of these studies.**

మైదానాల కావలగావున్న నీలిపర్వతాన్ని తిలకించడం లోతైన అనుభూతులను వ్యక్తపరచే ఒక సుందరమానవ ముఖాకృతిని చూడడంకంటె ఏమీ తక్కువ ఆనందం కాదు. శారద ప్రభాతంలో అరుణగగనాని కడ్డంగా ఛాయారూపంలో నిలిచివున్న ఆకులులేని చెట్టుకు రంగులోనూ, రేఖలోనూ రూపం ఇవ్వడం ధ్యానీ బుద్ధమూర్తిని చిత్రించడంతో సమానమైన ఆనందం. ఈ రెండు చిత్రాలనుంచి కూడా ప్రేక్షకుడు ఒకేవిధమైన లోకోత్తర ప్రశాంతభావాన్నీ, ఆనందాన్ని పొందుతాడు.

పైవిధంగా ప్రారంభించి అందులో కొన్ని సుందరమైన ప్రకృతి దృశ్యాలు ఏ విధంగా వుంటే బాగుంటవో వర్ణించాను. పచ్చికతో ఊగుతున్న పచ్చికబయలులో మేఘాలు క్రమ్మిన దినం, నీలగగనం క్రింద నీల సరోవరంలో తేలుతున్న ఒక తెల్ల తామరపూవూ, ఉభయ సంధ్యారాగాలూ, శీతసంధ్యలోని పొగమంచుతో అస్పష్టమైన లోయలు, ఉదయంనుంచి సాయంత్రంవరకు వాతావరణ శోభతో మారుతూవున్న ఉత్తుంగ హిమశృంగాలు, గాలీ, వానలో నదిలో దూరాన తేలిపోతూవున్న ఒంటరి పడవ, గ్రీష్మసంధ్యలో ఆకాశంలో తేలియాడుతున్న తొలకరి మబ్బుతునకలు, వెన్నెలలో దిగంతాని కడ్డంగా నిలిచివున్న వెదురుచెట్లు, నిశీధంలో నదీతీరపు శ్మశానంలో మిలమిలలాడే మంటలూ మొదలైనవి.

ఈ వ్యాసంలో చాలా పెద్ద పెద్ద ఇంగ్లీషు శబ్దాలను వాడాను. **Anthropomorphism, Transcendental, Deification** మొదలైన వాటివి. ప్రథమ రచనలలో రచయిత శబ్దాడంబరాన్ని ప్రదర్శించడానికి ఎక్కువ అభిరుచిని కనపరుస్తారు. అదీకాక రచించే విషయవస్తువును అనుసరించికూడా ఇటువంటి గంభీర శబ్ద ప్రయోగాలు చేయాలని వస్తూంటుందికూడా.

ఈ వ్యాసాన్ని చదివిన విజ్ఞులంతా అనుకూలభావాలు వ్యక్తపరచినందున నా మొదటి వ్యాసం నాకు మంచి ప్రోత్సాహాన్ని కలిగించింది. విజ్ఞులు వా వ్యాసం బాగుండలేదనే అభిప్రాయం కనపరిస్తే నిరుత్సాహపడడం సహజం. కాని ఈ నిరుత్సాహపడడం అంత మంచి పనికాదు. బాగున్నదని మెచ్చుకొంటే కలిగే ఉత్సాహమే బాగాలేదన్నప్పుడు కూడా కలిగితే ఇక ఆ వ్యక్తికి జీవితంలో ఏదీ అపజయంగా తట్టదు. అయితే ఇటువంటి గుణాన్ని సాధించాలంటే కఠినమైన మానసిక సాధన అవసరం.

1945 వ సంవత్సరం చలికాలంలో ఆ మొదటి వ్యాసం వ్రాశాను. చలి కాలం వెళ్ళిపోబోతూకూడా రెండవ వ్యాసం మరొకటేమీ వ్రాయలేదు. మొదటి వ్యాసమే ఆఖరువ్యాసంకూడ కాదుగదా అనే భయం కొంచెం కలిగింది. కాని ఆ భయాన్ని వెంటనే రూపుమాపాను. చలికాలంలో ఇంటిపట్టున కూచోబుద్ధికాక బయట ముక్తాకాశం క్రింద పొలాలలో, కాలవగట్టుపైన తిరగబుద్ధివేస్తుంది. అందు వల్ల స్థిరంగా ఈ ఋతువులో ఇంటివద్ద కూర్చొని బుద్ధిమంతునిలా వ్రాసుకునే స్థిరత కలగలేదు. అందుకని నా రచనా వ్యాసంగాన్ని వేసవికాలానికి వాయిదా వేసి మనసులో ఏవో మధురభావాలు పెంచుకొంటూ స్వేచ్ఛగా తిరగసాగాను.

వ్రాతలేమీ సాగకపోయినా చదవడంమాత్రం ఒకమాదిరి సాగిపోతూనే వుంది. మిత్రులనుంచి ఉత్తరాలు అందుకోడం, వారికి తిరిగి సుదీర్ఘమైన జవాబులు వ్రాయడం వదుస్తూనే వుంది. పంజాబులోని, యు.పి. లోని మిత్రులు నన్ను అక్కడికి రమ్మని వ్రాయడం, వస్తానని నేను జవాబిస్తూ వెళ్ళకపోవడం కూడ మామూలుగానే సాగుతున్నది. ఈ 1945 లో మాత్రం మళ్ళీ ఉత్తరప్రాంతాలకు వెళ్ళితీరవలసిందే అని మాత్రం నాలో నేను నిర్ణయించుకొన్నాను.

# అవ్యక్తమైన ప్రణయ భావాంకురం

రోహిణీకార్తె అనే పేరులోనే ఏదో భయానకత ధ్వనిస్తుంది. రోహిణీ కార్తెలో మండే వేడిఅంతా "రోహిణి" అనే పేరులోనే వినిపిస్తూన్నట్టుంటుంది. ఒక్కొక్క సంవత్సరం రోహిణీకార్తెలోనే తొలకరించి వర్షాలు బాగా పడి ఎండల వేడినే తెలియనీయవు. 1945 రోహిణిలో తొలకరించకపోవడమే కాక ఆకాశంలో తొలకరి మబ్బుతునక ఒకటికూడా గోచరించేదికాదు. ఎండలు మండి పోతున్నాయి. వర్షం అనే పేరువింటేనే ఎంతో ఆనందం వేస్తుంది. వర్షం అనే పేరు చెవికి వినిపించడం తప్ప వర్షం అనే వస్తువు కంటికి కనుపించడంలేదు.

కులూ లోయనుంచి నికోలస్ రోరిక్, లక్నోనుంచి అసిత్‌కుమార్ హాల్దార్ నన్ను తమవద్దకు రమ్మని వ్రాసే ఉత్తరాలు ఎక్కువైనాయి. ఉత్తరాలు వ్రాస్తే నేను బయలుదేరడం లేదని 1945 మే మాసాంతంలో వెంటనే బయలుదేరి రమ్మని నాకు టెలిగ్రాం ఇచ్చారు. ఉత్తరాలను నిర్లక్ష్యపరచి పోలేకపోయానుకాని ఇక టెలిగ్రామ్‌ను నిర్లక్ష్యపరచలేకపోయాను. సగం ఉత్సాహంతో, సగం నిరుత్సాహంతో బయలుదేరాను.

క్రిందటిసారి లక్నో పోయినప్పుడు హాయి అయిన శరదృతువు. ఇప్పుడు మండుతున్న గ్రీష్మం. గ్రీష్మంలో మనిషిలో చల్లగా వుంటుంది. బయటి జగత్తు మాత్రమే మాడుతూ వుంటుంది. బయట వేడివున్నా లోపల చల్లగా వుంటే లోపలి చల్లదనాన్నే అనుభూతి చెందుతూ ఆ హాయితో బయటివేడిని మరచి పోవచ్చు. నేను అదే చేయ ప్రయత్నించాను.

క్రిందటిసారివలెనే మళ్ళీ గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి మళ్ళీ ఝాన్సీ, కాన్పూర్‌ల మీదుగా, కృష్ణా, గోదావరి, నర్మదా, యమునా, గంగానదులను దాటి మళ్ళీ లక్నో చేరుకొన్నాను.

ఆంధ్రదేశంలోని ఎండలకంటె లక్నోలోని ఎండలు విపరీతమైన వేడిగా వున్నాయి. హాల్దార్‌గారి బంగళాకు చేరుకొనేసరికి చీకట్లు వ్యాపించి వేసవిలోని పగటివేళకంటె కొంత చల్లగా వున్నట్టు అనిపించింది. అంతకంటె చల్లగా తట్టింది హాల్దార్‌గారి ప్రేమపూరితమైన స్పర్శ. ఏడు సంవత్సరాలకు తిరిగి ఉభయులము కలుసుకొన్నందుకు ఉభయులకూ పరమానందం కలిగింది. ఆయన ఆ సంవత్సరంతో ప్రిన్సిపాల్ పదవినుంచి రిటైర్ అయిపోయినట్లే. అందువల్ల చాలా స్వేచ్ఛగా ఉల్లాసంగా, ఉత్సాహంగా గోచరించారు.

క్రిందటిసారి లక్నోలో నేను వీరి ఇంట వున్నప్పుడు కుటుంబం వారెవరూ ఇక్కడలేక కలకత్తాలో వున్నారు. ఇప్పుడు ఇక్కడ ఆయన కూతుళ్ళు ముగ్గురు వున్నారు. ఆయన సతీమణి మాత్రం కలకత్తాలోనే వున్నది. సునీరా, సుపర్ణా, రోచనా అని వీరి పేర్లు. నేను ఇదివరలో వున్నప్పటి తేజోసింగ్, బాలక్, ఝబ్బ్యా మొదలైన పాత పరిచారకులే ఇప్పుడు కూడా వున్నందువల్ల వాళ్ళను చూచేసరికి నాకు చాలా ఆనందం కలిగింది. వాళ్ళంతా కూడా నా రాకకు ఆనందించారు.

## "మద్రాసీ బాబు"

వీళ్ళలో ఝబ్బ్యా అనే అతడు చాలా అమాయకుడు. ఝబ్బ్యా అంటే హిందీలో జడలబర్రె అని అర్థం. అమ్మాయిలంతా అతనిని ఏదో అంటూ ఏడి పిస్తూండేవాళ్ళు. నేను అతనిపక్షం అవలంబించి అతడిని వెనకేసుకు వస్తూన్నందు వల్ల అందరికంటే మద్రాసుబాబు చాలా మంచివారు అంటుండేవాడు ఝబ్బ్యా. ఇక్కడి పరిచారకులు, పాకీ మనిషి అందరు నన్ను మద్రాసీ బాబు అని పిలిచేవాళ్ళు.

నేను లక్నో వచ్చినట్లు నికోలస్ రోరిక్‌కు ఒక ఉత్తరం వ్రాస్తూ తగు సమయంలో లక్నోనుంచి కులులోయకు రాగలనని తెలియపరచాను.

వేసవికాలపు వేడి తెలియకుండానే లక్నోలో సందడిగా గడిచిపోసాగి నాయి. హాల్దార్‌గారి కూతుళ్ళతో చనువు ఏర్పడింది. ఎక్కువకాలం వారితోనే గడి చేది. ఆయన సంతానం ఎవరు హాల్దార్‌వలె ప్రతిభావంతులు కారు. అయినా, మధుర హృదయాలు కలవారు. స్నేహపాత్రులు. హాల్దార్ ఇంటికి సంజీవముఖర్జీ అనే ఎం. ఎస్. సి. విద్యార్థి వస్తుండేవాడు. సునీరకు ముఖర్జీకి కొంచెం స్నేహం ఎక్కువగా వుండేది. వారిద్దరు వంటరిగా కూడా కూర్చొని సంభాషణలు జరుపు తుండేవారు. కాలక్రమేణ వారి స్నేహం ప్రణయంలోకి దారితీసి దానిఫలితంగా ఉభయులకు వివాహం స్థిరపడిపోయింది.

## ప్రణయాంకురం

మూడవఅమ్మాయి రోచనకు, నాకు సాన్నిహిత్యం ఏర్పడింది. మేముభ యులం కూడా వంటరిగా కూర్చొని ముచ్చటించుకొనేవాళ్ళం. ఇంకా ఎక్కువకాలం ఆమె అక్కడే వుంటే ఫలితాలు మరొకవిధంగా పరిణమించేవి. పరిస్థితులు అందాకా రాకుండానే, నా మంచికో, చెడుకోగాని రోచన తన తల్లి దగ్గరకు కల కత్తా వెళ్ళవలసి వచ్చింది. రోచన కలకత్తా వెళ్ళిపోయిన తరువాత నా కేదో విషా

దంగా తట్టసాగింది; లక్నో నగరమంతా నీరసంగా గోచరించసాగింది. నా మానసిక పరిస్థితిని హాల్దార్ గ్రహించారు. ఒక రాత్రి బంగళాముందు కూర్చొని ప్రొద్దుపోయేవరకు మాట్లాడుకొంటున్న సందర్భంలో ఆయన అకస్మాత్తుగా అన్నారు రోచనను వివాహం చేసుకోవలెననే తలంపు వున్నదా అని. ఆ విషయంలో ఇంకా నేనొక నిర్ణయానికి రాలేదని జవాబు చెప్పాను. అంత తొందరలో నిర్ణయానికి రాలేకపోయినా ఫరవాలేదని, నిదానంగా నిర్ణయించుకోవచ్చు అని అన్నారు ఆయన. ఆయన ప్రశాంతమైన సలహా నా తప్త హృదయాని కెంతో శాంతిని ప్రసాదించింది. అది మొదలు నాలో బెంగ తగ్గిపోయి ఉల్లాసంగా ఎప్పటివలె సంచరించసాగాను.

లక్నోలోని ప్రభుత్వ సెక్రటేరియట్‌లో నవేందుబోసు అనే ఒక పెద్ద ఉద్యోగి వున్నాడు. ఆయన గొప్ప బెంగాలీ సాహిత్యపరుడు. మంచి కావ్య సమీక్షకుడు. ఆయన ఇంటికి పోతుండేవాణ్ణి నేను. లక్నోలోని బెంగాలీ సాహితీపరులంతా కలసి ప్రవాసీ వంగ సాహితీ సమితి నొకదాన్ని నడుపుతున్నారు. ఒకనాడు ఆ సమావేశంలో నన్నుప్రసంగించమన్నారు. సాహిత్యంలో విషయవస్తువుకు ఎంతవరకు స్థానం వున్నది, అనే విషయాన్ని గురించి కొంత బెంగాలీలోను, కొంత ఇంగ్లీషులోను ప్రసంగించాను.

విషయ వస్తువుకు ప్రాధాన్యం ఇచ్చే రచన అంత ఉత్తమ రచన కాదని. శైలికి, ప్రక్రియకు ప్రాధాన్యమిచ్చే రచన మాత్రమే ఉత్తమమైనదని, అంత మాత్రాన సాహిత్యంనుంచి విషయవస్తువును పూర్తిగా తరలించమని అర్థంకాదని ప్రసంగించాను. కొందరు నా భావాలకు అనుకూలత, కొందరు ప్రతికూలత కనపరిచారు. నా భావాలేమైనా, వారంతా నా బెంగాలీ విని మాత్రం ఎక్కువగా సంతసించారు. పరభాషలో భావవ్యక్తీకరణకు కొంత కష్టం కలిగినా, కొంత ఉల్లాసం కూడా కలుగుతుంది.

ఒకరోజు ఉదయాన మేమంతా, సునీరా, సువర్ణా, సంజీవ ముఖర్జీ, నేనూ కారులో బయలుదేరి అలహాబాదుకు పయనించాం. కారును సంజీవముఖర్జీ నడుపుతున్నాడు. ఆ వేగం చూచి అమ్మాయిలు ఇద్దరూ భయపడసాగారు. వాళ్ళు భయపడుతున్నకొద్దీ ముఖర్జీ వేగం హెచ్చించాడు. ఆయన వేగం హెచ్చించినకొద్దీ వీళ్ళు ఇంకా భయపడసాగారు. ఆయన వేగానికి వీళ్ళ భయానికి పోటీపడింది. నాకు కూడా సందేహం వేసింది. మనం అలహాబాద్ చేరుకోగలమా లేక మన శవాలను తిరిగి లక్నో చేర్చడం జరుగుతుందా అని. అంతటితో ముఖర్జీ భుజం

తట్టి చెప్పసాగాను, ఎంత చేతకానివాళ్ళయినా వేగంగా పోనీయగలరు కాని బాగా చేతనయినవాళ్ళు మాత్రమే నెమ్మదిగా నడపగలరు అని. ఆ మాట విని ఆయన వేగాన్ని తగ్గించాడు. సునీరా, సుపర్ణలు సంతోషించారు.

అలహాబాద్ చేరుకొని మా స్నాన పానాదులు ముగించుకొని సాయంత్రం వరకు విశ్రమించాం. వడగాలి లక్నోలో కంటె ఇక్కడ తక్కువ వున్నట్టు అని పించింది. చల్లబడిన తరువాత ఇండియన్ ప్రెస్‌కు వెళ్ళి అక్కడ అచ్చవుతున్న హాల్దార్‌గారి కొన్ని బెంగాలీ కావ్యాలను చూచి, నదుల సంగమం అయిన త్రివేణీ వైపుకు వెళ్ళాం. వేసవికాలంపు ప్రొద్దు ఇంకా వుంది.

## కాబోయే అల్లుడు

"మిలన్", "పథిక్" మొదలైన హిందీ ఖండకావ్యాలను రచించిన కవి పుంగవుడు పండిత రామనరేశ త్రిపాఠీని కలుసుకోవాలని నాకు చాలాకాలం నుంచి ఆకాంక్ష. మేమంతా మళ్ళీ ఇండియన్ ప్రెస్‌కు వచ్చి త్రిపాఠీగారి చిరునామా తెలుసుకొని ఆయన ఇంటికి వెళ్ళాం. ఆయన ఎంతగానో మమ్మల్ని సత్కరించి సంభాషణ ప్రారంభించారు. వారిద్దరు ప్రిన్సిపాల్ హాల్దార్‌గారి అమ్మాయిలని, ఆ మూడో ఆయనహాల్దార్‌గారికి కాబోయే అల్లుడని త్రిపాఠిగారికి పరిచయం చేశాను. వెంటనే సంజీవముఖర్జీ అందుకొని "ఆయనకూడా హాల్దార్‌గారికి కాబోయే అల్లుడేనండీ" అన్నాడు. త్రిపాఠీగారు నవ్వుకొన్నారు. మిగతావారంతా కూడ నవ్వసాగారు. నేనుకూడా వారితోపాటు బయటికి నవ్వానేకాని నా లోపల నవ్వలేను.

రామ నరేశ త్రిపాఠి దక్షిణదేశం పర్యటించి వున్నారు. దక్షిణంనుంచి వచ్చిన యువకుడు తనను చూచేంత శ్రద్ధ కనపరచినందుకు ఆనందించారు. తెలుగు సాహిత్యంలోని నూతన కవులను గురించి, నూతన కవితా రీతులను గురించి వివరంగా అడిగి తెలుసుకున్నారు; హిందీ కవితలోని ఛాయావాదాన్నిగురించి కొంతసేపు చర్చించుకొన్నాం. హిందీ సాహిత్యభాషగానే నేను అభ్యసించానేకాని రాష్ట్రభాషగా నేను దానిని అభ్యసించలేదని ఆయనతో చెప్పాను. భారతదేశం మొత్తానికి హిందీ రాష్ట్రభాష కావడం సమంజసం కాదని, అందుకు ప్రధాన కారణం హిందీ కొందరి మాతృభాష కావడమేనని, ఒకరి మాతృభాష మరొకరికి రాష్ట్రభాష కావడం సమంజసం కాదనీ త్రిపాఠీగారితో చెప్పాను. అందుకని ఇంగ్లీషు భారతదేశానికి రాష్ట్రభాష కావలెనని కూడా నా అభిమతం కాదని, ఎవరికీ

మాతృభాషకాని "ఎస్పరాంటో" లాంటి భాష మాత్రమే రాష్ట్రభాషగాను, ప్రపంచ భాషగాను వుండడం సమంజసమని అన్నాను.

పండిత రామ నరేశ త్రిపాఠీ నా వాదాన్ని అంగీకరించారు, ఇష్టంగా కాక పోయినా కొంత అయిష్టంగా. నాతో లక్నోనుంచి వచ్చిన ముగ్గురికిమాత్రం ఈ వాద వివాదాలు గిట్టడంలేదు. ఈ వాదాలలోని విలువను వారంతా గ్రహించినట్టు లేరు. త్వరలో బయలుదేరి లక్నో వెళ్ళిపోవాలని వారు నన్ను తొందరపెట్ట సాగారు. సరే, తప్పనిసరిగా త్రిపాఠీగారి వద్ద సెలవు తీసుకొని తిరిగి కారులో బయలుదేరి ఆ రాత్రి ప్రయాణం సాగించి లక్నో చేరుకున్నాం.

మమ్మందరినీ కారులో అలహాబాడ్ తీసుకువెళ్ళిన సంజీవముఖర్జీ మధ్యలో ఎక్కడా ప్రమాదాలు జరపకుండా తిరిగి క్షేమంగా తెచ్చి లక్నోలో దింపినందుకు ఆయనకు ధన్యవాదాలు సమర్పించాం.

# పంజాబ్ ప్రయాణం – కొన్ని విశేషాలు

జూన్ అంతం కాబోతున్నది కాని లక్నో ప్రాంతంలో వర్షంపడలేదు. ఎండలు మండిపోతున్నాయి. నికోలస్ రోరిక్‌నుంచి లక్నోకు ఉత్తరం వచ్చింది నన్ను త్వరలో బయలుదేరి రమ్మని. ఇంకా ముందు వర్షాలు ఆరంభిస్తే కులూ లోయకు పోయే రోడ్లు చెడిపోయి రాకపోకలు ఆగిపోతాయి, కనుక వెంటనే బయలుదేరి రమ్మని రోరిక్ వ్రాశారు. ఉత్తరం హాల్డార్‌కు చూపాను. ఆయన నన్ను వెళ్ళిరమ్మని సలహా ఇచ్చారు.

నికోలస్ రోరిక్‌కు బహూమతి ఇవ్వమని తాను నిర్మించిన మట్టితో చేసి కాల్చిన బుద్ధుని తల వాకు ఇచ్చారు ఆయన. తోటలోని కెమీలియా చెట్టు ఆకులను కొన్ని ఇచ్చి పీటితో తేనీరుచేస్తే రుచిగా వుంటుంది కనుక ఇవికూడా రోరిక్‌కు ఇవ్వమని చెప్పారు హాల్డార్.

ఒక సాయంత్రం అందరివద్ద బరువు హృదయంతో వీడ్కోలు తీసుకొని లక్నో స్టేషన్‌కు బయలుదేరాను. మళ్ళీ రోచన కనిపించలేదు అనే బెంగ లక్నో వదలిపెట్టబోతూన్నపుడు ఇంకా ఎక్కువైంది. అయితే, ఈ బరువు హృదయాన్ని రోరిక్ దగ్గరకు కులూ లోయకు పోతున్నాను గదా అనే తలంపుతో కొంత తేలిక పరచాను. హాల్డార్‌స్టేషన్‌కు రాబోతూంటే వద్దని ఆపివేశాను. ఆయన వదనం విషాదంతో నిండింది. నేను బయలుదేరే సమయాన కులూ లోయనుంచి త్వరలో తిరిగి లక్నో వస్తానని చెప్పి స్టేషన్‌కు చేరుకొన్నాను.

యుద్ధ వాతావరణం మూలంగా లక్నో స్టేషన్ అంతా మిలటరీతో కిటకిట లాడుతోంది. కొంతసేపటికి తుఫాన్‌లాగా పంజాబ్ మెయిల్ వచ్చి ఆగింది. ఈ బండి కలకత్తాలో బయలుదేరి బీహారు గుండా, యు. పి. గుండా, పయనించి లాహోర్ చేరుకుంటుంది.

నేను అమృత్‌సర్‌కు రెండవ తరగతి టిక్కెట్టు తీసుకొని నా సీటులోకి వెళ్ళి కూర్చున్నాను. రెండవ తరగతిలో కూడా కొంత వత్తిడిగానే వుంది. చిన్న వ్పటినుంచి పంజాబ్ మెయిల్ అనే పేరు వినడమేకాని దాన్ని ఎన్నడూ చూడ లేదు. నేడు దానిని చూడడం మాత్రమేకాక దానిలో ఎక్కడంకూడా జరిగింది.

అందులో కలకత్తానుంచి వస్తున్న ఇద్దరు సిక్కులు, కాశీనుండి వస్తున్న ఒక ముస్లిమూ లక్నో స్టేషన్‌లో నాతోసహా ఎక్కిన మరి కొందరు పెద్దలూ వున్నారు. సాయంత్రం ఆరు అయింది. కాని గ్రీష్మకాలపు ప్రొద్దు ఇంకా వుంది.

పంజాబ్ మెయిల్ బయలుదేరింది. నేడు నేను పోతున్నదంతా ఇదివరలో త్రొక్కని నూతన ప్రదేశమే అన్న తలంపు కలిగి ఆనందం కలిగింది. లక్నో స్టేషన్ వదలి కొంతదూరం వెళ్ళినప్పటినుంచి మెయిల్ వేగాన్ని అందుకొంది. ఆ వేగానికి యు. పి. మైదానాలలోని దుమ్మంతా విపరీతంగా లేవసాగింది. చీకటి పడింది. ఈ ప్రయాణం పగటిపూట అయితే బాగుండేది దేశం చూస్తూపోవచ్చు ననిపించింది.

నా కంపార్టుమెంటులో వున్న వారంతా ఉత్తరహిందూస్థానీయులే. నే నొక్కడిని మాత్రమే దాక్షిణాత్యుడను. అక్కడున్న ప్రయాణీకులంతా దాదాపు వ్యాపార సరళి మనుషులే. కాని కేసర్‌సింగ్ అనే సిక్కు యువకుడుమాత్రం కొంచెం ప్రత్యేకంగా కనుపించాడు. దాదాపు నా వయసు వుంటుంది. మా ఇద్దరికీ మాటలు కలిశాయి. అతడు కలకత్తాలో వాళ్ళ తండ్రి చేస్తున్న రైల్వే కంట్రాక్టులలో తండ్రికి సహాయంచేస్తూ అక్కడే కొన్ని సంవత్సరాలనుంచీ వుంటున్నాడట. పంజాబ్ విశ్వవిద్యాలయంలో బి. ఎస్. సి. చదివినాటడ. కలకత్తాలో వుంటూ బెంగాలీకూడా నేర్చుకున్నాడట. సాహిత్యం అన్నా, కళలన్నా కొంత అభిరుచి ఏర్పడివుంది. నా దగ్గరున్న **"Landscape Art"** అనే నా వ్యాసాన్ని ఆయనకు చూపించాను. ఆయన దాన్ని శ్రద్ధగా చదవనారంభించారు.

## రుచించని లడ్డూలు

రైలుబండి మహా వేగంగా పరుగెత్తి పోతోంది. అంధకారంలో బయట దాగివున్న అస్పష్ట రూపాలన్నీ శరవేగంతో మరొకవైపుకు పరుగెత్తుతున్నాయి. వాటివైపు చూచినప్పుడల్లా అనిపిస్తుంది, పరిగెత్తుతున్నది బండికాదు బయటి ప్రకృతే అని. ఇంతలో హర్‌దోయీ స్టేషన్‌వచ్చింది: బండి ఆగిపోయింది. "హర్‌దోయీకా లడ్డు" అని ప్లాట్‌ఫారంమీద కేకలు వినపడుతున్నాయి. హర్‌దోయీలో తయారైన లడ్లు ఈ ప్రాంతంలో చాలా ప్రసిద్ధి. కాని తీపి తినడం నాకు అంతగా అలవాటు లేనందున లడ్డులోని విలువ నాకు తెలియదు. లడ్డులను ఎర్రని మట్టిముంతలలో వుంచి పైన కాయితంతో సీలుచేసి అమ్ముతున్నారు. నా ప్రక్కనే కూర్చున్న కేసర్‌సింగ్ ఒక ముంతను కొని అందులోని లడ్డులను తీసి నాకు తినమని ఇవ్వబోతే నేను తినజాలనని, అవి నాకు రుచించవని తెలిపాను. కాని తినిచూచిన తరువాత నా ఇష్టాఇష్టాలను తెలపమని ఆయన బలవంతంచేయగా నే నొక ముక్కను త్రుంచి నోటిలో వేసుకొంటే హర్‌దోయీ లడ్డులోని ప్రత్యే

కత నా కేమీ తెలియలేదు. మామూలుగా అన్ని లడ్డులవలెనే అదికూడా తియ్యగా వున్నది. రత్నాల విలువ తెలియనివాళ్ళకు రత్నాలు, గాజుముక్కలు కూడా ఒకే విధంగా గోచరిస్తాయి !

హర్‌దోయీ స్టేషన్‌నుంచి బండి కదిలింది. కేసర్‌సింగ్ నా వ్యాసాన్ని పూర్తిచేయడమేకాక ఆ ముంతలోని లడ్డులనుకూడా పూర్తిచేశాడు! లడ్డుల ప్రత్యేక రుచిని గురించి కొంతసేపు చెప్పి ఇక నా వ్యాసంలోని రుచిని అభివర్ణించ సాగాడు. అది నా మొదటి వ్యాసం మాత్రమేనని విని అతడు ఇంకా ఆశ్చర్య పోసాగాడు. ఇటువంటి మంచి ఇంగ్లీషును దాక్షిణాత్యులు మాత్రమే వ్రాయగల రని, ఇటువంటి సుందర భావాలు దాక్షిణాత్యులలోను, బెంగాలీలలోను మాత్రమే గోచరిస్తాయని ప్రశంసించి అలసిపోయి కేసర్‌సింగ్ పడుకొని కన్నుమూశాడు. ఈ ప్రాంతపు స్టేషను, స్టేషన్‌లోని ప్రజలనూచూడాలనే అభిలాషతో నేను నిద్రించకుండా కూర్చోవాలనే నిర్ణయించుకొన్నాను.

మా పంజాబ్ మెయిల్ వచ్చి షాజహాన్‌పూర్‌లో ఆగింది. నగరం పేరు చాలా బాగుంది కాని నగరం పేరుకు తగినంత బాగా వున్నదో లేదో తెలియదు. స్టేషన్‌మాత్రం ఆ నిశీధంలో దీపాలకాంతిలో కనుపించినంతవరకు బాగానేవుంది. అయినా, యు. పి. లోని తూర్పు ప్రాంతంకంటె ఈ పటమట ప్రాంతం బొన్న త్యంలో కొంత వెనకబడే వుంటుంది. షాజహాన్‌పూర్ నుంచి నేను కొంచెం కన్నుమూశాను. కాని బరేలీ స్టేషన్‌లో మళ్ళీమేల్కొన్నాను. పశ్చిమోత్తర యు. పి. లో బరేలీ ప్రాముఖ్యత గలది. లక్నోకూ అలహాబాద్‌కూమధ్య రాయ్ బరేలీ వున్నది. ఇది బరేలీ మాత్రమే. ఇక నాకు నిద్ర ఆగలేదు. పడుకొన్నాను. కూర్చుంటే నిద్ర వచ్చింది కాని పడుకొంటే నిద్ర తగ్గింది. రాబోతూన్న రాంపూర్ స్టేషన్ కూడ చూడాలని అనుకొని భవిష్యత్తును ఆలోచిస్తూ పడు కొన్నాను. కూర్చుంటే మళ్ళీ నిద్రవస్తుందని భయం.

రాంపూర్ స్టేషన్ రాగానే లేచి కూర్చున్నాను. రాంపూర్ నవాబు మంచి తనానికి పేరు పొందినవాడు. వీరి వంశమంతా సంగీత పోషణకు ప్రఖ్యాతి చెందింది. ఎందరెందరో పేరుపొందిన హిందూస్తానీ సంగీతపు ఉస్తాదులకు రాంపూర్ క్రీడాస్థలం. రైలుబండి రాంపూర్‌నుంచి కదిలింది. నేను నిద్రించాను. మురాదాబాద్, సహరాన్‌పూర్ స్టేషన్లు నా నిద్రలోనే దాటిపోయాయి. తెల్లవారి నేను నిద్ర మేల్కొని చూచేవరకు మేము యు. పి. లో కాక పంజాబ్ భూమి

మీదుగా పయనిస్తున్నాం. పొలాలలో ఒంటెలు తోలుతూన్న మోటలు, లాగులు ధరించివున్న స్త్రీలూ, తలపాగాల పురుషులూ గోచరించసాగారు. పంజాబ్ భూభాగాన్ని ఇంతకాలానికి చూడగలిగినందుకు సంతోషించాను. పొలాలన్నీ లేతచెరకు మొలిచి వున్నాయి. అక్కడక్కడ వివిధ విధాలైన పండ్లతోటలు కనిపిస్తున్నాయి.

మా బండి వచ్చి అంబాలా కంటోన్‌మెంటు స్టేషన్‌లో ఆగిపోయింది. మా బండి మిలిటరీకి నియోగించబడినదట. ఇక్కడనుంచి మాకు మరో బండిని ఏర్పాటు చేస్తామని చెప్పి మమ్మందరిని అంబాలాలో దించివేశారు. ఆ దిగమని చెప్పిన అధికార్లను కేసర్‌సింగ్ పంజాబీలో తిట్టసాగాడు. దానితో అక్కడ పెద్ద రభస జరిగి పోలీసులు వచ్చి సర్దవలసి వచ్చింది. ఎంత సర్దినా సర్దార్‌జీ కోపం శాంతించలేదు.

## విజయోత్సాహం

అంబాలా పంజాబ్‌లో గొప్ప మిలిటరీ కేంద్రం. మేమంతా దిగి అంబాలా స్టేషన్‌లో ఒక గంట గడిపాం. తిరిగి రైల్వే అధికారులు వచ్చి మేము దిగిన పంజాబ్ మెయిల్‌లో మళ్ళీ మమ్మల్ని ఎక్కమని చెప్పారు. మేమంతా ఆశ్చర్యపోయినాం. కేసర్‌సింగ్ మళ్ళీ అధికార్లను తిట్టసాగాడు. నేను ఆయనను వారించాను. బండిలోనుంచి దిగమన్నపుడు తిట్టడం సబబుగానే వుంది కాని తిరిగి ఎక్కమన్నప్పుడు తిట్టడం ఏమాత్రం సబబుగా లేదు, అని ఆయనతో వాదించినందువల్ల కేసర్‌సింగ్ చల్లబడడం జరిగింది. అంతటితో రైలులోనుంచి దిగినవారమంతా తిరిగి మా స్థానాలలో మేము వెళ్ళి కూర్చున్నాం. బండి విజయోత్సాహంతో కదిలింది.

పంజాబ్ మైదానాలలో గ్రీష్మఋతువు తన నిజరూపాన్ని చూపసాగింది. సూర్యుడు పైకొచ్చినకొద్దీ పడమటివైపునుంచి వేడిగాలులు సాగాయి. అనవసరంగా అంబాలా స్టేషన్‌లో ఒక గంట ఆలస్యమైపోయింది. రైలు లూథియానాలో వచ్చి ఆగింది. కేసర్‌సింగ్ నానుంచి వీడ్కోలు తీసుకొని తన నీటిపాత్రలోని నీరు నా నీటి పాత్రలో పోసి, తన దగ్గర వున్న పళ్ళు అన్ని నా దగ్గర వదిలి, వెనక్కు తిరిగి చూస్తూ లూథియానా స్టేషన్‌లో జనుల మధ్య అదృశ్యమైపోయాడు. లూథియానా స్టేషనంతా సిక్కులమయం. సిక్కుపురుషులెంత బలంగా వుంటారో సిక్కు స్త్రీలు అంత బలహీనంగా గోచరిస్తారు. పంజాబ్ ప్రధానంగా పురుషులదేశం. అందుకే కాబోలు ఎక్కడచూచినా మీసాలు, గడ్డాలు! పంజాబ్‌లో జనాభా లెక్కల ప్రకారం స్త్రీల పుట్టుక తక్కువ, పురుషుల పుట్టుక ఎక్కువ.

నా కంపార్టుమెంటులో నుంచి జలంధర్‌లో దిగిపోయేవారు ఎక్కువమంది వున్నారు. వారంతా సామానులు సర్దుకొని, కొందరు బట్టలు మార్చుకొని జలంధర్ స్టేషన్ నిమిత్తం ఎదురుచూస్తూ కూచున్నారు. తీక్షణమైన ఎండ వేడిలో మా రైలు వేగం ఎక్కువైంది. రైలు వేగం ఎక్కువైన కొద్దీ వేడిగాలి ఎక్కువైంది. రైలు వేగంవల్ల వేడిగాలికి కాని, గాలి వేడివల్ల రైలుకుగాని ఏమీ బాధ కలిగినట్టు లేదు. కాని ఆ రెంటివల్ల మాకు మాత్రం బాధ కలుగుతూనే వుంది!

జలంధర్ చేరుకొన్నాం. అన్ని స్టేషన్లలో కంటే ఈ స్టేషన్‌లో ప్రయాణీకుల సంఖ్య విపరీతంగా వుంది. మా కంపార్టుమెంట్‌లో ఇద్దరం మాత్రమే మిగిలాము. నేను అమృతసర్‌లో దిగిపోతాను. ఆయన లాహోర్ వెళ్ళిపోతాడు. రైలు అమృత్‌సర్ చేరుకొనేసరికి మధ్యాహ్నం ఒంటిగంట అయింది. నిప్పులలో వున్నట్టే వుంది. అమృత్‌సర్‌లో ఆ రోజు వేడి 120 డిగ్రీల వరకూ వున్నదట. ఇక్కడి ఎండలను భరించడం ఎంత కష్టమో చలిని భరించడం కూడా అంత కష్టం.

స్టేషన్ దగ్గరలోనే వున్న ఒక సిక్కుల హోటల్‌లో వెళ్ళి దిగాను. ఆ ఎండలలో ఏమైనా చల్లటి పానీయం త్రాగబుద్ధి కాసాగింది. కాని ఏమీ తినబుద్ధి కాలేదు. పెరుగులో మంచుగడ్డ వేసి చిలికిచేసే లస్సీ అనే పానీయాన్ని త్రాగి విశ్రమించాను. నిద్రకూడా సరిగా పట్టలేదు. నేను పడుకున్న గదిలోని కిటికీగుండా దగ్గరలోని ఒక వేపచెట్టు కొమ్మ కనుపిస్తూంది. వేపాకు చాలా సన్నగా వున్నది. దగ్గరకు లేచి వెళ్ళి ఇంకా చుట్టూ వున్న వేపచెట్లను చూచాను. అన్నిటి ఆకులు అంత సన్నగానే వున్నాయి. ఆంధ్రలోని ప్రజలకూ, ఇక్కడి ప్రజలకూమాత్రమే కాక అక్కడి వేపచెట్లకు ఇక్కడి వేపచెట్లకు కూడా ఇంత భేదం వుంటుంది కాబోలు అని ఆశ్చర్యపోయాను.

# పఠాన్‌కోట ప్రయాణం - ఒక మధురానుభూతి

పంజాబ్‌లో అమృతసర్, లాహోర్ ఈ రెండూ ప్రముఖ నగరాలు. లాహోర్ అప్పటి పంజాబ్‌కు ముఖ్యపట్టణం. అమృతసర్ శిఖ్ఖు మతానికి ముఖ్యస్థానం. సాయంత్రం బయలుదేరి జలియన్‌వాలాబాగ్, స్వర్ణమందిరం చూడబోయాను. జలియన్‌వాలాబాగ్‌లో నిలుచుంటే పూర్వం బ్రిటిష్ ఫిరంగులకు నిష్కారణంగా బలి అయిన ఎందరో నిర్దోషులైన అమరవీరులు తమ అశరీర రూపాలలో నా మానస చక్షువుల ఎదుట ప్రత్యక్షమయ్యారు.

అక్కడ నుంచి సిఖ్ఖుల స్వర్ణమందిరం చూడబోయాను. మందిరపు బంగారు గుంబజాలు, చుట్టూవున్న నిర్మల సరోవరంలో ప్రతిబింబిస్తున్నాయి. అసలు గుంబజాల కంటె ప్రతిబింబాలే ఎక్కువ సుందరంగా గోచరిస్తున్నాయి. స్వర్ణమందిరంలో తెల్లని పెద్ద పెద్ద గడ్డాలతో సిఖ్ఖు మతగురువులు మతగ్రంథాలు పఠిస్తున్నారు; ప్రసాదాలు పంచి పెడుతున్నారు. రంగురంగుల దుస్తులతో స్త్రీలు, పురుషులూ, పిల్లలు స్వేచ్ఛగా ఏవో కీర్తనలు పాడుతూ తిరుగుతున్నారు. ఇటు వంటి స్థలాలలో ఇతర అన్ని తీర్థస్థానాలలో వలెనే అల్లరి, అశాంతి, బాహ్యాడంబరం మొదలయినవి ఎక్కువగా వుండి ప్రశాంత వాతావరణం లోపిస్తుంది.

స్వర్ణమందిరంలో ప్రవేశించబోయే వారంతా తమ చెప్పులను బయటనే వదలి తలమీద ఏదైనా గుడ్డవేసుకొని వెళ్ళాలికాని వట్టితలతో వెళ్ళకూడదు. ఏమీ దగ్గర లేనపుడు కనీసం చేతిగుడ్డనైనా తలమీద వేసుకొని వెళ్ళవచ్చు. స్వర్ణ మందిరానికి సమీపంలో ఎవరూ పొగపీల్చరాదు. శిఖ్ఖులు సారాయి త్రాగడానికి వెనుదీయరుకాని పొగపీల్చడం వారికి విరుద్ధం. కారణం, వారి మత గ్రంథమైన గురుగ్రంథ్ సాహెబ్‌లో పొగపీల్చవద్దని మాత్రం నిషేధమున్నదట కాని సారాయి త్రాగవద్దని వ్రాసి లేదట. కనుక శిఖ్ఖులు స్వేచ్ఛగా మద్యం సేవిస్తారు.

## పఠాన్‌కోట ప్రయాణం

మరునటిదినం ఎనిమిది గంటల ప్రాంతంలో పఠాన్‌కోటకు వెళ్ళే రైలులో నా ప్రయాణం నిశ్చయించుకొన్నాను. అమృతసర్‌లో అటుతిరిగి ఇటుతిరిగి వచ్చి హోటల్‌లో బ్రాండీ రేతాతో పూరీలు తిని, పెరుగులో నిమ్మరసం పిండుకొని తిని, ఆరుబయట పంజాబ్ ఆకాశం క్రింద పడుకొన్నాను. క్రింద పంజాబ్ భూమి,

పైన పంజాబ్ ఆకాశం, వీటి రెంటికి మధ్య పంజాబ్ చెట్లూ; పంజాబ్ పశు పక్షులూ, పంజాబ్ ప్రజలూ. అవును, విశ్వంలోని భూమి అంతా ఒకటే, ఆకాశం అంతా ఒకటే, చెట్టుచేమలన్నీ ఒకటే, ప్రజలంతా ఒకటే. అయినా, భిన్న భిన్న భూములు, భిన్న భిన్న ఆకాశాలు, పశుపక్షులు, భిన్న భిన్న ప్రజలు; విశ్వంలో ఏకత్వం వున్నదనడం సత్యమే, భిన్నత్వం వున్నదనడం సత్యమే. భిన్నత్వంతో ప్రారంభించిన జీవితం ఏకత్వంలో పరిణతి చెందుతుంది. లోకాని కంతటికి ఒకటే భూమి అయినప్పటికీ ఇది పంజాబ్ భూమి; లోకానికంతటికి ఒకటే ఆకాశం అయినప్పటికి ఇది పంజాబ్ ఆకాశం: ఈ సత్యాన్ని కాదనలేం:

ఈ విధంగా ఆలోచిస్తూ ఎప్పుడో కన్ను మూశాను. తెల్లవారి ఎండవచ్చిన తరువాత గాని మెలుకువ రాలేదు. లేవగానే కనుపించే సూర్యుడు పంజాబ్ సూర్యుడు కాబోలు అనుకొని నవ్వుకొన్నాను. తగు సమయంలో సామాను సర్దుకొని స్టేషనుకు వచ్చేశాను. కొంతసేపటికి లాహోర్ నుంచి బండివచ్చి ఆగింది. పఠాన్‌కోటకు రెండవ తరగతి టికెట్టు తీసుకొని బండిలో ప్రవేశించాను. లాహోర్ విశ్వవిద్యాలయపు విద్యార్థులు చాలా మంది అందులో సందడిచేస్తూ కూర్చొని వున్నారు. వీరంతా బటాలా అనే చోట వనభోజనం చేయడానికని బయలుదేరారు. వారిలో లాహోర్ కార్పొరేషన్ డిప్యూటి కమిషనర్ హిమ్మత్‌ఖాన్ అనే ఆయన కూడా వున్నారు. నేను నికొలస్‌రోరిక్ వద్దకు పోతున్నానని తెలుసుకొని చాలా ఆనందించారు. తమతోపాటు బటాలాలో దిగి వన భోజనంలో పాల్గొనమని బల వంతం చేశారు. కాని మధ్యలో ప్రయాణం ఆగితే మళ్ళీ పఠాన్‌కోట చేరుకోడానికి సరైన ఏర్పాటు లేనందువ వారి ప్రేమ పూరితమైన ఆహ్వానాన్ని స్వీకరించలేకపోయాను. ఇందుకు కారణాలు వారికి వప్పచెప్పాను. వారు సానుభూతితో అర్థం చేసుకొన్నారు. అందుకని తాము బటాలాలో తినడానికి తీసుకువెళుతున్న తినుబండారాలను కొన్ని తీసి నన్ను తినమని బ్రతిమాలారు. కొన్ని తిని వారిని సంతృప్తిపరచాను.

లాహోర్ కార్పొరేషన్ డిప్యూటి కమిషనర్ హిమ్మత్ ఖాన్ తన చిరునామా నాకిచ్చి తిరుగు ప్రయాణంలో లాహోర్‌లో తమ ఇంట దిగమని గట్టిగా చెప్పాడు. దూరప్రాంతంలో ఇటువంటి ఆదరణ హృదయానికెంతో హాయి నిస్తుంది. ఇంతలో బటాలా స్టేషన్ వచ్చింది. ఆ క్షణిక మిత్రులంతా ప్రేమతో నావద్ద వీడ్కోలు తీసుకొని వెళ్ళిపోయారు. ఆ క్షణిక అనుబంధమే ఎన్ని

యుగాలుగా పెనవేసుకొన్న అనుబంధమో అనిపించింది. అవును, క్షణిక కాలం అయితే మాత్రం ఏమి? క్షణం గర్భంలోనే యుగ యుగాంతరాలు దాగివున్నాయి. విలియంబ్లేక్ కవిత గుర్తువచ్చింది:

**"To see a world in a grain of sand**
**And a heaven in a wild flower;**
**Hold infinity in the palm of your hand**
**And eternity in an hour."**

ఒక్క ఇసుక రేణువులో విశ్వాన్ని దర్శించాలి
ఒక్క వన్యకుసుమంలో స్వర్గాన్ని చూడాలి;
అనంతత్వాన్ని నీ అరచేతిలో పట్టుకో
ఒక్క గంటలో శాశ్వతలోకాన్ని పొందు.

ఇదంతా అనుకొంటూండగానే బటాలా స్టేషన్‌లో కలేపళ్ళు అమ్మడం చూచాను. కలేపళ్ళు, మీగడా కలిపి ఉప్పుచల్లి అమ్ముతున్నారు. అవి తీసుకొని తింటూంటే పుల్ల పుల్లగా, తీయతీయగా, ఉప్పఉప్పగా బాగున్నాయి. చిన్నప్పుడు నందిగామ తాలూకా నివాసం రోజుల్లో తిన్నామ కలేపళ్ళు అనబడే ఈ అడవి పళ్ళు. మళ్ళీ ఇప్పుడిక్కడ వాటినే మీగడతోనూ, ఉప్పుతోనూ తిన్నాను. కొన్ని రుచులూ, వాసనలూ, స్పర్శలూ మొదలైన సంవేదనలు గతించిన భూతకాలాన్ని మళ్ళీ వర్తమానంలోకి సజీవపరుస్తాయి. బటాలా నుంచి గురుదాస్‌పూర్ మీదుగా మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో పఠాన్‌కోట వచ్చి ఆగిపోయింది మా బండి.

పఠాన్‌కోటలో ఈ బండి ఆగిపోతుంది. ఇక ఇక్కడనుంచి కాంగ్రా వేలీ రైల్వే అనే చిన్నలైను ప్రారంభం. ఈ చిన్నలైను నగ్రోటా అనే చోటుకు వెళ్ళి ఆగిపోతుంది. నేను బండి మారి చిన్నబండిలో వెళ్ళి కూర్చున్నాను. అందులో క్రొత్తగా వివాహం అయిన దంపతులు హనీమూన్‌కు కులూ లోయకు విహారం వెడుతున్నారు. ఆమె పేరు కాత్యాయని, ఆయన పేరు ఆనందకపూర్, ఇద్దరు కూడా చాలా సరసులు. కాత్యాయని ఇంకా ఎక్కువ చురుకైన వ్యక్తి. తాను నవ్వి ఇతరులను నవ్వించడం ఆమెకు గొప్ప సరదా.

పఠాన్‌కోట నుంచి చిన్న బండి బయలుదేరింది. బండి క్రమేణ ముందుకు సాగిపకొద్దీ వాతావరణంలో చల్లదనం తట్టసాగింది. కాంగ్రా వచ్చేసరికి చల్లదనం

మాత్రమే కాక చలికూడా వేయసాగింది గ్రీష్మఋతువులో. కాంగ్రా ఒకప్పుడు చిత్రకళకు ప్రసిద్ధి చెందివుంది. అదే కాంగ్రా చిత్రకళ అని నేటికి వాడుకలో వుంది. కొండలలోగుండా, లోయలలోగుండా, నురుగులు కక్కుతూ ప్రవహించే తెల్లని చల్లని సెలయేళ్ళ మీదుగా మా రైలు పయనిస్తూంది. దూరాన ధవళధార పర్వతమాల తమ హిమ శిఖరాలను మేఘాలతో దాగుడుమూత లాడిస్తూ ప్రకాశిస్తున్నది. నే నిదివరలో కుమావూ ప్రాంతంలో సంచరించింది, తూర్పుకు చెందిన మధ్య హిమాలయాలు. ఇప్పుడు సంచరిస్తూన్నది పశ్చిమ హిమాలయాలలో. అవి యు. పి. సరిహద్దులలోనివి; ఇవి పంజాబ్ సరిహద్దులలోనివి.

రైలు లోపల కాత్యాయని సంభాషణలతో ఆనందం రైలు బయట ధవళ ధార పర్వతమాలమీది ధవళకాంతులను చూస్తూ ఆనందం. మొదటిది మానవానందం. రెండవది ప్రకృతి ఆనందం. మొదటిదానిలో ఉభయులం అంటే నేనూ, నా ఎదటివారూ కూడా పరస్పర సంభాషణలవల్ల ఆనందిస్తారు. రెండవదానిలో నేను ధవళధారను చూచి ఆనందిస్తానేకాని అది నన్నుచూచి ఆనందించదు. అయినా కూడా అందులో అనంతానందం లభించసాగింది.

కాత్యాయనికీ, నాకూ మధ్య ఎన్నెన్నో విషయాలనుగురించి సంభాషణలు. ఆ కొద్దికాలంలో ఆమెతో ఎక్కువ సాన్నిహిత్యం ఏర్పడిపోయింది. మళ్ళీ కొంచెంసేపటికే ఆమె నుంచి నేనూ, నా నుంచి ఆమె విడబడిపోవలసుంటుంది అనే ఆలోచన వచ్చేసరికి ఏదో భరించరాని వేదన కలగసాగింది. ఆమె భర్త ఆనందకపూర్ మా ఉభయుల సంభాషణలు వింటూ నవ్వుతూ కూర్చునేవాడు; ఎప్పుడైనా ఒక్క మాట మాట్లాడేవాడు. ఆయనవంతు వినడం మాత్రమే.

కాత్యాయని ముఖంలో కూడా విషాదచ్ఛాయలను గమనించాను. కలుసుకోవటంలో ఎంతో ఆనందం, విడిపోవటంలో ఎంతో విషాదం. అయితే ఈ సత్యం అన్నిటా వర్తించదు. ఇది ఇష్టమైన వ్యక్తుల విషయంలో మాత్రమే వర్తిస్తుంది. అయిష్టమైన వ్యక్తులు కలుసుకోడంలో బాధపడతారు, విడిపోవటంలో ఆనందిస్తారు. అనిపించింది, కాత్యాయని నాకు అయిష్టమైన వ్యక్తి అయివున్నట్లయితే ఈ బాధంతా లేకపోను. ఎంతో సంతోషంతో విడిపోయేవాణ్ణి. కాత్యాయనినుంచి విడిపోవడంలో వుండే వియోగవ్యథ ఆమెకూ, నాకూ సమాన పరిమాణంలో వుండదు. ఆమె తన ప్రియమైన భర్తతో కలసి నానుంచి విడిపోతుంది; మరి నేను ఒంటరిగా ఆమెనుంచి విడబడిపోతాను. తన భర్త ప్రేమమయ సాన్నిధ్యంలో ఆమె నన్ను త్వరలో మరచిపోగలదు; మరి నేను ఎవరి ప్రేమమయ సాన్ని

ధ్యంలో ఆమెను త్వరలో మరచిపోగలను? ఆ దూరాన కనుపిస్తూన్న ధవళధార పర్వతమాల సాన్నిధ్యంలోనో, లేక దగ్గరలోని నా అంతరాత్మ సాన్నిధ్యంలోనో, ఆమెను మరచిపోవ ప్రయత్నించాలి.

సాయంత్రానికి మా రైలు నగ్రోటా స్టేషన్‌లో వచ్చి ఆగింది. ఇక ఇంత వరకే రైలుమార్గం. ఈ రైలు మళ్ళీ రేపు ఉదయం తిరిగి వెనక్కు వెళ్ళి పోతుంది, పఠాన్‌కోటకు. ఈ నూతన దంపతుల నిమిత్తం పాలన్‌పూర్ నుంచి కారువచ్చి వుంది. నన్నుకూడా ఆ కారులో వారితో రమ్మన్నారు. ఆ హనీమూన్ దంపతుల మధ్య నేను అడ్డంకు కాదలచలేదు. అందుకని ఏవో సాకుచెప్పి నేను రానన్నాను. వారితో వెళ్ళడమూ ఇష్టంలేదు; వారిని వదలడమూ ఇష్టంలేదు. ఇది మరీ బాధ అయింది.

సరే, అనివార్య విషయాలలో ధైర్యాన్ని అవలంబించడం, ఆనందాన్ని సృష్టించుకోడం అభ్యస్తమైనందున మానసాన్ని ఏమాత్రమూ బాధచెందనీయక హృదయాన్ని అవ్యక్తానందంతో నింపుకొని ఆ రాత్రి ఆ రైలులోనే నా బెర్తు మీదనే నిద్రించాను.

# కులూ లోయలో అపర 'ద్రౌపదులు'

ఆ రాత్రి నగ్గోటాలో ఆ సంవత్సరానికి మొదటి తొలకరి వాన పడింది. వర్షం అంత పెద్దది కాదుగాని మేఘాల ప్రదర్శన అధికమైంది. హిమాలయ ప్రకృతి అంతా వణికిపోయేలాగా ఉరుములు, మెరుపులు, గాలి. అసలే చలిగా వుంది. ఇక ఈ తొలకరి వాన పడినందున ఇంకా చలి ఎక్కువ వేయసాగింది.

ఉదయం ఎనిమిది గంటల ప్రాంతంలో ఇక్కడనుంచి కులూకు బస్సు బయలుదేరుతుంది. ఇక్కడికి కులూ నూటముప్పయి మైళ్ళు. నేను క్రితం సాయంత్రమే బస్సులో సీటు రిజర్వు చేయించి వుంచుకొన్నాను. బస్సు బయలు దేరింది. కొండలమీదుగా, లోయలగుండా, రోడ్డుకు అటూ ఇటూ తేయాకుతోటలు, ఇంకా ఇతరవిధాలైన పళ్ళతోటలు వున్నాయి. కొంతదూరంలో, కొంత దగ్గరగా ధవళధార పర్వతమాల తెల్లని మంచుతో కనుపిస్తూనే వున్నది. ఆ పర్వతమాలను చూచినప్పుడల్లా కాత్యాయని గుర్తుకు రాసాగేది. కాత్యాయనిని, పర్వతమాలను కలిపి చూస్తూ వచ్చాను నిన్న రైలులో. అందువల్ల ఒకటి చూస్తూ మరొకటి జ్ఞాపకం వస్తుంది. పర్వతమాల నా కళ్ళ ఎదుట ఇప్పుడున్నది. కాత్యాయని లేదు. అందువల్ల వున్న వస్తువును చూస్తే లేని వ్యక్తి గుర్తుకొస్తారు. అదేవిధంగా ఈ పర్వతమాల లేని చోట కాత్యాయని కనుపిస్తే పర్వతమాల గుర్తుకువస్తుంది.

బస్సు పాలన్‌పూర్ వచ్చి ఆగింది. ఈ ప్రాంతంలో పాలన్‌పూర్ మంచి వ్యాపారకేంద్రం. ఇక్కడికి ధవళధార్ పర్వతమాల చాలా దగ్గరగా గోచరిస్తుంది. బస్సు ఇక్కడనుంచి బయలుదేరి జోగేంద్రనగర్ వచ్చి ఆగింది. ఇక్కడ వంతెన మరమ్మతుల మూలంగా బస్సు కొంచెం ఆలస్యంగా ఆగవలసి వచ్చింది. నేను బస్సు దిగి ఆ ప్రాంతాల విశేషాలను పరిశీలించసాగాను. ప్రకృతి అంతా కూడా సుందరంగా ఒక చిత్రంగా గోచరిస్తుంది.

## మండీ చేరిక

జోగేంద్రనగర్ నుంచి మండీ చేరుకొనేవరకు మధ్యాహ్నం అయింది. కొండలలో బస్సు ప్రయాణంలో కడుపులో వికారం జనిస్తుంది. కొందరికి వాంతులుకూడా అవుతాయి. నాకు కూడా బాగా వికారం ఏర్పడి కళ్ళు మూసుకొని పడుకోబుద్ధి కాజొచ్చింది. మండీలో బస్సు చాలాసేపు ఆగుతుంది. భోజనాలు చేసేవారంతా ఇక్కడ భోజనాలు ముగించుకొంటారు. భోజనం చేస్తే వాంతులు

అవుతాయని కొందరు ప్రయాణీకులు భోజనాలు చేయరు. నేనుకూడా భోజనం మానుకొని నిమ్మకాయ షర్బత్ త్రాగి పూరుకొన్నాను. నిమ్మరసం తగిలేసరికి వికారం కొంత ఉపశమించింది.

మండీ సంస్థానాన్ని ప్రస్తుతం రాణీ పరిపాలిస్తున్నది. పంజాబ్ హిమాలయాలలో ఇదొక ప్రముఖమయిన సంస్థానం. ఇక్కడికి చాలా క్రిందుగా వ్యాస నది ప్రవహిస్తూంటుంది. ఇంకా ఎత్తుగా రాజప్రాసాదాలున్నాయి. ఈ రాజ పరివారంలోని వారంతా ఎక్కువభాగం విదేశాలలోనే భోగజీవితం గడుపుతుంటారు. ఇక్కడి ప్రజల దగ్గర డబ్బును పన్నులరూపంలో దోచుకొని వీరంతా యూరప్‌లో తందనాలాడుతుంటారు; ఇక్కడ ప్రజలకు అన్నంలేక ఉపవాసాలు చేస్తుంటారు. బట్టలేక చలికి వణికిపోతుంటారు. ప్రస్తుతం పరిపాలన చేస్తూన్న రాణీని గురించి కూడా ఇక్కడంతగా మంచిపేరు లేదు. ప్రజలలో క్రమేణ ఈ పర్వతభూములలో కూడా రాజకీయ చైతన్యం వికసించ ప్రారంభించింది. పరిపాలకుల పట్ల ప్రజలలో ద్వేషం వ్యక్తం కాజొచ్చింది. ఇక్కడి రాజకుటుంబాన్ని గురించి ఏవో రకరకాల గాథలు ప్రచరితమై వున్నాయి ఇక్కడ.

బస్సు మండీనుంచి బయలుదేరుతుండగా కర్తార్‌సింగ్ అనే సిక్కు యువకుడు ఎక్కి వచ్చి నా దగ్గర కూర్చున్నాడు. మాటలలో తెలిసింది ఆయన పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ అని ఆయన చాలా స్నేహశీలి. మృదుమధుర స్వభావం కలవాడు. తానుకూడ కులూ వస్తున్నట్టు, తన అత్తవారి ఊరు కులూకు రెండుమైళ్ళు మాత్రమే వున్నదని చెప్పి నాకు కులూలో మంచివసతి ఏర్పాట్లు చేయిస్తానని అన్నాడు. కులూలోని డాక్ బంగళాలో ఎప్పుడూకూడా ఖాళీ వుండదు కనుక సిక్కుల గురుద్వారాలో నాకు బస ఏర్పాటు అవుతుందన్నారు.

ఎన్నో కొండల వంపులు తిరుగుతూ, దిగుతూ, ఎక్కుతూ మా బస్సు కులూ చేరుకొంది చీకటిపడకముందే. కర్తార్‌సింగ్ నన్ను తీసుకువెళ్ళి వ్యాసనది ఒడ్డున వున్న శిఖుల గురుద్వారాలో దింపాడు. ఈ భవనం చాలా విశాలంగా పరిశుభ్రంగా వుంది. అక్కడ దాని మేనేజరుగ వుంటున్న సర్దార్ అజయసింగ్ ఎంతో మర్యాదచేసి నాకు కావలసిన సహాయాలన్నీ చేశాడు. ఇంకా నాకు కడుపులో వికారంగా వున్నందువల్ల పచ్చి ఆల్బుకరాకాయ తినమని ఇచ్చాడు. దాని పులుపురసం తగిలేసరికి వికారం తగ్గిపోయింది. నూటముప్పయి మైళ్ళు కొండలలో బస్సుమీద ప్రయాణం చేసిన బడలికవల్ల ఆ రాత్రి నాకేమీ తినబుద్ధి కాలేదు.

ఒకటి రెండు యాప్రికట్ పండ్లను తిన్నాను. ఈ యాప్రికట్ పండ్లను ఇక్కడ ఖుర్మానీ పండు అంటారు. వీటిని తెలుగులో జలదార్ పండ్లు అంటారను కొంటాను.

నేను వున్న భవనానికి అతిసమీపంలో ఒక జలపాతం వున్నది. ఎత్తుమీద నుంచి నీరు ధారగా క్రింద పడుతూంటుంది. అది పెద్ద శబ్దం చేస్తూవుంటుంది. ఆ ధ్వని నేను పడుకొన్న తావుకు బాగా వినపడుతూంటుంది. మొదటిలో ఆ ధ్వని కొంచెం కటువుగా వినిపించిందికాని చెవి దానికి అభ్యస్తమైన తరువాత ఆ జల పాతపు ధ్వని మధురంగా వినిపించసాగింది. ఆ రాత్రి నాకు నిద్ర మెలకువ వచ్చి నప్పుడల్లా ఆ ధ్వనిని వినబుద్ధి అయేది. అందులో ఏదో ఆకర్షణాత్మక సంగీతం వినిపించేది. ఆ రాత్రి కొన్నిసార్లు మెలకువ వచ్చినాకూడా బాగానే నిద్రపట్టింది. చలిమాత్రం విపరీతంగా వేసింది.

బాగా ఎండెక్కిన తరువాత లేచి అల్పాహారం ముగించుకొని కులూ బస్తీ లోకి బయలుదేరాను. మధ్యలో పోస్టుఆఫీసు కనిపించింది. లోపలికి వెళ్ళి నికోలస్ రోరిక్‌కు ఒక టెలిగ్రాం పంపాను – నేను కులూ వచ్చినట్టు, రేపు బయలుదేరి బస్సులో కత్రాయిలో దిగుతానని. కత్రాయికీ రోరిక్‌ల నివాసానికీ కొండమీదుగా మూడు మైళ్ళుంటుంది.

కులూ బస్తీ రెండు భాగాలుగా వుంటుంది. కొండమీది భాగం, కొండ క్రింది భాగం. కొండమీది భాగాన్ని సుల్తాన్‌పూర్ అని కొండ క్రింది భాగాన్ని ధాల్‌పూర్ అని అంటారు. బస్తీ బయట దేవదారు వృక్షాలతో నిండిన విశాలమైన, అంద మైన పచ్చిక మైదానం వుంది. ఈ పచ్చికమైదానంలో దేవదారు వృక్షాల క్రింద వేసవిలో వచ్చే పర్యటకులు డేరాలు నిర్మించుకొని వుంటారు. కులూలో నేనున్న భవనం ముందుగా వ్యాసనది ఒడ్డున పోయిన రోడ్డు మనాలీ మీదుగా, రొతాంగ్ పాస్ మీదుగా, లాహుల్ మీదుగా లదాక్‌ను దాటి మధ్య ఆసియాకు పోతుంది. ఇది మధ్య ఆసియాకు, భారతదేశానికి మధ్య వ్యాపారమార్గం.

కులూ లోయలో అనేక గ్రామాలు, దేవళాలు వున్నాయి. యాపిల్ పండ్లకు కులూ లోయ ప్రసిద్ధి. ఇక్కడ దసరా రోజులలో గొప్ప గొప్ప ఉత్సవాలు జరుగు తాయి. ఇక్కడి ప్రజలంతా హిందూవులే అయినప్పటికీ వీరి ఆచార వ్యవహారాలు వేరు. స్త్రీలు, పురుషులు కూడా ఉన్ని బట్టలనే ధరిస్తారు. వివాహమైన స్త్రీలకు తలకు ఒక ఎర్ర గుడ్డను కాని, నల్ల గుడ్డను గాని కడతారు. వీరిలో సిగరెటు

కాలుస్తున్న వనితలు ఇద్దరు, ముగ్గురు కనిపించారు కులూ బజార్లలో. ఇక్కడి స్త్రీల గొంతు చాలా మృదు మధురంగ వినిపిస్తుంది. చాలా సన్నని నాదం వీరిది. కులసీ భాషలో స్త్రీలు మాట్లాడుకుంటూ వుంటే ఫిడేలు తీగలు మ్రోగుతున్నట్లే వుంటుంది. ఇక్కడి ప్రజలు స్థానికమైన కులసీ భాషను మాత్రమేకాక, పంజాబీని, హిందీ, ఉర్దూలను అర్థం చేసుకుంటారు.

కులూలోయ మొదలు లదాక్ వరకు స్త్రీలు ఎన్నిసార్లు అయినా వివాహం చేసుకొంటారు. పురుషుల వలెనే, ఒక భర్త మరణిస్తే రెండవ భర్తను, రెండవ భర్త మరణిస్తే మూడవ భర్తనూ, ఈ విధంగా విధవా వివాహాలు ఎన్ని సార్లు అయినా చేసుకొంటారు. భర్త మరణించక పోయినా కూడా చేసుకొనే స్త్రీలుకూడా వున్నారు. ఇంకా కొన్ని చోట్ల అన్నదమ్ములందరికీ ఒకే భార్యవుండే ఆచారం కూడా వుంది. పెద్దవాడు మాత్రమే వివాహం చేసుకొంటే అతని తమ్ములకు కూడా ఆమెయే భార్య అవుతుంది, పాండవులకు ద్రౌపదివలె! ఈ సాంఘికాచారం మూలంగా కుటుంబాల సంఖ్య పెరగకుండా కుటుంబ నియంత్రణ ఏర్పడుతుంది. ఒక భార్యకు ఒక భర్త వుంటే ఎందరు సంతానం కలుగుతారో ఎక్కువ మంది భర్తలున్నా కూడా అందరు సంతానమే కలుగుతారు. ఇందుకు విరుద్ధంగా ఒక భర్తకు ఒక భార్యవుంటే కలిగే సంతానం సంఖ్య కంటె ఎక్కువ మంది భార్య లుంటే కలిగే సంతానం సంఖ్య ఎక్కువది. భర్తల సంఖ్య ఎక్కువైనందున సంతానం సంఖ్య హెచ్చదు, భార్యల సంఖ్య ఎక్కువైతే హెచ్చుతుంది. టిబెట్టు లోను, లదాక్‌లోను కుటుంబాలన్నింటిలో వదినయే తమ్ముళ్ళకు కూడా భార్యగా వుండే ఆచారం వుంది. ఇక కులూ ప్రాంతంలోను, జాన్‌సార్ ప్రాంతంలోను కొన్ని చోట్లకూడా ఈ ఆచారం చెదురు మదురుగా వున్నది.

ఆ సాయంత్రం నేను వ్యాసనదికి ఎదురుగా నేనున్న భవనం వరండాలో కూర్చుని వున్నాను. ఒక టిబెట్ల తండా వీపున మూట బరువుతో వచ్చి వ్యాసనది ఒడ్డున ఆ వీపులమీద మూటలను దించకుండానే వాటికి చేరగిలబడి కూర్చున్నారు. నేను వారి దగ్గరకు వెడితే తెలిసింది, వారు టిబెటన్లు కారు, స్పితీ నివాసులని. స్పితీ ప్రదేశం చంబా ప్రాంతానికి ఆవలగా వుంది, టిబెటన్లు రంగు రూపాలకు స్పితీవాసుల రంగు రూపాల భేదం గుర్తించజాలం. వివిధాలైన వ్యాపార సరుకులను తమ ప్రాంతం నుంచి తెచ్చి ఇచ్చట జరిగే కులూ సంతలో అమ్ముకొని ఇక్కడనుంచి తిను పదార్థాలు తమ ప్రాంతానికి తీసుకుపోతారు.

కొంతసేపు ఆ స్పితీ ప్రాంతీయులతో గడపి అక్కడినుంచి వ్యాసనది తీరానే ఉత్తరంగా చాలా దూరంవరకు నడక సాగించాను. ఇంకా ప్రొద్దు చాలా వున్నందువల్ల వ్యాసనదీ తీరాన ఎక్కువ సమయం గడిపాను. వ్యాసనదిలో నీరు బురదలుగా వున్నది. పై ప్రదేశాలలో తొలకరి వానలు పడినందువనవి చిన్నవే కాని వేగం మాత్రం తీవ్రంగా వుంది. దూరాన కొండల వరసలు. దగ్గరలో పచ్చిక బియళ్ళు, ఆ పచ్చికలోని పచ్చదనం చూస్తూంటే విశ్వసృష్టిలోని జీవం అంతా నగ్న రూపంలో ఇక్కడ నర్తిస్తుందా అనిపించింది. పచ్చికలోని ఆకు పచ్చలో ఎన్నో విధాల కాంతులు, పచ్చిక పశువులకు మాత్రమే ఇష్టం కాదు. మానవులకు కూడా ఎంతో యిష్టం అనే సత్యాన్ని తెలుసుకొన్నాను.

కాంగ్రా, కులూ ప్రాంతాలలోని గొర్రెల కాపరులు చాలా వింత మనుషులు. వీళ్ళను గద్దిలు అని అంటారు. నేను కూర్చునివున్న వ్యాసనదికి సమీపంలో వీరు గొర్రెలను మేపుతున్నారు. నేను లేచి వాళ్ళ దగ్గరకు వెళ్ళి నిల్చున్నాను. వీళ్ళు మహా సాహస జీవులు. శ్రమజీవులు. రాత్రులు కూడా. ఆరుబయట హిమాల యాల చలిలో వీరు నిద్రిస్తారు. ఉత్తరంగా సుదూరపు రోతాంగ్‌పాస్ మొదలు దక్షిణంగా పఠాన్‌కోట వరకు వీళ్ళు ఋతుభేదాల ననుసరించి తమ గొర్రెలను మేపుకొంటూ ఎండనక, వాననక, చలి అనక, రాత్రి అనక, పగలు అనక తిరుగు తూనే వుంటారు. నాగరిక ప్రపంచానికి వీళ్ళను గురించి తెలియనట్టే వీళ్ళకుకూడా నాగరిక ప్రపంచాన్ని గురించి తెలియదు.

# నికోలస్ రోరిక్ - మరికొన్ని మధుర స్మృతులు

క్రొలూ నుంచి మూడవ రోజు ఉదయం బస్సులో బయలుదేరి వ్యాసనది ననుసరించి పన్నెండు మైళ్ళు పయనించి కుట్రాయీ అనే తావన దిగాను. అక్కడ రోరిక్ పంపిన మనిషి గుర్రంతో తయారుగా వున్నాడు. నా దాక్షిణాత్య ముఖాన్ని అతడు వెంటనే గుర్తించి నా దగ్గరకు వచ్చి స్వాగతం చెప్పాడు. అక్కడ వ్యాసనది మీద వంతెన దాటి పయనం సాగించాం. కొండ ఎక్కసాగాం. దూరంగా కొండమీద ఎర్రని ఇళ్ళు కనిపిస్తున్నాయి. అవే రోరిక్కుల నివాసాలని ఆ మనిషి చెప్పాడు. రకరకాల అడవి చెట్లలోగుండా మేము సాగిపోతున్నాం. చలిలో ఎండలోగుండా, చెట్ల నీడలగుండా పయనించడం చిత్రంగానే వుంది.

కొంతసేపటికి నగర్ అనే గ్రామం వచ్చింది. ఆ గ్రామంలోని త్రిపుర సుందరీ దేవాలయం చాలా సుందరంగా వుంది. కొంతసేపు అక్కడ ఆగి ఆలయపు వాస్తుశిల్పాన్ని పరిశీలించి మళ్ళీ ముందుకు పయనించాం. త్వరలోనే రోరిక్ నిలయం చేరుకొన్నాం. పూల తోటలతో, పండ్లతోటలతో, సెలయేరులతో రోరిక్ నిలయం కనులపండువుగా వుంది. ఇక్కడనుంచి చూస్తే సుదూరమైన లోయ కనిపిస్తుంది, ఒక వైపు; మరొక వైపు ఎత్తయిన దేవదారు వృక్షాలతో శోభిల్లుతున్న వాటికంటె ఎత్తయిన కొండ.

రోరిక్‌ల నివాసాలకు ఇంకా కొంత ఎత్తుగావున్న హిమాలయన్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్‌లో నా నివాసం ఏర్పాటు చేశారు. నేను వుంటున్నదాని ప్రక్కనే రోరిక్కుల కుటుంబ వైద్యుడు డాక్టర్ యలవెంకో వుంటున్నాడు. ఆయన నన్ను ముందుగా ఆహ్వానించి కుశల ప్రశ్నలు వేశారు. ఆయన చాలా సంవత్సరాల క్రితమే రష్యా వదలి ఇరవై సంవత్సరాలపాటు తుర్కిస్తాన్‌లో నివసించి, కొంత కాలంనుంచి రోరిక్కులకు కుటుంబ వైద్యుడుగా వుంటున్నాడు. డాక్టర్ యలవెంకో చాలా బలిష్ఠుడు, ఉల్లాసవంతుడు, ఉత్సాహవంతుడు. రోరిక్కుల కుటుంబ వైద్యుడని పేరేకాని ఈ ప్రాంతాలనుంచి వచ్చే రోగులందరికి ఉచిత వైద్యుడే ఆయన.

## చెర్రీ పండ్ల ఫలహారం

అది యాపిలు పండ్ల కాలం కాదు. చెర్రీ పండ్ల కాలం. ఒక పెద్ద ప్లేటు నిండా నల్లగా పండిన చెర్రీ పండ్లను తెచ్చిపెట్టారు. ప్రయాణాలతో అలసి సొలసి ఆకలితో వున్న ప్రాణానికి ఆ చెర్రీ పండ్లు అమృతంవలె వున్నాయి. నా స్నానా

ముఖ ముగించుకొని, లాగు తొడుక్కోకుండా ధోవతి కట్టుకొని లాల్చీపైన ఒక నీలపు ఖద్దరు శాలువా కప్పుకొని డాక్టర్ యలమెంకోతో కలసి రోరిక్‌ల నివాసానికి వెళ్ళాము. నా వద్ద మరొక క్రొత్త ఖద్దరు శాలువా నారింజ రంగుది నికోలస్ రోరిక్‌కు కప్పి హోల్డార్‌గారు ఇచ్చిన బుద్ధుని తలను ఆయనకు సమర్పించాను. ఆయన ఇంతకాలానికి ప్రథమంగా నన్ను చూచినందుకు అమితంగా ఆనందించారు. తెల్లని గడ్డమూ, మధ్యరకం ఎత్తులో బలిష్ఠమైన శరీరమూ, మంగోలియన్ కన్నులూ ఎంతో ఆకర్షణీయంగా వున్నాయి. నాతో వారందరికి ప్రథమ సమావేశం రాజకీయంగా జరిగింది. ప్రథమంగా నికోలస్ రోరిక్ వచ్చి కలుసుకొని నన్ను పరామర్శించిన తరువాత ఆయన భార్య మదాం హెలీన రోరిక్ వచ్చారు. ఆమె పల్చగా, విడివిగా వుంటుంది. ఆమె నన్ను పరామర్శచేయడం ఆయన తరువాత వారి పెద్ద కుమారుడు డాక్టర్ జార్జి రోరిక్, ఆయన తరువాత రెండవ కుమారుడు స్వెతోస్లవ్ రోరిక్ వచ్చారు. డాక్టర్ జార్జి రోరిక్‌కు ఫ్రెంచ్ గడ్డం వుంది. స్వెతోస్లవ్‌కు నిండు గడ్డం వుంది. జార్జి తన తండ్రివలె దృఢమైన వ్యక్తి. స్వెతోస్లవ్ తన తల్లివలె పొడవైన వ్యక్తి. వారందరితోనూ ఆ పూట భోజనం ముగించుకొన్నాను. డాక్టర్ జార్జి, డాక్టర్ యలమెంకో తప్ప తక్కినవారంతా శాకాహారులే. ఇక్కడ మామూలు యూరపియన్ భోజనం చేస్తారు వీరంతా. ఇటి వ్యవహారాలన్నీ చూడడానికి వీరింట ఇద్దరు రష్యన్ నర్సులున్నారు. చాలామంది పరిచారకులున్నారు. హిందువులు, ముస్లింలు కూడ.

## రోరిక్ పుట్టు పూర్వోత్తరాలు

నికోలస్ రోరిక్ 1874వ సంవత్సరంలో రష్యాలోని సెంట్ పీటర్సుబర్గులో జన్మించారు. అప్పటి సెంట్ పీటర్సుబర్గు అంటే ఇప్పటి లెనిన్‌గ్రాడ్. వీరి పూర్వులు స్కాండినేవియాలో, వైకింగులు అనబడే ప్రసిద్ధ పురుషులు. స్కాండినేవియానుంచి రష్యాకు వలస వచ్చారు. నికొలస్ రోరిక్ చిత్రకళాభ్యాసం రష్యాలోను, ఫ్రాన్సులోను జరిగింది. అతి బాల్యంలోనే కళలలో అభిరుచి కనపరచ సాగారు. 1917 లో రష్యాలోని విప్లవం నాటికే రోరిక్ కుటుంబం రష్యా వదలి ఫిన్లండ్‌లో ప్రవేశించారు. అటు తరువాత కొంతకాలం లండన్‌లోను, అమెరికాలోను గడిపారు. న్యూయార్కులో ఇరవై నాలుగు అంతస్తుల మ్యూజియం నిర్మించి రోరిక్‌కు సమర్పించారు.

అమెరికన్ సహాయంతో 1924 లో నికొలస్ రోరిక్ కొందరు నిపుణులను వెంట పెట్టుకొని మధ్య ఆసియాలో పురాతత్వ అన్వేషణకు బయలుదేరారు. ఆ

అన్వేషణలో పర్యటిస్తూ టిబెట్టుమీదుగా కాశ్మీరు, కాశ్మీరు నుంచి కులూలోయకూ వచ్చారు. 1920 లో ఇక్కడే స్థిరపడిపోవాలనే సంకల్పం ఏర్పడింది ఆయనకు.

నికోలస్ రోరిక్ ప్రధానంగా టెంపరా విధానంలో ప్రకృతి దృశ్యాలను, అందులోను ప్రత్యేకించి హిమాలయ దృశ్యాలను చిత్రిస్తారు. ఆయన రెండవ కొడుకుకూడా చిత్రకారుడే. కాని ఆయన ప్రధానంగా మనుషుల రూపపటాలను చిత్రిస్తాడు. తన తండ్రిగారి రూపపటాలనెన్నో విధాలుగా చిత్రించాడు. కొన్ని విధాలయిన దృశ్యాలను కూడా చిత్రించాడు.

డాక్టర్ జార్జి రోరిక్ ప్రతిభగల పండితుడు. ప్రత్యేకించి మంగోలియన్ భాషలలో ఆయన చాలా దిట్ట. టిబెటన్ భాషలో ప్రత్యేక కృషి సలిపాడు. చాలా గ్రంథాలను కూడా రచించాడు. రోరిక్ సతీమణి మదాం హెలీనా గొప్ప సంగీత వేత్త. మదాం బ్లావట్ స్కీ ఇంగ్లీషులో రచించిన **"Secret - Doctrine"** అనే బృహత్తర గ్రంథాన్ని మదాం హెలీనా రష్యన్‌లోకి అనువదించింది.

నికోలస్ రోరిక్ చిత్రాలు అద్భుతమైన వెలుగులతో ప్రకాశిస్తుంటాయి. హిమాలయ ప్రకృతిలోని కాంతులన్నీ ఆయన చిత్రాలలో ప్రతిబింబిస్తుంటాయి. ప్రకృతిలోని రంగుల సంగీతమంతా రోరిక్ చిత్రాలలో ప్రతిధ్వనిస్తుంటుంది. ఒక్క హిమాలయాలనే విషయ వస్తువుగా తీసుకొని పది వందల చిత్రాల వరకు చిత్రించారు ఆయన. మొత్తం అయిదు వేల చిత్రాలు చిత్రించివుంటారు ఆయన అని అంచనా. తన మధ్య ఆసియా అన్వేషణల గురించి, ఇంకా ఇతర సాంస్కృతిక విషయాలను గురించి ఆయన కొన్ని గ్రంథాలను కూడా రచించారు.

నికొలస్ రోరిక్ చేసిన ఒక గొప్ప కార్యం ఏమంటే యుద్ధ సమయాలలో సాంస్కృతి కేంద్రాలను ఉభయ పక్షాలు ధ్వంసం చేయకుండా వుండేట్టు శాంతి పతాక నొకదాన్ని స్థాపించాడు. **Roerich Pact and Banner of Peace** అనే పేరుతో ఇది లోకప్రసిద్ధి చెందింది. ఈ సంస్థకు భారతదేశంలో ముగ్గురు కార్యదర్శులు. ఆ ముగ్గురులో సంజీవదేవ్ ఒక కార్యదర్శి.

నిత్యమూ నేను దేవదారు అరణ్యంలోకి నడకకు వెళ్ళి వస్తూండేవాడిని. ఒక్కొక్కసారి డాక్టర్ యలవెంకోతో కలసి చాలా దూరం వరకు పోతూండే వాడిని. చలి వాతావరణంలో నడక సాగిస్తూంటే ఆనందంగా వుంటుంది.

మేమంతా చెర్రీ పండ్లను ముంచుంచుకొని తింటూ లోకానికి సంబంధించి నవీ, లోకోత్తర సంబంధమైనవీ అనేకం నిత్యమూ ముచ్చటించుకొంటూండేవాళ్ళం.

నా రాకకు ముందు జవహర్‌లాల్ నెహ్రూ ఆయన కూతురు ఇందిర వచ్చి ఇక్కడ రోరిక్కులతో పదిరోజులు గడిపి వెళ్ళారట. అప్పటి వైస్రాయి వేవెల్‌తో భారత జాతీయ నాయకులకు జరిగిన ఒడంబడిక ప్రకారం నెహ్రూ కూడా జైలునుంచి విడుదల అయినాడు. నెహ్రూ ఎప్పుడూ ఎక్కువగా చదువుతూ ఇక్కడ కాలం గడిపినాడట. తన జైలు అనుభవాల వింతలను చెప్పి వీరందరిని నవ్వించేవాడట నెహ్రూ.

కులూ లోయలో రోరిక్కుల నివాసంలో నా రోజులు ఆనందంగా గడచి పోతున్నాయి. నా ప్రయాణం, ఇక్కడ రోరిక్కుల విశేషాలు, వీరితో గడుపు తున్న నా జీవితయాత్ర మొదలైన వాటన్నింటిని గురించి ప్రతి ఆదివారం వ్యాసాలు వ్రాసి అప్పటి "ఆంధ్రప్రభ" ఎడిటర్ అయిన నార్ల వెంకటేశ్వరరావుగారికి పంపసాగాను. వారు నా వ్యాసాలకు సుందరమైన శీర్షికలు ఏర్పరచి ప్రతి ఆది వారం "ఆంధ్రప్రభ" లో ప్రచురించసాగారు. ఆ పత్రికలోనే మరొక పుటలో గోపీచంద్‌గారి నవల "అసమర్థుని జీవయాత్ర" కూడా వెలువడుతుండేది. తెలుగులో పత్రికలలో వ్యాసాలు ప్రచురించడం అంతగా అభ్యాసం లేకపోయినా, అప్పటి నా తెలుగు మొత్తంమీద నా భావాలను మరుగు పరచేదిగాగాక వ్యక్తపరచేది గానే వున్నదని తెలుసుకో గలిగాను.

అప్పుడే నికోలస్ రోరిక్‌ను గురించి రెండు ఇంగ్లీషు వ్యాసాలు రచించి అలహాబాద్ నుంచి కుంమారు ఈశ్వరదత్తుగారు నడుపుతున్న **"Twentieth Century"** లోను. పాట్నానుంచి డాక్టర్ సచ్చిదానంద సిన్హా నడుపుతున్న **"The Hindusthan Review"** లోను ప్రకటించాను. **"With Roerichs in the Himalayas"** అనే ఇందులోని నా వ్యాసం చదివి అమెరికానుంచి శ్రీమతి పీనాఫాప్‌డిక్ అనే ఆమె ఒక పెద్ద ఉత్తరం వ్రాసింది. అప్పటి నుంచి కొంతకాలం ఆమెతో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి.

ఒక సాయంత్రం నికోలస్ రోరిక్ నన్ను ఒంటరిగా దగ్గరకు పిలచి రహస్యంగా చెప్పారు, స్వెతోస్లేవ్‌కు, దేవికారాణీకి వివాహసంబంధం స్థిరపడిందని. తాము పూర్వం లండన్‌లో వుంటూండగా రవీంద్రనాథ్ టాగూర్‌తో పరిచయం ఏర్పడినప్పుడు దేవికారాణీకూడా పరిచితురాలు అయిందట. దేవికారాణి రవీంద్రుని మేనకోడలు కూతురు. ఆ వార్త విని ఇండో-రష్యన్ సంబంధం ఈ విధంగాకూడ దృఢపడబోతున్నందుకు నేను ఆనందాన్ని వ్యక్తపరచాను.

ఒకరోజు ఉదయం తాను కొత్తగా చిత్రించిన "గంగానదిమూలం" అనే చిత్రాన్ని నాకు చూపించారు. దానిలోని పైభాగపు కుడివైపున వున్న నీలికాంతులు నన్ను తన్మయపరచినాయి. నా ఆనందాన్ని గమనించి రోరిక్ **"This Picture awaits your wedding"** అన్నారు. ఈ బొమ్మ నా వివాహాన్ని నిరీక్షిస్తూందట. అంటే నేను వివాహం చేసుకుంటే ఈ సుందరమైన చిత్రాన్ని రోరిక్ నాకు బహూకరిస్తారని. అయితే నేను వివాహం చేసుకోడం మానేస్తే ఈ చిత్రం నాకు లభించదన్నమాట! ఈ చిత్రాన్ని చేపట్టే నిమిత్తమైనా నే నొక వధువును చేపట్టా లన్నమాట!! ఒక ఇష్టమైన వస్తువును సంపాదించడానికై మరొక ఇష్టంలేని కార్యం చేయాలన్నమాట!!! ఈ విషయాన్ని తరువాత ఆలోచించడానికి వాయిదా వేశాను.

# కులూ లోయ ప్రకృతి సౌందర్య శోభ

ఆ రోజు ఉత్తరంగా రొహ్‌టాంగ్ కనుమలవైపునుంచి బ్రిటిష్ ఇండియా విదేశాంగ కార్యదర్శి తిరిగి ఢిల్లీ వెడుతూ మార్గమధ్యంలో రోరిక్‌ల నిలయానికి వచ్చి చూచి వెళ్ళేరోజు. ఉదయం పదిగంటల ప్రాంతంలో రెండు గుర్రాలమీద విదేశాంగ కార్యదర్శి, ఆయన భార్యా, మరొక గుర్రంమీద కార్యదర్శిగారి కార్యదర్శి మొదలైన వారంతా వచ్చి నేనుంటున్న హిమాలయన్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ లోనే అవతలి హాలులో దిగారు. డాక్టర్ యలావెంకో నన్ను ఆ దంపతులకు పరిచయం చేశాడు. కాని ఆ రోజులు బ్రిటిష్‌వారిని భారతీయులు అనుమానదృష్టితోను, భారతీయులను బ్రిటిషువారు అనుమానదృష్టితోను చూచే రోజులు. మా ఉభయుల మధ్య అందుచేత అనుకూల వాతావరణం ఏర్పడలేదు. అయినా, నేను వారివెంట తిరగక తప్పిందికాదు.

అందరం కలిసి భోజనం ముగించుకొన్న తరువాత వారికి హిమాలయన్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్‌కు సంబంధించిన ప్రదర్శనశాలను చూపడానికి వారివెంట డాక్టర్ జార్జి రోరిక్‌తో నేనుకూడా వెళ్ళాను. యుద్ధానికి పూర్వం ఈ ఇన్‌స్టిట్యూట్‌లో ఇతర దేశాలనుంచి వచ్చిన వైజ్ఞానికులు హిమాలయాలకు సంబంధించిన జంతువులను గురించి, పక్షులను గురించి, మొక్కలను గురించి, ఖనిజాల గురించి, వాతావరణాన్ని గురించి, ఇంకా హిమాలయ సంబంధమయిన ఇతర విషయాలను గురించి పరిశోధనలు చేసేవారు. దీని తరఫున ఒక మంచి పత్రికను కూడా నడుపుతుండేవారు. ద్వితీయ మహా సంగ్రామం ప్రారంభంతో ఈ కార్యక్రమం అంతా ఆగిపోయి ఎవరిదేశాలకు వారు వెళ్ళిపోయారు. ఈ ప్రదర్శనశాలలో హిమాలయాలలోని వివిధాలైన అనేక సంగ్రహాలున్నాయి. హిమాలయాలలోని బృహదాకారంలోని గ్రద్దలూ, పాములూ, రకరకాల తేళ్ళూ కూడా వున్నాయి. సజీవంగా కాదు శవరూపాలలో.

విదేశాంగ కార్యదర్శి, ఆయన భార్య వీటన్నిటిని చూచి చాలా ఆనందించి వీటి సంబంధమైన అనేక ప్రశ్నలువేసి జార్జి రోరిక్‌ద్వారా వాటికి సమాధానాలు అందుకొని సంతృప్తి చెందారు. తాము రొహ్‌టాంగ్ కనుమల ప్రాంతంలో చూచిన విశేషాలను వర్ణించి చెప్పసాగారు. రోరిక్ చిత్రాలుకూడా వారికి ప్రదర్శించి చూపబడినాయి. తరువాత సాయంత్రం వారంతా బయలుదేరి రాత్రి మకాంకు కులూ వెళ్ళిపోయారు. పోతూ పోతూ ఆ విదేశాంగ కార్యదర్శి నా దగ్గరకూడా వీడ్కోలు తీసుకొంటూ ఢిల్లీ వచ్చినప్పుడు తప్పక తనను కలుసుకోమని చెప్పివెళ్ళాడు.

వర్షాలులేవు. నేను ఈ ప్రాంతంలో ఇంకొంచెం దూరం, అంటే ఇక్కడికి ముప్పయి మైళ్ళ దూరంలో వున్న రొౌతాంగ్ కనుమల వరకు ప్రయాణించేసి రావాలని కుతూహలపడసాగాను. నా అభిలాష నికోలస్ రోరిక్‌కు తెలిపితే అందుకు తగిన ఏర్పాట్లు చేయించమని ఆయన తన కారదర్శికి పురమాయించారు. ఇక్కడనుంచి అంటే ఇక్కడికి మూడుమైళ్ళలో వున్న కత్రాయీనుంచి మనాలీ వరకు బస్సు ప్రయాణం. మనాలీ ఇక్కడికి పదిమైళ్ళుంటుంది. మనాలీనుంచి మిగతా ఇరవై మైళ్ళు గుర్రంమీద కాని, కంచరగాడిదమీదకాని, నడచికాని పయనిస్తే రొౌతాంగ్ కనుమలు చేరుకోవచ్చు.

బస్సులో మనాలీ చేరుకుని డాక్ బంగళాలో మకాం పెట్టాను. కులూ లోయలో మనాలీ ఒక విశిష్టస్థానం. ఇక్కడవరకు మాత్రమే ఏ చక్రాల వాహనా లైనా నడవగలవు. ఇది దాటితే జంతువాహనాలు, నరవాహనాలు మాత్రమే నడుస్తాయి. అందుకనే ఇక్కడితో నాగరిక ప్రపంచంనుంచి సంబంధ తెగి పోతుంది. మనాలీనుంచి చాలా హిమశిఖరాలు గోచరిస్తుంటాయి. మనాలీలో యాపిల్ పండ్లు విరివిగా ఉత్పత్తి అవుతాయి. రిటైరయిన మిలిటరీ బ్రిటిష్ ఉద్యోగులకు ఇక్కడ చాలా తోటలున్నాయి.

కులూ లోయలో పూర్తిగా వర్షాలు లేకుండా పోయాయి. పంటలు ఎండి పోతున్నందున ప్రజాసామాన్యంలో విషాదచ్ఛాయలు వ్యక్తమవసాగాయి. ఈ ప్రాంతంలో వర్షపు దేవత పేరు హిర్మా. వర్షాలు లేనప్పుడల్లా హిర్మా జాతరలు చేస్తారు. ఆమెను తృప్తిపరచడానికి దేవదారుచెట్లకు ఇనుపమేకులు కొడతారు. దేవదారుచెట్లకు ఇనుపమేకులు దించినందువల్ల హిర్మాదేవికి ఎందువల్ల సంతుష్టి ఏర్పడుతుందో ఎంత ఆలోచించినా కూడా నాకు బోధపడలేదు.

ఇక్కడనుంచి ఒక ఉదయం గుర్రంమీద, వెంట ఝున్నూ అనే ప్రదర్శకుడు వెంటరాగా ఇక్కడికి ఇరవై మైళ్ళున్న రొౌతాంగ్ కనుమలకు బయలు దేరాను. దూరం ఇరవై మైళ్ళే కాని దారి చాలా కష్టమైంది. రొౌతాంగ్ కనుమల ఎత్తు 13400 అడుగులు. మనాలీ ఎత్తు ఆరువేల అడుగులుంటుంది. దారి అంతా ఎక్కుడుగానే వుంటుంది. పోయినకొద్దీ చెట్లు తగ్గిపోతూ రాతికొండలు, వాటి శిఖరాలపై మంచు కనుపించసాగాయి. ఎనిమిదిమైళ్ళ ప్రయాణం సాగించేవరకు మధ్యాహ్నం కావచ్చింది. కోఠీ అనేవూరులో డాక్ బంగళాలో ఆ రోజంతా గడిపి తిరిగి రెండవరోజు ఉదయం బయలుదేరి చాలా కష్టమైన ఎక్కుడు ఎక్కుతూ మధ్యాహ్నానంతరం రొౌతాంగ్ కనుమలను ఆరోహించాం. ఇక్కడ మంచుతుపా

నులు వేగంగా వస్తుంటాయి. రాత్రులు ఇక్కడ గడిపితే హిమసమాధి తప్పదు. కనుమలకు అవతలిభాగాన్ని లాహూల్ అంటారు. కనుమలు దాటగానే కోక్సార్ అనే చిన్న గ్రామం వుంది. ఆ రాత్రి ఆ గ్రామంలో తలదాచుకొన్నాం. లాహూల్ ప్రదేశానికి ప్రధానగరం కైలాంగ్. ఈ ప్రదేశపు పరిపాలన పంజాబ్ ప్రభుత్వానిదే. లాహూల్ ప్రదేశం దాటితే లడఖ్ వస్తుంది. లడఖ్‌కు ప్రధానగరం లేహ్. ఇది కాశ్మీర్ ప్రభుత్వంలోనిది. రొతాంగ్ కనుమలు దాటినప్పటినుంచి ప్రజల రూపురేఖలు టిబెటన్లవే. ఇక్కడి ఆకాశం కాంతివంతమైన నీలంగా ప్రకాశిస్తుంటుంది. ఏటావాలైన రాతికొండలు చెట్లులేనివి ఎండలో ఎరుపు, గోధుమరంగులో మండుతుంటాయి.

ఇక్కడంతా నిజనమైన మౌనప్రకృతి. అనంతంలో నిరంతరం ప్రతిధ్వనిస్తూంటుంది. ఈ శైలప్రదేశం మౌనంగా, రొతాంగ్ కనుమలమీది గాలి వేగాన్ని సహించడం దుస్తరం. రొతాంగ్ కనుమలకు వెళ్ళివచ్చిన వాళ్ళ ముఖాలలో ఆ వేగవంతమైన మంచుగాలికి నల్లని మచ్చలు ఏర్పడతాయి. అందుకనే ఆక్కడ ముఖాలకు వెన్నలాంటి మృదువైన నూనెపదార్థాన్ని రాసుకొంటారు. అందువల్ల కొంతవరకు ముఖాలు ఆ గాలి దెబ్బనుంచి రక్షణ పొందుతాయి.

ఆ రాత్రి కోక్సార్‌లో గడిపి రెండవరోజు ఉదయాన బయలుదేరి రొతాంగ్ కనుమల దిగి కోఠీ చేరుకొని ఆ రాత్రి కోఠీలో గడిపి తెల్లవారి మధ్యాహ్నానికి ముందే రోరిక్ నిలయానికి తిరిగి చేరుకొన్నాను. రొతాంగ్ కనుమల ఆరోహణ మూలంగా రెండురోజులవరకు శరీరంలో నొప్పులు తగ్గలేదు. డాక్టర్ యలావెంకో ఏవో మందులూ అవి ఇచ్చినందున త్వరలోనే జ్వరంలాంటి బాధలేమీ లేకుండానే తేరుకొన్నాను.

నికోలస్ రోరిక్, ఇంకా వారి పరివారం అంతా రొతాంగ్ కనుమలలోగుండా పయనించినవారే అయినందున రొటాంగ్ మీది నా అనుభవాలను విని ఆనందించారు. తాము ఆ ప్రాంతాలలో ప్రయాణాలు సాగించిన రోజులలో దారులలో ఈ మాత్రం సౌకర్యాలుకూడా లేనందున తామంతా చాలా బాధపడినట్టు చెప్పారు.

రొటాంగ్ కనుమలనుంచి నేను తిరిగివచ్చిన తరువాత కులూ ప్రాంతమంతా మంచి వర్షాలు ప్రారంభించినాయి. ఈ వర్షాలు అంతకుముందే వుంటే నేను రొతాంగ్ కనుమలకు వెళ్ళగలిగేవాణ్ణి కాదు. అవి రొతాంగ్ కనుమలలో నేనుండగా కురిసినట్టయితే నేను కనుమల దిగి ఇక్కడికి తిరిగి రాగలిగేవాణ్ణికాదు.

ఈ వర్షాల మూలంగా కులూ ప్రజలలో నవచైతన్యం ఉప్పొంగజొచ్చింది. తమ హిర్మాదేవిలోని అలౌకిక సత్తాను వేయినోళ్ళ శ్లాఘించసాగారు.

వర్షాలు వెలసిపోయాయి. హిమాలయ ప్రకృతి అంతా పాలతో కడిగినట్టు స్వచ్ఛంగా, పారదర్శికంగా గోచరిస్తున్నది. నేను సాయంత్రం ఆరుగంటలకే నా భోజనాన్ని ముగించుకొని మేడమీద నా గదిలోని పెద్ద కిటికీలో కూర్చుని దేవదారు వృక్షాలలో గుండా అవుతున్న చంద్రోదయాన్ని చూడసాగాను. నిటారైన దేవ దారు తరువుల మధ్యగా ఎర్రని పూర్ణచంద్రుడు దిగంతనుంచి ఆకాశంమీదకు పైకి ఎక్కిరావడం చూస్తుంటే అదొక ఆనందమయ జగత్తుగా తట్టింది. నేను చూస్తూ చూస్తూ వుండగానే ఎర్రని చందమామ పైకొస్తూ తెల్లరంగును దాల్చింది. నా కిటికీ క్రిందుగా దేవదారుల నీడలు వెన్నెల తెలుపెక్కినకొద్దీ నలుపెక్క సాగాయి, గాలికి దేవదారులు ఒక అసాదృశ్యమైన శబ్దాన్ని వ్వసాగాయి. అర మోడ్పు కన్నులతో ఆనందదృశ్యాన్ని చూస్తూ, ఆ దృశ్యానందాన్ని అనుభ విస్తున్న సమయాన ఏదో మృదువైనట్టి, తన్మయమైనట్టి సువాసన తట్టింది. దానికి తోడు అడుగుల చప్పుడు వినిపించింది.

నేను కిటికీలోంచి దిగి వెనక్కు చూస్తే మదాం హెలీనా రోరిక్ పరిచారిక నన్ను చూచి అన్నది. అమ్మగారు ఈ పూలతొట్టిని ఈ గదిలో పెట్టిరమ్మన్నారు అని అంటూ ఆ పిల్ల వెళ్ళిపోయింది క్రిందికి. నా బల్లమీద ఈస్టర్‌లిల్లీ కుండీ కనిపిస్తున్నది. గది మొత్తం ఒక మృధుమధుర సౌరభం వ్యాపించింది. సువాసనలో ఏమాత్రమైనా వెచ్చదనం వుంటుందేమో తెలియదు. ఆ సువాసనను పీలుస్తూంటే అంతకుముందున్న చలి తగ్గినట్టు అనుభూతి చెందసాగాను. ఇది ఒకవేళ భౌతిక సత్యమో లేక కేవలం మనో వైజ్ఞానికి సత్యం మాత్రమేనో! ఈస్టర్ లిల్లీ పూస్తే ఆ పూవు చాలారోజులవరకూ వడమడక జ్యోతివలె వెలుగుతూ మృదుమధుర సుగంధాన్ని వెదజల్లుతూంటుంది.

వెన్నెల తెల్లగా ప్రకాశించసాగింది. కిటికీలోగుండా ఈస్టర్ లిల్లీలమీద వెన్నెల పడి వెన్నెలకంటె తెల్లగా వెలుగుతున్నాయి అవి. వాటి సుగంధమాధురి కూడా ప్రసరిస్తోంది బాగా. మళ్ళీ వెళ్ళి ఆ కిటికీలో కూర్చున్నాను నేను. సంపూర్ణ మైన ఆనంద వాతావరణం, తెల్లని వెన్నెల మధుర సుగంధం, ఈ రెండూ మిళి తమై అద్వైతరూపం దాల్చినాయి. ఆకాశంలోని చంద్రునినుంచి ఈ సుగంధం

వస్తున్నట్టు. క్రింద ఈస్టర్ లిల్లీలనుంచి ఈ వెన్నెల ప్రసరిస్తూన్నట్టు తట్టసాగింది. వెన్నెలకు సువాసన వున్నదనీ, సువాసనలో వెన్నెల వున్నదని భావిస్తూ మంచంమీద పడుకొని కన్నుమూశాను.

ఉదయాన నాకు నిద్ర మెలకువ వచ్చేవరకూ పశ్చిమాకాశంలో వెలవెలబోతూ ఇంకా చంద్రుడు ప్రకాశిస్తూనే వున్నాడు. నా గదిలో ఈస్టర్‌లిల్లీ ఇంకా మృదుల పౌరభాన్ని ప్రసరిస్తూనే వుంది.

ఆరోజు భోజన సమయాన రాత్రి నాకు తట్టిన అనుభూతులను, ఆలోచనలను రోరిక్కులతో చెప్పి పరిమళం చంద్రునిది అనీ, వెన్నెల పూవులదని వివరించాను. మిగతా వారంతా నవ్వసాగారు. నికోలస్ రోరిక్‌మాత్రం కొంచెం చిరునవ్వుతో గంభీరముఖ ముద్రను తాల్చి నా కళ్ళల్లో చూస్తూ అన్నారు: "అవును నీ అనుభూతి సత్యమైంది, అవును పరిమళం చంద్రునిది, వెన్నెల పూవులది. మరి ఈ రెండూకూడా సంజీవదేవ్‌వి!" అక్కడ వున్నవారంతా తమ నవ్వుని ఆపి గంభీరంగా నిజం, నిజం అని కరతాళధ్వనులు చేశారు. నాకు ఏమనాలో తోచక వారందరి ముఖాలూ చూడసాగాను.

# రష్యా సందర్శనకు రోరిక్ ఆహ్వానం

రష్యన్ ప్రభుత్వం నుంచి ఒక సీలువేసిన పెద్ద కవరులో నికోలస్ రోరిక్ పేర ఒక ఉత్తరం వచ్చింది. అది రష్యన్ భాషలో టైపు చేయబడి వుంది. పెద్ద పెద్ద అక్షరాలలో దాన్ని చూసుకొని రోరిక్ కుటుంబం వారంతా ఆనందపరవశులైనారు. నికోలస్ రోరిక్‌ను, ఆయన పరివారాన్ని మొత్తం రష్యా రమ్మని, అక్కడ తమ చిత్రప్రదర్శనలు, ఉపన్యాసాలు ఏర్పాటుచేస్తామని వుంది ఆ వుత్తరంలో. నికోలస్ రోరిక్ నా భుజంతట్టి తమతోపాటు నన్నుకూడ రష్యాకు పయనించమన్నారు. అయితే ఈ కార్యక్రమం యుద్ధానంతరం విషయమని అంటే ఈ ప్రయాణం ఇంకా రెండు సంవత్సరాలనాటికి కాని కార్యరూపం దాల్చదని స్పష్టపరచారు. ఇంకా రెండు సంవత్సరాలనాటికి అనేసరికు అదివరకు నాలో లేచిన ఉత్సాహం కాస్తా చల్లారింది.

రెండు సంవత్సరాలంటే మాటలా? నూరు వారాలైతేకాని రెండు సంవత్సరాలు కావు. వారంఅంటే ఒకరోజులో పూర్తి అవుతుందా ఏడురోజులు గడిస్తేకాని వారం కాదు. ఏడు రోజులకు వారంచొప్పున నూరువారాలు గడిచేదాకా ఎవరు ఓర్చుకొని వుండగలరు? ఈ నిరాశా తిమిరంలోనే మళ్ళీ ఆశాకిరణం పొడసూపింది. మరొక ఆలోచన వచ్చింది. ఈ అనంతరకాలంలో రెండు సంవత్సరాలంటే రెండుక్షణాలతో సమానం. నేను పుట్టిన తరువాత ఎన్నెన్ని సంవత్సరాలు గడచిపోలేదు! కాలం గడచిపోతుందే కాని ఆగదు. జరగవలసిన విషయాన్ని మరచిపోయి వుంటే సంవత్సరాలు మనకు తెలియకుండా ఇట్టే గడిచిపోతాయి. జరగాలసిన విషయాన్ని నిత్యము గుర్తు చేసుకొంటూంటే కాలం అంత త్వరగా గడవక ఎంతో ఆలస్యంగా, ఎంతో బరువుగా గడుస్తుండి. కనుక ఈ రెండు విమిషాలు రాబోయే రష్యా ప్రయాణాన్ని గురించి గుర్తుచేసుకోండా మరచిపోయి వుండడం మంచిది. కొన్ని విషయాలలో మరచిపోవడం అనే దానికికూడా ఎంతో విలువ వుంది!

## రోరిక్ శాంతిపతాక

రోరిక్‌ని గురించి అని మూడు ఇంగ్లీషు వ్యాసాలను విభిన్నరూపాలలో రచించి పత్రికలలో ప్రకటించాను. వాటిని చదివి స్వదేశంలోని విదేశాలలోని కొందరు ప్రముఖులు ఉత్తరాలు వ్రాశారు. ఆ ఉత్తరాలను చూచి నాకంటే నికోలస్ రోరిక్ ఎక్కువ ఆనందించారు.

ప్రపంచంలో అనేక శిల్పసంపదలు, అనేక చిత్రకళా ఖండాలు మొదలైన ఎన్నో సంగ్రహాలయాలున్నాయి వ్యక్తులవి, ప్రభుత్వానివి కూడ. జర్మనీలో వున్న కళాసంపదలను మిత్రరాజ్యాలు నష్టం చేస్తారు. మిత్ర రాజ్యాలలోని వాటిని జర్మన్లు నాశనం చేస్తారు. కొంతకాలానికి ఇప్పుడు యుద్ధాలు చేస్తున్న విరోధులంతా మళ్ళీ మిత్రులవుతారు. వీళ్ళు మిత్రులు కావడం సులభమేకాని ఉభయుల దేశాలలో యుద్ధకాలంలో నాశనం చేయబడ్డ కళాసంపదలు తిరిగి రావాలంటే అసంభవం. నశించిన కళాఖండాలు తిరిగి ఏవిధంగా రాగలవు? కనుక ఇటువంటి కళాకేంద్రాల మీద రోరిక్ నిర్మించిన శాంతిపతాకను ఎగురవేసి వుంచితే యుద్ధం చేస్తున్న ఉభయపక్షాలు కూడా ఆ శాంతిపతాకను గౌరవించి ఆ కళా కేంద్రాలపైన బాంబులు వేయకుండా వుంటే శాంతిసమయంలో వాటిని గురించి ఆయా దేశాలవారు పశ్చాత్తాపం చెందవలసిన అవసరం వుండదు.

రెడ్‌క్రాస్ చిహ్నంవున్న ఆస్పత్రులను, అనాథ శరణాలయాలను మొదలైన వాటిని ఉభయపక్షాలు కూడ యుద్ధ సమయంలో గౌరవించి వదలినట్టుగానే సాంస్కృతిక కేంద్రాలను కూడ గౌరవించి వదలాలనే ఈ శాంతిపతాక స్థాపన. ఒక్క కళాకేంద్రాలు మాత్రమే కాక వైజ్ఞానిక కేంద్రాలు, విశ్వవిద్యాలయాలు మొదలైన విద్యాసంస్థలు కూడ వీటిలోకే వస్తాయి. ఈ పతాకను గుర్తించినట్టు ప్రపంచంలోని రాజ్యాలన్ని కూడ ఈ రోరిక్ ఒడంబడికమీద సంతకాలు చేయాలి. చేసిన ప్రభుత్వాలన్నీ ఈ పథకాన్ని అమలుజరపాలి.

రోరిక్ పరికల్పన (**Design**) చేసిన ఈ శాంతిపతాకమీద ఎర్రని రంగులో వలయం వుంటుంది. ఆ వలయం లోపల కళావరు పద్ధతిలో మూడు గోళాలుంటాయి. ఈ మూడు గోళాలు కళకు, విజ్ఞానానికి, ధర్మానికి చిహ్నాలు. వీటి చుట్టూ వున్న వలయం శాశ్వతకాలాన్ని తెలుపుతుంది. ఒకర్థంలో ఈమూడు గోళాలు కూడ "సత్యం శివం సుందరం" ఈ మూడింటిని తెలుపుతాయి. సత్యం జ్ఞానాన్ని (**Science**) తెలుపుతుంది. జ్ఞానం బుద్ధి తెలుపుతుంది. ధర్మం ఇచ్ఛాశక్తిని తెలుపుతుంది. కళ ఆవేశాన్ని తెలుపుతుంది. మానవజీవితానికి ఈ మూడూ ఎంతో అవసరమైనవి. కళ, విజ్ఞానం, ధర్మం ఈ మూడు కలిస్తేనే సమగ్ర సంస్కృతి మనగలిగేది. కనుక రోరిక్ శాంతిపతాక సమగ్ర సంస్కృతికి ప్రతీక.

సాంస్కృతిక సంపదలకు యుద్ధ సమయంలోనేకాక శాంతి సమయంలో కూడా ఎంతో రక్షణ అవసరం. ప్రభుత్వంమీద కోపంవచ్చిన ప్రజలు గ్రంథా

లయాలను, మ్యూజియంలను, తగలబెట్టడం కూడా జరుగుతుంటుంది. ఇటువంటి సమయాల్లో కూడా ఈ శాంతిపతాక ఉపయోగపడేట్టు చేయవచ్చు. నేను ఈ అంతర్జాతీయ ఉద్యమానికిభా రతదేశంలోని ముగ్గురు కార్యదర్శులలోను ఒకరిగా వుంటూ ఏమేమో చేయాలని ప్రయత్నిస్తే అప్పటి ద్వితీయ సంగ్రామంలో వున్న భారతదేశంలోని బ్రిటిష పాలకులు సరిఅయిన అవకాశాలను కల్పించలేదు. అందువల్ల మన దేశంలో ఆ శాంతిపథకం సరైన కార్యరూపం తాల్చజాలక పోయింది. కొన్ని సత్సంకల్పాలు కార్యరూపం తాల్చకపోయినా కూడా మంచి పరిణామాలనే సృష్టిస్తాయి. దుష్ట సంకల్పాలు త్వరలో కార్యరూపం తాల్చినా కూడ కార్యరూపం తాల్చని సత్యం కల్పాలంత ప్రభావాన్ని చూపజాలవు. సత్సం కల్పం జనించడమే ఒక కార్యాచరణ జరగడం అయినట్టు.

ఒకరోజు మధ్యాహ్నం నేను నా రచనా కార్యక్రమం ముగించుకొని నా గదినుంచి క్రిందికి దిగివచ్చి రోరిక్ నివాసం దగ్గరలోని పూలతోటలోకి వెళ్ళాను. మధ్యాహ్నపు సూర్యకాంతిలో తోటలోని రంగురంగులపూలు మిలమిలా మెరిసి పోతున్నాయి. తోటలో మరొకప్రక్క రోరిక్ నిలయంలో వుంటున్న ఇద్దరు రష్యన్ నర్సులలో చిన్నామె పూవులను పరిశీలిస్తూ నిలుచున్నది. నన్నుచూచి ఆమె నా వైపుకు బయలుదేరి వచ్చింది. ఆమెకూడా కొంత వచ్చీ రాని ఇంగ్లీషు మాట్లాడగలదు. మేముభయులం మాట్లాడుతూ వెళ్ళి ఒక దేవదారు వృక్షంక్రింద వున్న సిమెంటుబల్లమీద ఆసీనులమయాం.

ఆమె చాలా బలిష్టమైన అవయవ పుష్టి కలది. నిండైన, ఆరోగ్యమైన చిరునవ్వు నవ్వుతుంది ఆమె. నా పుట్టు పూర్వోత్తరాలన్నీ అడిగి తెలుసుకొన్న తరువాత ఆమె తన వృత్తాంతం చెప్పసాగింది. తన తల్లిదండ్రులు రష్యన్లు అయి నప్పటికీ ఆమె జన్మించింది లట్వియాలోనట. చిన్నతనంలోనే తల్లిదండ్రులు మర ణించడంతో ఏదో సామాన్య విద్యతప్ప పెద్దగా విద్యాభ్యాసం ఏమీ సాగలేదట. చిన్నప్పటినుంచి దేశాటనంమీది ప్రీతిమూలకంగా భారతదేశం వచ్చి వీరితో వుండి పోవటం జరిగిందట. వివాహం చేసుకొనే ఇచ్ఛ లేదట. ఇక్కడ ప్రాకృతిక జీవితంలోను, రోరిక్‌లతో కాలం గడపడంలోనే తనకు ఆనందం కలుగుతున్నదట. ఇటువంటి యుక్తవయస్సులో ఒంటరిగా జీవించడంలో నరాలబాధ, మానసికబాధ, జనించడం లేదా అని అడిగితే నవ్వుతూ అంది: తాను ఇందరిలో జీవిస్తుంటే

వంటరిగా జీవించటం ఎట్లా అవుతుందీ అని. ఆమెలోని సూక్ష్మగ్రాహ్యతను అవగాహన చేసుకొని నేను ఆనందించాను. ఆమెహూడా కిలకిల నవ్వుతూ అక్కడ నుంచి లేచింది.

వ్యక్తిలో నిండైన మానసిక ఆనందం కనుక వుంటే శారీరకోద్రేకాలు కూడా ఆ వ్యక్తిని బాధించవేమో! సహజానందం కొరత ఏర్పడినప్పుడే ఇతర బయటి ఆనందం నిమిత్తం వెదకాలేమో!

## భూటాన్ లామాతో పరిచయం

ఇక్కడ భూటాన్‌నుంచి వచ్చిన ఒక లామా వుంటున్నాడు. డాక్టర్ జార్జి రోరిక్ ఈ భూటాన్ లామాను ఇక్కడవుంచి ఆయనవద్ద భూటానీ భాషను, తాంత్రిక బౌద్ధాన్ని అభ్యసిస్తున్నాడు. బౌద్ధంలో హీనయానం మహాయానం మాత్రమేకాక వజ్రయానం కూడ వున్నది. వజ్రయాన బౌద్ధం అంటే తాంత్రిక బౌద్ధం అనే అర్థం. హీనయానం సింహళంలోనూ, మహాయానం దూరప్రాచ్య దేశాలలోనూ ఎక్కువ అనుయాయులను కలిగివుంటే, వజ్రయానం హిమాలయాల కావలి దేశాలైన సిక్కిం, భూటాన్. టిబెట్టు మొదలయినచోట్ల ఎక్కువ అనుయాయులను కలిగివుంది. ఈ భూటాన్ లామా వజ్రయాన బౌద్ధలామా. సాయంత్రం భూటానీ లామా నాతో కలిసి దేవదారు అరణ్యంలోకి నడకకు వచ్చేవాడు. ఆయనకు ఇంగ్లీషు రాదు. హిందీ రాదు. తెలుగు అంతకంటె రాదు. ఆయన కొంతకాలం డార్జిలింగ్‌లో వున్నందున వచ్చీరాని బెంగాలీ మాట్లాడుతాడు. ఆయన వచ్చీరాని బెంగాలీ నేను వినగని బెంగాలీలోను సంభాషణ సాగించేవాళ్ళం. తన భావాన్ని వ్యక్తం చేయటానికి సరయిన పదం దొరకనప్పుడు చేతులు ఆకాశం వైపుకు ఎత్తి నవ్వేవాడు.

మేము దేవదారు అరణ్యంలో కొంతదూరం నడచి తిరిగి వస్తూ క్రింద లోతయిన లోయ కనపడేచోట ఒక పెద్ద చెట్టుమీద కూర్చుండేవాళ్ళం. సూర్యాస్తమయ సమయంలో ఆయన పసుపురంగు శరీరమూ, నారింజరంగు దుస్తులూ ఆ అస్తమయపు కాంతిలో కలిసిపోయేవి. తాంత్రిక సాధనలను గురించీ, సిద్ధులను గురించి ఎన్నో అద్భుతమైన విషయాలు చెప్పేవాడు. తాను వజ్రయాన పండితుడు మాత్రమే కాని తాంత్రిక సాధకుడను కానని చెప్పాడు. తంత్రసాధనలో చాలా అపాయాలున్నాయి కనుక దాన్ని అందరూ అభ్యసించటం ప్రమాదకరమని

అంటూండేవాడు. అన్నిటికంటే ఉత్తమమైన పంథా హీనయాన బౌద్ధం అని తన విశ్వాసాన్ని ప్రకటించేవాడు.

డాక్టర్ జార్జి రోరిక్ ఈ లామాతో భూటానీ భాష మాట్లాడుతుంటే చాలా సార్లు విన్నాను. భూటానీ భాష టిబెటన్ భాషలాగానే ధ్వనించేది. భూటానీ లామాది సన్ననిగొంతు. ఆ గొంతుతో భూటానీ మాట్లాడుతుంటే వినసొంపుగా సంగీతంలాగా వుండేవి. జార్జి రోరిక్ టిబెటన్ భాషను గురించి మాత్రమేకాక టిబెటన్ సంబంధమైన హిమాలయాల ఉపభాషలను గురించి కూడా అధ్యయనం చేశాడు. వీలు చిక్కినప్పుడల్లా మంగోలియన్ భాషల పుట్టుపూర్వోత్తరాలను గురించి, మంగోలియన్ భాషలకు ఇండో యూరోపియన్ భాషలకు వుండే ప్రధాన భేదాలను గురించే చెప్పుతుండేవాడు.

భాషలనుగురించే కాక మానుషశాస్త్రం (**Anthropology**) గురించికూడా ఆయన చాలా పరిశోధనలు చేశాడు. టిబెటన్‌ల మానుషశాస్త్రం గురించి పరిశోధించి వాళ్ళకు సంబంధించిన సంస్కృతినిగురించి ఎన్నో నూత్నసత్యాలు బయటకు తీశాడు. ఆయన పగలు చాలాసేపు తలుపులు బిగించుకొని వంటరిగా కూర్చుని గంభీరమైన గవేషణ చేస్తుండేవాడు భాషాజ్ఞానాన్ని గురించి.

డాక్టర్ జార్జి రోరిక్‌కు ద్రావిడ భాషలను గురించి అంతగా పరిచయం లేదు. ద్రావిడ భాషలను గురించి ఆయనకెంతో గొప్ప అభిప్రాయం వుండేది. భవిష్యత్తులో ద్రావిడ భాషలను గురించికూడా అధ్యయనం చేయాలని, ద్రావిడ భాషలకూ మంగోలియన్ భాషలకు వుండే తారతమ్యాలను గురించి తులనాత్మకమైన (**Comparative**) గ్రంథం ఒకటి రచించాలనీ ఆయన తన అభిలాష వ్యక్తపరచాడు.

# నీలాలనింగి – చిత్రకారులకు కల్పతరువు

ఆకాశం అంటే ఏమిటో! గగనం శూన్యం అంటారు. కనుక ఆకాశం అంటే ఏమీ లేదని అర్థమా? ఏమీలేని ఆకాశంలో అన్నీ వున్నట్లు గోచరిస్తుంది. ఎన్ని రంగులు ఎన్ని కాంతులు గోచరిస్తాయి ఆకాశంలో ఉదయం మొదలు సాయంత్రం వరకూ – నీలాకాశం, బూడిదాకాశం, అరుణాకాశం, పసుపు ఆకాశం, వెండి ఆకాశం, బంగారు ఆకాశం. ఈ విధంగా ఎన్నో ఆకాశాలు వ్యక్తమవుతుంటాయి నిత్యం. మరీ ఈ కులూ హిమాలయ ప్రాంతపు ఆకాశాలు వివిధ వర్ణ కాంతులలో దీప్తివంతంగా వెలుగుతుంటాయి. క్రింది కొండలతో సంబంధం లేకుండానే స్వయంగా ఆ ఆకాశాలే చూడడానికి సుదృశ్యంగా వుంటాయి. ఇక ఆ ఆకాశాలను క్రింది కొండలతో కలిపి చూచినప్పుడు ఎంతో రసమయంగా గోచరిస్తాయి.

ఇలాంటి జ్యోతిర్మయ గగనాలే రోరిక్ హిమాలయ చిత్రాలలో గోచరిస్తాయి. ఆకాశం ఒక వంతు మాత్రమే వుండి మూడువంతులు కొండలతో నిండి వున్న చిత్రాలున్నట్లే మూడువంతులు ఆకాశంతో నిండి ఒకవంతుమాత్రమే కొండలతో వున్న చిత్రాలూ వున్నాయి. మొదటివాటికంటె రెండవచిత్రాలు అధిక రమ్యంగా వుంటాయి. దృశ్యాలలో భూభాగానికంటె ఆకాశభాగానిదే ఎక్కువ అందం. పల్లంలో నుంచి కొండల దృశ్యాన్ని చూస్తుంటే కొండల భాగం ఎక్కువై ఆకాశభాగం తక్కువవుతుంది. ఎత్తుమీదినుంచి చూస్తే ఆకాశభాగం ఎక్కువగాను, కొండలభాగం తక్కువగాను గోచరిస్తుంది.

కొంచెం ఎరుపు బూడిదరంగు మేఘాలు పొడవుగా విచ్చుకొని ఆ విచ్చుకొన్న ఖాళీస్థలం నీలపు ఆకుపచ్చతో ప్రకాశిస్తూవున్న ఆకాశపు శోభ మహా మనోహరంగా వుంటుంది. క్రింద ఏ వస్తువును చూపకుండా కేవలం ఆకాశాలను కూడా చిత్రిస్తారు కొందరు ప్రకృతి చిత్రకారులు.

ఇటువంటి రంగుల కాంతులతో నిండిన ఆకాశాన్ని చూస్తూ ఆనందిస్తున్న సమయాన నా గదికి ప్రక్కగదిలోకి ఇద్దరు బ్రిటిష్ యువకులు వచ్చి దిగారు. వారు రాయల్ ఎయిర్‌ఫోర్సుకు చెందినవారట. ఢిల్లీలో వుంటూ ఈ ప్రాంతాలను చూచి పోవాలని వచ్చారు. వీళ్ళందరికీ పర్యటనలంటే చాలా ఇష్టం. డాక్టర్ యతావెంకో వాళ్ళను నాకు పరిచయం చేయడమో లేక నన్నే వాళ్ళకు పరిచయం

చేయడమో జరిగింది. మొత్తంమీద ఎవరిని ఎవరికి పరిచయం చేసినప్పటికీ వాళ్ళూ నేనూ పరిచితులం మాత్రం అయ్యాం. వాళ్ళు ఎయిర్‌ఫోర్సులో పని చేస్తున్నా కూడా సాంస్కృతిక జీవితంతో సంబంధం వదులుకోరు. ఇందులో ఒకరు ఫొటో గ్రాఫరు. రెండవవారు నీటిరంగుల చిత్రకారుడు.

వీరుభయులు రొతాంగ్ కనుమలకు వెళ్ళిరావాలని, ఇక్కడికి కొంత దూరంలో వున్న దేవతిబ్బ అనే హిమశిఖరాన్ని అధిరోహించాలని అభిలాష కనపరచారు. అభిలాష కనపరచడం మాత్రమేకాక రేపే బయలుదేరి అందునిమిత్తం మనాలీ చేరుకోవాలని నిశ్చయించారు. సంకల్పాన్ని నిర్ణయంలోకి, నిర్ణయాన్ని కార్యంలోకి మార్చుకోడంలో ఈ శ్వేతజాతులకున్న ప్రతిభ చూచి నేను ముగ్ధుడ నయ్యాను. అయితే వాళ్ళకు సంకల్పాల సంఖ్య కొద్దిగానే వుంటుందేమో!

ఆ రాత్రి భోజనమైన తరువాత మా గదుల కెదురుగా వున్న వరండాలో మేము రగ్గులు కప్పుకొని కూర్చొని బయటి చీకటిని, చీకటిలో జడలు విరబోసుకొని దయ్యాలవలె నిలుచున్న దేవదారు చెట్లను, ఆ చెట్లపైగ మిలమిల మెరుస్తున్న నక్షత్రాలను చూడసాగాం. సౌందర్యాన్ని ఆనందించడంలో మానవులంతా ఒకటే పద్ధతి అయినప్పటికీ వ్యక్తి విశేషాల ననుసరించి, వారివారి రసచేతనలోని అర్హతనుబట్టి కొంత తారతమ్యం వుంటుంది. కొందరు ఆనందిస్తూ తన్మయులవుతారు; మరికొందరు ఆనందిస్తారే కాని తన్మయులు కారు; ఈ విధంగా రసానందం వివిధస్థాయిలను అందుకొంటుంది వివిధ వ్యక్తులలో.

## మృత్యుభీతి

మా సంభాషణల సందర్భంలో మరణాన్ని గురించి కూడా వచ్చింది. వాళ్ళలో ఒకరు చెప్పసాగారు. తాను ఫ్రాన్సులో జర్మను సైన్యాలను ఎదుర్కొవలసి వచ్చినపుడు నిజంగా చనిపోయి మళ్ళీ జీవించాడట. ఇతర సమయాల్లో ఎటువంటి ధీరునికి కూడా మృత్యువంటే కొద్దో గొప్పో భయం కలుగవచ్చు. కలుగకపోవచ్చు, కాని యుద్ధరంగంలో మాత్రం అటువంటి మృత్యు భయమనేదే జనించదట. యోధుడుగా జీవించడంలో ఎంతో ఆనందం వుంది, ఎంత ప్రమాదమున్నా కూడా అన్నాడాయన.

ఈ భూమిమీది వస్తువులపైనా, మనుషులపైనా, స్థలాలపైనా అతిగా ఆసక్తి కలిగివున్న వాళ్ళకున్నంత మరణభయం అవి అంతగా లేనివాళ్ళకుండదు అన్నాను నేను. ప్రతిదానితోను బంధవ ఘనీభవించినకొద్దీ దాన్ని వదలి చనిపోవడం అంటే

బాధ కలగడం సహజం. ఎంత శక్తివున్న బంధన వుంటే మరణభయం అంత తక్కువగా వుంటుంది అన్నాను. వారుభయులు నా అభిప్రాయంతో ఏకీభవించారు. అసలు మరణమంటే నిజంగా ఏమిటో ఇంతవరకు ఏ వైజ్ఞానికులూ ఇదమిత్థమని తేల్చలేదు. మరణానికి పూర్వం ఏముంటుందో మనందరికీ తెలుస్తూనే వుందికాని మరణానంతరం ఏముంటుందో నిజమైన విషయం ఇంతవరకు నిర్ధారణగా ఏమీ తెలియరాలేదు. తలా ఒక విధంగా చెబుతుంటారు. అని చెప్పుకొంటూ ప్రొద్దు పోయేదాకా ఆ నీరవ నిస్తబ్ధ అంధకారాన్ని చూస్తూ కూర్చున్నాం.

చలి ఎక్కువ కాజొచ్చింది. మేము ముగ్గురుమూ లేచి మా మా గదులకు వెళ్ళిపోయాం. వెళ్ళిపడుకున్నానేకాని నాకు నిద్రపట్టలేదు. ఈస్టర్ లిల్లీ మంచి సుగంధం ఇంకా వస్తూంది. ఈ సుగంధాన్ని క్రిందటిసారి వెన్నెలరాత్రిలో అనుభవించాను; నేడు ఈ చీకటిరాత్రిలో అనుభవిస్తున్నాను. నా మంచానికి కొంతదూరంలోని ఈస్టర్ లిల్లీపూలు చీకటిలోనుంచి కూడా తెల్లగా కనిపిస్తు న్నాయి. క్రిందటితడవ ఈ పూలు వెన్నెలలో కూడా తెల్లగా కనిపించినాయి; నేడు అవే పూలు చీకటిలో నల్లగా కనుపించక తెల్లగానే కనిపిస్తున్నాయి. ఈ పూలు చీకటివెలుగుల కతీతమా !

రెండవరోజు ఉదయం రాయల్ వైమానికదళపు ఇద్దరు బ్రిటిష్ యువకులు కొలాంగ్ కనుమలవైపుకు పయనించారు. నేను అటు అరణ్యం దాటి ఒక చిన్న పల్లెవైపుకు వెళ్ళాను. శీతలవాయువులు వేస్తూ తెల్లని ఎండ కాస్తూ వుంటే మధ్యాహ్నవేళలో కూడా ఇంటిలో కూర్చోబుద్ధికాక బయట ముక్తాకాశం క్రింద అరణ్యాలలో, లోయలలో, అక్కడక్కడ వున్న పొలాలలో తిరుగాలనిపించేది. దేవదారు అరణ్యానికి అవతల వున్న పల్లెలో పదిహేను ఇళ్ళకంటె ఎక్కువ వుండవు. వీరంతా ఠాకూరులు అనే రాజపుత్ర జాతికి చెందినవారు. అందరికీ కొద్ది వ్యవసాయాలున్నాయి. వ్యవసాయమే వీరి జీవిక. స్త్రీ పురుషులంతా పొలాలమీద పని చేస్తారు.

సెలయేళ్ళకు అడ్డంవేసి కొంతవరకు వడ్లు పండిస్తారు. మిగతా మెట్టచేలలో మొక్కజొన్న వేస్తారు. నేను ఆ వూరు దాటి ఆవలగా వున్న మొక్కజొన్న చేను వైపుకు వెళ్ళేను. మొక్కజొన్న కండెలు ఇంకా తెల్ల పీచుతో లేతగానే వున్నాయి కాని ముదిరి నల్లపీచు వేయలేదు. ఒక పదహారేళ్ళ అమ్మాయి ఒక ఎత్తయిన రాతిమీద నిల్చుని పిట్టలను తోలుతున్నది. నేనుకూడా ఆ రాతిమీదకు

ఎక్కి నిలుచున్నాను. నన్ను చూచి ఆ బాల మొదట కొంచెం తత్తరపోయింది. తరువాత నేను చిరునవ్వు నవ్వడం చూచి తానూ నవ్వింది. హిందీలో పలుకరించి చూస్తే ఆమెకేమీ తెలిసినట్టు లేదు. నాకు తెలిసిన ఒకటి రెండు పంజాబీ మాటలను వాడి చూశాను. లాభం లేకపోయింది. ఇక కులనీ భాషలో ఏమో మాట్లాడింది. కాని అది నాకు తెలియలేదు. నాకు తెలిసిన భాషలలో ఆమెకు ఒకటీ తెలియదు. ఆమెకు ఒకేభాష తెలుసు. అది నాకు తెలియదు. మేముభయులమూ పెద్ద చిక్కులో పడిపోయాం. ఇక మాకు తెలిసిన భాషల్లా ఒకరి ముఖాలు చూచి మరొకరు నవ్వుకోడం మాత్రమే. తరువాత నేను అక్కడనుంచి తిరిగి ఇంటి వైపుకు సాగాను.

మనుషులమధ్య భాషలేనప్పుడు ఎంతచిక్కో అర్థమైంది. ఒకరిభాష ఒకరికి తెలిసినట్టయితే ఆ అమ్మాయీ నేనూ ఎన్ని విషయాలు మాట్లాడుకొనేవాళ్ళమో! భాషవున్నపుడు అనుభూతులకు ఒక రూపం దొరకడంతో అనుభూతుల్లోని తీవ్రత కొంత పలచబడుతుంది. కాని, భాష లేనప్పుడు అనుభూతులు వ్యక్తిగతంగా వుండిపోయి వాటిలోని తీవ్రత హెచ్చుతుంది. ఆ కులూ బాలకూ, నాకూ నోళ్ళు వుండి కూడా మూగగానే వుండిపోయినాం. మరొకసారి ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళి రావాలని వాంఛ జనించింది కాని తిరిగి వెళ్ళడం పడలేదు. మాటలు తెలిసిన వాళ్ళకంటె మాటలు తెలియని వాళ్ళమీద ఎక్కువ ఆకర్షణ ఏర్పడుతుంది. ఈ ఇరవయ్యో శతాబ్దంలో కూడా ఇద్దరు తరుణవయస్కులు తమ పరస్పర భావాలను వ్యక్తం చేసుకోడానికి భాష అడ్డంకి అయినందుకు భాషా శాస్త్రంమీదా, శాస్త్రజ్ఞుల మీదా నాకు కోపం వచ్చింది.

నిజానికి రెండు ప్రేమ హృదయాలు ఒకదానితో ఒకటి ముచ్చటించుకోడానికి మౌన భాషకు మించిన మరొక గొప్ప భాష లేదు. నోటి భాషలకు భేదం వుంటుంది కాని హృదయభాషలకు భేదం వుండదు. నోటి భాషలు జాతికొకటి, ప్రాంతానికొకటి, దేశానికొకటి. కాని హృదయాల భాషమాత్రం అన్నిజాతులకు ఒకటే, అన్ని ప్రాంతాలకు ఒకటే, అన్ని దేశాలకు ఒకటే. హృదయ భాష విశ్వజనీన భాష. అయితే ఈ హృదయభాష కూడా అన్ని హృదయాలకు అర్థం కాదు. ప్రేమ హృదయాలకు మాత్రమే అర్థమవుతుంది!

ఒక మొక్కజొన్న కండెను వచ్చిరే దారిలో తిని మిగతా రెండు కండెలను తీసుకవెళ్ళి రోరిక్ పరివారమంతా కూర్చున్నచోట మదాం హెలీనా చేతుల్లలో

వుంచాము. వారంతా ఆశ్చర్యపోయి ఎక్కడివి ఇవి అన్నారు. నేను ఉదంతమంతా చెప్పాను. వారంతా కడుపుబ్బ నవ్వసాగారు. నికోలస్ రోరిక్ సంతోషంతో నా భుజం తట్టసాగారు. జార్జి రోరిక్ అన్నారు: మేమంతా ఇంతకాలందిట్టి ఇక్కడ వుంటూ చేయలేనిపని నీవు చేశావు" అని.

ఆ రాత్రి కొంచెం నాకు శైత్యంచేసి కొద్దిగా జ్వరం తగిలినట్టు అనిపించి బాధతో కొంచెం మూలిగేను. నాపక్క గదిలోనే పరున్న డాక్టర్ యలావెంకో వచ్చి శరీరం పట్టిచూచి ఏదో మందు తెచ్చి త్రాగించారు. శరీరపు బాధ కొంచెం తగ్గినట్టు అనిపించింది. కాని నిద్రమాత్రం పట్టలేదు. చిన్నప్పుడు నేను బాధపడిన జ్వరాలు గుర్తొచ్చినాయి. అప్పుడు జ్వరంవచ్చి పడుకుంటే మంచంచుట్టూ పెద తల్లులూ, అమ్మమ్మా మొదలైనవారంతా కూర్చొనివుండి జ్వరపుబాధను తాము కూడా పంచుకునేవారు. అందువల్ల అప్పుడు ఎంత బాధవున్నా కూడా బాధ అని పించేది కాదు; మరి ఇప్పుడు ఈ సుదూర పశ్చిమ హిమాలయాలలో, ఈ దేవదారు వృక్షాలమధ్య ఈ గదిలో ఒంటరిగా పడుకొనివుంటే బాధ లేకపోయినా బాధ అని పించడం సహజం. ఈ బాధ జనించగానే కంటివెంట ఒకటి రెండు వేడి కన్నీటి బిందువులు చెక్కిళ్ళమీదకు జారినాయి. అంతటితో నిద్రపట్టింది. ఆ ఉదయం ఎని మిది గంటలవరకు లేవలేదు. డాక్టర్ యలావెంకో వచ్చి పరిశీలించి జ్వరం తగ్గి పోయినదని చెప్పి మరోమందు త్రాగించారు. రాత్రి జ్వరం వచ్చినట్టు రోరిక్కు లతో చెప్పవద్దని డాక్టర్‌కు సూచించాను. ఆయన నవ్వుతూ సరే అన్నాడు. నేను లేచి మామూలుగా భోజనం చేసి ఆరోగ్యంగా తిరగసాగాను ఎప్పటివలె.

# పరిణయం పట్ల పెరిగిన మోజు

ఉదయం ఎనిమిదిగంటలవుతుంది. కులూలో నేను కూర్చున్న బస్సు నగ్రోటావైపుకు బయలుదేరుతున్న ఆఖరుక్షణాన ఒక పంజాబీ యువకుడు వచ్చి బస్సులో నా ప్రక్కన కూర్చున్నాడు. ఆయన చేతిలోని తోలుసంచిమీద పేరున్నది "డాక్టర్ ఓంప్రకాశ్ చోప్రా" అని. ఆయన ముఖం నేనిదివరకెక్కడో చూచిన ముఖంగా తట్టసాగింది. నా స్మృతి మంజూషలో అన్వేషించి చూచాను. ఎక్కడిదా ఈ పరిచితముఖమని. కాని జాడ దొరకలేదు. నిర్ణయించుకొన్నాను. ఇది పరిచితమైన ముఖం కాదు, పరిచితంగా కనుపించే అపరిచిత ముఖం మాత్రమే అని.

కొన్ని ముఖాకృతులు, ప్రత్యేకంగా మనవైపుచూచి నవ్వుతున్నప్పుడు, పరిచితముఖాలుగా గోచరిస్తాయి. అందువల్ల అవి మనం ఎరిగినముఖాలే అని భ్రమచెందుతాం. ఇంకొన్ని ముఖాకృతులుంటాయి. వాటిని ఎన్నిసార్లు చూచినప్పటికీ మళ్ళీ మళ్ళీ అపరిచితాలుగానే గోచరిస్తాయి. ఎరగని ముఖాలను ఎరిగినట్టుగా భ్రమించి వారిని పలకరించడంలో ప్రమాదం వుండదు. కాని ఎరిగిన ముఖాలను ఎరగనట్టు భ్రమించి పలకరించకపోవడంలో మాత్రం ప్రమాదం వుంది!

డాక్టర్ చోప్రా బస్సులోకి ఎక్కుతూనే నావైపుచూచి చిరునవ్వు నవ్వసాగాడు. నేనూ నా చిరునవ్వును అందులో కలిపేను. ఇంకేం మా ప్రథమ పరిచయమే సన్నిహిత స్నేహంగా రూపొందింది. నా ఉదంతం అంతా ఆయనకు తెలిపి ఆయన ఉదంతమంతా నేను తెలుసుకొన్నాను. ఆయన నాకంటె ఒకటి రెండేళ్ళు పెద్ద. ఆ సంవత్సరమే వివాహమైనదట. ఆయనది లాహోర్‌కు ఆవల వున్న గుజరన్‌వాలాజిల్లా. ఆ జిల్లా పేరు వినగానే నేను బాల్యంలోచదివిన స్వామీ రామతీర్థ గుర్తుకు వచ్చారు. రామతీర్థది గుజరన్‌వాలా జిల్లాలోని మురళీవాలా అనే గ్రామం. డాక్టర్ చోప్రా ప్రస్తుతం సుదూరానవున్న స్పిత్ ప్రాంతంలో వైద్యవృత్తి చేస్తున్నాడు.

మా బస్సు కొండలమీదుగా శరవేగంతో పోతున్నది. డాక్టర్ చోప్రా కొంతసేపు ఇంగ్లీషులోను, మరికొంతసేపు ఉర్దూలోను నాతో ప్రసంగించసాగాడు. మేము భోజనంవేళకు మండీ వచ్చిచేరాం. బస్సు ఇక్కడ చాలాసేపు ఆగుతుంది. దగ్గరేవున్న సిక్కుల హోటలులో పూరీలతో రేతాబుందీ అనే పచ్చడితో, బంగాళదుంపల కుర్మాతో మా భోజనం పూర్తి చేసుకొని మండీ బజార్లలో తిరగసాగాం.

ఆయనను ఎరిగినవాళ్ళు ఒకళ్ళిద్దరు కనుపించారు. వాళ్ళతో మాట్లాడుతూ వచ్చి బస్సు ఎక్కి కూర్చున్నాం. కాని బస్సు ఎంతసేపటికీ బయలుదేరదు. బస్సు డ్రైవర్ తన స్నేహితుని ఇంటికి విందుకు వెళ్ళాడట. ఇక్కడ విందులంటే సారాసీసాలను ఖాళీచేయడమే. డ్రైవరు విందునుంచి విపరీతమైన ఆలస్యంగా వచ్చారు. డ్రైవరు రాగానే డాక్టర్ చోప్రా అతనిని తిట్టసాగారు. డ్రైవరు త్రాగి వున్నందున డాక్టర్ మీదకు ఎదురు తిరిగాడు. దెబ్బలాటలోకి మారకుండా సమసి పోయింది.

బస్సు కదిలింది. ఆ వేగంచూచి, డ్రైవర్ త్రాగివున్నాడని తెలిసి బస్సు లోని ప్రయాణీకులు భయపడసాగారు, ఏమి ప్రమాదం సంభవిస్తుందోనని! మళ్ళీ దూరాన ధవలధార్ పర్వతపంక్తులు కనిపించసాగాయి. ఆ పర్వత పంక్తులను చూచేసరికి కొంతకాలం క్రిందట నాతో కలిసి రైలులో ప్రయాణం చేసిన కాత్యా యని గుర్తుకు రాసాగింది. కాత్యాయని ముఖాకృతీ, ఆమె నవ్వూ, ఆమె మాటలూ నన్ను కొంతసేపు మధురస్మృతులలోకి తీసుకువెళ్ళినాయి. సరే, ఆమె కనుపించ నప్పుడు ఆమెతోపాటు అప్పుడు కనుపించిన ధవలధార్ పర్వతమాల తిరిగి కను పిస్తూన్నందువల్ల ఆ పర్వతమాలను చూచి సంతృప్తి చెందసాగాను. ఆ పర్వత మాలను ఏకాగ్రతతో చూడడం చూచి డాక్టర్ చోప్రా ఎందుకలా చూస్తున్నారని అడిగితే నేను నవ్వి వూరుకొన్నాను.

సాయంత్రం ఆరుగంటలయింది. నగ్రోటా చేరుకోవలసిన బస్సు ఆ రాత్రికి పాలన్‌పూర్‌లో ఆగిపోయింది. డాక్టర్ చోప్రా మరొకసారి ఆ డ్రైవరును నెమ్మదిగా తిట్టుకొంటూ నన్ను వెంటపెట్టుకొని ఒక డాక్టర్ మిత్రుని ఇంటికి తీసుకుపోయాడు. నీ మిత్రునింటికి నీవు మాత్రమే పోయి అతిథిగా వుంటే మర్యాదగా వుంటుందికాని మళ్ళీ నీతోపాటు నీ మిత్రునికూడా ఆయనకు అతిథిగా తీసుకువెడితే ఆయన ఏమీ అనుకోకపోయినా ఆయనగారి శ్రీమతి ఏమైనా అను కొంటుంది తప్పక అన్నాను నేను. అందుకు డాక్టర్ చోప్రా అన్నాడు. ఆయనకు ఇంకా శ్రీమతి అంటూ ఎవరు లేరు, ఆయనకూడా నీ మాదిరే అని.

సరే, ఉభయులం ఆయన డాక్టర్ మిత్రుడైన కృష్ణన్నా ఇంటికి వెళ్ళాం. ఆయన ఇల్లు ఎత్తుమీదనుంచి లోయను చూస్తూ వుంది ఇంటిచుట్టూ మంచి పూల తోట వుంది. మమ్మల్ని చూచి ఆయన చాలా ఆనందించాడు. నాలో కొత్తదనాన్ని ఏమీ చూడలేదు. ఆయన చోప్రా మొదట ఎంత చనువు చూపాడో నాయెడల

కూడా అంత చనువు చూపాడు. నేను ఆయన మిత్రుడు మిత్రుడను కాను, స్వయంగా ఆయన మిత్రుడనే అన్నట్టు సంచరించాడు. నాకుకూడా అనిపించింది, ఆయన స్వయంగా నా మిత్రుడే అని. నేను కులూలోయలోని నికోలస్ రోరిక్ దగ్గర కొంతకాలం గడిపి వస్తున్నానని తెలిసి ఆయన ఎంతో ఆనందించాడు. ఆయన ఇంట వంటమనిషి మరొక పరిచారకుడూ తప్ప మరెవరూ లేరు. ఒక కొండ కుక్కమాత్రం వుంది. ఒక దక్షిణాదిమిత్రుడు ఆ రాత్రి తనకు అతిథిగా దొరకడం తనకెంతో ఆనందమైంది అన్నాడు. ఒకసారి ఆయన దక్షిణదేశం వెళ్ళడం జరిగిందట. మద్రాసు చూడలేదటకాని మైసూరు, బెంగుళూరు, ఉదక మండలం చూచాడట. ఉదకమండల ప్రాంతం ఇక్కడి హిమాలయ ప్రదేశం వలెనే వున్నందున అది తనకు స్వీయప్రదేశంగా వున్నదట. ఆ రాత్రి పూరీల తోనూ, వాటిలోకి మంచి మంచి కూరలతోను మేమంతా సలక్షణంగా భోజనాలు చేశాం. తరువాత ఆయనవద్ద వున్న హుక్కా పీలుస్తూ కూర్చున్నాం.

ఆ రాత్రంతా మేము చాలా పొద్దుపోయేవరకు మాట్లాడుతూనే పడుకున్నాం ఏయే ప్రాంతంలో వివాహాలు ఏవిధంగా జరుగుతాయి? గర్భాదానాలు ఏరూపంతో జరుగుతాయి? మొదలయిన సాంఘికాచారాలను గురించి, మరణించినపుడు ఏయే ప్రాంతాల్లో ప్రేతకర్మలు మొదలైనవి ఏవిధంగా జరుపుతారు? అనే విషయాలను గురించి ముచ్చటించుకొన్నాం. ఇటువంటివన్నీ ఆంధ్రలో ఏ విధంగా జరుగుతాయో నేను చెప్పాను. పంజాబ్‌లో ఏ విధంగా జరుగుతాయో డాక్టర్ చోప్రా చెప్పాడు. కాంగ్రా కొండల్లో ఏవిధంగా జరుగుతాయో డాక్టర్ ఖన్నా చెప్పాడు. ఈ మూడు ప్రాంతాల వివాహపద్ధతులను చూడగా ఆంధ్రలోను, పంజాబులోనుకంటె కాంగ్రా కొండలలోనే ఎక్కువ స్వేచ్ఛా వాతావరణం వున్నట్టు తట్టింది. కొండల ప్రాంతాలలో ఇష్టమొచ్చినవాళ్ళను వివాహం చేసుకోడంలో వధూవరుల తల్లిదండ్రులు అంతగా అడ్డురారు. ఉభయులకు ఇష్టం తప్పినప్పుడు ఒకరినొకరు సులభంగా వదలివేయవచ్చు కూడా. ఇటువంటి సాంఘికస్వేచ్ఛ ఇతర నాగరిక ప్రాంతాలతో చాలా తక్కువగా గోచరిస్తుంది.

డాక్టర్ ఖన్నా, నేను ఉభయులం అవివాహితులమే అయినందువల డాక్టర్ చోప్రాకంటె వివాహ విషయాలమీద మాకు ఆసక్తి ఎక్కువ. నేను అవివాహితుడుగా ఎందుకున్నానని నన్ను ఖన్నా అడిగాడు. అందుకు నేను ఏవో కొన్ని సాంస్కృతికమైన కారణాలు చెప్పాను. ఆయనను అదే విషయం నేనూ అడి

గామ. ఆయన అంటుకు కొన్ని కుటుంబ సంబంధమైన కారణాలు తెలిపాడు. చోప్రా ఎందుకు వివాహం చేసుకొన్నాడని అడిగితే జీవితంలో వివాహం విష యంలో ఎక్కువగా ఆలస్యం చేయడం మంచిదికాదని తాను వివాహం చేసు కొన్నట్లు చెప్పాడు ఆయన.

కులూ లోయలో ఉన్నంత తీవ్రమైన చలిలేదు ఈ కాంగ్రా లోయలో. అయినా ధవలధార పర్వతమాలలోని హిమశిఖరాల మూలంగా ఇక్కడకూడా ఒక మాదిరి చలి వేసింది.

డాక్టర్ ఖన్నా మమ్మల్లను రెండవరోజు కూడా వుండమని బలవంతం చేశాడు. కాని మేము చీకటితో అయిదుగంటలకే బయలుదేరి వెళ్ళి నిన్న వచ్చిన బస్సులో కూర్చున్నాం. ఇక్కడినుంచి నగ్రోటా వరకు రోడ్డు దిగుడుగా వున్నది. చలిగాలిలో పొగమంచులోగుండా ఉదయం ఎనిమిదిగంటల లోపే నగ్రోటా రైలు స్టేషన్ చేరుకున్నాం. పఠాన్‌కోట వెళ్ళే రైలుబండి సిద్ధంగా వుంది. ఇంతకాలానికి మళ్ళీ రైలుకూత వినిపించింది. ధవలధార్ పర్వతమాలను చూసుకొంటూ కాంగ్రా లోయ దృశ్యాలను తిలకిస్తూ పదకొండుగంటల ప్రాంతంలో పఠాన్‌కోట చేరుకొన్నాం.

పఠాన్‌కోటనుంచి ఎకాయెకీ లాహోర్ వెళ్ళే రైలుబండి సిద్ధంగా వుంది. మేము ఆ బండిలో వెళ్ళి కూర్చొని భోజనం రైలులోకే తెప్పించుకొని తిన్నాం. ఇద్దరమూ కూడా ఈ బండినుంచి లాహోర్‌లోనే దిగుతాం. ఆయన అక్కడ నుంచి మరొక బండిలో గుజరన్‌వాలా వెళ్ళిపోతాను. నేను లాహోర్‌లోనే వుండి పోతాను.

మళ్ళీ పంజాబ్ మైదానాలగుండా గుర్‌దాస్‌పూర్ మీదుగా ప్రయాణం సాగిస్తున్నాము. నేను కులూలోయకు పోతూన్న రోజుల్లో ఈ వుత్తర పంజాబ్ అంతా మాటజరవై డిగ్రీల వేడితో మాడిపోయింది. నేడు చల్లగా హాయిగావుంది. బటాలాలో బండి ఆగేవరకు ఆనాటి లాహోర్ మిత్రులు వనభోజనానికని ఇక్కడ దిగిపోవడం గుర్తువచ్చింది. ప్లాట్‌ఫారంమీద మళ్ళీ కలేపండ్లు మీగడతోను, ఉప్పు తోనూ అమ్ముతున్నారు. డాక్టర్ చోప్రాను అడిగాను ఈ పండ్లను ఎప్పుడైనా తిన్నావా అని. ఆయన వాటిని ఎప్పుడూ చూడలేదన్నాడు. ఆయనకు వాటిని రుచి చూపించాను. చాలా రుచిగా వున్నాయని వాటిని బాగా తినసాగాడు. బి. ఎస్. సి.

పరీక్షలో ఆయన తీసుకొన్నది వృక్షశాస్త్రమట. వృక్షశాస్త్ర విద్యార్థికి కలేపండ్ల సంగతి తెలియకపోవడం సిగ్గు కలిగించడంలేదా అంటే ఆయన నా వీపు చరిచాడు.

వృక్షశాస్త్రానికి సంబంధించిన తన అజ్ఞానాన్ని తొలగించి చూపాలని మా రైలు పొడుగునా కనబడే ప్రతి చెట్టుపేరూ చెప్పసాగాడు. నేను వృక్షశాస్త్ర విద్యార్థిని కాదు. నీవు చెప్పే ఆ వృక్షాల పేర్లన్నీ నిజమో, వట్టిదో నాకేమి తెలుస్తుంది అన్నాను. అయినా వాటి పేర్లను ఆయన చెప్పుకుపోతూనే వున్నాడు. ఇంతలో చీకటిపడిపోయింది. కొంతసేపటికి అమృత్‌సర్ వచ్చేసింది. ఆరోజు పగలు చూచిన అమృత్‌సర్ స్టేషన్‌కంటె నేడు రాత్రి చూచినది ఇంకా ఎక్కువ కళకళలాడుతూంది. ప్లాట్‌ఫారంమీది సిఖ్ఖులు గడ్డాలతో, తలపాగాలతో, రైలులోనే రాత్రి భోజనం ముగించుకున్నారు. రైలు రాత్రి పదిగంటలకుకాని లాహోర్ చేరుకోదు.

అమృత్‌సర్ నుంచి లాహోర్ వైపుకు పయనిస్తున్న స్థలమంతా నాకు కొత్త స్థలం. పంజాబ్‌లో పశ్చిమంగా పోతూంది రైలు. మేమున్న రైలులో పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతీయులు కూడా వున్నారు ఇద్దరు ముగ్గురు. వీరు లాహోర్‌లో దిగి పెషావర్ మెయిల్ ఎక్కుతారు. మరి ఒకరిద్దరు సింధు ప్రాంతీయులున్నారు. వీరు కరాచీ వెళ్ళే రైలు ఎక్కుతారు. లాహోర్‌లో దిగి మరొకరైలు ఎక్కకుండా వుండిపోయేది మా పెట్టెలో కూర్చున్నవాళ్ళలో నేనొక్కడినే మాత్రమే. ఈ ఆలోచన వచ్చేసరికి మనసుకు కొంచెం కష్టం అనిపించింది. నేనుకూడా ఈ సరిహద్దు రాష్ట్ర ప్రయాణీకులతో కలసి పెషావర్ మెయిల్ ఎక్కితే యెంత బాగుంటుందో అనిపించింది కాని కారణాంతరాలవల్ల లాహోర్‌లోనే ఆగిపోదలచాను. లాహోర్ స్టేషన్ వచ్చేసింది. డాక్టర్ చోప్రా నామంచి విడబడుతూ కంటతడి పెట్టాడు. ఇక నేను ఆయన ముఖంవైపు చూడజాలక పోయాను. ఆయన పోతున్నంతసేపు అటే చూస్తూ వుండిపోయాను. ఆయన వెనక్కు వెనక్కు తిరిగిచూస్తూ జనులమధ్య అదృశ్యమైపోయాడు.

# ఆగ్రా, లాహోర్ నగరాల విశేషాలు

లాహోర్ పంజాబ్‌కు ముఖ్యపట్టణమైన లాహోర్, ఒక విలక్షణమైన నగరం. అమృతసర్‌లో సిక్కుల సభ్యతా సంస్కృతుల ప్రాధాన్యత. ఈ నగరంలో అతి నవీనత్వం ఎంత వున్నదో అతి పురాతనత్వం కూడా అంత వున్నది. రావీనదీతీరాన వున్నదీ నగరం. లాహోర్‌లోది లిప్‌స్టిక్ నాగరికత అని అంటూంటారు ఈ ప్రాంతంలో. కారణం ఇక్కడి యువతులంతా పెదవులకు రంగు వేసుకొంటారు లిప్‌స్టిక్‌తో. స్త్రీవిద్య చాలా ఎక్కువ ఈ నగరంలో. రోడ్డుమీద స్త్రీల సైకిళ్ళసంఖ్య చాలా ఎక్కువగా వుంటుంది. పంజాబీ హిందూ స్త్రీలూ, సిక్కు స్త్రీలు కూడా మామూలుగా పల్లెలోనూ, పట్టణాలలోనూకూడా, లాగులనే ధరిస్తారు: కాని బాగా చదువుకొన్న స్త్రీలు మాత్రం చీరెలు ధరించివుండడం కనబడుతుంది.

అమృత్‌సర్‌లో రైలులో కలసి తిరుగు ప్రయాణంలో నన్ను తమ ఇంట లాహోర్‌లో ఉగమని గట్టిగా చెప్పిన లాహోర్ కార్పోరేషన్ డిప్యూటీ కమీషనర్ హిమ్మత్‌ఖాన్ ఇంట ఉగాను. ఆయన, ఆయన సతీమణి చాలా ఆదరించి, నారాకకు సంతోషించారు. వారిది అసలు ముల్తాన్ నగరం. ఉద్యోగరీత్యా లాహోర్‌లో వుంటున్నారు. వీరి వివాహం ఇటీవలనే జరిగింది. ఇంకా పిల్లలు కలగలేదు. కొందరికి వివాహమైన అనుమానాలకే భార్య ప్రసవిస్తుంది. ఈ పద్ధతి ఎక్కువగా ప్రేమించి పెళ్ళిచేసుకొన్న దంపతులలో గోచరిస్తుంది. ఇక్కడ ఖాన్ దంపతులు కూడా కాలేజీలో ప్రేమించి పెళ్ళి చేసుకొన్నవారే. కాని వీరికి ఆ పద్ధతి జరగలేదు: ఈ ముస్లిం దంపతుల ఆదరణమూలంగా లాహోర్‌లో వున్న సమయం ఎంతో ఆనందమయంగా గడచిపోయింది. నాతో వారికి వచ్చిన చిక్కు ఎక్కడం టే నాకు శాకాహారాలను తయారు చేయించవలసి వచ్చేది.

పాకిస్తాన్ నిర్మాణ విషయంలో కాంగ్రెసు నాయకులకు జిన్నాకు చర్చలు జరుగుతూ హిందూ ముస్లింల మధ్య చాలా వైమనస్యం ఏర్పడి వున్నది. ఈ లక్షణాలు పరోక్షంగా లాహోర్‌లో ప్రత్యక్షం కాజొచ్చాయి. రాజగోపాలాచారి పాకిస్తాన్ నిర్మాణానికి సుముఖత ప్రకటిస్తూండడం పంజాబ్‌లోని ముస్లిమేతరులకు ఆయనమీద చాలా వ్యతిరేకతను లేపింది. ఇక అంతర్జాతీయరంగంలో యుద్ధ విరామం ఏర్పడి, శాంతివాతా రణం ప్రవేశింపజొచ్చింది హిరోషిమాలో అమెరికన్లు వేసిన అణుబాంబు మూలంగా.

లాహోర్‌లో అనార్‌కలీ బజార్ ప్రఖ్యాతమైంది. సలీం ప్రేమించిన అనార్‌కలిని అక్బర్ సజీవసమాధి చేయించినప్పటికీ అనార్‌కలి పేరుమాత్రం లాహోర్‌లో ఈ అనార్‌కలి బజార్‌లో అమరంగా నిలిచిపోయింది।

విఖ్యాత చిత్రకారుడైన అబ్దుల్ రహమాన్ చుగ్‌తాయ్‌తో నాకు ఇదివరకే ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా పరిచయం వున్నందున ఒక సాయంత్రం లాహోర్‌లో ఆయన ఇంటికి వెళ్ళాను. నేను లాహోర్ వస్తూన్న విషయం ఆయనకు తెలియజేయనందువ ఆయన నన్ను చూచి చాలా ఆశ్చర్యపోయాడు. అనుకోకుండా నన్ను చూడగలిగినందుకు తనకు చాలా ఆనందమైన దన్నాడు. ఆయనవద్ద వున్న చిత్రాలను. ఇంకా ఇతర ఇరానీ చిత్రాలన్నీ చూపి అనేక విషయాలు ముచ్చటించాడు.

లాహోర్‌లో మూడురోజులు గడిపి నాలుగవరోజు సాయంత్రం ఢిల్లీ మెయిల్‌లో ఢిల్లీకి బయలుదేరాను. సాయంత్రం ఏడుగంటలకు లాహోర్‌లో బయలుదేరిన మెయిల్ అర్ధరాత్రికి భటిండా స్టేషన్‌లో ఆగిపోయింది. ఫస్టుక్లాసులో వున్న ఒక మిలిటరీ బ్రిగేడియర్ తన పెట్టెలో ఏవో వసతులు చెడిపోయినందున వాటన్నిటిని మరమ్మతు చేయనిదే రైలును కదలనీయనని మొండిపట్టు పట్టాడు. అవన్నీ మరమ్మతు చేయడంలో రెండుగంటల ఆలస్యం అయింది భటిండా స్టేషన్‌లో. రెండవరోజు ఉదయం ఢిల్లీ చేరుకొనేసరికి ఎనిమిదిగంటలైంది.

ఢిల్లీ నగరాన్ని ముందు చూడగానే అనిపించింది. పంజాబ్ రాజధాని అయిన లాహోర్‌కంటే భారత రాజధాని అయిన ఢిల్లీ ఏమంత బాగాలేదని. ఇదివరలో యు. పి. లో రాయ్‌బరేలీ కలెక్టర్ చేసిన ఎం. సి. రంధవా ఇప్పుడు ఢిల్లీలోని ఇంపీరియల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసర్చికి సెక్రటరీగా వుంటున్నాడు. నేను ఢిల్లీ ఏనాడు వచ్చేదీ ఆయనకుకూడాను తెలియపరచలేదు. ఆయన బంగళాకు వెళ్ళి చూస్తే అక్కడ ఎవరూ లేరు. తరువాత తెలిసింది, ఆయన సకుటుంబంగా కాశ్మీర్‌లోని గుల్‌మార్గ్ వెళ్ళాడని, ఇంకా పదిహేను రోజుల వరకు రాడనీ.

## నైరాశ్య దర్శనం

ఢిల్లీ రైల్వేస్టేషన్ దగ్గరి పార్కులో వున్న హోటల్ పార్క్‌వ్యూలో నేను బసచేశాను. ఢిల్లీలో నేను పెద్దగా చూడతగినవి ఏమీ కనుపించలేదు. ఢిల్లీ చాలా నీరసమైన ఎండు నగరంగా కనుపించింది. కుతుబ్‌మీనార్ మాత్రం పైదాకా ఎక్కి చూశాను. కొత్త ఢిల్లీకూడా నాకేమీ అంతగా నచ్చలేదు. ఆ సాయంత్రం

నాకు దగ్గరలో వున్న పార్కులో బహిరంగసభ. ఆ సభలో జవహర్‌లాల్ నెహ్రూ ప్రసంగం. జవహర్‌లాల్ నెహ్రూను నేను అదే మొదటిసారి చూడటం, అదే ఆఖరుసారి చూడటంకూడా. భారతదేశ స్వాతంత్ర్యాన్ని గురించి, పాకిస్తాన్ నిర్మాణ వ్యతిరేకతను గురించి హిందీలో ఉపన్యసించారు. అందులో నాకు క్రొత్త ఏమీ కనిపించలేదు. నిత్యమూ వార్తాపత్రికలలో కళ్ళతోచూచే విషయాలనే నేడు చెవులతో విన్నాను. నెహ్రూ ఉపన్యాసాలకంటె నెహ్రూయే బాగున్నారు అనిపించింది.

ఆ సాయంత్రమే సభలోనుంచి మధ్యలోనే లేచి వైస్రాయి భవనంవైపు, అసెంబ్లీ భవనాలవైపూ కొత్తఢిల్లీకి వెళ్ళాను. నాకుతోడు మాథుర్ అనే మరో స్నేహితుడు కలిశాడు హోటల్లో. అతనికి అలహాబాద్‌వైపు. నావలెనే తిరగ డానికి వచ్చాడు. వైస్రాయి భవనాన్ని బయట గేటు వద్దనుంచి మాత్రమే చూచాను. బయటికి అంత విశేషంగా ఏమీ కనుపించలేదు లోపల బాగుంటుందట. నేనూ, మాథుర్ కలసి రేపు ఆగ్రా వెళ్ళి తాజ్‌మహల్ చూచి రావాలని నిర్ణ యించాం.

నేనూ, మాథుర్ కలసి ఉదయం ఎనిమిది గంటల రైలులో ఢిల్లీనుంచి ఆగ్రాకు బయలుదేరాం. నూరుమైళ్ళు నాలుగు గంటలు పట్టింది. మధ్యలో శ్రీకృష్ణుని విహార స్థలమైన మధురానగరం తగిలింది, పశ్చిమ యు. పి. ప్రాంతమంతా ఏదో వింతుగా కన్పించసాగింది. మధ్యాహ్నం పన్నెండు గంటల ప్రాంతంలో ఆగ్రాలో రాజాకీమండీ స్టేషన్‌లో దిగాం. స్టేషన్ దగ్గరలో భోజనం ముగించుకొని యమునా నదీ తీరాన తాజ్‌మహల్‌కు చేరుకొన్నాం. తాజ్‌మహల్‌ను చూసిచూడగానే నాకు ఆశాభంగం కలిగింది. మూడు శతాబ్దాలుగా దేశ విదేశాలలో కీర్తిగానం చేయబడు తున్న తాజ్‌మహల్ ఇదేనా? షాజహాన్ చక్రవర్తి తన ప్రియతమ ముంతాజ్‌కు ప్రేమ చిహ్నంగా నిర్మించిన సుధాసౌధం ఇదేనా? అయివుండదు. దీని కావలగా మరొక భవనం వుండి వుంటుంది కాని అదే తాజ్‌మహల్ అని తేలిపోయింది. నాకు ఆశాభంగం తప్పలేదు. ఇంతగా తాజ్‌మహల్ నాలో ఆశాభంగాన్ని కలిగించ డానికి కారణం లేకపోలేదు. చిన్నప్పటినుంచీ తాజ్‌మహల్‌ను గురించి నేను నా మనసులో ఒక కల్పనా సౌధాన్ని నిర్మించుకొని వున్నాను. నేడు వాస్తవమైన తాజ్ మహల్ చూచేవరకు నేను చిన్నప్పటినుంచి మానసంలో నిర్మించుకొన్న కల్పనా తాజ్‌మహల్ విచ్ఛిన్నమైపోయింది. నా మనో జగత్తులోని తాజ్‌మహల్ ముందు ఈ వాస్తవ తాజ్‌మహల్ వెలవెలపోయింది.

ఇక్కడికి తాజ్‌మహల్‌ను చూడవచ్చిన వారందరికీ ఇటువంటి ఆశాభంగమే కలుగుతుందని నేను నమ్మను. కారణం అందరూ నావలెనే కల్పనాలోకంలో తమ స్వంత తాజ్‌మహల్‌లను నిర్మించుకొని దానితో ఈ వాస్తవ తాజ్‌మహల్‌ను కొలచి విలువలు కట్టరు. నా మిత్రుడు మాధుర్ తాజ్‌మహల్‌ను చూచి మహాప్రశంసించసాగాడు. నా ఆశాభంగాన్ని ఆయనకు వెల్లడిచేయలేదు నేను. నాలోనే నా ఆశాభంగాన్ని దిగమ్రింగినందున నా కళ్ళలో నీళ్ళు క్రమ్మినాయి. నా కన్నీరును చూచి మిత్రుడు మాధుర్ అవి ఆనందాశ్రువులని భ్రమచెందాడు. ఆయనను నేను మోసం చేస్తున్నానేమో అని బాధపడసాగాను. అయితే తాజ్‌మహల్ లోపలికి వెళ్ళి చూచినప్పుడు లోపలవున్న కొన్ని నగిషీ పనులు నన్ను ఆకర్షించకపోలేదు. అది వేరు సంగతి.

యుద్ధంరోజులు గడచి ఎక్కువకాలం కానందువల్ల విదేశీ సైనికులు అప్పటికింకా చాలామంది మనదేశంలో వుండిపోయారు. చాలామంది అమెరికన్, బ్రిటిష్, కెనెడియన్ సైనికులు, సైనికోద్యోగులుఖరీదైన కెమేరాలను భుజాలకు తగిలించుకొని వివిధ దృక్కోణాలనుంచి ఫొటోలు తీస్తున్నారు. తాజ్‌మహల్‌ను పైనా, క్రిందా ప్రక్కలా అంతా పరిశీలించివచ్చి ఆ తోటలోని శీతల తరుఛాయలలో విశ్రమించాం. ఆ తోటలోని కొన్ని వృక్షాల వయసు తాజ్‌మహల్ వయస్సుతో సమానం. ఆ వృద్ధ వృక్షఛాయలలో విశ్రమించి మరోసారి ఆ తాజ్‌మహల్ వైపుకు చూస్తుంటే అప్పటి బేగం ముంతాజ్‌మహల్‌కు, చక్రవర్తి షాజహాన్‌కు మధ్య విలసిల్లిన ప్రేమలు, ప్రణయాలూ, ఏ యే రూపాలలో ఎంత మధురంగా వుండేవో అని కల్పనా రూపాలు లేవ ప్రారంభించినాయి. నాటి చక్రవర్తులు ఎంత ప్రేమమయులో అంత క్రూరహృదయులుకూడా. రాజ్యం నిమిత్తం, స్త్రీ నిమిత్తం, స్వంత సోదరులను, కొడుకులను, తండ్రులను, ఎవరు తమ కార్య సాధనకు అడ్డం అనుకొంటే వారిని క్రూరంగా హత్య చేయించడానికి ఏ మాత్రం వెనుకాడేవారు కాదు. ఆనాటి మొగల్ చక్రవర్తులు అయిన వాళ్ళ హృదయాలలో కత్తులు గ్రుచ్చిన చేతులతోనే జవరాండ్ర హృదయసీమలపైన స్వప్న ందాన్ని సృష్టించడంలో తన్మయత పొందేవారు ఆనాటి పాలకులు. అంత కంటే ఇంకా ఎక్కువ ఆనందం పొందడానికి ఆ జవరాండ్రు కూడా అడ్డం అనుకొంటే వారిని కూడా రూపుమాపడానికి సంశయించని సిద్ధహస్తులు వారు!

సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో నేనూ, మాథుర్ కలిసి ఆగ్రా కోటకు వెళ్ళాం, ఎంతో విశాలమైన కోట. ఇందులో ఔరంగజేబ్ తన తండ్రి అయిన షాజహాన్‌ను బందీ చేసివుంచాడట. రెండు రోజులు తిరిగి చూసినాకూడా ఈ కోటను పూర్తిగా చూడటం పూర్తికాదు. ఇందులో ఒక చోట గోడలో ఒక విలువైన వజ్రం తాపడిడివుంటుంది. దానిలోకి చూస్తే దూరానవున్న తాజ్‌మహల్ ప్రతిబింబం ఆ రాయిలో కనిపిస్తూంటుంది.

మేము ఆగ్రా కోటలో అటు తిరిగి ఇటు తిరిగి చివరకు "ఫాంసిఘర్" అనే అప్పటి ఉరితీసే చోటుకు వచ్చాం. లోపలికి వెళ్ళి చూస్తే క్రిందికిదారి కనిపించింది. యమునా నది మట్టంవరకు దిగవచ్చునట. ఆ భూగృహంలోగుండా కొందరు అమెరికన్ సైనికులతో కలిసి మేముకూడా లోపల ఉరితీసే చోటుకు దిగసాగాం. ముందుగా ఒకరు కాగడా వెలిగించి మాకు దారి చూపుతున్నారు. లోపలికి దిగినకొద్దీ గబ్బిలాల పెంట వాసనతో కళ్ళు తిరిగిపోసాగినాయి. ఆ అంధకారం కాగడా వెలుగును కూడా మ్రింగిపారేస్తున్నది. మాకు ఊపిరాడటం లేదు. ఇది భూగృహం కాదు భూతగృహం అనిపించింది. ఇంతలో కాగడా ఆరిపోవటం కూడా జరిగింది. ఊపిరి సలపక ప్రాణాలు నిలవవనిపించింది. అమెరికన్ సైనికులలో ఒకరు (**Suffocating**) (ఊపిరి సలపడం లేదు) అంటూ పెద్దగా కేకపెట్టి అక్కడే స్పృహతప్పి పడిపోయాడు. మా అందరికి కూడా కొద్ది నిమిషాలలో అంతపని జరిగేదే. ఆ అమెరికన్ సైనికుని మోసుకొని మేమంతా వెనక్కు తిరిగి పైకి పరుగెత్తుకు వచ్చి ఊపిరి పీల్చుకొన్నాం. అమెరికన్ సైనికునికి తరువాత స్పృహ వచ్చింది.

ఆగ్రా కోటనుంచి ఆగ్రానగరం వీక్షిస్తూ బజార్లవెంట తిరుగుతూ రాత్రికి ఆగ్రా స్టేషన్ చేరుకొన్నాం, తిరిగి ఢిల్లీ వెళ్ళడానికి, ముంతాజ్, షాజహానుల ప్రణయ మాధుర్యాన్ని స్మరిస్తూ.

# కళా స్రష్టకు, కళా ద్రష్టకు తారతమ్యం

క్రుంబూనుంచి లాహోర్. లాహోర్‌నుంచి ఢిల్లీ, ఢిల్లీనుంచి ఆగ్రా. తరువాత తుమ్మపూడి. రెండవ ప్రపంచయుద్ధం 1945 లో అంతరించడంతో 1946 నాటికి ప్రపంచంలో కొంత శాంతి వాతావరణం ఏర్పడింది. అయినా ఆ శాంతి కాంతినివ్వగల శాంతి కాదు. ఇక అనేకాలైన నూతన పత్రికలు జన్మించసాగాయి. మదరాసు లలితకళల విద్యాలయానికి కొంతకాలం వైస్ ప్రిన్సిపాల్ చేసి తరువాత ప్రకాశంగారి మదరాసు రాష్ట్ర మంత్రివర్గం రోజులలో చేతి పరిశ్రమలకు డిప్యూటీ డైరెక్టర్‌గా వుంటున్న శ్రీ వి. ఆర్. చిత్రానుంచి ఒక ఉత్తరం వచ్చింది, "SILPI" అనే ఇంగ్లీషు మాసపత్రికను స్థాపిస్తున్నట్టు, దానిలోకి కళలగురించి వ్యాసం వ్రాసి పంపమనీ.

ఎవరూ వ్రాయమని ఆదేశించకుండా స్వయంగా, స్వేచ్ఛగా వ్రాసుకోడంలో ఆనందం వుంటుందికాని ఇతరులు ఎవరయినా వ్రాయమని ఆదేశించినపుడు ఆ వ్రాయడం అనేది ఏదో బరువుగా కనిపిస్తుంది. వి. ఆర్. చిత్రా వ్రాయమన్నప్పుడు కూడా అది వ్రాయడం బరువుగా తట్టింది. వ్రాయడమే కాదు, వ్రాయటానికి ప్రయత్నించటం కూడ బరువుగానే తట్టింది. ప్రయత్నించటమే కాదు, ప్రయత్నించే ఆలోచనలోకూడ హాయి కనిపించలేదు.

కళలగురించి కావాలట వ్యాసం. కళాతత్వాన్ని గురించి వ్రాయడమా, కళా సృష్టిని గురించి వ్రాయడమా, కళాకారుల గురించి వ్రాయడమా, కళాస్వాదన గురించి వ్రాయడమా అని ఆ రోజంతా ఆలోచించాను. ఒక నిర్ణయానికి వచ్చి ఏదో వ్రాయబూనేవరకు ఆ నిర్ణయించుకొన్న విషయం వెంటనే పాతబడపోయేది. దానితో మరొక నిర్ణయానికి వచ్చేవాణ్ణి. ప్రతి నిర్ణయమూ ఆ నిర్ణయం ముందు పరాజయం పొందేది. ఇదంతా చూస్తే అనిపించేది, నాది అసమర్ధ రచయితల లక్షణమా అని!

రెండవరోజు ఊరిబయటకు ఏకాంతంలో వెళ్ళి కాలవవడ్డున చెట్టు నీడలో కూర్చుని కాలవలో ప్రవహిస్తూన్న జలాలను చూస్తూ, జలాలమీద తేలిపోయే పడవలను చూస్తూ, పడవలమీద నీలాకాశంలో ఎగిరే తెల్లని తెరచాపలను చూస్తూ కొంచెంసేపు కూర్చుని నా వ్యాసం ప్రారంభించాను. ఇంటిలో కూర్చుని వ్రాయాలంటే కుదరదు. ఇంటిలోని గోడలు, పైకప్పు నా సృజనాత్మక ప్రతిభకు అడ్డం

విలచినట్టు అనిపించేవి. ముక్త ప్రకృతిలో కూర్చుంటే ఎంతో శక్తి సమకూడినట్టు తట్టేది. అనంతమైన నీలాకాశమంతా నా ప్రతిభయే ననిపించేది.

సరే, ఆ బకింగ్‌హాం కాలువగట్టున కూర్చుని వ్యాసం ప్రారంభించాను. ముందుగా వ్యాసం శీర్షికను గురించి కొంత చర్చించుకొని **"Creator and Connoisseur"** అనే శీర్షిక పెట్టాను. అంటే "కళాకృత్, కళావిత్" అని అర్థం. కళను సృష్టించేవాడు, కళను తెలుసుకొనేవాడు. మొదటి పేరాగ్రాఫ్ వ్రాశాను ఈ విధంగా.

**Some persons seek delight in creating works of art while others do in appreciating them. Creators are self-effulgent as the stars whereas the connoisseurs depend upon the creators like planets. Creator's joy lies in his synthetic conception while that of the connoisseur does in the analytical perception. Creator's is the vision whereas the connoisseur's is the revision, creator acts, connoisseur reacts.**

కొందరు వ్యక్తులు కళాకృతులను సృష్టించడంలో ఆనందాన్ని అన్వేషిస్తే, మరికొందరు వాటిని ఆస్వాదించడంలో. స్రష్టలు నక్షత్రాలవలె స్వయం ప్రకాశకులు, సహృదయులు గ్రహాలవలె స్రష్టలపైన ఆధారపడి వుంటారు. స్రష్టల ఆనందం తమ సంశ్లేషణాత్మక భావనలో ఇమిడివుంటే సహృదయులది తమ విశ్లేషణాత్మక గ్రహణంలో ఇమిడి వుంటుంది. స్రష్టలది దృష్టి. సహృదయులది పునర్దృష్టి; స్రష్టలది క్రియ, సహృదయులది ప్రతిక్రియ.

ఆ వ్యాసాన్ని ఈ విధంగా ముగించాను :

**The world of art is in eager expectation of a new age when every creator shall be a discriminating connoisseur and every connoisseur a dextrous creator.**

ప్రతి స్రష్టాకూడా వివేకంగల సహృదయుడూ, ప్రతి సహృదయుడూ కూడా నిపుణ స్రష్టా అయ్యే నవయుగం నిమిత్తం కళాజగత్తు ఆతురంగా నిరీక్షిస్తూంది.

వ్యాసం వ్రాసి పూర్తి చేసిన తరువాత హృదయం తేలికయిచ్చింది. ఆనందంతో కాగితాలను మడిచి చేతబట్టుకొని కనిపిస్తున్న వాటన్నిటినీ చూస్తూ, వివి

పిస్తున్న పాటన్నిటినీ వింటూ, పడవలవాళ్ళు పడవలలో చేసుకొంటున్న వంట వాసనలను పీలుస్తూ, నెమ్మదిగా సంతృప్తిగా ఇల్లు చేరుకొన్నాను. వ్యాసం పూర్తి చేయకుండా వచ్చినట్టయితే అంత సంతృప్తిగాను, సంతుష్టిగాను వుండేదికాదు మానసం.

ఇంటికొచ్చిన తరువాత వ్యాసాన్ని తీసి చదివి చూశాను. నామట్టుకు నాకు బాగానే నచ్చింది. అయితే నాకు నచ్చితే అది బాగున్నట్టా? నేను వ్రాసింది నాకు నచ్చడం సహజం. నాకునచ్చిన నా రచన ఇతరులకు కూడా నచ్చుతుందా? నచ్చనూ వచ్చు, నచ్చకపోనూ వచ్చు. తన రచనను తాను మమకారం లేకుండా, వస్తుగతా దృక్కోణంతో, ఇతరులు చూచినట్లు చూడడం నేర్చుకుంటేనే గాని తన లోపాలు తనకు తట్టవు. నేను నా రచనను ఇటువంటి నిర్లిప్తతతోనే చదివి చూచాను. దాని మీద నాకు నమ్మకం ఏర్పడింది. అంతటితో దాన్ని వి. అర్. చిత్రాకు పంపి **"SILPI"** ప్రథమ సంచిక నిమిత్తం నిరీక్షించసాగాను. నా వ్యాసం సంపాదకునికి నచ్చుతుందో లేదో అనే అనుమానంకూడా కలగసాగింది. త్రిప్పి పంపలేదు కనుక నచ్చినదనే నమ్మాను.

1946 ఆగస్టులో **"SILPI"** మొదటి సంచిక సర్వాంగ సుందరంగా వచ్చింది. నికోలస్ రోరిక్, అసిత్‌కుమార్ హాల్దార్, ఆనందకుమారస్వామి మొదలైన ప్రముఖుల రచనలున్నాయి అందులో. విచిత్రమేమంటే నా వ్యాసం **"Creator and Connoisseur"** అనే దాన్ని అన్నిటికంటె ముందు ముద్రించారు. అది చూచి నేను ఆశ్చర్యపోయాను. ఇందరు పెద్దల రచనలను వదలి నా రచనను ముందు ఎందుకని ముద్రించారా అని నేను ఆలోచించసాగాను.

క్రమేణ కొందరు కళాకారుల నుంచి రచయితలనుండి నా వ్యాసాన్ని ప్రశంసిస్తూ ఉత్తరాలు రాసాగినాయి. లక్నోలోని వైస్ ప్రిన్సిపాల్ బీరేశ్వర్ సేన్ నుంచి మొదటి ప్రశంసాలేఖ వచ్చింది. ఇవన్నీ చూచిన తరువాత నా రచనా పాటవంమీద నాకు విశ్వాసం ఏర్పడింది.

అమెరికాలోని శ్రీమతి సీనాఫాస్‌డిక్ అనే రచయిత్రికూడా నా వ్యాసం చదివి ఉత్తరం వ్రాసింది. అప్పటినుంచి ఆమెతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరగసాగినాయి. ఇటువంటి వాళ్ళనుంచి ఉత్తరాలు అందుకోడంలోను తిరిగి వారికి వ్రాయడంలోను ఎంతో ఆనందం కనిపించసాగింది. నా ఉత్తరప్రాంతపు ప్రయాణాల్లో కలసిన అనేకమంది మిత్రులనుంచి కూడా ఉత్తరాలు రాసాగాయి. మంచి

నుంచి విదేశీకవర్లు, ఆ కవర్లవంటి అందమైన కాయితాలు సేకరించడం వాటిమీద నా వద్దవున్న చిన్న హెమ్మరిప్ టైపు యంత్రంమీద సుందరంగా టైపుచేసి వాటిని స్వయంగా పోస్టుచేయడమూ ఒక సరదాగా ఏర్పడింది. కవర్లు కమనీయంగా వుండాలి. కవర్లలోని కాయితాలు కమనీయంగా వుండాలి; కాయితాలమీది అక్షరాలు కమనీయంగా వుండాలి; అక్షరాలు వ్యక్తపరచే భాష కమనీయంగా వుండాలి; భాష వ్యక్తపరచే భావాలు కమనీయంగా వుండాలని అభిలాష. అంతమాత్రమే చాలదు; ఈ ఉత్తరాలను అవతల అందుకునే వ్యక్తులుకూడా కమనీయంగా వుండాలి; ఇవతల వాటిని వ్రాసే వ్యక్తి కమనీయంగా వుండాలి. ఇన్ని కమనీయతలు ఏకమైనప్పుడు అదెంత గొప్ప కమనీయత అవుతుందో, కమనీయం కాని జీవితానికి జీవించే హక్కు లేకుండా వుండాలి!

తుమ్మపూడి దగ్గరలో వున్న రేవేంద్రపాడు అనే గ్రామంలో నవ్యభారతి అనే ఒక విద్యాలయం నడుస్తూంది నూతనంగా. అక్కడ చదవడానికి దూర దూరాలనుంచి కూడా విద్యార్థులు రాసాగారు. తుమ్మపూడి పోస్టాఫీసే అప్పుడు రేవేంద్రపాడుకు కూడా. నేను కాలవకట్టమీద కూర్చుని చదువుకొంటూ వుండే ఆ విద్యార్థులు తుమ్మపూడి పోస్టాఫీసుకు పోతూ, వస్తూ నాకు కనుపించేవాళ్ళు. వాళ్ళలో ఒక విద్యార్థి కొంచెం ఎర్రగా, సన్నగా, ఉంగరాల జుట్టుతో, పొడవైన ముక్కుతో, కొంచెం సిగ్గుతో నావైపు చూస్తూ పోతుండేవాడు. కాని పాపం నన్ను ఎన్నడూ పలకరించే సాహసం చేయలేకపోయాడు. ఒకరోజు నేను ఇంటి దగ్గర వుండగా వచ్చి నా వ్యాసాలను తాను చదివినట్టూ, అవి తనకెంతో నచ్చినట్టూ చెప్పి, తనపేరు దండమూడి మహీధర్ అని, ఇదివరలో హిందీ విద్యార్థినని, ఇప్పుడు రేవేంద్రపాడులోని నవ్యభారతిలో మెట్రిక్ చదువుతున్నట్టు చెప్పాడు, ఆడపిల్లలాగా ముఖంపెట్టి. చాలా సెన్సిటివ్ స్వభావం అని గుర్తించాను. తీరిక వున్నపుడల్లా వస్తూండమని చెప్పాను.

వీలున్నపుడల్లా వచ్చి కొంతసేపు నాతో వివిధ సాంస్కృతిక విషయాలను గురించి మాట్లాడి పోతుండేవాడు. బనారస్ మెట్రిక్ పరీక్ష వ్రాయడానికై కాశీ వెళ్ళి అక్కడనుంచి ఉత్తరాలు వ్రాయడం ప్రారంభించాడు. కాశీనుంచి నాకేమైనా తెచ్చిపెట్టాలని తన అభిలాష అని. కనుక నాకే వస్తువులమీద ప్రీతి వున్నదో వ్రాయమన్నాడు. నేను వ్రాశాను, "నాకు అనేక వస్తువులమీద ప్రీతి అని, స్నేహమూ, సౌహార్దతా, కరుణా, సానుభూతి, విశ్వప్రేమా, రసదృష్టి మొదలైనవి కనుక నీవు కాశీనుంచి నా నిమిత్తం తీసుకురావలసిన వస్తువులివి." ఈ ఉత్తరం

అందుకొని మహీధర్ తిరిగి నాకు వ్రాశాడు. "మీరు చెప్పిన వస్తువులు కాశీలో దొరకవు. అవి మీ దగ్గర మాత్రమే దొరకగలవు."

స్నేహమూ, సౌహార్దతా, ఎంత శ్రావ్యమైన పదాలు; పదాలు మాత్రమే శ్రావ్యంగా కొన్ని వుండి, విషయం మాత్రం కటువుగా వుంటుంది. కాని స్నేహమూ, సౌహార్దతా అనే వాటిలోని పదాలు ఎంత ఉత్తమంగా వున్నాయో విషయాలు కూడా అంత ఉత్తమమైనవే. స్నేహం ఇద్దరు పరాయివ్యక్తులను పరిచితులుగా చేసి వారి మధ్య పరస్పర ఆత్మీయతను వృద్ధిపరచేది స్నేహం. నిజమైన స్నేహం మానవజాతిలో వృద్ధిచెందితే ప్రపంచంలో యుద్ధాలుండాల్సిన అవసరాలే వుండవు. స్నేహం, ఎటువంటి స్నేహం వుండాలి? సౌహార్దతతో నిండిన స్నేహం వుండాలి. సౌహార్దత అంటే మంచి హృదయం అని అర్థం. కనుక మంచి హృదయంతో నిండిన స్నేహం వుండాలి. సౌహార్దం లేని స్నేహం వ్యాపారసంబంధం వంటిది, స్నేహంలేని సౌహార్దత ఊహాగానం వంటిది.

సంచారజీవితాన్ని తాత్కాలికంగా ముగించుకొని తిరిగి ఇంటివద్ద సాంస్కృతిక సాధనలో నిమగ్నం అయి కాలం గడుపుతున్నాను. ఇంటిపెద్దలు నా వివాహ విషయంలో వత్తిడి పెడుతున్నారు. ఎవరెవరో తమ అమ్మాయిలను చేసుకోమని రాయబారాలు జరుపుతున్నారు. తాత్కాలిక సమాధానాలేవో చెప్పి తాత్కాలికంగా తప్పుకొంటున్నాను. వివాహం అసలు మానుకోవడమా అని నేనే స్వయంగా తేల్చుకోలేకుండా వున్నాను. అసలు జీవితాన్ని ఏ నిర్ణీత రూపంలో జీవింపచేయాలనే విధానం ఇంతవరకూ తేల్చుకోవడంలో సఫలత చిక్కలేదు. చదవడాలు, వ్రాయడాలు, సంచారాలు, ఉపన్యాసాలు వీటితోనే ఆనందించడం నేర్చుకొంటే సరిపోదు అనే సత్యం మాత్రం తెలుసుకొన్నాను.

రవీంద్రుడు రచించిన బెంగాలీ నాటకం "చిరకుమార సభ" అనేదాన్ని చదవసాగాను. ఇది ఒకవిధమైన ప్రహసనం. అవివాహితులుగా వుంటామని దీక్ష పూనిన విద్యార్థులను గురించిన వ్యంగ్యరచన ఇది. కొందరు యువకులు అవివాహితులుగా వుండిపోవాలని దీక్షపూని ఒక సంఘంగా ఏర్పడి చివరకు కొందరు అమ్మాయిల ప్రేరణకు లొంగిపోయి వాళ్ళను వివాహాలు చేసుకొంటారు. ఇందులో కొన్ని పాత్రలతో నాకు పోలిక వున్నట్టు గ్రహించి నాలో నేను నవ్వుకొన్నాను.

# కళాప్రయోజనంపై విభిన్నవాదాలు

**1946** అక్టోబర్ ప్రాంతంలో ఒక అపరిచిత వ్యక్తి నుంచి ఒక స్నేహంతో కూడిన ఉత్తరం. ఆయన రచించిన పుస్తకం **"By the Candle Light"** అనేది పోస్టులో వచ్చాయి. ఆయన పేరు ఆర్. ఎస్. ఫోంటే. పోర్చుగీస్ వ్యక్తి. పరిచిత వ్యక్తివలె ఎంతో ప్రేమతో ఉత్తరం వ్రాశాడు. తీరా చూస్తే ఆయన నికోలస్ రోరిక్ మిత్రులలో ఒకరు. ఆ సంబంధాన్ని పురస్కరించుకొని నాకు ఉత్తరం వ్రాసి, తన పుస్తకం కూడా పంపాడు. ఆయన పోర్చుగీస్ భాషలో మంచి రచయిత. ఇంగ్లీషులో కూడా బాగా రచించగలడు. అప్పుడు ఆయన పోర్చుగల్ నుంచి వచ్చి గోవాలో ఒక పత్రిక నడుపుతున్నాడు. నన్ను గోవా రమ్మని కూడా వ్రాశాడు.

ఫోంటేకు నేను జవాబు వ్రాస్తూ బ్రిటిష్‌వారు మా దేశం వదలి పోబోతున్నారు కాని మీ పోర్చుగీసులు మాత్రం మా దేశంలోనే ఒక భాగమైన గోవాను మాత్రం వదలి పోనట్టున్నారు అని వ్రాశాను. అందుకు ఆయన తిరిగి వ్రాస్తూ తాను సామ్రాజ్యవాదిని కానని, గోవాలో పోర్చుగీసుల పాలనకు తాను ప్రతికూలుడనే అని, తాను జన్మరీత్యా పోర్చుగీసు అయినప్పటికీ పోర్చుగీసువారు చేసే అక్రమచర్యలను తాను సమర్థించజాలనని, తాను జాతీయవాదికాదు అంతర్జాతీయ వాదినని, ఏమేమో వ్రాశాడు. అది చదివితే నాకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆయన విశాలభావాలకు, విశ్వజనీనతకు, మానవతాశీలతకు నేను జోహార్లర్పించాను.

ఆయనతో ఉత్తరాలద్వారా మైత్రి ఘనీభవించింది. ఒకరి ఆంతర్యం మరొకరికి వ్రాసుకోసాగాం. ఒకరి జీవితంలోని వెలుగునీడలు మరొకరికి తెలుపుకో ప్రారంభించాం. మా ఘనీభావం చివరకు ఎంతవరకు వచ్చినదంటే మా ఉభయులమూ జంట రచయితలుగా వ్యవహరించాలని నిశ్చయించుకొన్నాం. అంటే నేను ఏ రచన చేసినాకూడా నా పేరుకుతోడు ఆయన పేరుకూడా వుంచడం, ఆయన ఏ రచన చేసినా కూడా ఆయన పేరుకుతోడు నా పేరునుకూడా వుంచటం అని. కాని ఈ సంకల్పం కార్యరూపం తాల్చలేదు.

ఆ రోజులలో కలకత్తానుంచి **"Dawn of India"** అనే ఇంగ్లీషు మాసపత్రిక ఒకటి నడుస్తుండేది. దానిలో నెలనెలా ఒక పేజీకి సరిపోను ఏవో

చెదిరిన ఆలోచనలు వ్రాయడానికి అంగీకరించాను. శీర్షిక **"Flickers of the Flame"** (దీపశిఖలు) పెట్టాను. మొదటిదానిలో ఈ విధంగా వ్రాశాను.

సంగీతంలో లయ, నర్తనలో లయ, చిత్రలేఖనలో లయ, ఇవన్నీ నాదానికి, గతికి, రూపానికి పూర్ణతను ప్రసాదిస్తాయి. లయ అనేది అపశ్రుతులపాలిటి శ్రుతి, లయ అనేది అసమతలకు భారసామ్యం, లయ అనేది విశ్వసృష్టికి సంరక్షణ శీలం. లయ అనేది కళాసృష్టికి ప్రధానసూత్రం. కాని, లయ అనేది జీవితంలో గొప్ప ప్రాణశక్తి. మానవ అస్తిత్వంలోని భేదాలను మోదాలలోకి రూపాంతర పరుస్తుంది జీవనలయ. శిలలనుంచి, తరువులనుంచి, జంతువులనుంచి మానవుని వేరుచేసి చూపుతుంది లయ. మానవుని శారీరక, మానసిక వ్యాపారాలకు లాలిత్యాన్ని ప్రసాదిస్తుంది లయ.

ఈ విధంగా చాలానెలలు వివిధ విషయాలమీద **"Dawn of India"**లో వ్రాశాను. అదే పత్రికలోని ఒక సంచికలో పద్మం గురించి ఒక చిన్న వ్యాసం వ్రాశాను. తామరతీగ జన్మించడం బురదలో జన్మిస్తుందని, కాని బురదకు వ్యతిరేకంగా దాని పూవు ఎంతో నిర్మలంగా, మృదువుగా, పరిమళంగా బురదకు అతీతంగా వికసించి ప్రకాశిస్తుందని. జన్మస్థానానికి భిన్నంగా ఉన్నతంగా రూపొందటం దాని విశేషగుణమని, ఏమేమో వ్రాశాను. అందుకే బౌద్ధంలో ధర్మానికి తామరపూవు పేరు జోడించారు. "సద్ధర్మ పుండరీక"మని. మన సాహిత్యంలోకూడా తామరపూవు పేరును విరివిగా వాడారు. పద్మాసనం, ముఖకమలం, పాదపద్మం. హృదయకమలం, కమలలోచనాలు, ఈ విధంగా ఎన్నో **"Dawn of India"** లోని నా ఈ రచన **"Lotus Song"** అనేది చాలామంది పాఠకులకు నచ్చింది.

తిరిగి **"SILPI"** లో నాది మరొక వ్యాసం **"Art qua Art"** అనేది వెలువడింది. కళను అనేక విధాలుగా ఉపయోగించుకోవచ్చు. చారిత్రకంగా, మతరూపేణ, కావ్యచిత్రణగా ఈ విధంగా అనేక ప్రయోజనాల నిమిత్తం కళ సృష్టిచబడవచ్చు. కాని, కళ రసానందం నిమిత్తం సృష్టించబడితే అది ఉత్తమ కళ కాని, మిగతా ప్రయోజనాల నిమిత్తం సృష్టించబడితే అది ప్రచారక కళ మాత్రమే అవుతుంది, కాని ఉత్తమ కళ మాత్రంకాదు. కళ నిమిత్తమే కళ అంటూ వ్రాశాను ఈ విధంగా వ్రాశాను;

తాను చిత్రించే విషయ వస్తువుమీద కళ విలువ ఆధారపడి వుంటుందా? ఈ సమస్య చిత్రకారుల, శిల్పుల మానసాలను మాత్రమేకాక సాహితీపరుల, గాయకుల, నర్తకుల మనసాలనుకూడా కలవర పెడుతూంది. కళలోని అన్ని విభా

గాలూ - గీచేవి, చెక్కేవి, సాహితీ పరమైనవి, వర్తక సంబంధమైనవి - నేడు ఈ క్లిష్టమైన సమస్యను ఎదుర్కొని వున్నాయి. కళాసృష్టిలో విషయ వస్తువులోని శుద్ధత్వానికీ, మహత్వానికీ ప్రాధాన్యం ఇవ్వాలనే వారిని నైతిక కళావాదులని హేళన చేయడమూ, కళలో రూపానికి, నిర్మాణ కౌశలానికి ప్రాధాన్యం ఇవ్వాలనే వారిని కళ నిమిత్తమే కళావాదులని అపహాస్యం చేయడమూ జరుగుతూ వస్తుంది.

## "ఆంధ్ర శిల్పి"

ఆంగ్లంలో మాత్రమే నా రచనలు వెలువడడం చూచి కొందరు మిత్రులు నన్ను తెలుగులో కూడా వ్రాయమని సలహా లివ్వసాగారు. దానికి తోడు ఇంగ్లీషు **SILPI** సహచారిగా తెలుగులో కూడా "ఆంధ్ర శిల్పి" అనే పత్రికను స్థాపించి పిలకా గణపతిశాస్త్రి గారిని దానికి సంపాదకులుగా ఏర్పరిచారు. చిత్రాగారు, గణపతిశాస్త్రిగారు ఉత్తరాలు వ్రాయసాగారు. "ఆంధ్ర శిల్పి" కి కూడా వ్యాసాలు పంపమని. అంతటితో తెలుగులో కూడా రచనలు సాగించాను.

"ఆంధ్ర శిల్పి" లో నేను రచించిన వ్యాసాలలోకల్లా దీర్ఘమైన వ్యాసం "ఆధునిక శిల్పం — అంతర్జాతీయత" అనేది. అందులో ఈ విధంగా వ్రాశాను.

"విశ్వ సృష్టిలో స్పష్టంగా గోచరించే శాశ్వత సత్యం పరివర్తన. పరివర్తన గతి శీలం. జీవలక్షణం గతిశీలం. కనుక పరివర్తన జీవలక్షణం. ఈ పరివర్తన ఇతర జీవులలో కంటె మానవులలోనే అధికతరం. కారణం, మానవులలో ఇతర జీవులలోకంటె బుద్ధి అనే వస్తువొకటి బలంగా పనిచేస్తుంది. బుద్ధి బాగా పనిచేస్తూం దంటే తన కుపకరించేవేవో, అపకరించేవేవో, అనగా ఏది మంచి ఏది చెడు అనే విషయాలలో వివేకం కనపరచి అనుకూల విషయాలను తీసుకొనడం, ప్రతికూలాలను వదలి వేయడం. ఈ విధంగా మానవ చరిత్రంతా ఒక పెద్ద పరివర్తన. ఈ పరివర్తనే పరిణామ సిద్ధాంతానికి అసలు పంథా".

సంజీవదేవ్ మాతృభాషలో వ్రాయకుండా ఇంగ్లీషులో మాత్రమే వ్రాస్తున్నాడు అనే మచ్చను తొలగించుకొన్నాను తెలుగులో రచనలను ప్రారంభించి. ఇంగ్లీషులో వ్రాయకపోయినా తెలుగులో వ్రాస్తూంటే ఎవరూ ఏమీ నిందించరు. కాని తెలుగులో వ్రాయకుండా ఇంగ్లీషులో వ్రాస్తుంటే మాత్రం నింద తప్పదు. నిందిస్తారని మంచి పనిగా భావించినదాన్ని మార్చుకోడం తప్పుకాదు. తెలుగులో వ్రాయకపోవటం నా దృష్టిలో కూడ అంతమంచి పనిగా తట్టనందున తెలుగులో ప్రారంభించాను.

భారత దేశాన్ని పాకిస్తాన్‌గాను, హిందూస్తాన్‌గాను విడదీయాలనే ఒక వర్గపు నిర్ణయం ముదిరి వెర్రితలలు వేసి బెంగాల్‌లోను, పంజాబ్‌లోను మతం పేర ఉభయ వర్గాలలోను రక్తపాతం ప్రారంభించింది. నిత్యమూ పత్రికలలో భరించజాలని దారుణ కృత్యాలు వినరావడం ప్రారంభించినాయి. స్త్రీలూ, పిల్లలూ, వృద్ధులూ, యువకులు మొదలైన ఎందరో నిరపరాధులు నిత్యం చిత్రహింస చేసి చంపబడుతున్నారు, మతం అనేది మానవజాతికి ఒక ఘోర కళంకంగా ఏర్పడి పోయింది. మతం అనేది మానవజాతికి కొంత మేలు చేసిన మాట నిజమే. కాని మేలుకంటె కీడు ఎక్కువ చేసినమాట మాత్రం అంత కంటె ఎక్కువ నిజం. మతం మానవావళిలో విశ్వప్రేమగా ప్రవహిస్తే గొప్పదేకాని రక్తదాహాన్ని కలిగించి తన తోటి మానవుడు తన శత్రువుగా తయారయే విధంగా చేస్తేమాత్రం తుచ్ఛమైంది అవుతుంది. ఇది మతం తప్పుకాదు. మతాన్ని ఉపయోగించు కొంటూన్న మనుషుల తప్పు మాత్రమే అని కొందరంటారు. ఒక విధంగా ఇదీ నిజమే అనిపిస్తుంది. నేటి భౌతిక విజ్ఞానంకూడా అంతే, మనుషులు దాన్ని ఉపయోగించుకొనే పద్ధతినిబట్టి అది మంచిదిగానో చెడ్డదిగానో మారుతుంది.

ఏది ఏమైనా ప్రపంచ చరిత్రలో మేలు కంటె కీడే ఎక్కువ చేసింది మతం. అందులో ప్రత్యేకించి మతంలోని బాహ్యరూపాన్ని మాత్రమే ఆరాధిస్తూ అసలైన అంతర్భాగాన్ని నిర్లక్ష్యపరచే మతమూఢుల ద్వారా ఎంతగానో కీడు వాటిల్లింది లోకానికి. 1946 లో భారత దేశానికి ఇటువంటి ఆపదయే సంప్రాప్తమైంది. కరుణ, ప్రేమ, సానుభూతి అనే పదాలు నిఘంటువు నుంచి తీసివేసే తరుణం వచ్చింది. భయాందోళనలు సాగాయి. కరుణ, ప్రేమ, సానుభూతి అనేవి నిఘంటువులో లేకుండా పోయినా కూడా పరవాలేదు కాని అవి మానవుల హృదయాలలో లేకుండా పోతే మాత్రం విశ్వమంతా అంధకార మయమైపోతుంది.

భారత దేశానికి స్వాతంత్ర్యం దొరకాలంటే పాకిస్తాన్ ఉద్భవించాలని బ్రిటిష్‌వారి పట్టుదల కూడా. మరి పాకిస్తాన్ ఆవిర్భవించాలంటే హత్యల ద్వారా కాని ఆవిర్భవించదని ఒక వర్గంవారి భావన. కనుక హింసాకాండ లేనిది పాకిస్తాన్ లేదు. పాకిస్తాన్ లేని భారత స్వాతంత్ర్యం లేదు. అంటే భారత స్వాతంత్ర్యం అంటే హింసాకాండ అన్నమాట. అటువంటప్పుడు హింసాయుతమైన స్వాతంత్ర్యానికంటె హింసలేని బానిసత్వమే ఉత్తమమా అనే ఆలోచన రాక మానదు. స్వాతంత్ర్యంలో చచ్చేదినములు బానిసత్వంలో బ్రతికుండడం మేలా? కాని ఏ ఆత్మాభిమానంగల వ్యక్తికూడా అందు కంగీకరించదు. బానిసత్వంలో

బ్రతికి వుండేదానికంటె స్వాతంత్ర్యంలో చావటమే మేలు అనే విశ్వసిస్తాను. చచ్చి అయినా స్వాతంత్ర్యాన్ని కాపాడాలి కాని బ్రతికి అయినా బానిసత్వాన్ని వుంచరాదు అవి.

సరే, దూర దూరపు మిత్రులనుంచి ఎన్నో హృదయ విదారకమైన ఉత్తరాలు వస్తున్నాయి. ఈ హత్యాకాండను గురించి, తాము చూచినవీ, విన్నవీకూడా చూడజాలనీ, వినజాలనీ విషయాలు.

తెలుగు, ఇంగ్లీషు "శిల్పి"లో మాత్రమే కాక అలహాబాద్‌నుంచి వెలువడే **"Twentieth Century"** లోను, పాట్నానుంచి వెలువడే **"Hindustan Review"** లోనూ నా ఆంగ్లరచనలు వెలువడినాయి. దేశం బాధలలో వున్నప్పుడు అటువంటి విషయాలను గురించి మాత్రమే వ్రాయాలికాని కళలను గురించి, రసానుభూతులను గురించి వ్రాయడం సబబు కాదని కొందరు నన్ను ఎత్తిపొడిచారు. కాని నా జవాబేమంటే దేశం బాధలలో వున్నప్పుడే ఇటువంటి బాధలేని విషయాలను గురించి వ్రాస్తే దేశీయులబాధ కొంత తగ్గగలదని.

# రసదృష్టిలేని ఆధునిక మానవజీవితం

**1946** వ సంవత్సరం నవంబర్ **"Silpi"** లో నా వ్యాసం **"Aesthetic Vision"** అనేది వెలువడింది. బాహ్యరూపాలలోని సౌందర్యాన్ని ఆనందించాలంటే మానవునిలో రసదృష్టి వుండాలి అంటూ వ్రాశాను ఈ వ్యాసంలో.

**Every day appear the rosy sunrise in the eastern horizon and the crimson sun-set in the western horizon. But how many persons could behold these glowing horizons every day with rapturous eyes? only a few. Every month makes her appearance the new crescent moon, delicate and sky like a native bride, on the vesper sky. But how many do care to cast a passing glance at her ? Only a limited few. Every year comes the autumn morning with dew drops on the grass glistening in iridescent glow under the transparent azure sky, provoking in the sensitive hearts, aesthetic vibrations of the Far Beyond. But how many do enjoy this ? A few only. Why this negligence? Is it due to lack of leisure from daily duties? No, it is due to lack of aesthetic vision.**

నిత్యం వెలువడతాయి పూర్వ దిగంతంలో గులాబీ సూర్యోదయం పశ్చిమ దిగంతంలో సింధూర సూర్యాస్తమయం, కాని ఈ దీప్తివంత దిగంతాలను ఎందరు తన్మయదృష్టితో తిలకిస్తారు? కొందరు మాత్రమే. ప్రతినెలా, నెలవంక ముగ్ధ వధువు వలె మృదువుగా, సిగ్గుగా సాంధ్యాకాశంమీద ప్రత్యక్షమవుతుంది. కాని ఎందరు దానివైపు ఒక్క కటాక్షమైనా ప్రసరించే శ్రద్ధ కనపరుస్తారు ? కొందరు మాత్రమే. ప్రతిసంవత్సరం శారద ప్రభాతం ప్రత్యక్షమవుతుంది. గడ్డి మొలకల పైన ఇంద్రధను కాంతులతో ధగధగలాడే హిమబిందువులతో, శారద నీలాకాశం క్రింద ఈ మెరుస్తూన్న రంగుల హిమకణాలు సున్నిత హృదయాలలో నిజంగా అనంతపు ఆనంద ప్రకంపనలను రేకెత్తిస్తాయి. కాని ఈ శారద దృశ్యాన్ని తిలకించి ఎందరు ఆనందిస్తున్నారు? కొందరు మాత్రమే. ఎందుకని ఈ నిర్లక్ష్యం? దైనందిన కార్యకలాపాలనుంచి తీరిక లేకనా? కాదు, రసదృష్టి లోపించినందునే.

ఈ వ్యాసం వెలువడ్డ తరువాత కొందరు సహృదయుల దగ్గరనుంచి ఉత్తరాలు రాసాగినాయి. వీటిలో ఒకటి సింగపూర్‌నుంచి వచ్చింది. ఆయన పేరు దురై రాజసింగం. ఆయన డాక్టర్ ఆనందకుమారస్వామి అనుయాయి. వ్యాసాన్ని ప్రశంసిస్తూ ఉత్తరం వ్రాసి తాను ఆనందకుమారస్వామిని గురించి ప్రకటించబోతున్న సంచికకు ఒక వ్యాసం వ్రాసి పంపమని అడిగారు. వెంటనే నేనొక వ్యాసం వ్రాసి దాన్ని ఆయనకు పంపాను. అందులో ఆనందకుమారస్వామి పాశ్చాత్యదేశాలలో వుండి ప్రాచ్యదేశాల కళలకు, అందులోను ప్రత్యేకించి భారతీయ కళలకు చేసిన అమోఘమైన సేవను గురించి వ్రాశాను.

**"SILPI"** లోని **"Aesthetic Vision"** చదివి 1947 జనవరిలో రాజమండ్రినుంచి ఇద్దరు సంతకాలు చేసిన ఉత్తరం ఒకటి వచ్చింది. ఆ సంతకాలు చేసినవారు ఆంధ్రలో భరత నాట్యంలో ప్రసిద్ధి చెందుతున్న బి. వి. నరసింహారావుగారు, సుప్రఖ్యాత చిత్రకారులైన వరదా వెంకటరత్నంగారు. ఒకరి రచనలను ప్రశంసించడంలో మామూలుగా వాడే పదప్రయోగం మాత్రమే కాక ఆ ఉత్తరంలో ఎంతో ఆత్మీయతను వ్యక్తపరచే పదజాలం కూడా వుంది. నేను ఇంటివద్ద వుండే తేదీని తెలియపరిస్తే బి. వి. నరసింహారావుగారు తుమ్మపూడి వచ్చి చూచి వెడతామని కూడా వ్రాశారు. అంతటితో నేను జవాబు వ్రాస్తూ ఆయన ఏ తేదీన వచ్చినా కూడా నేను ఇంటివద్దనే వుంటానని తెలియజేశాను.

నేను జవాబు వ్రాసిన నాలుగవరోజు ఒక మధ్యాహ్నం ఒక సన్నని వ్యక్తి కొంచెం నారీ లాలిత్యంగల ముఖముద్రతో ప్రత్యక్షం. బి. వి. నరసింహారావుగారి ఖ్యాతి విన్నానే కాని ఆయనను కాని, ఆయన నాట్యప్రదర్శనాన్ని కాని చూచి ఎరుగను. ఆయనపేరు ఆంధ్ర దేశమంతటా తెలుసు. నా పేరు ఆంధ్రదేశమంతటా తెలియదు. అయితే ఆంధ్రదేశమంతటా తెలిసిన వ్యక్తి ఆంధ్రదేశమంతటా తెలియని వ్యక్తిని చూడడానికి వచ్చినప్పుడు ఆ అజ్ఞాత వ్యక్తి పేరు కూడా అందరికీ తెలిసినట్టేనేమో అని నేను నరసింహారావుగారితో అంటే ఆయన పెద్దగా నవ్వసాగారు.

చిత్రకారుణ్ణి మీ చిత్రాలు చూపించమని అడిగితే చూపించగలడు; కవిని తన కవితలు వినిపించమని అడిగితే వినిపించగలడు; గాయకుణ్ణి గానం వినిపించమంటే వినిపించగలడు. కాని నాట్యశిల్పిని తన నాట్యం చూపమంటే మాత్రం చూపజాలడు. అందుకు బోలెడంత హంగు కావాలి. ప్రయత్నం కావాలి. ఇంకా ఏమేమో కావాలి. అందుకే నరసింహారావుగారిని తమ నాట్యం చూపమని అడగ

లేకపోయాను. ఆయన రచించిన కొన్ని గేయాలను మాత్రం పాడి వినిపించారు. ఏమి మాటాడుతున్నా, ఏమి పాడుతున్నా కూడా ఆయన మాటలో, పాటలో ఆటయే గోచరిస్తుంది.

రెండురోజులు నరసింహారావుగారితో ఆనందంగా గడిచింది. మూడవరోజు ఉభయులమూ బయలుదేరి బెజవాడ వెళ్ళి చేతికి దెబ్బతగిలి మంచంలోవున్న బెజవాడ కాలేజీ ప్రిన్సిపాల్ డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచారి గారిని చూశాం. మేము శ్రీనివాసాచారిగారింటికి వెళ్ళేసరికి తెల్లని ఖద్దరు బట్టలతో ఒక పచ్చనివ్యక్తి మా కంటె వయసులో చాలా పెద్దవారు, కూర్చుని మాట్లాడుతున్నారు. శ్రీనివాసాచారి గారు మాకు పరిచయం చేశారు. ఆయన గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారట. రచనలు చేస్తారట. అంతటితో గొర్రెపాటి తాము రచించిన చిన్న పుస్తకం "హంపీ పిలుపు" అనేదాన్ని చిరునవ్వుతో ఇచ్చారు. అదివరకే కాంతివంతంగా వున్న వెంకటసుబ్బయ్యగారి ముఖం చిరునవ్వుతో ఇంకా ఎక్కువ కాంతివంతమైంది.

తెలుగు ప్రముఖులతో క్రమేణ పరిచయం పెంపొందసాగింది. బెంగాలీ, ఇంగ్లీషు, హిందీ భాషలలో మాత్రమేకాక, తెలుగులోకూడ క్రమేణ ఉత్తరాలు రాసాగినాయి. బి. వి. నరసింహరావుగారు. గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు, తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు మొదలైన వారినుంచి ఉత్తరాలు రాసాగాయి.

ఒకరోజు దండమూడి మహీధర్‌నుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంలో గుంటూరులో ఇంటర్‌మీడియట్ చదువుతూన్న అన్నపూర్ణ అనే ఒక అమ్మాయిని పరిచయంచేస్తూ వ్రాశాడు ఆమె నా వ్యాసాలను చదువుతూందనీ. సాహిత్యమంటే ఆమెకు ఇష్టమని, ఆమె భర్త విశాఖపట్నంలో ఎం. బి. బి. యస్. చదువుతున్నారని వ్రాశాడు. తరువాత కొద్దిరోజులకు అన్నపూర్ణనుంచి మొదటి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరాన్నిబట్టి ఆమె చాలా తెలివైన అమ్మాయి అనీ, బాగా పుస్తకాలు చదివిన అమ్మాయి అని తెలుసుకొన్నాను. తిరిగి నేను జవాబులు వ్రాయసాగాను. మా ఉభయుల ఉత్తర ప్రత్యుత్తరాలలో అనేక విషయాలు, కవులూ, కవితలు, నవలలూ, నవలాకారులూ, చిత్రాలూ, చిత్రకారులూ, నాట్యాలూ, నాట్యకారులు ఈ విధంగా మోటారుకారులు మొదలు పటాకులు వరకు ఏదీ విడువబడేది కాదు. మా పరిచయం ఉత్తరాలతో మాత్రమే ఆగక ముఖాముఖిగా పరస్పర సందర్శనం వరకు వచ్చింది. గుంటూరు వచ్చి పొమ్మని అన్నపూర్ణ పదే పదే వ్రాయడంతో, వెళ్ళి చూడాలనే అభిలాష నాలో రేకెత్తడంతో ఒక రోజు గుంటూరు వెళ్ళాను.

ఎక్కడికైనా ప్రయాణానికి బయలుదేరే సమయాన ఇంటివద్ద పెంపుడు తల్లి అయిన రాజ్యలక్ష్మమ్మగారి మంగళహారతులు తప్పేవికావు. వివాహానికి సుముఖునిగా లేనని ఆమెగారి అసలు కోపం. కోడలు వుండి వుంటే వస్తుతః ఆమెలోని కోపమంతా కోడలుమీద చూపకలిగేది. కాని కోడలు లేనందున ఆమె లోని కోపాన్నంతా నామీదే చూపుతూండేది. సధవలకంటె విధవలకు కోప మెక్కువనేది మనోవైజ్ఞానిక సత్యం. ఆమె మంగళహారతులు మ్రోగుతూనే వుండేవి. నా కార్యక్రమాలు సాగుతూనే వుండేవి. ఆమె మంగళహారతులకు నా కార్యక్రమాలు అడ్డుపడేవి కావు. నా కార్యక్రమాలకు ఆమె మంగళహారతులు ఆటంకాలుగా వుండేవికావు. వేటి త్రోవ వాటిదే.

నేను గుంటూరులో దిగేసరికి గుంటూరులో వుంటూన్న దండమూడి మహీధర్ నన్ను కలుసుకొని అన్నపూర్ణ ఇంటికి తీసుకువెళ్ళారు. గుంటూరు నాకు చాలా అపరిచితం. బాల్యంలో చూడడం తప్ప మళ్ళీ గుంటూరును ఎప్పుడుచూచి ఎరుగను, బెజవాడ అలవాటయిన కళ్ళకు గుంటూరు కొంత మార్పుగా కనిపించ సాగింది. నగరం విశాలంగా వున్నట్టు నగరవాసులు వడుదుడుకులుగా లేనట్టు తట్ట సాగింది. అన్నపూర్ణ ఇంటికి వెళ్ళేసరికి ఆమె నా రాకను నిరీక్షిస్తూంది. పరోక్ష పరిచయం ప్రత్యక్ష పరిచయంలోకి మారింది. ఆమె ఉత్తరాలలో ప్రత్యక్షమైనట్టే ఆమె ముఖంలోకూడా తెలివితేటలు ప్రత్యక్షమయినాయి. ఇంటర్‌లో ఉత్తీర్ణు రాలయిన తరువాత తానుకూడా తన భర్తవలె ఎం. బి. బి. యస్. చదవాలని ఆమె ఆశయం. ఆమె చెల్లెలు వసుంధర పాఠశాలలో చదువుతూంది.

మహీధర్, అన్నపూర్ణా, నేనూ ఎన్నో విషయాలను చర్చించుకొంటూ కాలం గడిపాం. ఏవేవో ఫలహారాలు, పానీయాలు మొదలయినవి సేవిస్తూ సాహిత్యగోష్ఠితో కాలం గడిపాం. ఫలహారం అనేది తెలుగుదేశంలో ఫలాలు కాని ఆహారానికే ఎక్కువగా వాడబడుతూంది. వడలు, ఆవడలు, బోండాలు, బజ్జీలు, ఉప్మా, ఇడ్లీ, దోసె, మిఠాయిలు- మొదలైన వాటన్నిటినీ తెలుగుదేశంలో ఫలహారమనే అంటున్నారు. ఫలహారమంటే ఫలాలులేని ఆహారమని అర్థం కాబోలు. కాని అన్నపూర్ణ అందించిన ఫలహారం మాత్రం నూటికి నూరువంతులా ఫలాహారమే!

ఆరోజు సాయంత్రం మహీధర్ నన్ను వెంటబెట్టుకు వెళ్ళి గుంటూరు అంతా త్రిప్పి చూపించాడు. బెజవాడకంటె గుంటూరు చాలా బాగున్నట్లు అని

పించింది. గుంటూరు బజార్లలో చుట్టూవున్న పల్లెటూళ్ళ ప్రజలు ఎక్కువ కని పిస్తారు. అందువల్ల అదొక ప్రత్యేకంగా కనిపిస్తుంది.

ఆ రాత్రి ప్రొద్దుపోయేవరకూ అన్నపూర్ణ ఇంటివద్ద మేము సంభాషణలు సాగిస్తూనే వున్నాం. అన్నపూర్ణను చూచానుకాని ఆమె భర్త రాఘవయ్యగారిని కూడా చూడాలనిపించింది. ఇద్దరిలో ఎవరు ఎక్కువ మంచివారయివుంటారో అనే కుతూహలం ఏర్పడసాగింది. ఆ రెండవరోజే ఆయన గుంటూరు వస్తాడని తెలి సింది. ఆ విధంగానే ఆయన వచ్చాడు. విశాఖపట్నంలో ఎం. బి. బి. యస్. మూడవ సంవత్సరం చదువుతున్నాడు. అన్నపూర్ణకంటె కొంత మందంగా వున్నాడు. కాని మనసుమాత్రం కొంత పలచని మనసే. అన్నపూర్ణకు నేను వ్రాసే ఉత్తరాలద్వారా నన్నుగురించి ఆయన ఇదివరకే వినివున్నాడు. వినివున్న మనిషి కనుపించేసరికి ఆయన చాలా సంతోషించాడు. ఆయనకు కూడా లలిత విషయాలంటే చాలా ఇష్టం. ఆయన అందరు విద్యార్థులవలె చదవడమేకాక చది విన దాన్ని గురించి ఎంతో స్వతంత్రంగా ఆలోచిస్తాడు. ఈయన రోగులకు బాగా ఉపయోగపడగలడని ఊహించాను. ఆ రోజు మధ్యాహ్నం బయలుదేరి గుంటూరు నుంచి వచ్చాను.

క్రొత్త కొత్త వ్యక్తులనుంచి ఉత్తరాలు రాసాగాయి. శాంతినికేతనంలో చిత్రకళను అభ్యసిస్తూన్న జి. వి. సుబ్బారావు నుంచి ఉత్తరాలు, చిన్న చిన్న రేఖా చిత్రాలూ వేస్తుండేవాడు. జి. వి. సుబ్బారావు పెద్ద ఉత్తరాలు వ్రాయగలిగేవాడు కాదు. ఆయన అన్న వెంకటేశ్వరరావుగారు మాత్రం పెద్దఉత్తరాలు వ్రాసేవారు. జి. వి. సుబ్బారావు శాంతినికేతనంలో నందలాల్ బోసుకు చాలా ఇష్టమైన విద్యార్థి. సుబ్బారావు ప్రతిభగల వ్యక్తే కాని కష్టపడి పనిచేయడం అనేదిమాత్రం ఆయన స్వభావానికి కొంత దూరం. కొందరి భావాలు, స్వభావాలు ఎంతో ఉన్న తంగా వుంటాయి. కాని కష్టపడి పనిచేయనందున కొందరిలో అవి వికసించవు. కాని జి. వి. సుబ్బారావు విషయంలో మాత్రం ఈ సత్యం వర్తించలేదు.

# కళారంగం కోల్పోయిన రెండు వటవృక్షాలు

దాస్యం అనేది అన్నిటికంటె అయిష్టమైన బాధ. దాస్యం అనేది స్వాతంత్ర్యానికి వ్యతిరేకం కనుక ప్రతి జీవికూడా తన ఇష్టప్రకారం జీవించడానికే ఇష్టపడుతుంది కాని ఇతరుల ఇష్టప్రకారం జీవించడానికి ఇష్టపడదు. ముఖ్యంగా మానవుడు తన స్వీయభావాలకు, స్వభావాలకు, ఆశలకు, ఆశయాలకు అనుకూలంగా జీవించాలని అభిలషిస్తాడు. ఆరాటపడతాడు. అయితే ఈ స్వాతంత్ర్యకాంక్షను ప్రభుత్వమూ, సమాజమూ కొంత అదుపులో పెడుతూ వుంటాయి. లేనిచో స్వాతంత్ర్యమనేది వెర్రితలలు వేస్తుంది. వాక్స్వాతంత్ర్యం వున్నదని అనవసరంగా ఇతరులను తిట్టటం, కార్య స్వాతంత్ర్యం వున్నదని ఇతరులను కొట్టటం మొదలైనవాటన్నిటినీ అదుపులోకి తేకుండా వదలివేస్తే అవి దాస్యానికంటె దుష్పరిణామాలను తెస్తాయి.

ఏమైనా, స్వాతంత్ర్యం అనేది మహత్తర వస్తువు. అన్నిటికంటె మించింది వ్యక్తి స్వాతంత్ర్యమైనా కూడా దేశస్వాతంత్ర్యం కూడా తక్కువది కాదు. ఈ దేశ స్వాతంత్ర్యానికే మరొక పేరు స్వరాజ్యం. కొందరి వాదనప్రకారం మనకు కావలసింది సురాజ్యమే కాని స్వరాజ్యం కాదని. బ్రిటిషు ప్రభుత్వంక్రింద దేశం మంచి పరిపాలనలో వుండి సుభిక్షంగా వుంటే అది సురాజ్యం అవుతుంది. స్వరాజ్యంలో సురాజ్యం లేనప్పుడు ఈ స్వరాజ్యానికంటె సురాజ్యమైన పర రాజ్యమే మేలు అని. స్వరాజ్యం కూడా సురాజ్యంగానే వుంటే స్వరాజ్యమే మేలు అనే దానిలో సందేహం లేదు.

1947 లో అనేక ప్రత్యక్షమైన పరోక్షమైన కారణాలవల్ల బ్రిటిష్‌వారు భారతదేశానికి స్వరాజ్యం ఇచ్చారు. భారతదేశం తిరిగి ఎంతకాలానికో బానిసత్వం నుంచి బయటపడింది. బానిసత్వంనుంచి బయటపడిందేకాని బీదతనంనుంచి బయటపడలేదు. బానిసత్వమూ, బీదతనమూ కలిసే వుంటాయా? అయితే ధనికత్వమూ స్వాతంత్ర్యం కలిసివుంటాయా? కాదు. ఇందుకు వ్యతిరేకతలు కూడా వుంటాయి. బానిసత్వమూ ధనికత్వం కలిసివున్న దేశాలున్నాయి. స్వాతంత్ర్యము, బీదతనము కలిసివున్న దేశాలు వున్నాయి. బానిసత్వంలో బీదదేశమైన భారతదేశం స్వరాజ్యంలో ధనవంతం కాగలదని.

ఈ దేశ స్వాతంత్ర్య సమారోహంలో దేశం కొన్నాళ్ళపాటు ఉత్సవాలు చేసుకొంది. దేశంలోని చీకటి పోయినట్టూ కాంతి ప్రవేశించినట్టు సమ్మర్దం జరి

గింది. కోట్ల ప్రజలు ఇక ఇప్పటినుంచి నిత్యమూ దీపావళియేనని భావించసాగారు. కొందరు ఈ స్వాతంత్ర్యాన్ని హేళన చేయసాగారు. వెక్కిరించసాగారు.

అదివరకునుంచి నడుస్తూన్న సాంస్కృతిక జీవితంలో ఈ నూతన స్వాతంత్ర్యంద్వారా నూతనంగా మార్పులేమీ రాలేదు. వి. ఆర్. చిత్రా నడుపు తూన్న **"Silpi"** నిరాటంకంగా నడుస్తూనే వుంది. అందులో నా రచనలు వెలు వడుతూనే వున్నాయి. దూరప్రాచ్య చిత్రకళమీద చిత్రకారులమీద నాకు ప్రీతి హెచ్చుజొచ్చింది. ఆ రంగంలో కొంత కృషి చేయసాగాను. హిరోషిగే అనే జపాను ప్రకృతి చిత్రకారుని గురించి **"Silpi"** లో నాదొక వ్యాసం వెలువడింది. అందులో ఇలా వ్రాశాను.

"మానవజీవితపు పవిత్రాశయాలలో ఒకటి ప్రకృతిని జయించడం, భౌతిక సత్తాను మానవజాతికి సేవచేసేలాగా వినియోగించడం, మనను చుట్టిముట్టివున్న దేశకాలాలను అతిక్రమించడం అయివుంది. ఇటువంటి నిరంతర సాధనాప్రవృత్తి స్మరణాతీత కాలంనుంచి సృష్టిలో ప్రవహిస్తూ వస్తూవున్నప్పటికీ మానవుడింత వరకు ప్రకృతిని సంపూర్ణంగా జయించలేకపోయినాడు. అసలు ప్రకృతిని చిన్న చూపు చూడడంవల్ల కాని, లేక నిర్లక్ష్యపరచడంద్వారా కాని మానవుడు ప్రకృతిని జయించలేడు. అందుకనే సర్వకాలాలలోని ద్రష్టలూ ప్రకృతిని గౌరవించడం లోను, ఆరాధించడంలోను ఆనందాన్ని సంపాదించారు. ప్రకృతిని ద్వేషించటం ద్వారాకాక ప్రకృతిని ప్రేమించటం ద్వారా మాత్రమే దాన్ని జయించగలమని వారంతా సమగ్రంగా తెలుసుకోగలిగారు. ప్రకృతిని ఆదరించడం, ఆరాధించడం, దాన్ని జయించడానికీ, అతిక్రమించడానికీ సులభమైన కిటుకు. దృశ్య ప్రపంచపు సౌందర్యం అపార్థివ సత్యంలోని అదృశ్యశోభను వ్యక్తపరచే సత్తా కలిగివుంది.

హిరోషిగే పద్దెనిమిది పందొమ్మిది శతాబ్దాలలో జీవించివున్న గొప్ప ప్రకృతి చిత్రకారుడు. ప్రకృతిలోని రసమయావస్థలను సృష్టించడంలో ఆయన సిద్ధహస్తుడు. మంచు, వర్షం, చంద్రుడు, ఇవి ఆయన ప్రత్యేక అభిమాన విష యాలు. ఆయన కుంచెతో చిత్రించిన చిత్రాలనుకాక వర్ణముద్రణ **(Colour Print)** విధానంలోనే తన చిత్రసాధన అధికంగా సాగించాడు. హిరోషిగే చిత్రా లలో ఏకాంత ప్రకృతికాక ప్రకృతిలో మానవమూర్తులను కూడా సృష్టిస్తాడు. ప్రకృతి మానవసమాజం నుంచి వేరుగాను, ప్రకృతినుంచి మానవసమాజం వేరు గాను వుండరాదని ఆయన పూర్తి అభిమతం. అందుకే తన చిత్రాలలో

హిరోషిగే ప్రకృతికీ, మానవులకు ఒక సమన్వయం ఏర్పరచాడు. ఆయన రంగుల కాంతులు మృదువుగా వుంటాయి.

1947 లో ఇద్దరు మహావ్యక్తులు సంస్కృతి రంగానికి సంబంధించినవారు మరణించారు. ఇద్దరుకూడా నాకెంతో అభిమానపాత్రులు. ఒకరు విశ్వవిఖ్యాత కళాసమీక్షకులైన డాక్టర్ ఆనంద కెంటిష్ కుమారస్వామి. ఆయన అమెరికాలో మరణించారు. రెండవవారు జగత్ ప్రసిద్ధులైన కళాకారులు నికోలస్ రోరిక్. మొదటివారితో నాకు ప్రత్యక్ష పరిచయంలేదు; ఆయనను గురించి నేను మలయాలోని ఒక సంచికలో వ్రాసిన వ్యాసాన్ని ఆయన చూచి ఆనందించారు. ఇక రెండవవారితో నా సంబంధం అవినాభావ సంబంధం.

1947 డిసెంబర్‌లో నికోలస్ రోరిక్ 74 వ జన్మదినం. ఆ సందర్భంలో ఆయనకు జన్మదిన అభివందనలు తెలుపుతూ నేను కొన్ని చమత్కారమైన మాటలు వ్రాశాను. 1947 లో 74 వ జన్మదినం రావడం విచిత్రంగా ఉన్నదని, 47 అనే అంకెలను త్రిప్పితే 74 అవుతుందని కనుక ఆ సంవత్సరం రోరిక్ జీవితంలో ఏదో అసాధారణ సంఘటనను తెస్తుందని వ్రాశాను. ఈ చమత్కారాన్ని ఆయన ఆనందించి నాకు తిరిగి వ్రాస్తూ తమకు 47 ను త్రిప్పితే 74 అవుతుందనే సత్యం ఇదివరలో తట్టలేదని, నా ఉత్తరం ద్వారా ఆ సత్యాన్ని తెలుసుకొని తామంతా చాలా ఆనందించామనీ తెలియజేశారు.

## రోరిక్ స్మృతి

ఆ సంవత్సరం డిసెంబర్‌లోనే ఒకరోజు అకస్మాత్తుగా టెలిగ్రాంవచ్చింది. నికోలస్ రోరిక్ ఇకలేడు అంటూ ఆయన పెద్దకొడుకు డాక్టర్ జార్జి రోరిక్ ఇచ్చిన టెలిగ్రాం అది. ఆ టెలిగ్రాం చూచుకొని చాలా బాధపడ్డాను.

కాని ఎక్కువగా బాధపడే అలవాటుకు బానిసకాకుండా వుండే అభ్యాసం చేసుకొన్న నేను త్వరలోనే బాధపడడం మానేసి మామూలు మానసికస్థితిని అందుకొన్నాను.

ఒకరోజు ఒక పార్సెల్ వచ్చింది. పోస్టులో దానిమీద మదాం హెలీనా రోరిక్ పంపినట్టు పేరున్నది. విప్పి చూస్తే అందులో నికోలస్ రోరిక్ చిత్రించిన "గంగానది మూలం" అనే విలువైన చిత్రం వున్నది. ఈ చిత్రాన్ని చూపుతూనే వెనక నికోలస్ రోరిక్ అన్నాడు **"This Painting awaits your wedding"** అని. ఈ చిత్రాన్ని నా వివాహ సమయాన నాకు బహూకరించాలని ఆయన

ఆకాంక్ష. కాని ఆయన అభిలాష తీరలేదు. ఆయన జీవించివుండగా నేను వివాహం చేసుకోలేదు. ఆయన మరణిస్తూ ఆ చిత్రాన్ని నాకు పంపమని చెప్పినారట. అందుకే ఆయన సతీమణి దాన్ని నాకు పంపింది.

రోరిక్ మరణించినందుకు విచారం, ఆ చిత్రం అందినందుకు ఆనందం, ఈ మిశ్రమ అనుభూతులు నన్ను ఆవహించినాయి. ఆయనతో నేను గడిపిన మధురక్షణాలు ప్రతిక్షణం గుర్తురాసాగాయి. నా జీవితంలో ఎంతో గొప్ప అండ పోయినట్టు గ్రహించాను. ప్రపంచమంతా ఆయన స్మృతికి సంతాప సభలు జరిపారు.

రోజులు గడచిపోతున్నాయి. మళ్ళీ నా రచనలలో, నా ఆలోచనలలో నేను తల దాచుకొన్నాను. అప్పుడపుడు రోరిక్ చిత్రం "గంగానది మూలం" అనేదాన్ని బయటికి తీసి చూస్తూ విషాదంతో కూడిన ఆనందాన్ని అనుభవించేవాణ్ణి.

భారతదేశ స్వాతంత్ర్యాన్ని తెచ్చిన 1947, డాక్టర్ ఆనంద కుమారస్వామి, నికోలస్ రోరిక్‌ల మరణాలను తెచ్చిన 1947 అంతరించి 1948 ప్రవేశించింది. జనవరి నెల పొట్టి పగళ్ళతోను, పొడుగు రాత్రులతోను చల్లని నీడలతోను, తెల్లని ఎండతోను అదొక రమ్యంగా వుంటుంది. ఒకరోజు మద్రాసునుంచి ఒక ఉత్తరం వచ్చింది. అది లక్నో లలితకళాశాల ప్రిన్సిపాల్ అసిత్‌కుమార్ హాల్దార్ నుంచి. ఆయన మద్రాసువచ్చి రాజా రామస్వామి మొదలియార్ ఇంటి అతిధిగా వుంటూన్నట్టు, నన్ను మద్రాసువచ్చి తనతో కొన్నాళ్ళు గడిపిపొమ్మని, రామస్వామి మొదలియార్ మనుమడు అయిన రామకృష్ణ ప్రత్యేకంగా నాకు వ్రాయగలడని వ్రాశారు. ఆ మరునటి రోజే రామస్వామి మొదలియార్ మనుమడు అయిన రామకృష్ణనుంచి టెలిగ్రాం వచ్చింది నన్ను వెంటనే బయలుదేరి మద్రాసు రమ్మని, ఏ బండిలో వచ్చేదీ మళ్ళీ టెలిగ్రాం ద్వారా తెలియజేయమని. నేను ఫలాని బండిలో వస్తున్నట్టు వెంటనే టెలిగ్రాం పంపి మద్రాసు చేరుకొన్నాను రెండవ రోజు మెయిలులో.

నేను మద్రాసులో సెంట్రల్ స్టేషన్‌లో దిగేసరికి ప్లాట్‌ఫారంమీద అసిత్ కుమార్ హాల్దార్‌తో సహా మరి ఇద్దరు యువకులున్నారు. ఆ ఇద్దరు యువకులు నాకు అపరిచితులు. అసిత్‌కుమార్ హాల్దార్ వారిద్దరిని నాకు పరిచయం చేశారు. ఒకరు తన అతిధేయులైన రామకృష్ణ అవి, మరొకరు రామకృష్ణకు మిత్రుడైన

డాక్టర్ రాజన్ అని. నా రాకకు రామకృష్ణ చాలా ఆనందించాడు. వారంతా నా నిమిత్తం స్టేషన్‌కు వచ్చినందుకు నేనుకూడా ఆనందాన్ని తెలిపాను.

నా సామానునూ మమ్మూ కారులో ఎక్కించుకొని రామకృష్ణ తన సౌధానికి తీసుకువెళ్ళాడు. మద్రాసును నా బాల్యంలో చూడడమే, మళ్ళీ ఎప్పుడూ చూడడం పడలేదు. బజారులను చూస్తుంటే బాల్యంలోని స్మృతులు మేల్కొనసాగాయి. ఉత్తరదేశపు నగరాలను వీక్షించిన కన్నులకు మద్రాసు నగరం ఎంతో హాయిగా తట్టసాగింది. మద్రాసులోని సముద్రతీరానికి, అడయారుకు వెంటనే వెళ్ళి వాటిని మళ్ళి చూచి ఆనందించాలనే ఆరాటం కలగసాగింది. నేను వెనక అడయారు వెళ్ళినపుడు డాక్టర్ అనిబిసెంట్ జీవించి వున్నది. నేడు ఆమె లేదుగదా అని విచారం వేసింది. జిడ్డు కృష్ణమూర్తి కూడా అడయారులో వుండడు. ఆయన అడయారుతోనూ, థియొసాఫికల్ సొసైటీతోనూ సంబంధాలను తెంచివేసుకొని స్వతంత్ర జీవిగా, ప్రపంచ పౌరుడుగా, పైనున్న ఆకాశమూ, క్రిందవున్న భూమీ మొత్తం తనదే అన్నట్లుగా అనంతస్వేచ్ఛతో మహామానవుడుగా జీవిస్తున్నాడు.

# దారితప్పిన మిత్రునిలో పరివర్తన

మద్రాసులో రాజా రామస్వామి మొదలియార్‌గారి సౌధం ఒక గొప్ప కళా భవనం. స్వర్గీయ రామస్వామి మొదలియార్ గొప్ప ధనికులు. ధనికులైనంత మాత్రాన గొప్ప వ్యక్తులు కానిమాట నిజమే. ధనానికి తోడు కొందరిలో చెడ్డ గుణాలుంటాయి. మరికొందరిలో మంచి గుణాలుంటాయి. రామస్వామి మొదలియార్ ధనికుడైనప్పటికి ఆయనలో ఎన్నో మంచి గుణాలున్నాయి. దాతృత్వం, కళాపోషణ ఇవి ప్రధాన సుగుణాలు ఆయనలో. ఎందరో చిత్రకారుల చిత్రాలు కొని వారిని పోషించాడు. ప్రత్యేకించి అసిత్‌కుమార్ హాల్దార్‌కు ఆయన అన్ని విధాలా ఎంతో తోడ్పడ్డాడు. రామస్వామి మొదలియార్ సౌధంలో ఎందరో విఖ్యాత చిత్రకారుల చిత్రశాల వుంది.

ఆయనకు మొగపిల్లలు లేనందువల్ల తనకూతురుకూమారుడైన రామకృష్ణను దత్తు చేసుకొని చనిపోయినాడు. ఆ రామకృష్ణకు అతిథిగా అసిత్‌కుమార్ హాల్దార్‌తో కలసి నేను వారి సౌధంలో వుండసాగాను. రామకృష్ణ నవయువకుడు, ఆంగ్ల విద్య నభ్యసించినవాడు. స్నేహశీలి, కాని, శోచనీయమైన విషయం ఏమంటే యౌవన దశలో ధనం చేతికివస్తే ఏయే దురభ్యాసాలూ, భోగలాలస ఏర్పడతాయో అవన్నీ రామకృష్ణలో ఏర్పడ్డాయి. అయినప్పటికి ఆయన మంచివాడుగానే భావించబడు తున్నాడు. అసిత్‌కుమార్ హాల్దార్ అంటే తన తాతగారైన రామస్వామి మొదలియార్‌కు ఎంత శ్రద్ధ వుండేదో రామకృష్ణకు అంత శ్రద్ధ. అందుకే హాల్దార్‌ను లక్నోనుంచి రప్పించి తన ఇంట వుంచి హాల్దార్‌కు మిత్రుడైన నన్ను కూడా రప్పించి ఆనందించసాగాడు. రామకృష్ణ, అందరు దుర్వ్యసనాల మనుషుల కున్నట్టు ఆయనలో కూడా త్వరత్వరగా మారిపోయే మూడ్సు వున్నాయి. మనిషిలో ఈ మూడ్సు ఎక్కువగా వుంటే ఇటువంటి మనిషితో ఎదటి మనిషి కొంచెం జాగ్రత్తగా ఆ వ్యక్తిలోని మూడ్సును గుర్తించి నడవాలి. లేనిచో అప్పుడప్పుడు ఆపదలు తప్పవు.

రామకృష్ణ బాగా చదివినవాడు. సాంస్కృతిక రంగంలోని చాలా శాఖలను గురించి అనగా సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, నాట్యం మొదలైన వాటిని గురించి ఆయనకు మంచి పరిచయం వున్నది. నేను ఆయన అభిరుచులకు అభిలాషలకు మెరుగుపెట్ట ప్రయత్నించేవాణ్ని. ఆయన జీవితాన్ని మరొక మార్గానికి త్రిప్ప ప్రయత్నించేవాణ్ని.

అసిత్‌కుమార్ హాల్దార్ నేనూ సౌధం పై భాగంలో వుంటుండే వాళ్ళం. నేనూ నిత్యమూ చీకటిలో లేచి తెల్లవారేసరకు స్నానం కూడా ముగించుకొని కూర్చునేవాణ్ణి. అప్పటికింకా హాల్దార్ లేచేవారు కారు. రామకృష్ణ మాత్రం లేచి ముఖం కడుగుకొని మేడమీదకు వచ్చి నా దగ్గర కూర్చొని నేను చెప్పే విషయాలు శ్రద్ధతో ఆలకించేవారు. ఉన్నత జీవితంపైనా, ఉత్తమ ఆశయాలపైనా అతనికి ఎంతో ప్రీతి. నాతో ఎన్నో తెలివైన విషయాలను చర్చించేవాడు. ఇటువంటి లోతయిన వ్యక్తిలో, ఇటువంటి స్నేహశీలమైన వ్యక్తిలో, ఇటువంటి మధుర స్వభావం గల వ్యక్తిలో ఇటువంటి దుర్వ్యసనాలు ఏ విధంగా ప్రవేశించినవో అని మనో వైజ్ఞానిక పరిశీలన ప్రారంభించేవాణ్ని. ఒక వేళ అటువంటి దుర్వ్యసనాలుండబట్టే ఇతనికింత మంచి స్వభావం అబ్బిందా అనే అనుమానం కూడా జనించేది. ఏది ఏమైనా, రామకృష్ణ మనస్తత్వం ఒక విశిష్టమైన విచిత్ర తత్వం. దాన్ని తెలుసుకోడం కొంత కష్టమే అనిపించింది.

## చిత్రాతో పరిచయం

వి. ఆర్. చిత్రాను చూడడం అదే ప్రథమం. రామకృష్ణ ఇంటికి ఆయన తరచుగా వస్తూపోతుంటాడు. చిత్రా చాలా పొట్టిగా, గుండ్రంగా, జపాన్ బొమ్మ వలె వుంటాడు. ఆయన అసిత్‌కుమార్ హాల్దార్ శిష్యుడు. దక్షతతో మద్రాసు నుంచి **"SILPI"** అనే ఇంగ్లీషు మాసపత్రికను, "ఆంధ్ర శిల్పి" అనే తెలుగు మాసపత్రికను నడుపుతున్నాడు. మద్రాసు ప్రభుత్వంలో డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ ఇన్‌డస్ట్రీస్‌గా వుంటున్నాడు.

నేను మద్రాసు చేరుకొన్న రాత్రే చిత్రా రామకృష్ణ ఇంటికి నన్ను చూచేందుకు వచ్చాడు. తెలుగు మాట్లాడినా, తమిళం మాట్లాడినా, ఇంగ్లీషు మాట్లాడినా గడగడ మాట్లాడుతాడు. బెంగాలీ మాట్లాడుతాడే కాని వ్రాయడం, చదవడం మాత్రం రాదు. ఆయన వెంట "ఆంధ్ర శిల్పి" సంపాదకత్వం నిర్వహిస్తున్న శ్రీ పిలకా గణపతి శాస్త్రి కూడా వచ్చారు. గణపతి శాస్త్రిగారికి కొద్ది కాలం కిందటనే భార్యావియోగం సంభవించి వుంది. అందువల్ల ఆయన ఏదో విషాద యోగంలో వున్నట్టు కనుపించారు. మేమంతా చాలాసేపు **"SILPI"** "ఆంధ్ర శిల్పి" వీటి భవిష్యత్తును గురించి, వాటిలో ఏ యే నూతన విధానాలను ప్రవేశ

పెట్టాలా అనేవాటిని గురించి చర్చించాం, చిత్రాగారు రేపువచ్చి శిల్పి ఆఫీసుకు తీసుకు వెళతామన్నారు.

తెల్లవారి నప్పటినుంచి రామకృష్ణ మనసులో ఉన్న పథకానికి హాల్దార్, నేను రూప కల్పన చేయసాగాం. తమ సొంతం ని శిల్ప, చిత్ర సంగ్రహాన్నంతా ప్రజలకు అందుబాటులో వుండేలాగ ఏర్పాటు చేయాలని, ఈ కళా సంగ్రహాన్నంతా ఒక చిత్రశాలగా మార్చాలని, దీనికి సంబంధించే ఒక కళా సమితిని స్థాపించాలని రామకృష్ణ అభిలాష. ఆ అభిలాషకు మేము ఒక భౌతిక రూపం ఇవ్వ బూనాం, అటువంటి ఒక పథకాన్ని తయారు చేయడంలో వివిధ సాధక బాధకాలను కూడా చర్చించసాగాం.

ఒక సాయంత్రం వి. ఆర్. చిత్రా వచ్చి హాల్దార్, నన్ను తమ అన్నగారయిన ప్రసాదరావు గారింటికి తీసుకువెళ్ళాడు. ప్రసాదరావుగారు మద్రాసులో మెడికల్ కాలేజీలో ప్రిన్సిపాల్ చేస్తున్నారు. ఆయన చాలా సరసుడు. ఆయన కూతుళ్ళు రమణి, దేవిక అనేవారు మెడికల్ కాలేజీలో చదువుతున్నారు. చాలా ప్రొద్దు పోయేవరకు వారందరితో ఇష్టాగోష్టి జరిపి తిరిగి ఇంటికి వచ్చాం.

ఒకరోజు సాయంత్రం మ్యూజియంలో కమల్‌కృష్ణ అనే ప్రసిద్ధ చిత్రకారుడు తన చిత్రప్రదర్శనాన్ని ఏర్పరచి ఆహ్వానించగా హాల్దారూ, నేనూ రామకృష్ణా వెళ్ళిచూశాం. కమల్‌కృష్ణ రచించినవన్నీ జలవర్ణ చిత్రాలే అధికం. అవన్నీకూడా ఎక్కువభాగం హిమాలయాల , టిబెట్టుకు ఎక్కువ సంబంధించి వున్నాయి. తీక్షణతలేని రంగులతో చిత్రించబడి వున్నాయి. తెల్లని మంచు దృశ్యాలు రమణీయంగా శోభిస్తున్నాయి.

వెనక కొన్ని ఏళ్ళ క్రిందట చూచిన హిందీ నాయకులు మోటూరు సత్యనారాయణగారు మ్యూజియంలో కనుపించారు. ఒకరినొకరు గుర్తుపట్టి కలసి సంతోషించాం. హాల్దారును, రామకృష్ణనూ ఆయనకు పరిచయం చేశాను. తమ దక్షిణ భారత హిందీ ప్రచార సభను ఒకసారి సందర్శించి పొమ్మనగా తప్పక రాగలమని ఆయనతో చెప్పి, మేము ముగ్గురం అక్కడనుంచి బయలుదేరి సముద్రతీరానికి వెళ్ళి ఆ రాత్రి వెన్నెలలో, ఆ చలిలో చల్లని ఇసుకమీద కొంతకాలం గడిపి ఇంటికి తిరిగి వెళ్ళాం.

నేను మద్రాసువచ్చి వారం రోజులైంది. వీరందరితో, వివిధ సాంస్కృతిక

విషయాలతో కాలం చాలా ఆనందంగా గడచిపోతూంది. ఇప్పటిలో నన్ను ఇంటికి తిరిగి పోనిచ్చేలాగా గోచరించడం లేదు రామకృష్ణ.

రామకృష్ణ దగ్గర తెల్లగా మెరుస్తున్న కప్లుడ్ రేంజ్ ఫైండర్‌గల ఒక మిని యేచర్ కేమెరా వున్నది. అది ఎంతో అందమైన కేమెరా. ఆ కేమెరా చాలా బాగున్నదని రామకృష్ణతో నేను అనలేము ఎప్పుడు కూడా. బాగున్నదని అంటే ఆ కేమెరాను నాకిచ్చివేస్తాడేమో అని నా భయం. తనదగ్గర వస్తువును చూచి ఎవరైనా తనకు అభిమానమున్న మిత్రుడు బాగున్నదని అంటే ఆ వస్తువును ఆ మిత్రునికి ఇచ్చివేయడం రామకృష్ణకు సరదా. అదేవిధంగా తన మిత్రులదగ్గర తనకు నచ్చిన వస్తువేదైనా గోచరిస్తే దాన్ని తాను తీసుకోవడం కూడా ఆయనకు సరదా.

ఒకరోజు ఉదయానే, అసిత్‌కుమార్ హాల్దార్ లేవకముందే నేను లేచి స్నానంకూడా ముగించుకుని మేడపైన అటూఇటూ తిరుగుతూండగా నైట్ డ్రెస్‌లో వున్న రామకృష్ణ వచ్చి, నన్ను తీసుకొని హాల్‌లో వున్న సోఫాలో ఎచ్చి కూర్చుని తనకు తట్టిన ప్రశ్నలకు సమాధానం ఇవ్వమని అడిగాడు నా వైపు చిరునవ్వుతో చూస్తూ.

## వివేకోదయం

తనను గురించిన నా అభిప్రాయమేమిటో నిస్సంకోచంగా, నిర్మొహమాటంగా తనకు తెలియజేయమని అడిగాడు. తనను గురించి నాకెంత చెడ్డ అభిప్రాయం వున్నా కూడా చెప్పడానికి వెనకాడవద్దని అన్నాడు. నేను చెప్పసాగాను. ఆయన తెలివితేటలమీద, స్నేహశీలతమీద నాకు అపారమైన సదభిప్రాయం వున్నది కాని ఆయన స్వభావంమీద, వర్తనమీద అంతగా సదభిప్రాయం లేదని, ఆయన తన స్వభావాన్ని, వర్తనను మార్చుకోవాలని వుంటే మాత్రం ఆ విషయంలో ఆయనకు నేను తోడ్పడగలనని చెప్పాను భుజంమీద చేయివేసి. అందుకు రామకృష్ణ కళ్ళవెంట నీరు కారజొచ్చింది. నా రెండు చేతులూ తన చేతులలోకి తీసుకొని చెప్పసాగాడు. తన జీవితాన్ని మార్చుకోవాలని తన అభిలాష అయినట్టు, ఆ ప్రయత్నంలో నేను తనకెంతో తోడ్పడాలని, తనకున్న దుర్వ్యసనాలను మానుకోడంలో నా తోడ్పాటు తనకెంతో అవసరమని, ఆ విధంగా తనను మార్చమని బ్రతిమిలాడుతూ నన్ను ఇంకా ఎక్కువకాలం తనతోనే వుండిపొమ్మనీ,

ఇప్పటిలో తుమ్మపూడి పోవద్దని వినయంతో చెప్పాడు. రామకృష్ణలో ప్రత్యక్షమైన ఈ వైఖరి చూచి నా హృదయం కరగిపోయింది.

సంక్రాంతి వచ్చింది. దీన్నే పొంగల్ అంటారు తమిళనాడులో. అసిత్ కుమార్ హాల్దార్‌కు, నాకు ఆ రోజు రామకృష్ణ అభ్యంగన స్నానాలు చేయించి, క్రొత్తబట్టలు కట్టబెట్టాడు. మద్రాసులోని కొందరు తన స్నేహితులను భోజనానికి పిలచి ఆ రోజు రామకృష్ణ పొంగల్ వేడుక జరిపాడు.

రామకృష్ణచేత నిత్యమూ ఒక నూతన గ్రంథాన్ని నా ఎదుట చదివించి, దానిలో ఆయన చదివిన భాగాలకు నేను విపులంగా వ్యాఖ్య చేసేవాణ్ని. ఆయనకు సంతృప్తి కలిగేది. ఆ రోజుతో ఆ పుస్తకం అవతలపెట్టి మరునటిరోజు మరొక నూతన గ్రంథంలో కొంతభాగం చదవమనేవాణ్ని. తన తాతగారి గ్రంథాలయంలో వున్న **"Golden Book og Tagore"** అనే గ్రంథాన్ని తెచ్చి చూపాడు ఒకనాడు. దాన్ని పూర్తి అయ్యేవరకు నిత్యమూ చదివించి, రవీంద్రుని గురించీ, ఆయన సాహిత్యాన్ని గురించి, ఆయన తత్వాన్ని గురించి విశదీకరిస్తూండేవాణ్ని. రామకృష్ణతోపాటు అసిత్‌కుమార్ హాల్దార్ కూడా నవ్వుతూ వింటూ కూర్చునేవాడు.

# మహాత్మాగాంధీ హత్యానాడు....

మద్రాసు వచ్చి నెల కావచ్చింది. నెలరోజులు పదిరోజులవలె గడచి పోయాయి. రామకృష్ణ నన్ను ఇంటికి వెళ్ళనీయడం లేదు. నిత్యం నేను ప్రయాణం కావడం, రామకృష్ణ ఆపివేయడం. తుమ్మపూడినుంచి సోదరి భారతి ఉత్తరం వ్రాసింది గట్టిగా రమ్మని.

త్వరలో తప్పక తిరిగి వస్తానని, ఇంటివద్ద చాలా అవసరమైన పనులున్న వని, రామకృష్ణను, హోల్డార్‌ను కూడా ఒప్పించి ఒకనాడు బయలుదేరి ఇంటికి వచ్చివేశాను. నేను తిరిగి వచ్చినరోజు సాయంత్రమే 1948 జనవరి 30 వ తేదీన మహాత్మాగాంధీ హత్య జరిగినట్లు వార్త. దేశం అంతా అల్లకల్లోలం. నే నెప్పుడూ గాంధీని చూచి ఎరుగను. నేను చూడకుండానే ఆయన తన జీవనయాత్రను ముగించాడు. ఆయన త్యాగజీవితంమీద గౌరవం వున్నప్పటికీ జీవితానికి సంబంధించి ఆయనకున్న కొన్ని అభిప్రాయాలమీద నా కంతగా ఇష్టం వుండేదికాదు. మిగతా విషయా లెట్లున్నప్పటికీ ఆయన త్యాగమయ జీవితాన్ని ప్రేమించకుండా వుండ గలగడం అసంభవం.

ఆయన హత్యతో భారతదేశపు రాజకీయ జీవితంలో మరొక మజిలీ ప్రారంభమైంది. హత్య కావించబడినవారిని ఎక్కువమంది ప్రశంసిస్తూంటే హత్య కావించిన వారిని కూడా కొద్దిమంది ప్రశంసించసాగారు!

ఆ సాయంత్రం సోదరి భారతి, నేనూ తీరికగా కూర్చుని గాంధీగారి హత్యను గురించి చెప్పుకొని ముగించి, తరువాత మద్రాసు విశేషాలు చెప్పసాగాను. పల్లె లలో వుండే వసతులు పల్లెల్లో వుంటాయి. పట్టణాలలో వుండే వసతులు పట్టణా లలో వుంటాయి. అదేవిధంగా పల్లెలలో కొన్నిరకాల ఇబ్బందులుంటే పట్టణా లలో కొన్నిరకాల ఇబ్బందులుంటాయి కనుక గ్రామనివాసం శ్రేష్టమైనదా? లేక నగర నివాసమా? అని తేల్చడం సంభవం కాదు. రెండింటివి రెండువిధాల జీవి తాలు. మనిషి తన జీవితంలో సమగ్రమైన అనుభవం సంపాదించాలంటే గ్రామం లోనూ, నగరంలోనూ కూడా జీవించాలి. గ్రామ్య జీవితంలోని లోపాలను నగర జీవితం పూరిస్తుంది. నగర జీవితంలోని లోపాలను గ్రామ్యజీవితం పూరిస్తుంది. కనుక కొంతకాలం గ్రామంలో నివసించడం, కొంతకాలం నగరంలో జీవించడం మంచిది అని చెప్పి సోదరి భారతికి చెప్పి విశదపరచాను.

కొందరు నగరవాసులు గ్రామీణ జీవితాన్ని ప్రశంసించి నగర జీవితాన్ని నిందిస్తారు; మరికొందరు నగరవాసులు తమ నగరజీవితాన్నే ప్రశంసించి గ్రామీణ జీవితాన్నే నిందిస్తారు. ఇదేవిధంగా కొందరు గ్రామవాసులు తమ గ్రామీణ జీవితాన్ని నిందించి నగరజీవితాన్ని ప్రశంసిస్తే మరికొందరు గ్రామవాసులు నగర జీవితాన్ని నిందించి గ్రామ్యజీవితాన్ని ప్రశంసిస్తారు. ఇదంతా జీవితాన్ని అసమగ్రంగా ఒకప్రక్క చూడడంమాత్రమే అవుతుంది. నిజానికి దేన్నీకూడా నిందించవలసిన పని లేదు. దేని మంచి దానిదే; దేని చెడు దానిదే. ఒకవిధంగా చూస్తే పల్లెలలోనివారంతా అనాగరికులూ కారు, పట్టణాలలోని వారంతా నాగరికులూ కారు. నిజానికి నాగరికత అనే పేరు నగరం మీదనుంచి వచ్చినదే. అయినా, నేడు ఆ పదం నగరానికి సంబంధించి మాత్రమే కట్టుబడక మానవ జీవితంలోని ఒక ఉన్నతస్థితిని చూపుతూంది. కనుక నేడు నగరికత అనేది నగరంలో మాత్రమే కాక పల్లెలలోకూడా వికసించి వుంది. పూర్వం ద్రావిడులది నగర సభ్యతగానూ, ఆర్యులది గ్రామసభ్యతగానూ వుండేది. నేడు ద్రావిడులని, ఆర్యులని ప్రత్యేక నివాసులెవరూ లేరు. అంతా భారతీయులే. అదేవిధంగా నేడు నగరసభ్యత అని, గ్రామసభ్యత అనికూడా ప్రత్యేకించి ఏమీలేదు; అంతా మానవసభ్యతే.

**"Silpi"** సంపాదకులైన వి. ఆర్. చిత్రానుంచి ఉత్తరం వచ్చింది. లక్నో కళల విద్యాలయానికి వైస్‌ప్రిన్సిపాల్ అయిన బీరేశ్వర్‌సేన్‌ను గురించి **"Silpi"**కి ఒక వ్యాసం వ్రాసి పంపమనీ, సేన్ రచించిన చిత్రం **"Land of the Thunder bolt"** అనేదాన్ని నా దగ్గరనుంచి పంపమనీ. సేన్‌ను గురించి వ్యాసం వ్రాసి పూర్తిచేశాను. వ్యాసాన్ని ప్రారంభించడంలో ఏదో విశేషం చూపడం ఒక అలవాటు అయింది. వ్యాసంపేరు **"Bireswarsen the Landscapist"** అని వుంచాను. దాన్ని ఈ విధంగా ప్రారంభించాను.

"శబ్దానికంతకూ నిశ్శబ్దం మూలమైనట్టే, రంగులన్నిటికీ తెలుపు మూలమైనట్టే, కళ అంతటికీ ప్రకృతి మూలమయింది. భవం అంతకూ భావం మూలమయింది; అయినప్పటికీ ప్రకృతిని అనుకరించడం ఉత్తమ కళకాదు. భావం **(Being)** ప్రతిబింబం ఆదర్శమైన భవం **(Becoming)** కాదు, ప్రకృతిశిల్పి అస్తవ్యస్త ప్రకృతిని అద్భుతరూపాల సృష్టిలోకి మార్చే రూపాంతరీకుడు. ఉత్తుంగ శైలశృంగాలు. లోతయిన పచ్చని లోయలు, ప్రవహించే సెలయేళ్ళు, మేఘాచ్ఛన్నమయిన పగళ్ళు, వర్షపు రాత్రులు, శారద ప్రభాతాలు గ్రీష్మ,

సంధ్యలు, ఇవన్నీ కూడా రేఖల లయతోను, రంగుల రాగాలతోను స్పందిస్తుంటాయి. బీరేశ్వర్ సేన్ ఇటువంటి చిత్రకారుడు.

బీరేశ్వర్ సేన్‌ను గురించి వ్రాసిన ఈ వ్యాసంతోపాటు **"Silpi"** లో నా దగ్గరవున్న ఆయనచిత్రం **"Land of the Thunder bolt"** అనేది రంగులలో ముద్రించబడింది. అదికాక ఇంకా ఆయన చిత్రాల ఫోటోగ్రాపులు నలుపు తెలుపులో ముద్రించబడినాయి. ఈ వ్యాసం వెలువడిన తరువాత లక్నోలోని కొందరు నా మిత్రులైన విఖ్యాత చిత్రకారులకు నామీద కోపం వచ్చింది. సేన్ మీద కోపం వచ్చింది. సేన్‌మీద వారికి చాలా అసూయ జనించింది, తమను గురించి వ్రాయక సేన్‌ను గురించి వ్రాసినందుకు వారిలో చాలామందికి నామీద స్నేహభావం తగ్గిపోయింది.

గొప్ప కళాకారులలో కూడా పరస్పర ఈర్ష్యాద్వేషాలు అధికంగా గోచరిస్తాయి. కాని వైజ్ఞానికులలో ఇవి అంతగా గోచరించవు. కవులలో, చిత్రకారులలో, నర్తకులలో, నటకులలో, గాయకులలో పరస్పరం ఇటువంటి అసూయలు అధికం. ఈ విషయంలో వీరికంటె వైజ్ఞానికులెంతో మేలు, కళాకారులంతా ఇటువంటివారని కాదు; వైజ్ఞానికులంతా విశాలహృదయులని అర్థం కాదు. ఎక్కువమంది కళాకారులలో ఇటువంటి సంకీర్ణ భావాలుంటాయని, ఎక్కువ మంది వైజ్ఞానికులలో విశాలభావా లుంటాయని మాత్రమే.

నా మానసం వెనకటివలె కవితలమీదకాక సమీక్షాత్మకమైనట్టి, తార్కికమైనట్టి వ్యాసాలమీదకు ఎక్కువగా మొగ్గు చూపసాగింది. అటువంటి వాటిని చదవడంలోనూ, రచించడంలోనూ ఆనందం పొందసాగాను. అందువల్ల ప్రధానంగా గద్య రచనలనే చేయడం, అవికూడా ఎక్కువగా దృశ్యకళా సమీక్ష రూపంలో రచించడం ప్రాధాన్యం వహించింది.

మద్రాసులో రామకృష్ణ ఇంట వుంటూన్న అసిత్‌కుమార్ హాల్దార్ తిరిగి లక్నో వెడుతూ బెజవాడలో రైలులో కలుసుకోమని టెలిగ్రామ్ వచ్చినందున ఆయనను బెజవాడలో రైలులో కలుసుకొన్నాను. తుమ్మపూడి వెడదాం దిగమన్నాను. కాని, లక్నో ప్రయాణాన్ని ఆపడానికి అది తరుణం కాదని, మరొకసారి అందుకు ప్రత్యేకంగా వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు

తుమ్మపూడి జీవితంలో ఏదో ఒక పనిని కల్పించుకొని కాలం గడపవలసించే. చదవడమో, వ్రాయడమో, ఆలోచించడమో, ఏదో ఒకటి లేనిది సమయం

దొర్లను. సోమరితనం కూడా ఒక పనేకాని దానితో కాలం గడవడం అంటే కాలం గడవకపోవడమే అవుతుంది. మద్రాసులో ఏమీ చదివేవాడిని కాదు; ఏమీ వ్రాసేవాడిని కాదు; ఏమీ ఆలోచించేవాడిని కాదు. అయినప్పటికీ కాలం తేలికలో వెళ్ళిపోయేది. ఇందుకు ప్రధానకారణం తుమ్మపూడిలోనిది ఏకాంత జీవితం. మద్రాసులోనిది జనాంతజీవితం, అధ్యయనం. ఆలోచనావృద్ధికావాలంటే ఏకాంతం ఉపయోగపడినట్టుగా జనాంతం ఉపయోగపడదు. మరికొన్ని మనస్తత్వాలకు జనాంతమే ఎక్కువగా ఉపయోగపడుతుందేమో తమ ఆంతర్యవికాసానికి!

ఎందుకో ప్రాచీన చైనీయ చిత్రకళమీద అభిరుచి వృద్ధిపొందసాగింది. ఆ విషయానికి సంబంధించిన మంచిగ్రంథం ఏమీ నా దగ్గర లేదు. అందుకని విలియం కోన్ రచించిన **"Chinese Painting"** అనే ఉద్గ్రంథాన్ని తెప్పించాను. ఆ పుస్తకం చాలా విద్వత్తుతోటి, విపులమైన భోగట్టాతోటి, ఎన్నో ఉత్తమ చిత్రాలతోటి కూడుకొనివుంది. సిరాతో చిత్రించిన వెదురుచెట్ల చిత్రాలు ఎంతో మనోహరంగా వున్నాయి.

ఆ పుస్తకాన్ని శ్రద్ధగా అధ్యయనం చేసి సక్రమంగా జీర్ణించుకొన్న తరువాత **"Silpi"** కి నేనొక వ్యాసం వ్రాశాను. **"Chinese Painting in the Sung Period (960-1279 A. D.)"**, అందులో వ్రాశాను.

సంగ్‌యుగం చైనాకు మాత్రమేకాక యావత్ విశ్వానికే శుద్ధమైన, లలితమైన ప్రకృతి చిత్రణలో స్వర్ణయుగం అనవచ్చు. కారణం, ఆనాటికి పాశ్చాత్యదేశాలు ఇలాంటి ప్రకృతి చిత్రణ అంటే ఏమిటో ఎరుగవు. ప్రాచీన చైనాలో విశుద్ధ ప్రకృతి చిత్రణ వికసించడం, ఆచరింపబడడం జరిగింది. సంగ్‌యుగపు చిత్రకళా చరిత్ర అంటే చైనాదేశపు ప్రకృతి చిత్రణ చరిత్ర అనే అర్థం.

చరిత్రాత్మకమైనట్టి, విశ్లేషణాత్మకమైనట్టి ఇటువంటి వ్యాసం రచించడంలో కొంత మానసిక శ్రమ జనించి తల చిటచిటలాడింది. కఠినమైన మానసికశ్రమను వోర్చుకోడంలో కూడా అదొక ఆనందం కనిపించేది.

# ఛాయాగ్రహణ వ్యామోహం:
# తృటిలో తప్పిన ప్రమాదం

కొంతకాలంబట్టి ఫొటోగ్రఫీమీద వ్యామోహం తలెత్తసాగింది. ఫొటోగ్రఫీకి సంబంధించిన పుస్తకం ఒకటి దొరికింది. కెమేరాకు సంబంధించిన రహస్యాలు, డెవలప్పింగ్, ప్రింటింగ్‌కు సంబంధించిన వివరాలు మొదలైన విషయాలన్నింటినీ జీర్ణింపచేసుకొన్నాను. ఇంతలో ఎడోక్స్ అనే 35 **mm** కెమెరా ఒకటి చేతికొచ్చింది. అది నా చొక్కా ప్రక్క జేబులో ఇముడుతుంది.

ఫొటోగ్రఫీని మొదలుపెట్టే వాళ్ళెవరూ కూడా 35 **mm** కెమెరాతో మొదలుపెట్టరు. రోల్ ఫిలింకెమెరాలో ప్రారంభించి కొందరు 35 **mm** కెమెరాలోకి పరిణతి చెందుతారు. కాని నేను ప్రారంభించటమే 35 **mm** కెమెరాతో ప్రారంభించాను. పైగా నా మినియేచర్ కెమెరాకు ఫోకస్ చేసుకొనే కపుల్డురేంజ్ ఫైండర్ లేదు. కెమెరానుంచి వస్తువు దగ్గరకు వున్న దూరాన్ని ఊహించుకొని ఫోకస్ చేయాలసిందే.

1948 సెప్టెంబరులో నా మినియేచర్ కెమెరాతో ఫొటోగ్రాఫులు తీయడం, టాంక్‌లో ఫిలిమును డెవలప్ చేయడం, ప్రారంభించాను. సాయంత్రం కాలవకట్టకు వెళ్ళడం - చెట్లను, దారిని నడిచే మనుషులను, పశువులను, బండ్లను, కాలవలో పయనించే పడవలను, ఆకాశంలోని మేఘాలను, కంటికేది కనిపిస్తే దానినల్లా ఫొటోతీయడం, ఆకాశంలో ఎగిరే కొంగలను కూడా తీయాలని ఎంతో ఉబలాటం వుండేది కాని టెలిఫొటో లెన్సులేని నా కెమెరాతో ఆ పని నెరవేర్చడం అసంభవంగా తట్టింది.

ఇదే సమయంలో బెంగుళూరులోని విఖ్యాత ఫొటోగ్రాఫర్ డాక్టర్ జి. థామస్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలద్వారా పరిచయం ఏర్పడింది. ఫొటోగ్రఫీకి సంబంధించిన వివిధ విషయాలను గురించి ఆయన సలహాలను తీసుకొనేవాణ్ణి. డాక్టర్ థామస్‌తో ఫొటోగ్రఫీతో బయలుదేరిన నా పరిచయం సన్నిహిత స్నేహంలోకి పరిణతి చెందింది. ఆయన నన్ను బెంగుళూరు రమ్మని వ్రాయడం, నేను వస్తాననడం జరగసాగింది.

ఫొటోగ్రాఫీని ప్రధానంగా రెండు విభాగాలు చేయవచ్చు: ఒకటి డాక్యుమెంటరీ ఫొటోగ్రఫీ, రెండు పిక్టోరియల్ ఫొటోగ్రఫీ. మొదటిదానిలో వాస్తవ వాదం ప్రధానమైతే, రెండవదానిలో కల్పన ప్రధానం. కుక్కను ఫొటోతీస్తే కుక్కగానే వుండాలి డాక్యుమెంటరీ ఫొటోగ్రాఫీలో. కాని, పిక్టోరియల్ ఫొటోగ్రఫీలో మాత్రం కుక్క కుక్కగా గోచరించకపోయినా ఫరవాలేదు. రెండవదానిలో ప్రధానమయింది కుక్క కాక దాని వెలుగు నీడలు, రచన (**Composition**), భావసామ్యము మొదలైన చిత్ర ధర్మాలు (**Pictorial elements**) మాత్రమే. డాక్యుమెంటరీ ఫొటో ప్రధానాశయం, కుక్కను బొమ్మలో చూపాలనడం. పిక్టోరియల్ ఫొటో ప్రధానాశయం ఒక సున్దృశ్యమైన రూపకల్పన చేయడం. ఇందుకు కుక్కను ఉపయోగించుకోడం ఒక నెపంమాత్రమే. మొదటిదానిలో కుక్క అనేది గమ్యమూ, ఫొటో అనేది సాధనా. రెండవదానిలో ఫొటో అనేది గమ్యమూ, కుక్క అనేది సాధనా. డాక్యుమెంటరీ ఫొటో భోగట్టానిస్తుంది; పిక్టోరియల్ ఫొటో రసానుభూతి నిస్తుంది.

నేను పిక్టోరియల్ ఫొటోగ్రాఫీలోనే ఎక్కువ అభిరుచి కనపరచసాగాను. ఫొటోగ్రఫీలో సిద్ధహస్తుణ్ని కావాలని దానికి సంబంధించిన వివిధ విషయాలను అధ్యయనం చేయసాగాను. ప్రకృతిని ఫొటోలు తీయడంలో ప్రత్యేక కృషి ప్రారంభించాను. ఈ నూతన సాధన సక్రమంగానే సాగిపోజొచ్చింది.

ఈ నూతన ప్రియతమ అయిన కెమెరాతో కాలక్షేపం చేయడం ప్రారంభమైన తరువాత నిరంతరం ఫొటోగ్రఫీ వ్యామోహం తీవ్రత కాసాగింది. చదవడం, వ్రాయటం మొదలైనవన్నీ వెనకాడసాగాయి. పుస్తకం పట్టుకొంటే బరువుగా తట్టేది. పుస్తకానికంటే బరువు ఎక్కువగావున్న కెమెరా పట్టుకొంటే తేలికగా ఉల్లాసంగా వుండేది. ఉదయాన స్నానం చేయడమే ఆలస్యం, కెమెరా జేబులో వేసుకొని పొలాలవెంట, కాలవకట్టలవెంట బయలుదేరేవాడిని. తిరిగి భోజనం చేసిన తరువాత, మళ్ళీ సాయంత్రందాకా అదేపని. పగలు పన్నెండు గంటలకు బదులు ఇరవై నాలుగు గంటలుంటే బావుండుననిపించేది.

ఇంటిముందువున్న గులాబిచెట్టు నిత్యం పూలు పూస్తుండేది. ఒక్కొక్క రోజు ఒక కొమ్మమీద ఒకే ఒక గులాబి మొగ్గ దీపశిఖవలె వెలుగుతూ కనుపించేది. దాన్ని మామూలు నలుపు తెలుపు ఫిలింమీదవే ఫొటోతీయాలని రసతృష్ణ కలగసాగింది. నా కెమెరాకు సరైన క్లోజప్‌లెన్సు వగైరా లేవు. అయినప్పటికీ

లెన్సు ఫోకస్‌ను కురుచచేసే ఒక అద్దాన్ని ఉపయోగించి, దానికొక ఎర్రని ఫిల్టరు వేసి ఆ ఏకాంత గులాబి మొగ్గను ఫొటో తీసిన తరువాత డెవలప్‌చేసి ప్రింటుచేసి చూస్తే నా కార్యదక్షతమీద నాకు అమితానందం వేసింది. నేను నిరీక్షించిన ఫలితాలకంటె బ్రహ్మాండమైన ఫలితాలు వచ్చాయి. ఫొటోలో ఆ గులాబీ మొగ్గను చూచి ముగ్ధుడనైపోయాను.

లెన్సుకు ఎర్రని ఫిల్టర్‌వేసి ఫొటోతీయడంలో గులాబీ ఆకులన్నీ నల్లగాను, గులాబీమొగ తెల్లగాను ప్రింటులో ప్రత్యక్షమైనాయి. బొమ్మలో గులాబీమొగ్గ ఒక ప్రక్కగా ఎడమకువుండి మిగతా భాగమంతా నల్లని ఆకులతో నిండివుండడం చూస్తే మేఘాచ్ఛన్నమైన నిశాగగనంలో మేఘాల సందునుంచి చంద్రుడు తొంగిచూస్తున్నట్లుతోచింది.

బొమ్మలో ప్రధాన వస్తువును కుడిప్రక్క ఉంచడంలోను ఎడమప్రక్క ఉంచడంలోను భేదంవున్నది. కుడిప్రక్క వుంచిన వస్తువు మనకంటికి దూరంలో వున్నట్టు గోచరిస్తుంది. ఎడమప్రక్కన వుంచిన వస్తువు దగ్గరలో వున్నట్టు గోచరిస్తుంది. కనుక ప్రకృతి దృశ్యాలలో దూరాన గోచరించవలసిన ప్రధాన వస్తువును బొమ్మలో కుడిప్రక్క వుంచడం, క్లోజప్‌లో ప్రధానవస్తువును ఎడమ ప్రక్క వుంచడం అవసరం.

నగ్నదేహాల ఫొటోలు చాలా ఫొటోగ్రఫి పుస్తకాలలో కనుపించినప్పుడల్లా అనిపించేది, నేనుమాత్రం ఎందుకు ఇటువంటి వాటిని తీయరాదా అని! నగ్నదేహము అనగానే స్త్రీ నగ్నదేహమే తడుతుంది ఎందుకనో. చిత్రకళలో కాని, శిల్పాలలోకాని, ఫొటోగ్రఫీలోకాని స్త్రీల నగ్నశరీరాలకే రూపకల్పన చేశారుకాని పురుషుల నగ్నశరీరాలుకాదు. ఇందుకు ప్రధానకారణం పురుషుని నగ్నశరీరం సమతలంగా సాఫ్‌గావుండి, వైవిధ్యాన్ని చూపక, ఏకతానంగా వుంటుంది. స్త్రీ నగ్నశరీరం ఆవిధంగా గాక ఎత్తుపల్లాలుగా, వక్రరేఖల లయతో, వైవిధ్యాన్ని ప్రసాదిస్తూ సుదృశ్యంగా వుంటుంది.

అయినప్పటికీ, నగ్నదేహాన్ని ఫొటోతీసే అవకాశం నాకు ఒకటికంటె ఎక్కువసార్లు కలిగినప్పటికీ నేను ఆ సాహసం చేయజాలక పోయాను! మానవుల నగ్నశరీరాలేకాదు ఎండిపోయి చర్మం వూడిపోయిన వృక్షాల నగ్నరూపాలు కూడా ఎంతో సుందరంగా వుంటాయి. అటువంటి నగ్నరూపాలను మాత్రం కొన్ని

ఫొటోలు తీశాను, అంత మంచికాని వస్తువును కూడ మంచిగా ఫొటో తీయవచ్చు, అదేవిధంగా ఎంత మంచివస్తువునైనా చెడ్డగా ఫొటోతీయవచ్చు. ఎవరో ఒక గొప్ప ఫొటోగ్రాఫర్ అన్నట్టున్నాడు **"Good Photography is not to photograph a beautiful thing but to beautifully photograph a thing"** ఒక సుందరవస్తువును ఫొటోతీయడం కాక ఒక వస్తువును సుందరంగా ఫొటోతీయడం మాత్రమే మంచి ఫొటోగ్రఫీ అట.

## తృటిలో తప్పిన ప్రమాదం

ఒకరోజు సాయంత్రం కాలవకట్టన కెమేరాతో తిరుగుతూ ఒక పెద్ద నేరేడు చెట్టుదగ్గరకు వచ్చాను. ఇంతలో తెరచాపలేని పడవ ఒకటి కాలవలో మెల్లగా పోతోంది. దానిని చాలాఎత్తునుంచి ఫొటోతీయాలని ఆ నేరేడుచెట్టుఎక్కి క్రింద పోతూన్న పడవను వ్యూఫైండర్‌లో కంపోజ్ చేసుకొని కెమేరా షట్టర్‌నొక్కాను. టక్కున నా చేయిజారి కొమ్మపట్టు తప్పింది. నేనువచ్చి కెమేరాతోసహా, లేక కెమేరా నాతోసహా కాలవలో పడాలసిందే. కాని నేను సంగతి గ్రహించి మరొక కొమ్మపట్టుకొని కెమేరాను, నన్నుకూడా రక్షించుకొన్నాను! చెట్టు దిగివచ్చిన తరువాత చాలాసేపటివరకు కాళ్ళు వణకడం గుండె దడదడ కొట్టుకోడం తగ్గ లేదు. నేను క్రిందపడిపోనందుకు సంతోషించాను. కాని కెమేరా పడిపోనందుకు ఇంకా ఎక్కువ సంతోషించాను.

ఆరాత్రి ఫిలింను డెవలప్‌చేసి చూస్తే చెట్టుమీదనుంచి తీసిన పడవబొమ్మ అద్భుతంగా కనుపించింది. ప్రకృతి దృశ్యాలను క్రిందికోణంనుంచి ఫొటోతీసే కంటే పైకోణంనుంచి తీస్తే సుందరతరంగా వుంటాయి. ఇటువంటివాటిని క్రింది నుంచితీస్తే అనవసరమైన వస్తుచయము, అనవసరమైన ఆకాశభాగము మొదలైన వన్నీ బొమ్మలో ప్రవేశిస్తాయి. పైనుంచి తీయటంలో ఇటువంటి ప్రమాదాలు తగ్గుతాయి.

తుమ్మపూడిలో ఒక ధర్మతోపు వుంది పదిఎకరాల విస్తీర్ణతగలది. దానిలో చింతచెట్లు, నేరేడుచెట్లు, మామిడిచెట్లు, తాడిచెట్లు ఎంతో మనోహరంగా నిలచి వుండి ఉదయాన వాటి నీడలను పడమటి దిశకు, సాయంత్రం తూర్పుదిశకూ పంపు తుంటాయి. భూమిమీద ప్రాకే వాటి నీడలనుచూస్తుంటే ఎంతో ఆనందగావుండేది. ప్రకృతిలోనే ఈ నీడలు ఇంత రమ్యంగావుంటే ఇక వీటిని ఫొటోతీస్తే ఎంత

రమ్యతరంగా వుంటాయో అని కుతూహలం కలగసాగింది. చెట్లమొదళ్ళను, వాటి నీడలనూ కలిపి ఫొటోతీశాను. ప్రింటుచేసిచూస్తే నిజంగా ప్రకృతిలో కనుపించిన వాటికంటె ఎంతో ఎక్కువ రమ్యంగా కనుపించాయి.

ప్రతి దృశ్యము ప్రకృతిలో కనుపించినంత సుందరంగా ఫొటోగ్రఫీలో రాదు. ఒక్కొక్కటి ప్రకృతిలోకంటె ఫొటోగ్రఫీలోనే బాగావస్తుంది. అదంతా కూడా చాలా భాగం వస్తువును ఎన్నుకోవడంలో వుంటుంది. కనుపించే వస్తు సముదాయంనుంచి ప్రధాన వస్తువేదో ఎన్నుకొని ప్రాముఖ్యతంతా ప్రధాన వస్తువుకు ఇచ్చి మిగతావాటిని వదలివేయడమో. అసలు వదలడానికి వీలులేనప్పుడు వాటిని ఫోకస్‌లో లేకుండా చేయడమో చేయాలి.

ఫొటోగ్రఫీ మీద ఉన్న నా అతివ్యామోహం మీద నాకే భయం వేయడం ప్రారంభించింది. ఇది క్రమేణా నా విద్యావ్యాసంగాన్ని, తాత్విక చింతనను, తార్కిక సత్తాను తినివేసేట్టు గోచరించింది. అంతటితో జాగ్రత్తపడి ఎందుకైనా మంచిది అని కెమెరాను ముట్టే పనిని కొంతవరకు పరిమితం చేయడంలో సఫలుడనయ్యాను.

# ఏది నిజమైన సౌందర్యం?

ఫొటోగ్రఫీనుంచి మళ్ళీ నా అభిరుచిని అధ్యయనం, రచన, ఆలోచన మొదలైన నా మామూలు విషయాలమీదకు త్రిప్పి తిరిగి వీటిలోనే ఆనందం పొందసాగాను. 1948 డిశంబర్‌లో ఢిల్లీలో కుటీర పరిశ్రమలకు డిప్యూటీ డైరెక్టర్‌గా వుంటున్న వి. ఆర్. చిత్రానుంచి ఉత్తరం వచ్చింది. ఒక్కసారి జనవరిలో మద్రాసు వెళ్ళి "SILPI" ఏవిధంగా నడుస్తున్నదో చూచి ప్రస్తుతం దానికి ఎడిటర్‌గా వుంటున్న ఫ్రెంచి మహిళ మార్సెలహార్డీని కలుసుకొని కొన్నాళ్ళు మద్రాసులో రామకృష్ణ ఇంటగడిపిరమ్మని, శ్రీమతి మార్సెలహార్డీనుంచి కూడా మద్రాసు వచ్చిపొమ్మని ఉత్తరాలు రాసాగినాయి.

1949 జనవరి మధ్యభాగంలో ఇంటిదగ్గరి కార్యక్రమాలు ముగించుకొని మద్రాసువెళ్ళి ఇదివరలో హాల్దార్‌తో కలిసి నేను వున్న రాజా రామస్వామి మొదలియార్ మనుమడైన రామకృష్ణ బంగళాలో మకాంపెట్టాను. మళ్ళీ సంవత్సరానికి తిరిగి కనుపించినందుకు రామకృష్ణ చాలా ఆనందించి మర్యాదచేసి నన్ను తన ఇంట ఈ తడవ ఇదివరలోకంటె ఎక్కువకాలం వుండవలసిందిగా కోరాడు. క్రిందటి తడవ నేను ఇక్కడ వున్నప్పుడు అసిత్‌కుమార్ హాల్దార్‌తో కలిసి వున్నందున, బాగా సందడిగా లేకపోయినా కూడా కాలం ఆనందంగా గడవసాగింది.

రామకృష్ణకి రెండు మంచి విలువైనకార్లు వున్నాయి. ఒక కారును తాను స్వయంగా నడుపుకొంటాడు. రెండవకారును డ్రయివర్‌ను నేనున్నంతకాలం ఉపయోగించుకొనే నిమిత్తం నాపరంచేశాడు. డ్రయివర్ పేరుఫ్రాన్సిస్.నవయువకుడు. తెలుగు బాగా మాట్లాడుతాడు. వాళ్ళపూర్వులు తెలుగుదేశంనుంచి లేచిపోయి నీలగిరిలో నివాసం ఏర్పరచుకొన్నారట. వినయ విధేయతలు అతని ముఖంలో ఉట్టిపడుతుంటాయి. ఫిబ్రవరి చివరిలో పెళ్ళినిశ్చయమైనదట. తాను పెళ్ళాడబోయే కన్య ఫొటోను నాకుచూపి, నాకునచ్చినట్లు తెలుసుకొని సంతోషించాడు. అతనిని కారుదగ్గర నిలబెట్టి కారును అతనిని కలిపి ఒక ఫొటోతీశాను. అది చాలా బాగా వచ్చినది. దాన్ని తాను పెళ్ళాడబోయే కన్యకు పంపాడు. దానికాపీని రామకృష్ణకు చూపాను, ఆయనకూడా సంతోషించాడు. రామకృష్ణ సంతోషించడం తన కారు ఫొటోలో బాగా పడిందని డ్రయివర్ ఫ్రాన్సిస్ సంతోషించడం తాను ఫొటోలో

బాగా పడినందుకు. యజమానిదీ డ్రయివరిదీ కూడా సంతోషమే అయినప్పటికీ వారి ద్దరి సంతోషాలకు కారణాలు వేరువేరు!

నాకు మద్రాసులో నిత్యమూ ఒక నిర్ణీత కార్యక్రమం ఏర్పడింది. ఉదయం స్నానము, అల్పాహారము కాగానే తొమ్మిదిగంటల ప్రాంతంలో ఫ్రాన్సిస్ కారుతో సిద్ధంగా వుండేవాడు. తొమ్మిదిన్నరకల్లా నేను కారులో బయలుదేరి నరసింగపురం రోడ్డులోని "SILPI" కార్యాలయానికి వెళ్ళడం, పన్నెండు గంటలవరకు అక్కడ శ్రీమతి మార్సెలహార్డీతో కలసి సంపాదకీయ వ్యవహారాలు చూడడం. అక్కడ నుంచి పన్నెండు గంటలకు బయలుదేరి మౌంట్ రోడ్డులోని ఫొటో ఎంపోరి యంలో కొంచెం కాలం గడిపి తరువాత ఒక గంట ప్రాంతంలో బంగళాకు చేరు కోడం. ఒకొక్కరోజు ఏదైనా అవసరమైన పనివుంటే రామకృష్ణ ముందుగానే భోజనం ముగించుకు వెళ్ళిపోయేవాడు. లేనిచో నాతో కలిసి భోజనం చేసేవాడు. రామకృష్ణకు నిత్యమూ భోజనంలో మాంసం వుండాలి. నాకు అదిపనికిరాదు. అయినా ఒకచోట ఆనుకొని యిద్దరమూ భోజనం చేసేవాళ్ళం. మాంసాహారులు, శాఖాహారులతో కలిసి భోజనం చేయగలరు కాని శాకాహారులు మాత్రం మాంసా హారులతో కలిసి భోజనం చేయజాలరు. కాని మా ఉభయుల మధ్యా సహజీవనం అలవాటయింది.

శ్రీమతి మార్సెలహార్డీ మంచి విదుషీమణి. బెల్జియన్ తల్లిదండ్రులకు ఆమె స్కాట్లెండులో జన్మించింది దక్షిణ అమెరికాలో పెరిగింది. అక్స్‌ఫర్డు పట్టభద్రు రాలు. ఆంగ్లేయుణ్ణి వివాహమాడింది. అయిదారు యూరపియన్ భాషలు తెలుసు ఆమెకు. ప్రత్యేకించి ఫ్రెంచి భాషలో నిపుణురాలు. ప్రపంచంలో చాలా చోట్ల నివాసాలు మార్చి ఆమె చివరకు భారతదేశం చేరుకొని, కొంతకాలం కలకత్తాలో వుండి తరువాత వచ్చి మద్రాసులో స్థిరపడింది. కళలన్నా, కళాకారులన్నా, సాహిత్య మన్నా, సాహితీపరులన్నా ఆమెకెంతో ప్రేమ. ఇంగ్లీషులోను, ఫ్రెంచిలోను కూడా కథానికలను, వ్యాసాలను రచిస్తుంది. ఆరు అడుగులఎత్తు, ఎత్తుకుతగిన లావు, ఈ రెంటికితోడు ఆలోచనలో లోతూ కలిగిన పటిమకల వ్యక్తిత్వం ఆమెది. శ్రీమతి హార్డీ కిల్పాక్‌లో ఒంటరిగా నివసిస్తుంది. ఆమె వుంటున్న ప్రక్కభాగంలో విఖ్యాత డాక్యుమెంటరీ ఫిలిం నిర్మాతయిన డాక్టర్ పి. వి. పతి నివసిస్తుంటాడు.

## డాక్టర్ పి. వి. పతి

డాక్టర్ పి. వి. పతి గొప్ప ప్రజ్ఞాశాలి. ఆయన ఆంధ్రుడు. పూర్తిపేరు పిట్టమండలం వేంకటాచలపతి. చిన్నతనంలోనే ఫ్రాన్సువెళ్ళి అక్కడ ఫ్రెంచి

సాహిత్యాన్ని. ఫొటొగ్రఫీని, సినిమెటోగ్రఫిని అధ్యయనంచేసి సార్బాన్ విశ్వ విద్యాలయంనుంచి డాక్టర్ ఆఫ్ లిటరేచర్ డిగ్రీని పొందాడు. తెలుగు నాటక రంగాన్ని గురించి థీసిస్ వ్రాసి డాక్టరేట్ పొందాడు. అక్కడే ఒక ఫ్రెంచి వనితను వివాహమాడాడు. ఇద్దరు కొడుకులు కూడా.

ఒకరోజు సాయంత్రం మార్సెలహార్డీ నన్ను తన ఇంటికి భోజనానికి పిలచి నాకు తోడు డాక్టర్ పి. వి. పతిని, సుప్రసిద్ధ రచయిత అయిన మంజేరి ఈశ్వరన్‌ను, ఆంగ్ల రచయిత్రీ, ఉమన్స్ క్రిస్టియన్ కాలేజీలో ఉపన్యాసకురాలుగా పనిచేస్తున్న మిస్ మార్జొరీ సైక్సును కూడా పిలచింది. మేము అయిదుగురు వ్యక్తులం ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకు అక్కడ ఎంతో ఆనందంతో కాలం గడిపివేశాం. మా అయిదుగురిలో డాక్టర్ పి. వి. పతిగారు మాత్రమే కొంచెం నిషా చేశాడు. మా నలుగురికీ అది అభ్యాసం లేకపోవడంతో మా నలుగురి వంతుకూడా డాక్టర్ పతిగారే పుచ్చుకొన్నాడు. అందువల్ల ఆయన ధోరణి బాగా హెచ్చింది. కొంతసేపు ఫ్రెంచిలో కొంతసేపు ఇంగ్లీషులో మరికొంతసేపు తెలుగులోను, తమిళంలోను ప్రసంగించేవాడు. ఏ భాషలో మాట్లాడినాకూడా ఎదటి మనిషి అర్థం చేసుకోడానికి వీలులేనంత వేగంగా మాట్లాడేవాడు.

డాక్టర్ పతి భార్య ఫ్రాన్సులోనే వుంటున్నది కొడుకులతోసహా. కొన్ని సంవత్సరాలు అయింది. ఈయన ఫ్రాన్సుపోలేదు. ఆమె ఇక్కడకు రాలేదు. నేను డాక్టర్ పతిగారిని అడిగాను విడాకులు పుచ్చుకున్నారా? అని. అందుకాయన పెద్దగా నవ్వి "విడాకులు పుచ్చుకోడం ఏమి కర్మ? మేముభయులం ఇప్పటికీ అనుకూల దంపతులుగానే జీవిస్తున్నాం. భౌతికంగా సముద్రాలు మా శరీరాలను వేరు చేసినాకూడా మానసికంగా మేము కలిసేవున్నాం. ఉత్తరాలద్వారా మా పరస్పర ప్రేమను వ్యక్తం చేసుకొంటూ వున్నాం "మాది కొన్ని సంవత్సరాలబట్టి **Postal Love** అన్నమాట" అని ఆయన మళ్ళీ పెద్దగా నవ్వసాగాడు. మేమంతా మా చిరునవ్వులను ఆయన పెద్దనవ్వుతో కలిపివేశాం.

రెండవరోజు సాయంత్రం మార్జొరీసైక్సు నన్ను తమ ఉమన్స్ క్రిస్టియన్ కాలేజి చూపడానికి తీసుకు వెళ్ళింది. అదొక గొప్ప విద్యాసంస్థ. ఎటుచూచినా స్త్రీలే. స్త్రీలు వివిధ వయస్సులలో. కొందరు ఉపన్యాసకురాండ్రతోనూ, విద్యార్థినులతోనూ నన్ను పరిచయం చేసింది. సగం జడవేసుకొని మిగతా సగం వదలివేసిన విద్యార్థినులు ఎక్కువగా వున్నారు. ఎందుకవో విందుజడలకంటె అవి

వంటి సగం జడలంటే నా కెంతో ప్రీతి. అటువంటి జడలువేసుకొన్న యువతుల ముఖాలు ఎంత కళాహీనంగా వున్నాకూడా వారిని ముందుప్రక్కకాక వెనకప్రక్క చూస్తే సుందరంగా వుంటారు. అసలు సౌందర్యం నిమిత్తం కేవలం ముఖంమీద ఆధారపడటం కూడా అంత సబబుకాదేమో. ముఖం బాగుంటేనే వ్యక్తి బాగున్నట్టా ? శరీరానికి ముఖం ఒక్కటి మాత్రమేకాక అనేక అవయవాలున్నాయి, చేతులున్నాయి; చేతులకు వ్రేళ్ళున్నాయి; వ్రేళ్ళకు గోళ్ళున్నాయి.

## సౌందర్య వైవిధ్యం

కొందరిచేతులు సుందరంగా వుంటాయి. కొందరి సుందరంగా లేని చేతులకుకూడా వేళ్ళు సుందరంగా వుంటాయి; కొన్ని వ్రేళ్ళు సుందరంగా లేకపోయినాకూడా వ్రేళ్ళకున్న గోళ్ళు మెరుస్తూ బాదంకాయ ఆకారంలో ఎంతో సుందరంగా వుంటాయి. కొందరిగోళ్ళూ అందంగా వుంటాయి, చేతులూ అందంగా వుంటాయి. కొందరి కాళ్ళుకూడా అంతే. ప్రతి అవయవానికీ ఒక్కొక్క సౌందర్యంవుంది. వీటన్నిటికీ విలువ ఇవ్వక కేవలం ముఖాన్ని మాత్రమే సౌందర్యాన్ని కొలిచే కొలతబద్దగా తీసుకోడం ఎందుకనో ? ముఖంలోకూడా వివిధభాగాలు కళ్ళు, ముక్కు, చెక్కిళ్ళు, నోరు, పెదవులు, కనుబొమ్మలు మొదలైనవి. వీటిలో కూడా అందరికీ అన్నీ సుందరంగా వుండవు. కొందరి కళ్ళుబాగుంటే పళ్ళుబాగుండవు. కొందరివి రెండూ బాగుంటే ముక్కుబాగుండదు. ఈవిధంగా ఒకటి బాగుంటే మరొకటి బాగుండదు. ఎక్కడో అరుదుగా ఏ ఒక్కరిలోనో ఇవన్నీ బాగుండవచ్చు. అయితే మనిషిముఖం ప్రధానం, ముఖంలో కళ్ళు ప్రధానం. అందువల్ల కళ్ళు బాగున్నవి అంటే ముఖం బాగున్నదనీ, ముఖంబాగుంటే మనిషి బాగున్నట్లు అని పారంపర్యంగా భావింపబడుతూ వస్తున్నది. సరే ఏదిఏమైనా, ఉమన్స్ క్రిష్టియన్ కాలేజీలో నాకు మాత్రం జడలు నచ్చినాయి.

కాలేజీ బయట పచ్చికమీద మార్జోరీ, నేనూ కూర్చుని వివిధ విషయాలు ముచ్చటించుకోసాగాము. భారతీయ భాషలు, లిపులు, సాహిత్యాలు, గద్యరచనలు, పద్యరచనలు, పండితులు, కవులు, కళలు, కళాకారులు మొదలైన ఎన్నో విషయాలు ముచ్చటించుకొన్నాం. దక్షిణాది సాహిత్యాలమీద, ఉత్తరాది సాహిత్యాల ప్రభావం పడినంతగా ఉత్తరాది సాహిత్యాలమీద దక్షిణాది సాహిత్యాల ప్రభావం పడలేదని ఆమె అన్నది. ఇంతకు ప్రధానకారణం బెంగాలీ హిందీభాషలను దక్షిణాదివారు ఎక్కువగా నేర్చుకోడం. దక్షిణాది భాషలను ఉత్తరాదివారు ఎక్కువగా

నేర్చుకోకపోవడం. మార్జోరీ సైక్స్ ఇంగ్లండునుంచి వచ్చినతరువాత కొంతకాలం శాంతినికేతనంలో పనిచేసింది. కొంతకాలం వార్ధాలో చేసినది. రవీంద్రుని గురించి గ్రంథం రచించింది. జీవితంలో ఏవో ఉన్నతాదర్శాలను పెంచుకొన్న వ్యక్తి. సన్నగా, కోలముఖంతో కత్తిరించిన జుట్టుతో మెరిసే కళ్ళద్దాలతో మేధా జీవిగా గోచరిస్తుంది.

రాత్రికి నేను మకాంకు తిరిగివచ్చిన తరువాత డ్రయివర్ ఫ్రాన్సిస్ ఆరోజు నాకు కలిసిన వ్యక్తులను గురించి ప్రశ్నలవర్షం కురిపించి వివరాలు తెలుసుకొన్నాడు. అప్పుడుకాని అతని జిజ్ఞాస అణగారలేదు! తనకు తెలియనిదంతా తెలుసుకోవాలనే వ్యక్తి ఫ్రాన్సిస్!!

# జాతి జీవితంలో సంస్కృతి వికాస ప్రాధాన్యం

రాత్రి ఎనిమిది గంటలకు మద్రాసులో రామస్వామి మొదలియార్ మనుమడైన రామకృష్ణ ఇంట నేను ఏదో మాసపత్రిక చదువుకొంటూ నాగదిలో సోఫాలో కూర్చుని వుండగా ఫోన్ గణగణ మ్రోగింది. ఎత్తివింటే మద్రాసు మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్ డాక్టర్ సి. ప్రసాదరావుగారి పిలుపు. నాలుగురోజులలో మెడికల్ కాలేజీ విద్యార్థులు సాంస్కృతిక ఉత్సవాలు జరుపబోతున్నారు, కనుక ఆరోజు సాయంత్రం ఆ సభలలో ప్రసంగించ వలసినదని ఆరోజు ఉదయం జరుగనున్న విద్యార్థుల వక్తృత్వ పోటీలో ఒక జడ్జిగా వ్యవహరించ వలెనని తెలియజేశారు. ఆరోజు సాయంత్రం సభకు మద్రాసు హైకోర్టుజడ్జి చింతగుంట రాఘవరావుగారు అధ్యక్షత వహిస్తారట.

సభలరోజు ఉదయం ప్రిన్సిపాల్ శ్రీ ప్రసాదరావువచ్చి నన్ను తనకారులో మెడికల్ కాలేజీకి తీసుకు వెళ్ళారు. నా జీవితంలో మెడికల్ కాలేజీని చూడడం అదే మొదటిసారి. ప్రసాదరావుగారు కాలేజీ అంతా త్రిప్పిచూపారు. ఎనాటమీ విభాగంలోని శవాలను జూచి ఆశ్చర్యపోయాను. అన్ని శవాలను ఒక్కచోట చూడటం అదే ప్రథమం. ఏయే శవం ఏయే గ్రామానికి చెందిందో, ఏయే వృత్తి చేసేదో, ఎటువంటి స్వభావంగలదో, కుటుంబజీవితం ఎటువంటిదో, తన జీవితంలో బాధలనే అనుభవించిందో, సౌఖ్యాన్నే అనుభవించిందో, నేడు ఇక్కడ ఈ బల్లమీద ఈ విధంగా చాకులతో కోయబడుతూ పడివున్నది కదలక, మెదలక, పలుకక! అని ఆ శవాలన్నిటి పూర్వచరిత్రను తెలుసుకోవాలనే ఆకాంక్ష జనించింది. అయితే, నా ఆకాంక్షను వ్యక్తం చేయకుండానే దిగమింగి వూరకొన్నాను.

సభా కార్యక్రమం ప్రారంభమైంది, టంగుటూరి సూర్యకుమారి పాటకచ్చేరీతో. సూర్యకుమారిని గురించి విన్నానేకాని ప్రత్యక్షంగా ఆమెను చూడడం ఇదే ప్రథమం. సన్నగా, పొడవుగా, పచ్చగావున్నది. ఆమెరూపానికంటె ఆమె గానమే బాగున్నది. ప్రిన్సిపాల్ ప్రసాదరావుగారు ఆమెకు నన్ను పరిచయం చేశారు. ఉభయులం ఆనందించాం.

అనంతరం వక్తృత్వపోటీ ప్రారంభమైంది. మెడికల్ విద్యార్థులు పనిమనుషులేకాని మాటల మనుషులుకాదు ముఖ్యంగా. అందువల్ల వారు వేదికఎక్కి మాట్లాడబోయి నానా యాతనలు అనుభవించారు. నేను, మరిద్దరు పుర ప్రముఖులు

జడ్జీలుగా కూర్చుని పాయింట్లు వేసుకుంటున్నాము. జడ్జీగావుండి ఎదటివాళ్ళ విలువలను కొలవడం చాలా సులభం అనిపిస్తుంది చూచేవాళ్ళకు. అది చాలా కష్టమైన పని. అది ఆ జడ్జీగా వ్యవహరించే వ్యక్తికికాని తెలియదు.

ముగ్గురు విద్యార్థులు తమ వక్తృత్వ ప్రదర్శనంచేసి వెళ్ళినతరువాత నాలుగవ విద్యార్థి వచ్చాడు వేదికమీదకు, వచ్చి గట్టిగానిల్చొని మావైపుతిరిగి నమస్కారంచేసి తడబడే మాటలతో సభను సంబోధించాడు. ఇకఅంతే! అతనికాళ్ళు వణకి పోతూన్నాయి. మాట రావడంలేదు. నోటినుంచి పెదవులు కంపిస్తున్నాయి. ఎంత నిలకడగా వుండాలని ఆ మెడికల్ విద్యార్థి ప్రయత్నించినా కూడా లాభం లేకపోయింది. చలికాలం అయినప్పటికీ అతని దుస్తులన్నీ చెమటతో తడిసిపోయాయి. ఇక అతడు ఒక్కమాటకూడా మాటాడలేక మాకు వణకే చేతులతో మరొక నమస్కారం విసరి వేదికదిగి వెళ్ళిపోయాడు. విద్యార్థులు, విద్యార్థినులు కూడా గొల్లున నవ్వసాగారు. కాని నాకుమాత్రం అతనిమీద విపరీతంగా జాలి వేసింది.

ఆ సాయంత్రం న్యాయమూర్తి చింతగుంట రాఘవరావుగారి అధ్యక్షతన మెడికల్ కాలేజీలో నేను ఉపన్యసించాను. జీవితంలో సంస్కృతి ప్రాముఖ్యాన్ని గురించి వివరించాను. ఒకజాతి అభ్యున్నతికి రాజకీయాలు అవసరం, ఆర్థిక విషయాలు అవసరం, సాంఘిక విషయాలు అవసరం, కుటుంబ విషయాలు అవసరం. కాని వీటన్నిటికంటె ఎక్కువ అవసరం సాంస్కృతిక విషయాలు. దేశంలో సంస్కృతి వికసించి వుంటేనేకాని, రాజకీయాలుకాని, ఆర్థిక విషయాలుకాని, సాంఘిక విషయాలుకాని ప్రకాశించవు. ఇందుకు వైజ్ఞానిక వికాసంతోపాటు సృజనాత్మకమైన కళలు కూడా పూర్ణంగా వికసించాలి. మెడికల్ విద్యార్థుల అధ్యయనం వైజ్ఞానిక మైనప్పటికీ లలితకళలను సృష్టించడం నేర్చుకోలేకపోయినా, వాటిని ఆనందించడమైనా నేర్చుకొనివుంటే వారి భావి జీవితాలలో నూతనతేజం వికసించగలదు. ఈ విధంగా ఏమేమో ప్రసంగించాను.

ఆ సభకు గిండీ ఇంజనీరింగ్ కాలేజీ విద్యార్థులుకూడా హాజరైనారు. వారు తరువాత నాదగ్గరకొచ్చి తమ ఇంజనీరింగ్ కాలేజీలోకూడా అటువంటి సాంస్కృతికసభ జరపదలచినట్లు, దానిలో నన్ను ఉపన్యసించమని కోరారు. గిండీ ఇంజనీరింగ్ కాలేజీ విద్యార్థుల సాంస్కృతికోత్సాహం చూచి నేను చాలా ఆనందించాను.

నిర్ణీత సమయానికి శ్రీమతి మార్సెలాహార్డీ, నేను కూడా ఇంజనీరింగ్‌కాలేజీ చేరుకొన్నాము. మెడికల్ కాలేజీలో విద్యార్థులకుతోడు విద్యార్థినులుకూడా వున్నారు. ఇక్కడ మాత్రం నాకు ఒకవిద్యార్థినికూడా కనుపించలేదు. అందరూ విద్యార్థులే విద్యార్థులు. ఇక్కడచేసిన ప్రసంగంలో భారతదేశంలో జరిగిన సాంస్కృతిక పునర్జాగృతిని గురించి విశదీకరించాను. రాజా రామమోహనరాయలుతో ప్రారంభించి మహాత్మగాంధీ, జిడ్డు కృష్ణమూర్తితో ముగించాను.

మార్సెలా హార్డీని ఆమె ఇంటిపద్ద దింపి నేను నా మకాం చేరుకొనేవరకు రాత్రి తొమ్మిదిగంటలైంది. రామకృష్ణ నా నిమిత్తం ఎదురుచూస్తూ కూర్చున్నాడు భోజనానికి. భోజనం అయినతరువాత నేను ఇంజనీరింగు కాలేజీలో చేసిన ప్రసంగాన్ని సంక్షిప్త రూపంలో తనకు ఇంగ్లీషులో వినిపించమని కోరాడు. భోజన సమయంలో కొంచం నిషాచేసి వున్నాడు. సరే, నేను నాలుగు మాటలలో నా ప్రసంగం సారాంశాన్ని ఆయనకు తెలియజేశాను. ఆయనపిని సభలోవలె కరతాళ ధ్వని చేసి నన్నుగురించి వేదికమీద ప్రసంగించినట్టు ప్రసంగించసాగాడు. చుట్టూ వున్న మిత్రులు నవ్వసాగారు.

## పిచ్చుకపై బ్రహ్మాస్త్రం

ఆ రాత్రి పన్నెండు గంటల సమయంలో క్రిందనుంచి నాకు పిస్టల్ శబ్దం వినిపించింది మేడమీదకు. తిరిగి మళ్ళీ నిశ్శబ్దం. ఏమైవుంటుందో నాకు అర్థంకాక తిరిగి నేను నిద్రించాను. ఉదయానే రామకృష్ణ మేడమీదకువచ్చి రాత్రి ఒక జంతువును పిస్టల్‌తో కాల్చిచంపాను. ఆ జంతువు ఏమిటో చెప్పగలరా ! అని ప్రశ్నించాడు. నేనునవ్వుతూ చమత్కారానికి అన్నాను ఆజంతువు ఎలుక అయివుంటుందని. రామకృష్ణ ఆశ్చర్యచకితుడైనాడు యదార్థం నాకేవిధంగా తెలిసుంటుందా అని, నా సత్యదృష్టిని గురించి ప్రశంసించసాగాడు. నేను నవ్వుతూ అన్నమాట నిజమైనందుకు నేను ఆశ్చర్యపోయాను. ఒక ఎలుక తనమీద అటూ ఇటూ పరుగెత్తుతూ తనను నిద్రపోనీయక అల్లరిచేయసాగినదట. దానితో తనకు విసుగెత్తి దాన్ని పిస్టల్‌తో సంహరించాడట. పిస్టల్‌తో ఎలుకలాంటి చిన్నజంతువును పరుగెత్తుతుండగా కాల్చడానికి ఎంతో నేర్పు అవసరం అటువంటి నేర్పు రామకృష్ణలో వున్నందుకు ఆయనను అభినందించాను. ఇంటిలో ఇటువంటి క్షుద్రమృగాల బాధ లేకుండా చేస్తున్నందుకు కూడా ఆయనను అభినందించాను. ఇక ఆపూట కూరకు రాత్రి వేటాడిన జంతువు వున్నది కనుక మార్కెట్‌నుంచి ఇప్పుడు మాంసం

తెప్పించాలసిన పనిలేదనుకుంటాను అని అన్నాను. పెద్దగా నవ్వుతూ ఈమాటను క్రిందివారందరిలోకి వెళ్ళి ప్రచారం చేశాడు.

నిత్యమూ **Silpi** కార్యాలయానికి పోతూనే వున్నాను. మార్సెలా హార్డీతో కలపి వ్యవహారాలు పరికిస్తూనే వున్నాను. ఒకరోజు హార్డీ అన్నది, ఇక **Silpi** ని ఎక్కువకాలం నడపజాలం, మూలధనం తరిగిపోయింది, చిత్రాగారు ఢిల్లీపోయింది మొదలు దీనివిషయం ఏమీ పట్టించుకోడంలేదు, కొద్దికాలానికి కార్యాలయం మూయవలసి వస్తుందేమో అని.

నాకూ ఆవిధంగానేతట్టింది.పరిస్థితులుచూస్తే, **"Silpi"** ప్రారంభించినపుడే నేను చిత్రాగారికి తెలిపాను ఇటువంటి ప్రత్యేక విధమైన పత్రికను మాసపత్రికగా నడపడం కష్టం, త్రైమాసపత్రికగా నడిపితే బాగుంటుందని. అందుకు ఆయన సమాధానంఇచ్చాడు, లండన్‌నుంచి **"Studio"** మాసపత్రికగా ఎంతోకాలంనుంచి నడుస్తూంది. అదేవిధంగా **'Silpi'** ని కూడ మాసపత్రికగానే నడపాలి అని. నేను ఆశ్చర్యపోయాను. లండన్‌నుంచి నడిచే పత్రికకు, మద్రాసునుంచి నడిచే పత్రికకు ఎక్కడ పోలిక అని. ఒకళ్ళు వార్తాపత్రిక కొంటే చుట్టూవున్న పదిమంది ఆ వార్తాపత్రికనే చదివే మనదేశానికి, పదిమందివున్నచోట ఇరవై వార్తా పత్రికలు కొనిచదివే ఇంగ్లండుకు పోలికను సృష్టించుకోడంలో చిత్రాగారి మానసిక ఆరోగ్యానికేమీ భంగం కలగలేదుగదా అని శంక వేసింది !

ఒక ఉదయం రామకృష్ణ ఇంటికి ముగ్గురు అతిథులు వచ్చారు తెలుగు దేశంనుంచి. ఒక అందమైన యువతి, ఆమె తమ్ముడు, వాళ్ళమిత్రుడూ. మొగవాళ్ళిద్దరూ బయటికి వెళ్ళిపోతుండేవాళ్ళు; ఆమెమాత్రం ఇంటనే వుంటుండేది. ఎక్కువకాలం ఆమె రామకృష్ణతో కలిసి ఏకాంతంలో గడపటం గ్రహించాను. ఆమె ప్రవేశించింది మొదలు రామకృష్ణ నాకు కనుపించడం తగ్గించాడు. ఏదో తప్పుచేస్తున్నట్లు సంచరించటం ప్రారంభించాడు. నన్నుచూచి ఏదో భయపడుతున్నట్టు నటించసాగాడు. ఆ వచ్చిన నూతన వనితలో మాత్రం అటువంటి సంకోచం ఏమీ కనుపించేదికాదు. నాతో చాలా స్వేచ్ఛగా సంభాషించేది. అప్పుడప్పుడు పైకివచ్చి నాదగ్గర కూర్చుని లోక వ్యవహారాలను చర్చించేది. చాలావ్యవహార దక్షతగల యువతి అని గుర్తించాను.

ఒకరోజు సాయంత్రం నేను ఎప్పుడూ రాని వేళకు ఇంటికి రావలసి వచ్చింది. నేను ఎకాయెకీ మేడమీదకు నా గదిలోకి వెళ్ళేవరకు కింది తివాచీపైద ఒవరుసుమ ఆనుకొని రామకృష్ణ కూర్చుని వున్నాడు. ఆమె నగ్నవక్షంతో ఆయన

పక్కలో తలపెట్టి పడుకొనివుంది. నేను ఆ దృశ్యాన్నిచూచి వెనక్కురాకుండా నా గదిలో వాళ్ళుముందే నిలబడిపోయాను. నా ముందున్నదృశ్యం ఏమీ విశేషమైంది కాదు మామూలుదే అన్నట్లు. ఆమె మాత్రం ఏమీబెదరకుండా చప్పునలేచి నిల్చొని నన్ను ఏదో మామూలుగా పలకరించింది. రామకృష్ణ మాత్రం కంపించిపోతు న్నాడు. నేను ఆయనదగ్గరగావచ్చి ఏవో ఇంటివ్యవహారాలు మాట్లాడ ప్రారంభించి ఆయనలో ఆవరించిన భయాన్ని పోగొట్ట ప్రయత్నించాను. తెలివికలదికనుక పరి స్థితిని కనిపెట్టి ఆమె పమిట సర్దుకొంటూ క్రిందికెళ్ళిపోయింది. రామకృష్ణభుజం మీద చేయివేసి ఇటువంటి విషయాలలో నన్నుచూచి భయపడవద్దని, నా దృష్టిలో ఇవి మామూలు విషయాలు మాత్రమే అని, ఇవన్నీ పాపపు కార్యాలుగా నేను భావించనని అభయం ఇచ్చాను. ఆయన ప్రాణంలేని చిరునవ్వుతో నాకు నమస్క రించాడు.

# మద్రాసులో ఒక విషాదానుభవం

నేను మద్రాసు వచ్చి నెల అయింది. **"Silpi"** వ్యవహారాలేమీ చక్కబడే పద్ధతిలో లేవు. నేను తుమ్మపూడి వెళ్ళిపోవడానికి సిద్ధమైనాను. కాని, రామకృష్ణ నన్ను వెళ్ళవద్దని చేతులు పట్టుకొని బ్రతిమాలగా ఆగిపోయాను.

నిత్యమూ సాయంత్రం ఇండియన్ మెడికల్ కాలేజి నుంచి ఇద్దరు విద్యార్థులు వచ్చి నాతో కాలం గడుపుతుండేవారు. ఇద్దరిదీ కూడ తుమ్మపూడి దగ్గరవున్న రేవేంద్రపాడు. ఒకరిపేరు ఉమామహేశ్వరరావు, రెండవవారిపేరు రామకృష్ణయ్య. ఉమామహేశ్వరరావు చాలా సంవేదన గల వ్యక్తి. సాహిత్యంమీద, సంగీతంమీద ప్రీతి. ఏదో ఒక వాద్యంకూడా వాయించేవాడు. విద్యార్థి అయినప్పటికీ విద్యార్థివలె గోచరించేవాడు కాదు.

మిత్రుల ద్వారా ఒక వార్త. తెలుగుదేశంనుంచి వచ్చి మద్రాసు హైకోర్టులో న్యాయవాదవృత్తి ప్రారంభించిన ఒక అడ్వొకేట్‌గారు తమ పుత్రికతో నా వివాహం చేయాలనీ, అందునిమిత్తమై నన్ను చూడడానికి రామకృష్ణ ఇంటికి ఫలాన రోజున వస్తారని తెలిసింది. వారి రాకకు నేను నా అంగీకారాన్ని తెలియజేశాను.

ఆరోజు సాయంత్రం నాలుగుగంటల ప్రాంతంలో ఇద్దరు పెద్దమనుషులు రామకృష్ణ ఇంట నేనున్న మేడపైకి వచ్చి ఆసనం అలంకరించారు. వారిద్దరిలో వధువు తండ్రిగారు ఖద్దరు ధోతీ, చొక్కా ధరించి నడివయసులో చాలా సాదాగా వున్నారు. నేను చూడగానే అనుకొన్నాను ఆయనగారు **plain living and high thinking** అనే వర్గానికి చెందిన పెద్దమనిషి అని. ఎంతో నిజాయితీగల వ్యక్తిగా గుర్తించాను ఆయనగారిని. రామకృష్ణ ఇంటిలోని ఆడంబరాలన్నీ ఆయనగారికి అంతగా నచ్చివుండవు అని ఆయనగారి ముఖవైఖరి తెలుపుతూంది. రామకృష్ణ చరిత్రను గురించి మద్రాసులో తెలియని పెద్దలుండరు. రామకృష్ణ అనగానే ఆయనలో వున్న మంచికాక ఆయనలోని దుర్వ్యసనాలు ప్రజలకు గుర్తువస్తాయి. ఒకవ్యక్తి ఎటువంటి స్వభావం కలవాడా అని తెలుసుకోడానికి ఆ వ్యక్తికి వున్న స్నేహితులను చూస్తే చాలునట. కనుక నేను ఎటువంటివాడినో రామకృష్ణను చూస్తే సరిపోతుంది అనుకోవచ్చు.

సమానశీల వ్యసనేషు సఖ్యం

నన్ను చూడవచ్చిన అడ్వొకేట్‌గారికి మొదటగా తట్టిన సందేహం ఇదే.

భారతదేశంలోని గొప్పగొప్ప వారితో స్నేహం చేసిన ఈ సంజీవ్‌దేవ్‌కు ఇటు వంటి రామకృష్ణ స్నేహం ఏ విధంగా కుదిరిందా అని. అంటే రామకృష్ణలో వున్న కొన్ని గుణాలు నాలో వుండి వుండాలి, అంటే నాలో కూడా కొన్ని దుర్వ్యస నాలు అనబడేవి వుండివుండాలి అని. ఒకవేళ నాలోవున్న కొన్ని మంచిగుణాలు రామకృష్ణలో వున్నకూడా మా ఉభయులకు స్నేహం కుదరవచ్చుననే సత్యం ఎక్కువమందికి తట్టదు! అందుకే ఆయనగారు నన్ను చూడగానే మొదట వేసిన ప్రశ్న నేను ఈ యింట వుండడం ఏవిధంగా జరిగిందని.

అడ్వొకేట్‌గారితో వచ్చిన మిత్రుడు మౌనంగా కూర్చున్నాడు. అడ్వొకేట్ గారు నన్ను కొంతవరకు క్రాసుపరీక్ష చేసి చూశారు. నేను ఇంతవరకెన్నడూ కోర్టులో వాదిగాకాని, ప్రతివాదిగా కాని, ముద్దాయిగా కాని, ఫిర్యాదిగాకాని బోను ఎక్కి న్యాయవాదులముందు నిలచి ఎరుగను. నిజం చెప్పాలంటే అసలు కోర్టు అంటే మేడ అయివుంటుందో, పెంకుటిల్లుగా వుంటుందో, ఎలా వుంటుందో కూడా నాకు తెలియదు. అయినప్పటికీ నన్ను చూడవచ్చిన అడ్వొకేట్‌గారి ముందు నేను నెగ్గినట్టే భావించాను. నేను ఆయనగారికి నచ్చినట్టు కూడా గ్రహించాను. ఆయన గారి మీద నాకు అమిత గౌరవం ఏర్పడింది.

వారి అమ్మాయి క్వీన్ మేరిస్ కాలేజిలో బి. యస్ సి. చదువుతోంది అని చెప్పారు. తరువాత మా సంభాషణ వివాహ విషయాలమీద నుంచి అనేక సాంస్కృతిక విషయాలమీదకు దొర్లింది. చివరకు ఆయనగారు లేచి వెళ్ళబో తూంటే చెప్పాను, రెండు మూడు రోజులలో ఇంటికి వెడుతున్నాను, ఇంటికి వెళ్ళిన తరువాత ఆలోచించి ఉత్తరం వ్రాస్తానని. వారుభయులు వెళ్ళిపోయారు. బయటి గేటు వరకు వారిని పంపి వచ్చాను. గేటు దాటి వెడుతూ మరొకసారి వెనక్కు తిరిగి నన్ను చూశారు ఆయనగారు ప్రేమతో.

ఆ రాత్రి అంతా ఆలోచనలో పడిపోయాను. అమ్మాయని చూడకపోయినా కూడా అమ్మాయి తండ్రిలోని గొప్ప గుణాలు నన్ను ఆకర్షించినాయి. ఆ రాత్రి ు నిర్ణయానికి చేరుకోలేక నిద్రపోలేక, నిద్ర మేల్కొలేక సతమతమయ్యాను.

ఆ సాయంత్రం రామకృష్ణా, ఆ నూతనయువతీ, మరొకరిద్దరు మిత్రులూ లిసి మహాబలిపురం పోయినారు రామకృష్ణ తిరిగే పెద్ద కారులో. ప్రొని న్ను ుడు నడపడానికి తీసుకవెళ్ళాడు. ప్రొ సు వచ్చి నా అనుమతి తీసుకొనే వాళ్ళ రులో వెళ్ళారు రేపు మధ్యాహ్నానికి తిరిగి వస్తానని చెప్పి. ఇదివరకెప్పుడూ

లేని పద్ధతిలో నా కాళ్ళకు వంగి నమస్కారం చేసి వెళ్ళాడు. నా మనసు చివుక్కు-మన్నది. అతనిమీద అమితంగా జాలి వేసింది. ఇదే ఆఖరి చూపా అనిపించింది. అధోచేతనలోని అజ్ఞాతపరిధులలో. అతను పోతూ పోతూ వెనక్కు వెనక్కు తిరిగి నావైపు చూస్తూ వెళ్ళాడు. నా కంటినుంచి ఒక అశ్రుకణం క్రిందపడలేక కంటిలోనే ఇంకిపోయింది. ఆపలేక అన్నాను దూరంగా పోయిన ఫ్రాన్సిస్‌తో "మళ్ళీ రేపు ఈ సమయానికి తిరిగివస్తావు కదూ ఫ్రాన్సిస్ ?"

## విషాద సంఘటన

విద్రపట్టని అర్ధరాత్రి, పన్నెండుగంటలకు క్రింద కారుల శబ్దమూ, మానవుల అరుపులూ వినిపించినాయి. నేను ఆందోళనతో లేచి క్రిందకు వెళ్ళిచూస్తే నన్ను నేను నమ్మలేకపోయాను. స్వప్నమో, జాగృతో కూడా నా కర్థం కాలేదు. డ్రైవర్ ఫ్రాన్సిస్ శవం వరండాలో పడుకోబెట్టి వుంది. రామకృష్ణ. ఆ నూతన యువతీ కూడా తలల కట్లతో రోదన పెడుతున్నారు అర్ధచైతన్యంతో. కొంత సేపటికి అర్థమైంది నాకు. మహాబలిపురం రోడ్డుకు ఫ్రాన్సిస్ బలిఅయినాడని. కారుప్రమాదంలో ఫ్రాన్సిస్ మరణించాడు; రామకృష్ణకు, నూతన యువతికి, ఇంకా ఇతరులకూ స్మృతితప్పే దెబ్బలు తగిలాయి, తలలు పగిలాయి, ఎముకలు విరిగాయి, కీళ్ళు తొలగాయి. నా కాళ్ళక్రింద భూమి క్రిందకు క్రుంగిపోతున్నట్టు అయింది నాకు. ఇక నేను అక్కడ నిలవలేక మళ్ళీ పైకిపోయి పడుకున్నాను.

ఎంతో మంచివాడైన డ్రైవర్ ఫ్రాన్సిస్ ఇక లేడు. ఇంకా అతని పెళ్ళి కొద్దిరోజులే వుంది. వధువుకు ఈ వార్తఅందితే ఆమె ఎంతగావిచారిస్తుందో మరి; ఎందుకో ఆ సాయంకాలం మహాబలిపురం పోతూ అంతిమ వీడ్కోలులాగా చేసి వెళ్ళాడు ఫ్రాన్సిస్. అప్పుడు అతని ముఖంమీద మృత్యుఛాయలు అస్పష్టంగా గోచరించినట్టు నాకు అస్ఫుటంగా తట్టింది, కాని ఆ అస్ఫుటభావనకు నేను విలువ ఈయలేదు. ఈ విధమైన వికలమానసం నుంచి వెలువడే భావనలతో తెల్లవారింది. క్రిందకి వెళ్ళి చూస్తే ఫ్రాన్సిస్ శవం లేదు. పోస్టుమార్టంకు వెళ్ళింది. గాయాలు పడినవారంతా బాధతో పెద్దగా మూలుగుతున్నారు. నన్ను చూచి మంచంలో బాధ పడుతున్న రామకృష్ణ పెద్దగా ఏడుపు ప్రారంభించారు. తనకు గాయాలు తగిలినందుకు కాదు, "మీ డ్రైవర్‌ను చంపాను" అని ఏడ్వడం. అటువంటిస్థితిలో ఏమి ఓదార్పుగలం? రామకృష్ణకు తలమీద బలమైన గాయాలు తగిలాయి; వెన్ను విరిగిన లక్షణాలు కనుపించసాగాయి. డాక్టర్లు వచ్చి పరీక్షలు చేస్తున్నారు.

అసలు మహాబలిపురం దారిలో ఏమి జరిగింది, ఫ్రాన్సిస్ ఎందుకు మర ణించాడు; వీళ్ళందరికీ ఇంత దురవస్థ ఎందుకు ప్రాప్తించింది. మొదలైన విష యాలను తెలుసుకోవాలంటే చెప్పేవాళ్ళు ఒకళ్ళూ కనిపించరు. చివరకు కొంత సేపటికి వార్తాపత్రికలలో చదివి తెలుసుకొన్నాను వివరాలు. మహాబలిపురం వెళ్ళే రోడ్డుమీద మహావేగంగా నడుపుతున్నాడట ఫ్రాన్సిస్ కారును. ఒక ఆవు రోడ్డుకు అడ్డం రాగా, దాన్ని తప్పుకోడానికి కారును ఒక ప్రక్కకు కోయడంతో ఆ వేగంలో కారువెళ్ళి చెట్టుకు ఢీకొనడంతో స్టీరింగ్‌చక్రం ఫ్రాన్సిస్ గుండెలకు గ్రుద్దుకొనగానే రక్తం క్రక్కి ఫ్రాన్సిస్ ప్రాణాలు వదిలాడట. మిగతా వెనక సీటులో వున్న వాళ్ళందరికీ బలమైన గాయాలు తగిలినవట.

ఇక నాకు ఆ యింట వుండబుద్ధి పుట్టలేదు. ఆపదలో వున్న వ్యక్తులను వదలి తుమ్మపూడి వెళ్ళిపోవడం బాగుండదు. ఇక నాకు ఏమీ తోచక మార్సెలాఫో హార్డీని రమ్మని ఫోన్ చేశాను. ఆమె వచ్చిన తరువాత నా హృదయానికి కొంత ప్రమితం చిక్కింది. డ్రైయివర్ ఫ్రాన్సిస్ మరణానికి ఆమెకూడా ఎంతో చింతించింది. ఎవరెవరో నగరంలోని పెద్దలు వస్తున్నారు. బాధలో వున్న రామ కృష్ణను పరామర్శిస్తున్నారు. వెళుతున్నారు. ఫోన్‌లో పిలచి అడిగినవారికి నేను సమాధానాలు చెబుతున్నాను.

ఆ నూతన యువతి మూలంగానే ఇంత అనర్థకం ఏర్పడింది అని ప్రతి వాళ్ళూ చాటుగా చెప్పుకోసాగారు.. పాపం ఆమెకు విపరీతంగా గాయాలు తగిలి బాధ భరించలేక నేను కనుపించినపుడల్లా ఆమె నాకు నమస్కారాలు పెట్టసాగింది. నేను వెళ్ళి ఆమెదగ్గర కూర్చున్నాను. ఆమె ఏకధారగా కన్నీరు కార్చసాగింది. తాను ఈ యింటిలో ప్రవేశించడమే తప్పు అని, తన మూలంగానే ఈ ముప్పు అంతా వాటిల్లినదని నా చేతులలో ముఖంపెట్టి పెద్దగా శోకించసాగింది. ఆపదలో బాధలలో మనిషిలోని నిజస్వభావం బయటికివస్తుంది. ఆమెను ఓదార్చి నా ప్రయా ణం విషయం తెలిపాను. రెండుమూడు రోజులలో ఇంటికి వెళ్ళబోతున్నట్టు. కాని ఆమె నన్ను బ్రతిమాలసాగింది ఇంకా కొద్దిరోజులుండి పొమ్మని. తన భవిష్యత్తు అంతా అంధకారమయంగా వున్నదనీ ఆమెచెప్పింది. వీలున్నప్పుడల్లా తనవద్ద కొంతసేపు గడపమని, ఆవిధంగా అయితే తనకు మనశ్శాంతి కలుగుతుందని.

మద్రాసులో మిత్రుల దగ్గర సెలవుతీసుకొని, మరల వారంలో తిరిగి వస్తా నని చెప్పి రామకృష్ణను వప్పించి, **"Silpi"** వ్యవహారాలను అనిర్ణీత రూపం లోనే మార్సెలాహార్డీకి వదలి నేను తుమ్మపూడి చేరుకొన్నాను.

చాలా రోజులకు తిరిగివచ్చినందుకు సోదరి భారతి ఆనందించింది. అడిగింది: "మద్రాసునుంచి వదినతో కలసి వస్తావు అనుకొన్నాను, నీవు ఒక్కడవే వచ్చావు ఎందుకని అన్నయ్యా" అని. వదిన నిమిత్తమైకాక బావమరది కూడా దొరుకుతాడేమోనని మద్రాసు అంతా గాలించితే ఇద్దరూకూడా దొరకలేదు; కనుక మనం ఇద్దరంకూడా అదృష్టవంతులమే చెల్లి" అన్నాను.

మద్రాసునగరం నుంచి వచ్చిన సాయంత్రమే కాలవకట్టకువెళ్ళి మామిడి పూత బాగా పూచివున్న ఒక మామిడిచెట్టు క్రింద కూర్చుని మద్రాసులో హృదయంమీద పడిన ముద్రలన్నిటినీ తుడిచివేయ ప్రయత్నించాను. కొన్ని చెరిగివాయి, కొన్ని చెరగక ఆ విధంగానే వుండిపోయాయి, మరికొన్ని మొదటికంటె విస్పష్ట రూపాలు దాల్చసాగాయి!

# ఆదర్శాలు, ఆచరణమధ్య అంతరాలు

గులాబీకి గుడ్లగూబకు భేదం ఏమిటి? చిలుకకూ ఎలుకకూ తారతమ్యం ఏమిటి? మిన్నుకూ మన్నుకూ తేడా ఎక్కడ? లోతులను మించిన లోతుకు దిగి ఆలోచిస్తే తారతమ్యమేమీలేదు. ఇవన్నీకూడా ఎలక్ట్రాన్ ప్రోటానుల నిర్మాణమే. కనుపించని దశలో వీటికి భేదంలేదు. కనుపించే దశలో మాత్రం కావలసినంత భేదం వుంది. రూపంలో భేదం రంగులో భేదం, గతిలో భేదం స్థితిలో భేదం, గుణంలో భేదం దోషంలో భేదం. ఈ విధంగా అన్నింటిలోనూ భేదమే కనుపించుమేర, ఇక ఈ భేదం మానవులలో ఇంకా అధికం. స్వరూపంలోను స్వభావంలోను ఈ భేదం అధికంగా గోచరిస్తుంది. ఈ బేదం స్త్రీ పురుషులలో ఇంకా ఎక్కువ ప్రాముఖ్యాన్ని వహించివుంది.

స్త్రీలు, పురుషులుకూడా మనుషులే అయినప్పటికీ వీరి ఆకృతులలోను ప్రకృతులలోను వున్న బేదం మనుషులకు, మనుషులుకాని వాటి మధ్యకూడా వుండదు. ఇతర గ్రహాలలో నివసించే జీవులుఎవరైనా మొదటిసారిగా భూలోకాన్ని దర్శించడం జరిగి, కొందరు పురుషులను మాత్రమే ముందుగా చూడడం జరిగి, ఆ పురుషులు మనుషులని తెలుసుకొన్న తరువాత స్త్రీలను చూడడం జరిగితే వారుకూడా మనుషులేఅని ఆ ఇతర గ్రహనివాసులు గుర్తించలేరు. స్త్రీలను ముందు చూచి తరువాత పురుషులను చూడడం జరిగితే పురుషులనూ అంతేఅనుకొంటారు. స్త్రీలూ పురుషులూ కూడా ఒకే మానవజాతికి చెందినవారు అని విశ్వసించడానికి వీలులేనంత తారతమ్యం ఇమిడివుంది వీరిమధ్య!

వీరిమధ్య ఇంత తారతమ్యం ఇమిడివుంది కనుకనే వీరికి ఒకరిపై ఒకరికి అంతగా అనురాగం! పరస్పరంవున్న సహజ విబేదాన్ని మరచి ఒకరిలో ఒకరు ఐక్యం కావాలనే ఆరాటం. స్త్రీకి స్త్రీమీద, పురుషునకు పురుషునిమీద అనురాగం వుండదని కాదు, వుంటుంది. కాని స్త్రీకి పురుషునిమీద, పురుషునకు స్త్రీమీద ఇంకా ఎక్కువ గాఢానురాగం వుంటుంది. అయితే అందరు పురుషులకు అందరు స్త్రీలమీద గాఢానురాగం వుండదు. అదేవిధంగా అందరు స్త్రీలకు అందరు పురుషులమీద కూడ వుండదు. గాఢానురాగం లేని స్త్రీ పురుషులు కలిసి వుండజాలరు. గాఢానురాగం వున్న స్త్రీ పురుషులు విడివడి వుండజాలరు.

గాఢానురాగం గల ఒకపురుషుడూ, ఒక స్త్రీ ఒకచోట కలిసి నివసించడాన్ని దాంపత్యజీవితం అనడం జరుగుతున్నది. ఈ విధంగా జంటగా జీవించడానికి

వివాహం అనే వ్యవస్థద్వారా లైసెన్సు పొందడం జరుగుతూంది. అయితే ఇది క్రమేణ ఏవిధంగా పరిణమించినదంటే అనురాగం లేనివారుకూడా వివాహంద్వారా ఒకచోట వుండడం జరగజొచ్చింది. ప్రేమించి వివాహం చేసుకోవడంకంటే వివాహం చేసుకొని ప్రేమించడం అధికవ్యాప్తిలోకి రాజొచ్చింది, ప్రత్యేకించి మనదేశంలో. సరే, ఏమైనప్పటికీ, పురుషునికి ఒక స్త్రీ, స్త్రీకి ఒక పురుషుడూ జీవితంలో మిగతా విషయాలకంటే ఎక్కువ అవసరమయారు.

సోదరి భారతి వివాహం జరిగిపోయింది 1949 జూన్‌లో. బావమరది భూపాల్ చాలా యోగ్యుడు. భార్యకుతగిన భర్త మాత్రమే కాక బావకు తగిన బావ మరదికూడా. సోదరి భారతి, ఆయనా, నేను ఎక్కువగా ఒకచోట కూర్చొని ఎక్కువ సమయం ఆనందంగా గడిపేవాళ్ళం. నా సాంస్కృతిక జీవితంమీద ఆయనకెంతో మక్కువ. తుమ్మపూడిలో సోదరి భారతిలేని లోపం నాకు తట్టినప్పుడల్లా గుంటూరులోవున్న ఆమె దగ్గరకు వెళ్ళి నాలుగురోజులు గడిపి వచ్చేవాణ్ణి.

## నా ఉపన్యాసం

ఒక సాయంత్రం గుంటూరులోని థియసాఫికల్ మందిరంలో నా ఉపన్యాసం ఏర్పాటుచేశారు. పురప్రముఖులంతా చాలామంది హాజరైనారు. సోదరి భారతి నా ఉపన్యాసాన్ని ఎప్పుడూ వినివుండనందున అన్నయ్య ఉపన్యాసం వినాలని చాలా కుతూహలంతో వచ్చి కూర్చున్నది. "జీవితమూ ఆదర్శాలూ" అనే విషయంపై ప్రసంగించాను. ఆదర్శాలన్నీ ఆచరణలోకి రూపాంతరంకాకపోయినా ఫరవాలేదు. ఆచరించక పోయినంతమాత్రాన ఆదర్శాలు వుండరాదనడం సమంజసం కాదు. ఆదర్శాలు అనేవి వుంటే ఈనాటికికాకపోయినా ఏనాటికైనా వాటిలో కొన్ని అయినా ఆచరణలోకి రాకమానవు. అసలు ఆదర్శాలు అనేవి ఆచరణలోకి రాకపోయినా ఫరవాలేదు. ఆచరణనిమిత్తం ఆదర్శాలుకాక ఆదర్శాల నిమిత్తమే ఆదర్శాలు చాలు, అని ప్రసంగిస్తూ జీవితంలోని ప్రేమలు, ద్వేషాలు, ఇష్టాలు, అయిష్టాలు, కష్టాలు, నష్టాలు, స్వేచ్ఛాబంధన, వ్యాధి, బాధ, జననాలు, మరణాలు మొదలైన వాటన్నిటినిగురించి కూడా ప్రసంగించాను. ఇది నా తొలి ప్రసంగం గుంటూరులో. ఈ సభకు డాక్టర్‌గారి భార్య అన్నపూర్ణకూడా హాజరయింది. ఉపన్యాసానంతరం ఆ రాత్రి ప్రొద్దుపోయేవరకు గుంటూరులో సోదరి ఇంటివద్ద ఇష్టాగోష్ఠిలో కూర్చున్నాం.

వర్షాలు వెనకబడకుండానే శరత్కాలం ప్రవేశించింది. అంటే శరత్కాలం ప్రవేశించినా కూడా వర్షాలు కురుస్తూనే వున్నాయి. ఒకరోజు ఉదయం ఎందరు ఆటంకపరచినా ఆగకుండా గుంటూరునుంచి తొమ్మిదిగంటల ప్రాంతంలో తుమ్మ పూడికి బయలుదేరి వర్షంలోనే ఒకమాదిరి గాలిలోనే గుంటూరు రైలుస్టేషన్‌కు వచ్చాను. వర్షమూ ఎక్కువైనది. దానికితోడు తూర్పునుంచి తోలేగాలి ఎక్కువైనది. అంతలో బెజవాడవెళ్ళే రైలుబండి వచ్చింది. నన్ను ఎక్కించుకొని కదిలింది. బండి వేగంతోపాటు గాలివేగం కూడా హెచ్చింది. మూడు వేగాలగుండా నేను పయనిస్తున్నాను. గాలివేగం, వర్షం వేగం, రైలువేగం. ఈ మూడు వేగాలకంటె ఎక్కువ వేగంగా పయనిస్తోంది నా మనోవేగం.

రైలు నిరాటంకంగా కృష్ణానదిని దాటి బెజవాడ చేరుకొంది. కృష్ణానదిమీద ఆ గాలివానదృశ్యం మహాభీతావహంగానూ, మనోహరంగానూ కూడా వున్నది. బెజవాడలో దిగి మరొక రైలుబండి ఎక్కి మధ్యాహ్నం పన్నెండుగంటలకు ఇల్లు చేరుకున్నాను, బ్రహ్మాండమైన గాలివానలో. నేను రైలు దిగినది మొదలు వానా గాలీ బీభత్సరూపం దాల్చాయి. బహుశా రైలు ప్రక్కస్టేషన్ చేరుకొని ఆగిపోయి వుంటుంది ముందుకు సాగిపోకుండా. నేను ఇంటికి చేరుకొన్నది మొదలు వాతావరణం ప్రళయరూపం దాల్చింది. ఉరుములూ, మెరుపులూ, ధారాపాత వర్షమూ, విపరీతమైన గాలీ. పాతగోడలపైవున్న ఇళ్ళు కూలిపోతున్నాయి. ఎత్తయిన చెట్లు విరిగిపడుతున్నాయి. చెట్లకొమ్మలమీద గూళ్ళుకట్టుకొన్న కొంగలూ, కాకులూ వాటి పిల్లలతోసహా చచ్చి క్రింద పడుతున్నాయి. కొన్ని క్రిందపడి చస్తున్నాయి. దృశ్యప్రకృతి అంతా ఊగిపోతున్నది. భూమి మొత్తం నీటిమయం, ఆకాశమంతా మేఘాలతోనూ, వర్షధారలతోను నిండిపోయింది. కొంతదూరానికి అవతల వున్న దేమీ కనిపించడంలేదు.

వేసవిలోని వర్షంలోనూ, వర్ష ఋతువులోని వర్షంలోను చలి అనిపించదు. కాని శరత్కాలపు వర్షంలో అందులో గాలివానలో చలివేస్తోంది బాగా. నేను బాగా తడిసిరావడంలో ఇంకా ఎక్కువ చలి వేయసాగింది. పొడి దుస్తుల సహాయంతో కొంతవరకు చలిని పోగొట్టుకొని ప్రకృతిలో చెలరేగుతున్న ఈ విలయతాండవాన్ని చూస్తూ పడుకొన్నాను. ఊరులోని కొన్ని కొన్ని పెద్ద పెద్ద చెట్లు విరిగి పడిపోయినాయి. కాలవకట్టమీద నాకొక ప్రియమైన పున్నాగచెట్టు వుండేది. శరత్కాలం మొదలు శీతాంతం వరకు నిత్యమూ ఉదయానే వెళ్ళి ఆ చెట్టుక్రిందరాలిన

పున్నాగపూలను తెచ్చుకొనేవాణ్ని. సాయంత్రం ఆ చెట్టుక్రింద కొంతసేపు విశ్రమించేవాణ్ణి ఆ పున్నాగసుగంధంలో. ఆ చెట్టూకూడా గాలివానకు పడిపోతుందేమో అని ఆందోళన కలగసాగింది. కాని మనం దాన్ని రక్షించజాలనప్పుడు దాన్ని గురించి ఆందోళన చెందడం సబబుకాదని ఆందోళనచెందడం మానివేశాను.

ఆ పగలూ రాత్రీకూడా గాలి వాన తోలి రెండవరోజు ఉదయానికల్లా ఆగిపోయింది. నేను వెంటనే బయలుదేరి కాలవకట్టకు వెళ్ళి చూస్తే పున్నాగచెట్టు మొదలంటా పడిపోక సగానికిమాత్రం విరిగి పడిపోయి వుంది. సగానికి విరిగినందుకు చింతకలిగినా సమూలంగా పడిపోనందుకు సంతోషం వేసింది ! నేలంతా పున్నాగపూలతో తెల్లబారిపోయింది. పున్నాగపూల వాసనలో ఒక అతీంద్రియానుభూతి కలగసాగేది నాకు.

## పుష్పం : పూబోడి

సగం విరిగిన చెట్టు సజీవంగా వున్నట్టే అని భావించాను. సగం తెగిన మనిషికాని, జంతువుకాని సజీవంగా వున్నట్టు కాక నిర్జీవంగా వున్నట్టు లెక్క. కాని చెట్టుకుమాత్రం ఆ ప్రమాణం లేదు. అది సగం తెగినా మూడువంతులు తెగినా మళ్ళీ చిగురువేసి జీవిస్తుందికాని మరణించదు. ఇది అన్నిచెట్లకు వర్తింపక పోవచ్చు. కాని సాధారణంగా చెట్టుజాతికి వర్తిస్తుంది. అమవంటప్పుడు, మనిషి కంటె చెట్టు ఎక్కువ అమరజీవి, అందుకని మనుషులందరికంటె చెట్లు అన్నీ ఎక్కువ విలువగలవేమో తెలియదు కాని స్త్రీ జన్మకంటె పుష్పం జన్మ శ్రేష్ఠమని నారాయణతీర్థులు తన తెలుగు "పారిజాతాపహరణం"లో సత్యభామచేత అనిపిస్తాడు.

"పుడమిలోపల నాదు పుట్టువుకంటె
నడవిలో నొక పుష్పమై యున్న మేలు"

సరే ఏది ఏమైనా, నాకు ప్రియమైన పున్నాగచెట్టు సగం విరిగికూడా సజీవంగానే వున్నందుకు సగం సంతోషంతో ఇంటికి తిరిగివచ్చాను. మళ్ళీ సంవత్సరానికి కాని అది చిగురు తొడిగి పూవు పూయదు. మళ్ళీ సంవత్సరంనాటికి కూడా ఇదే గాలివానవస్తే అప్పుడేమవుతుంది ఈ పున్నాగ? ఈ గాలివానకు సగం విరిగింది. వచ్చే గాలివానకు మొత్తం సమూలంగా పడిపోతుంది. సగం విరిగిన సజీవపున్నాగ ఆనాడు సాంతం పడి నిర్జీవమవుతుంది. ఆ విధంగా నిర్జీవమైన పున్నాగనుచూస్తే నాకు ఏమి అనిపిస్తుందో!

గాలివాన మూలంగా గ్రామంలోని ఇళ్ళూ వాకిళ్ళూ, చెట్టు చేమలూ, పైర్లూ పంటలూ ధ్వంసమైనాయి. గ్రామంలోని చాలమంది పేదవాళ్ళ ఇళ్ళు పడిపోయాయి. వారంతా రాత్రినుంచి ఉపవాసాలు చేస్తున్నట్టు తెలిసింది. అంతటితో గ్రామంలోని

సేవాశీలురైన నవయువకులంతా కలిసి వంటచేయించి పేదవారందరికీ భోజనాలు ఏర్పాటు చేశారు. తిన్నవాళ్ళూ, పెట్టినవాళ్ళు కూడా సంతృప్తి చెందారు.

తుఫాను అనంతరం తెల్లని ఎండతో నిండిన నీలాకాశం ఎంతో హాయిగా కనిపించసాగింది ఆ శరత్కాలంలో. క్రమేణ తుఫాన్ రేపిన నష్టకష్టాలను జనులు మరచి యథావిధిగా జీవయాత్ర సాగించసాగారు. విరిగిపోగా మిగిలి వున్న కొమ్మలమీద మళ్ళీ కాకులూ, కొంగలూ గూళ్ళు నిర్మించుకొని గ్రుడ్లు పెట్ట సాగాయి. పత్రికలనిండా కొన్నాళ్ళపాటు దేశంలో జరిగిన నష్టాలననుసరించిన ఉదంతం వెలువడుతుండేది.

నేను ఆ గాలివానలో బయలుదేరి గుంటూరునుంచి సరిగా ఇల్లు చేరానో, లేదో అని గుంటూరువారు ఆ రెండవరోజు నాకు కబురుచేసి తెలుసుకొని నిరపాయంగా ఇల్లు చేరినందుకు సంతోషించారు.

తుపాన్ కల్లోలం అణగిన తరువాత మళ్ళీ నా పుస్తకాలలో నా తల దాచుకొన్నాను. అధ్యయనం, రచనలు సాగిపోసాగినాయి. చలికాలపు బయటి జీవితం నా సృజనాత్మక రచనలకు ఎంతో ప్రేరణనిస్తూ వచ్చింది. డిశంబర్ వెళ్ళగానే 1950 సంవత్సరం ప్రవేశించింది.

# ఎట్టకేలకు జరిగిన నా వివాహం

**1950** వ సంవత్సరం రావడం అంటే ఇరవయ్యో శతాబ్దంలోని సగ భాగంలో మనం ప్రవేశించినట్లు అనిపించింది. గడవవలసిన ఇరవయ్యో శతాబ్దపు సగభాగం ఏ విధంగా వుంటుందో మరి! ఆ భాగంలోని రాజనైతిక, ఆర్థిక సామాజిక, సాంస్కృతిక, పారివారిక, వైయక్తిక జీవితం ఏవిధంగా వుంటుందో !! రానున్న సగభాగంలో ఎన్ని వైజ్ఞానిక అద్భుతాలు ఉద్భవించవలసి వున్నవో!!!

నేను వివాహితుడుగా వుండడమో లేక అవివాహితుడుగా వుండడమో ఈ 1950 లో తేలిపోవాలని నిర్ణయించాను. ఈ సమస్యను ఇక పొడిగించదలచలేను. ఈ సుదీర్ఘ సమస్యకు ఈ సంవత్సరంలో పరిష్కారాన్ని ప్రసాదించాలని దృఢ నిర్ణయానికి వచ్చాను. నేను తుమ్మపూడిలో నివసించడమా లేక తుమ్మపూడిని వదలడమా అనేది ఈ సమస్యా పరిష్కారం మీదనే ఆధారపడి వుంటుంది.

బొంబాయిలో **Youth Art & Culture league** అనేదాన్ని కొందరు స్థాపించి దానిలో నన్ను పాల్గొనమనీ, వాళ్ళు నడుపుతూన్న పత్రికలో నన్ను వ్యాసాలు వ్రాయమనీ కోరారు. అందుకు సమ్మతించి సాంస్కృతిక విషయాలకు సంబంధించిన కొన్ని చిన్న వ్యాసాలు రచించాను. అందు; చిత్రకారులను గురించి, ఫొటోగ్రఫీని గురించీ వ్రాశాను. నేను తీసిన ఫొటోలుకూడా కొన్ని అందులో ముద్రించబడినాయి. ఫొటోగ్రఫీపై మోజు ఎక్కువైనది. కొన్ని ఫొటోలను పెద్దవిగా ఎన్‌లార్జు చేసి కొన్ని ప్రదర్శనాలలోకూడా ప్రదర్శించసాగాను. కలం స్థానాన్ని కెమెరా ఎక్కడ మింగివేస్తుందో అని భయం వేయసాగింది. అందుకని సాధ్యమైనంతవరకు కలానికే ప్రాధాన్యం ఇవ్వసాగాను. అయినప్పటికీ కెమేరా నన్ను విడువకుండా వెంట వుంటూనే వుంది.

## సర్ప దర్శనం

అది వసంతకాలపు సంధ్య. అకాల వర్షాలమూలంగా ఎటుచూచినా పచ్చని గడ్డితో ప్రకృతి ప్రాణస్పందన చెందుతోంది. సాయంకాలం పశ్చిమాకాశంలో వారింజమబ్బులు తేలిపోతున్నాయి. దూరాన ఒకే ఒక మోడుచెట్టు ఆ సాంధ్య గగనానికి ఛాయారూపంలో నిలచివుంది. దాన్ని ఫొటోతీసే కెమెరా దగ్గర కూంచుకొని ఆ పచ్చిక మైదానంతో సూర్యుని సాంధ్యరాగాన్ని తిలకిస్తున్నాను. నా కెదురుగా పచ్చికలో ఏదో చిన్న శబ్దం వినిపించింది. నా దృష్టిని సుదూర సిందూర దిగంతం

నుంచి సమీపంలోని పచ్చికమీదకు దింపాను. నన్ను నేను నమ్మలేకపోయాను. మంచి గోధుమవన్నె తాచుపా మొకటి ఆ సంధ్యాకాంతిలో మిలమిల మెరుస్తూ గడ్డిలో ప్రాకుతూ నావైపు వస్తోంది.

నాకేమి చేయాలో తోచలేదు. లేచి పరిగెత్తాలో లేక కెమెరాతీసుకొని ఫోకస్ చేసి ఆ పామును ఫొటో తీయాలో తెలియక నిర్ఘాంతపోయి చూస్తూ కూర్చున్నాను. నాకు అయిదారు గజాల దూరంలో నిలచి పడగవిప్పి ఆడసాగింది. భయమూ, కుతూహలమూ, ఆనందమూ త్రివేణిగా పారుతున్నాయి నా హృదయంలో. నేను అక్కడే వుండడమా లేక లేచి దూరంగా పోవడమా అనేది తేల్చుకోలేక దగ్గరున్న కెమెరాను తీసి పడగవిప్పి ఆడుతున్న త్రాచుపాముమీద ఫోకస్ చేయ ప్రారంభించాను. నేను ఫోకస్ చేయడం పూర్తికాకముందే అది పడగ ముడిచి జర జర పారిపోయింది. నా ప్రయత్నం ఫలించలేదు. సర్పరూపం కెమెరాలోని నెగెటివ్‌మీద ప్రవేశించనే లేదు!

తరువాత ఇంటికొస్తూ జరిగిన ఘట్టాన్ని గుర్తుచేసుకొన్నప్పుడు గడచిపోయిన దృశ్యంలోని ప్రమాదం తెలియవచ్చింది. హృదయం కొంచెం భారంగా అనిపించింది. త్రాచుపాము పడగ నిప్పుతో నిర్మించిన పడగగా కళ్ళఎదుట ప్రతిబింబించింది. దాని నోటినుంచి వెలువడే నాలుకలు మేఘంలోని మెరుపులవలె తట్టినాయి. నేను అప్పటికి ఎన్నోపాములను నిర్జన ప్రదేశాలలో చూశాను కాని ఈ పామును చూచినంతగా నేను చలించి వుండలేదు.

మిగతా అన్ని క్రూరజంతువులకంటె కూడా మనిషికి పాము అంటే ఎక్కువ భయం. పులి మనిషిని చంపుతుంది. పులి అంటే మనిషికి భయమే, కాని పులి ఆకారమంటే మనిషికి భయంవుండదు. చచ్చిన పులిదగ్గరకు వెళ్ళి దాని శరీరంమీద చేయివేసి సవరించగలం. కాని చచ్చిన పాము శరీరంమీద చేయివేసి సవరించజాలం. పాము ఆకారానికున్న ప్రత్యేకత అది. మిగతా జంతువులలో లేని ఒక వింత గగుర్పాటు పాము ఆకారంలో వుంది.

ఆ సాయంత్రం కనుపించిన పామును ఫొటో తీయజాలకపోయానుకదా అనే చింత కొంతసేపు బాధించింది. అది నెగెటివ్‌మీద ముద్రపడినట్లయితే అది ప్రింటులో ఏవిధంగా రూపొందేదో ఊహాచిత్రంలో దర్శించసాగాను.

## వైవాహం

ఎండాకాలం చివరన జూన్ మాసం ప్రవేశించింది. సంవత్సరం క్రితం ఈ

నెలలో సోదరి భారతి వివాహం అయింది. ఈ సంవత్సరం జూన్‌లో నా వివాహం అయింది. వధువు పేరు సులోచన. కొంత చదువుకొన్న యువతి. చదువుకంటె ఎక్కువగా ఆమెలో సంస్కారం వున్నది. కనులు కొంచెం పెద్దవి గనుకనే సులోచన అనే పేరు ఆమెకు వచ్చిందేమో తెలియదు! ఆమె రాకతో నా ఒంటరి జీవితం జంట జీవితంగా మారింది.

సులోచన స్వభావం నాకు నచ్చింది; ఆమె స్వరూపం నాకునచ్చింది. మనిషి అంటే ప్రధానంగా స్వరూప స్వభావాల కూడికయే. కొందరి స్వరూపాలు నచ్చితే స్వభావాలు నచ్చవు. స్వభావాలు నచ్చితే స్వరూపాలు నచ్చవు; రెండూ నచ్చితే ధన్యజీవులే. నామటుకు నేను ధన్యజీవినే అని సంతృప్తి చెందాను. ఆమె ఇంటిలో ప్రవేశించినది మొదలు నాలోని ప్రతిభలకు ఏదో నూతనకాంతి అబ్బినట్టు తట్ట సాగింది. ఆమె సాన్నిధ్యంలో నా రచనలు ఇదివరకంటె వేగంగా, రసవంతంగా సాగిపోసాగాయి. ఎక్కడో హృదయం అడుగున పొరలలో దాగివున్న ఏదో బెంగ తొలగిపోయినట్టు తట్టసాగింది. కార్యరంగంలో ఒక చురుకుదనం, కావ్యరంగంలో ఒక తీయదనం ప్రవేశించసాగాయి,

కొన్నాళ్ళు అయిన తరువాత సింహావలోకనం చేసి చూచుకొని తెల్సు కొన్నాను వివాహం చేసుకోడం అనేది నా జీవితంలో ఏమాత్రమూ పొరపాటు కాదని, అది అన్నివిధాలా సముచితమే అనీ.

బళ్ళారినుంచి ఒక వకీల్ శామారావు అనే వ్యక్తితో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి. ఆయన మాతృభాష కన్నడం, అయినా తెలుగుతో కూడా బాగా పరి చయం వుంది. ఆయన ప్రతిభ బహుముఖమైంది. ఆంగ్లంలో కవితలు రచిస్తాడు; వివిధ విషయాలమీద వ్యాసాలు రచిస్తాడు; పాడతాడని తెలుసుకాని ఆడతాడో లేదో తెలియదు; భారతీయవిధానంలో చిత్రరచన చేస్తాడు. మంచి సాంస్కృతిక మైన విలువగల ఉత్తరాలు వ్రాస్తుండేవాడు.

బెంగుళూరులోని ప్రసిద్ధ ఫొటోగ్రాఫర్ డాక్టర్ జి. థామస్‌నుంచి కూడా ఫొటోగ్రఫీని గురించి ఉత్తరాలు రాసాగాయి, **Photographic Society of America** కు సభ్యునిగా కూడా అయినాను. ఆ సొసైటీ పత్రిక ప్రతినెలా వస్తుం దేది అమెరికానుంచి. మంచి మంచి బొమ్మలతో, విలువైన వ్యాసాలతో, చాలా కమనీయంగా వుంటుండేది ఆ పత్రిక. భారతదేశంలోని, ఇతర దేశాలలోని అనేక మంది సుప్రసిద్ధ ఫొటోగ్రాఫర్లతో ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా పరిచయం ఏర్పడింది.

నా వివాహమైనదని తెలిసిన తరువాత అనేకమంది పాతమిత్రులు, ప్రత్యేకించి వివాహం కానివారు. అవివాహిత జీవితం బాగుండేదా లేక వివాహిత జీవితం బాగుంటున్నదా అంటూ ఉత్తరాలు వ్రాయసాగారు. వివాహం కాకముందు అవివాహిత జీవితం బాగుండేదనీ, ఇప్పుడు వివాహిత జీవితం బాగుంటున్నదనీ వారికి జవాబులు వ్రాశాను. వ్యక్తిలో అసమర్థత ఎక్కువగా వుంటే అటు వివాహం లేకుండానూ సుఖించలేడు, ఇటు వివాహం అయీ సుఖించలేడు; జీవితంలోని రెండు దశలు కూడా అసమర్థునికి బాధాకరమే. ఇక సమర్థునికి జీవితంలోని ఈ రెండు దశలూ కూడ సుఖప్రదమే. సమర్థుడు అవివాహితుడుగాను సుఖించగలడు, వివాహితుడుగాను సుఖించగలడు, అని కూడా మిత్రులకు జవాబులు వ్రాశాను.

గుంటూరులోని ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీలో సాంస్కృతిక సప్తాహం జరుపుతూ నా ప్రకృతి ఫొటోగ్రాపులు ఆ కాలేజీలో ప్రదర్శించారు. అప్పుడు ఆ కాలేజీలో విద్యార్థిగా వుంటున్న మైనేని వెంకటనారాయణ, ఆయనసతీమణి విఠల్ కుమారి నన్ను, సులోచనను గుంటూరు ఆహ్వానించారు, ఆ వారం రోజులూ తమ అతిథులుగా వుండమని. వాళ్ళఆహ్వానాన్ని స్వీకరించి సులోచనా, నేనూ గుంటూరు వెళ్ళి ఒక వారం గడిపాం. అప్పుడు అన్నపూర్ణ మమ్మల్ని గుంటూరులో నూతనంగా వైద్యవృత్తి ప్రారంభించిన డాక్టర్ దంపతులగు డాక్టర్ సదాశివరావుగారికి, ఆయన సతీమణి డాక్టర్ జయప్రదాంబకు పరిచయం చేసింది. డాక్టర్ జయప్రదాంబ నిరుడు నన్ను మద్రాసులో తమ మెడికల్ కాలేజీలో ఉపన్యాసానికి వచ్చినపుడు చూచివున్నట్టు చెప్పింది.

డాక్టర్ సదాశివరావుగారు స్ఫురద్రూపి, ప్రతిభగల సర్జన్‌గా రూపొందుతున్నారు. ప్రతిభాన్వితుడేకాక ఆయన మంచి లౌక్యుడు, మాటకారి, సాంస్కృతిక విషయాలలో, ప్రత్యేకించి తెలుగు సాహిత్యంలో ఆయనకు మంచి అభిరుచి; డాక్టర్ జయప్రదాంబ కొంత గంభీరస్వభావురాలు; మంచి సాహితీప్రియ; స్వయంగా కొన్ని కథానికలను కూడా రచించింది ఆమె. ఆమె తండ్రిగారు కవి. ఆమె మంచి స్నేహశీలిని. సహృదయ. ఈ ఆదర్శ డాక్టర్ దంపతుల సేవ మానవసంఘాని కెంతగానో తోడ్పడగలదని భావించాను. అప్పటినుంచి వారు స్నేహితులయారు.

గుంటూరులోని ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీలో నా ఫొటోగ్రాపుల ప్రదర్శనాన్ని ప్రేక్షకులు శ్రద్ధగా చూడసాగారు. చూడడమేకాక వాటినిగురించి ప్రశ్నలు కూడా వేసేవారు. ఏమి కెమెరాతో వాటిని తీశారు? అనేది ప్రధానప్రశ్న. ఇక ఫొటోగ్రఫీతో పరిచయంవున్న వ్యక్తులు దాని ఎక్స్‌పోజరును గురించి, డయాఫ్రమ్‌ను గురించి, వాడిన కెమికల్ పదార్థాలను గురించి కూడా ప్రశ్నలు వేసేవారు. నేను అక్కడ ప్రదర్శించినవన్నీ ప్రకృతి దృశ్యాలే. వాటిలో ఒక్క మానవ మూర్తి కూడా గోచరించదు. ఆకులురాలిన మోడు చెట్లూ, మేఘాలతో నిండిన ఆకాశమూ, తాటియాకుల క్లోజప్‌లు, సాగరతీరపు దృశ్యాలు మొదలైనవి ప్రధానం.

"మీకు మనుషులంటే ఇష్టం లేదా? మనుషులను ఎందుకని ఫొటో తీయరు మీరు?" అనే ప్రశ్నలు కూడా వేసేవారు. "మనం మనుషులం కనుక మనకంటే భిన్నమైనవాటిని ఫొటో తీయటంలో నాకు ఎక్కువ ఇష్టం. మనుషులు ఇష్టమే కాని, ప్రకృతి, మనుషులకంటే ఇంకా ఎక్కువ ఇష్టం. కొందరు ఎక్కువగా మనుషుల ఫొటోలు తీస్తారు, మరి నేను ఎక్కువగా ప్రకృతి ఫొటోలు తీస్తాను, వ్యక్తికొక అభిరుచి" అని నేను జవాబులిచ్చేవాడిని.

మా దంపతుల సమయం వారంరోజులపాటు గుంటూరులో మిత్రులమధ్యా, బంధువుల మధ్యా, విద్యార్థినీ విద్యార్థులమధ్యా ఆనందంగానే గడచిపోయింది. అందరూ ప్రశంసించేవారయినా కూడా వోర్చుకోవడం కొంత కష్టంగానే వుంటుంది. అయితే మానవప్రకృతి ఎందరి ప్రశంసలనైనా భరిస్తుందికాని ఏ ఒక్కరి నిందనుకూడా భరించజాలదు! మిథ్య అయిన భూషణను భరిస్తుంది కని సత్యమైన దూషణను భరించజాలదు!!

# సాఫీగా సాగిపోతున్న కొత్తజీవితం

శ్రీమతి మార్సెలాహార్డీ మద్రాసులో గ్రంథకర్తలు, కళాకారులసంఘం స్థాపించి నన్ను దాని సభ్యునిగా చేర్చుకొన్నది. దాని తరపున "చక్ర" అనే పత్రిక నొకదాన్ని నడపబూనినట్టు, ఆ పత్రిక ప్రథమ సంచికకు నన్ను ఏమైనా వ్రాసి పంపమని కోరింది. ఏమి వ్రాయాలా అని ఆలోచించాను. గద్యంవ్రాయాలా, పద్యం వ్రాయాలా అని తర్కించుకొని చివరకు పద్యం వ్రాయాలనే నిర్ణయించుకొన్నాను.

సాధారణంగా ఆధ్యాత్మికులనబడేవారు ప్రతి విషయంలోను బాహ్యమని, అంతరమని వాడుతూ వాటి రెంటికి మధ్య ఒక బలమైనగోడను నిర్మిస్తూవుంటారు. బయటిది భౌతికమని, లోపలిది ఆత్మికమని చెబుతుంటారు. ఈ వర్గీకరణ నాకు నచ్చేదికాదు. బయటిదానికి లోపలిదానికి మౌలిక ప్రభేదం ఏమీ లేదని నా విశ్వాసం. ఈ సత్యాన్ని వ్యక్తంచేస్తూ "ఇన్ అండ్ ఔట్" అనే కవితను రచించి శ్రీమతి హార్డీకి పంపాను. దాని భావ మిది.

బహిర్జగత్తుకు, అంతర్జగత్తుకు మధ్య మౌలిక ప్రభేదాలను సృష్టించుకోవడం అంత శ్రేయంకాదు; ఈ రెంటికీ ప్రధానభేదం అభివ్యక్తిలోనే కాని అస్తిత్వంలో కాదు; ఈ రెంటికి మధ్య వున్న కంచకాన్ని పూడ్చడంలోనే మానవసమగ్రత ఇమిడివుండి, లోపల బయటలు ఎంత సమీపంలోకి వస్తే అంతమంచిది.

సుప్రసిద్ధ కవి పండితులు శ్రీ తల్లావఝుల శివశంకర శాస్త్రిగారు అప్పుడప్పుడు వచ్చి వెడుతుండేవారు. వారివద్ద వున్న క్రొత్త పుస్తకాలను నాకు ఇస్తూ నా దగ్గర వున్న కొత్తవాటిని వారు తీసుకువెడుతుండేవారు. ఒకసారి వచ్చినపుడు నన్ను సాహితీసమితి సభ్యునిగా చేర్చుకొన్నారు. కొద్దిరోజులకే గుంటూరులో సాహితీ సమితి సమావేశం జరిగింది. ఆ సమావేశంలో ప్రతి సభ్యుడు తాను వ్రాసి తెచ్చిన రచన చదవాలి. నేను రసమయ ప్రకృతి అనే వ్యాసాన్ని వ్రాసి చదివాను. సాహితీ సమితి సమావేశంలో అది విని మొదటిగా నన్ను అభినందించిన వారు కవిశేఖరులు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. శ్రీ కృష్ణశాస్త్రిగారిని చూడడం అదే ప్రథమం, ఆయన అన్నారు, "శిల్పి"లో వెలువడుతున్న మీ ఆంగ్ల రచనలను చదివేవాణ్ని. వాటిలో ఒకదాన్ని తెలుగులోకి అనువాదం చేయాలని కూడా ప్రయత్నించాను. కాని చేయజాలక పోయాను" అని. ఈ మాటలు నన్ను

సంతోషపట్టాలనే అన్నారో లేక యదార్థవిషయాన్ని తెలుపుతూనే అన్నారో నాకు తెలియలేదు. ఆ మాటలను శ్రీ కృష్ణశాస్త్రిగారు ఏ దృష్టితో అన్నప్పటికీ కృష్ణశాస్త్రిగారే అన్నారు కనుక నేను సంతోషించాను.

ఆ గుంటూరు సమావేశంలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారిని కూడా మొదటిసారిగా చూడడం తటస్థించింది. నోరి నరసింహశాస్త్రిగారినీ, మరి ఇంకెందరో తెలుగు కవులను కూడా ఆ సమావేశంలోనే ప్రథమంగా చూచాను.

నా "రసమయ ప్రకృతి"లో ఈ విధంగా వ్రాశాను. "ప్రాచీనకాలంనుంచీ కవులు, గాయకులు, చిత్రకారులు, తత్వద్రష్టలు ప్రభృతులు తమతమ రచనలలో ప్రకృతి సౌందర్యానికి రూపం ఇస్తూ వచ్చారు. మనదేశంలో కాళిదాసు తన "మేఘదూత", "కుమారసంభవం", "ఋతు సంహారం" మొదలైన రచనలలో సృష్టించిన ప్రకృతి చిత్రాలు రసికుల హృదయాలలో నిజంగా రసతరంగాలను రేకెత్తిస్తాయి. ఇక పాశ్చాత్యదేశాలలోని కవులలో ప్రసిద్ధ ఆంగ్లకవి వర్డ్సువర్తు ప్రకృతిప్రేమ జగద్విదితం. ఆంగ్లకవి వర్డ్సువర్తు తన మధురకవితలలో ప్రకృతి శోభకు అమరకల్పన నిస్తే, ఆంగ్ల రూపశిల్పి టర్నర్ ప్రకృతి సౌందర్యాన్ని తన రంగుల రమ్యకాంతులలో చిరస్థాయి చేశాడు."

హాజరయిన మిగతా సాహితీ సమితి సభ్యులందరు కావ్యతత్వాలను గురించి, శ్రీనాథుని గురించి, అల్లసాని పెద్దనను గురించి ఇంకా అనేక సాహితీ స్రష్టియలను గురించి, తమ వ్యాసాలు చదివారు. కావ్యగానాలు చేశారు. రెండు రోజులపాటు సాహితీ ప్రవంతిలో స్నానమాడటం జరిగింది ఆనందంగా.

1951 వ సంవత్సరంలో చాలా సభలలో పాల్గొనడం జరిగింది. నిడదవోలులోని సాంస్కృతిక సమితివారు తమ సమితిలో "భారతీయ సాహిత్యంపైన హిమాలయాల ప్రభావం" అనే విషయంపైన "ఉపన్యసించమని ఆహ్వానించగా వెళ్ళాను. నా పాతమిత్రులు, సంస్కారులు, సహృదయులు అయిన తాడిమేటి కుటుంబశాస్త్రిగారు స్టేషన్‌కు వచ్చి తమ ఇంటికి అతిథిగా తీసుకవెళ్ళారు. శ్రీ కుటుంబశాస్త్రి గారిని కలిసి అప్పటికి చాలాకాలమైపోయింది. సుదీర్ఘకాలానికి తిరిగి కలుసుకొన్నందుకు ఉభయులం కూడా ఆనందించాం, ఆ సాయంత్రం బహిరంగ సభ; నా ఉపన్యాసం పూర్తికాకముందే వర్షం ప్రారంభమైంది. అంతటితో సభను తిరిగి హాలులోపల జరుపుతున్నాం. భారతీయుల జీవితంమీద, సాహిత్యంమీద కళలమీద హిమాలయాలు తమ ప్రభావాన్ని ఏవిధంగా ప్రసరించిందీ విశదీకరించాను.

ఆ రాత్రి ప్రొద్దుపోయేవరకు శ్రీ కుటుంబశాస్త్రిగారు నేను అనేక విషయాలను గురించి చర్చించుకొంటూ పడుకొన్నాం. శాస్త్రిగారు మరునటిరోజు వుండి పొమ్మని బలవంతపరచారు. కాని నాకు అవసరమైన పని వున్నందున రెండవ రోజు ఉదయమే తిరిగివచ్చాను.

ఆ సంవత్సరం వేసవిని ఇంటిదగ్గరే ఏవో సాహిత్య వ్యాపంగాలతో గడిపేస్తిని. వేసవి అంతమై తొలకరి ప్రారంభించగానే శ్రీమతి మార్సెలాహార్డీ తుమ్మపూడి వచ్చి మాకు అతిథిగా ఒక వారంరోజులు ఆనందంగా గడిపింది. నిత్యం ఆమెతో సాహిత్యగోష్ఠి, సాయంత్రం కాలవలో పడవషికార్లు, రాత్రులలో ముక్తాకాశం క్రింద నిద్ర; వర్షం రాగానే మంచాలు లోనికి తెచ్చుకోడాలు; ఇటువంటి వన్నీ సాగుతుండేవి.

ఫ్రెంచ్ భాషకు, సాహిత్యానికి సంబంధించిన విశేషాలను గురించి ఎక్కువగా ప్రసంగించుకొనే వాళ్ళం. ఇంగ్లీషు చిత్రకారుల గురించి, అమెరికన్ కవుల గురించి కూడా ముచ్చటించుకొనేవాళ్ళం. ఆమెకు దక్షిణాది ఆహారం బాగా అలవాటయినందున ఆమె భోజనవిషయాలు మమ్మేమీ ఇబ్బందిపెట్టేవికావు మా వలెనే ఆమెకూడ శాకాహారి.

ఒకరోజు ఆమెను వెంటబెట్టుకొని మాకు పదిమైళ్ళ దూరంలో వున్న ఉండవల్లి గుహలకు వెళ్ళాను. ఆమె కోరిన కొన్ని శిల్పాలను ఫొటోతీసి ఆమెకిచ్చాను. ఈ గుహలవద్ద నిలచి వర్షాకాలపు కృష్ణాతీరదృశ్యాన్ని చూస్తూంటే చాలా సుందరంగా గోచరిస్తుంది. ఉండవల్లి గుహలను క్రీస్తుశకం అయిదవ శతాబ్దంలో విష్ణుకుండినులు నిర్మించారు.

విష్ణుకుండినులకు అప్పటి బెంమలూరు (ఇప్పటి వెందులూరు) రాజధాని. వీరు క్రీస్తుశకం 350 మొదలు 610 వరకు రాజ్యం చేశారు. ఉండవల్లి గుహలను మాత్రమే కాక మొగల్‌రాజపురం, సీతానగరం గుహలనుకూడా వీరే నిర్మించారు. ఈ గుహలలో కొన్ని సుందరమైన శిల్పాలున్నాయి.

శ్రీమతి హార్డీతో కలసి సాయంత్రంవరకు ఆ ప్రాంతమంతా తిరిగి రాత్రికి ఇంటికి తిరిగివచ్చాం. ఆ రాత్రి ఆకాశంక్రింద సులోచనా, నేనూ, హార్డీ పడుకొంటే తన పాశ్చాత్యజీవితంలోని విశేషాలు కొన్ని చెప్పసాగింది. తన చిన్నతనం దక్షిణ అమెరికాలో గడుపుతున్న దినాలలో అక్కడి పొగతోటలలో ప్రవేశించి ఎండిపోయిన పొగాకును తెచ్చి కాగితంలో చుట్టి కాల్చేదట. ఆ బాల్యచేష్టలు తన తరువాతి జీవితంమీద కూడా నీడలను వేసినవట. అందువల్లనే ఆమెకు సిగ

రెట్లు కాల్చడం అభ్యాసమైనదట. తరువాత కష్టపడి ఆ అభ్యాసాన్ని మానుకొన్నది. క్రిందటి తడవ ఆమెను నేను మద్రాసులో చూచినప్పుడు ఆమె సిగరెట్లు కాలుస్తున్నది. సిగరెట్లు మానడానికి నన్ను ఉపాయం అడిగింది. అందుకు నేను అన్నాను, సిగరెట్టు కాల్చడం అనేది బాధపడి మానివేయవలసినంత చెడ్డ అలవాటు కాదనీ, అందువల్ల దాన్ని అంత బాధపడి మానుకోనవసరం లేదనీ చెప్పి ఇంకా అన్నాను, తనలో స్వార్థం, అసూయ, పిరికితనం మొదలైన చెడ్డగుణాలుంటే మాత్రం వాటిని మానివేయడానికి తన మానసికశక్తిని వ్యయపరచమని, సిగరెట్లులాంటి చిన్న విషయాన్ని గురించి ఆందోళన చెందవద్దు అని. అందుకు ఆమె అప్పుడు సంతోషించింది. కాని తరువాత సిగరెట్లు కాల్చడంకూడా కష్టపడి మానేసింది.

ఆమె హార్డీ అనే ఇంగ్లీషు భర్తను చేసుకొన్నది. కాని ఈమె స్వతంత్ర బుద్ధికి, ఆయన అధికారమనస్సుకు కుదరక తరువాత విడాకులు పుచ్చుకొన్నారు. అప్పటినుంచి ఈమె ఏకాకిగానే జీవిస్తున్నది.

ఆ సంవత్సరం నవంబర్ ప్రారంభంలో మద్రాసులో గ్రంథకర్తలు, కళాకారుల సంఘం తరపున ప్రదర్శనం జరపాలని అందుకు నా ఫొటోగ్రాఫులను కూడా పంపమని కోరింది. నేను అంగీకరించాను. సులోచనకు ఆమెకు కూడా మంచి సన్నిహితత్వం ఏర్పడింది. ఆమె తిరిగి మద్రాసు వెడుతుంటే ఆమెకు మంచి చీర, జాకెట్టు పెట్టి సత్కరించింది సులోచన. ఆమెతో కొంత ఆవకాయ పచ్చడి కూడా పట్టుకువెళ్ళింది. మాతో కలసి ఆవకాయ కూడా తినేది హార్డీ!

మనిషి తాను పుట్టిన దేశాన్ని వదలి కొంతకాలమైనా పరాయిదేశాలలో వుండడం ఎంతో అవసరం. ఇందువల్ల మనిషిలోని చాలా సంకుచిత భావాలు నశించి విశాలభావాలు ఏర్పడతాయి, తన స్వంతసత్తా ఏమిటో తెలుస్తుంది. మనిషిలో విశ్వజనీనత వికసిస్తుంది.

అమెరికాలోని క్రిస్టీనా అనే ఒక మిస్టిక్ కవయిత్రి తాను రచించిన కవితా గ్రంథాలను పంపసాగింది. గ్రంథాలలోని కవితలు బాగున్నాయి కాని, ఆ గ్రంథాల ఆకృతి, ముద్రణ కాగితం మొదలైనవి ఇంకా ఎక్కువ బాగున్నాయి. ఆ గ్రంథాలను చేతిలో వుంచుకోవడమే ఒక ఆనందం!

# మద్రాసులో చిత్రకళా ప్రదర్శనం

ఏకాంత జీవితం అలవాటయినవాళ్ళు మనుషులమధ్య కూడా జీవించ గలరు, కాని మనుషులమధ్య జీవించడం అలవాటయినవారు మాత్రం ఏకాంతంలో జీవించజాలరు. నా జీవితంలో ఎక్కువభాగం ఏకాంతంలోనే గడిచి కొంతకాలం నుంచి మనుషులమధ్య గడుస్తోంది. సభలలో ఉపన్యాసాలివ్వమని ఆహ్వానిస్తే ఆ ఆహ్వానాలను స్వీకరించి ఆ సభలకు హాజరై వాటిలో ఉపన్యసించి రావడంలో ఒకవిధమైన ఆనందం తట్టసాగింది.

1951 శరత్కాలంలో బెజవాడలో అరుణోదయ నాట్యమండలివారు భారీ ఎత్తున వార్షికోత్సవాలు జరపబోతున్నట్టు అందులో నన్ను ప్రసంగించమని ఆహ్వానించారు. ఆ సభకు శ్రీ గోపీచంద్ అధ్యక్షత వహించాడు; నార్ల వెంకటేశ్వర రావుగారు సభాప్రారంభకులు; శ్రీ కొంగర జగ్గయ్య, నేను, మరికొందరు ఉపన్యాసకులు. ఎవరో కొందరు సినిమావారికి సన్మానం చేయడంకూడా వున్నది. మమ్మందరిని గుర్రపుబగ్గీలో ఎక్కించి ఊరేగిస్తూ సభావేదిక దగ్గరకు తీసుక వెళ్ళారు. గోపీచంద్, జగ్గయ్య నన్ను అంతకుపూర్వమే ఎరుగుదురు. నార్లవారిని మాత్రం నేను ప్రథమంగా చూడడం అక్కడే. గోపీచంద్ నన్ను నార్లవారికి పరిచయం చేశాడు.

పగటి సభలు ప్రధానంగా సన్మానించడంలోనే పూర్తి అయినాయి. రాత్రి సభలలో మా ప్రసంగాలు; రాత్రికి అక్కడే ఏవో నాటకాలుకూడా వుండడంవల్ల సభ జనులతో క్రిక్కిరిసి గోలగావుంది. శ్రోతలు లోపల స్థలంలేక బయటకూడా నిలచివున్నారు. ఆ గందరగోళంలో వక్తల ప్రసంగాలు వక్తలకేతప్ప శ్రోతల చెవులవరకు అందుతున్నట్లు లేదు. వచ్చిన జనులంతా ప్రధానంగా నాటకాలు చూడాలని వచ్చినవారేకాని ఉపన్యాసాలు వినాలని వచ్చినవారు కారు. సభ పూర్తి అయిన తరువాత నార్లవారు, నేను కొంతసేపు ముచ్చటించుకొన్నాం. మద్రాసు వచ్చినప్పుడు తప్పక తమ ఇంటికి వచ్చిపొమ్మని ఆయన గట్టిగా చెప్పారు.

మా పెంపుడుతల్లిగారిని కొన్నాళ్ళనుంచి పక్షవాతం పీడిస్తోంది. ఆమెకు కాళ్లూ చేతులు మాత్రమే కాక మాటకూడా పోయింది. మంచంలోనే వుంటోంది. అందువల్ల నవంబర్‌లో నేను మద్రాసు, అటునుంచి బెంగుళూరు వెళ్ళే ప్రయాణంలో సులోచన నాతో బయలుదేరడాని కిష్టపడలేదు. తాను అత్తగారి సేవ చేయా

లని. కనుక నన్నుమాత్రమే వెళ్ళిరమ్మని బలవంతం చేసింది. నేను కూడా ప్రయాణం మానుకొంటానంటే ఆమె అంగీకరించలేదు.

నేను మద్రాసు చేరుకొని శ్రీమతి మార్సెలాహార్డీకి అతిథిగావున్నాను. బ్రిటిష్ కౌన్సిల్ భవనంలో **Authors and Artists Association** ప్రదర్శన ఏర్పాటులను శ్రీమతి హార్డీ చురుకుగా చేస్తోంది. ఆ ప్రదర్శనలో నా ప్రకృతి ఫొటోగ్రాపులు కూడా ప్రదర్శించబడినాయి. అసోసియేషన్ సభ్యుల కవితలను శిల్పాలను చిత్రాలను, పుస్తకాలను, ఫొటోగ్రాపులను ప్రదర్శించారు. నా ప్రకృతి ఫొటోగ్రాపులు ఆకులురాలి ఎండిపోయిన అస్థిపంజరాలవంటి చెట్లు, తెల్లని రెల్లు పూలు, నదిమీద నావల దృశ్యాలు, సముద్రతీరాలు, పడవల తెరచాపల రెపరెపలు మొదలైన రసమయ ప్రకృతి దృశ్యాలు. అప్పటిలో అటువంటివే నా అభిమాన విషయవస్తువులు. అనంతా సుందర ప్రకృతిలోని మౌన సంగీతం!

ఉదయంనుంచి నేను, మార్సెలాహార్డీ మరికొందరు సభ్యులము ప్రదర్శనలోనే కూర్చుని వచ్చేపోయే ప్రేక్షకులకు సుస్వాగతం చెబుతున్నాం. ఉదయం తొమ్మిది గంటలనుంచి బ్రిటిష్ కౌన్సిల్ భవనం ప్రేక్షకులతో నిండిపోజొచ్చింది. ప్రేక్షకులు వస్తున్నారు, ప్రదర్శించబడిన కళాకృతులను చూస్తున్నారు, వాటిని గురించిన వివరాలను కళాకారులతో చర్చిస్తున్నారు. నచ్చినవాటిముందు ఎక్కువ సేపు నిలచి చూస్తున్నారు; నచ్చని వాటిముందు ఆగకుండా వెళ్ళిపోతున్నారు. బాగున్నవాటిని ప్రశంసిస్తున్నారు.

ఆ వచ్చిన ప్రేక్షకులలో ఒక ఇరవై సంవత్సరాల యువతి అక్కడివారందరిలోకీ ఒక ప్రత్యేకాకర్షణ కలిగివుండి కత్తిరించినజుట్టు, పెదవులకు రంగు, ముఖంలో చిరునవ్వు మొదలైనవాటితో ఆమె తేజోమయంగా వుంది. ఆమె నా ఫొటోగ్రాపులవద్ద నిలచింది. హార్డీ నన్ను ఆమెకు ఆమెను నాకు పరిచయం చేసింది. ఆమెపేరు మిస్ బీవాటాంపూ.

## స్విస్ యువతి

మిస్ టాంపూ, నేనూ ఫొటోగ్రఫీనిగురించి ముచ్చటించుకొంటూ అక్కడే కూర్చున్నాం. తాను ఫొటోగ్రాఫీలో కొంత కృషిసల్పినట్లు, అయితే నావలె ప్రకృతి దృశ్యాలనుకాక తాను మానవమూర్తులను తీయడంలోనే ఎక్కువ అభిరుచి కలిగివున్నట్లు చెప్పింది. తాము సిలోన్‌నుంచి పూర్వం ఈ దేశం వచ్చారట.

తన తండ్రి మిస్టర్ టాంపూ ఐ. సి. యస్. పాసయి మనదేశంలో గొప్ప గొప్ప ఉద్యోగాలు చేసి రిటైర్ అయినాడట. తాను స్విట్జర్‌లాండ్‌లో విద్యాభ్యాసం చేసినదట. స్విట్జర్‌లాండ్‌లోనే ఒక స్విస్ యువకుడూ తానూ ప్రేమించుకొన్నారట. త్వరలో తమ వివాహం కానున్నదట. ఈ విధంగా అమితోత్సాహంతో ఏమేమో చెప్పుకొంటూ వెళ్ళింది. అవును కాదు అనకుండా ఆమె చెప్పేదంతా నేను మౌనంగా వింటూ కూర్చున్నాను. ఆమె స్వీయగాథను వినడంలో అంత ఆనందం పొందాను. కొన్ని సమయాలలో చెపుతున్నవారికి మాత్రమే ఆనందం కలుగుతుంది, కాని వింటున్నవారికి ఆనందం కలగదు. చెపుతున్న విషయం ఏదయినప్పటికీ అది చెప్పబడుతున్న విధానాన్నిబట్టి వుంటుంది దాని విలువ.

ఆ ప్రదర్శనలో ఇద్దరివి మాత్రమే ఫొటోగ్రాఫులు ప్రదర్శితమై వున్నాయి. ఒకరు నేను, రెండవవారు డాక్టర్ పి. వి. పతి. ఆయనవి అన్నీ శిల్పాలకు తీసిన ఫొటోలు. ప్రపంచంలోని నిపుణ డాక్యుమెంటరీ ఫొటోగ్రాఫర్లలో డాక్టర్ పతి ఒకరు. ఆయన డాక్యుమెంటరీ ఫిలింలనుకూడా ఎన్నోతీశారు. ఆయన ఆంధ్రుడు; ఆయన భార్య ఫ్రెంచి వనిత. డాక్టర్ పతి, నేను సంభాషిస్తుండగా సుప్రసిద్ధ రచయిత మంజర్ ఈశ్వరన్ వచ్చాడు. ఆయన ప్రదర్శనాన్ని కలియతిరిగి వచ్చి మా దగ్గర కూర్చున్నాడు. ఆంగ్లభాషలో రచనలు చేసే భారతీయ రచయితలలో ఈశ్వరన్ కూడ ఒకరు. ఆయన తమిళభాషలో కూడా చక్కని రచనలు చేశాడు. ఇంగ్లీషులో ఎన్నో ఉత్తమమైన కథానికలు రచించాడు. ఆయన కథలలో సామాజిక వాస్తవవాదం మనోహరంగా చిత్రించబడి వుంటుంది.

అప్పుడు మార్సెలా హార్డీ నడుపుతున్న ఇంగ్లీషు మాసపత్రిక **'Chakra'** అనే దానిలో నా కవిత **"In And Out"** అనేది వెలువడివుంది ఆ పత్రికను తీసి ఈశ్వరన్ నా కవితను చదివి అందులో ఆయనకుతట్టిన సందేహాలను నాతో వెలిబుచ్చగా, నేను వాటికి తగిన సమాధానాలు ఇచ్చాను. దానితో ఆయన సంతృప్తి చెందాడు.

మధ్యాహ్నం మా భోజనాలన్నీ ముగించి మేము అక్కడే విశ్రమించి వుండగా రచయిత ఆచంట జానకిరామ్‌గారు, ఆయన సతీమణి శారదాదేవిగారు వచ్చారు. వారుభయులూ మంచి సాహితీస్రష్టలు. జానకిరామ్‌గారు సాహితీసృష్టికి తోడు చిత్రకళా సృష్టికూడా చేస్తారు. వారుభయులు కొంతసేపు మాతో వివిధ సాంస్కృతిక విషయాలమీద ప్రసంగించి వెళ్ళిపోయారు. శారదాదేవిగారు మితభాషిణి, గంభీరస్వభావురాలు.

సాయంత్రం అవుతున్నకొద్దీ ప్రేక్షకుల సంఖ్య పెరగసాగింది. సన్నగా కోలముఖంతో మిస్ మార్జొరీ సైక్సు ప్రవేశించింది. ఈమె అప్పుడు ఉమన్స్ క్రిస్టియన్ కాలేజీలో ఉపన్యాసకురాలుగా పనిచేస్తున్నది. ప్రదర్శనాన్ని చూచివచ్చి నా ఫొటోగ్రాఫులున్నచోట తీరికగా కూర్చుని ఆ ఫొటోగ్రాఫులకు సంబంధించిన వివరాలను అడగసాగింది, మిస్ సైక్సు. ఏ కెమేరాతో, ఏ లెన్సుతో వాటిని తీశానో, ఏ ఫిల్మును వాడానో, దేనితో డెవలప్‌చేశానో మొదలైన వివరాలన్నీ అడిగి తెలుసుకొంది. ఆమెలోని జిజ్ఞాసకు నేను ఆశ్చర్యపోయాను.

మిస్ మార్జొరీ సైక్సుతో మాట్లాడుతుండగానే సుప్రసిద్ధ పత్రికా సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావుగారు వచ్చారు. అప్పుడు ఆయన "ఆంధ్రప్రభ" సంపాదకులుగా వుంటున్నారు. ఆయనకు సాహిత్యమంటే ఎంత ప్రీతో మిగతా కళలమీద కూడా అంత ప్రీతి. రాగానే నన్ను వెంటపెట్టుకొని ప్రదర్శనమంతా తిలకించారు నార్లవారు కళా సంబంధమైన కొన్ని సందేహాలను వ్యక్తపరుస్తూ వచ్చారు. ఆయన ఏ విషయంలోను సంతృప్తిగా వుండలేరు. దాన్ని విశ్లేషణ దృష్టితో పరిశీలించాలి. దానిలోని బాగోగులను చుట్టూ వున్నవారితో చర్చించాలి. అవును అనాలి, కాదు అనాలి, అవునూ, కాదులను కలిపి అనాలి. అప్పుడుకాని ఆ చూచినదానితోను, విన్నదానితోను తృప్తిచెందరు ఆయన. రసదృష్టికితోడు నార్లవారిలో సమీక్షాత్మక విచారణకూడా వుంది.

ఉదయాన ప్రదర్శనలో ప్రవేశించిన మార్సెలా హార్డీ, నేను, మరికొందరు మిత్రులూ ప్రదర్శనాన్ని వదిలి రాత్రివరకు బయటకు పోలేదు. ప్రదర్శింపబడిన కళాకృతులను చూస్తే ఎంత ఆనందం జనించిందో ప్రదర్శనాన్ని చూడడానికి వచ్చిన వ్యక్తులనుచూచి, వారితో సంభాషించినా అంత ఆనందం కలిగింది.

కళాకృతులను రచించేది వ్యక్తులే; మరల వాటిని ఆనందించేదీ వ్యక్తులే, వాటిని రచించేది కొద్దిమంది వ్యక్తులుమాత్రమే. కాని వాటిని ఆనందించేది ఎక్కువమంది వ్యక్తులు. లక్షమంది ఆనందించడానికి కళాకృతులను లక్షమంది రచించవలసిన అవసరం లేదు. ఒక్కవ్యక్తి రచిస్తే చాలు; వాటిని లక్షలమంది, కోట్లమంది ఆనందించవచ్చు. అందుకే కళాస్రష్టకు అంత విలువ. కళాసృష్టికి అంత ఘనత. అయితే ఎక్కువమందిచేత ఆనందించబడడంమాత్రమే కళాసృష్టికి కొలత బద్ద కాదు, అది కూడా ఒకటి. అంతే.

మొత్తంమీద **Authors and Artists Association** వారి ప్రదర్శనం విజయవంతంగా ముగిసింది. మద్రాసులోని సహృదయుల హృదయాలలో

ఒకవిధమైన రసచైతన్యాన్ని కలిగించింది, ఈ ప్రదర్శనం. ప్రదర్శనం పూర్తి అయిన తరువాత మరి రెండురోజులు మద్రాసులో వుండి పాతస్నేహితులను చూశాను.

ఆ నెలలోనే బెంగుళూరులో అంతర్జాతీయ ఫొటోగ్రాఫీ ప్రదర్శన జరుగుతున్నది. ఆ ప్రదర్శనలో నావికూడా రెండు ఫొటోగ్రాఫులు ప్రవేశాన్ని పొందినాయి. డాక్టర్ థామస్ గట్టిగా బెంగుళూరు రమ్మని మళ్ళీ మళ్ళీ వ్రాశాడు. నే నిదివరకు బెంగుళూరు చూడటంకూడ జరగలేదు. మద్రాసునుంచి బెంగుళూరు ప్రయాణం నిశ్చయించుకున్నాను.

డాక్టర్ పి. వి. పతి మద్రాసులో లేనందున ఆయనరాకకోసం మరొకరోజు వేచివున్నాను. కాని ఆయన తిరిగి రాలేదు. శ్రీమతి హార్డీ ఆతిథ్యాన్ని స్వీకరిస్తూ మద్రాసులోని సమయం ఆనందంగా నే గడచిపోయింది కొంత తీరికలేకుండా.

# బెంగుళూర్ ప్రయాణం - ఒక విచిత్ర పరిచయం

మద్రాసు సెంట్రల్ స్టేషన్‌నుంచి మధ్యాహ్నం పన్నెండు గంటల ప్రాంతంలో బెంగుళూరు ఎక్స్‌ప్రెస్ బయలుదేరింది. నడుస్తున్నదంతా నాకు నూతన ప్రదేశమే. చల్లని నవంబర్ వాతావరణం. నా బెర్తుమీద నేను ఒక్కడినే. నాకు ఎదురుగావున్న బెర్తుమీద మాత్రం ఒక ముప్పయిసంవత్సరాల యువతి, అయిదు సంవత్సరాల ఆమె కొడుకుమాత్రం వున్నారు. వాళ్ళు పార్శీవాళ్ళు. బెంగుళూరులో భర్త హిందుస్థాన్ ఎయిర్ క్రాఫ్టులో ఇంజనీరట. ఆమె మద్రాసులోవున్న తన చెల్లెలు దగ్గరకు వచ్చి తిరిగి బెంగుళూరు వెడుతున్నది. మంచి చిత్తసంస్కారం గల వనిత. ఇంగ్లీషు బాగా మాట్లాడుతుంది.

క్రమేణ మా బండి ముందుకు సాగిపోతున్నకొద్దీ మా పరిచయంకూడా ముందుకు సాగజొచ్చింది. పార్శీవాళ్ళు సౌందర్యానికి మూర్తీభవించిన స్వరూపాలు. మామూలుగా భారతీయులలో కొందరి ముఖాకృతిబాగుంటే రంగువుండదు. రంగు వున్నవాళ్ళలో ముఖాకృతి బాగున్నవాళ్ళు తక్కువ వుంటారు. ఇక పార్శీవాళ్ళలో ఈ రెంటి సమన్వయం ఎక్కువమందిలో వుంటుంది. కన్ను, ముక్కు, ముఖము కోణాలు తీరి కమనీయంగా వుండడమేకాక మంచి రంగుకూడ వుంటుంది. ఈ రెండూవుంటే బంగారానికి సువాసన వున్నట్లే!

మానవ స్వభావాలను గురించి ఆమె మంచి అనుభవం సంపాదించింది. ఇతరుల స్వభావాలను ప్రథమ సంభాషణలోనే ఇట్టే గ్రహించగలదని తెలుసుకొన్నాను. అందువల్ల ఈమెతో చాలా జాగ్రత్తగా ప్రసంగించాలి. అంతకంటె జాగ్రత్తగా ప్రవర్తించాలని నిర్ణయించుకొన్నాను. ఆమె నన్ను వేసిన మొదటి ప్రశ్న "మీరు ఏమి చేస్తున్నారు?" అని. ఇందుకు నేను ఇచ్చిన మొదటి జవాబు "మీరు చూస్తూనే వున్నారుగా, నేను మద్రాసునుంచి బెంగుళూరుకు మీతో కలిసి రైలులో ప్రయాణం చేస్తున్నాను". అందుకామె కొంచెం తెల్లబోయి నా ముఖం వైపు చూచి తరువాత బిగ్గరగా నవ్వసాగింది.

ఆమె తిరిగి అన్నది "మీరు చెప్పేదినిజంకాదు. మీరు రైలులో ప్రయాణం చేయడంలేదు. ప్రయాణం చేస్తున్నది రైలుకాని మీరుకాదు. మీరు రైలులో కూర్చుని వున్నారు. అంతే. ఏది కదులుతుందో అది ప్రయాణం చేస్తున్నట్టు. ఏది

కదలకో అది ప్రయాణం చేయనట్లు, రైలు కదులుతూందికనుక రైలు ప్రయాణం చేస్తున్నది; మీరు కదలడం లేదు కనుక మీరు ప్రయాణం చేయడంలేదు." అందుకు నేను తిరిగి అన్నాను. "కదలని పట్టాలమీద రైలు కదలగలదు కాని కదిలే రైలులోనిదేదీ కూడా కదలకుండా వుండజాలదు. కదిలే రైలులో కూర్చున్న మీరు, నేను, మీ అబ్బాయి, మీ సూట్‌కేసు, నా సూటుకేసు అన్నీ కదలకుండా వుండడం అసంభవం. రైలు కదలికకు మనమంతా ఊగుతూనే వున్నాం; అంటే కదలుతూనే వున్నాం. కదులుతున్నాం కనుక ప్రయాణం చేస్తూనే వున్నాం."

ఉభయులలో ఎవరు గొప్ప తార్కికులో నిర్ణయించుకోజాలక ఉభయులం నవ్వసాగాం. మా ఉభయులతో కలసి అయిదేళ్ళ అబ్బాయికూడా నవ్వసాగాడు. ఆమె భర్తను గురించిన వివరాలు అడిగాను. ఆమెకంటే ఆమెభర్త వయసులో ఎంత పెద్ద అని అడిగితే అయిదేళ్ళు పెద్ద అని చెప్పింది. తమ ఉభయులలో ఎవరు ఎక్కువ అందంగా వుంటారు? అనే ప్రశ్నకు తన భర్తయే ఎక్కువ అందంగా వుంటాడు అన్నది. అందుకు నేను నమ్మననీ, భర్తయెడల విలువ చూపటానికి అన్న మాట మాత్రమే అనీ నేను నొక్కిచెప్పాను. వెంటనే ఆమె తనదగ్గర వున్న తన కుటుంబపు ఫొటో ఆల్బం తీసి చూపెట్టింది. అంతవరకు ఆమెయే ఎక్కువ సుందరంగా వున్నదనుకున్న నా కంటికి ఆమె భర్త ఫొటో చూచిన తరువాత ఆయనయే ఎక్కువ సుందరంగా వున్నాడని గ్రహించాను.

కాని నేను గ్రహించిన సత్యాన్ని వ్యక్తపరచకుండా నా మాటనే నెగ్గించుకోవలెనని, తన భర్తకంటే తానే ఎక్కువ సుందరంగా వున్నదని వాదించాను. అందుకామె చిరునవ్వుతో అన్నది: మొగవాళ్ళ కంటికి మొగవాళ్ళు అందంగా కనుపించడం అరుదు." భర్తను గురించి, ఆయన మంచి గుణాలను గురించి ఎన్నో సంగతులు చెప్పింది. మీ భర్తకూడా మిమ్ము గురించి రైలులో కనుపించిన తోటి ప్రయాణీకునితో ఇంతమంచిగా చెబుతాడా " అని అడిగితే ఆయనతో కలసి నన్ను ప్రయాణం చేసి చూడమని సలహాఇచ్చింది.

మా సంభాషణలను మధ్య మధ్య ఆపి కిటికీలోంచి బయటి దృశ్యాలను, పరుగెత్తుతున్న గ్రామాలను, పశువులను, మనుషులను, భూమినీ, ఆకాశాన్నీ కూడా తిలకిస్తున్నాం. ఆకాశంలో ఒక మూలనుంచి నవంబర్ మేఘాలు క్రమ్ముకు వస్తున్నాయి. దూరాన తళుక్కున మెరుపూ, ఫెడేల్‌మని ఉరుమూ ప్రత్యక్షమైనాయి. కుర్రవాడు ఉలిక్కిపడి బిక్కముఖం పెట్టాడు. వెంటనే ఆ కుర్రవానిని

వీపుచరచి నా వడిలో కూర్చోపెట్టుకొని బుజ్జగించాను. భయం పోయి నవ్వ సాగాడు.

సాయంత్రం జాలార్ పేట వచ్చేవరకు వర్షంపడి ఆగిపోయింది. రైలులో నుంచి వర్షం చూస్తుంటే మనోహరంగా వుంటుంది. కనుపించే మేర ఎటుచూసినా వర్షధారలు, ఆ ధారలగుండా కనుపించే దృశ్య ప్రకృతి ఎంతో రసవంతంగా గోచరిస్తాయి. జాలారుపేట స్టేషన్‌లోని విశేషం ఏమంటే అక్కడి కోతులు. రైలులోని ఒక పెట్టెనుంచి మరొక పెట్టెమీదకు, ఒక దూలం మీదనుంచి మరొక దూలం దకూ పిల్లల్ని పొట్టలకు కరిపించుకొని దూకుతుంటాయి. తోక లాడిస్తుంటాయి: పళ్ళు ఇకిలిస్తుంటాయి. రైలులో మా సంభాషణలను ఆనందించ జాలక విసుగెత్తివున్న కుర్రవాని మనస్సుకు ఇప్పుడు ఉల్లాసం జనించింది కోతులను చూచేసరికి. పిల్లల స్వభావాలకూ కోతుల స్వభావాలకూ చాలా పోలిక ఉంటాయి. ఉభయులలో కూడా ప్రాణశక్తి చురుకుగా స్పందిస్తూంటుంది. ఉభయులూ కొంటె చేష్టలను చేయడంలో ఆనందం పొందుతారు.

ఒక మొగకోతిని చూపి పిల్లవానితో అన్నాను. "అదుగో నీ మెటర్నల్ అంకుల్" [మేనమామ] అని. అందుకు వెంటనే ఆమె అందుకొని అన్నది, "మెటర్నల్ అంకుల్ కాదు. పెటర్నల్ అంకుల్ (పినతండ్రి కాని, పెదతండ్రి కాని)" అని. నన్ను అతని పినతండ్రిని చేసింది. చేసి నన్ను కోతితో పోల్చింది.

ఆమె వట్టి మాటకారిమాత్రమే కాదు. కొంత విద్యాగంధం వున్న వ్యక్తి కూడా. నా ఫొటోగ్రాఫులను చూచి ఆనందించడమే కాక, నా ఆంగ్ల రచనలను కూడా అక్కడక్కడ చదివి ఆనందించింది. తాను ఇతరుల రచనలను చదివి ఆనందించడం తప్ప స్వయంగా రచనలను చేయజాలదట. అందుకు నేను ఆమెను అభినందిస్తూ అన్నాను: "అది చాలా మంచిపని; మీరంతా రచయితులైతే ఇక మా రచనలను చదివి ఆనందించేవారెవరుంటారు? కనుక మీరంతా రచించకుండా వుంటేనే మంచిది. అందరూ డాక్టర్లే అయితే ఇక రోగులేరీ? కనుక మీరెప్పుడూ రచయిత్రి కావాలని ప్రయత్నించి మా ప్రతిష్ఠను పోగొట్టకండి."

బెంగుళూరులో తమ ఇంటనే అతిథిగా దిగమని ఆమె మరీ మరీ కోరింది. కాని, నా కొరకు డాక్టర్ థామస్ స్టేషన్‌కు వస్తాడనీ, అందువల్ల ఆయనతో ఆయన ఇంటికే అతిథిగా వెళ్ళడం మర్యాదగా వుంటుందనీ ఆమెకు చెప్పి ఒప్పించాను.

లోకంలో ఇంత సుగుణవతులు ఎందరుంటారా అని ఆలోచింపసాగాను. ఆశ్చర్య పోసాగాను.

జాలార్‌పేటలో రైలు చాలాసేపు ఆగింది. మేము ముగ్గురము రైలుదిగి ప్లాట్‌ఫారంపైన అటూ ఇటూ నడవసాగాము. ఆమె అంటుంది, "నిజమైన కదలిక ఇది. రైలులో కదలిన కదలిక రైలు కదలికేకాని మన కదలిక కాదు; ఇక్కడి నడవడం మన కదలిక." నేను అన్నాను, "ఇదిమాత్రం మన కదలిక ఏ విధంగా అవుతుంది? ఇది మన కాళ్ళ కదలికేకాని మన కదలిక కాదు; నడుస్తున్నది మనకాళ్ళు మాత్రమేకాని మనం కాదు. మనం వేరు మనకాళ్ళు వేరు." ఆమె అన్నది "మీరు అచ్చమైన వేదాంతం మాట్లాడుతున్నారే! మనకాళ్ళు మనం కాము, మన చేతులం మనం కాము, మన కన్నూ ముక్కూ మనం కాము అంటే ఈ శరీరం మనం కాము అని అర్థమన్నమాట. నేను రమణమహర్షి పుస్తకాలు చదివాను; ఆయన వేదాంతమంతా ఇదేధోరణిలో వుంటుంది."

ఇంతలో రైలు కదలబోతూంది. పిల్లవానికి జీడిపప్పు, పళ్ళూ కొనిపెట్టి మేము ముగ్గురమూ వచ్చి మళ్ళీ రైలులో కూర్చున్నాం. రైలు కదలింది. మళ్ళీ మా తాత్వికచర్చ తార్కికరూపం తాల్చింది. నేను అన్నాను, "పుస్తకాలలో చదివే వేదాంతం సజీవ వేదాంతంకాదు. జీవితంలో అనుభూతి చెందే వేదాంతంమాత్రమే సజీవ వేదాంతం. వేదాంతం నిమిత్తం పుస్తకాలమీద, గురువులమీద ఆధారపడడంలో దొరికేది రాద్ధాంతమే కాని వేదాంతం కాదు. స్వయంగా జీవితంలో నుంచి నిత్యమూ జరిగే దైన-దిన కలాపంనుంచి, కష్టసుఖాల అనుభవంనుంచి, బాహ్యా జగత్తును చేసే పరిశీలననుంచి, అంతర్ జగత్తులోకి ప్రసరింపజేసే అంతర్ వీక్షణనుంచి పొందే వేదాంతమే సజీవ వేదాంతం." "ఇదంతా జిడ్డు కృష్ణమూర్తిగారి ధోరణిగా వున్నది అన్నది ఆమె. నేను అన్నాన, "జిడ్డు కృష్ణమూర్తిగారిధోరణి అంటూ ప్రత్యేకం ఒక ధోరణి లేదు; సృష్టిలోనే వున్నది ఈ ధోరణి. దీన్ని జిడు కృష్ణమూర్తి కూడా అవలంబించాడు. నేనుకూడా అవలంబిస్తున్నాను. మీరు కూడా అవలంబి-చవచ్చు. ఇది ఏ ఒక్కరి స్వంతమూ కాదు; మానవజాతి అంతటిది; ఇది ఏ ఒక మతానిది కాదు, అన్ని మతాల సారమే ఇది."

ఆమె ముఖం కొంచెం గంభీరాకృతిని తాల్చింది. ఏదో ఆలోచనలోపడింది. రైలులో దీపాలు వెలిగాయి కాని మేము దీపాలను తీసివేసి ఆ ప్రశాంతమైన

చల్లని చీకటిలోనే కూర్చుని కిటికీలగుండా బయటి వెలుగును చూడడానికే ఇష్టపడ్డాం. కూర్చున్న లోపల కాంతి వుంటే బయటున్న కాంతి కనుపించదు సరిగా. అందుకని కూర్చున్న ప్రదేశాన్ని చీకటి చేస్తే బయటి కాంతి బాగా కనుపిస్తుంది. మా సంభాషణ అనంతరం కొంతసేపు మౌనంగా కూర్చున్న తరువాత ఆమె నెమ్మదిగా అనసాగింది, "మనకాళ్ళు మనం కాము; మన చేతులు మనం కాము; మన కన్నూ ముక్కూ మనం కాము; ఈ శరీరం మొత్తం మనం కాము. మరి మనమంటే ఏమిటి?" నేను అందుకొని అన్నాను, "మనమంటే మనమే: మనం కానివన్నీ మనం కాము; మనం ఏదో అదే మనం. సరే బెంగుళూరు వచ్చింది, ఇక దిగండి".